Islami Fiquah
(Telugu)

# ఇస్లామీ ధర్మావగాహన

మూలం

మౌలానా ముజీబుల్లాహ్ నద్వీ

అనువాదం

ఎస్.ఎమ్. ఖాద్రి

# విషయసూచిక

# మా మాట

ఇస్లాం ధర్మం పట్ల అవగాహన ప్రతి వ్యక్తికి అవసరం. ఎవరి శ్రేయాన్నయితే అల్లాహ్ కోరుతాడో వారికి ధర్మావగాహన కలిగిస్తాడని హదీసులో పేర్కొనటం జరిగింది. దైవాదేశాలు, మహాప్రవక్త(స) హితవుల పట్ల ఎవరికైతే విశ్వాసం వుంటూ, ఆ విశ్వాసం త్రికరణశుద్ధిగా ఆచరించ డానికి దృఢంగా నమ్మకం కలుగుతుందో అదే "అఖీదా"గా మారి పోతుంది. ఒక విశ్వాసి అల్లాహ్ ఒక్కడే ఆరాధ్య దైవమని విశ్వసిస్తాడు. ఆయనకు సాటి కల్పించడు. జీవితం దైవారాధనలో గడుపుతాడు. ఇస్లామీ వ్యవస్థలో నమాజ్, జకాత్, ఉపవాసాలు, హజ్ ఇంకా దైనందిన వ్యవహారాలలో దైవాదేశాలకు కట్టుబడి మహాప్రవక్త (స) ఉపదేశాలను పాటిస్తూ జీవితం గడుపుతాడు. ఇటువంటి సందర్భంలో ధర్మ జ్ఞానానికి సంబంధించిన అవగాహన ప్రతి వ్యక్తికీ అవసరముంది. అటువంటి అవసరాన్ని తీర్చడం కోసం ఈ పుస్తకం మొదటి భాగంలో ఆరాధనలు గురించిన విషయాల్ని, రెండవ భాగంలో దైనందిన విషయాలకు సంబంధించిన అవగాహన పాఠకులకు అందించటం జరిగింది. తెలుగు తెలిసిన ప్రతి వ్యక్తి ఈ పుస్తకాన్ని చదివి తన ధర్మావగాహనను పెంపొందిం చుకుంటాడని ఆశిస్తున్నాము.

- ప్రకాశకులు

# ఆరాధనలు

ఆరాధనా భావం మనిషి నైజంలోనే వేరుగొని ఉంది. ఆత్మ వికాసానికి అతను కోరుకునే ఏకైక సాధనం ఆరాధనే. మనిషి ఏ శక్తినయితే తనకు అతీతమయిందని లేదా తనకంటే శక్తివంతమయిందని భావిస్తాడో, దేనికయితే భయపడతాడో లేక దేనిపై ఆశలు పెట్టుకుంటాడో ఆ శక్తిముందే అతను మోకరిల్లుతాడు. చెడు శిక్షణ, చెడు పరిసరాల కారణంగా అతను దైవం ముందు తలవంచకపోతే, తనకంటే అల్పమయిన అసంఖ్యాక సృష్టిరాసుల ముందు సాగిలపడుతాడు. చెట్లు, రాళ్ళు, నీళ్ళు, గాలి, సూర్యుడు, చంద్రుడు, చివరికి జంతువులు, క్రిములు, కీటకాల్లో సయితం శక్తి, ఆధిక్యతలు వున్నాయనిపిస్తే, వాటిపట్ల ఏ మాత్రం, ఆశ, భయం అనిపిస్తే మనిషి వాటిని కూడా దేవుళ్ళుగా చేసుకొని వాటి ముందు మోకరిల్లుతాడు. వాటిని ప్రసన్నత పొందడానికి మొక్కుబడులు చెల్లిస్తాడు.

అందువల్ల మనిషిలోని ఈ నైజాన్ని మధ్యేమార్గాన ఉంచేందుకు ఇస్లాం తన సందేశం, బోధనలను తౌహీద్ (దేవుని ఏకత్వం)తో ప్రారంభించింది. తౌహీద్ లేక దేవుని ఏకత్వం అంటే దైవాన్ని తప్ప ఇతరుల్ని మహత్తుకు, గొప్పదనానికి అర్హులుగా పరిగణించ రాదు. ఆయనకన్నా ఇతరులు అధికులని, పరిపూర్ణులని భావించకూడదు. ఆయన ప్రతి మనిషికీ చేరువలో ఉన్నాడు, అతని మాటలు వినగలుగుతాడు. కాబట్టి మనిషి తన అవసరాలు, కోరికల కోసం ఆయన ఎదుటే చేతులుజాపాలి. విధేయతకు, ఆరాధనకు ఆయన్నే కేంద్రంగా భావించాలి. ఆయన మీదే ఆశలు పెట్టుకోవాలి, ఆయనకే భయ పడాలి. ఒకవేళ మనిషి దేవుని సన్నిధిలో కాకుండా ఇతరుల సన్నిధిలో తలవంచితే అతను మానవతనే అవమానపరచిన వాడవుతాడు. ఇలాంటి మనిషి నిజానికి మానవుడు కాదు. పశువుకన్నా హీనుడు.

దైవానికి సంబంధించిన ఈ ఉన్నత భావంతో ఆరాధన చేసినప్పుడే మనిషి నైజానికి తృప్తి, ఆత్మకు తాజాదనం చేకూరుతాయి. అతను తన హృదయాంత రాళాలలో శక్తి, శాంతి, సౌఖ్యం, ఏకాగ్రతలను అనుభవిస్తాడు. దీనికి భిన్నంగా అనేక దేవుళ్ళ సమక్షంలో తలవంచేవారు తమ హృదయంలో, ఆత్మలో శాంతి, సౌఖ్యం, ఏకాగ్రతలకు

బదులుగా భావభిన్నత్వం, ఒక విధమయిన శూన్యం ఉన్నట్లు అనుభవిస్తారు. దివ్య ఖుర్‌ఆన్ ఒక దృష్టాంతం ద్వారా ఇలా వివరిస్తోంది:

"అల్లాహ్ (బహు దైవారాధకులు మరియు ఒకే దేవుని ఆరాధించేవారి విషయంలో) ఒక దృష్టాంతాన్ని మీకు తెలుపుతున్నాడు. ఒక వ్యక్తి, పరస్పర విరుద్ధగుణాలు కల అనేక భాగస్వాములకు (దాసుడు), మరొక వ్యక్తి పూర్తిగా ఒకే వ్యక్తికి దాసుడు. మరి వీరిద్దరి పరిస్థితి ఒకటే కాగలదా?" *(అజ్జుమర్ : 29)*

ضَرَبَ اللّٰهُ مَثَلًا رَّجُلًا فِيْهِ شُرَكَآءُ مُتَشٰكِسُوْنَ وَرَجُلًا سَلَمًا لِّرَجُلٍ - هَلْ يَسْتَوِيٰنِ مَثَلًا - (سورة زمر)

## ఆరాధనా భావం

ఆరాధన లేక ఇబాదత్ అంటే ఆజ్ఞాపాలన, విధేయత, అశక్తతను వ్యక్తపరచడం అనే అర్థాలున్నాయి. అయితే ఇస్లామీయ షరీఅత్‌లో ఆజ్ఞాపాలన, విధేయతలను మాత్రమే ఆరాధన అనరు. ఇక్కడ దైవ గ్రంథం, ప్రవక్త సంప్రదాయాలకు అనుగుణంగా దైవ ప్రసన్నతను, పుణ్యఫలాన్ని పొందే ఉద్దేశంతో మనిషి చేసే ప్రతి పనీ ఆరాధన క్రిందికే వస్తుంది. పై రెండు షరతుల ప్రకారం ఆజ్ఞల్ని పాలించేవారిని, విధేయత పాటించేవారినే ఇస్లాం అంగీకరిస్తుంది. మనిషి కోరితే ఈ రెండు షరతుల్ని పాటించి, తినడం, త్రాగడం, నిద్రించడం, మేల్కోవడం, ఆఖరికి తన లైంగిక వాంఛల పరిపూర్తిని సయితం దైవారాధనగా మలచుకోగలడు. తద్వారా అతను పరలోకంలో పుణ్య ఫలానికి అర్హుడు కాగలడు.

అనేక హదీసుల్లో ఈ విషయం వివరించడం జరిగింది. ఒక హదీసులో దైవ ప్రవక్త (సఅసం) "మనిషి మర్మావయంలో కూడా పుణ్యం (ఇమిడి) వుంద"ని చెప్పగా, కామతృష్ణ తీర్చుకోవడంలోనూ పుణ్యం ఉందా అని అడిగారు అక్కడున్నవారు. దానికి మహా ప్రవక్త (సఅసం) ఇలా బోధించారు:

"నిషేధించబడిన చోట అతను తన లైంగిక వాంఛను తీర్చుకుంటే పాపం అయ్యేది కాదా? అలాంటప్పుడు అనుమతించబడిన చోట తన కోరికను తీర్చుకుంటే అతనికి పుణ్యఫలం లభిస్తుంది."

لو وضع في الحرام اليس كان عليه وزر فكذالك ان وضعها في الحلال كان له اجر (الادب المفرد)

## సరయిన ఆరాధనా భావం

ఆరాధన సరయిన, సర్వసామాన్యమయిన ఈ భావన ఎలా వస్తుంది. అది కోరే విషయాలను మనం ఎలా నెరవేర్చాలి? దీనికోసం ఇస్లాం ఒక సమగ్ర కార్యక్రమాన్ని

ఇస్తుంది. ఈ కార్యక్రమంలో ఓ భాగమయిన కొన్ని ప్రత్యేక ఆరాధనలను మనం నమాజ్, రోజా, హజ్, జకాత్‌లని అంటున్నాం. ఇవి స్వయంగా ఆరాధనలవడమేగాక, ఆరాధన సాధారణ భావనను జనింపజేయడానికి కారణభూతమవుతాయి.

ఈ ఆరాధనల్లో ప్రత్యేకంగా నమాజ్‌కు విశేష ప్రాముఖ్యం ఉంది. దాని ద్వారా ఆరాధన, విధేయతల భావం ఎంతగా జనిస్తుందో ఇతర ఆరాధనల ద్వారా అంతగా కలగదు. ఈ కారణంగానే ఇతర ఆరాధనలయితే సంవత్సరంలో లేదా జీవితంలో ఒకసారి మాత్రమే విధిగా చేయబడ్డాయి. ఇది (నమాజ్) మాత్రం రోజుకు అయిదుసార్లు విధిగా చేయబడింది. దీన్ని గురించి దివ్య ఖుర్ఆన్‌లో వందల చోట్ల తాకీదు చేయడం జరిగింది.

నమాజ్ ప్రాముఖ్యాన్ని తెలుపుతూ మహా ప్రవక్త (స) ఇలా ప్రవచించారు: "నమాజ్ ఇస్లామీ ధర్మానికి మూలస్తంభం. ఎవరైతే దీన్ని స్థాపించారో అతను ధర్మాన్ని స్థాపించాడు. మరెవరయితే దీన్ని వదిలారో అతను ధర్మపు భవనాన్నే కూలగొట్టినవాడయ్యాడు."

దైవ ప్రవక్త (స) మరొక సందర్భంలో "కుఫ్ర్, మరియు విశ్వాసం మధ్య నమాజ్ మాత్రమే గీటురాయి" అని వివరించారు.

## తహారత్ (శుచి, శుభ్రత)

నమాజ్ చేయడానికి ముందు తప్పనిసరిగా పాటించవలసిన కొన్ని షరతులు ఉన్నాయి. వాటిలో పరిశుభ్రత (తహారత్) కూడా ఒకటి.

## తహారత్ ప్రాముఖ్యత

తహారత్ అంటే నిఘంటువు ప్రకారం శుచి, శుభ్రత అని అర్థం. షరీఅత్ పరిభాషలో 'హుక్మి' లేక 'హకీకి' అపరిశుద్ధావస్థను దూరం చేసి పరిశుభ్రతనొందడానికి తహారత్ లేక పరిశుద్ధత అని అంటారు. సదా శుచి, శుభ్రతలతో ఉండాలని ఇస్లాం ఆదేశించినప్పటికీ ప్రత్యేకంగా నమాజ్ కోసం పరిశుద్ధతకు మరికొన్ని షరతులను విధించింది. ఈ నియమాలనుగనక పాటించకపోతే సాధారణ పరిశుభ్రత స్థితిలో ఉండి కూడా మనం నమాజ్ చేయడానికి వీల్లేదు. ఒక వేళ నమాజ్ చేసినా అది నెరవేరదు.

ఉదాహరణకు మీరు పరిశుభ్రంగాఉన్నా వుజూ చేయకపోతే మీరు నమాజ్ చేయలేరు. ఇతర ఆరాధనల కోసం ఈ షరతు లేదు. అందువల్లనే "పరిశుభ్రత నమాజ్ యొక్క తాళపు చెవి" అన్నారు దైవ ప్రవక్త (సఅసం). "పరిశుభ్రత అర్ధ విశ్వాసం" అని సెలవిచ్చారు కూడా. పరిశుభ్రత అవసరాన్ని గురించి దివ్య ఖుర్ఆన్‌లో అనేక చోట్ల చెప్పబడింది. ఒకచోట ఇలా ఉంది:

**"ఇన్నల్లాహ యుహిబ్బుల్ ముతతహ్హిరీన్"** إِنَّ اللَّهَ يُحِبُّ الْمُتَطَهِّرِينَ ○

(శుచి, శుభ్రతలు కలిగివుండే వారంటే దైవానికి ఇష్టం.)

పరిశుభ్రతకున్న ఈ ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకునే ధర్మవేత్తలు హదీసు స్మర్తలు సాధారణంగా హదీసు, ఫికహ్ గ్రంథాలను శుచి, శుభ్రత, వుజూ, గుసుల్‌ల వివరణతో ప్రారంభిస్తారు.

## నజాసత్ (అశుద్ధత)

పరిశుభ్రత నియమాలు, దాని ఆజ్ఞల వివరణకు ముందు అశుద్ధత యొక్క వాస్తవికత, దాని రకాలను గురించి తెలుసుకోవడం చాలా అవసరం. ఎందుకంటే అశుద్ధత వాస్తవికతను గురించి తెలుసుకోనంతవరకు, దాన్ని దూరం చేయడం సాధ్యం కాదు.

## నజాసత్ (అశుద్ధత)లో రకాలు

నజాసత్ అంటే అపరిశుభ్రత, మాలిన్యం అని అర్థం. ఇది రెండు రకాలు. ఒకటి, “నజాసతె హుక్మి” లేక ఆదేశమూలకంగా ఏర్పడే అశుద్ధత. రెండు, “నజాసతె హకీకి”, వాస్తవిక అశుద్ధత. ఈ రెండింటిలో మళ్ళీ రెండేసి రకాలున్నాయి.

## నజాసతె హుక్మి

మన కంటికి కనపడనిది కేవలం షరీఅత్ ద్వారానే అపరిశుభ్రమయినదని తెలిసే అశుద్ధతను “నజాసతె హుక్మి” అంటారు. ఉదాహరణకు వుజూ లేక గుసుల్ అవసరం కలగడం ఇత్యాదివి. ఇందులోనూ రెండు రకాలున్నాయి. ఒకటి, “హదసె అస్గర్” (చిన్న అశుద్ధత), రెండు, “హదసె అక్బర్” (పెద్ద అశుద్ధత).

## హదసె అస్గర్

ఈ అశుద్ధత వుజూ చెయ్యడంవల్ల దూరమవుతుంది. ఉదా: (1) మల విసర్జన లేక మూత్ర విసర్జన, (2) అపానవాయువు వెడలటం, (3) దేహంలోని ఏ భాగం నుండయినా రక్తం లేక చీము కారడం, (4) నమాజులో పెద్దగా నవ్వడం (5) నేలపైగాని, మంచంపైగాని గోడను లేదా మరేదయినా వస్తువును అనుకొని నిద్రపోవడం, (6) నోటి నిండా వాంతిచేసుకోవడం, ఇవన్నీ ‘హదసె అస్గర్’ క్రిందికి వస్తాయి.

## హదసె అస్గర్ విషయంలో ఆదేశాలు

హదసె అస్గర్ కలిగిన పక్షంలో మనిషి నమాజ్ చెయ్యరాదూ, దివ్య ఖుర్ఆన్‌ని తాకనూరాదు, జ్ఞాపకమున్న ఖుర్ఆన్‌ని నోటితో పఠించడానికి అనుమతి ఉంది. అయితే చిన్న పిల్లలకు వుజూ లేకుండానే దివ్యఖుర్ఆన్‌ని ముట్టుకోవడానికి, చదవడానికి అనుమతి ఉంది.

## హదసె అక్బర్

ఈ అశుద్ధత గుసుల్ (స్నానం) చెయ్యడం ద్వారా దూరమవుతుంది. ఉదా: సంభోగం, వీర్యస్ఖలనం జరగడం, లేదా స్త్రీకి రుతుస్రావం, ప్రసూతిస్రావం జరగడం– ఇవన్నీ 'హదసె అక్బర్' రూపాలు.

## హదసె అక్బర్‌కు సంబంధించిన రూపాలు

ఇలాంటి స్థితిలో మనిషి గుసుల్ లేదా తయమ్ముమ్ చెయ్యకుండా నమాజ్ చెయ్యడానికిగాని, దివ్యఖుర్ఆన్‌ని ముట్టుకోవడానికి లేదా దాన్ని పఠించడానికిగాని వీల్లేదు, అంతేకాదు, తప్పనిసరి అయితే తప్ప మస్జిద్‌లో ప్రవేశించడానికి వీల్లేదు. తప్పనిసరి అంటే అర్థం– స్నానం కోసం మనిషి మస్జిద్ యొక్క స్నానాల గదిలోకి వెళ్ళాడు కాని, బకెట్ మస్జిద్ లోపలనో లేక ఆవరణలోనో ఉండిపోయినప్పుడు లేదా స్నానాల గదికిపోయే దారి మస్జిద్ ఆవరణగుండా వున్నప్పుడు. ఇలాంటి పరిస్థితుల్లో తయమ్ముమ్ చేసి మస్జిద్‌లో ప్రవేశించడానికి లేదా మస్జిద్ ఆవరణగుండా వెళ్ళడానికి అనుమతి ఉంది.

## నజాసతె హకీకి

నజాసతె హకీకి అంటే భావం– కంటికి కనిపించే సహజంగా ప్రతి మనిషి అసహ్యించుకునే అపరిశుభ్రత. దీన్నుండి మనిషి తన శరీరాన్ని, దుస్తుల్ని, ఆహారాన్ని కాపాడుకుంటాడు. ఈ అశుద్ధత రెండు రకాలు. ఒకటి, "నజాసతె గలీజా." దీనికి సంబంధించిన ఆదేశాలు కఠినంగా ఉంటాయి. రెండు, "నజాసతె ఖఫీఫా", దీనికి సంబంధించిన ఆదేశాలు తేలికయినవిగా ఉంటాయి.

## నజాసతె గలీజ

వీటికి సంబంధించిన ఆదేశమయితే కఠినంగా ఉంటుంది. ఇవి అపరిశుద్ధం కావడంలో ఎలాంటి అనుమానం లేదు. ఈ క్రిందివన్నీ నజాసతె గలీజా క్రిందికి వస్తాయి.

(1) మనిషి మలమూత్రాలు (2) మనుషులు, జంతువుల రక్తం (3) వీర్యం (4) సారా, కల్లు (5) పాలు త్రాగే చంటి పిల్లల మలమూత్రాలు (6) అదే విధంగా అన్ని జంతువుల మలం, పెంటలు (ఉదాహరణకు ఆవులు, గేదెలు, మేకలు, గొర్రెలు, కుక్కలు, పిల్లులు) (7) పందికి సంబంధించిన ప్రతి వస్తువూ నజాసతె గలీజాయే (8) అలాగే యావత్తు నిషిద్ధ జంతువుల మలమూత్రాలు (9) పక్షుల్లో కేవలం కోళ్ళు, బాతుల పెంట నజాసతె గలీజాగా పరిగణించబడుతుంది.

## నజాసతె గలీజా విషయంలో ఆదేశాలు

నజాసతె గలీజాకు సంబంధించిన నియమాలు రెండు విధాలు. మొదటిది, పలుచగా ఉండే గలీజా. ఉదాహరణకు: రక్తం, మూత్రం లేక మద్యం వగైరా. ఇవి దేహానికి, దుస్తులకు, బల్లలకు, మంచానికి అంటుకుంటే వాటిని ఎలాంటి పరిస్థితిలోనూ కడగవలసిందే. నీళ్ళతోగాని, లేదా పరిశుభ్రమయిన మరే ద్రవంతోగాని కడగనిదే అవి పరిశుభ్రం కాజాలవు. ఇలాంటి అశుద్ధత రూపాయి నాణెమంతగా లేక అంతకంటే తక్కువగా మన దేహానికి లేదా దుస్తులకు అంటితే దాన్ని కడగకుండా నమాజ్ చేస్తే నమాజ్ నెరవేరుతుంది. కాని కావాలని చేసినా మాటిమాటికి ఇలాచేసినా అది 'మక్రూహ్' (అసహ్యమైంది)గా పరిగణించబడుతుంది. మలినం ఇంతకంటే ఎక్కువ పరిమాణంలో అంటుకుంటే దాన్ని కడిగివేయకుండా నమాజ్ చెయ్యకూడదు. ఒకవేళ నమాజ్ చేస్తే దాన్ని కడిగివేసిన తరువాత మళ్ళీ నమాజ్ చెయ్యడం తప్పనిసరి (వాజిబ్) అవుతుంది.

రెండవది, చిక్కగా ఉండే నజాసతె గలీజా. ఉదాహరణకు: మలం, పేడ ఇత్యాదివి. ఇవిగనక మన దేహానికి దుస్తులకు అంటితే, అది బరువులో పావలా నాణెం లేదా అంత కంటే తక్కువ ఉన్నప్పుడు వాటిని కడిగివేయకుండా నమాజ్ చేస్తే నమాజ్ నెరవేరుతుంది. కాని ఉద్దేశపూర్వకంగా అలా చెయ్యడం మక్రూహ్ (ఏహ్యమయింది). ఒకవేళ ఈ మలినం అంతకంటే ఎక్కువ ఉంటే దాన్ని తప్పనిసరిగా కడిగివేయాలి. కడగకుండా నమాజ్ చేస్తే నమాజ్ నెరవేరదు. నజాసతె గలీజా విషయంలో మరికొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి.

(1) కొన్ని పరిస్థితుల్లో నజాసతె గలీజాని గీకివేసినా పరిశుభ్రమవుతుంది. ఉదా॥ మన చెప్పులకు పేడ, మలంలాంటి చిక్కటి మలినం ఏదయినా అంటితే దాన్ని రుద్ది శుభ్రం చేస్తే చాలు. లేదా అది ఎండిపోయినప్పుడు దాన్ని గీకివేసినా మన చెప్పులు పరిశుభ్రమవుతాయి. అయితే మూత్రం వగైరా ద్రవరూపంలో ఉండే మలినాలను మాత్రం కడిగివేయడం తప్పనిసరి. కడిగివేయకపోతే అవి శుభ్రం కావు.

(2) ఈ నియమం, శరీరం లేక ఇతర వస్తువులకు వర్తించదు. ఈ అశుద్ధతనయితే ఎట్టి పరిస్థితిలోనూ కడిగివేయాల్సిందే, అది పలచగా ఉన్నా లేక చిక్కగా ఉన్నా సరే.

(3) అశుద్ధతను కడిగివేయడంలో ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. అశుద్ధత అంటిన భాగాన్ని బాగా రుద్ది లేక గీకి కడిగివేయాలి. ఆ విధంగా ఆ మచ్చపోతుంది. ఒకవేళ రుద్దినా గీకినా కూడా మచ్చ ఉన్నట్లయితే ఫరవాలేదు.

(4) అశుద్ధత అంటిన చోటును మూడుసార్లు కడగడం మంచిది. వస్త్రమయితే మూడుసార్లు పిండి కడిగివేయాలి. ఒకవేళ రెండేసార్లు కడగడం, పిండివేయడం వల్ల మలినం దూరమయిందని తృప్తి కలిగితే మూడుసార్లు కడగవలసిన

అవసరం లేదు. కాని కడిగితే మంచిది.

(5) నజాసతె గలీజా భోజన పదార్థాలలో లేదా నీటి కుండలు, కడవల్లాంటి పాత్రలలో ఏ కొంచెం పడినా ఆ నీరు అపరిశుభ్రమవుతుంది.

(6) ఈ విషయంలో గుర్తుంచుకోవలసిన మరో విషయం ఏమిటంటే అనవసరంగా అనుమానంలో పడిపోయి నాల్గేసిసార్లు, అయిదేసిసార్లు కడుగుతూ ఉండరాదు. దైవం దగ్గర నీటి విషయంలోనూ లెక్క చెప్పుకోవలసి ఉంటుంది. "మీరొకవేళ ప్రవహిస్తున్న నది సమీపాన ఉన్నాసరే నీళ్ళ వాడకంలో జాగ్రత్త వహించండి" అని మహా ప్రవక్త (సఅసం) బోధించారు.

## నజాసతె ఖఫీఫా

ఏ అశుద్ధ పదార్థాలకు సంబంధించిన ఆదేశాలైతే కొంత సడలింపునుగలిగి ఉంటాయో అలాంటి అశుద్ధ పదార్థాలను "నజాసతె ఖఫీఫా" అంటారు. అంటే ఒక ఆధారం ప్రకారం అవి అశుద్ధమయినవిగా, మరో ఆధారం ప్రకారం శుద్ధమయినవిగా వ్యక్తమవుతుందన్న మాట. అలాంటి పదార్థాలు కొంచెం అంటినా నమాజ్ నెరవేరుతుంది. ఉదాహరణకు: (1) హలాల్ (ధర్మసమ్మతమయిన) పశువులు ఆవు, ఎద్దు, గేదె, మేక మొదలయినవాటి మలమూత్రాలు. (2) కాకి, గ్రద్ద, చిలుకలాంటి హరాం (నిషిద్ధమైన) పక్షుల రెట్టలు (3) కోడి, బాతుతోపాటు పావురం, గువ్వ, కొంగలాంటి హలాల్ పక్షుల రెట్టలు కూడా శుద్ధమయినవే. (4) గబ్బిలం హరాం పక్షియే అయినా దాని పెంట మరియు మూత్రం కూడా శుద్ధమయినవే. అంటే ఈ పదార్థాలు బట్టలకు లేక శరీరానికి కొద్దిగా అంటినా వాటిని కడగడం లేక శుభ్రం చేయడం తప్పనిసరి కాదన్నమాట.

## నజాసతె ఖఫీఫాకు సంబంధించిన ఆదేశాలు

(1) ఈ అశుద్ధ పదార్థాలు బట్టలకు, శరీరానికి లేక ఇంక దేనిపైనయినా దాని నాల్గవ వంతుకన్నా తక్కువ భాగానికి అంటినట్లయితే దానికి మినహాయింపు ఉంది. అంతకంటే ఎక్కువయితే దాన్ని కడిగివేయడం తప్పనిసరి అవుతుంది.

(2) మినహాయింపుకు అర్థం ఏమిటంటే పైన చెప్పిన ప్రమాణంలో ఆ అశుద్ధ పదార్థం మీ బట్టలకుగాని, శరీరానికిగాని, బల్లకుగాని అంటివుండగా మీరు అలాగే నమాజ్ చేస్తే నమాజ్ నెరవేరుతుంది. కాని అది 'మక్రూహ్' (అసహ్యమయింది)గా పరిగణించబడుతుంది. కాబట్టి సాధ్యమయినంతమేరకు జాగ్రత్త పడడం మంచిది.

(3) నజాసతె ఖఫీఫాకు సంబంధించినది ఏ మాత్రమయినా తినే పదార్థాల్లోగాని, కొద్దిపాటి త్రాగేనీటిలోగాని పడితే, ఆ పదార్థాలు అన్ని విధాలా అశుద్ధమయి పోతాయి.

నజాసతె గలీజా మరియు నజాసతె ఖఫీఫాకు సంబంధించిన మరికొన్ని నియమాలు జ్ఞాపకం ఉంచుకోవలసి ఉంది.

(1) కుట్టిన బట్టల్లోని వేరు వేరు భాగాలను ఇక్కడ ఒక్కో భాగంగా పరిగణించడం జరిగింది. ఉదాహరణకు చొక్కా చేతులు, ముందు వెనుక భాగాలు, పైజామా పాంటుల్లోని రెండు కాళ్ళు, ఇవన్నీ ఒక్కోటి ఒక్కో భాగంగా భావించాలి. అదే విధంగా శరీరంలోని ఒక్కో అంగం ఓ ప్రత్యేక భాగం క్రిందికి వస్తుంది. కాబట్టి వీటిలో ప్రతిదానికి దాని నాల్గవ వంతుకన్నా తక్కువ భాగాన నజాసతె ఖఫీఫా అంటినట్లయితే మినహాయింపు వర్తిస్తుంది. కాని పూర్తి వస్త్రంలోని నాల్గవ భాగంలో అంటినట్లయితే ఏ మాత్రం మినహాయింపులేదు.

(2) ధాన్యం నూర్పిడి సమయంలో పశువులు ధాన్యంలో మూత్ర విసర్జన చేస్తే ధాన్యం అశుద్ధం కాదు. పూర్తిగా నూర్చిన తరువాత అలా జరిగితే అది అశుద్ధమవుతుంది.

(3) పేడతో అలికిన ప్రదేశం అపరిశుద్ధమయినది. దానిపై ఏదయినా పరచకుండా కూర్చోవడంగాని, నమాజు చేయడంగాని సరయినది కాదు.

కొంతమేరకు అశుద్ధ పదార్థం అంటినప్పుడు నమాజ్ నెరవేరేందుకు లభించిన అనుమతి ప్రాముఖ్యాన్ని, దాని ప్రయోజనాన్ని వ్యవసాయం చేసే రైతులు, ఇంటి పనులు చేసే స్త్రీలు, ఇంకా వర్షాకాలంలో బురదలో తిరగవలసివచ్చేవారు బాగా గుర్తించగలుగుతారు.

(4) నీరు లభించనప్పుడు నీరులాంటి ద్రవపదార్థం, ఉదాహరణకు పసరులాంటి దానితో, శరీరానికి లేక బట్టలకు అంటిన అశుద్ధ పదార్థాన్ని కడగవచ్చు. అయితే అలాంటి ద్రవపదార్థం 'వుజూ' మరియు 'గుసుల్' కోసం ఏ మాత్రం పనికిరాదు.

(5) మడతవేసిన బట్టలోని, ఓ మడతలో అశుద్ధత అంటిన పక్షంలో, ఒకవేళ ఆ వస్త్రం కుట్టినదయితే దాన్ని పరచుకుని నమాజు చేయడం సరిఅయినది కాదు. కుట్టినది కాకపోయినట్లయితే పరిశుభ్రంగా ఉన్న మడతపై నమాజు చేయవచ్చు.

(6) చెక్క బల్లకు ఓ ప్రక్క అశుద్ధం అంటి మరో ప్రక్క పరిశుభ్రంగా ఉన్నట్లయితే చెక్క మందాన్ని బట్టి అది మధ్యకు చీల్చేందుకు వీలుగా ఉంటే దాని పరిశుభ్రంగా ఉన్న తలంపై నమాజ్ చేసుకోవచ్చు. అలాకాక దాన్ని చీల్చడానికి వీలులేకపోతే దానిపై నమాజ్ చేయడం సరిఅయినది కాదు.

(7) భూమ్మీద ఏదయినా అశుద్ధత అంటి అది ఎండిపోయి దాని గుర్తు చెరిగిపోయి ఉన్నట్లయితే అలాంటి భూమ్మీద నమాజ్ చేయవచ్చు. కాని ఆ భూమిపై 'తయమ్ముమ్' చేయరాదు.

(8) నీరు పిండి వెయ్యడానికి వీలుకాని వస్తువులు, ఉదాహరణకు బల్ల, మంచం, అరుగు, నేలలాంటి వానిపై అశుద్ధత అంటినట్లయితే వాటిని గీరి వేసినా, దానిపై మూడుసార్లు నీళ్ళుకొట్టినా సరిపోతుంది. కాని ఒకసారి నీరు కొట్టి ఆ నీరు పూర్తిగా కారిపోయిన తరువాత మళ్ళీ నీరు కొట్టాలి.

(9) చేప, ఈగ, దోమ, నల్లి వీటి రక్తం అశుద్ధం కాదు.

(10) పశువుల పేడ, గాడిద, గుర్రపు లద్దె, మేక పెంటికలు ఇవన్నీ అశుద్ధ పదార్థాలే. అయితే అవి కాలిన తరువాత వాటి బూడిద అపరిశుద్ధం కాదు.

(11) నూనె లేక నెయ్యిలో ఏదయినా అశుద్ధ పదార్థం పడినప్పుడు అందులో నీరుపోసి ఆడించాలి. నూనె లేక నెయ్యి పైకి తేలిన తరువాత దాన్ని తేర్చుకోవాలి. ఇలా మూడుసార్లు చేయడంవల్ల అది పరిశుభ్రమయిపోతుంది.

(12) పరికించినా కనబడని మూత్రపు తుంపరవల్లగాని, వర్షాకాలంలో పడే బురదనీటి తుంపరవల్ల బట్టలు అపరిశుభ్రం కావు. ఉత్తుత్తి అనుమానంతో వాటిని ఉతికే అవసరం లేదు.

(13) దూదిపరుపు, దిండ్లు మొదలయిన వాటిపై పిల్లల మలమూత్రాలు పడినట్లయితే వాటిని కడిగి వేయాలి. పిండడం వీలుపడకపోతే మూడుసార్లు బాగుగా నీరుకొట్టి ఆరవేయాలి. దూది బయటకు తీసి కడిగే అవసరం లేదు.

(14) కుక్క చొంగ అశుద్ధమయింది. అది పొడిపిండిలాంటి దానిలో మూతిపెడితే దాని మూతి తగిలినంత మేరకు పిండి తీసిపారవేయాలి. మిగిలిన పిండిని ఉపయోగించుకోవడం సరయినదే. కుక్క శరీరం అపరిశుద్ధం కాదు. అది బట్టలకో, శరీరానికో రాసుకున్నా దానివల్ల అవి అపరిశుభ్రం కావు. ఒక వేళ కుక్క శరీరం తడిగా ఉన్నట్లయితే బట్టలు ఉతికి శుభ్రం చేసుకోవాలి. శరీరాన్ని కడిగివేయాలి. అదే విధంగా కుక్క ద్రవపదార్థంలో మూతిపెడితే అది అశుద్ధమయిపోతుంది. పాత్రల్లో, పళ్ళాల్లో కుక్క మూతిపెడితే వాటిని ఏడుసార్లు కడగాలి. ఈ ఏడుసార్లలో ఒకసారి మట్టితో కూడా తోమాలి.

(15) అద్దం, కత్తి, చాకు, వెండి బంగారు ఆభరణాలు, రాగి, ఇనుము, గిల్టుగాజు మొదలయిన సామాన్లు అపరిశుద్ధమైతే వాటిని బాగుగా తుడవడమో, రుద్దడమో

లేక మట్టివేసి తోమడమో చేస్తే పరిశుభ్రమవుతాయి. కాని నగిషీలుఉన్నవాటిని మాత్రం తప్పకుండా కడగాలి.

(16) క్రొత్త కుండలాంటి పాత్రలు అశుద్ధతను పీల్చుకున్నట్లయితే అవి కేవలం కడగడంవల్ల పరిశుద్ధం కావు. ఆ పాత్రల్లో నీరు నింపి ఉంచి పారబొయ్యాలి. అశుద్ధత ప్రభావం, రంగు, వాసన పోయినంతవరకు నీటిని అలా నింపుతూ పారబోస్తూ ఉండాలి. అప్పటికిగాని అవి పరిశుభ్రం కావు.

(17) అపరిశుద్ధమయిన మట్టితో కుమ్మరి పాత్రలు చేస్తే అవి పచ్చిగా ఉన్నంతవరకు అశుద్ధమైనవే. వాటిని కాల్చిన తరువాత అవి పరిశుద్ధమయిపోతాయి. ఇదే విధంగా పొయ్యి, స్టవ్ లాంటివి అపరిశుద్ధమైనట్లయితే మంటలవల్ల పరిశుద్ధ మవుతాయి.

## హైజ్-నిఫాస్

గత ప్రవక్తల అనుచర సమాజాల్లో స్త్రీల రుతుస్రావాలకు సంబంధించిన ఆదేశాలు అతి కఠినంగా ఉండేవి. అంటే పురుషుడు రుతుస్రావం గల స్త్రీతో సంభోగించడం అటుంచి, ఆమె ప్రక్కన కూర్చోవడం గాని, ఆమె ప్రక్కన మంచంపై పడుకోవడంగాని, ఆమెతో కలిసి భుజించడంగానీ– అన్నీ హరామ్‌గా పరిగణించబడ్డాయి. కాని అంతిమ ప్రవక్త హ్రజత్ ముహమ్మద్ (సఅసం) అనుచర సమాజమయిన ముస్లింలకు బహిష్టు రోజుల్లో తప్ప మరే నిషేధమూ లేదు. (అంటే ఈ రోజుల్లోనూ స్త్రీ యొక్క నాభిస్థానం మొదలు మోకాలి వరకు శరీరాన్ని మాత్రం పురుషుడు తన శరీరంలోని ఏ అవయంతోనూ ముట్టుకోకూడదు.

## హైజ్

స్త్రీలకు ప్రతి నెల నిర్ణీత కాలంలో జరిగే రక్తస్రావాన్ని హైజ్ (బహిష్టు) అంటారు. దివ్య గ్రంథమయిన ఖుర్‌ఆన్ మరియు హదీసుల్లో ఈ రక్తం అశుద్ధమయినదిగా చెప్పబడింది. దివ్య ఖుర్‌ఆన్‌లో ఉంది,

هُوَ أَذًى فَاعْتَزِلُوا النِّسَاءَ فِي المحيض.

**"అది అపరిశుద్ధమైనది, కాబట్టి రుతు స్రావ కాలంలో స్త్రీలతో (సంభోగానికి) దూరంగా ఉండండి."**

హదీసులోనూ దీన్ని అపరిశుద్ధమయినదిగానే చెప్పడం జరిగింది. అది వస్త్రంపై అంటినట్లయితే దాన్ని కడిగివేయాలి.

## బహిష్టు కాలపరిమితి

1. రుతుస్రావ కాలపరిమితి కనీసం మూడు రాత్రులు, మూడు పగళ్ళు. అత్యధికం పది రాత్రులు, పది పగళ్ళు. ఏ స్త్రీకయినా మూడు రాత్రులు, మూడు పగళ్లకంటే తక్కువగా లేక పది రాత్రులు పది పగళ్ళకంటే ఎక్కువగా రక్తస్రావం కలిగితే ఆ రక్తస్రావాన్ని బహిష్టు రక్తస్రావంగా గుర్తించడం జరగదు. దాన్ని 'ఇస్తిహాజా' అంటే 'రుతుస్రావంలాంటి రక్తం' అని అంటారు.
2. రుతుస్రావ (బహిష్టు) కాలంలో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ, ఎరుపు నలుపు రంగులతో కూడిన రక్తం స్రవించవచ్చు. అది ఏదైనా అంతా బహిష్టు క్రిందికే వస్తుంది.
3. సాధారణంగా తొమ్మిదేళ్ళ వయసుకు ముందు రుతుస్రావం కాదు. ఒకవేళ తొమ్మిదేళ్ళ వయస్సుకు ముందే రక్తస్రావం జరిగితే అది 'ఇస్తిహాజా'గా పరిగణించ బడుతుంది.
4. ఏ స్త్రీకయినా ప్రతి నెల మూడు రోజులే రక్తస్రావం జరుగుతూ ఉంటే ఈవిడ ఈ అలవాటునే రుతుస్రావ కాలపరిమితి, అంటే మూడు రాత్రులు, మూడు పగళ్ళుగా పరిగణించబడుతుంది. ఏ నెల్లోనయినా ఆమెకు ఏడు రోజులు రుతుస్రావం కలిగినా అది హైజ్‌గానే భావించబడుతుంది. ఎందుకంటే హైజ్ గరిష్ఠ కాలపరిమితి పది రోజులు కాబట్టి. కాని ఎవరికయినా ఆ తరువాతి నెలలో పది రోజులకంటే ఎక్కువ రోజులు రుతుస్రావం కలిగితే (ఉదాహరణకు పన్నెండు రోజులు లేక పదిహేను రోజులు) అలాంటప్పుడు క్రితం నెలలో ఆమెకు ఎన్ని రోజులు రక్తస్రావం కలిగిందో అన్ని రోజులనే హైజ్ కాలంగా పరిగణించి మిగతా రోజుల రక్తస్రావాన్ని 'ఇస్తిహాజా'గా భావించబడుతుంది.
5. ఇదే విధంగా ఏ స్త్రీకయినా ఒకవేళ మూడు రోజులే రతుస్రావం కలిగే అలవాటు ఉండి, ఓ నెలలో నాలుగు రోజులు ఆ తరువాతి నెలలో 15 రోజుల వరకు రక్త స్రావం కలిగితే క్రితం నెల్లో ఆమెకు నాల్గు రోజులే రక్తస్రావం కలిగింది కాబట్టి ఆమె అలవాటు నాలుగు రోజులుగా లెక్కించబడుతుంది. తతిమ్మా రోజులకు సంబంధించిన నమాజులన్నీ ఆమె ఖజా చేసుకోవాలి. కాని ఈ ఖజా పది రోజులు వేచి ఉన్న తరువాతనే చేసుకోవాలి. ఎందుకంటే ఈ పది రోజుల్లో తిరిగి అలవాటు మారిపోవచ్చు. అయితే పది రోజులకు మించి రక్తస్రావం జరిగినందువల్ల నాల్గు రోజుల తరువాత వచ్చిన రక్తం అంతా ఇస్తిహాజా రక్తమే అన్న విషయం తేలి పోయింది. కాని ఈ నెలలో ఆమెకు 8, 9 లేక 10 రోజులు రక్తస్రావం కలిగితే

గత నెలలోని బహిష్టు దినాలు లెక్కలోనికి రావు. దీన్నే ఆమె బహిష్టు క్రమం (అలవాటు)గా పరిగణించాలి. అయితే 10 రోజుల కంటే ఎక్కువ కాలం రక్తస్రావం జరిగితే ఆమె అలవాటు ఆ మొదటి నాల్గు రోజులుగానే భావించబడు తుంది.

మొత్తానికి పది రోజుల తరువాత జరిగే రక్తస్రావం అంతా ఇస్తిహాజాయే. కాని పది రోజులలోపు వచ్చే బహిష్టులో అలవాటు (క్రమం) మారే అవకాశం ఎప్పుడూ ఉంటుంది. అంటే ఎల్లప్పుడు నాల్గు రోజుల అలవాటు ఉండి ముహర్రం నెల్లో అయిదు రోజులు, ఆ తరువాత సఫర్ నెల్లో పన్నెండు రోజులు వస్తే అయిదు రోజులే ఆమె అలవాటు అని భావించబడుతుంది. కాని సఫర్ నెలలో తొమ్మిది లేక పది రోజులు వచ్చినప్పుడు ఆమె బహిష్టు క్రమం తప్పిపోయింది అనుకోవాలి. ఈ తొమ్మిది పది రోజులే ఆమె రుతుకాలంగా నిర్ణయించుకోవాలి.

## నిఫాస్

స్త్రీలకు కాన్పు అయిన తరువాత స్రవించే రక్తాన్ని నిఫాస్ (ప్రసూతి స్రావం) అంటారు.

## నిఫాస్ కాలపరిమితి

నిఫాస్ గరిష్ఠ పరిమితి నలభయి రోజులు. కనీస పరిమితి ఏదీ లేదు. నలభై రోజులకంటే ముందు ఏ రోజునైనా రక్తస్రావం ఆగిపోతే స్నానం చేసుకోవాలి. అప్పటి నుండి పరిశుభ్రం అయిపోయినట్లు గ్రహించి నమాజును ప్రారంభించాలి. ఇదే విధంగా నలభై రోజుల కంటే ఎక్కువ రోజుల వరకు రక్తస్రావం జరుగుతూ ఉంటే నలభై రోజులకే గుసుల్ చేయాలి. నలభై రోజులకంటే ఎక్కువ వచ్చే రక్తం 'ఇస్తిహాజా'గా గుర్తించాలి.

## హైజ్ మరియు నిఫాస్‌కు సంబంధించిన ఆదేశాలు

1. హైజ్, నిఫాస్ కాలం ముగియగానే స్నానం చేసి నమాజ్ ప్రారంభించాలి. రక్తస్రావం ఆగిన తరువాత ఆమె ఎన్ని నమాజులనయితే వదిలిపెడుతుందో వాటిని వదలడం వల్ల పాపం కలగడమేకాక ఆ వదిలిన ఖజా నమాజులను చేయడం కూడా వాజిబ్ (తప్పనిసరి) అవుతుంది.

2. హైజ్ మరియు నిఫాస్ స్థితిలో నమాజ్, రోజా, ఖుర్ఆన్ పారాయణం ఏవీ చేయకూడదు. అయితే నమాజ్‌కు, రోజాకు ఉన్న తేడా ఏమిటంటే, హైజ్ కాలంలో చెయ్యని నమాజులకు ఖజా ఉండదు. వాటికి మాఫీ లభిస్తుంది. కాని రోజా విషయంలో అలా కాదు. పరిశుద్ధత పొందిన తరువాత వదలిన రోజాలకు ఖజా పాటించడం అవసరం.

3. ఈ స్థితిలో జిక్ర్ (దైవనామ స్మరణ) దుఆలు (వేడుకోలు) చేసుకోవచ్చు.
4. దరూద్ కూడా పఠించవచ్చు.
5. ఖుర్ఆన్‌లోని దుఆలను కేవలం దుఆగా పఠించవచ్చు.
6. స్త్రీ పురుషులు కలిసి కూర్చోవచ్చు. కలసి భోజన పానీయాలు పుచ్చుకోవచ్చు. కాని సంభోగించడం నిషిద్ధం. ఇది షరీఅత్‌లోనూ హరామే, వైద్యశాస్త్ర రీత్యా కూడా హానికరమే.

## ఇస్తిహాజాకు సంబంధించిన ఆదేశాలు

1. హైజ్, నిఫాస్ కాలపరిమితి కంటే తక్కువ లేక ఎక్కువ రోజులవరకు వచ్చే రక్తాన్ని ఇస్తిహాజా అని అంటారన్న విషయం తెలుసుకున్నాము. రక్తం కూడా ముక్కు నోరు, పన్నుల నుండి వచ్చే రక్తం కోవకు చెందినదే. ఇది సాధారణంగా వ్యాధివల్ల స్రవిస్తుంది.
2. ఇస్తిహాజా కాలంలో ఖుర్ఆన్ పారాయణం మరియు నమాజుల్ని వదలరాదు. అయితే ప్రతి నమాజ్ కొరకు క్రొత్తగా వుజూ చేయాలి. ఒకే వుజూతో ఎన్నో వేళల సమయానుక్రమమయిన నమాజులు చేయరాదు. అయితే ఎన్నో వేళల ఖజా నమాజులు ఒకే వేళలో ఒకే వుజూతో చేయవచ్చు.
3. ఎవరికయినా గర్భం ధరించి ఉన్న కాలంలో రక్తం స్రవిస్తే ఆ రక్తం కూడా ఇస్తిహాజాగానే పరిగణించబడుతుంది. అలాంటి గర్భవతి నమాజు మానేయకూడదు.

## పరిశుద్ధంగా ఉండే కాల వ్యవధి

1. రెండు బహిష్టులకు నడుమ పరిశుద్ధంగా ఉండే కాలవ్యవధి కనీసం 15 రోజులు. అత్యధిక వ్యవధికి హద్దు లేదు. ఏ స్త్రీకయినా, ఒకవేళ మూడు రోజుల కంటే తక్కువ అంటే ఒకటి లేక రెండు రోజులే రక్తం వచ్చి తరువాతి రెండు రోజులు పరిశుద్ధంగా ఉండి, ఆ తరువాత మళ్ళీ రక్తస్రావం జరిగితే అలా వచ్చిన రక్తం ఇస్తిహాజాగానే భావించాలి.
2. ఇదే విధంగా ఒకటీ రెండు రోజులు రక్తం వచ్చి తరువాత పదిహేను రోజులకంటే తక్కువగా, అంటే 10, 12 రోజులు స్రావం నిలిచిపోయి, తదుపరి రక్తం వచ్చినట్లయితే ఆమె బహిష్టు అలవాటున్న రోజులు బహిష్టుకాలంగా భావించి మిగిలిన రోజులు ఇస్తిహాజా రోజులుగా పరిగణించాలి.

3. ఏ స్త్రీకయినా వరుసగా 15 రోజులు రక్తం వస్తూనే ఉన్నట్లయితే అందులో 10 రోజులు బహిష్టు కాలంగా పరిగణించి, మిగిలిన రోజుల్లో గుసుల్, వుజూ చేసి నమాజ్ చేయాలి.

## ముఖ్య సూచన:

స్త్రీలకు 'ల్యుకోరియా" (తెల్లబట్ట) స్రావం కారణంగా స్నానం చేయనవసరం లేదు. కాని ఇలాంటి స్త్రీ ప్రతి నమాజ్ కొరకు తప్పకుండా క్రొత్తగా వుజూ చేసి నమాజ్ చేయ వలసి వుంటుంది. వుజూకు పూర్వం మర్మాంగాన్ని నీటితో పరిశుభ్రపరచుకోవాలి.

## హైజ్, నిఫాస్, ఇస్తిహాజాకు సంబంధించిన ముఖ్య విషయాలు:

1. ఏ స్త్రీకయినా ఒకటీరెండు రోజుల వరకు రక్తం స్రవించి నిలిచిపోయినట్లయితే ఆమె స్నానం చేయకుండా వుజూ చేసి నమాజ్ చేయవచ్చు. స్నానంకోసమని నమాజ్‌ను వదిలివేయడం మహాపాపం. అయితే సంభోగానికి దూరంగా ఉండాలి.

2. నమాజ్ వేళ దాటిపోతున్న చివరిఘడియల్లో రక్తస్రావం ఆగిపోతే, వెంటనే స్నానం చేసి నమాజ్ చేసుకోవాలి. సోమరితనంవల్ల నమాజ్‌ను వదిలేస్తే అది అపరాధ మవడం అటుంచి ఆ నమాజ్‌ను ఖజాగా నెరవేర్చాలి. ప్రసవం తరువాత ఎవరికైనా రక్తం స్రవించకపోతే అలాంటి స్త్రీ ప్రసవం తరువాతనే స్నానం చేయడం వాజిబ్ (తప్పనిసరి) అవుతుంది.

## పరిశుద్ధతకు సాధనాలు

ఇంతవరకు 'నజాసత్' (అపరిశుద్ధత) ఎన్ని విధాలుగా ఏర్పడుతుందో, దాన్ని ఎలా దూరం చేయవచ్చునో చెప్పడం జరిగింది. ఇప్పుడు దాన్ని దూరం చేసేందుకు కావలసిన పదార్థాల గురించి వివరించడం జరుగుతోంది. ఈ నజాసత్‌ను దూరం చేసుకునేందుకు ఖుర్ఆన్ మరియు హదీసుల్లో రెండు పదార్థాలను సూచించి అనుమతి ఇవ్వడం జరిగింది. ఒకటి నీరు, రెండవది మన్ను.

దివ్య ఖుర్ఆన్‌లో ఇలా చెప్పబడింది:

"మీపై మబ్బుల నుండి నీళ్ళు కురిపిస్తాడు. మిమ్మల్ని పరిశుద్ధులుగా చేయడానికి."
(అన్ఫాల్)

وَيُنَزِّلُ عَلَيْكُم مِّنَ السَّمَاءِ مَاءً لِّيُطَهِّرَكُم ۔ (انفال)

ఇదే విధంగా మట్టి విషయంలో కూడా అనుమతి ఇవ్వబడింది.

"నీరు లభించకున్నట్లయితే మట్టితో 'తయమ్ముమ్' చేసుకోండి." (నిసా)

فَإِنْ لَّمْ تَجِدُوا مَآءً فَتَيَمَّمُوا صَعِيدًا طَيِّبًا۔ (النساء)

మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు:

"నీరు పరిశుద్ధం చేస్తుంది."

اَلْمَآءُ طَهُورٌ۔

మట్టికి సంబంధించిన మహా ప్రవక్త (సఅసం) హదీసులో, "భూమి నాకోసం పరిశుద్ధం చేయబడింది" అని ఉంది.

మొదట నీటితోనూ ఆపై మట్టితో పరిశుద్ధత ఎలా పొందాలో చెప్పుకుందాం.

## నీరు

నది నీరయినా, సముద్రపు నీరయినా, వర్షపు నీరయినా, బావి (నూతి) నీరైనా లేక ఊట నీరైనా– నీటితో కోరినప్పుడల్లా మనిషి అపరిశుద్ధతను దూరం చేసుకోగలడు. వుజూ, గుసుల్, మలమూత్రాల పరిశుద్ధతకై ఇస్తెన్జా చేసుకోగలడు. అయితే నీటి గురించి చెప్పుకోబోయే ముందు కొన్ని పారిభాషిక పదాల గురించి తెలుసుకోవడం మంచిది– ఆ పదాలను వాడినప్పుడు వెంటనే అర్థం చేసుకోవడానికి.

## హరాం

ఒక వస్తువును 'హరాం' (నిషిద్ధమయినది) అని చెప్పినప్పుడు అలాంటి వస్తువుకు దూరంగా ఉండాలని, దాన్ని వాడకూడదని ఖుర్ఆన్, హదీసుల్లో తాకీదు చేయబడిందని అర్థం. ఏ ముస్లిమయినా ఓ హరాం వస్తువును హరాంగా భావించకపోతే అతను కాఫిర్ (ధర్మ తిరస్కారి) అవుతాడు. ఒకవేళ దాన్ని అతడు హరాంగా భావిస్తూ దానికి దూరంగా ఉండకపోతే అతను 'ఫాసిఖ్' (తెలిసీ పాపం చేసేవాడు, భ్రష్టుడు)గా ఎంచబడి శిక్షకు అర్హుడవుతాడు. ఉదాహరణకు, త్రాగుడు, జూదం, వడ్డీ వ్యాపారాలు చెయ్యడం, అబద్ధమాడడం, నమాజ్ లేక రోజాలను పాటించకపోవడం, జకాత్ చెల్లించకపోవడం మొదలయినవి.

## మక్రూహ్

ఏదయినా ఓ వస్తువు నిషిద్ధమైందన్న ఉత్తర్వులు నిరంతరంకాని ఉల్లేఖనాల ద్వారా లేక ప్రతీతిలో లేని హదీసు ద్వారా మాత్రమే రుజువయితే అలాంటి వస్తువు 'మక్రూహ్' (ఏహ్యమయింది, విసర్జింపదగింది) అని అంటారు.

మక్రూహ్ రెండు రకాలు: (1) మక్రూహె తహ్రీమీ, (2) మక్రూహె తన్జీహి.

## మక్రూహ్ తహ్రీమి

మక్రూహె తహ్రీమి 'హరాం'కు దగ్గరయింది. కాబట్టి ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలై) దీన్ని కూడా హరాం కోవకు చెందిందే అన్నారు.

## మక్రూహె తన్జీహి

హరాం ఎప్పుడూ దృఢమయిన ఆధారంతో రుజువవుతుంది. కాని మక్రూహె తన్జీహి తార్కిక ప్రాతిపదికగా ఊహ ఆధారంగా నిర్ణయించబడుతుంది. దీన్ని చేయడమూ పాపమే.

## నీటి రకాలు

నీరు రెండు రకాలు. (1) ముత్లఖ్ నీరు (కేవలం నీరు) (2) ముఖయ్యిద్ నీరు.

మనం సర్వసామాన్యంగా దేన్నయితే నీరు అంటున్నామో అదే ముత్లఖ్ నీరు. కాని చూడటానికి నీరులాగే ఉన్నా సామాన్యంగా దేన్నయితే నీరు అని అనరో అది ముఖయ్యిద్ నీరు. ఉదాహరణకు, రోజ్ వాటర్, సోడా వాటర్, షర్బత్తు మొదలయిన ద్రవ పదార్థాలు.

## ముత్లఖ్ నీటి రకాలు

ముత్లఖ్ నీరు అయిదు రకాలు

1. నజిస్: ఈ నీరు పరిశుద్ధతకై ఉపయోగపడదు.

2. తాహిర్: పరిశుద్ధమయిన నీరు. పరిశుద్ధతకై ఉపయోగపడే నీరు.

3. తాహిర్ గైర్ ముతహ్హిర్: స్వతహాగా పరిశుద్ధమయినా పరిశుద్ధతకు ఉపయోగపడని నీరు. ఉదాహరణకు వుజూ, గుసుల్‌లో ఉపయోగమయిన నీరు.

4. తాహిర్ ముతహ్హిర్ మక్రూహ్: 'తాహిర్' నీరు లభ్యమయినప్పుడు ఇలాంటి నీరు వాడకం మక్రూహె తన్జీహి క్రిందికి వస్తుంది. ఉదాహరణకు ఎండలో కాగిన నీరు, మనిషి ఉమ్మిపడిన కొద్ది మాత్రపు నీరు, స్త్రీ కోసం పర పురుషుని వెంగిలి నీరు, పురుషుని కోసం పరస్త్రీ వెంగిలి నీరు, శుద్ధత, అశుద్ధత జ్ఞానంలేని పిల్లలు చేయిముంచిన నీరు.

5. మష్కూక్: పరిశుద్ధమో, అపరిశుద్ధమో తెలుసుకోలేని సందేహాస్పదమయిన నీరు. ఉదా॥ గాడిద లేక కంచర గాడిదల వెంగిలి నీరు.

## ప్రవహించే నీరు, నీటి నిల్వలు

నదులు, సముద్రాలు, చెలమల నీరు ఎప్పుడూ పారుతూనే ఉంటుంది. ఈ నీటిలో

ఏదయినా అపరిశుద్ధ పదార్థం పడినప్పుడు ఆ నీరు, అపరిశుద్ధత దూరం చేయలేనంత మలినం కాదు. ఇదే విధంగా పెద్ద పెద్ద జలాశయాల నీరు ప్రవహించకపోయినా అశుద్ధత కలిసినప్పటికీ మలినం కావు. కాని ఆ నీటిలో దాని రంగు, రుచి లేక వాసన మారేటంతటి మలినం కలిస్తే వాటికి కుంటలు, చిన్న కొలనులకు సంబంధించిన ఆదేశాలే వర్తిస్తాయి. వాటి నీరు సాధారణంగా పరిశుద్ధమయినవిగానే పరిగణించబడాలి. అయితే చిన్న చెరువులు, కుంటలు, నీటి గుంటలు, బావుల నీరు అప్పుడప్పుడు శుద్ధంగాను మరొకప్పుడు అశుద్ధంగానూ అవుతూ ఉంటుంది. అందుకని వాటికి సంబంధించిన ఆదేశాలు ఇక్కడ చెప్పబడుతున్నాయి.

## మాయె కసీర్ (ఎక్కువ నీరు)

ఓ చెరువు, కుంట, నీటి గుంటలో ఓ ఒడ్డున అశుద్ధం పడి, రెండో ఒడ్డుపై దాని ప్రభావం కనపడకపోయేంత పెద్దదిగా ఉంటే దాని నీరు 'తాహిర్' నీటి కోవకే చెందుతుంది. తాహిర్ అంటే రంగు, రుచి, వాసన మారనటువంటి నీరు. ఈ నీటితో పరిశుద్ధతను పొందొచ్చు. షరీఅత్ పరిభాషలో దీన్ని 'మాయె కసీర్' అంటారు.

## మాయె కలీల్ (కొద్దిపాటి నీరు)

పైన చెప్పబడిన ఆదేశాలకు భిన్నంగా తక్కువ నీరుండి అందులో ఓ వైపు ఏదయినా అశుద్ధ పదార్థం పడి మరో వైపు దాని ప్రభావం (రంగు, రుచి, వాసన) గోచరిస్తే ఆ నీరంతా అశుద్ధమయిన నీరుగా పరిగణించబడుతుంది. దీన్ని మా-ఎ-కలీల్ అనంటారు. ఉదా॥కు మట్టి పాత్రలో లేక బకెట్‌లో లేక తొట్టెలో, గాబులాంటి వానిలో నీరుండి వాటిలో అశుద్ధమయినదేమయినా పడిపోతే ఆ నీరు అశుద్ధమవుతుంది. బావి నీటి గురించి వేరుగా చర్చించబడుతుంది. బావి కాకుండా ఇతర నీరు అది తక్కువయినా, ఎక్కువైనా దానికి సంబంధించిన కొన్ని ఆదేశాలు పైన పేర్కొన్నాము. మరికొన్ని దిగువన ఇస్తున్నాము.

(1) అశుద్ధంపడడం మూలంగా నీటి రంగులోగాని, రుచిలోగాని మార్పువస్తే లేక దుర్వాసన ఏర్పడితే ఆ నీరు ఎక్కువయినా, తక్కువయినా అశుద్ధమైన నీరుగా పరిగణించబడుతుంది.

(2) ఒకవేళ నిలువ ఉండడంవలన నీటి రంగుగాని, రుచిగాని, వాసనగాని మారిపోతే లేక అందులో కేవలం ఆకులు పడడంవలన మార్పువచ్చినా అలాంటి నీరు అశుద్ధజలం కాజాలదు. కాని నీటికి ఉండవలసిన పలుచదనంపోయి అది చిక్కగా తయారయితే మాత్రం ఆ నీటి ద్వారా పరిశుద్ధత ప్రాప్తం కాదు.

(3) సేద్యం కోసం వాడే బావులు, గొట్టపు బావుల (Tube Wells) నీరు కాలువల

ద్వారా పారుతుంది. అది మాయె కసీర్ (అధిక జలం) కోవకు చెందిందే. అలాంటి నీటిలో అశుద్ధ పదార్థం పడినప్పుడు పడిన చోటి నుండి దూరంగా జరిగి వుజూగాని, గుసుల్‌గాని చేసుకోవచ్చు. అశుద్ధం పడడం మూలంగా కాలువ నీరు అపరిశుద్ధం కాదు. రంగు, రుచి, వాసన మారినంత అశుద్ధం పడితే మాత్రం ఆ నీరు అపరిశుద్ధమే. పారే నీటిలో ఇలా జరగడం బహు అరుదు.

(4) నీటిలో ఏదయినా పదార్థం పడి దాని పలుచదనం మాత్రం యథాతథంగానే ఉండి దాన్ని సాధారణంగా నీరు అనకపోతే అలాంటి నీటితో వుజూ, గుసుల్ చేయ వీలులేదు. ఉదా॥ రోజ్‌వాటర్, షర్బత్తు, సోడా వాటర్ లేక ఔషధ ద్రవం, ఇలాంటి వాటితో నజాసతె హఖీఖీ మాత్రం కడగవచ్చు.

(5) నీటిలో ఏదయినా పరిశుద్ధ పదార్థం పడిపోయినా లేక కలిపినా దాని రంగు, రుచి, వాసన మారిపోయినా అలాంటి నీటిలో పరిశుద్ధతను పొందవచ్చు. సాధారణంగా నీటిలో సబ్బుపొడి, కుంకుమ పువ్వు లేక బట్టల రంగు కలిసినప్పుడు రంగు గాఢంగా మారకపోతే ఆ నీటి ద్వారా శుద్ధత పొందవచ్చు. రంగు గాఢంగా మారితే లేక కావాలని రంగు కలిపిన నీరయితే మటుకు అది 'మక్రూహ్' అవుతుంది. పాలు, శనగ ఆకుల ద్వారా గ్రహించిన ఆమ్లంలాంటి ఏదైనా ద్రవపదార్థం వల్ల నీటి రంగు, రుచి, వాసన మారిపోతే అలాంటి నీరు పరిశుద్ధతకు పనికిరాదు. మొత్తానికి చెప్పవచ్చిందేమంటే, ఈ పదార్థాలు నీటిలో బాగా కలిసిపోయినట్లయితే అలాంటి నీటితో వుజూ, గుసుల్ చేయడం సరికాదు. కాని కొద్దిగా మాత్రమే కలసినట్లయితే ఫరవాలేదు.

(6) ఒకవేళ ఏదయినా పరిశుద్ధ పదార్థం నీటిలో వేసి కాగబెట్టినప్పుడు దాని ప్రభావం వల్ల తేలికపాటి రంగు వచ్చినా అది పరిశుద్ధమయినదే. ఉదాహరణకు మయ్యత్ (మృతుని) గుసుల్ కొరకు రేగు ఆకులు నీటిలో వేసి కాగబెడతారు. కాని ఇలాంటి పదార్థాన్ని మరీ మరగకాచినప్పుడు ఆ నీరు ఏ మాత్రం చిక్కగా తయారయినా, దాన్ని సాధారణంగా నీరు అని చెప్పకపోయినప్పుడు, ఆ నీరు మాత్రం పారిశుద్ధ్యానికి పనికిరాదు.

(7) ఫలాలు, ఆకుల నుండి పిండి తీసిన పసరు, పుచ్చకాయ నుండి వెలువడే నీరు, చెరకు రసం మొదలయిన వాటి ద్వారా పరిశుద్ధత ప్రాప్తం కాదు. అంటే వుజూ, గుస్ల్ చెయ్యరాదు. కాని వస్త్రాలకు అంటిన మలమూత్రాలు లేక మరేదయినా అశుద్ధ పదార్థం వాటితో కడిగి శుభ్రం చేసుకోవచ్చు. ఈ ఆదేశమే పెట్రోలుకు కకూడా వర్తిస్తుంది.

(8) వుజూ, గుసుల్‌లో ఉపయోగపడిన నీటిని తిరిగి పరిశుద్ధతకై వాడడం సరయింది కాదు.

(9) హరాం జంతువుల వెంగిలి నీరు పరిశుద్ధత పొందడానికి పనికిరాదు.

(10) పరపురుషుని వెంగిలి నీరు స్త్రీ కోసం, పరస్త్రీ వెంగిలి నీరు పురుషుని కోసం మక్రూహ్ అవుతుంది.

(11) అడవిలోనూ, నీరులేని ప్రదేశాల్లోనూ ఏ కొద్ది నీరు లభించినా అది అశుద్ధమయిన నీరుగా రుజువుకానంత వరకు ఆ నీటితో వుజూ, గుసుల్ చేసుకోవచ్చు. కేవలం అనుమానంవల్ల దాన్ని వదిలేసి తయమ్ముమ్ చేయరాదు.

## జంతువుల ఎంగిలి నీరు

జంతువుల ఎంగిలి మూలంగా అపరిశుద్ధం అయ్యే నీరు. (మక్రూహె తహ్రీమీ)

కుక్క, పంది, పులి, తోడేలులాంటి క్రూరమృగాలన్నిటి ఎంగిలి నీరు అపరిశుద్ధమే. అయితే ఈ ఆదేశం, పాత్రలు, నూతులు, చిన్న గుంటల్లోని నీటికే వర్తిస్తుంది. నదులు, వాగుల్లో ఆ జంతువులు నీరు త్రాగినట్లయితే ఆ ప్రదేశం నుండి కొంత దూరాన పరిశుద్ధ నీరు లభిస్తుంది. ఇదే విధంగా పిల్లి ఎలుకను తిన్న వెంటనే త్రాగిన నీరు లేక మనిషి సారా లేక ఏదేని మత్తుపానీయం త్రాగి వదలిన ఎంగిలి నీరు పూర్తిగా అపరిశుద్ధమే.

## ఏయే జంతువుల ఎంగిలి నీరు మక్రూహె తన్జీహి కోవకు చెందుతుంది

కొన్ని జంతువులు హరామ్ అయినప్పటికి ఇండ్లలోనే ఉంటాయి గనక వాటి బారినుండి తప్పించుకోవడం కష్టం. అలాంటి జంతువుల్లో పిల్లి ఒకటి. పిల్లి అప్పుడే ఎలుకను తిని ఉండకపోతే (తిని చాలా సేపయినట్లయితే, దాని ఎంగిలి మక్రూహె తన్జీహి అవుతుంది. అదే విధంగా ఎలుక, బల్లి, విచ్చలవిడిగా తిరిగే కోళ్ళు మొదలయినవాటి ఎంగిలి కూడా మక్రూహె తన్జీహియే. అదే రీతిలో కాకి, గ్రద్ద, డేగలాంటి హరాం (నిషిద్ధ) పక్షుల ఎంగిలి కూడా మక్రూహె తన్జీహియే. కొన్ని జంతువులు హలాల్ అయినప్పటికీ విచ్చలవిడిగా తిరిగి అశుద్ధాన్ని తినడానికి అలవాటుపడి వుంటాయి. ఉదాహరణకు ఆవు, ఎద్దు, గేదె, కోళ్ళులాంటివి. ఈ జంతువులు నీటిలో మూతిబెడితే ఆ నీరు మక్రూహె తన్జీహిగా మారిపోతుంది. అయితే వాటి మూతులకు అశుద్ధం అంటి ఉంటే మాత్రం ఆ నీరు అపరిశుద్ధం అయినట్లే. ఇదే విధంగా పర పురుషుల ఎంగిలి స్త్రీలకు, పరస్త్రీల ఎంగిలి పురుషులకు మక్రూహ్ అవుతుంది.

## ఏ ప్రాణుల ఎంగిలి పరిశుద్ధమయినది?

మనిషి, ముస్లిమయినా, ముస్లిమేతరుడైనా అతని ఎంగిలి పరిశుద్ధమయింది. అయితే అతను హరాం (నిషిద్ధ) పదార్థాలు, ఉదాహరణకు పంది లేక మృత జంతువు మాంసం తిని లేదా సారా త్రాగి నీరు ఎంగిలి చేసినట్లయితే ఆ నీరు అశుద్ధమయిపోతుంది.

హలాల్ జంతువులు, పక్షుల ఎంగిలి కూడా పరిశుద్ధమయినదే. అదే విధంగా నదులు, సముద్రాల్లో ఉండే జంతువులు– అవి హలాల్ అయినా హరాం అయినా– వాటి ఎంగిలి కూడా పరిశుద్ధమయిందే. గుర్రం చేసిన ఎంగిలి కూడా పరిశుద్ధమయినదే.

అయితే పైన చెప్పిన ఈ జంతువుల నోటికి ఏదైనా అశుద్ధ పదార్థం, మూత్రం, మలం, లద్దె, పేడలాంటిది అంటివున్నప్పుడు అవి ఆ నోటే నీరు త్రాగితే ఆ నీరు అపరిశుద్ధ మవుతుంది. కాని ఈ విషయంలో ఇదమిత్థంగా తెలియనప్పుడు అనవసరంగా అనుమాన పడడం మంచిది కాదు. కొందరు స్త్రీలు ఈ విషయంలో అతిగా అనుమాన పడడం మామూలు. అది సరయిన పద్ధతి కాదు. వాటి మూతులకో, కాళ్ళకో అశుద్ధ పదార్థం అంటివుండిందని రూఢీగా తెలిసిన పక్షంలో, అవి నీటిని ముట్టినట్లయితే ఆ నీరు అపరిశుద్ధంగా భావించాలి.

## ఏయే జంతువులు నీటపడినప్పుడు నీరు అపరిశుద్ధం కాదు

(1) నీటిలోనే పుట్టి పెరిగే చేప, కప్ప, తాబేలు, పీతలాంటి ప్రాణులు నీటపడినా లేక ఆ నీటిలోనే చనిపోయినా ఆ నీరు అపరిశుద్ధం కాదు.

(2) వర్షా కాలంలో భూమ్మీదనే పుట్టి పెరిగే కప్పలు, చిరు కప్పలకు కూడా ఈ ఆదేశమే చెల్లుతుంది. అవి నీటబడి చనిపోయి కుళ్ళిపోయినా ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే ఇలాంటి నీరు త్రాగడం మాత్రం నిషిద్ధం. పరిశుద్ధత పొందడానికి వాటిని వాడవచ్చు.

(3) ఈగ, దోమ, కందిరీగ, చీమ తదితర ప్రవహించే రక్తంలేని కీటకాలు, నీటబడినా లేక అందులోనే చచ్చిపోయినా ఆ నీరు అపరిశుద్ధం కాదు.

(4) ఇదే విధంగా చచ్చిపోయిన లేక జిబహ్ చేసిన జంతువుల ఎముకలుగాని, కొమ్ములుగాని, వెంట్రుకలుగాని నీటపడినా ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే పందికి సంబంధించిన ప్రతి వస్తువూ అశుద్ధమయినదే.

## నీరు అపరిశుద్ధం ఎలా అవుతుంది

ఇదివరకే చెప్పుకున్నట్లు నీరు ఎక్కువగా ఉండి నిలిచిఉన్నా, ప్రవహిస్తూఉన్నా ఆ

నీటిలో ఏదేని అశుద్ధ వస్తువు పడి దాని కారణంగా ఆ నీటి రంగులోగాని, రుచిలోగాని, వాసనలోగాని మార్పురానంతవరకు ఆ నీరు పరిశుద్ధమయినదే. కాని కొద్దిపాటి నీటిలో నజాసతె ఖఫీఫా లేక నజాసతె గలీజా పడిపోతే ఆ నీరు అపరిశుద్ధమవుతుంది. కొద్ది నీటిలో పిల్లి, ఎలుక, మేక, కోడి, కాకి, పిచ్చుకలాంటి ప్రవహించే రక్తం గల ప్రాణులు పడి చని పోయినట్లయితే ఆ నీరు అపరిశుద్ధ మవుతుంది. వీటికి సంబంధించిన ఆదేశాలు ముందు చెప్పబడుతున్నాయి.

## తక్కువ ఎక్కువ నీటికి ప్రమాణం

ఎంత నీరయితే తక్కువయినదో మరెంత నీరు ఎక్కువయినదో ఇదివరకే చెప్పడం జరిగింది. అయితే సౌలభ్యంకోసం అందాజా కూడా చెప్పబడుతోంది.

ఒక గుంటగాని, బావిగాని, కొలనుగాని అయిదున్నర గజాల పొడవు అంతే వెడల్పు, కనీసం ఒక మూరెడు లోతుగా ఉంటే దాని నీరు మాయె కసీర్ (ఎక్కువ నీరు) అంతకంటే తక్కువ పరిమాణమయితే అది మాయె ఖలీల్ (తక్కువ నీరు)గా పరిగణించ బడుతుంది.

## బావి-నీరు

అశుద్ధతలు, హరాం, హలాల్ జంతువులు, వాటి ఎంగిలి గురించి పైన చెప్పు కున్నాం. ఒకవేళ ఆ అశుద్ధాలు లేక ఆ జంతువులు ఏదేని నూతిలో పడిపోయినా లేక అందులోనే చనిపోయినా ఆ నీటిని శుభ్రపర్చడానికి మూడు మార్గాలున్నాయి.

(1) పూర్తి బావే అపరిశుద్ధం అయిపోవడం. ఈ పరిస్థితిలో ఆ బావిలోని మొత్తం నీటినే తోడివేయవలసి వస్తుంది.

(2) పూర్తి బావి అపరిశుద్ధం కాకపోవడం. ఇలాంటి పరిస్థితిలో బావిలోని నీరు కొంత తోడివేసినా సరిపోతుంది.

(3) అసలు బావి అపరిశుద్ధమే కాకపోవడం.

బావి పూర్తిగా ఎప్పుడు అపరిశుద్ధమవుతుంది?

ఈ క్రింది పరిస్థితులు ఏర్పడినప్పుడే పూర్తి బావి అపరిశుద్ధమయిపోతుంది.

(1) నూతిలో నజాసతె ఖఫీఫా లేక నజాసతె గలీజాకు సంబంధించిన ఏ అపరిశుద్ధ పదార్థం పడిపోయినా ఆ నూతిలోని నీరంతా అపరిశుద్ధమయిపోతుంది.

ఉదాహరణకు హలాల్ లేక హరాం జంతువుల పేడ, లద్దెల పెద్దమొత్తం బావిలో పడినా, మనిషి మలం, మూత్రం, రక్తం, చీము, సారా; కోడి, బాతుకు

సంబంధించిన రెట్ట మొదలయినవి నూతిలో పడిపోయినా ఆ నూతిలోని నీరంతా అపరిశుద్ధమే.

(2) ఏ జంతువుల ఎంగిలి అపరిశుద్ధమో ఆ జంతువులు అంటే కుక్క, పంది మొదలయినవి బావిలో పడిపోయినప్పుడు ఆ నీరంతా అపరిశుద్ధమయిపోతుంది. ఇదే విధంగా వాటి ఎంగిలి పడినా నీరు పూర్తిగా అపరిశుద్ధమవుతుంది.

(3) అశుద్ధం అంటిన చెప్పులు, బూట్లు, అలానే అశుద్ధమయిన గుడ్డలు నూతిలో పడి పోతే ఆ బావి నీరంతా అపరిశుద్ధమయిపోతుంది. అయితే కేవలం అనుమానంపై నీటినీ లేక మరే వస్తువునయినా అపరిశుద్ధం అని అనుకోరాదు. అశుద్ధం అంటిందని రూఢీగా తెలిసినప్పుడే నీరు అశుద్ధమయినట్లు భావించాలి. ఉదాహ రణకు చెప్పుకో, బూటుకో అశుద్ధం అంటింది కాని నడిచేటప్పుడు భూమి రాపిడికి అది తొలగిపోయింది, అలాంటప్పుడు అనుకోకుండా పాదరక్షలు బావిలో పడిపోతే ఆ నీరు అపరిశుద్ధం కాదు, అయినా ముందుజాగ్రత్త కోసం పది ఇరవై బొక్కెన్ల నీరు తోడివేయడం మంచిది.

(4) ఒకవేళ మనిషిగాని, ఎద్దు, ఆవు, గేదె, మేకలాంటి జంతువులుగాని లేక రెండు పిల్లులు లేక అనేక ఎలుకలు ఒకేసారి నూతిలోపడి చనిపోయినా ఆ నీరంతా అపరిశుద్ధమే. కాని అవి ప్రాణంతో బయటకు వచ్చినప్పుడు ఆ నీరు అపరిశుద్ధం కావు. అయితే వాటి శరీరాలకు అశుద్ధ పదార్థం ఏదయినా అంటిందని రూఢీ అయినప్పుడు, అవి ప్రాణాల్తో బయటకు వచ్చినా ఆ నీరు అపరిశుద్ధం అయినట్లే.

(5) పిచ్చుక, పావురం, కోడి, పిల్లి, ఎలుక, ముంగిస, పాములాంటి రక్తం ప్రవహించే చిన్న జంతువులు, పక్షులు బావి నీటిలో పడి చనిపోయి బాగా ఉబ్బిపోయినా, చిట్లిపోయినా ఆ నీరంతా అపరిశుద్ధమే.

ఉబ్బడం అంటే నీటిలో పడటం కారణంగా ఉబ్బడం అని, చిట్లిపోవడం అంటే వాటి శరీరంపై ఉన్న వెంట్రుకలు, ఈకలు రాలిపోవుట అని అర్థం.

(6) గాయపడి శరీరం నుండి రక్తంగాని, చీముగాని కారుతున్నప్పుడు ఏ జంతువయినా బావిలో పడిపోతే ఆ నీరంతా అపరిశుద్ధమయిపోతుంది.

(7) అపరిశుద్ధమయిన బావి నీరు మరో బావిలో పడినా ఆ రెండో బావి నీరు కూడా అపరిశుద్ధమయినట్లే.

(8) ఒకవేళ ఎలుక ఏదయినా మరుగుదొడ్డి, మూత్రశాల నుండి శరీరంపై ఆ అశుద్ధ పదార్థాలు పులుముకుని బయటకువచ్చి నూతిలోపడినా– అది చనిపోయినా,

ప్రాణాల్తో ఉన్నా– ఆ బావి నీరు మొత్తం అపరిశుద్ధమే అవుతుంది. ఆ బావి నీటి మొత్తాన్ని తోడివేయవలసిందే. ఇదే విధంగా తోక తెగిన వెంటనే ఎలుక బావిలో పడినా ఆ బావి నీరంతా అపరిశుద్ధం అయిపోతుంది.

(9) చనిపోయిన జంతువేదయినా బావిలో పడినా, అది బావిలో పడి చనిపోయి నట్లుగానే భావించబడుతుంది.

## బావిని ఎలా శుభ్రం చేయాలి?

(1) బావి పూర్తిగా అపరిశుద్ధం అయినప్పుడు వీలయితే, ఆ బావిని అపరిశుద్ధం చేసిన ఆ అశుద్ధ పదార్థాన్ని మొట్టమొదట తీసివేయాలి. ఆ తరువాత ఆ బావి నీరంతా తోడెయ్యాలి. నీరంతా తోడడం అంటే, తోడేసిన తరువాత చివరన బొక్కెన (చేద) వేస్తే అది సగం కూడా నీటిలో మునగరాదు. కాని బావిచాలా పెద్దదయి నీరంతా తోడడం వీలుకాకపోతే లేక ఎంత తోడినా తిరిగి అంతే నీరు వేగంగా ఊరుతూ ఉంటే మొదట ఆ బావిలో నీరెంతుందో అంచనా వేసుకోవాలి. ఆ అంచనా మేరకు నీరు తోడేస్తే చాలు. అయితే ఈ అంచనాకట్టేవారు అనుభవమున్న ధార్మిక ముస్లిములయి ఉండాలి. ఈ విధంగా అంచనాకట్టే వ్యక్తి లభ్యం కానట్లయితే ఆ బావి నుండి మూడొందలు, మూడొందల యాభయి కడవలు లేక బొక్కెన్ల నీరు తోడివేయాలి. బొక్కెనయినా, కడవయినా సాధారణంగా మనం వాడేవే కావాలి. మరీ పెద్దది కాకుండా మరీ చిన్నది కాకుండా ఉండాలి.

(2) అపరిశుద్ధమయిన బావిని శుభ్రపరిచేవారు తమ కాళ్ళు, చేతులు, శరీరం లేక చేద, త్రాడు కడుగనవసరం లేదు. నీటిని తోడుతున్నప్పుడే వారి కాళ్ళు చేతులు వగైరాలు శుభ్రపడిపోతాయి.

## ఏ పరిస్థితుల్లో బావి అపరిశుద్ధమవుతుంది?

(1) పావురం, కోడి, కాకి, పిల్లి లేక అంతే పరిమాణంగల ఏ జంతువయినా, పక్షి అయినా బావిలో పడి మరణించినప్పుడు అది ఉబ్బడంగాని, చిట్లి పోవడంగాని జరగకపోతే, ఆ బావి మొత్తం అపరిశుద్ధం కాదు. పైనున్న నీరు మాత్రమే అపరిశుద్ధం. కాబట్టి యాభయి లేక అరవయి బొక్కెనల నీరు తోడివేయాలి.

(2) ఇదే విధంగా, ఎలుక, పిచ్చుక లేక అదే పరిమాణం గల పక్షో లేక జంతువో పడి మరణించి కుళ్ళిపోవటం జరక్కపోతే పూర్తి బావి అపరిశుద్ధం కాదు. ఈ సందర్భంలో పాతిక ముప్ఫయి బొక్కెనల నీరు తోడివేస్తే బావి శుభ్రపడుతుంది.

కాని పడిన జంతువు ముందు తీసివేయాలి. అలా తీయకుండా నీరు తోడివేయడం నిరర్థకం. ఆ జంతువును లేక పక్షిని తీసిన తరువాతే తిరిగి అంత నీరు తోడి వేయడం అవసరం.

(3) బావి లోపల చనిపోయిన ఎలుకో లేక ఇతర జంతువో కనబడగా అది ఆ బావిలో ఎప్పుడు పడిందో తెలియని పక్షంలో అది ఉబ్బడంగాని, చిట్లిపోవడంగాని జరగని సందర్భంలో తెలీక ఎవరయినా ఆ నీటితో వుజూ చేసి నమాజ్ చేస్తే అలాంటివారు ఒక రేయి ఒక పగలు నమాజులను తిరిగి చేసుకోవాలి. ఈ నీటితో ఉతికిన బట్టలను సయితం తిరిగి ఉతుక్కోవాలి. అదే, ఒకవేళ ఆ జంతువు ఉబ్బడంగాని, చిట్లిపోవడంగాని జరిగితే మూడు రేయింబవళ్ళ నమాజుల్ని తిరిగి చేయాలి.

## ఎలాంటి పరిస్థితుల్లో బావి నీరు అపరిశుద్ధం కాదు?

ఈ క్రింది పరిస్థితులు ఏర్పడినప్పుడు బావి నీరు అపరిశుద్ధం కాదు.

1) పరిశుద్ధమయిన వస్త్రంగాని, చెట్ల ఆకులుగాని లేక ఏదేని పరిశుద్ధ పదార్థంగాని బావిలో పడిపోతే ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే ఆ పదార్థాలు పడిన తరువాత నీరు, నీరుగా ఉండక అది వాడుక భాషలో 'నీరు' అనబడకపోతే ఆ నీటితో వుజూ, తహారత్ చేయడం సరిగాదు. ఉదాహరణకు బావిలో ఆకులు పడి ఆ నీరు ఏమాత్రం చిక్కబడిన ద్రవంగా మారినప్పుడు లేక రంగు, వాసనల్లో ఏదేని మార్పు కలిగినప్పుడు ఆ నీటితో వుజూ, తహారత్ చేయకూడదు. ఇదే విధంగా బావిలోను, ఇంటిలోని నీటిలోను, చక్కెరపడి ఆ నీరు షర్బతులా మారినా దానితో వుజూ చేయరాదు. ఏదో కొంచెం చక్కెర మాత్రం పడ్తే ఫరవాలేదు.

2) రక్తంలేని ప్రాణులు లేదా నీట వుండే జలచరాల్లాంటివి బావిలోపడినా, అవి అందులోనే చనిపోయినా ఆ నీరు అపరిశుద్ధం కాదు. కప్ప, చేప, తాబేలు, పాము, దోమ, ఈగ, చిన్నబల్లి వగైరా ఈ కోవకు చెందుతాయి.

3) పంది తప్ప ఇతర క్రూరమృగాలకు సంబంధించిన లేక చనిపోయిన హరాం జంతువుల వెంట్రుకలు, ఎముకలు లేక గోళ్ళు వగైరాలు బావిలో పడ్తే ఆ నీరు అపరిశుద్ధం కాదు.

4) ఆవు, ఎద్దు, మేక, కోడి వగైరా జంతువుల ఎంగిలి అపరిశుద్ధం కాదు. అలాంటి జంతువులు నీటబడి ప్రాణాలతో బయటకు వస్తే ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే వాటి శరీరంపై ఇతర అశుద్ధ పదార్థం అంటుకొని ఉండరాదు.

5) బావిలోను, ఇంటవాడే నీటిలోను పిచ్చుక లేక పావురపు రెట్టబడినా ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే కోడి, బాతులాంటి పక్షుల రెట్టబడితే మాత్రం ఆ నీరు అశుద్ధమే అవుతుంది.

6) మనిషి శరీరంపైగాని, అతని బట్టలపైగాని ఎలాంటి అశుద్ధం అంటిలేని పక్షంలో అతడు బావిలో పడినా లేక స్వయంగా అందు దిగినా ఆ నీరు అపరిశుద్ధం కాదు– అతడు ముస్లిమయినా, ముస్లిమేతరుడయినా సరే. బావిలో దిగేటప్పుడు దిగేవాడు స్నానం చేసి దిగితే మరీ మంచిది.

7) వ్యవసాయదారుల పాత్రలకు ఏదో కొంత పేడ అవీ అంటడం సహజం. అలాంటి పాత్రల్ని బావిలో వేయడంవల్ల ఆ నీరు అపరిశుద్ధం కాదు. ఊళ్ళో ఉండే బావుల నీటిని పేడ, లద్దెల నుండి కాపాడడం కష్టమే అవుతుంది. ఇలాంటి బావుల్లో ఏ కొద్ది పరిమాణంలో పేడ, లద్దె, మేక పెంటికలు పడిపోయినా ఆ నీరు అపరిశుద్ధం కాదు. అయితే అవే అధికంగాపడినట్లయితే ఆ నీరు అపరిశుద్ధమవుతుంది. కావాలని అలా చేయడం భావ్యం కాదు.

## ముస్లిమేతరులు, పసిపిల్లలకు సంబంధించిన ఆదేశాలు

ముస్లిమేతర సోదరులకు ఇస్లామియ పారిశుధ్యపు నియమాలు తెలియవుగనక, వారయినా, పసిపిల్ల వాడయినా చేతులు కొద్దిపాటి నీటిలో ముంచితే ఆ చేతులకు అశుద్ధత అంటివున్న పక్షంలో ఆ నీరు అపరిశుద్ధమవుతుంది. వుజూకోసం ఆ నీరు పనికిరాదు. అశుద్ధం అంటిలేకపోయినా వారి పారిశుధ్యం గురించి గ్యారంటీలేదు గనుక కొందరు ధర్మవేత్తలు పిల్లలు చేతిముంచిన నీటిని మక్రూహె తన్జీహిగా పరిగణిస్తారు.

ముస్లిమేతర సోదరులు ఇస్లాంలో హరామ్ అయిన పంది, కుక్కలాంటి జంతువుల విషయంలో జాగ్రత్తగా మసలుకోరుగనక వారి పాత్రలు శుభ్రంగా కడక్కుండా ఉపయోగించకూడదు. అయితే కేవలం అనుమానంపై వాటిని అపరిశుద్ధం అనుకోవడం మాత్రం భావ్యం కాదు.

## పారిశుద్ధ్యానికి సంబంధించిన మరికొన్ని సమస్యలు

1. స్పిరిట్ మరియు టింక్చర్ సారాయి కోవకు చెందినవే. అనవసరంగా వాటిని శరీరంపై పులమడం తగదు. శరీరంపై అంటినా కడిగివేయడం వాజిబ్ (అత్యవసరం). కాని చికిత్సార్థం వీటిని ఉపయోగించవచ్చు. అయితే రంగు, రంగు బట్టలు, సిరా, సబ్బులాంటివి స్పిరిట్ వేసి తయారు చేయబడినా వాటిలో స్పిరిట్ రూపం మారిపోతుంది గనుక అవి అశుద్ధాలు కావు. అవసరాలు అశుద్ధ పదార్థాలను 'ముబాహ్' (కేవలం

అవసరానికి అనుమతించబడినవిగా) చేస్తాయి. 'ఆల్కహోల్'తో తయారయిన ఔషధాలు కూడా ఇలాంటివే.

2. బావిని శుద్ధి చేయాలంటే సాధారణంగా చేదనే (బొక్కెన) వాడ్తాం. కాని మోటారు, పంపు సహాయంతో తోడే బావి అయితే దాన్ని శుభ్రపరచడానికి ధర్మవేత్తలు సూచించిన పరిమాణంలో నీరు తోడివేస్తే బావి పరిశుద్ధమవుతుంది.

## నీటి టాంకు శుభ్రత

సాధారణంగా వాటర్ టాంకులోకి నీరు పైపంపు సహాయంతో చేరవేస్తారు. క్రింది పంపు సహాయంతో నల్లాలు (ఊబిచీరీ)లోనికి పోతుంది. ఇలాంటి టాంకు పారే నీటి కోవకు చెందిందే. దీనిలో ఎలాంటి అపరిశుద్ధ పదార్థంగాని, జంతువుగాని పడినా టాంకు నీరు అపరిశుద్ధం కాదు (ఫతావా హిందియా).

కాని టాంకు రెండు వైపుల నుండి లేక ఒక వైపు నుండే మూయబడిందయితే అపరిశుద్ధం కాగలదు. అలాంటి టాంకులోని నీరంతా పైపుద్వారా తోడి వేస్తేగాని పరిశుద్ధం కాదు. ఎలుక, పిల్లి, మేక పెంటికల్లాంటి ప్రత్యేక ఆకారంగల అశుద్ధ పదార్థాల్ని ముందు తీసివేసిన తరువాతే శుభ్రపర్చాలనే విషయం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. హేండ్ పైప్, నల్లా (ఊబిచీ) విషయంలో ఇదే ఆజ్ఞ వర్తిస్తుంది.

## ఇస్తింజా

మల మూత్ర విసర్జనానంతరం శుద్ధి పొందడానికి గైకొనే చర్యల్నే షరీఅత్ పరిభాషలో 'ఇస్తెంజా' అంటారు. ఇస్తెంజా చేసే మంచి పద్ధతి ఏమంటే, మర్మాంగాల్ని మొదట మట్టి పెడ్డల్తో శుభ్రపరిచి ఆ తరువాత నీటితో కడగాలి. మలంగాని, మూత్రంగాని మలమూత్ర ద్వారాలను దాటి ప్రక్కలకు అంటకుండా ఉంటే కేవలం మట్టిపెడ్డ వగైరాలతో ఇస్తెంజా చేస్తేనే సరిపోతుంది. కాని సాధ్యమయినంతవరకు అలా చేయరాదు. ఒకవేళ మలంగాని, మూత్రంగాని ప్రక్కలకు షుమారు రూపాయి నాణెం అంత పరిమాణంలో అంటినట్లయితే తప్పనిసరిగా నీటితో కడుగవలసి ఉంటుంది.

## ఇస్తింజా గురించి పాటించవలసిన విషయాలు

ఇవన్నీ హదీసుల్లో ఉన్నాయి.

1) రాత్రి లేక పగలు నిద్రపోయి లేచిన తరువాత ఇస్తెంజాగాని వుజూ లేక 'గుసుల్' గాని చేయవలసివస్తే మొదట రెండు చేతుల్ని శుభ్రంగా కడుక్కోవాలి. ఆ తరువాతే చేతులు నీట ముంచి వుజూ లేక ఇస్తెంజా చేయాలి.

2) మల మూత్ర విసర్జన చేసేటప్పుడు 'ఖిబ్లా' దిక్కుగా ముఖంగాని వీపుగాని చేసి కూర్చోవడం తగదు. పిల్లల్ని మల మూత్ర విసర్జన చేయించేటప్పుడు కూడా ఈ నియమాన్ని పాటించాలి. ప్రవక్త మహనీయులు వారించారు. సూర్యాభిముఖంగా కూర్చుని మూత్ర విసర్జన చేయడం వారించబడింది. వైద్య, ఆరోగ్య నియమాల రీత్యా కూడా ఇలా చేయడం అపాయకరమే.

3) ఎముక, పేడ, బొగ్గు, కాలిన ఇటుక, వస్త్రం లేక తినే ఏ పదార్థాన్ని ఇస్తెంజాకై వాడకూడదు. అలా చేయడం మక్రూహ్.

## కాగితంతో ఇస్తెంజా

కాగితంతో ఇస్తెంజా చేయడం కూడా మక్రూహ్‌యే. దీనికి కారణం కాగితం నునుపుగా ఉండడం, అది విలువయింది కావడం, చదవడానికి వ్రాయడానికి పనికివస్తుంది కాబట్టి దాన్ని గౌరవించడం. మనిషి తన శరీరంతోను, వస్త్రంతోను మల మూత్రాలను శుభ్రం చేసుకోనట్లే కాగితంతోను ఇస్తెంజా చేయకూడదు. అయితే ఏ కాగితమయిన ప్రత్యేకంగా ఈ పనికే తయారు చేయబడితే (ఉదాహరణకు విమానాల్లో మలమూత్రాల నుండి పరిశుద్ధత పొందడానికి ఇది తప్ప వేరే మార్గం ఉండదు) అలా చేయడంలో తప్పులేదు.

4) పరిశుద్ధమయిన మట్టి, రాళ్ళు, గులకరాళ్ళు, పచ్చి ఇటుక ముక్కలు నీట తడిసి ఉండకపోతే వాటితో ఇస్తెంజా చేయవచ్చు.

5) కుడి చేత్తో ఇస్తెంజా చేయరాదు.

6) ఎవరికయినా మూత్ర విసర్జనానంతరం మూత్రపు బొట్లు పడే వ్యాధి ఉన్నట్లయితే అలాంటి వ్యక్తి మొదట మట్టి పెడ్డల్తో ఇస్తెంజా చేసుకోవాలి. ఆ తరువాత నీటితో కడుక్కోవాలి. పది, ఇరవయి అడుగులు అటు ఇటు పచార్లు చేస్తూ ఆ మూత్రపు బొట్లను పెడ్డతో అద్దాలి. అయితే ఇలాంటివారు స్త్రీలు, పిల్లలు ఉన్నచోట్ల, బజారు లేక ప్లాట్‌ఫారంలాంటి జనసమ్మర్థంగల ప్రదేశాల్లో అలా పచార్లు చేయడం తగదు. కుడి చేత్తో కడుక్కోవడం తగదనే విషయమూ జ్ఞప్తియందుంచుకోవాలి. ఇస్తెంజా కోసం వాడే మట్టి పెడ్డలు బేసి సంఖ్యలో ఉండాలి. 1, 3, 5 మూత్రపు బొట్ల ప్రమాదం ఏర్పడి సమయానికి మట్టి పెడ్డలు లభించకపోతే తొడిగివున్న వస్త్రం మార్చి ఇస్తెంజా చేయాలి. లేక ఇస్తెంజా తరువాత మరో బట్ట వగైరాలతో మూత్ర ప్రదేశాన్ని పొడి అయ్యేవరకు అద్దాలి.

7) నిలబడి మల మూత్ర విసర్జన చేయడం నిషిద్ధం. అనివార్య పరిస్థితుల్లో తప్ప.

8) మల మూత్ర విసర్జనల సమయంలో మాట్లాడడం కూడా వారించబడింది. అయితే అవసరానుసారం మాట్లాడడంలో తప్పులేదు. ఉదాహరణకు ఎవరో పిలిచినప్పుడు మీరు మరుగుదొడ్డిలో ఉన్నారు జవాబిచ్చేవారు ఇంకెవరూ లేరు, అలాంటప్పుడు మీరు జవాబివ్వవచ్చు.

9) నలుగురు నడిచే దారిలో కూడా మల మూత్ర విసర్జన నిషిద్ధం. ఎవరయినా ఆరు బయట మైదానాల్లో ఈ అవసరాలకు వెళ్ళవలసివస్తే మనుషుల దృష్టి పడనంత దూరం వెళ్ళాలి.

10) కన్నాల్లో లేక గట్టి ప్రదేశంపై మూత్ర విసర్జన చేయకూడదు. కన్నాల్లో ఎదయినా అపాయకరమయిన కీటకం ఉండవచ్చు. అది బయటికి వచ్చి కాటు వేయవచ్చు. లేక వాటికే బాధ కలుగవచ్చు. గట్టి నేలపై మూత్ర విసర్జన చేయడంవల్ల శరీరంపై, దుస్తులపై మూత్ర తుంపర్లు పడే ఆస్కారముంది. బాత్ రూంలోను, నీటిలోను మూత్ర విసర్జన కూడదని హదీసులు వారిస్తున్నాయి.

11) చేతి ఉంగరంపై అల్లాహ్ పేరు లేక కలిమా వ్రాసి ఉంటే మలమూత్ర విసర్జనలకు పూర్వమే వాటిని తీసివేయాలి.

12) మల మూత్ర విసర్జనలప్పుడు తుమ్ము వస్తే 'అల్ హమ్దులిల్లాహ్' అని పైకి అనకుండా మనస్సులోనే అనుకోవాలి.

13) మల మూత్ర విసర్జనల సమయంలో తలపై టోపిగాని, మరేదయినా వస్త్రంగాని ఉండాలి.

14) మల మూత్ర విసర్జనలకు పోయినప్పుడు, అది మైదానమయితే కూర్చునేముందు, మరుగుదొడ్డి అయితే లోపల అడుగుపెట్టేటప్పుడు ఈ దుఆ పఠించాలి.

**"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ ఖుబుసి వల్ ఖబాయిస్." (మిష్కాత్)**

اَللّٰهُمَّ اِنِّیْٓ اَعُوْذُبِكَ مِنَ الْخُبُثِ وَالْخَبَآئِثِ - (مشکوٰۃ)

(ఓ అల్లాహ్! నేను అపవిత్రత మరియు అపవిత్రులయిన షైతానుల నుండి నీ శరణు కోరుతున్నాను.)

విసర్జనానంతరం బయటికి వచ్చిన తరువాత ఈ దుఆ పఠించాలి.

**"గుఫ్రానక అల్‌హమ్దులిల్లాహిల్లజీ అజ్‌హబ అన్నిల్ అజా వఆఫాని." (మిష్కాత్)**

غُفْرَانَكَ اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْٓ اَذْهَبَ عَنِّی الْاَذٰی وَعَافَانِیْ

(అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఎవరయితే నా నుండి కష్టాన్ని దూరం చేసి సుఖాన్నిచ్చాడో.)

ఈ దుఆ జ్ఞాపకం లేకపోతే కేవలం "గుఫ్రానక్" (ఓ అల్లాహ్ నీ మన్నింపు కోరుతున్నాను)అనాలి. అంటే నీవేవిధంగానయితే మల బాధ నుండి నన్ను రక్షించావో అలానే నన్ను నరకాగ్ని బాధల నుండి కూడా కాపాడు అని అర్థం.

పై నియమాలన్నీ ఖుద్దుగా మహా ప్రవక్త (సఅసం) ఆచరించడమే కాక ప్రతి ముస్లిం వీటిని ఆచరించాలని ఆజ్ఞాపించారు.

ఈ సందర్భంలో ఓ హదీసును జ్ఞాపకముంచుకోవడం మంచిది. ఓసారి ఓ ముస్లిమేతరుడు పరిహాసమాడే ధోరణిలో, హజ్రత్ సల్మాన్ ఫార్సి (ర.అన్)తో ఇలా అన్నాడు. "మీ ప్రవక్త మీకు చేసే బోధనల్లో మల మూత్ర విసర్జనం పద్ధతులు కూడా ఉన్నాయి!" అని అన్నాడు. ఆ పరిహాసానికి హజ్రత్ సల్మాన్ (ర.అన్) శాంతంగా ఇలా జవాబిచ్చారు. "అవును, సందేహం లేదు. ఆయన మాకు ప్రతి చిన్న విషయాన్ని కూడా బోధిస్తారు" అంటే మహా ప్రవక్త (సఅసం) బోధనల్లో జీవితానికి సంబంధించిన ఏ చిన్న సమస్య కూడా మిగలలేదని అర్థం.

## నిలబడి ఇస్తింజా

నిలబడి మూత్ర విసర్జన చేయడాన్ని వారించారు మహా ప్రవక్త (సఅసం). కాని ప్రయాణాలు చేసే వారికి అప్పుడప్పుడు రైల్లోని ఫస్ట్‌క్లాస్ బోగీల్లో, స్టేషన్‌లలో, విమానాశ్ర యాల్లో ఇంకా ఇతర చోట్లల్లో నిలబడి మూత్ర విసర్జన చేయడానికే వీలు కలిగిన మూత్రశాలలు, టాయిలెట్‌లు లభిస్తాయి. కుర్చీపై కూర్చున్నట్లు కూర్చునే మలమూత్ర విసర్జనలు చేయవలసి వస్తుంది కొన్నిచోట్ల. అలాంటి పరిస్థితులు తారసపడినప్పుడు గత్యంతరం లేక అశుద్ధం, మూత్రపు తుంపర్లు శరీరంపై, దుస్తులపై పడకుండా నిలబడే మూత్రవిసర్జన చేయడం, లేదా కమోడ్‌లపై కూర్చుని మల విసర్జన చేయడం తప్పు కాదు.

అశుద్ధతను దూరం చెయ్యడానికి, పరిశుద్ధతను పొందటానికి ఏ నియమాలయితే పైన తెలుపడం జరిగిందో వాటి ప్రకారం మనిషి తన శరీరం, తన వస్త్రాలను శుభ్రం చేసుకున్నా అతను నమాజ్ చెయ్యలేడు. ఆపైన అతడు వుజూ, గుసుల్ లేక తయమ్ముమ్ లాంటివి చెయ్యవలసి ఉంటుంది. వాటికి సంబంధించిన ఆజ్ఞలు ఆదేశాలు ఇక్కడ చెప్పబడుతున్నాయి.

## ఫికహ్‌కు సంబంధించిన కొన్ని పారిభాషిక పదాలు

అయితే వుజూ, గుసుల్, తయమ్ముమ్ గురించి చెప్పే ముందు ఫికహ్‌కు సంబంధించిన కొన్ని పారిభాషిక పదాలు తెలుసుకోవడం ముఖ్యం. ఎందుకంటే ఆ పదాలు వచ్చినప్పుడు అవి తేలిగ్గా అర్థం అవుతాయి. ఖుర్ఆన్ మరియు హదీసులద్వారా లభించే

ఆదేశాలు నాలుగు రకాలు. అవి ఫర్జ్, వాజిబ్, సున్నత్ మరియు నఫిల్. వీటికి సంబంధించిన నిర్వచనాలు ఇలా ఉన్నాయి:

## ఫర్జ్

ఖుర్‌ఆన్, హదీసులు రెంటిద్వారా లేక కేవలం ఖుర్‌ఆన్ ద్వారా లేక అనేక హదీసుల ద్వారా రూఢీఅయి, అందులో ఎలాంటి అనుమానానికి తావులేకపోతే అలాంటి ఆదేశాన్ని 'ఫర్జ్' అంటారు. ఈ ఆదేశాన్ని (ఫర్జ్‌ను) కాదనేవాడు షరీఅత్‌లో 'కాఫిర్' (తిరస్కారి)గా పరిగణించబడతాడు. ఎలాంటి కారణం లేకుండా దాన్ని ఆచరించనివాడు 'ఫాసిఖ్' (అపరాధి)గా భావించబడతాడు. 'ఫర్జ్' రెండు రకాలు. 'ఫర్జె ఐన్', 'ఫర్జె కిఫాయ.'

## ఫర్జె ఐన్

'ఫర్జె ఐన్'ను ప్రతి వ్యక్తి విధిగా ఆచరించి తీరాలి.

## ఫర్జె కిఫాయ:

'ఫర్జె కిఫాయ'ను ప్రతి వ్యక్తి ఆచరించడం విధి అయినప్పటికీ, ఇలాంటి ఆదేశాన్ని సమాజంలోని కొందరు ఆచరించినా మిగిలిన జనసామాన్యంపైనుండి ఆ బాధ్యత తీరిపోతుంది.

## సున్నత్

మహాప్రవక్త (స) స్వయంగా ఆచరించింది లేక ఆచరించమని ఆదేశించిన క్రియ సున్నత్ అనబడుతుంది. ఇది కూడా రెండు రకాలు. (1) సున్నతె ముఅక్కిద (2) సున్నతె గైర్ ముఅక్కిద.

## సున్నతె ముఅక్కిద

సున్నతె ముఅక్కిద అనేది మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) నిత్యం చేసిన ఆచరణ. సరిఅయిన కారణం లేకుండా ఆయన దాన్ని ఎన్నడూ వదలలేదు. సున్నతె ముఅక్కిదను ఎలాంటి కారణం (ఉజ్ర్) లేకుండా వదిలివేయడం పాపం, గర్హించదగిన విషయం.

## సున్నతె గైర్ ముఅక్కిద

మహా ప్రవక్త (సఅసం) కొన్ని పనుల్ని అప్పుడప్పుడు ఆచరిస్తూ, ఎలాంటి కారణం లేకుండానే అప్పుడప్పుడు వదిలేస్తూనూ ఉండేవారు. అలాంటి కార్యాన్ని సున్నతె గైర్

ముఅక్కిద అని అంటారు. ఇలాంటి కార్యాన్ని ఆచరించేవారు పుణ్యఫలానికి అర్హులు. ఆచరించకుండా వదిలేసేవారికి ఎలాంటి పాపమూ లేదు. సున్నత్‌లో కూడా మరి రెండు రకాలున్నాయి. అవి సున్నతె ఐన్ మరియు సున్నతె కిఫాయ. 'సున్నతె ఐన్"ని ప్రతి ముస్లిం ఆచరించవలసిందే. ఉదాహరణకు వుజూలో కడిగే ప్రతి అవయవాన్ని మూడుసార్లు కడగడం సున్నతె ఐన్. సున్నతె కిఫాయను ప్రజలందరి తరఫున కొందరాచరిస్తే సరి పోతుంది. ఉదాహరణకు ఏతికాఫ్, జనాజా నమాజ్ లాంటివి.

## ముస్తహబ్

మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) అప్పుడప్పుడు ఆచరించిన క్రియ. దీన్ని ఆచరించడం పుణ్యప్రదం. ఆచరించకపోతే పాపం కాదు. దీన్నె నఫిల్ మన్దూబ్ అని, తతవ్వ అని మరియు సుననె జవాయిద్ అని కూడా అంటారు. ముస్తహబ్ కంటే సున్నతె గైర్ ముఅక్కిదలో పుణ్యఫలం అధికం.

## వాజిబ్

ఇది సున్నతె ముఅక్కిద కంటే ముఖ్యమయినది, ఫర్జ్‌కు దరిదాపుల్లో ఉండేది. వాజిబ్‌ను వదిలేయడం సున్నతె ముఅక్కిదను వదిలేయడం కంటే తీవ్రమైన పాపం. అయితే దీన్ని కాదనేవారిని మాత్రం కాఫిర్ అనరు.

## వుజూ

**వుజూ అర్థం:**

వుజూ అనే పదానికి కాంతివంతమయిన ముఖం కలవాడని నిఘంటువు అర్థం. కాని షరీఅత్‌లో, శరీరంలోని కొన్ని ప్రత్యేక భాగాల్ని ఓ పద్ధతి ప్రకారం కడగడాన్ని వుజూ అని అంటారు.

**దివ్య ఖుర్ఆన్ మరియు హదీసుల్లో వుజూ ఆదేశం**

దివ్య ఖుర్ఆన్‌లో వుజూకు సంబంధించిన ఆదేశం ఇలా ఉంది:

"విశ్వసించిన ఓ ప్రజలారా! మీరు నమాజ్ కొరకు లేచినప్పుడు, మీ ముఖాలను, మోచేతుల వరకు రెండు చేతుల్ని కడుక్కోండి; తలపై చేతులతో స్పర్శించండి, రెండు కాళ్ళను చీలమండలం వరకు కడుక్కోండి."

يَا أَيُّهَا الَّذِينَ
آمَنُوا إِذَا قُمْتُمْ إِلَى الصَّلَاةِ فَاغْسِلُوا
وُجُوهَكُمْ وَأَيْدِيَكُمْ إِلَى الْمَرَافِقِ
وَامْسَحُوا بِرُءُوسِكُمْ وَأَرْجُلَكُمْ
إِلَى الْكَعْبَيْنِ

వుజూ చేయడంవల్ల చిన్న చిన్న పాపాలు సమసిపోతాయని హదీసుల్లో ఉంది. మహా ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. "ఏ వ్యక్తి అయితే సరయిన నియమనిష్ఠలతో వుజూ చేస్తాడో అతని శరీరపు చిన్న చిన్న పాపాలన్నీ ప్రక్షాళనమవుతాయి." అంటే ఉదాహరణకు చెవులతో చెడు మాట వినడం, కళ్ళతో నిషిద్ధమైనదాన్ని చూడటం, నోటితో దుర్భాషలాడటం, చేతుల్తో బాధించడం- ఇలాంటి చిన్న చిన్న అపరాధాలు మన్నించబడ తాయని అర్థం. (అయితే చిన్న చిన్న పాపాలు మాటిమాటికి చేస్తూ ఉంటే అవే పెద్ద పాపాలుగా పరిణమిస్తాయి. అవి కేవలం వుజూ ద్వారా మన్నించబడవు.) ఆయన ఇంకా ఇలా ప్రవచించారు. "అంతిమ దినంనాడు నా అనుచర సమాజానికి ఓ ప్రత్యేక గుర్తింపు ఉంటుంది. వారు అయిదు పూటలా వుజూ చేయడంవల్ల వుజూలో కడగబడిన శరీర భాగాలు వెలుగుతో నిగనిగలాడుతూ ఉంటాయి. కాళ్ళు, చేతుల ఈ వెలుగు కారణంగానే వారిని నేనానాడు గుర్తించగలుగుతాను."

మహా ప్రవక్త (సఅసం) తన అనుచరులతో "మీ పాపాలను పటాపంచలు చేసే మార్గం ఏమిటో చెప్పనా మీకూ?" అని అడగ్గా.

"తప్పకుండా దైవ ప్రవక్తా (సఅసం)! చెప్పండి" అని అడిగారు సహాబా(ర.అన్.).

"ఇబ్బందిఉన్నా బాధఉన్నా సక్రమంగా వుజూ చేయడం, అధికంగా మస్జిద్‌కి పోవడం, మరియు నమాజ్‌కోసం ఎదురుచూడడం" బదులిచ్చారు దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం). (బుఖారి, ముస్లిం, అబూదావూద్, తిర్మిజీ)

'ఇబ్బంది', 'బాధ' అనే పదాలకు, చలికాలమైనా, నీరు చల్లగాఉన్నా, లేక నీరు ఇంట్లో లభ్యం కానప్పుడు బావి నుండి తోడవలసిఉన్నా అని అర్థం. వీటన్నింటిని లెక్క చేయక వుజూ చెయ్యడంలో అజాగ్రత్త చూపరాదు. సక్రమమయిన రీతిలో నియమాను సారం చెయ్యాలి. నీరు చల్లగా ఉందనిగాని, నీరు లభించడంలేదనిగాని జమాఅత్‌ను వదిలేయరాదు, ఆలస్యమూ చెయ్యరాదు.

## వుజూ ఎలా చేయాలి?

మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) వుజూ కోసం ఆదేశమివ్వడమే కాదు, స్వయంగా వుజూచేసి చూపెట్టారు కూడా. ఆయన చూపెట్టిన వుజూ విధానం ఇక్కడ వ్రాయబడుతోంది:

వుజూ చేయదలిస్తే మొదట వుజూ చేసే "నియ్యత్"- సంకల్పం చేసుకోవాలి. 'బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీం' పఠించి రెండు చేతుల్ని మణికట్లవరకు మూడు సార్లు కడుక్కోవాలి. తదుపరి మూడుసార్లు నోటినిండా నీటిని తీసుకొని పుక్కిలించాలి. పుక్కిలించే

టప్పుడు 'మిస్వాక్' చేయాలి. 'మిస్వాక్ అంటే పండ్ల పుల్ల, మిస్వాక్ లేకపోతే వ్రేలితోనయినా పండ్లను తోముకోవాలి. గొంతువరకు పరిశుభ్రమయ్యే గర్గరా (స్త్రబిజీవీజిరిదీవీ) చేయాలి. (రోజా (ఉపవాసవ్రతం) పాటించేటప్పుడు గర్గరా చెయ్యనవసరం లేదు). హదీసుల్లో మిస్వాక్ ప్రయోజనాలెన్నో చెప్పబడ్డాయి. పుక్కిలించడం అయ్యాక మూడుసార్లు ముక్కులో నీరు ఎక్కించి ఎడమ చేత్తో శుభ్రంగా చీదివేయాలి. ఆ తరువాత మూడుసార్లు ముఖం కడగాలి. ముఖం కడగడం అంటే నొసటి పైభాగం మొదలుకుని గడ్డం క్రింది వరకు, ఒక చెవిలోలకు నుండి మరో చెవిలోలకు వరకుగల ముఖ భాగాన్నంతా కడగడం అని అర్థం. గుబురు గడ్డంగలవాళ్ళయితే తడి వ్రేళ్ళతో గడ్డపు వెంట్రుకల పాదులు తడిచేటట్లు ఖిలాల్ చేయాలి (దువ్వాలి). ఆ తరువాత మొదట కుడి ఆ తరువాత ఎడమ చేతులు రెండూ మోచేతులతో సహా మూడేసిసార్లు శుభ్రంగా కడగాలి. వ్రేళ్ళకు ఉంగరంగాని, స్త్రీలకు గాజులుగాని ఉండే పక్షంలో వాటి క్రింద భాగం కూడా తడిసేటట్లు వాటిని కదపడంగాని, త్రిప్పడంగాని అవసరం. ఇదే విధంగా రెండు చేతుల వ్రేళ్ళను ఒకదానిలో ఒకటి వేసి ఖిలాల్ చేయాలి. తరువాత మొత్తం తలను తడిసిన అరిచేతులతోను, చెవుల వెలుపల, లోపల తడి వేళ్ళతో ఒకసారి స్పర్శించాలి అంటే 'మసహ్' చేయాలి. చివరన రెండు కాళ్ళను చీల మండళ్ళవరకు – మొదట కుడికాలు తరువాత ఎడమకాలును మూడేసిసార్లు కడగాలి. కాళ్ళు కడిగేటప్పుడు కాలి వ్రేళ్ళ మధ్య ఎడం చేతి చిటికెన వ్రేలుతో, నీరు చేరేటట్లు ఖిలాల్ చేయాలి. వుజూ చేసేటప్పుడు గమనించవలసిన విషయం ఏమిటంటే ఒక్కో అవయవం కడిగేలోపున మరో అంగం తడారిపోకుండా, ఆలస్యం చేయకుండా జాగ్రత్తపడాలి. వుజూ పూర్తి అయిన పిదప ఈ దుఆ పఠించాలి.

"అష్హదు అన్ లా ఇలాహ ఇల్లల్లాహు, వహ్దహూ లాషరీక లహూ వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్. అల్లాహుమ్మజ్ అల్నీ మినత్తవ్వాబీన వజ్ అల్నీ మినల్ ముతతహ్హిరీన్."

اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ اَللّٰهُمَّ اجْعَلْنِيْ مِنَ التَّوَّابِيْنَ وَاجْعَلْنِيْ مِنَ الْمُتَطَهِّرِيْنَ ؕ

వుజూ చేసే సంపూర్ణ విధానం ఇదే. హదీసుల్లో సక్రమంగా వుజూ చేయాలని వచ్చే ఆదేశాలకు భావం, పైన చూపిన ప్రకారం వుజూ చెయ్యాలన్నదే.

**సూచన :** వుజూలో ఏదయినా ఒక భాగం మూడుసార్లకంటే తక్కువగా కడిగితే పుణ్యఫలం తగ్గుతుంది. అదే మూడుసార్లకంటే ఎక్కువగా కడిగిన పక్షంలో పాపం కలిగే ప్రమాదముంది. ఇబ్నెమాజా మరియు అబూ దావూద్ హదీసుల్లో మహా ప్రవక్త

ముహమ్మద్ (సఅసం) మూడుసార్లు వుజూ చేసి చూపెట్టి ఇలా ప్రవచించారు. "ఇంకా దీనికంటే ఎక్కువగా కడిగినట్లయితే అది మంచిదికాదు. అలా చేసినవాడు తనపై అతిగా ప్రవర్తించినట్లవుతుంది."

**గమనిక:** పైన చెప్పిన వుజూ విధానంలోని కొన్ని విషయాలను ఆచరించకపోతే అసలు వుజూయే నెరవేరదు. వీటిని 'ఫరాయిజె వూజూ' (వుజూ విధులు) అంటారు. ఇంకా కొన్నింటిని ఆచరిస్తే పుణ్యం ప్రాప్తమవుతుంది. వాటిని వదిలేస్తే వుజూ అయితే నెరవేరుతుంది. కాని అలా కావాలని వదిలేయడం భావ్యం కాదు. వాటిని మాటిమాటికీ వదిలేస్తే పాపం కలుగుతుంది. వీటిని 'వుజూ సున్నత్‌లు' అంటారు. ఇంకా కొన్నింటిని చేయడంవల్ల పుణ్యం (సవాబ్) లభిస్తుంది. చేయకపోతే ఎలాంటి పాపం ఉండదు. వీటిని ఆచరించడమే మేలు. ఇలాంటి వాటిని 'ముస్తహబాతె వుజూ' అని అంటారు. ఇదే విధంగా కొన్ని కారణాలవల్ల వుజూ భగ్నమవుతుంది. వీటిని 'నవాభిసె వుజూ' అని అంటారు. కొన్ని కారణాలవల్ల వుజూ 'మక్రూహ్' అవుతుంది. ఇవి 'మక్రూహాతె వుజూ' అనబడతాయి.

ఇప్పుడు వుజూ ఫర్జులు, దాన్ని సున్నత్‌లు మరియు వుజూను భగ్నం చేసే కారణాలు వేరువేరుగా చెప్పుకుందాము.

## వుజూలోని ఫర్జులు (ఫరాయెజె వుజూ)

వుజూలోని ఫర్జులు నాలుగు. (1) ముఖాన్నంతా ఓసారి కడగడం, (2) రెండు చేతుల్ని మోచేతుల్తో సహా ఓసారి కడగడం, (3) తలను తడి చేతుల్తో తుడవడం లేక మసహ్ చేయడం, (4) రెండు పాదాలను చీలమండతో సహా కడగడం. ఈ నాల్గింటిని దివ్య ఖుర్‌ఆన్ ఆయత్ ఆధారంగా నిర్ణయించడం జరిగింది.

**గమనిక:** ఈ నాల్గు అవయవాల్లో ఏ అవయవమయినా వెంట్రుక మందం పొడిగాఉన్నా వుజూ నెరవేరదు.

## వుజూలోని సున్నత్‌లు

వుజూలో 15 విషయాలు సున్నతె ముఅక్కిదాకు సంబంధించినవి. అవి: (1) వుజూ చేసే సంకల్పం (2) బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీం పఠించి వుజూ ప్రారంభించడం (3) రెండు చేతుల్ని మణికట్లతో సహా కడగడం (4) పుక్కిలించడం, (5) ముక్కులోనికి నీరు పోనిచ్చి శుభ్రం చేయడం, (6) మిస్వాక్ చేయడం (పుల్లతో లేక వ్రేలితో పల్లు తోమడం), (7) గడ్డాన్ని ఖిలాల్ చేయడం అంటే చేతివ్రేళ్ళతో దువ్వడం, (8) కాలు, చేతుల వ్రేళ్ళ మధ్య వ్రేళ్ళతో శుభ్రపరచడం లేక ఖిలాల్ చేయడం, (9) ప్రతి అవయవాన్ని మూడేసిసార్లు కడగడం, (10) తల మొత్తాన్ని తుడవడం లేక మసహ్ చేయడం, (11) పైన పేర్కొన్న

వుజూ క్రమంలోనే వుజూ చేయడం, (12) రెండు చెవుల మసహ్, (13) వెంట వెంటనే. అవయవాలను కడగడం అంటే ఓ అవయవం తడి ఆరక మునుపే మరో అవయవాన్ని కడగడం, (14) అవయవాలను కడగడంలో ముందు కుడి ఆ తరువాత ఎడమ అవయవాలను కడగడం, (15) ప్రతి అవయవాన్ని కడిగేటప్పుడు ఏ భాగమూ పొడిగా ఉండకుండా బాగా రుద్దడం.

## మిస్వాక్

వుజూ చేసేటప్పుడు 'మిస్వాక్' (దంతధావనం) చేయమని హదీసులో తాకీదు చేయబడింది. మహా ప్రవక్త (సఅసం) దీన్ని ఎల్లప్పుడూ నిర్వర్తించేవారు. మిస్వాక్ (పండ్ల పుల్ల) ఏ చెట్టుదయినా ఫరవాలేదు. ఉదాహరణకు తుమ్మ, కానుగు, వేప మొదలయినవి. ఇవి లభించని పక్షంలో వ్రేలితోనో గుడ్డతోనో పండ్లను రుద్దుకోవాలి. టూత్ పేస్ట్ మరియు బ్రష్‌తోను సున్నత్ నెరవేరుతుంది కాని వుజూలో దీన్ని అలవాటు చేసుకోవడం అంతమంచిది కాదు.

## వుజూ నియమాలు

ఈ క్రింది విధంగా వుజూ చేయడం ముస్తహిబ్ (అభిలషనీయం)

(1) శరీరంపైగాని లేక దుస్తులపైగాని నీటి తుంపర్లు పడకుండా ఎత్తయిన ప్రదేశంలో కూర్చుని వుజూ చేయడం (2) ఖిబ్లా వైపు తిరిగి కూచోని వుజూ చేయడం (3) సరయిన కారణం లేకుండా ఇతరుల సహాయంతో వుజూ చేయకుండా ఉండడం. ఒకవేళ ఎవరయినా స్వయంగా నీరు అందిస్తే, లేక బావి నుండి , నీటి టాంకుల నుండి నీరు ముంచి ఇస్తే ఫరవా లేదు. కాని ఎలాంటి కారణం లేకుండా ఇతరులు నీరు అందిస్తేనే వుజూ చేయాలని నిరీక్షించడం మక్రూహ్‌గా పరిగణించబడుతుంది. (4) ముక్కు లోనికి సరిగా నీరుపోసి ఎడమ చేత్తో శుభ్రపర్చి చీది వేయడం (5) వుజూ చేసేటప్పుడు ప్రాపంచిక విషయాలు మాట్లాడకుండా ఉండడం, మాట్లాడే అవసరమేవస్తే, లేక మంచి మాటలే అయితే తప్పులేదు. (6) కాలు, చేతివ్రేళ్ళకు ఏదయినా ఉంగరంగాని, ముక్కులో ఏదయినా బేసరులాంటిదిగాని, చెవుల్లో ఏదయినా ఆభరణంగాని ఉంటే వుజూ చేసేటప్పుడు వాటి క్రిందికి నీరు చేరేటట్లు వాటిని కదిలించాలి. ఉంగరం, గాజులు, బేసరులాంటివి బాగా బిగుతుగా ఉంటే వాటిని కదిలించడం వాజిబ్ అవుతుంది. (7) వుజూ పూర్తిఅయిన తరువాత పైన వ్రాయబడిన దుఆ పఠించాలి. (8) వుజూ చేసేటప్పుడు ఎవరికి సలాం చేయకూడదు. ఎవరయినా సలాం చేస్తే బదులు సలాం చేయడం మంచిదే.

వుజూ అయిన తరువాత ఎవరయినా రెండు రకాతుల నఫిల్ నమాజ్ చేస్తే అది ఎంతో పుణ్యప్రదమయిన కార్యం. మహా ప్రవక్త (సఅసం) ఈ నమాజు ఎంతో గొప్పదని బోధించారు. ఈ నమాజ్‌ను 'తహియ్యతల్ వుజూ' అంటారు. కాని నఫిల్ లేక ఫర్జ్ నమాజ్ చేయడం నిషిద్ధమయిన వేళల్లో ఎవరయినా వుజూచేస్తే ఈ నమాజ్ చేయకూడదు. ఉదాహరణకు అస్ర్ నమాజ్ చేసిన తరువాత, సూర్యోదయం, సూర్యాస్తమయ సమయాల్లో, సూర్యుడు నడినెత్తిన ఉన్నప్పుడు, లేక ఫజ్ర్ నమాజు అనంతరం సూర్యోదయం అయినంతవరకూ.

వుజూ చేసేటప్పుడు నీరు ఎక్కువగా వృధా చేయకూడదనే విషయాన్ని జ్ఞప్తి యందుంచుకోవాలి. ఏ అవయవాన్నయినా మూడుసార్లకంటే అధికంగా కడుగరాదు. కొందరు అనుమానంవలన అశ్రద్ధవలన అధికంగా నీరు వృధా చేస్తారు. ఇలా చేయడం పాపం.

## వుజూను భంగపర్చే విషయాలు (నవాఖిజె వుజూ)

### మొదటి రూపం

మనిషి శరీరం నుండి వెలువడే ఈ పదార్థాల మూలంగా వుజూ భంగమవుతుంది.

(1) మలమూత్ర విసర్జన, (2) అపానవాయువు వెలువడటం, (3) మలమూత్ర ద్వారాల నుండి ఇంకేదయినా పదార్థం, ఉదాహరణకు నులి పురుగు, సన్నటి రాళ్ళు, ఇవికాక ఇంకేదయినా వెలువడినట్లయితే వుజూ భంగమవుతుంది, (4) శరీరంలోని ఏ భాగంనుండయినా రక్తంగాని, చీముగాని కారడం, (5) తెమడ కాకుండా రక్తంగాని, చీముగాని, తిన్న పదార్థంగాని, నీరుగాని, నోటి నిండా వాంతి అయినా లేక కొంచెం కొంచెంగా అనేకమార్లు అయినా– వుజూ భంగమవుతుంది. (6) ఉమ్మిలో రక్తం అధికంగా ఉండడం, అప్పుడప్పుడు వుజూ చేసేటప్పుడు పళ్ళ చిగుళ్ళ నుండి రక్తం వస్తూ ఉంటుంది. ఆ రక్తం కొంచమే అయితే ఫరవాలేదు. కాని అది ఉమ్మిని ఎరుపుగా మార్చే అంత పరిమాణంలో వస్తే అది ఆగిపోనంతవరకు వుజూ చేయరాదు. (7) వీర్యం ప్రొస్టేట్ గ్రంథి స్రవం (రంగులేని జిగట ద్రవపదార్థం) మరియు బహిష్టు రక్తం వచ్చినా వుజూ భంగమవుతుంది. అది దుస్తులకు అంటినట్లయితే దుస్తుల్ని కడగడం అవసరం. దీనికి సంబంధించిన వివరాలు 'గుసుల్' అధ్యాయంలో చెప్పబడతాయి.

### వీర్యం, ప్రొస్టేట్ స్రవానికిగల తేడా

వీర్యం మరియు ప్రొస్టేట్ గ్రంథి ద్వారా స్రవించే ద్రవానికి భేదం ఉంది. వీర్యం

సంభోగం మరియు స్వప్నస్థలనం వలన వెలువడుతుంది. కాని ఈ ద్రవపదార్థం జననాంగ స్తంభన మూలంగా, ఉపరతి విలాసాలవల్ల లేక ఆ సంబంధమయిన తలంపులు వచ్చినప్పుడు మూత్ర ద్వారం గుండా వెలువడే ఆస్కారముంటుంది. అది జిగటగా నీరులాంటి రంగు లేని ద్రవం.

రేతస్సు లేక వీర్యం వెలువడడంవల్ల గుసుల్ స్నానం) చేసే అవసరం కలుగు తుంది. కాని ఈ ద్రవపదార్థంవల్ల కేవలం వుజూ చేయాలి. (8) స్త్రీ స్తనాల నుండి పాలు కారినా లేక వాటిలో నొప్పి కలిగి నీరులాంటి ద్రవం వచ్చినా వుజూ భంగమవుతుంది. (9) కండ్ల కలకవచ్చి, లేక కంటిలో బాధగా ఉండి కారే ద్రవంవల్ల వుజూ భంగమవు తుంది. కాని ఆ ద్రవమే ఎడతెగకుండా వస్తూవుంటే దాన్ని ఓ వ్యాధిగా పరిగణించాలి. దానివల్ల వుజూకు ఏ అవాంతరం వాటిల్లదు. అంతిమ దినం, ప్రళయం ప్రస్తావన వచ్చినా లేక ఏదేని ధార్మిక విషయం వినడంవల్ల లేక మరే బాధవల్ల కన్నీరు కారినా వుజూ భంగమవదు.

## రెండో రూపం

కొన్ని అవస్థలను మనిషి తనపై కల్పించుకుంటాడు మరికొన్ని అవస్థలు మనిషిని ఆవహిస్తాయి. వాటివల్ల కూడా వుజూ భంగమవుతుంది. అవి ఇవి:

(1) పడుకొని లేక ఆనుకొని నిద్రించడం, (2) అపస్మారక స్థితిలో పడిపోవడం అంటే ఏదైనా వ్యాధి మూలంగా గాయం, బాధ కారణంగా మనిషి అపస్మారక స్థితిలోనికిపోతే అతని వుజూ భంగమవుతుంది. (3) మత్తు పదార్థం తినడంలేక త్రాగడంవల్ల మత్తు కలగడం (4) రుకూ మరియు సజ్దాలుండే నమాజుల్లో బిగ్గరగా నవ్వడం, జనాజా నమాజులో బిగ్గరగా నవ్వడంవలన వుజూ భంగమవదు, (5)స్త్రీ పురుష మర్మాంగాలు ఒకదానితో ఒకటి కలసి వీర్యస్థలనం కాకపోవడం.

## మక్రూహాతె వుజూ

ఈ క్రింద వ్రాయబడినవి వుజూలోని 'మక్రూహ్' (అవాంఛనీయమయిన) విషయాలు. అంటే వీటివల్ల వుజూ భంగమవదుగాని అలా చేయడంవల్ల పాపమన్నా కలుగుతుంది, పుణ్యఫలమన్నా తగ్గుతుంది.

(1) వుజూ చేయవలసిన క్రమంలో వుజూ చేయకపోవడం (2) అపరిశుద్ధ స్థలంలో కూర్చుని వుజూ చేయడం (3) నీటిని అవసరానికి మించి వృధా చేయడం (4) వుజూ చేసేటప్పుడు ప్రాపంచిక విషయాలు మాట్లాడడం. ప్రత్యేక అవసరం కలిగి

ఒకటి అరా మాటలు పలకడంలో తప్పులేదు. (5) ముఖంపైనా, ఇతర అవయవాలపైనా నీరు గట్టిగా కొట్టడం, లేక ముఖం కడిగేటప్పుడు గాలి ఊదుట 'ఫర ఫర' శబ్దం చేయడం. (6) మూడేసిసార్లకంటే అధికంగా అవయవాలను కడగడం. (7) ఒక్కో అవయవాన్ని కడుగుతూ దాన్ని తుడవడం. ఏదయినా సరిఅయిన కారణం ఉండి లేక వ్యాధివల్ల అలా చేయడంలో తప్పులేదు. కాని అనవసరంగా అలా చేయడం తప్పు. (8) కుడి చేత్తో ముక్కును చీదడం లేక మొదట ఎడమ ఆ తరువాత కుడి చేతినిగాని, పాదాన్నిగాని కడగడం. (9) నమాజులో చిరునవ్వు నవ్వడం, బిగ్గరగా నవ్వడం మరియు చిరునవ్వులో తేడా ఉంది. నమాజులో బిగ్గరగా నవ్వితే వుజూకు భంగమవుతుంది.

## వేటివల్ల వుజూ భంగం కాదు

కొన్ని విషయాలవల్ల వుజూ భంగమవదు. వీటివల్ల వుజూ భంగమవుతుందని ప్రజల్లో అపోహవుంది.

(1) కూర్చుని కునుకుపాట్లు పడితే వుజూకు భంగమవదు. (2) నమాజు చేసేటప్పుడు సజ్దాలో కునుకువచ్చినా వుజూకు భంగమవదు. కాని ఆ కునుకే కొంత ఎక్కువగా వచ్చి దానివల్ల అవయవాలు పూర్తిగా అదుపుతప్పి వదులై ఒకదానిలో ఒకటి కలిసిపోతే ఉదాహరణకు సజ్దాలో మోచేయి తొడలతో కలిసి పోయినా లేక తొడ పొట్టతో కలిసిపోయినా వుజూ భంగమవుతుంది. (3) ఏదో జ్ఞాపకం వచ్చి నమాజులో చిరునవ్వు నవ్వడంవల్ల వుజూ భంగపడదు. (4) వుజూ చేసి తల్లి శిశువుకు పాలుపట్టినా, లేక రొమ్ము నుండి పాలు పితికినా వుజూ భంగమవదు. (5) తన లేక ఇతరుల మర్మాంగాలపై దృష్టిపడినా వుజూ పోదు. కాని కావాలని అలా చేయడం తగదు. (6) స్త్రీ పురుషులు ఒకరినొకరు తాకినా లేక ముద్దు పెట్టుకున్నా వుజూకు భంగం వాటిల్లదు. (7) వుజూ చేసిన తరువాత తన మర్మాంగంపై చేయిపడినా వుజూపోదు. కాని కావాలని అలా చేయడం మక్రూహ్. (8) వుజూ చేసిన తరువాత గోళ్ళు కత్తిరించినా, కాలి చర్మాన్ని గిల్లివేసినా వుజూ భంగమవదు. పన్నుల్లో వెండి, బంగారు పల్లు ఉంటే వాటిని బయటకు తీసే అవసరం లేదు. అయితే కృత్రిమ దంతాలను, వాటిని సులభంగా భయటకు తీయడం వీలయితే, తీసి వుజూ చేయాలి. వుజూకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన విషయాలను జ్ఞప్తియందుంచు కోవాలి.

## వుజూకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు

(1) వుజూ చేసిన తరువాత అది భంగపడనంతవరకు లేదా ఏదయినా ఆరాధన చేయనంతవరకు తిరిగి వుజూ చేయకూడదు. అలా చేయడం నీటిని వృధా చేయడమే.

(2) స్నానం చేసేటప్పుడు ఎవరయినా వుజూ చేస్తే అతడు తిరిగి వుజూ చేయనవసరం లేదు. ఆ వుజూతోనే నమాజు చేయాలి. (3) గోళ్ళలో మట్టిగాని, పిండిగాని ఉండి అది ఎండిపోయి వుజూ నీరు ఆ గోటిలోనికి చేరకపోతే వుజూ నెరవేరదు. ఎవరయినా అలాంటి వుజూతోనే నమాజు చేస్తే అది నెరవేరదు. (4) చలివల్ల ఎవరయినా చేతులు, కాళ్ళ చర్మం పగిలి దానికి వేస్‌లీను లేక మైనముగాని పూస్తే దానిపై నుండి నీరు పారజేయడం సరి పోతుంది. దాన్ని తీయనవసరం లేదు. (5) వుజూ చేసిన తరువాత ఏ అవయవమయినా పొడిగా ఉందని గ్రహిస్తే దాన్ని కడగవలసిందేగాని తడి చేత్తో తుడవడం సరిపోదు.

## గాయంపై మసహ్ చేయడం

'మసహ్' అంటే చేత్తో స్పర్శించడం. ప్రత్యేక సందర్భాల్లో చేతిని ఓ అవయవంపై స్పర్శించడాన్ని షరీఅత్‌లో 'మసహ్' అని అంటారు. ఇది ఎన్నో విధాలు. ఒకటి, తలపై చేసే మసహ్. దీన్ని ప్రతి వుజూలో చేయడం ఫర్జ్. రెండోది గాయంపైగాని పట్టి (బ్యాండేజి)పైగాని చేసే మసహ్. మూడోది మేజోళ్ళ (ఖిఖీదిరీ)పై చేసే మసహ్. వుజూలో చేయవలసిన మసహ్ గురించి ముందే చెప్పడం జరిగింది. గాయంపైనా, మేజోళ్ళపైనా మసహ్ ఎలా చేయాలో ఇక్కడ చెప్పబడుతోంది.

(1) శరీరం మీద ఎలాంటి గాయమయినా లేక కురుపో, పుండో అయినా, వాటికి నీరు తగిలితే ఏదయినా హాని కలిగే ప్రమాదం ఉంటే వాటిపై చేత్తో స్పర్శిస్తే సరిపోతుంది. అలా స్పర్శించడంవల్ల కూడా హాని కలుగుతుందనో లేక భరించరాని బాధ కలుగుతుందనో సంశయం కలిగితే దాన్ని అలానే వదిలేసి మిగిలిన భాగాన్ని మాత్రం కడిగేయాలి.

(2) ఇదే విధంగా గాయం లేక పుండుపై కట్టబడిన బ్యాండేజిను విప్పడం కష్ట మయినా లేక బాధ కలిగినా ఆ పట్టిపైనే మసహ్ చేసుకోవాలి. ఈ రకపు మసహ్‌లన్నీ మసహ్ 'అలల్ జబీరా' అనబడతాయి.

(3) చర్మంతో చేసిన మేజోళ్ళు, లేక బాగా మందంగా ఉండే గుడ్డ మేజోళ్ళు లేక నైలాన్ మేజోళ్ళు వేసుకొన్నవాళ్ళు, సొంత ఊరిలో ఉండే ఒక రోజు (అంటే ఒక రేయి, ఒక పగలు) వరకు, ప్రయాణంలో ఉంటే మూడు రేయింబవళ్ళవరకు వాటిపై మసహ్ చేసుకునే అనుమతి ఉంది.

## మేజోళ్ళపై మసహ్ చేసుకోవడానికిగల షరతులు

చర్మంతోగాని లేక గుడ్డతోగాని తయారుచేసిన మేజోళ్ళపై మసహ్ ఈ క్రింది షరతులకు లోబడి అనుమతించబడింది.

(1) ఆ మేజోళ్ళపై నీరు పోసినప్పుడు లోనికి దిగకుండా ఉండేంత మందంగా ఉండాలి.

(2) కనీసం ఓ మైలు నడిచేవరకు అవి కాళ్ళలో నిలువగలగాలి. అవి రెండు చీల మండళ్ళు కప్పి ఉండాలి, చిరగకుండా ఉండాలి.

(3) వీటికితోడు ఆ మేజోళ్ళు వుజూచేసి ఉన్న పరిస్థితుల్లో తొడుక్కుని ఉండాలి.

పై షరతుల్లో ఏ ఒక్కటి లేకున్నా మేజోళ్ళపై మసహ్ సరికాదు.

## మేజోళ్ళపై మసహ్ చేసే పద్ధతి

మూడు చేతి వ్రేళ్ళను పాదం పైభాగంపై మొత్తాన స్పర్శించాలి. వుజూ చేసేటప్పుడు పాదం అధిక భాగం బయటపడినా లేక మేజోళ్ళల్లోనికి నీరు దిగినా వాటిపై మసహ్ చేసే బదులు మేజోళ్ళను తీసివేసి పాదాలు కడుక్కోవాలి.

చేతి తొడుగుల (గ్లవ్స్)పై, అవి ఎంత మందంగా ఉన్నాసరే మసహ్ చేయకూడదు. ఇదే విధంగా తయమ్ముమ్ చేసి మేజోళ్ళపై మసహ్ చేయడం కుదరదు. ఎందుకంటే 'తయమ్ముమ్' ద్వారా కలిగిన తహారత్ (శుచి, శుభ్రత) పూర్తి తహారత్ కాదు. తయమ్ముమ్ కేవలం తాత్కాలికంగా పొందే తహారత్ మాత్రమే.

## నైలాన్ మరియు ఫోం మేజోళ్ళు

నైలాన్ మరియు ఫోం మేజోళ్ళకు పై షరతులు అనుకూలించవు. కాబట్టి వాటిపై మసహ్ నెరవేరదు. కాని ఫోం, నైలాన్ మేజోళ్ళు బాగా మందంగా ఉంటే మాత్రం వాటిపై మసహ్ చేసే వీలుంది. మందం అంటే ఏమిటో పైన చెప్పడం జరిగింది.

## 'మాజూర్' (గత్యంతరం లేనివాడు) గురించిన ఆదేశాలు

శరీరంపై గాయాలున్న పక్షంలో, స్త్రీలకు రుతు సంబంధమైన వ్యాధివల్ల రక్తస్రావం నిరంతరాయంగా జరుగుతున్న పక్షంలో లేక గాయమయి లేక వడదెబ్బ కారణంగానో, ముక్కు నుండి రక్తం కారి ఆగకపోయిన పక్షంలో, ఇంకా అతి మూత్ర వ్యాధివల్ల ఎల్లప్పుడు మూత్రం బొట్లుబొట్లుగా కారే పక్షంలో ఈ కారణాల వల్ల నమాజును వదలకూడదు. అలాంటివారు పై వ్యాధుల వల్ల ఏ మాత్రం ఉపశమనం కలిగినా, అంటే రక్తం కారడం గాని, మూత్రపు బొట్లు పడడంగాని కొంతసేపయినా ఆగిపోగానే వుజూచేసి నమాజు చేయవలసిందే. వుజూచేసిన తరువాత రక్త స్రావంగాని మూత్రపు బొట్లుగాని కారినా ఫరవాలేదు. ప్రతి నమాజుకు వేరుగా వుజూ చేస్తూ ఉండాలి.

## వుజూ లేకుండాఉన్న వ్యక్తిని గురించిన ఆదేశాలు

(1) వుజూ లేకుండా ఉన్న వ్యక్తి చేత్తో ఖుర్ఆన్ గ్రంథాన్ని తాకడంగాని, నమాజు చేయడంగాని తగదు. ఇదే విధంగా సజ్దయే తిలావత్ (ఖుర్ఆన్ పారాయణంలో చేయవలసిన సజ్దా), సజ్దయే షుక్ర్ (కృతజ్ఞతా భావంగా దైవానికి చేసే సజ్దా) లాంటివి చేయకూడదు. ఖుర్ఆన్ అనువాదంగల మూల ప్రతిని కూడా ముట్టకూడదు. అయితే కంఠస్థమయిన ఖుర్ఆన్ పఠించడంలో తప్పులేదు. వుజూ లేకుండా దివ్య గ్రంథాన్ని తాకడానికి అనుమతిలేని విధంగానే దాని 'ఆయత్'లను వ్రాయడం కూడా అనుమతించ బడలేదు. ఇదే విధంగా 'తఫ్సీర్' (వ్యాఖ్యాన) గ్రంథాల్లో ఖుర్ఆన్ ఆయత్‌లు ఉంటే వాటిని కూడా తాకడం మక్రూహ్‌గానే పరిగణించబడుతుంది. చిన్న పిల్లలు వుజూ లేకుండా ఖుర్ఆన్‌ను తాకినా, పఠించినా ఫరవాలేదు.

## జనాబత్ స్థితిలో ఖుర్ఆన్ వ్రాయడం లేక టైపు చేయడం

'జనాబత్' (గుస్ల్ చేసే ఆవశ్యకత ఉన్న) స్థితిలో కంఠస్థమున్న ఖుర్ఆన్‌ని పఠించడం సరికాదు. ఇదే విధంగా దాన్ని వ్రాయడం, లేక ముద్రించడం, టైపు చేయడం కూడా సరికాదు.

ఈ రోజుల్లో ఖుర్ఆన్‌ను రికార్డు చేయడం, క్యాసెట్లలో నింపడం జరుగుతోంది. వాటిని తాకవచ్చు. ఇవి చిత్రంలాంటివే.

## గుసుల్

గుసుల్ రెండు లక్ష్యాలతో చేస్తారు. ఒకటి పుణ్యం పొందదానికి. ఉదాహరణకు జుమా, పండుగలు (ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్హా) సమయాన చేసే గుసుల్ రెండోది కొన్ని అశుద్ధతలు చేయకనే దూరం కావు. వాటి కోసం గుసుల్ చేయడం తప్పనిసరి అవుతుంది.

## గుసుల్ అంటే ఏమిటి?

నిఘంటువు ప్రకారం, గుసుల్ అంటే శరీరాన్నంతటినీ కడగడాన్ని లేదా స్నానం చేయడాన్ని గుసుల్ అంటారు. అయితే షరీఅత్ పరిభాషలో గుసుల్ అంటే, అశుద్ధతను దూరం చేయడానికి, లేక పుణ్యఫలాపేక్షతో ప్రత్యేక పద్ధతిలో శరీరాన్నంతటినీ కడగడం లేదా స్నానం చేయడం అని అర్థం.

## గుసుల్ ఎప్పుడు ఫర్జ్ (విధి) అవుతుంది?

ఈ క్రింద చెప్పబడిన పరిస్థితుల్లో గుసుల్ ఫర్జ్ అవుతుంది.

(1) కామోద్రేకంతో మనిషి శరీరంనుండి వీర్య స్థలనం జరిగినప్పుడు– అది సంభోగం వల్ల జరిగినా లేక మరేవిధంగా జరిగినా సరే.

(2) రాత్రి లేక పగలు నిద్రలో స్థలనం జరిగినప్పుడు– అతడు ఆ సంబంధమయిన కలగన్నా, కనకపోయినాసరే, స్వప్నస్థలనం జరిగినట్లు కలగన్నప్పటికీ బట్టలు వగైరాపై స్థలనం జరిగినట్లు ఏ ప్రభావం కానరాని పక్షంలో గుసుల్ చేసే అవసరం లేదు.

(3) పురుషుని మర్మాంగం స్త్రీ మర్మాంగంలోనికి ప్రవేశించగా దీనివల్ల వీర్యస్థలనం జరిగినా జరగక పోయినాసరే, స్త్రీ పురుషులుభయులూ గుసుల్ చేయడం ఫర్జ్ అవుతుంది. ఈ రోజుల్లో 'నిరోధ్' వాడకం సర్వసాధారణమయిపోయింది. నిరోధ్ లేక మరే కండోమ్‌ను ఉపయోగించి సంభోగించినా గుసుల్ వాజిబ్ అవుతుంది. దీనికిగల కారణం గుసుల్ చేయడానికిగల ఆ రెండు షరతులే. (1) కామోద్రేకంతో వీర్య స్థలనం జరగడం, (2) పురుషుని శిశ్నం స్త్రీ యోనిలోకి ప్రవేశించడం. ఈ రెండు షరతులు ఇక్కడ నెరవేరుతున్నాయి గనుక గుసుల్ చేయవలసిందే.

(3) స్త్రీకి రుతుస్రావం, ప్రసూతి స్రావం జరిగిన సందర్భంలో రుతుస్రావం, ప్రసూతి స్రావాల గురించి ఇదివరకే చెప్పడం జరిగింది. గుసుల్ ఫర్జ్ అయిన వారిని 'జునుబి' అంటారు.

## ఇతరుని వీర్యంవల్ల గుసుల్

నేటి నీతిబాహ్యమయిన పాశ్చాత్య నాగరికత మరో రుగ్మతను సృష్టించింది. అదేమిటంటే ఒకరి వీర్యాన్ని స్త్రీ గర్భాశయంలో ఏదయినా వాహకంద్వారా ప్రవేశింప జేయడం. ఇలాంటి సందర్భాల్లో గుసుల్ చేయడం వాజిబ్ అవుతుందా కాదా అనే సందేహం కూడా కలగక మానదు. కొన్ని కారణాలవల్ల వాజిబ్ కాదనే చెప్పవచ్చు. 'రద్దుల్ మొఖ్తార్' అనే గ్రంథం సంపుటం 1 పేజీ 153లో ఇవ్వబడిన కొన్ని సూచనల ప్రకారం గుసుల్ వాజిబ్ కాదు అని చెప్పవచ్చు. దీనికి సంబంధించిన పూర్తి వివరాలు 'సామాజిక జీవితం' అనే అధ్యాయంలో ప్రస్తావించాము.

## కృత్రిమ కేశాల (వెంట్రుకలు)కు సంబంధించిన ఆదేశాలు:

కృత్రిమ వెంట్రుకల (విగ్గు, సవరాలు)ను ఉపయోగించడం, వాటిని అలంకరింప జేసుకోవడాన్ని మహా ప్రవక్త (సఅసం) వారించారు. ఒకవేళ ఏ స్త్రీ పురుషులయినా అలాంటి వెంట్రుకల్ని వాడుతున్నట్లయితే వుజూ, గుసుల్ చేసేటప్పుడు వాటిని తొలగించి అసలు వెంట్రుకలు తడిసేటట్లు స్నానంగాని మసహ్‌గాని చేయవలసిందే.

గుసుల్ ఎప్పుడు సున్నత్ (ప్రవక్త సంప్రదాయం) మరియు ముస్తహిబ్ (అభిలషనీయం) అవుతుంది?

(1) జుమా నమాజుకోసం, (2) ఈదైన్ (పండుగల) నమాజులకోసం, (3) హజ్ యాత్రికులు (హాజీలు) 'ఇహ్రాం' కట్టేటప్పుడు మరియు అరఫాత్‌లో (4) ముస్లిమేతరుడు ముస్లింగా ధర్మ పరివర్తన చెంది (అంటే ఇస్లాం స్వీకరించినప్పుడు) గుసుల్ చేయడం ముస్తహిబ్. (5) శవానికి గుసుల్ చేయించిన తరువాత గుసుల్ చేయించినవాడు గుసుల్ చేయడం, (6) ఏదేని పాపం (గునాహ్) జరిగిన తరువాత తౌబా పశ్చాత్తాపంతో ప్రార్థన చేసేటప్పుడు గుసుల్ చేయడం ముస్తహిబ్.

## గుసుల్ ఎలా చేయాలి?

గుసుల్ చేసే మస్నూన్ ప్రవక్త (సఅసం) (సంప్రదాయం) పద్ధతి ఏమిటంటే ముందు రెండు చేతుల్ని మణికట్ల సమేతంగా కడుక్కోవాలి. తరువాత మర్మాంగాన్ని కడిగి శుభ్రం చేసుకోవాలి. ఆ తరువాత శరీరంపైగాని, బట్టలపైగానిగల అశుద్ధతను కడిగి శుభ్రం చేసుకోవాలి. తదుపరి పూర్తి వుజూ చేయాలి. ఏదేని పీటపైగాని, ఎత్తయిన ప్రదేశంపైగాని లేక గట్టి గచ్చు నేలపైగాని కూర్చుని వుజూ చేస్తే వుజూ లోనే రెండు కాళ్ళు కూడా కడిగేయాలి. గట్టి ప్రదేశంగాని, ఎత్తయిన ప్రదేశంగాని లేనప్పుడు గుసుల్ ముగించిన తరువాత రెండు కాళ్ళు (పాదాలు) కడుక్కోవాలి.

వుజూ అయిన పిమ్మట తలతోసహా పూర్తి శరీరంపై మూడుసార్లు నీరుపోసుకోవాలి. మొదటిసారి నీరు పోసుకున్న తరువాత వెంట్రుక మందం కూడా పొడి లేకుండా పూర్తి శరీరాన్ని బాగా మర్దన చెయ్యాలి. రెండోసారి ఆ తరువాత మూడోసారి పూర్తి శరీరంపై నీరు పోసుకొని స్నానం చేయాలి.

వుజూలాగానే గుసుల్‌లో కొన్ని విషయాలు ఫర్జ్‌లు, కొన్ని సున్నత్‌లు మరికొన్ని ముస్తహిబ్‌గా ఉన్నాయి.

## గుసుల్‌లోని ఫర్జులు

జనాబత్ గుసుల్‌లో మూడు ఫర్జులున్నాయి. (1) నోటి నిండా నీరు తీసుకుని పుక్కిలించడం, (2) ముక్కులోనికి నీరు ఎక్కించడం, (3) వెంట్రుక మందం కూడా పొడి లేకుండా, చివరికి గోళ్ళ సందుల్లోను నీరు చేరేటట్లు, పూర్తి శరీరమంతటా ఒకసారి నీరు పోసుకోవడం.

## స్త్రీల వెంట్రుకలకు సంబంధించిన ఆజ్ఞ

స్త్రీ తల వెంట్రుకలు విడువడి ఉంటే ఒక్కొక్క వెంట్రుక సయితం తడిసి వాటి

పాదులు కూడా తడవడం అవసరం. కాని వెంట్రుకలు ముడివేసిగాని, జడగా అల్లి ఉన్న పక్షంలో వాటి పాదులకు మటుకే నీరు చేరినా సరిపోతుంది. ముడివేసి ఉన్న వెంట్రుకల పాదుల్లోకి నీరు చేరలేని పక్షంలో వాటిని విడదీసి తడపాలి. చెవికీ, చేతి వ్రేళ్ళకు బిగుతయిన ఆభరణాలుగాని, ఉంగరాలుగాని ఉంటే స్నానం చేసేటప్పుడు వాటి దిగువనున్న భాగాలు తడిసేటట్లు వాటిని కదపాలి లేక త్రిప్పాలి.

గుసుల్‌లోగల ఫర్జుల్లోనుండి ఏ ఒక్క ఫర్జును వదిలేసినా గుసుల్ నెరవేరదు. అంటే అలా చేసిన వ్యక్తి 'నాపాక్' (అపరిశుద్ధుడు)గానే ఉంటాడు. ఉదాహరణకు పుక్కిలించడం ఫర్జ్. అది మరచినా లేక ముక్కున నీరు ఎక్కించడం మరచినా లేక శరీరం మొత్తం తడవకున్నా గుసుల్ నెరవేరదు. పల్లెల్లో కొందరు ముస్లిములు ధోవతి కట్టడానికై బెల్టులా కట్టుకొని గుసుల్ చేస్తారు. దాన్ని విప్పివెయ్యడం మంచిది. లేకపోతే నడుముభాగం పొడిగా ఉండిపోవచ్చు.

## గుసుల్‌లో ఉన్న సున్నత్‌లు

గుసుల్‌లో ఎన్నో సున్నత్‌లున్నాయి. వాటిని వదిలేసినా గుసుల్ నెరవేరుతుంది. కాని పుణ్యఫలం మాత్రం తగ్గిపోతుంది. ఆ సున్నత్‌లు ఇవి:

(1) దైవ ప్రసన్నతకోసం పరిశుద్ధులయ్యే సంకల్పంతో గుసుల్ చేయడం.

2) రెండు చేతుల్ని మణికట్లతో సహా కడగడం.

3) శరీరంపైనగాని లేక వస్త్రంపైగాని అశుద్ధత అంటినట్లయితే దాన్ని కడిగేసి శుభ్రం చేశాకనే పూర్తి గుసుల్ చేయడం.

4) మర్మాంగాన్ని కడగడం

5) వుజూ చేయడం

6) పూర్తి శరీరంపై మూడుసార్లు నీరు పోసుకోవడం.

7) బాత్‌రూమ్‌లో గుడ్డ కట్టుకొని స్నానం చేయడం.

## గుసుల్ చేసేటప్పుడు పాటించవలసిన జాగ్రత్తలు

1) కూర్చునే గుసుల్ చేయాలి. 2) పైన చెప్పబడిన సంకల్పంతో గుసుల్ చేయడం 3) నీరు ఎక్కువగా పారబోయకుండా ఉండడం 4) శరీరం బాగా మర్దన చెయ్యడం 5) (గుసుల్ చేసే వ్యక్తితో వివాహానికి అర్హులయినవారి) కంట పడకుండా ఉండేచోటే గుసుల్ చేయడం. స్త్రీలు గుసుల్ చేసేటప్పుడు స్త్రీలకు కూడా కనబడకుండా ఉండాలి.

గుసుల్ చేసేటప్పుడు మరుగు స్థలం లభించకపోతే పురుషులు కూడా తమ మోకాలి పైభాగం ఇతరులకు కనబడకుండా జాగ్రత్తపడాలి. 6) ఖిబ్లా వైపుకు తిరిగి గుసుల్ చేయకూడదు. 7) గుసుల్ చేసే ప్రదేశం అపరిశుద్ధంగా ఉండకూడదు. లేకపోతే అపరిశుద్ధ నేలపై పడ్డనీరు తిరిగి శరీరం మరియు దుస్తులపై పడి పూర్తిశుచి లభించకపోతుంది.

## సూచనలు

1) ఒకరు నదిలోనో, చెరువులోనో లేక నీటి టాంకులోనో దూకినా లేక ప్రమాద శాత్తు పడిపోయినా లేక వర్షంవల్ల అతని పూర్తి శరీరం తడిసి నోటిలోనికి, ముక్కులోనికి నీరు పోయినా అలాంటి వ్యక్తికి దాని ద్వారా గుసుల్ నెరవేరినట్లే. తిరిగి అతడు గుసుల్ చేయనవసరం లేదు.

2) ఏ వ్యక్తి అయినా పైన చూపిన పద్ధతి ప్రకారం గుసుల్ చేసినట్లయితే అతడు నమాజుకోసం తిరిగి వుజూ చేయనవసరం లేదు. అతడు ఆ గుసుల్‌లో చేసిన వుజూతోనే నమాజు చేయాలి.

3) బాత్ రూం (స్నానాల గది), నది లేక చెరువులో గుసుల్ చేసేటప్పుడు వాటిలో మూత్ర విసర్జన చేయకూడదు. అలా చేస్తే మనిషి మనస్సులో సందేహాలు, కుశంకలు ఉత్పన్నమవుతాయని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు.

4) వుజూలో చెప్పబడిన సూచనలన్నింటిని గుసుల్‌లో కూడా పాటించాలి.

5) చన్నీళ్ళతో స్నానం చేస్తే అనారోగ్యం ఏర్పడడంగాని లేక వ్యాధి ముదిరే ప్రమాదం గాని ఉన్న సందర్భంలో వేణ్ణీళ్ళు లభించకపోతే 'తయమ్ముమ్' చేసి నమాజు చేయాలి. నమాజును ఖజా మాత్రం ఎట్టి పరిస్థితిలోనూ చేయకూడదు.

## 'జునుబి' (గుసుల్ ఫర్జ్ అయినవాడు) పాటించవలసిన జాగ్రత్తలు

ఒక వ్యక్తిపై గుసుల్ చేయడం ఫర్జ్ అయినట్లయితే అతడు కొన్ని విషయాలకు దూరంగా ఉండాలి.

1) దివ్య ఖుర్ఆన్‌ను తాకడం, దాన్ని పఠించడం 2) సజ్దా చేయడం లేక నమాజ్ చేయడం 3) అనివార్యమయితే తప్ప మస్జిద్‌లోనికి అడుగుపెట్టడం 4) స్త్రీలు రుతుస్రావం, ప్రసూతి స్రావాల కాలంలో సంభోగించడం 5) వుజూ లేకుండా దివ్యఖుర్ఆన్ కంఠస్థంగా ఉన్నట్లయితే చదవవచ్చు. కాని జునుబి కంఠస్థమైన ఖుర్ఆన్ వాక్యాలను కూడా పఠించ కూడదు. అయితే ఖుర్ఆన్‌లోని ఓ చిన్న ఆయత్‌ను వేడుకోలుగా లేక సంస్మరణగా చదవవచ్చు. ఉదాహరణకు సుబ్హానల్లాహ్, అల్హందులిల్లాహ్‌లాంటివి పఠించినా తప్పులేదు.

# తయమ్ముమ్

నీటిద్వారా పరిశుద్ధత ఎలా పొందాలో పైన చర్చించబడింది. ఇప్పుడు మట్టితో పరిశుద్ధత పొందే విధానం చెప్పబడుతోందిక్కడ. నీరు లభ్యంకాని పక్షంలో, నీరు లభించినా దాని వాడకంవల్ల అనారోగ్యం ఏర్పడి నష్టం కలిగే భయం ఉన్నా, అలాంటి పరిస్థితిలో 'తయమ్ముమ్' చేసి పరిశుద్ధత పొందే అనుమతి ఇచ్చాడు దైవం. ఈ అనుమతి దైవం ప్రసాదించిన ఓ మహావరం. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

وَإِنْ كُنْتُمْ مَرْضَىٰ أَوْ عَلَىٰ سَفَرٍ أَوْ جَاءَ أَحَدٌ مِنْكُمْ مِنَ الْغَائِطِ أَوْ لَامَسْتُمُ النِّسَاءَ فَلَمْ تَجِدُوا مَاءً فَتَيَمَّمُوا صَعِيدًا طَيِّبًا فَامْسَحُوا بِوُجُوهِكُمْ وَأَيْدِيكُمْ إِنَّ اللَّهَ كَانَ عَفُوًّا غَفُورًا (النساء)

"మీరు అస్వస్థులైనా లేక ప్రయాణంలోఉన్నా లేక మీలో ఎవరయినా మీ అవసరం తీర్చుకుని (మల మూత్ర విసర్జనం చేసి) వచ్చినా లేక మీరు స్త్రీలను కలసినా (సంభోగించినా) ఇలాంటి పరిస్థితిలో మీకు నీరు లభ్యంకాని పక్షంలో పరిశుభ్రమయిన మట్టిని ఉపయోగించి తయమ్ముమ్ చేసుకోండి. మీ చేతులతో మీ ముఖాలను, చేతుల్ని స్పర్శించండి. నిస్సందేహంగా అల్లాహ్ న్యాయశీలుడు, క్షమాగుణం గలవాడూను." (నిసా-43)

## తయమ్ముమ్ అంటే

తయమ్ముమ్ అంటే శాబ్దిక అర్థం ఉద్యుక్తులవడం, సంకల్పించడం అని. షరీఅత్ పరిభాషలో, పరిశుభ్రమయిన మట్టి లేక పరిశుభ్రమయిన మట్టి కోవకు చెందిన వస్తువుద్వారా పరిశుద్ధతను పొందే సంకల్పం చేయడాన్ని తయమ్ముమ్ అనంటారు. వుజూ, గుసుల్‌లో ఏ విధంగానయితే కొన్ని ఫర్జులు, సున్నత్‌లున్నాయో తయమ్ముమ్‌లోనూ అలాగే ఉన్నాయి.

## తయమ్ముమ్‌లో ఫర్జులు

తయమ్ముమ్‌లో మూడు విషయాలు (ఫర్జ్) విధి అయినవి: (1) సంకల్పం, (2) అరచేతుల్ని పరిశుభ్రమయిన మట్టిపై అదిమి, ముఖంపై వెంట్రుక మందం కూడా ఖాళీ లేకుండా స్పర్శించడం. (3) రెండు అరచేతుల్ని తిరిగి మట్టిపై అదిమి (కొట్టి) రెండు చేతుల్ని మోచేతుల సహితం వెంట్రుక మందం ఖాళీ లేకుండా స్పర్శించడం.

## తయమ్ముమ్ చేసే ప్రవక్త సాంప్రదాయిక విధానం

మహాప్రవక్త (సఅసం) సంప్రదాయ పద్ధతి ప్రకారం ముందు 'బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీం' పఠించి తయమ్ముమ్‌కై సంకల్పం చేయాలి. అంటే దైవప్రసన్నతకోసం పరిశుద్ధత పొందే మనోసంకల్పం చేసుకోవాలి. ఆ తరువాత రెండు అరచేతుల్ని మట్టిపై అదిమికొట్టి ఆ అరచేతుల్ని ముఖంపై రుద్దుకోవాలి. ఒకవేళ చేతులకు మట్టి బాగా అంటినట్లయితే దాన్ని దులుసుకోవచ్చు. అనవసరంగా ముఖానికి మట్టిని పులుముకోనవసరం లేదు. రెండోసారి తిరిగి అదే విధంగా అరచేతుల్ని మట్టిపై అదిమి, రెండు చేతుల్ని మోచేతుల వరకు బాగా స్పర్శించాలి. చేతుల్ని స్పర్శించేటప్పుడు మొదట ఎడమ అరచేతిలో కుడి చేతిని, తరువాత కుడి అరచేతిలో ఎడమచేతిని వెంట్రుక మందం ఖాళీ లేకుండా స్పర్శించాలి. ముఖంపై చేతులతో స్పర్శించేటప్పుడు గడ్డాన్ని వ్రేళ్ళతో దువ్వాలి. (అంటే ఖిలాల్ చేయాలి) ఇలా చేయడం సున్నత్. (ఆలమ్‌గీరి-పేజి 25-26)

## వేటితో తయమ్ముమ్ చెయ్యొచ్చు

పరిశుభ్రమైన మట్టి, రాళ్ళు, గులకరాళ్ళు, ఇసుక, సున్నం, పచ్చి లేక పండు ఇటుక, సింధూరం, మట్టితో రాయితో లేక ఇటుకతో కట్టిన గోడ, మట్టితో తయారు చేసిన పాత్రలు-కాల్చినవైన, పచ్చివైనా- (వాటిపై పెయింటు చేయకుండా ఉంటే), కట్టెగాని, వస్త్రంగాని లేక అలాంటిదే ఇంకేదైనా పరిశుద్ధమయిన వస్తువుపై దుమ్ము ధూళి పడి ఉంటే వాటిపై తయమ్ముమ్ చెయ్యొచ్చు. (దర్రెముఖ్తార్, ఆలంగీర్-25,26)

## ఏయే అశుద్ధతలకై తయమ్ముమ్ చేయాలి

'నజాసతె హుక్మియా' గురించి ఇదివరకే చర్చించడం జరిగింది. ఈ నజాసతె హుక్మియా చిన్నదయినా, పెద్దదయినా ఉభయత్రా తయమ్ముమ్ ద్వారా అపరిశుద్ధతను దూరం చేసుకుని పరిశుద్ధత పొందవచ్చు. అయితే నజాసతె హఖీఖి కోసం తయమ్ముమ్ ఒక్కటే చాలదు, దీన్ని కడిగి శుభ్రం కూడా చేయాలి.

**సూచన:** వుజూ మరియు గుసుల్ రెంటికీ ఒకే తయమ్ముమ్ చేయాలి. ఆ ఒక తయమ్ముమ్మే ఈ రెంటికి సరిపోతుంది.

## ఏ పరిస్థితుల్లో తయమ్ముమ్ అవసరమవుతుంది

తయమ్ముమ్ ఎల్లప్పుడూ ధర్మబద్ధం కాదు. ఈ క్రింది షరతులకు లోబడే దాని ఆవశ్యకత ఏర్పడుతుంది.

1. నీరు ఓ మైలు లేక అంతకంటే దూరంగా ఉన్నప్పుడు.

2. బావి ఉన్నా అందులో నుండి నీరు తీసే సదుపాయాలు లేనప్పుడు.

3. నీటి దరిదాపుల్లో ఏవయినా క్రూర జంతువులు శత్రుభయం ఉండి అటు వెళ్ళి నట్లయితే ప్రాణాపాయం కలిగే ప్రమాదమున్నప్పుడు.

4. బస్సు, రైలు లేక విమానంపై ప్రయాణం చేస్తున్నప్పుడు వాటిలో నీరు లభించని పక్షంలో లేక వుజూ చేయడానికి వీలుపడని పక్షంలో లేక దిగి నీరు తీసుకునే లోపలే అవి బయలుదేర్తాయనే భయం ఉన్నప్పుడు, రైలు, బస్సు వగైరాల్లో ప్రయాణం చేసేటప్పుడు నీరు లభించకపోతే వాటి గోడల మీద ఉన్న ధూళిపై తయమ్ముమ్ చేయవచ్చు.

5. నీటి ఉపయోగంవల్ల వ్యాధి ముదిరే భయం లేక ఆరోగ్యంపై చెడు ప్రభావం పడే ప్రమాదం ఉన్నప్పుడు. (ఈ విషయంలో అనవసర అనుమానాలకు తావిచ్చి తయమ్ముమ్ చేయకూడదు) వ్యాధి తీవ్రం అయ్యే లేక అనారోగ్యం ఏర్పడే అనుభవం లేక పూర్తి నమ్మకం ఉంటేనే తయమ్ముమ్ చేయాలి. ఉదాహరణకు చలి కాలంలో, కొందరికి చల్లని నీరు ప్రయోగంవల్ల నష్టం జరగవచ్చు. అలాంటి వారు వేడి నీళ్ళతో వుజూ, గుసుల్ చేయాలి. అది కూడా లభ్యంకాని పక్షంలో లేదా వేడినీళ్ళవల్ల కూడా నష్టం కలిగే ప్రమాదముంటే తయమ్ముమ్ చేసుకోవచ్చు.

6. నీరు తక్కువగా ఉండి, దాంతో వుజూ చేస్తే దాహంతో ఉండవలసి వస్తుందన్న భయముంటే, లేక వంటకు ఆటంకం ఏర్పడే భయమున్నప్పుడు తయమ్ముమ్‌తో పరిశుద్ధతను పొందొచ్చు.

7. నీరున్నా స్వయంగా దాన్ని అందుకోజాలనప్పుడు, లేదా ఎవరయినా అందించే వారు దరిదాపుల్లో లేనప్పుడు.

8. వుజూగాని, గుసుల్‌గాని చేసేలోపల ఖజా చదవవీలులేని నమాజులు (అంటే నమాజె ఈదైన్, నమాజె జనాజాలాంటివి) దాటిపోయే ప్రమాదమున్నప్పుడు, ఈ పరిస్థితులన్నింటిలో వుజూ, గుసుల్‌కు బదులుగా తయమ్ముమ్ చేయవచ్చు. (ఇల్ముల్ ఫికహ్, ఆలంగీరి)

**సూచనలు:**

1. ఒకరికి గుసుల్ చేసే అవసరం కలిగింది. నీటితో గుసుల్ చేస్తే అస్వస్థతకు గురయ్యే ప్రమాదం ఉంది. అయితే వుజూ చేయడంవల్ల అతనికెలాంటి ప్రమాదం ఏర్పడదు. అలాంటి వ్యక్తి గుసుల్‌కు బదులు తయమ్ముమ్ చేసి ప్రతి నమాజుకు తాజాగా వుజూ చేయవలసి ఉంటుంది.

2. కేవలం ఒక్కొక్కసారి మాత్రమే ముఖం, కాళ్ళుచేతులు కడగడానికి సరిపడే

నీరున్నప్పుడు, వుజూలో ఆ అవయవాల్ని ఒక్కసారే కడగాలి. తయమ్ముమ్ చెయ్యొద్దు. వుజూలోని సున్నత్‌లు అంటే పుక్కిలించడం, ముక్కులోనికి నీరెక్కించడంలాంటివి వదిలేయాలి.

3. ఒక వ్యక్తి తయమ్ముమ్ చేసి నమాజు చేశాడు. ఆ తరువాత తెలిసింది దగ్గర్లో నీరుందని. అప్పుడు ఆ వ్యక్తి ఆ నమాజును తిరిగి చేయనవసరం లేదు. అయితే ఆ వ్యక్తి ఇదివరకే నీటికోసం ప్రయత్నం చేసి ఉండాలి. అలా ప్రయత్నం చేయక ఉన్నట్లయితే ఆ నమాజ్‌ను తిరిగి చెయ్యాల్సిందే.

4. నమాజ్‌చేసే వేళ ముగియక ముందు నీరు లభ్యం అయ్యే నమ్మకం ఉంటే ఆ నమాజ్‌ను చివరి సమయం వరకు వేచి ఉండి చెయ్యడమే ముస్తహబ్. ఉదాహరణకు ఒక వ్యక్తి రైల్లోనో, బస్సులోనో ప్రయాణం చేస్తున్నాడు; నమాజ్ చేసే చివరి సమయం లోపలే నీరు ఉన్న చోటికి ఆ బండి చేరుకోగలదనే నమ్మకం ఉంది. అలాంటి వ్యక్తి నమాజ్ ఆలస్యంగానే చెయ్యవచ్చు. అనుమానంగా ఉన్నప్పుడు మటుకు తయమ్ముమ్ చేసి నమాజ్ చేసుకోవాలి.

5. నీటికోసం వెతికిన తరువాతే తయమ్ముమ్‌చేసి నమాజ్ చేసుకున్న వ్యక్తికి ఆ నమాజ్‌చేసే సమయం ఉండగానే నీరు లభ్యమయినా ఆ నమాజ్‌ను తిరిగి చేయనవసరం లేదు.

6. ఎవరికయినా, రైల్లోనో, బస్సులోనో ప్రయాణం చేసేటప్పుడు ఎన్నివిధాలా ప్రయత్నించినా అతనికి నీరుకాని, మట్టికాని లభ్యంకానప్పుడు అలాంటి వ్యక్తి వుజూగాని, తయమ్ముమ్‌గాని లేకుండానే నమాజ్ చేయాలి. ఇదే విధంగా ఎవరయినా జైల్లో ఉన్నప్పుడు ఇదే పరిస్థితి ఏర్పడితే ఆ వ్యక్తి పరిశుద్ధత కూడా లేకపోయినా సరే నమాజు చేయాలి. కాని ఈ రెండు పరిస్థితుల్లోను నీరు లభ్యమవగానే ఆ నమాజును తిరిగి చేసుకోవాలి.

7. మనిషి కల్పించిన ఆటంకము (ఉజ్ర్) వల్ల కూడా ఇలా చెయ్యొచ్చు. ఉదాహరణకు జైల్లో వుజూ చెయ్యకుండా ఆటంకపరిస్తే లేక త్రాగడానికి తప్ప నీరు అందివ్వకపోతే పై విధంగా చేయవచ్చు.

## తయమ్ముమ్ ఎప్పుడు భంగపడ్తుంది?

1. వుజూ ఏ కారణాలవల్ల భంగపడ్తుందో వాటి వల్ల తయమ్ముమ్ కూడా భంగపడ్తుంది. 2. గుసుల్ ఫర్జ్ అయ్యే పరిస్థితి ఏర్పడినా తయమ్ముమ్ భంగపడ్తుంది. 3. తయమ్ముమ్‌కు కారణమయిన పరిస్థితులు తొలగిపోయిన వెంటనే తయమ్ముమ్ భంగపడ్తుంది. 4. నీరు లభ్యమయిన వెంటనే తయమ్ముమ్ భంగమవుతుంది.

# నమాజ్

నమాజును అరబీ భాషలో 'సలాత్' అంటారు. సలాత్ అంటే వేడికోలు, ప్రార్థన అని అర్థం. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది.

"వారి కోసం ప్రార్థించండి (వేడుకోండి). మీ ప్రార్థన వారికి శాంతిని కలిగిస్తుంది." (తౌబా)

وَصَلِّ عَلَيْهِمْ إِنَّ صَلَوٰتَكَ سَكَنٌ لَّهُمْ - (توبہ)

మహాప్రవక్త (సఅసం) ఓ సందర్భంలో "దైవదూతలు మీ కోసం ప్రార్థిస్తారు" అని అన్నారు.

నమాజ్‌ను ప్రార్థన అనడానికి కారణం, ఇందులో దైవదాసుడు తన నిజ స్వామి ఔన్నత్యాన్ని, ఆయన మహత్తును మరియు ఆయన ప్రభుసత్తాను గుర్తిస్తాడు. తన దాస్యభావాన్ని, తన అశక్తతను ఆయన ఎదుట ప్రదర్శిస్తాడు. దీనిద్వారా తన్ను దైవదాస్యంపై నిలకడగా ఉంచేందుకు ప్రార్థిస్తాడు. రుజుమార్గమైన ఇస్లాం ధర్మంపై నడిచే సద్బుద్ధిని ప్రసాదించమని వేడుకుంటాడు, అంటే నమాజ్ దాసుణ్ణి నిజస్వామి వద్దకు తీసుకువెళ్ళే మార్గం. ప్రార్థన ఉద్దేశ్యం కూడా అదే.

## ఇస్లాంలో నమాజ్ ప్రాముఖ్యత

ఇస్లాంలో ఫర్జ్ చేయబడిన ఆరాధనలన్నింటికీ ప్రాముఖ్యత ఉంది. అయితే నమాజ్‌కు ఓ ప్రత్యేకమయిన ప్రాముఖ్యతగలదు. ఈ ఆరాధన ప్రతి ముస్లింపై విధి-ఫర్జ్‌గా చేయబడింది. స్త్రీ అయినా పురుషుడయినా, ధనవంతుడైనా నిరుపేద అయినా, రోగి అయినా ఆరోగ్యవంతుడయినా, బలవంతుడైనా, బలహీనుడయినా, నివాసంగలవాడైనా, ప్రయాణంలో ఉన్నవాడయినా, మనిషి యుద్ధ రంగంలో ఉన్నా, ప్రశాంత సమయంలో ఉన్నా విధిగా నమాజ్ చెయ్యవల్సిందే. మనిషి బుద్ధివివేకాలు సవ్యంగా ఉన్నంత కాలం, మృత్యువు సంభవించేంతవరకు దీని మాఫీ లేదు.

## ఇస్లాంలో నమాజ్...

నిలబడి నమాజు చేయవీలులేకపోతే కూర్చుని, కూర్చుని చేసే స్థితిలో లేకపోతే పడుకొని, అలా కూడా శరీరాన్ని కదపడం సాధ్యం కాకపోతే సంజ్ఞల ద్వారా నమాజ్ చేయవల్సిందే. ఏ స్థితిలోనూ నమాజ్ మాఫీ చెయ్యడం జరగలేదు. ఏడేళ్ళ ప్రాయం కలిగిన పిల్లలను సయితం నమాజు కోసం ప్రోత్సహించమని, వారికి పదేళ్ళు రాగానే నమాజు చేయించమని, అలవరచడానికి అవసరమయితే పిల్లలను కొట్టమని అంతిమ దైవప్రవక్త (సఅసం) ఆదేశమిచ్చారు. (ముస్లిం)

దివ్యగ్రంథంలో నమాజుకు సంబంధించిన ఆదేశం పలుమార్లు వచ్చింది. "ముస్లిములకు నమాజ్ దాని నిర్ణీత సమయంలో ఫర్జ్ (విధి)గా నిర్ణయించబడింది" అంటూ దివ్యఖుర్ఆన్ నమాజ్‌లో అలసత్వం చూపినవాణ్ణి మునాఫిక్ (కపటుని)గా పేర్కొన్నది. మహనీయ ముహమ్మద్ (సఅసం) తమ మాటల ద్వారా, చేతల ద్వారా దీని ఔన్నత్యాన్ని చాటారు. ఓ హదీసులో, "ఎవరయితే సక్రమంగా వుజూచేసి మనస్సును లగ్నంచేసి సరయిన రీతిలో నమాజ్ చేస్తాడో అంతిమ దినం నాడు అల్లాహ్ అతని చిన్న చిన్న తప్పిదాలను మన్నించి స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు" అని ప్రవచించారు. (ముస్లిం)

మహాప్రవక్త ఏనాడూ నమాజును వదలలేదు. ఫర్జ్ నమాజులే కాక అదనంగా నమాజులు సలిపేవారు. నఫిల్ నమాజులు సుదీర్ఘంగా చెయ్యడంవల్ల ఆయన పాదాలపై వాపు కనబడేది. "నమాజ్ నా కంటి చలువ" అనేవారాయన (సఅసం).

ఆయన పరమపదించడానికి ఓ సంవత్సరం ముందు బనూ సకీఫ్‌కు చెందిన ఓ ప్రతినిధి వర్గం ఇస్లాం స్వీకరించడానికి ఆయన దగ్గరకు వచ్చింది. ఇస్లాం స్వీకారానికి ముందు నమాజును వదిలేసే అనుమతి కోరింది ఆ వర్గం. వారిని ఉద్దేశించి, "ఏ ధర్మం లోనయితే నమాజ్‌లేదో ఆ ధర్మంలో శ్రేయమే లేదు" అన్నారు మహాప్రవక్త (సఅసం). మరో సందర్భంలో "దాసునికి, తిరస్కారికి మధ్య వ్యత్యాసం నమాజే. ఎవరయితే నమాజును వదిలేస్తాడో అతడు అవిశ్వాసపు సరిహద్దుల్లోకి చేరినట్లే" అని అన్నారు. మరో ప్రవచనంలో ఇలా సెలవిచ్చారాయన, "కావాలని నమాజును వదిలేసినవాడు 'కుఫ్ర్' (దైవ ధిక్కారం) చేసినట్లే." (మిస్కాత్)

మహాప్రవక్త (సఅసం) తమ అస్తమయంకంటే కొంచెం ముందు తమ అనుచర వర్గాన్ని (సహాబా, రజిఅన్) ఉద్దేశించి "నమాజుగూర్చి శ్రద్ధ వహించండి; ఎవరయితే నమాజును కావాలని వదిలేస్తాడో ఆ వ్యక్తి కుఫ్ర్ చేసినట్లే" అని బోధించారు. ఈ ప్రవచ నాల ఆధారంగా నమాజ్‌కు ఎంత ప్రాముఖ్యత ఉందో అర్థం అవుతుంది. ఆయన ఇంకా ఇలా సెలవిచ్చారు. "నమాజ్ 'దీన్' (దైవధర్మం) స్తంభం. ఎవరయితే దీన్ని పడగొడ్తాడో అతడు దైవధర్మాన్నే పడగొట్టినవాడు." ఇలాంటి ఆదేశాల మూలంగానే సహాబా (రజిఅన్) అనుచరవర్గం నమాజ్‌ను వదిలేయడాన్ని కుఫ్ర్‌గా భావించారు. ఇమాం అహ్మద్ బిన్ హరోల్ (రహ్మాలై) నమాజును వదిలేసినవాణ్ణి కాఫిర్ అన్నారు. ఇమామ్ షాఫయీ (రహ్మాలై) ఇలాంటి వ్యక్తిని హతమార్చమన్నారు. ఇమాం అబూహనీఫా (రహ్మాలై) అతన్ని తౌబా చేయనంతవరకు ఖైదులో ఉంచమన్నారు.

## నమాజు చేసేదెలా

దివ్యగ్రంథంలో నమాజు ప్రస్తావన వచ్చిన చోటల్లా, కేవలం నమాజుచేసే ఆజ్ఞ

మాత్రమే లేదు. దాన్ని స్థాపించడం (అకామతిస్సలాత్), నమాజును పరిరక్షించడం (హిఫాజతిస్సలాత్) అనే ఆదేశాలు ఇవ్వబడ్డాయి. అంటే నమాజును సక్రమంగా, మనస్సు లగ్నంచేసి చెయ్యడం మరియు దానిలో ఎలాంటి అంతరాయంగాని, లోపంగాని రానివ్వకపోవడం అని అర్థం. ఇలాంటి అంతరాయం, లోపాలు శారీరక అవయవాలద్వారా ఉత్పన్నమైనా సంకల్పంలోనూ శ్రద్ధాసక్తుల్లో ఏర్పడినా–నమాజ్‌ను సకల చెడులకు దూరంగా పరిశుద్ధంగా ఉంచాలి. అందుకే నమాజు చేసేటప్పుడు అనవసరంగా కాళ్ళు చేతులు ఆడించడం, శరీరాన్ని గోక్కోవటం, అటుఇటు ఓర చూపుల్తో చూడడం తగదు. వీటివల్ల ఏకాగ్రతకు భంగం వాటిల్లుతుంది.

నమాజుచేసే వ్యక్తి నమాజుచేసే ముందు పరిశుద్ధుడు కావాలి. ఆ తరువాత సక్రమంగా వుజూ చేయాలి. నమాజుకై నిలబడితే దానికి సంబంధించిన ప్రతి అంశాన్ని (రుక్న్)ను స్థిమితంగా నెరవేర్చాలి. అతని మనస్సు ప్రాపంచిక విషయాల్లో లీనం అయ్యేబదులు దైవంవైపు లగ్నంకావాలి. ఏదేని ఇహలోక సంబంధమయిన ఆలోచనవస్తే దాన్ని దూరం చేసి మనస్సును దైవం వైపునకే మరల్చాలి. దీన్నే షరీఅత్ పరిభాషలో 'ఖుషూ' (ఏకాగ్రత) మరియు హుజూరె ఖల్బ్ (ధ్యానోన్ముఖ స్థితి) అని అంటారు. ఖుషూతో నమాజ్ చేసేవారిని తన గ్రంథంలో అనేక చోట్ల ప్రశంసించాడు అల్లాహ్. ఖుషూ మరియు హుజూరె ఖల్బ్ లేకుండా నమాజు చేసేవారిని గురించే దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. "చాలా మందికి నమాజులో కష్టం మరియు శ్రమ తప్ప మరేమీ ఉండవు." మరో ప్రవచనంలో దైవప్రవక్త ఇలా సెలవిచ్చారు, "దైవారాధన చేసేటప్పుడు (నమాజు చేసే టప్పుడు) మీరు ఆయన్ని (దైవాన్ని) చూస్తూ ఉన్న భావంతో చేయండి. మీరు ఆయన్ని చూడకపోయినా ఆయన మాత్రం మిమ్మల్ని చూస్తూనే ఉన్నాడు." (ముస్లిం)

అంటే మీ హ్రస్వ దృష్టి ఆయన ప్రభుసత్తాను, ఆయన శక్తియుక్తులను కానలేక పోయినా, ఆయన సువిశాల దృష్టి నుండి ఏ వస్తువు మరుగుపడలేదు కదా అని అర్థం. ఈ భావన ప్రతి ముస్లింకు సర్వావస్థల్లో ఉండవలసిందే. ఒకతను మహాప్రవక్త (సఅసం) ఎదుట నమాజు చేశాడు కాని నమాజులోని ఏ అంశాన్నీ అతడు సక్రమంగా నెరవేర్చలేదు. ఏకాగ్రత (ఖుషూ) అంతకంటే లేదు. ఆ వ్యక్తి చేత మహాప్రవక్త (సఅసం) అదే నమాజును మూడుసార్లు చేయించారు. చేయించిన ప్రతిసారి ఆయన ఇదే సెలవిస్తూపోయారు, 'నమాజు చెయ్యి, నీవు నమాజు చేయలేదు" అని. (అబూదావూద్, తిర్మిజి)

## నమాజువల్ల కలిగే ప్రయోజనాలు

నమాజు వల్ల కలిగే ప్రయోజనాలు ఎనలేనివి.

(1) నమాజులోని తహారత్ (శుచి, శుభ్రత) అనే షరతు ముస్లింను ఎల్లవేళలా పరిశుద్ధంగా

ఉండడం నేర్పుతుంది.

(2) నమాజులో శరీరాన్ని కప్పడం (ఆచ్ఛాదన) అనే షరతు మనిషిలో సిగ్గు, బిడియాన్ని, సభ్యతా సంస్కారాలను సృజిస్తుంది.

(3) వుజూలో పాటించవలసిన షరతులు మరియు 'మిస్వాక్' తాకీదు మనిషి ఆరోగ్యంపై సత్ప్రభావాన్ని వేస్తాయి.

(4) నమాజులోని క్రమశిక్షణ (Punctuality)మనిషికి ఎల్లవేళలా, ప్రతి పనిని దాని నిర్ణీత సమయంలోనే చేసే గుణాన్ని అలవరుస్తుంది.

(5) తెల్లవారుజామున చేసే నమాజు మనిషిని వేకువనే మేల్కొలిపే అలవాటును కలుగజేస్తుంది.

(6) నమాజు మనిషిని చెడు ఆలోచనలకు దూరం చేస్తుంది.

ఈ ప్రయోజనాలు మనిషి శరీరానికి, ఆరోగ్యానికి సంబంధించినవి. నమాజు యొక్క నైతిక మరియు ఆధ్యాత్మిక ప్రయోజనాలు వీటికంటే ఎన్నోరెట్లు అధికం.0

(1) నమాజు చేయడం అంటే దేవుని ఏకత్వాన్ని, ఆయన పోషణ గుణాన్ని అంగీకరిస్తూ ఆయన ఔన్నత్యాన్ని చూడటమే.

(2) నమాజులో మనిషి అల్లాహు అక్బర్ అని అంటాడు. అంటే అతడు ఒక్క అల్లాహ్ తప్ప ఈ ప్రపంచంలోని ఏ శక్తి కూడా గౌరవాదరణలకు తగినది కాదని, ఆయనకంటే ఉన్నతమయింది కాదని ప్రకటిస్తాడన్నమాట. ఈ ప్రకటన మూలంగా మనిషి హృదయంలో, ఆయన తప్ప మరేదీ తన అవసరాన్ని తీర్చలేదు అనే నమ్మకం, విశ్వాసం ఏర్పడుతుంది.

(3) ఇదే విధంగా ప్రతి 'రకాతు' నమాజులో 'ఫాతిహా సూరా' పఠనం, నమాజులో చేసే దుఆలు – అన్నీ దేవుని ఔన్నత్యాన్ని, ఆయన ఆధిక్యతను ఇంకా మనిషి యొక్క శక్తివిహీనతను, అసహాయతను చాటుతుంటాయి. దేవుడు ఆరాధ్యుడన్న భావాన్ని, మనిషి దాసుడన్న సత్యాన్ని గ్రహించడంకంటే ప్రయోజనకరమయిందే ముంది?

(4) "నమాజు చెడు మరియు అశ్లీలంనుండి కాపాడుతుంది" అని దివ్యగ్రంథంలోనే చెప్పబడింది.

(5) నమాజుద్వారా సహనం, కృతజ్ఞతాభావం అనేవి అలవడి వృద్ధిపొందుతాయి.

(6) "కష్టాల్లో నమాజుద్వారా సహాయం పొందండి" అంటుంది దివ్య గ్రంథం.

(7) మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ఏ వ్యక్తి అయితే అయిదు పూటలా నమాజు క్రమం తప్పకుండా నెరవేరుస్తాడో అతడు దేవుని శరణులో ఆయన

అనుగ్రహ శాంతిలోకి ప్రవేశిస్తాడు." అంతిమ దైవప్రవక్త (సఅసం) నమాజు ప్రయోజనాలను గూర్చి సెలవిస్తూ ఓ చక్కటి ఉదాహరణ ఇచ్చారు. ఆయన ఓ రోజు తన అనుచరులనుద్దేశించి, "మీలో ఎవరి గడప ముందయినా ఓ పరిశుద్ధ మయిన, నిర్మలమయిన సెలయేరు ప్రవహిస్తూ ఉండి, అందు అతడు అయిదు పూటలా స్నానం చేస్తూ ఉంటే అతని శరీరంపై మురికి ఏదయినా మిగులు తుందా?" అని ప్రశ్నించారు. లేదు, మహాప్రవక్తా (సఅసం) అని సహచరులు (ర.అన్) బదులు పలికారు. "అయిదు పూటల నమాజులు కూడా అంతే. అల్లాహ్ దీని కారణంగా అనేక పాపాలను పరిహరిస్తాడు, మన్నింపు ప్రసాదిస్తాడు" అన్నారు మహాప్రవక్త (సఅసం). (మిష్కాత్)

మొత్తానికి నమాజువల్ల మనిషి శరీరమే కాదు, అతని ఆత్మ, అతని మనస్సు, మస్తిష్కం సర్వం చెడులనుండి, చెడ్డ ఆలోచనలనుండి, చెడ్డ పనులనుంచి పరిశుభ్రమవు తాయి.

## నమాజు ఎవరికి ఫర్జ్‌గా విధించబడింది

ప్రాజ్ఞు(బాలిగ్)లయిన, తెలివి కలిగివున్న ప్రతి ముస్లిం స్త్రీ పురుషులకు నమాజు విధిగా నిర్ణయించబడింది. షరీఅత్ ప్రకారం, నమాజును తిరస్కరించినవాడు కాఫిర్, మరియు ఫర్జ్‌గా నమ్ముతూ ఎలాంటి కారణం లేకుండా మానుకున్నవాడు ఫాసిఖ్ (పాపి) మరియు ఘోరమయిన అపరాధి.

## నమాజు ఫర్జ్‌గా చేయబడిందెప్పుడు

హిజ్రత్‌కు ఒకటిన్నర లేక రెండు సంవత్సరాలకు పూర్వం మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు మేరాజ్ సంప్రాప్తమయింది. అంటే అల్లాహ్ ఆయన్ను తన సన్నిధికి ఆహ్వానించాడు. తిరుగు ప్రయాణంలో కానుకగా ఆయనకు అయిదు పూటల నమాజ్ ఆదేశాన్ని ఇచ్చాడు. మేరాజ్ నుండి తిరిగి వచ్చిన తరువాత దైవదూత హజ్రత్ జిబ్రీల్ (అ.సలాం) ఆయన వద్దకొచ్చి దైవాజ్ఞానుసారం, నమాజు వేళల్ని మరియు దాన్ని చేసే పద్ధతిని ప్రత్యక్షంగా నేర్పారు. (అబూదావూద్, తిర్మిజి)

## ఫర్జు నమాజుల సంఖ్య

ప్రతి రోజు రేయింబవళ్ళలో ఐదు పూటల నమాజు ఫర్జ్ చేయబడింది. ఆ నమాజులు ఇవి: (1) ఫజ్ర్ (2) జుహ్ర్ (3) అస్ర్ (4) మగ్రిబ్ (5) ఇషా.

ఈ నమాజుల వేళలు కూడా ఖరారు చేయబడ్డాయి. ఒకవేళ ఆ సమయం కంటే

ముందే నమాజు చేస్తే ఆ నమాజు నెరవేరదు. దివ్యగ్రంథం ఖుర్ఆన్‌లో ఇలా చెప్పబడింది.

"నిశ్చయంగా నమాజు ముస్లిములకు నిర్ణీత కాలం ప్రకారం ఫర్జ్ చేయబడింది." (నిసా)

إِنَّ الصَّلٰوةَ كَانَتْ عَلَى الْمُؤْمِنِيْنَ كِتٰبًا مَّوْقُوْتًا (نساء)

నమాజు వేళలకు ఎంత ప్రాధాన్యత ఇవ్వబడిందంటే, నమాజు ఫర్జ్ కాగానే హజ్రత్ జిబ్రీల్ (అ.సలాం) మహాప్రవక్త వద్దకువచ్చి రెండు రోజుల వరకు వేళ ప్రకారం నమాజును చేయించారు. చూపబడిన ఈ వేళల ప్రకారమే మహాప్రవక్త (సఅసం) మరియు ఆయన సహాబాలు (ర.అన్) (అనుచరులు) నమాజును చేసేవారు. ఇతర ఇమాములు కూడా దీని వెలుగులోనే సమయాన్ని, ఆ సమయాల గుర్తుల్ని నిర్ధారించి చెప్పారు.

## నమాజు వేళలు

ఫజ్ర్ నమాజు వేళ తొలి పొడుపు (సుబ్హెసాదిక్) వేళ నుండి సూర్యోదయం అయ్యేంత వరకు; జుహ్ర్ నమాజు వేళ మధ్యాహ్నం సూర్యుడు పశ్చిమ దిశకు వాలినప్పటి నుండి వస్తువుల నీడలు వాటి అసలు నీడకు రెండింతలు అయినంతవరకు; అస్ర్ నమాజు వ్యవధి జుహ్ర్ వేళ ముగిసినప్పటినుండి సూర్యాస్తమయం అయ్యేంతవరకు ఉంటుంది. మగ్రిబ్ నమాజువేళ సూర్యాస్తమయమయినప్పటి నుండి మొదలయి పశ్చిమాన అరుణ కాంతి మాయమయ్యేంత వరకు ఉంటుంది. ఇక ఇషా నమాజు వేళ ఆ అరుణ కాంతి మాయ మయినప్పటి నుండి మొదలుకుని తిరిగి తొలి పొడుపు అయ్యేంతవరకు ఉంటుంది.

గమనిక: తొలి పొడుపు అనేది సూర్యోదయానికి ఒక గంటా ఇరవయి నిమిషాల ముందే ప్రారంభం అవుతుంది. కాబట్టి ఫజ్ర్ నమాజును సూర్యోదయానికి గంటంబావు ఉన్నప్పుడు చేయవచ్చు. అదే విధంగా సూర్యాస్తమయం తరువాత పశ్చిమాన అరుణ కాంతులు దాదాపు గంటంబావు వరకు ఉంటాయి. కాబట్టి ఇషా నమాజును సూర్యాస్తమయం అయిన గంటంబావు తర్వాత చేయవచ్చు. అయితే గంటన్నర తర్వాత చేయడమే మంచిది.

ఆరు నెలల పగలు మరియు ఆరు నెలల రాత్రి ఉన్న ప్రదేశాల్లో నమాజు ఎలా చేయాలి అనే ప్రశ్న ఉత్పన్నం కాకమానదు. ప్రపంచంలో అనేక ప్రదేశాల్లో ఆరేసి నెలల పగలు, ఆరేసి నెలల రాత్రులుగల ధృవ ప్రాంతాలు ఉన్నాయి. అనేక ప్రదేశాల్లో సూర్యోదయానికి, సూర్యాస్తమయానికి మధ్య కేవలం ఒక గంటన్నర కాల వ్యవధే ఉంటుంది. ఇలాంటి సందర్భాల్లో కొందరు నమాజు యొక్క అవసరాన్ని అంగీకరించరు. అయినా ఓ హదీసు ప్రకారం అలాంటి చోట కూడా నమాజు తప్పక చేయవలసిందే అని ప్రస్ఫుటంగా తెలుస్తోంది. ఆ హదీసు ప్రకారం సుదీర్ఘమయిన రేయింబవళ్ళ ప్రదేశాల్లో అంచనా ప్రకారం

నమాజులు చేసుకోవాల్సిందే. ఈ ప్రవచనం (హదీసు) 'హదీసె దజ్జాల్'గా గుర్తించబడింది. ఇది తిర్మిజీ గ్రంథంలో వ్రాయబడి హజ్రత్ నవాస్ బిన్ సమ్ఆన్ (ర.అన్)చే ఉల్లేఖించబడింది. ఆ ప్రవచనం ఇలా ఉంది:

"మహాప్రవక్త (సఅసం) దజ్జాల్ గురించి అడిగినప్పుడు మేము ఆయన్ని అడిగాము. దైవ ప్రవక్తా! అతడు భువిలో తన దుష్ట ప్రవర్తనతో కల్లోలం సృష్టిస్తూ ఎన్ని రోజులుంటాడు? అని. దానికి ఆయన (సఅసం) "నలభయి రోజులు" అని సమాధానమిచ్చారు. ఆ తర్వాత మొదటి మూడు రోజుల గూర్చి వివరణ ఇస్తూ, మొదటి రోజు ఓ సంవత్సరానికి సమానం, రెండో రోజు ఒక నెలకు సమానం, మరియు మూడో రోజు ఓ వారానికి సమానం అన్నారాయన. దానిని మేము ఆయన్ని, ఓ దైవప్రవక్తా (సఅసం)! ఒక సంవత్సరానికి సమానమయిన రోజున ఒక రోజుకు సరిపడ నమాజులు చేస్తే సరి పోతాయా అని అడిగాం. మా ప్రశ్నకు సమాధానమిస్తూ "లేదు అంచనాతో ఐదు పూటల నమాజుల్ని చేయాల్సిందే" అన్నారు మహాప్రవక్త (సఅసం).

*(మిష్కాత్ దజ్జాల్ ప్రస్తావన)*

قلنا يا رسول الله وما لبثه في الارض قال اربعون يوما يوم كسنة ويوم كشهر وسائر ايامه كايامكم قلنا يا رسول الله فذلك اليوم الذي كسنة أيكفينا فيه صلاة يوم قال لا اقدروا له قدره۔

(مشكوة ذكر دجال)

ఈ హదీసు ప్రకారం ఈ సమస్య 'ఇజ్తిహాది' అంటే 'అనువర్తనా కృషికి' సంబంధించింది కాదు. ఇది గట్టి ఆధారంగల (మన్సూస్) సమస్య అయింది.

ఈ ప్రవచనం దజ్జాల్‌కు సంబంధించిందే అయినా దీని ఆజ్ఞ, ఆదేశం మాత్రం సర్వసాధారణం. రోజా విషయంలో కూడా ఈ ఆదేశాలే వర్తిస్తాయి. అలాంటి ప్రదేశాల వారు అంచనా ప్రకారమే రోజాలు పాటించవలసివస్తుంది. అంతే సమీప దేశాలు, ప్రదేశాల్లో ఎంత ఎంత సుదీర్ఘమయిన పగలుంటుందో దాన్ని దృష్టిలో ఉంచుకునే రోజా సమయాన్ని నిర్ణయించుకోవలసి ఉంటుంది. అయితే రోజాను నమాజులా భావించడం భావ్యమా కాదా అనే దానిపై ఇతర ధర్మవేత్తల్ని సంప్రదించడం మంచిది. నా దృష్టిలో మాత్రం, ఈ హదీసు ఆధారంగా నమాజును రోజాలా భావించడంలో ఎలాంటి అభ్యంతరం లేదు.

## గడియారం, క్యాలెండర్ల సహాయంతో నమాజు వేళల్ని నిర్ధారించడం

గడియారం, క్యాలెండరు వాడకం ప్రాచీన కాలం నుండే వస్తోంది. కాని నమాజు వేళల్లో వీటి ఉపయోగం ప్రాచీన కాలం నుండి మాత్రం జరగడం లేదు. ప్రస్తుత కాలంలో క్యాలెండరు మొదలయినవాటిలో నమాజు సమయాల నిర్ధారణ జరుగుతూనే ఉంది. ఈ విషయం ఖగోళ శాస్త్రానికి సంబంధించింది. ఈ శాస్త్రం అతి ప్రాచీనమయినదే అయినా, ఆధునిక దూరదర్శినులు (టెలిస్కోపులు) మరియు ఇతర పరికరాల ఆవిష్కరణల తరువాత మరింత ప్రగతి సాధించింది. దీనిప్రకారమే మన గడియారాలు తయారు చేయబడు తున్నాయి. కాబట్టి వేధశాలల (అబ్జర్వేటరీస్) పరిశీలన ప్రాతిపదికగా నమాజు వేళల్ని నిర్ణయించి క్యాలెండర్లు తయారుచేస్తే అవన్నీ సరయినవే. వీటి వాడకంలో ఎలాంటి ధార్మిక అభ్యంతరం లేదు. ఇదే కాదు, దైవం మనకు సమకూర్చిన సదుపాయాల ప్రకారం నమాజు చేసేవారి సమయం ఎంతో పొదుపు కూడా అవుతుంది. ధార్మిక విషయాల్లో ఉపయోగపడే ఇలాంటి వనరులన్నీ ఎంతో శ్లాఘనీయమయినవి మరియు ప్రయోజనకర మయినవే.

## రైలు, విమానం, ఓడల్లో ఖిబ్లా దిశను నిర్ధారించడం

రైలు, విమానం మరియు ఓడల్లో నమాజు ప్రారంభించినప్పుడు ఖిబ్లా దిశ ఎటుందో తెలుసుకోవడం ఎంతో ముఖ్యం. ఖిబ్లా దిశను తెలుసుకోవడానికి కంపాస్ లేక దిక్సూచి ఉపయోగించాల్సిందే ఈ ప్రయాణాల్లో. అయితే కేవలం కంపాస్ దిక్కుల్ని మాత్రమే సూచించేదిగా ఉండకూడదు. ప్రత్యేకంగా ఖిబ్లా దిశ (కాబా గృహం దిశ)ను చూపించే సదుపాయంగలదై ఉంటే మంచిది. ఖిబ్లా ఫలానావైపు ఉంది అని చూపెట్టే వ్యక్తిగాని లేక పరికరంగాని ఏవీ లేక, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి చూచి ఖిబ్లా దిశను కనుగొనే వీలు కూడా లేనప్పుడు మాత్రం, ఖిబ్లా తప్పక ఫలానా వైపునే ఉంటుంది అని దృఢంగా భావించి నమాజు చేయాలి. తరువాత అనుకున్నది తప్పు అని తెలిసిన నమాజ్‌ని తిరిగి చేస్తే మంచిదే. కాని అలా తిరిగి చేయకున్నా ఆ వ్యక్తి నమాజ్ నెరవేరినట్లే. దారుల్ ఉలూమ్ దేవ్‌బంద్ మాజీ 'ముఫ్తీ' అయిన మౌలానా అజీజుర్రహ్మాన్‌గారి సలహా ధర్మంలోగల సౌలభ్యాన్ని అద్దం పట్టేదిగా ఉంది. ఆయన రైలు ప్రయాణంలో నమాజు చేయడం గురించి ఇలా రాస్తున్నారు, "ఒక వేళ రైల్లో గుంపు ఎక్కువై, రుకూ, సజ్దాలు చేయడం వీలుకానట్లయితే అలాంటప్పుడు ఖిబ్లా వైపు తిరక్కుండానే, నిలబడకుండానే నమాజు చేయాలి." (ఫతావా దారుల్ ఉలూమ్, సంపుటం-2, పేజి 156)

విమానంలోను, ఓడపైనా నమాజు చేసే ఆదేశాలు కూడా, పడవపై నమాజు చేసే

అదేశాల్లాంటివే. 'అల్ ఫిక్హు అలల్ మజాహిబుల్ అర్‌బఅ' సంకలన కర్త షేక్ అబ్దుర్రహ్మాన్ ఇలా వ్రాస్తున్నారు.

"పడవలో నిలబడగానే పడిపోయే భయంఉన్నా లేక నిలబడడానికి ఎలాంటి వీలు లేకపోయినా అలాంటప్పుడు కూర్చునే ఎలా నమాజ్ చేయవచ్చో అదే విధంగా ఓడ మరియు విమానంలో కూడా కూర్చునే నమాజు చేయవచ్చు. "పడవ లోపల చేసే నమాజులో ఏ విధంగా సజ్దాలో నొసలు భూమిపై ఆనదో అదే విధంగా భూమిపై నొసలు ఆనని వాహనాల్లో సైతం ఏ వస్తువుపై సజ్దా చేసినా అది భూమిపై సజ్దా చేసినట్లే భూమిపై చేస్తేనే నమాజు నెరవేరుతుంది అనేది షరీఅత్ ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు.

## అయిదు పూటల నమాజుల్లోని ఫర్జ్‌లు మరియు సున్నత్‌ల సంఖ్య

'ఫజ్ర్' వేళలో నమాజ్ మొత్తం నాల్గు రక'తులు మొదట రెండు రక'తుల సున్నత్, ఆ తరువాత రెండు రక'తుల ఫర్జ్.

'జుహ్ర్' వేళలో మొత్తం పది రక'తులు చేయాలి. మొదట నాల్గు రక'తుల సున్నత్, తరువాత నాల్గు రక'తుల ఫర్జ్, అటుపై రెండు రక'తుల సున్నత్.

'అస్ర్' నమాజు వేళలో చేయవలసినవి మొత్తం రక'తులు నాల్గు ఫర్జ్. ఈ నమాజుకు ముందుచేసే నాలుగు రకాతుల నమాజ్ సున్నతె గైర్ ముఅక్కిద, 'మగ్రిబ్' నమాజులో మొదట మూడు రకాతుల ఫర్జ్, తరువాత రెండు రకాతుల సున్నత్.

'ఇషా' సమయంలో నాలుగు రకాతుల ఫర్జ్; తదుపరి రెండు రకాతుల సున్నత్ చేయాలి. ఇషా నమాజ్‌కు సంబంధించిన ఈ రెండు రకాతుల సున్నత్ తరువాత మూడు రకాతుల 'విత్ర్' నమాజ్ చేయడం ఎంతో అవసరం, విత్ర్ నమాజు వేళ, ఇషా ఫర్జ్ నమాజు పూర్తి చేసినప్పటి నుండి ఉషోదయం వరకు ఉంటుంది. ఈ అయిదు పూటల్లోను మొత్తం పదిహేడు రకాతుల ఫర్జ్, పన్నెండు రకాతుల సున్నతె ముఅక్కిదా మరియు మూడు రకాతుల విత్ర్ ఉన్నాయి. విత్ర్ నమాజ్ 'వాజిబ్'గా పరిగణించబడుతుంది.

ఇవి కాకుండా ప్రతి ఫర్జ్ నమాజుకు ముందు మరియు ఆ తరువాత ఎన్ని నఫిల్ నమాజులయినా చెయ్యవచ్చు. ఉదాహరణకు, ఇషాకు ముందు మరియు దాని తరువాత (విత్ర్ కంటే ముందు) నఫిల్ నమాజ్ చెయ్యవచ్చు. విత్ర్ తరువాతి రెండు రకాతుల నఫిల్ నమాజు కూర్చుని చేసేందుకు షరీఅత్‌లో ఆధారం లభిస్తుంది.

మగ్రిబ్ ఫర్జ్ నమాజుకు ముందు ఎలాంటి సున్నత్ నమాజు లేదు. అయితే ఫర్జ్ తరువాత చేసే రెండు రకాతుల సున్నతె ముఅక్కిదా కాకుండా ఆరు రకాతుల నఫిల్ నమాజు చేయడం మంచిది. కనీసం రెండు రకాతులయినా చేయాలి. ఇదే విధంగా జుహ్ర్

నమాజ్ వేళలో సున్నతె ముఅక్కిదా ముందు, దాని తరువాత నఫిల్ నమాజు చేయవచ్చు. కాని అస్ర్ ఫర్జ్ నమాజు పూర్తి అయిన తరువాత ఎలాంటి సున్నత్ నమాజు కాని, నఫిల్ నమాజు కాని చేయకూడదు. ఇదే విధంగా ఉషోదయం అయ్యాక, రెండు రకాతుల సున్నతె ముఅక్కిదా మరియు రెండు రకాతుల ఫర్జ్ నమాజు చేసి ఇంకే సున్నత్ నమాజు గాని, నఫిల్ నమాజుగాని చేయరాదు. ఫజ్ర్ వేళ ఫర్జ్ నమాజుకు, సూర్యోద యానికి మధ్య ఎలాంటి నమాజు లేదు. నఫిల్ నమాజులకు సంబంధించిన మరికొంత సమాచారం ముందు అధ్యాయాల్లో చెప్పబడుతుంది.

ప్రతి ఫర్జ్ నమాజుకు ముందు 'అజాన్' (నమాజుకు పిలుపు) ఇవ్వడం ముఖ్యం. కాబట్టి ఇక్కడ అజాన్ గురించి చెప్పడం కూడా అవసరమే.

## అజాన్ అంటే ఏమిటి?

'అజాన్' అనే పదానికి అర్థం తెలియజేయడం, ప్రకటించడం అని. షరీఅత్ పరిభాషలో ప్రతి రోజు ఫర్జ్ నమాజుల కంటే ముందు ప్రత్యేక పదాలతో (నమాజ్ చేసేవారిని) పిలువడానికి చేసే ప్రకటననుగాని, తెలియజేయడాన్నిగాని 'అజాన్' అని అంటారు. దివ్యగ్రంథం అయిన ఖుర్ఆన్‌లో నమాజు వైపునకు పిలిచే ప్రస్తావన వచ్చింది. ఇంకా ఈ పిలుపుకు సంబంధించిన పదాలు వాటిని పలికే పద్ధతి కూడా చూపెట్టారు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం).

## అజాన్ ఎప్పుడు ప్రారంభం అయింది

ప్రారంభంలో సమయాన్ని అంచనాకట్టి ఒకచోట సమావేశమయి నమాజు సలిపేవారు. హిజ్రీ శకం రెండో సంవత్సరంలో మహాప్రవక్త (సఅసం) నమాజు కోసం ఓ పద్ధతి ప్రకారం పిలుపునిచ్చే ఆజ్ఞ ఇచ్చారు. "అస్సలాతుల్ జామియా" అనేవి అప్పుడు ఆ పిలుపుకు ఉపయోగించబడ్డ పదాలు. కొన్ని రోజుల తరువాత మహాప్రవక్త (సఅసం), కొందరు సహచరులకు కలల్లో సూచించబడినదాని ఆధారంగా ప్రస్తుతం అమల్లో ఉన్న అజాన్ పదాలను నిర్ధారించారు.

## అజాన్ ఘనత

అంతిమ దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. "ముఅజ్జన్ (అజాన్ పిలుపునిచ్చేవాని) అజాన్ ధ్వని ఎక్కడివరకయితే వినవస్తుందో ఆ ప్రదేశంలోని ప్రతి వస్తువు ప్రళయ దినం నాడు (ఆ పిలుపుకు) సాక్ష్యం ఇస్తుంది." మరో సందర్భంలో ఆయన (సఅసం) ఇలా ప్రవచించారు.

"అంతిమ దినంనాడు (ప్రళయ దినంనాడు) అజాన్ పలికేవాని మెడ అందరికంటే ఉన్నతంగా కనబడుతుంది."

అజాన్ ఇస్లామియ చిహ్నాల్లో ఒకటి ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలై) ఇలా చెబుతూ ఉండేవారు. "ఒకవేళ ఏ బస్తీలో నివసించే ప్రజలయినా అందరూ అజాన్ పలకడం మానేస్తే నేను వారితో జిహాద్ చేస్తాను. ఒక్కడే అలా చేస్తే అతణ్ణి శిక్షిస్తాను, ఖైదు చేస్తాను." (రద్దుల్ ముహ్తార్)

## అజాన్ ఆదేశం

పురుషుల కోసం, ప్రతి ఫర్జ్ నమాజుకు పూర్వం అజాన్ పలుకడం సున్నతె ముఅక్కిదా. నమాజీ ఒక్కడే అయినా, అనేకులయినా: ప్రయాణంలో ఉన్నా స్థిర నివాసంలో వున్నా, వేళకు వేసినా, వేళ దాటిన తర్వాత కజా చేసినా, నమాజుకు పూర్వం అజాన్ పలకడం సున్నత్. కాని స్త్రీలు అజాన్ పలకడం మక్రూహె తహ్రీమి.

ఖజా నమాజు కోసం ఇద్దరు అంతకంటే ఎక్కువ మంది ఉంటేనే అజాన్ పలకాలి. ఒకవేళ మస్జిద్‌లోనే ఖజా నమాజు చేయవలసివస్తే, ప్రజల్లో ఆందోళన చెలరేగకుండా అజాన్ వినబడీ వినబడనట్లు మెల్లగా పలకాలి. ఒకే వ్యక్తి తన ఖజా నమాజు చేయదలిస్తే అతడు ఆ ఆజాన్ పలికే పనిలేదు.

జుమా రోజున రెండు అజాన్‌లు చెప్పడం అవసరం. ఒకటి ఖుత్బా (ప్రసంగం)కు ముందు, మరొకటి ప్రసంగం మొదలయ్యేటప్పుడు.

'ఈద్' (ఈదుల్ ఫిత్ర్ మరియు ఈదుల్ అజ్హా) నమాజులు మరియు నమాజె జనాజా లేక ఖననం తరువాత గోరీపై అజాన్ చెప్పడం మక్రూహె తహ్రీమి అని తెలుసుకోవాలి.

## అజాన్ పలుకులు మరియు దాని విధానం

అజాన్ చెప్పే 'మస్నూన్' (ప్రవక్త (సఅసం) సాంప్రదాయం) విధానం ఏమిటంటే, ఏదయినా ఎత్తు ప్రదేశంలో ముఅజ్జన్ నిలబడాలి. తన రెండు చూపుడు వ్రేళ్ళను చెవుల్లోనికి దూర్చి బిగ్గరగా ఈ పలుకులు (పదాలు) పలకాలి.

"అల్లాహు అక్బర్" (నాల్గు సార్లు) اَللّٰہُ اَکْبَرُ

"అష్హదు అంల్లా ఇలాహ ఇల్లల్లాహ్' (రెండు సార్లు) اَشْهَدُ اَنْ لَّآ اِلٰہَ اِلَّا اللّٰہُ

أَشْهَدُ أَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللهِ 'అష్హదుఅన్న ముహమ్మదర్రసూలుల్లాహ్' (రెండుసార్లు)

حَيَّ عَلَى الصَّلٰوةِ 'హయ్య అలస్సలాహ్' (రెండు సార్లు)

حَيَّ عَلَى الْفَلَاحِ 'హయ్య అలల్ ఫలాహ్' (రెండు సార్లు)

اَللهُ أَكْبَرُ 'అల్లాహు అక్బర్' (రెండు సార్లు)

لَا إِلٰهَ إِلَّا اللهُ 'లా ఇలాహ ఇల్లల్లాహ్' (ఒకసారి)

ఫజ్ర్ నమాజుకు సంబంధించిన అజాన్‌లో, 'హయ్యా అలల్ ఫలాహ్' రెండుసార్లు అన్న తరువాత 'అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్' రెండు సార్లు చెప్పడం కూడా సున్నతే (ప్రవక్త (సఅసం) ఆచారమే).

అజాన్ అయ్యాక ముఅజ్జిన్ మరియు ప్రతి ముస్లిం దరూద్ చదివాక ఈ క్రింది దువా చదవాలి.

## దువా

اَللّٰهُمَّ رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّامَّةِ وَالصَّلٰوةِ الْقَائِمَةِ اٰتِ مُحَمَّدَنِ الْوَسِيْلَةَ وَالْفَضِيْلَةَ وَابْعَثْهُ مَقَامًا مَّحْمُوْدَنِ الَّذِىْ وَعَدْتَّهٗ اِنَّكَ لَا تُخْلِفُ الْمِيْعَادَ ٥

"అల్లాహుమ్మ రబ్బ హాజిహిద్దావతిత్ తామ్మతి వస్సలాతిల్ ఖాయిమతి ఆతి ముహమ్మదనిల్ వసీలత వల్ ఫజీలత వబ్అస్హు మఖామమ్ మహ్మూద నిల్లజీ వ అద్తహు ఇన్నక లా తుఖ్లిఫుల్‌మీ ఆద్."

## ఇకామత్

నమాజ్ ప్రారంభించేముందు అజాన్ పలుకులు మరోసారి పలకడాన్నే ఇకామత్ అని అంటారు. ఇకామత్ అంటే "ఇప్పుడు నమాజు ప్రారంభం కానున్నది, నమాజీలంతా తమ తమ వరుసల్ని తీర్చిదిద్దుకోండి అని చెప్పే హెచ్చరిక అన్నమాట. ఇకామత్‌లో కూడా అజాన్‌లోని పలుకులే పలుకుతారు. కాకపోతే حَيَّ عَلَى الْفَلَاحِ 'హయ్య అలల్ ఫలాహ్'

తరువాత రెండు సార్లు **قد قامت الصلوة** 'ఖద్ ఖామతిస్సలాహ్' (నమాజు సిద్ధంగా ఉంది) అన్న మాటలు అనడం అవసరం. ఇకామత్‌లో **ముఅజ్జిన్ 'ఖద్‌ఖామతిస్సలాహ్'** అనగానే 'ఇఖామహల్లాహు వ  అదామహ' (అల్లాహ్ దీన్ని సుస్థిరం చేయుగాక, చిరస్థాయి చేయుగాక) అనడం సున్నత్.

## అజాన్ మరియు ఇకామత్ భాష

అజాన్ మరియు ఇకామత్‌ను, మహాప్రవక్త (సఅసం) ద్వారా ప్రవచించబడ్డ అరబీ భాషలోని ఆ ప్రత్యేక పదాల్లోనే పలకడం అవసరం. ఒకవేళ ఎవరయినా ఇతర ఏ భాషలోనో లేక అరబీ భాషలోని ఇంకే ఇతక మాండలికంలోనో అజాన్ పలికితే అజాన్ నెరవేరదు, ప్రజలు దాన్ని అజానే అని భావించినా సరే.

## అజాన్, ఇకామత్‌లోని సున్నత్‌లు మరియు దాని నియమాలు

(1) ఎత్తయిన ప్రదేశంలో నిలబడి ఖిబ్లా వైపుకు తిరిగి అజాన్ పలకడం సున్నత్.

(2) అజాన్ పిలుపునిచ్చేటప్పుడు రెండు చూపుడు వ్రేళ్ళను చెవులపై పెట్టుకోవడం ముస్తహబ్.

(3) అజాన్ పలుకులు బిగ్గరగా, ఆగి ఆగి చెప్పడం సున్నత్.

(4) హయ్యా  అలస్సలాహ్ అంటూ కుడి వైపుకు, హయ్యా అలల్ ఫలాహ్ అంటూ ఎడమ వైపుకు ముఖాన్ని త్రిప్పడం సున్నత్. ముఖాన్ని కుడి ఎడమలకు త్రిప్పేటప్పుడు ఎదురొమ్ము ఖిబ్లా వైపే ఉండేటట్లు జాగ్రత్తపడాలి. మెడను మాత్రమే త్రిప్పాలి.

(5) వుజూ చేసి అజాన్ పలకడం  ముస్తహబ్. కాని వుజూ లేకుండా అజాన్ పలికినా అది నెరవేరుతుంది. అయితే అలా చేయడం మంచిది కాదు. గుసుల్ చేసే అవసరం కలిగి, గుసుల్ చేయకుండానే అజాన్ పలికితే మాత్రం అది మక్రూహె తహ్రీమీ.

(6) అజాన్ పలికిన వ్యక్తే ఇకామత్ కూడా పలకాలి. హదీసులో ఇలా ఉంది. మహా ప్రవక్త (సఅసం) అజాన్ పలికిన వ్యక్తే ఇకామత్ పలకాలి అని  ప్రవచించారు. (తిర్మిజి). కాని ముఅజ్జిన్‌కు ఎలాంటి అభ్యంతరంకాని ఆక్షేపణకాని లేకపోతే అతని అనుమతితో ఇతరులు కూడా ఇకామత్ చెప్పవచ్చు.

## అజాన్‌లో మక్రూహ్, చేయకూడనివి

(1) అజాన్ చెప్పేవాడు ప్రాజ్ఞుడు, మతిస్థిమితం గలవాడయి ఉండాలి. ఉన్మాదులు,

పరిపక్వత లేని బాలురు అజాన్ పలకడానికి అనర్హులు. ఇది మక్రూహ్. స్త్రీలు అజాన్ పలకడం మక్రూహె తహ్రీమీ. ఒకవేళ పిల్లలయినప్పటికీ, మంచి చెడ్డల తారతమ్యం తెలిసిన తెలివయిన పిల్లలతో అజాన్ పలికిస్తే అజాన్ నెరవేరుతుంది. కాని స్త్రీ అయినా లేక మరీ చిన్న పిల్లవాడయినా అజాన్ పలికితే అలాంటి అజాన్‌ను తిరిగి పలకవలసి వస్తుంది.

(2) మస్జిద్‌లో నమాజ్ చేసే ఆవరణలో నిలబడి అజాన్ పలకకూడదు. అయితే బయట ఏదైనా ఎత్తయిన ప్రదేశంలో నిలబడి అజాన్ పలుకవచ్చు. ఎవరయినా మస్జిద్ ఆవరణలోనే అజాన్ పలికితే వారితో వాదులాడటం భావ్యం కాదు.

(3) నమాజ్ వేళ కంటే ముందే అజాన్ పిలుపు ఇవ్వకూడదు.

(4) కూర్చుని అజాన్ చెప్పడం మక్రూహె తన్జీహి.

(5) జుమా నమాజుకు సంబంధించిన మొదటి అజాన్ తరువాత ఏ విధమయిన ప్రాపంచిక పని పాటల్లో, వ్యాపారంలో పాల్గొనడం మక్రూహె తహ్రీమీ.

(6) మస్జిద్‌కు కుడి ప్రక్కన, లేక ఎడమ ప్రక్కన నిలబడి అజాన్ పలుకవచ్చు. ముస్లిముల జన సంఖ్య మస్జిద్‌కు ఎటు వైపు ఎక్కువగా ఉంటుందో అటు వైపు నిలబడి అజాన్ పలకడం ఉత్తమం. చాలా మంది మస్జిద్‌కు ఎడమ వైపునే నిలబడి అజాన్ పలకాలని అంటారు. ఇది అజ్ఞానం.

## ముఅజ్జిన్ ఎలాంటివాడయి ఉండాలి?

అజాన్ పిలుపు ఆధారంగానే, నమాజు, రోజాలు చేస్తారు. కాబట్టి ఆయా వేళల్ని పూర్తిగా ఆకళింపు చేసుకున్నవాడు, తెలివైనవాడు, దూరదృష్టి కలవాడు, ధార్మికుడు, మరియు సన్మార్గుడైన వ్యక్తినే ముఅజ్జిన్‌గా ఎన్నుకోవాలి. దీనికితోడు అతడు అజాన్ నియమాలను తెలుసుకున్నవాడయి ఉండాలి. దురాచారి, తప్పులు చేసేవాడు అజాన్ పలకడం మక్రూహ్ అవుతుంది. (ఆలమ్‌గీరి)

**"మీలో మంచివారు, ధార్మికులయినవారే అజాన్ ఇవ్వాలి"** ليوذن لكم خياركم

అని మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రవచించారు.

## అజాన్‌కు బదులు పలకడం

అజాన్ పిలుపు వినబడేటప్పుడు దానికి బదులివ్వడం ముఖ్యం. అజాన్‌కు రెండు విధాలుగా బదులివ్వాలి. ఒకటి ఆచరణ ద్వారా, రెండోది నోటిద్వారా.

(1) ఆచరణద్వారా ఇచ్చే జవాబు, వెంటనే నమాజుకు వెళ్ళడానికి సిద్ధం అవడం, మసీదుకు చేరే ప్రయత్నం చేయడం.

(2) నోటిద్వారా సమాధానమివ్వడం అంటే నోటితోనూ అజాన్ పలుకుల్ని తిరిగి పలకడం అన్నమాట ఇలా చేయడం సున్నత్. అంటే ముఅజ్జిన్ పలికే వాటినే మీరు మెల్లగా నోటితో పలకడమన్నమాట. కాని ముఅజ్జిన్ హయ్యి అలస్సలాహ్ లేక హయ్యి అలల్ ఫలాహ్ అన్నప్పుడు మీరు దానికి బదులు "లా హౌల వలాఖువ్వత ఇల్లా బిల్లాహ్" అనాలి. దీని అర్థం, 'పాపాల నుండి రక్షణకు, పుణ్యం చేసుకొనే బుద్ధికి, శక్తికి అల్లాహ్ సహాయ సహకారాలు తప్ప మార్గం లేదు" అని.

ఇదే విధంగా ఫజ్ర్ నమాజులో ముఅజ్జిన్ اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్ అనగానే దానికి బదులు صدقت وبررت 'సదఖ్త వ బరర్త' అని పలకాలి.

ఇకామత్ పలుకుల్ని కూడా తిరిగి పలకడం ముస్తహబ్. ఇకామత్‌లో ముఅజ్జిన్ 'ఖద్‌ఖామతిస్సలాహ్ అంటే సమాధానంగా قد اقامها الله وادامها 'ఖద్ అఖామహల్లాహు వ అదామహా' అనాలి.

## అజాన్‌కు సమాధానం ఇవ్వకూడని సందర్భాలు

1) నమాజు చేసేటప్పుడు

2) మల మూత్ర విసర్జన సమయంలో 3) జుమా ఖుత్బా (ప్రసంగం) జరిగేటప్పుడు

4) భోజనం చేస్తూ ఉండగా 5) దివ్యఖుర్ఆన్ పారాయణం చేసేటప్పుడు లేక ధార్మిక గ్రంథాధ్యయనం చేసేటప్పుడు.

పై సందర్భాలన్నిటిలోను అజాన్ పిలుపుకు సమాధానం ఇవ్వనక్కరలేదు.

(6) మస్జిద్‌లో ఉన్నవాడు తన నోటితో సమాధానం పలకడం ముస్తహబ్. ఒకవేళ అతడు దానికి సమాధానం పలకకున్నా సున్నత్‌కు విరుద్ధం కాదు. కారణం అతడు మస్జిద్‌కు వచ్చి ఆచరణ రూపేణ అజాన్ పిలుపునకు సమాధానం ఇచ్చాడన్న మాట.

ఒకే ముఅజ్జిన్ రెండు చోట్ల అజాన్ పలకడం మక్రూహె తహ్రీమీ.

(ఫతావా రహీమియా)

## వేళకు ముందే అజాన్

నమాజు వేళ కాకముందే ఆ నమాజు కోసం అజాన్ ఇవ్వడం సరికాదు. కాని దానివల్ల నమాజుపై ఎలాంటి ప్రభావం పడదు. అయితే ధార్మికవేత్తల అభిప్రాయ భేదాలున్న నమాజు వేళల్లోగనకా అజాన్ ఇస్తే దాన్ని తిరిగి ఇచ్చే పని లేదు.

## అజాన్ అయ్యాక

عن عثمان قال قال رسول الله صلى الله عليه وسلم من ادرك الاذان فى المسجد ثم خرج لحاجة وهو لا يريد الرجعة فهو منافق۔
(ابن ماجہ ص۵۴)

అజాన్ పిలుపు తరువాత, ఎలాంటి ధార్మికమయిన అవరోధం (ఉజరె షరయీ) లేకుండా, లేక తిరిగి వచ్చే ఉద్దేశ్యం లేకుండా మస్జిద్ నుండి బయటకు వెళ్ళడం మక్రూహె తహ్రీమి. హదీసులో అలాంటి వ్యక్తిని 'మునాఫిక్'గా పేర్కొనడం జరిగింది. మహాప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు. "ఏ వ్యక్తి అయితే అజాన్ అయిన తరువాత తిరిగి వచ్చే ఉద్దేశ్యం లేకుండా మస్జిద్‌నుండి బయటకుపోతాడో అతడు మునాఫిక్." (ఇబ్నెమాజా)

నమాజ్ ప్రయోజనాలు, దాని వేళలు మరియు అజాన్ వగైరాలను గురించి వివరంగా చర్చించడం జరిగింది. ప్రస్తుతం నమాజ్‌లో 'ఫర్జ్' మరియు 'వాజిబ్'లను గూర్చి ఇక్కడ తెలుసుకుందాము.

## నమాజులో ఫర్జ్‌లు (విధిగా నెరవేర్చవలసిన అంశాలు)

నమాజ్‌లో పదమూడు విషయాలు ఫర్జ్ అయినవి. ఏడు అంశాలు నమాజ్‌కు పూర్వం చెయ్యవలసినవి. ఆరు నమాజ్ చేసేటప్పుడు పాటించవలసినవి. నమాజుకు పూర్వం ఆచరించవలసిన వాటిని షరతులని (షరాయితె నమాజ్) అంటారు. నమాజు చేసేటప్పుడు పాటించవలసిన ఫర్జ్‌లను 'అర్కానె నమాజ్' అని అంటారు.

## షరాయితె నమాజ్

నమాజ్ నిబంధనలు మొత్తం ఏడు. ఈ ఏడు షరతుల్లో ఒక్కటయినా నెరవేకపోతే అసలు నమాజే నెరవేరదు.

(1) వేళ ప్రకారం నమాజు చేయడం. ఒకవేళ నిర్ణీత సమయంకంటే ముందో లేక ఆ సమయం దాటిపోయిన తరువాతో నమాజు చేసినా అది నెరవేరదు.

(2) శరీరం పరిశుద్ధంగా ఉండడం. అంటే నమాజు చేసే వ్యక్తి శరీరాన నజాసతె హకీకి. నజాసతె హుక్మి రెంటికి దూరంగా పరిశుద్ధమయి ఉండాలి. అంటే వుజూ లేకపోయినట్లయితే వుజూ చేసుకోవాలి. గుసుల్ చేసే అవసరముంటే గుసుల్ చేసుకోవాలి. శరీరంపై ఏదయినా అశుద్ధ పదార్థం అంటిఉంటే దాన్ని కడిగి శుభ్రపరచుకోవాలి.

(3) వస్త్రాలు పరిశుభ్రంగా ఉండడం. అంటే నమాజుచేసే వ్యక్తి యొక్క వస్త్రాలపై నజాసతె గలీజా లేక నజాసతె ఖఫీఫా అంటి ఉంటే దాన్ని కడిగివేయాలి.

(4) నమాజుచేసే స్థలం పరిశుద్ధంగా ఉండడం. అంటే నమాజు చేయడానికి నిలబడే ప్రదేశం పరిశుద్ధంగా ఉండాలన్నమాట. వ్యక్తి తాను నమాజుచేసే జాయ్‌నమాజ్ లేక చాప పరిశుద్ధంగా ఉండాలి.

(5) సత్రె ఔరత్. అంటే నమాజు చేసే వ్యక్తి శరీరం కనీస ఆచ్ఛాదన కలిగి ఉండడం. ఆచ్ఛాదన అంటే పురుషుడు కనీసం తన నాభి నుండి మోకాలి క్రింద వరకు కప్పి ఉంచే వస్త్రాన్ని ధరించడం. స్త్రీలు తమ చేతులు మణికట్ల వరకు, పాదాలు మరియు ముఖం తప్ప శరీరం అంతా కప్పే వస్త్రాలను ధరించాలి. ఒకవేళ పురుషుని చీలమండలు పూర్తిగా కనబడకుండా కప్పుకుపోయినా అతని నమాజు మక్రూహ్ అవుతుంది. అలాగే స్త్రీ చీలమండలు పూర్తిగా బయటపడినా నమాజ్ మక్రూహ్ అవుతుంది.

(6) ఖిబ్లా దిశకు అభిముఖంగా నిలబడడం.

(7) నమాజ్ నియ్యత్ చేయడం. నియ్యత్ అంటే మనస్సులో ఫలానా పని చేస్తున్నానని సంకల్పించుకోవడం. నోటితో పలికే అవసరం లేదు. అంటే ఎవరయినా నోటితో ఫలానా నమాజు చేస్తున్నాను అని అనకుండా కేవలం మనస్సులోనే ఫలానా నమాజు చెయ్యడానికి ఉపక్రమిస్తున్నానని అనుకున్నా సరిపోతుంది. ఈ సంకల్పం నోటితో పలికినా మంచిదే. ఇలా చేయడం వల్ల మనస్సుకు ఏకాగ్రత లభిస్తుంది.

ఇవి నమాజుకంటే ముందు పాటించవలసిన షరతులు. నమాజ్ చేసేటప్పుడు విధిగా పాటించవలసిన అంశాలు ఆరు. వీటిలోనూ ఏ ఒక్కటి వదలివేసినా మరచి పోయినా నమాజు నెరవేరదు. వీటిని అర్కానె నమాజ్ అనంటారని ముందే చెప్పడం జరిగింది.

## అర్కానె నమాజ్

(1) తక్బీరె తహ్రీమా. అంటే నమాజ్ ప్రారంభించేటప్పుడు 'అల్లాహు అక్బర్' అని అనడం.

(2) కియామ్. అంటే ఎలాంటి ఇబ్బంది లేకపోతే నిటారుగా నిలబడడం.

**(3)** ఖిరాత్ అంటే దివ్య ఖుర్ఆన్‌లోని మూడు చిన్నచిన్న ఆయత్‌లు (వాక్యాలు) లేక ఒక పెద్ద ఆయత్ పఠించడం.

(4) రుకూ చేయడం.
(5) రెండు సజ్దాలు చేయడం.
(6) ఖఅదమే అఖీరా (నమాజు చివరి ఖఅద)లో తషహ్హుద్ చదివినంతసేపు కూర్చోవడం.

## వాజిబాతె నమాజ్

నమాజులో ఫర్జ్ చేయబడిన అంశాలు తప్పిపోయినా, వదిలేసినా నమాజ్ నెరవేరదు. తిరిగి నమాజ్ చెయ్యవలసిందే. ఉదాహరణకు 'అల్లాహు అక్బర్' (తక్బీరె తహ్రీమా) అనడం మరిచిపోయినా లేక సజ్దా చేయకపోయినా లేక రుకూ చేయడం మరచిపోయినా ఇట్టి సందర్భాల్లో నమాజ్ నెరవేరదు. కాని నమాజులో ఏ అంశమైతే వాజిబ్ చేయబడిందో అది వదిలివేసినా లేక మరచిపోయినా నమాజు పూర్తిగా భంగపడదు, అయితే ఇలా జరగడంవల్ల నమాజులో ఓ లోపం ఏర్పడుతుంది. ఈ లోపాన్ని సరిదిద్దడానికి షరీఅత్‌లో, 'సజ్దాయే సహ్‌హూ' నియమించబడింది. దీన్నే (ఉచ్ఛారణా సౌలభ్యం కొరకు 'సహు సజ్దా' అనంటారు) అంటే మరపు కారణంగాచేసే సజ్దా అన్నమాట. సజ్దయే సహ్‌హూ చెయ్యవలసిన అవసరం కలిగితే అంటే అది 'వాజిబ్' అయిన పక్షంలో ఆ సజ్దా చేయకపోయినట్లయితే నమాజ్ భంగపడుతుంది; తిరిగి నమాజు చేసుకోవాలి. ఒకవేళ కావాలని వాజిబ్‌ను వదలివేసినా నమాజ్ భంగపడుతుంది. అలాంటి వ్యక్తి తిరిగి నమాజు చేసుకోవాలి. సజ్దయే సహు చేసే పద్ధతి ముందు వస్తున్నది. ఇక్కడ నమాజులో వాజిబ్‌గా ఖరారయిన అంశాలను పేర్కొంటున్నాము. వీటిని జాగ్రత్తగా మననం చేసుకోవాలి. ఈ విషయాలు జ్ఞప్తియందుండకపోవడంవల్ల చాలా మంది చేసే నమాజులు వారికి తెలియకుండానే అసంపూర్ణంగా ఉండిపోతున్నాయి.

## నమాజ్‌లోని వాజిబ్‌ల సంఖ్య మొత్తం పదహారు

1. ఫర్జ్ నమాజుల్లోని మొదటి రెండు రకాతుల్లో ఖిరాత్ (ఖుర్‌ఆన్ పఠనం) చేయడం.
2. ఫాతిహా సూరా పఠించడం. అంటే ఫర్జ్ నమాజుల మొదటి రెండు రకాతులలోనూ, సున్నత్ మరియు నఫిల్ నమాజుల అన్ని రకాతుల్లోను సూరయే ఫాతిహా చదవడం వాజిబ్ అన్నమాట.
3. నఫిల్ మరియు 'విత్ర్' నమాజుల్లోని అన్ని రకాతుల్లోను ఫాతిహా సూరాకు తోడు ఏదయినా ఒక సూరానుగాని లేక మూడు చిన్న ఆయత్‌లనుగాని పఠించడం వాజిబ్.

ఫర్జు నమాజుల్లో కేవలం మొదటి రెండు రకాతుల్లో ఫాతిహా సూరా తరువాత మరో సూరాగాని మూడు చిన్న ఆయత్‌లనుగాని చదవడం వాజిబ్. మూడవ, నాల్గవ రకాతుల్లో అలా చదవడం సున్నత్.

4. ఫాతిహా సూరాను ఇతర సూరాల కంటే ముందు చదవడం.

5. నమాజ్‌లోని అన్ని అంశాలను ఒకదాని తరువాత మరొకటి వెంటవెంటనే జాప్యం చెయ్యకుండా నెరవేర్చడం. అంటే ఓ అంశం తరువాత మరో అంశాన్ని నెరవేర్చడంలో మరుపువల్ల ఆలస్యం జరిగి, ఆ కాలయాపనలో ఒక సజ్దాగాని లేక రుకూగాని చేసే అంత సమయం దొర్లిపోయినా సహు సజ్దా చేయడం వాజిబ్ అవుతుంది. అయితే సజ్దాల్లోగాని, రుకూలోగాని పఠించే దుఆలవల్ల ఎంత సమయం సాగిపోయినా సజ్దయే సహు చేసే అవసరం ఉండదు.

6. ఖియామ్, ఖిరాత్, రుకూ మరియు సజ్దాల వరుస క్రమాన్ని పాటించడం. అంటే రుకూకు ముందు సజ్దాగాని, సజ్దాకు ముందే ఖఅయిదాగాని చేయడం జరిగితే సహు సజ్దా చేయవలసిందే.

7. రుకూ, సజ్దాలలో కనీసం ఓమారు సుబ్హాన రబ్బియల్ ఆలా లేక సుబ్హాన రబ్బియల్ అజీమ్ అనే తస్బీహ్ చదివినంత కాలంపాటైనా నిమగ్నులవడం. ఎవరయితే త్వరత్వరగా రుకూ సజ్దాలు చేస్తూ ఉంటారో వారి నమాజులు నెరవేరవు.

8. కౌమా చేయడం అంటే రుకూ పూర్తి అయిన తరువాత తాపీగా నిటారుగా నిలబడడం అన్నమాట. ఈ సందర్భంలోనూ చాలా మంది తొందరపడుతుంటారు. పూర్తిగా నిలబడక ముందే సజ్దాలో పడిపోతారు. ఇలా చేసినందుకు సహు సజ్దా కూడ చేయరు. ఇలా చెయ్యడంవల్ల కూడా నమాజ్ నెరవేరదు.

9. 'జల్సా' చేయడం. (జల్సా అంటే కూర్చోవడం అని అర్థం) అంటే ఒక సజ్దా తరువాత స్థిమితంగా కూర్చుని రెండవ సజ్దా చేయాలి.

10. మొదటి ఖఅదా. అంటే మూడు లేక నాల్గు రకాత్‌ల నమాజులో రెండు రకాత్‌ల తరువాత తషహ్హుద్ చదివినంతసేపు కూర్చోవడం అన్నమాట.

11. రెండు ఖ'అదాలలోనూ తషహ్హుద్ చదవడం. అంటే రెండు రకా'త్‌లు గల నమాజ్ అయితే రెండు రకా'త్‌లు అయిన పిదప తషహ్హుద్ చదవడం. నాల్గు రకాతుల నమాజ్ అయినట్లయితే రెండు మరియు నాల్గు రకాతులు పూర్తిచేసి కూర్చుని తషహ్హుద్ చదవడం; మూడు రకాతుల నమాజ్ అయితే రెండు మరియు మూడు రకాతుల తరువాత స్థిమితంగా కూర్చుని తషహ్హుద్ చదవడం అన్నమాట.

12. తాదీలె అర్కాన్. అంటే నమాజులోని అన్ని అంశాలను శాంతంగా సంతృప్తితో నెరవేర్చడం. మరో విధంగా చెప్పాలంటే ఖౌమా, రుకూ, సజ్దా మరియు జల్సాలను స్థిమితంగా ఎలాంటి తొందరపాటు లేకుండా నెరవేర్చడం. ఏయే దువాలైతే నమాజులో చదువబడతాయో వాటన్నింటినీ స్థిమితంగా చదవడం. తొందర పాటువల్ల అనేక అంశాలు నెరవేరవు. వాటివల్ల నమాజుకు భంగం వాటిల్లు తుంది. ముఖ్యంగా ఖౌమా మరియు జల్సాలలో ఇమామ్‌లు చాలా తొందరపడు తుంటారు. ఈ అంశాలలో కనీసం సుబ్హాన రబ్బియల్ ఆలా అనే తస్బీహ్ చదివినంతకాలం అయినా ఆగాలి.
13. ఏ నమాజులలోనైతే ఖుర్ఆన్‌ను ధ్వనిలేకుండా పఠించలసి ఉంటుందో (ఉదాహర ణకు జొహ్ర్ మరియు అస్ర్ నమాజులు) వాటిలో ఖుర్ఆన్‌ను మెల్లగానే పఠించడం. మరే నమాజులలోనైతే దివ్య ఖుర్ఆన్‌ను బిగ్గరగా చదవవలసి ఉంటుందో ఆ నమాజులో, (ఉదాహరణకు మగ్రిబ్, ఇషా, ఫజ్ర్,జుమా, ఈదైన్ మొదలైనవి). బిగ్గరగానే దివ్యఖుర్ఆన్‌ను పఠించాలి.
14. అస్సలాము అలైకుం వరహ్మతుల్లాహ్ అని పలుకుతూ నమాజును పూర్తి చేయడం.
15. విత్ర్ నమాజులోని మూడవ (చివరి) రకాత్‌లో ఖునూత్ దుఆకోసం తక్బీర్ (అల్లాహు అక్బర్) పలకడం మరియు ఖునూత్ దుఆ చదవడం.
16. ఈదైన్ నమాజుల్లో, ఆరేసి అదనపు తక్బీర్లు పలకడం ఒకవేళ సమూహం ఎక్కువై ఈ తక్బీర్లు పలకడంలో ఆరు కాక హెచ్చు తగ్గులైనా లేక మరే వాజిబ్‌ను నెరవేర్చడంలో ఏదైనా లోపం ఏర్పడినా సహూ సజ్దా చేయనవసరం లేదు.

## నమాజులోని సున్నత్‌లు

పైన పేర్కొన్నవన్నీ నమాజ్‌కు సంబంధించిన వాజిబ్‌లు, వీటిలో ఏది వదిలేయబడినా సహూ సజ్దా

చేయవలసిందే. ఇక నమాజులోని సున్నత్‌లు ఏవో ఇక్కడ తెలుసుకుందాము. ఈ సున్నత్‌లలో ఏదైనా వదిలివేసినా నమాజు పూర్తిగా భంగపడదు.

## నమాజ్

సహూ సజ్దా కూడా చేయనవసరం లేదు కాని కావాలని ఇలా చేయడం పాపం. పూర్తి సున్నత్‌లను జ్ఞప్తియందుంచుకుని ఆచరించేవారికి అధిక పుణ్యఫలం ప్రాప్తమవు

తుంది. కారణం, సున్నత్ అంటే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) నమాజు చేసిన విధానం అన్నమాట

నమాజులోని మొత్తం సున్నత్‌లు 21.

(1) తక్బీరె తహ్రీమా పలికేటప్పుడు రెండు చేతులు పైకెత్తడం, అంటే నమాజు ప్రారంభించినప్పుడు చెప్పేతక్బీర్ పలికేటప్పుడు పురుషులైతే తమ రెండు అర చేతుల్ని చెవుల వరకు ఎత్తడం, స్త్రీలయితేభుజాల వరకే ఎత్తడం.

(2) చేతులు పైకెత్తైటప్పుడు వేళ్ళువిడివడిగా ఉంచి అరచేతుల్ని ఖిబ్లా దిశగా ఉంచాలి.

3) ఇమాం ప్రతి అంశాన్ని నెరవేర్చేటప్పుడు బిగ్గరగా తక్బీర్ పలకడం.

4) మొదటి రకాత్ ప్రారంభంలో 'సనా' అంటే سُبْحَانَكَ اللّٰهُمَّ 'సుబ్హాన కల్లాహుమ్మ' అనేది మెల్లగా పఠించడం.

5) మొదటి రకాతులో 'తఅఊజ్' اَعُوْذُ بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ (అవూజు బిల్లాహి మినష్షయితానిర్రజీం) మెల్లగా చదవడం.

6) ప్రతి నమాజుని 'తస్మియా' بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ (బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీం)తో ప్రారంభించడం.

7) సూరయే ఫాతిహా పూర్తిగా పఠించి 'ఆమీన్' అని మెల్లగా పలకడం.

8) పురుషులయితే తమ కుడిచేతిని ఎడమ చేతిపై పెట్టి నాభి దగ్గర కట్టుకోవడం, స్త్రీలైతే చేతుల్ని ఛాతీపై కట్టుకోవడం.

9) రుకూ చేసేటప్పుడు అల్లాహు అక్బర్ అనడం.

10) రుకూలో మూడుసార్లు سُبْحَانَ رَبِّيَ الْعَظِيْمِ 'సుబ్హాన రబ్బియల్ అజీమ్' అనడం.

11) ఖౌమాలో రుకూ నుండి లేచేటప్పుడు ఇమామ్ سَمِعَ اللّٰهُ لِمَنْ حَمِدَهٗ సమి అల్లాహు లిమన్ హమిద అనడం. ఇమామ్ మరియు ముక్తదీలు (వెనుక నమాజు చేసేవారు) అందరూ اَللّٰهُمَّ رَبَّنَا لَكَ الْحَمْدُ 'అల్లాహుమ్మ రబ్బనా వలకల్‌హంద్' అనడం.

12) సజ్దా చేసేటప్పుడు మొదట రెండు మోకాళ్ళను ఆ తరువాత రెండు అరచేతులను ఆపై నొసటిని భూమిపై ఆనించడం.

13) సజ్దా చేసేటప్పుడు, సజ్దా నుండి లేచి జల్సా చేసేటప్పుడు, రెండవ సజ్దా చేసే టప్పుడు అల్లాహు అక్బర్ అనడం.

14) రెండు సజ్దాల్లోను మూడేసి మార్లు سُبْحَانَ رَبِّيَ الْأَعْلَىٰ 'సుబ్హాన రబ్బిఅల్ ఆలా' పఠించడం.

15) సజ్దాలో రెండు అరచేతులను ముక్కుకు సమానంగా ఉంచడం. పురుషులయితే ఛాతిని తొడలు ఆనకుండా ఎడంగా ఉంచడం. రెండు మోచేతుల్ని తొడలకు ఎడంగా, భూమికి ఆనకుండా ఎత్తుగా ఉంచడం. రెండు పాదాలు నిలువుగా భూమిపై ఆనించి ఉంచడం, స్త్రీలైతే తొడలు, మోచేతులు, ఛాతి ముడుచుకుని, పాదాలను భూమిపై పరచి సజ్దా చెయ్యాలి.

16) జల్సా మరియు ఖాయిదాలలో పురుషులు తమ ఎడమ పాదాన్ని పరుండబెట్టి దానిపై కూర్చోవడం. స్త్రీలైతే రెండు పాదాలు భూమిపై కుడి వైపునకు వాల్చి వాటిపై కూర్చోవడం.

17) సజ్దా చేసిన తరువాత రెండవ రకాతుకై నిలబడేటప్పుడు తక్బీర్ 'అల్లాహు అక్బర్' అనడం.

18) తషహ్హుద్‌లో اشهد ان لا اله الا الله అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్ అనేటప్పుడు కుడి చేతి చూపుడు వ్రేలును లేపి 'ఒకటి' అన్నట్లు సైగ చేయడం.

19) చివరి ఖాయిదాలో తషహ్హుద్ తరువాత దురూద్ చదవడం.

20) 'దురూద్' తరువాత ఏదయినా దుఆ పఠించడం. (దుఆలు రాబోవు అధ్యాయంలో ప్రస్తావించాము)

21) మొదట కుడి ఆ తరువాత ఎడమ వైపునకు మెడ త్రిప్పి అస్సలాము అలైకుం వరహ్మతుల్లాహ్ అని పలకడం.

22) ఫర్జ్ నమాజుల్లోని మూడు మరియు నాల్గవ రకాతులో ఫాతిహా సూరా పఠించడం.

**ముఖ్య గమనిక:** మెల్లగా తనకు మాత్రమే వినబడేటట్లు చేసే నమాజుల్లో దివ్యఖుర్ఆన్ పారాయణంగాని ఇతర దుఆలుగాని, బిగ్గరగా చదివే నమాజుల్లాగా అరబీ ఉచ్చారణ దోషాల్లేకుండా పఠించాలి. సాధారణంగా ఇలాంటి నమాజుల్లో దివ్య ఖుర్ఆన్ మరియు దుఆలు ఉచ్చారణ దోషాలు కలిగి ఉంటాయి.

## నమాజ్ ముస్తహబాత్ లేక నమాజ్ నియమాలు

నమాజ్‌లో ఫర్జ్, వాజిబ్, సున్నత్‌లే కాక కొన్ని విషయాలు 'ముస్తహబ్'గా అంటే నియమాలుగా ఉన్నాయి. ముస్తహబ్‌ను ఆచరించడంవల్ల పుణ్యం ప్రాప్తమవుతుంది. ఆచరించకపోవడం పాపం కాదు. అవి దిగువన పేర్కొనబడుతున్నాయి.

1) పురుషుడు దుప్పటి, శాలువలాంటివి కప్పుకొని ఉన్నట్లయితే నమాజ్‌లో తక్బీర్ చెప్పి చేతులు కట్టుకునేటప్పుడు చేతులు బయటకు తీసి కట్టుకోవడం స్త్రీలయితే తమ కొంగు లోపలే చేతులు ఉంచుకొని నియ్యత్ చేయడం.
2) ఒకవేళ ఒంటరిగానే నమాజ్ చేస్తున్నట్లయితే, రుకూలోను, సజ్దాలోను మూడు సార్లకంటే అధికంగా తస్బీహ్ పఠించడం.
3) ఖియాం (నిలబడడం)లో ఉన్నప్పుడు సజ్దా చేసే చోటును, రుకూ చేసేటప్పుడు తన పాదాలపైనా, జల్సా ఖాయిదాల్లో తన ఒడిలోను సలాంచేసి నమాజు ముగించే టప్పుడు తన భుజాలపైనా దృష్టిని ఉంచడం.
4) దగ్గును సాధ్యమయినంతవరకు ఆపే ప్రయత్నం చేయడం.
5) ఆవులింత వచ్చినప్పుడు దాన్ని ఆపే ప్రయత్నం చేయడం, ఆగని పక్షంలో నోటికి అడ్డంగా చేతిని ఉంచుకోవడం.
6) ఇఖామత్ చెప్పేవాడు, 'ఖద్‌ఖామతిస్సలాహ్' అన్నప్పుడు నమాజు కోసం లేచి నిలబడడం.
7) సజ్దా నుండి లేచేటప్పుడు, మొదట నుదుటిని, ఆ తరువాత రెండు చేతుల్ని పైకీ లేపడం. పైకి లేచేటప్పుడు రెండు చేతుల్ని మోకాళ్ళపై ఉంచి లేవడం.

## 'ముఫ్సిదాతె నమాజ్' అంటే నమాజును భంగపరిచే అంశాలు

ఇప్పుడు నమాజ్‌ను భంగపరిచే అంశాలేవో చెప్పబడుతున్నాయి. ఇవి సంభవించినట్లయితే నమాజును తిరిగి చేయవలసి ఉంటుంది.

1) నమాజ్ చేసే స్థితిలో, కావాలని లేక మరుపువల్లనయినా మాట్లాడడం.
2) ఎవరికయినా సలామ్ చేయడం, లేక సలామ్‌కు బదులు పలకడం.
3) తుమ్మినప్పుడు 'అల్‌హమ్దులిల్లాహ్' అనడం లేక దాని జవాబుగా యర్‌హముకల్లాహ్ అనడం నమాజులో తుమ్మురాగా మరచిపోయి 'అల్‌హమ్దులిల్లాహ్' అని అన్నట్లయితే నమాజు నెరవేరుతుంది' కాని కావాలని అలా చేయరాదు.
4) నమాజ్‌లో లేని వ్యక్తి ఎవరయినా దుఆ చేస్తూ ఉంటే దానికి ఆమీన్ అనడం.
5) మరణవార్త లేక ఏదయినా విచారకరమయిన వార్త విని 'ఇన్నాలిల్లాహి వ ఇన్నాఇలైహి రాజిఊన్ అనడం లేక మరే దుఆనయినా పఠించడం.
6) సంతోషకరమయిన వార్త విని 'అల్ హమ్దులిల్లాహ్' అనడం. మరింకేదైన వాక్యం పలకడం.

7) ఆశ్చర్యకరమైన విషయం విని సుబ్హానల్లాహ్ అనడం, అలాంటిది మరే మాటయినా పలకడం.

8) బాధ, నొప్పి, దుఃఖం మూలంగా అమ్మో, అయ్యో, ఆహ్, ఉఫ్‌లాంటి మాటలు పలకడం. స్వర్గ నరకాల ప్రసక్తి లేదా మరణానంతర శిక్ష గుర్తుకు వచ్చినప్పుడు పై పలుకులు నోటి నుండి వెలువడితే నమాజులో ఎలాంటి లోపం రాదు.

9) నమాజులో లేని వ్యక్తి ఖుర్‌ఆన్ పారాయణంలో ఏదయినా పొరపాటు చేయగా నమాజు చేసే వ్యక్తి దాన్ని సరిదిద్దడానికి మాట (లుక్మా) అందజేయడం.

10. నమాజులో దివ్య గ్రంథాన్ని చూసి పఠించడం.

11. ఎదురుగానున్న ఏదయినా గ్రంథంపైగాని, మరేదయినా వ్రాతపైగాని దృష్టిపడి దాన్ని నోటితో చదవడం. ఒకవేళ మనస్సులోనే చదువుకొని దాన్ని అర్థం చేసుకుంటే నమాజు భంగపడదు కాని, అలా కూడా చేయరాదు.

12. 'అమలె కసీర్' చేయడం అంటే చూసేవారికి నమాజ్ చేయడం లేదనిపించే ఏ పనినయినా చేయడం. ఉదాహరణకు నమాజ్ చేస్తూ రెండు చేతులతో శరీరాన్ని గోక్కోవడం, లేక ఒక చేత్తోనే చాలా సేపు గోక్కోవడం లేక మాటిమాటికీ బట్టలు సరిచేసుకుంటూ ఉండడం.

13) అనవసరంగా పెద్దగా దగ్గడం లేక గొంతును సవరించుకుంటూ ఉండడం.

14) కావాలని లేదా మరుపు కారణంగా ఏ పదార్థన్నయినా తినడం, త్రాగడం.

15. ఖుర్‌ఆన్ పారాయణంలో అర్థం మారిపోయేటంత తీవ్రమయిన పొరపాటు చేయడం. ఉదాహరణకు, 'కతల దావుదు జాలూత' అని ఉన్న వాక్యాన్ని 'దావుదు'లోని 'ద'కు కొమ్మును తీసేసి తలకట్టుతోను, జాలూతలోని 'త'కు కొమ్ము పెట్టి చదవడం. ఇలా చదవడంవల్ల అర్థమే తారుమారయిపోతుంది. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలాంటి వాక్యాలు చాలా ఉన్నాయి.

16) నమాజులో నాలుగయిదు అడుగులు నడవడం.

17) ఖిబ్లా దిశ నుండి ముఖాన్ని మరో వైపునకు త్రిప్పుకోవడం. అదే విధంగా ఎలాంటి అవసరం, కారణం లేకుండా తన రొమ్మును ఖిబ్లా దిశ నుండి మరల్చుకోవడం.

18) ఒక సజ్దా చేసేటంత సమయం వరకు శరీరంలో కప్పి ఉంచవలసిన భాగం (సతర్)లో నాల్గవ వంతు శరీర భాగం ఆచ్ఛాదన లేకుండా ఉండడం. అంటే ఆ శరీర భాగం నగ్నమైపోవడం.

19) నమాజ్ చేసేటప్పుడు మామూలుగా మనుషుల్ని అడిగి తెలుసుకోగల పదార్థాలకై దైవాన్ని వేడుకోవడం. ఉదాహరణకు అన్నం, నీరు, నిప్పు వగైరా కావాలని దైవాన్ని అడగడం అన్నమాట.

20) బాధ, కష్టం లేక నొప్పివల్ల ఏడ్వగా, అర్థం వచ్చే ఎలాంటి పదాలయినా వెలువడడం. ఉదాహరణకు అయ్యో దైవమా, హాయ్ అల్లాహ్, ఉఫ్ ఉఫ్ లాంటివి.

21) జనాజా నమాజులో తప్ప ఇతర నమాజుల్లో బిగ్గరగా నవ్వడం.

22) ఇమామ్ కంటే ముందుగానే పూర్తి రుకూగాని, సజ్దాగాని చేసేయడం. లేక ఇమామ్ నిలుచున్న ప్రదేశంకన్నా ముందుకుపోయి నిలువడం.

23) ఒకే నమాజులో పురుషుడు, స్త్రీ కలసి నిలబడటం. అలా కనీసం ఒక సజ్దా చేసేటంత సేపు నిలబడినట్లయితే నమాజ్ భంగమవుతుంది.

24) తయమ్ముమ్ చేసి నమాజు చేస్తున్న వ్యక్తికి నీరు ప్రాప్తమవడం.

25) స్త్రీ నమాజ్ చేస్తూ ఉన్నప్పుడు, శిశువు వచ్చి అదే స్థితిలో ఆమె వద్ద పాలు త్రాగడం లేదా స్తనాల నుండి పాలు పొంగి బయటకు రావడం. ఈ రెండు స్థితుల్లోనూ ఆమె నమాజు భంగపడుతుంది.

రేడియో, టి.వి., టేపు రికార్డులద్వారా నమాజ్ లేక అజాన్‌కు సంబంధించిన వివరణ:

రేడియో, టి.వి., టేపు రికార్డుద్వారా జరిగే అజాన్ లేక ఇమామత్ సక్రమమైనవి కావు. కారణం అవి నిర్జీవ సాధనాలు. అజాన్ పలికే లేక నమాజు చేయించే స్తోమత వాటికి లేనేలేదు. నమాజు అనేది ఓ విన్యాసం లాంటిదిగాని, కవాతులాంటిదిగాని కాదు. మనిషి నమాజులో శరీర కదలికలకు తోడుగా మానసిక ఏకాగ్రతతో దైవం సమక్షంలో నిలబడతాడు. అలానే నిలబడాలి కూడా. రేడియో, టీవీలాంటి నిర్జీవ సాధనాలతో ఇది సాధ్యం కాదు. రేడియో స్టేషన్ లేక టి.వి. కేంద్రం నుండి నమాజు చేయించే ఇమామ్‌కు, మస్జిద్‌లో నమాజు చేయించే ఇమామ్‌కు పరిసరాల రీత్యా మానసిక స్థితి రీత్యా ఉన్న తేడా విజ్ఞుడయిన ప్రతి వ్యక్తి ఇట్టే గ్రహించగలడు. ధర్మ వేత్తలు ఈ నిర్జీవ సాధనాల ద్వారా ఖుర్ఆన్ పఠనం చేస్తే తారసపడే పారాయణ సజ్దాలు కూడా వాజిబ్ కావు అని అంటున్నారు. ఇక ఇమామత్, నమాజుల సంగతి సరేసరి.

## నమాజ్‌లో మక్రూహ్ (అసహ్యమయిన) అంశాలు

ఏ అంశాల వల్లనయితే నమాజ్ పూర్తిగా భంగపడకపోయినా, వాటివల్ల

నమాజులో లోపం, ఒక విధమయిన అసహ్యత ఏర్పడుతుందో వాటిని మక్రూహ్ అంశా లుగా పేర్కొనడం జరిగింది. అవి క్రింద పేర్కొంటున్నాము.

1) దుప్పటి లేక శాలువలాంటివి కప్పుకోకుండా కేవలం వాటిని వ్రేలాడదీయడం, చొక్కా లేక షేర్వాని చేతుల్ని తొడుక్కోకుండా భుజాలపై వేసుకోవడం. ఇదే విధంగా మఫ్లర్‌ని మెడకు చుట్టుకోకుండా వ్రేలాడదీసి నమాజు చేయడం.

2) బట్టలకు, నుదుటికీ మట్టి తగలకుండా బట్టల్ని మాటిమాటికీ దగ్గరకు లాక్కో వడం, లేదా మట్టిని ఊదుకుంటూ శుభ్రం చేయడం. ఒకవేళ సజ్దా ప్రదేశంలో గులక రాళ్ళు ఉంటే వాటిని తొలగించడానికి ఏదో ఒకసారి చేత్తో తుడవచ్చు లేదా ఊది శుభ్రం చేసినా అభ్యంతరకరం కాదు.

3) తన శరీరాన్ని, గడ్డాన్ని, వస్త్రాల్ని తరచూ తడుముకుంటూ ఉండడం, నమాజుల్లో చాలా మంది ఇలా చేస్తుంటారు. ఇలా చేయకుండా ఉండడం అవసరం.

4) బజారుల్లో, ప్రజా సమూహాల్లో తొడుగుకొని పోవడానికి సిగ్గుపడేటటువంటి వస్త్రాలు తొడుక్కొని నమాజు చేయడం.

5) దివ్య ఖుర్‌ఆన్ పారాయణంలో అసౌకర్యం కలిగించేటటువంటి వస్తువును దేన్నయినా నోటిలో వుంచుకొని నమాజు చేయడం.

6) అలసత్వం, అశ్రద్ధల వల్ల తలపై టోపీకాని, మరేదయినా ఆచ్ఛాదనకాని లేకుండా, అదే విధంగా నాభికి పైభాగాన ఎలాంటి వస్త్రం లేకుండా నమాజు చేయడం. ఎవరయినా దైవం ఎదుట తన అశక్తతను వ్యక్తం చేయడానికి తలపై టోపీగాని, ఇంకేదయినా వస్త్రంగాని లేకుండా నమాజు చేస్తే అది మక్రూహ్ కాదు. అయితే మస్జిద్‌లో అలా చేయడం మంచిది కాదు. ఇంటి లోపల ఆ విధంగా నమాజు చేయడం మంచిది. మస్జిద్‌లో చేయడం వల్ల చూసేవారు అతని అంతరంగాన్ని ఎరుగరు గనక వారిలోనూ అశ్రద్ధ పెరిగి వారు ఈ పంథానే అవలంబించవచ్చు.

7) చేతి వ్రేళ్ళను విరుచుకోవడం, లేక ఒక చేతి వ్రేళ్ళను మరో చేతి వ్రేళ్ళలో దూర్చుకోవడం.

8) నడుంపై లేక తొంటిపై అనవసరంగా చేతిని ఉంచుకోవడం.

9) సజ్దాలో, చేతుల్ని మోచేతుల వరకు భూమిపై ఆనించడం.

10) ఓర చూపులతో ఇటు అటు చూడడం.

11) తనవైపునకే ముఖం త్రిప్పి ఉన్న మనిషికి ఎదురుగా నమాజు చేయడం.

12) చేయి లేక తలతో సైగ చేస్తూ సలాముకు మరేదయినా ప్రశ్నకు జవాబు ఇవ్వడం.

13) ఆకారణంగా బాసికపట్టు వేసుకొని లేక మరే ఇతర విధంగానైనా కూర్చోవడం.

14) కావాలని ఆవులించడం, ఆవులింతను ఆపకపోవడం.

15) నమాజు వరుసలో (సఫ్‌లో) చోటున్నా తాను ఒంటరిగా నిలబడి నమాజు చేయడం.

16) జీవరాసుల చిత్రాలు గల వస్త్రాలు ధరించి నమాజు చేయడం.

17) అలాగే ఇలాంటి చిత్రాలున్న బట్ట కాక జానమాజ్‌పై నిలబడి నమాజ్ చెయ్యడం. ఒకవేళ ఈ చిత్రాలు జానమాజ్‌కు దిగువ భాగంలోఉన్నా, పాదాల క్రిందున్నా అభ్యంతరం లేదు. కాని కావాలని మాటిమాటికీ అలాంటి వస్త్రాలపై నమాజు చేయకూడదు. జీవం లేని పదార్థాల చిత్రాలయితే అభ్యంతరం లేదు.

18) ఇమాం ఒక్కడే ఎత్తయిన ప్రదేశంలో నిలబడటం. ఆ ప్రదేశం భూమికి ఒక జానెడెత్తు ఉంటే ఫరవాలేదు.

19) నమాజులో చేతులు బయటకు తీయవీలుకాకుండా దుప్పటిని కాని, శాలువను గాని చుట్టుకొని నమాజు చేయడం.

20) వళ్ళు విరుచుకోవడం.

21) టోపి, అమామ, తలపాగా లేక కండువా (రుమాలు)ల కుచ్చులపై సజ్దా చేయడం. వీటిని ధరించి సజ్దా చేసేటప్పుడు సజ్దా చేసేందుకు నుదురు ఆచ్ఛాదన లేకుండా ఉండాలన్నదే దీని భావం.

22) రెండవ రకాత్‌ను మొదటి రకాత్ కంటే పొడిగించడం.

23) ఏ నమాజులోనైనా, ఓ ప్రత్యేక సూరానే పఠించాలన్న నియమం చేసుకోవడం.

24) దివ్యఖుర్‌ఆన్‌ను దాని క్రమపద్ధతిలో కాక వెనుకా ముందుచేసి చదవడం. అంటే ఖుర్‌ఆన్ సూరాలు ఏ క్రమంలోనైతే వ్రాసి ఉన్నాయో ఆ క్రమాన్ని మార్చి పఠించడం.

25) మలమూత్ర విసర్జన అవసరం ఏర్పడినప్పుడు నమాజు చేయడం.

26) బాగా ఆకలిగా ఉండి, భోజనం సిద్ధంగా ఉన్నప్పుడు భోజనం చేయకుండానే నమాజు చేయడం. అయితే నమాజు వేళ అతి స్వల్పంగా ఉండి, భోజనం తయారవడానికి ఇంకా సమయం ఉంటే జమాఅత్ తోటి నమాజ్ తప్పి పోయే

ప్రమాదముంటే ముందు నమాజ్ చేసుకోవాలి.

27) నమాజు చేస్తూ నల్లి, ఈగ, దోమ, చీమ వగైరాలను చంపడం. ఒకవేళ ఇవి కుట్టి బాధిస్తూ ఉంటే వాటిని పట్టి వదిలివేయవచ్చు.

28) సజ్దా చేసేటప్పుడు రెండు పాదాలు పైకెత్తడం. కొందరు ధర్మవేత్తలు, ఈ చర్య నమాజును పూర్తిగా భంగపరుస్తుందని అంటారు.

29) రుమాలు లేక మఫ్లరును భుజాలపై వేసుకొని నమాజు చేయడం మక్రూహ్.

30) అనేకమంది మాట్లాడుకుంటున్న చోట నమాజు చేస్తే వారి మాటలకు నవ్వు రావడంగాని, నమాజులో పొరపాటు జరగడంగాని, ఏకాగ్రత చెడిపోవడంగాని జరిగే భయం ఉంటే అలాంటి చోట నమాజు చేయడం మక్రూహ్.

31) రెండు మోచేతుల దాకా ఎలాంటి ఆచ్ఛాదన లేకుండా నమాజుచేసినా నమాజు మక్రూహ్ అవుతుంది. (ఫతావా రహీమియా)

32) నమాజుచేస్తూ, ఇటు, అటు చూడడం. ఒకవేళ గడియారంపై దృష్టిపడి టైము తెలుసుకున్నా, ఏదైనా పుస్తకం ఎదురుగా ఉండి దాన్ని కళ్ళతోనే అర్థం చేసుకున్నా నమాజు మక్రూహ్ కాదు. కాని కావాలని అలాచేస్తే నమాజ్ మక్రూహ్ అవుతుంది.

## నమాజును భగ్నం చెయ్యవలసిన సందర్భాలు

ఇప్పుడు నమాజు చేసేవాడే తానయి నమాజ్‌ను భగ్నం చేయవలసిన సందర్భాలు పేర్కొంటున్నాము. ఇలా నమాజ్‌ను భగ్నం చేయకపోతే, నమాజ్ చేసే వానికి కొన్ని సందర్భాల్లో అధికంగాను మరికొన్ని సందర్భాల్లో అల్పంగాను పాపం కలుగుతుంది. ఆ సందర్భాలు ఇవి:

1) ఏదైనా విషజంతువు కాటేసే ప్రమాదంలో ఉదాహరణకు నమాజ్ చేసేటప్పుడు పాము ముందుకు వచ్చేస్తే నమాజును భగ్నం చేసి దాన్ని చంపేయాలి. ఇదే విధంగా తేలు, కందిరీగ లాంటివి వస్త్రాల్లో దూరి కుట్టి బాధ కలిగించే భయం కలిగితే నమాజును భగ్నంచేసే అనుమతి ఉంది. అలాగే కోడిని పిల్లి పట్టేసినా, పట్టేసే ప్రమాదంఉన్నా నమాజును భగ్నం చేయవచ్చు.

2) రెండు రూపాయలకంటే అధిక విలువ కలిగిన వస్తువుకు నష్టం వాటిల్లుతుంది. అనే భయం కలిగినప్పుడు. ఉదాహరణకు, పొయ్యిపై కూర వండుతూ ఉన్నప్పుడు అది కాలిపోతుందనే భయం కలిగినప్పుడు నమాజును భగ్నంచేసి దాన్ని

దించేసుకోవచ్చు. ఇదే విధంగా కుక్క, పిల్లి, కోతిలాంటివి ఇంట్లో ప్రవేశించి పిండి, బియ్యం, పప్పు, నూనె, నెయ్యి లాంటివి ఏ వస్తువులనైనా కాజేస్తాయనే భయం ఉంటే నమాజును భగ్నం చేయవచ్చు. ఇదే విధంగా మస్జిద్‌లోనైనా లేక మరే ప్రదేశంలోనైనా నమాజు చేసేటప్పుదు, తన పాదరక్షలుగాని, సామానుగాని ఓ చోట మరిచిపోయి, అవి దొంగిలించబడతాయనే ప్రమాదం ఉన్నప్పుడు నమాజును భగ్నం చేసి వాటిని రక్షించుకోవచ్చు. అయితే అలాంటి సామానులను, వస్తువులను ముందే భద్రపరచుకొని తరువాత నమాజు చేసుకోవడం ఉత్తమం.

3) రైలు, బస్సు లాంటి ప్రయాణ వాహనాలు బయల్దేరి పోతాయని లేదా వాటిలో తన సామాను, భార్యాపిల్లలున్నప్పుడు, లేదా బయలుదేరడం వల్ల నష్టం కలిగేలా ఉంటే ఆ సందర్భాల్లోనూ నమాజును భగ్నం చేయాలి.

4) నమాజు చేసేటప్పుడు మలమూత్ర విసర్జనకు పోవడం అత్యవసరమయి నప్పుడు.

5) ఒకరి ప్రాణాన్ని రక్షించదానికి, వారికి హాని జరక్కుండా కాపాడటానికి నమాజును భగ్నం చేయడం ఫర్జ్ లేక విధి. ఇలాంటి సమయాల్లో నమాజును భగ్నం చేయకపోవడం మహాపరాధం. తీవ్ర పాపానికి పాల్పడిన వాడవుతాడు.

ఉదాహరణకు:

(అ) గ్రుడ్డివాడు నడుస్తుండగా అతను ముందున్న బావిలోనో లేక గుంటలోనో పడే ప్రమాదముంటే.

(ఆ) ఒకరి బట్టలకు నిప్పంటుకుని కాలి చనిపోయే ప్రమాదం ఉన్నప్పుడు.

(ఇ) ఎవరైనా నీట మునుగుతూ చనిపోయే ప్రమాదం ఉన్నప్పుడు.

(ఈ) ఎవరినైనా అతని శత్రువుగాని దొంగగాని బాగా గాయపర్చి, ఆ వ్యక్తి సహాయం కోసం అరచినప్పుడు. ఇలాంటి సందర్భాల్లో నమాజ్‌ను విధిగా భగ్నం చేసి వారిని రక్షించాలి. అలా చేయడం ధార్మిక విధి.

6. తల్లిదండ్రులు, తాతలు, అమ్మమ్మ, నాయనమ్మలు ఏదైనా కష్టం వల్ల తాను నమాజు చేస్తున్నప్పుడు పిలిస్తే, వెంటనే నమాజ్‌ను భగ్నం చేసి వారి వద్దకు పోవాలి. ఉదాహరణకు, వారిలో ఎవరైనా పడిపోయి దెబ్బలు తగిలి, వారిని లేపడానికి మరెవ్వరూ అక్కడ లేని సందర్భాల్లో. ఇదేవిధంగా వారు మలమూత్ర విసర్జనకు పోతూ సహాయానికి పిలిస్తే, పిలిచినా మరెవ్వరూ చేయూత ఇచ్చేవారు అక్కడ లేని సందర్భంలో. కాని ఎవరయినా సహాయం చేసే వారున్నా వారు అలా అరుస్తూ

ఉంటే, అనవసరంగా పిలుస్తున్నప్పుడు, నమాజును భగ్నం చేయనవసరం లేదు. అయితే, నఫిల్, సున్నత్ నమాజులు చేసేటప్పుడు, వారికి నమాజు చేస్తున్నట్లు తెలియకపోతే వారు ఏదయినా కష్టం వల్ల పిలిచినా లేక ఇట్టే పిలిచినా నమాజును భగ్నం చేసి సమాధానం ఇవ్వవచ్చు. వారికి తాను నమాజు చేసేది తెలిసినప్పుడు ఏ కారణం లేకుండా పిలిస్తే బదులు పలకనవసరం లేదు. కాని ఏదయినా కష్టం వల్ల పిలిస్తే మటుకు నమాజును భగ్నం చెయ్యాలి.

## నమాజు చేసే సంపూర్ణ విధానం

ఇప్పటి వరకు నమాజులోని ఫర్జులు, వాజిబ్‌లు ఇంకా సున్నత్‌లను గురించిన వివరాలు నమాజ్‌ని భంగపరిచే విషయాలు లేక మక్రూహ్ చేసే విషయాలను గురించి చెప్పుకున్నాము. ఇప్పుడు నమాజు ఎలా చేయాలో తెలుసుకుందాము. ఈ పద్ధతి ప్రకారమే నమాజు చేయాలి.

నమాజు ప్రారంభించే ముందు, నమాజు చేసే వ్యక్తి తన శరీరాన్ని, వస్త్రాల్ని పరిశుభ్రంగా ఉంచుకున్నట్లే తన మనస్సును ప్రాపంచిక విషయాలు, ఆలోచనల నుండి ప్రక్షాళన చేసుకోవాలి. కారణం ఏమిటంటే ఒకవేళ అతడు తన దైవం ఎదుట హాజరైనప్పుడు అతని మనస్సు ప్రాపంచిక విషయాల్లోనే లగ్నమయి ఉంటే, అతనికి ఆ నమాజు వల్ల పూర్తి ప్రయోజనం ప్రాప్తం కాదు. ఇంకా ఏ ధ్యేయంతోనైతే నమాజు చేస్తున్నాడో ఆ ధ్యేయం కూడా ఏ మాత్రం నెరవేరదు, తన శ్రద్ధాభక్తుల్ని ఏకాగ్రతతో దైవం వైపుకే మరల్చుకునేందుకు ఈ దుఆను పఠించాలి.

إِنِّي وَجَّهْتُ وَجْهِيَ لِلَّذِي
فَطَرَ السَّمٰوَاتِ وَالْأَرْضَ
حَنِيفًا وَمَآ أَنَا مِنَ
الْمُشْرِكِينَ ۝ (انعام)

**ఇన్నీ వజ్జహ్తు వజ్ హియ లిల్లజీ**
**ఫతరస్సమా వాతి వల్ అర్జ హనీఫవ్‌ం**
**వమా అనమినల్ ముష్రికీన్.**

అర్థం: నేను ఏకోన్ముఖుడనై నా దీక్షనంతా ఈ భూమ్యాకాశాల సృష్టి కర్త వైపునకే మరల్చుకున్నాను. నేను, మరెవ్వరినీ ఆయనకు సహవర్తులుగా భావించేవాడిని కాను.

ఇలా పఠించి, సరిగ్గా నిలబడి, ఏ నమాజు, ఎన్ని రకాత్‌లు చేస్తున్నాడో మనస్సులో సంకల్పం (నియ్యత్) చేసుకోవాలి. నోటితోనూ ఆ సంకల్పాన్ని పలికితే మరీ మంచిది. ఇక నిలబడడం (ఖియామ్)లో మెడను పూర్తిగా క్రిందికి వ్రేలాడదీయడంగానీ, మరీ నిగిడ్చడంగాని చేయకూడదు. రెండు పాదాల నడుమ కనీసం నాల్గంగుళాల ఎడం తప్పని సరిగా ఉండాలి. అది ఎక్కువైనా ఫరవాలేదు. చూపునంతా సజ్దా చేసే ప్రదేశంపై ఉంచాలి.

సంకల్పం చేసిన తరువాత 'అల్లాహు అక్బర్' అంటూ రెండు అరచేతుల్ని పశ్చిమ దిశగా ఉంచి వ్రేళ్ళను విడదీసి చెవుల వరకు లేపి వాటిని నాభి దగ్గర కట్టుకోవాలి. చేతులు కట్టుకునేటప్పుడు ఎడమ చేతి మణి కట్టును, కుడి చేతి బొటన వ్రేలు మరియు చిటికెన వ్రేలితో పట్టుకోవాలి. చేతులు పైకి లేపిన తరువాత వాటిని పూర్తిగా క్రిందికి వదిలి వేయకుండానే కట్టుకోవాలన్న విషయాన్ని జ్ఞప్తియందుంచుకోవాలి. చేతులు కట్టుకోగానే ఈ దుఆ పఠించాలి. దీన్ని 'సనా' అంటారు.

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ وَلَآ اِلٰهَ غَيْرُكَ

"సుబ్‌హానకల్లాహుమ్మ వబి హమ్దిక, వతబారకస్ముక, వతాల జద్దుక వలా ఇలాహ గైరుక్."

అర్థం: ఓ అల్లాహ్ పవిత్రుడవు నీవు. నీవే ప్రస్తుతికి పాత్రుడవు. ఉన్నతమైనదీ, శుభప్రదమైనదీ నీ నామం. ఎంతో గొప్పది. నీ మహిమ. నీవు తప్ప ఆరాధనకు మరెవ్వరూ అర్హులు కారు.

ఈ దుఆ చదివిన తరువాత 'తఅవ్వుజ్' అంటే, 'అవుజు బిల్లాహి మినష్షైతా నిర్రజీమ్, ఆపైన 'తస్మియా' అంటే బిస్మిల్లాహి ర్రహ్మానిర్రహీమ్ చదవాలి.

ఆ తరువాత దివ్యఖుర్ఆన్‌లోని మొట్టమొదటి సూరా 'ఫాతిహా సూర' చదవాలి. ప్రతి రకాత్‌లో ఫాతిహా సూరా మొదలెట్టేటప్పుడు బిస్మిల్లాహి ర్రహ్మానిర్రహీం చదవాలి. (ఇదే విధంగా ఫాతిహా సూరా తరువాత మరో సూరా పఠించేటప్పుడు కూడా ప్రారంభంలో బిస్మిల్లాహి ర్రహ్మానిర్రహీం చదవాలి.)

సూరయే ఫాతిహా పూర్తిగా చదివిన తరువాత మెల్లగా 'ఆమీన్' అని పలకాలి. ఆ తరువాత దివ్యఖుర్ఆన్‌లోని ఏదైనా సూరాను లేక దాని మూడు ఆయత్‌లను పఠించాలి. సూరాయె ఫాతిహా మరియు మరో సూరాను పఠించేటప్పుడు వాటి అర్థంపై మనసు నుంచాలి. ఆ తరువాత 'తక్బీర్' అంటే అల్లాహు అక్బర్ అంటూ 'రుకూ' చేయాలి. రుకూ చేసే విధానం ఏమిటంటే, వెనుక భాగం, వీపు మరియు తల అన్నీ సమంగా ఉండాలి. తలను పూర్తిగా వంచడంగాని, వీపుకంటే పైకి లేపడంగాని తగదు. వ్రేళ్ళను విడదీసి రెండు చేతులతో రెండు మోకాళ్ళను పట్టుకోవాలి. బాహువులు ప్రక్కలకు ఆనుకొని ఉండాలి. చూపు రెండు పాదాల నడుమనుంచాలి.

ఆ తరువాత "సుబ్‌హానరబ్బియల్ అజీం" అనే దుఆని ఆగి ఆగి మూడు లేక అయిదు లేక ఏడుసార్లు లేక మరెన్ని పర్యాయాలయినా బేసి సంఖ్యలో చదవాలి. కాని

ఇమాం మాత్రం మూడుసార్లు చదవడమే మంచిది. హదీసుల్లో మరో దుఆ కూడా ఉంది. దాన్ని కూడా ఇష్టమయితే పఠించవచ్చు.

سُبْحَانَكَ اللّٰهُمَّ رَبَّنَا وَبِحَمْدِكَ اللّٰهُمَّ اغْفِرْ لِي

**"సుబ్‌హానకల్లాహుమ్మ రబ్బనా వబి హమ్దిక అల్లాహుమ్మగ్ ఫిర్‌లీ."**

అర్థం: ఓ అల్లాహ్ నీవు పవిత్రుడవు. ఓ మా ప్రభూ, మేము నీ స్తోత్రగానమే చేస్తాము. ఓ అల్లాహ్ నన్ను క్షమించు. (బుఖారి, ముస్లిం)

ఇమామ్ అయితే వీటిలో ఏదో ఒకటి చదివితే చాలు. ఒంటరిగా నమాజు చేసే వాడైతే ఈ రెండు దుఆలను కూడా కలిపి చదవవచ్చు.

రుకూ తరువాత 'ఖౌమా' చేయాలి. ఖౌమా అంటే రుకూ నుండి నిటారుగా లేచి చేతులు క్రిందికి దించి నిలుచోవడం. ఖౌమా చేసేటప్పుడు (రుకూ నుండి పైకిలేచేటప్పుడు) 'సమి అల్లాహులిమన్ హమిద' (అల్లాహ్‌ను ప్రస్తుతించిన వాని మాటను ఆయన వింటాడు) అని పలుకుతూ నిలబడాలి. నిలబడి తీరికగా 'తహ్‌మీద్' అంటే 'రబ్బనా లకల్ హమ్ద్' (ఓ నా ప్రభూ! నీ కోసమే స్తోత్రాలన్నీను) చదవాలి. ఇమామ్ అయితే సమి అల్లాహులిమన్ హమిద మరియు తహ్మీద్ రెండూ పలకాలి. కాని ముక్తదీలు (ఇమామ్ వెనుక నమాజు చేసేవారు) మాత్రం తహ్మీద్‌నే పలకాలి.

తహ్‌మీద్ చదివిన తరువాత అల్లాహు అక్బర్ అంటూ 'సజ్దా' చేయాలి. సజ్దా విధానం ఏమిటంటే మొదట రెండు మోకాళ్ళను భూమిపై పెట్టి ఆ తరువాత రెండు అరచేతులు, తదుపరి నొసలు భూమిపై ఆనించడం. నొసటితోపాటు ముక్కు కూడా భూమికి ఆని ఉండాలి. సజ్దాలో రెండు అరచేతులు నమాజీ చెవుల దగ్గరగా ఉండాలి. చేతివ్రేళ్ళను దగ్గరగా కలిపి ఉంచి అవి ఖిబ్లా దిశగా ఉండాలి. అట్లే రెండు కాళ్ళ వేళ్ళు సైతం సజ్దా అయ్యేంతవరకు ఖిబ్లా దిశగానే ఉండి భూమి నుండి పైకి లేవకుండా ఉండాలి. ఇక రెండు మోచేతులు, ముంజేతులు భూమికి ఆనకుండా ప్రక్కలకు మరియు తొడలకు ఎడంగా ఉండాలి. సజ్దాలో నమాజీ కడుపు క్రిందగా ఓ చిన్న మేకపిల్ల సునాయాసంగా పోగలగాలి. ఈ విధంగా సజ్దా చేసిన తరువాత తీరిగ్గా 'సుబహాన రబ్బియల్ ఆలా' (నా ప్రభువు ఉన్నతుడు, పవిత్రుడూను) అనే తస్బీహ్ బేసి సంఖ్యలో చదవాలి.

మొదటి సజ్దా అయిన తరువాత అల్లాహు అక్బర్ అంటూ సజ్దా నుండి పైకి లేచి స్థిమితంగా కూర్చోవాలి. అలా కూర్చోవడం జల్సా అనబడుతుంది. జల్సాలో ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اغْفِرْلِيْ وَارْحَمْنِيْ
وَعَافِنِيْ وَاهْدِنِيْ وَارْزُقْنِيْ
وَاجْبُرْنِيْ وَارْفَعْنِيْ۔

"అల్లాహుమ్మగ్ ఫిర్లీ వర్
హమ్నీ, వ ఆఫినీ వహ్దినీ,
వర్జుఖ్నీ, వజబుర్నీ, వర్ఫ
అనీ."

అర్థం: ఓ అల్లాహ్! నన్ను మన్నించు, నన్ను కరుణించు, నన్ను క్షమించు, నాకు సన్మార్గం చూపు, నాకు హలాల్ (ధర్మసమ్మతమైన) ఉపాధిని కల్పించు. నా దారిద్ర్యాన్ని దూరం చెయ్యి. నాకు ఔన్నత్యాన్ని ప్రసాదించు). కుడికాలి వ్రేళ్ళు కిబ్లా వైపుకు పెట్టి పాదాన్ని నిలబెట్టాలి. ఎడమ కాలిని కుడి వైపుకు మడిచి దానిపై కూర్చోవాలి. రెండు అరచేతుల్ని వాటి వ్రేళ్ళు ఎడం ఎడంగా ఉండేటట్లు ఉంచి మోకాలి పైభాగంలో తొడల మీద పెట్టుకోవాలి వ్రేళ్ళు ఖిబ్లా దిశగా ఉండాలి.

**గమనిక:** ముక్తదీలు విసిగిపోతారనే భయం ఉంటే ఇమామ్, జల్సాలో చదివే దుఆలోని రెండు మూడు పదాలలనే పలకాలి. ఒంటరిగా నమాజు చేసేవారు మాత్రం దీన్ని పూర్తి చదవవచ్చు.

ఈ దుఆ చదివిన తరువాత రెండవ సజ్దాను, మొదటి సజ్దా చేసినట్లే అల్లాహు అక్బర్ అంటూ చేయాలి. తిరిగి ఆ సజ్దాలోను మొదటి సజ్దాలో చదివిన దుఆలనే చదవాలి. రెండు సజ్దాలు చేసిన తరువాత ఒక 'రకాఅత్' నమాజు పూర్తి అవుతుంది. రెండవ రకాఅత్ కోసం లేచి నిలబడాలి. సజ్దా నుండి పైకి నిలబడేటప్పుడు మొదట నొసలు తరువాత రెండుచేతులు లేపి తొడలపై పెట్టి మోకాళ్ళను లేపి నిలుచోవాలి. అంటే సజ్దా చేసేటప్పుడు ఏయే అవయవాలైతే చివరగా భూమ్మీద ఆనాయో వాటిని మొదటను, మొదట ఆనిన వాటిని చివరగాను లేపాలన్న మాట. ఇలా ఒక రకాఅత్ నమాజు పూర్తయింది.

ఈ విధంగా ఒక రకాత్ నెరవేరింది. రెండవ రకాత్లో మొదట బిస్మిల్లాహ్ చదివి ఫాతిహా సూరాను పూర్తిగా చదవాలి. ఆమీన్ అన్న తరువాత మరో సూరాను లేక అందులోని మూడు ఆయత్లను పఠించాలి. ఆ తరువాత తక్బీర్ చెబుతూ రుకూ, ఖౌమా, సజ్దా, జల్సా మరో సజ్దా చేసి 'ఖాయిదా' చేయాలి. అంటే కుడి కాలుని నిలబెట్టి దాని వ్రేళ్ళను ఖిబ్లా దిశగా ఉంచి ఎడ కాలిని నేలపై పరచి కూర్చోవడం అన్నమాట. ఖాయిదాలో జల్సాలో మాదిరిగానే కూర్చోవాలి. ఖాయిదాలో 'తషహ్హుద్' అనే దువాను పఠించవలసి ఉంటుంది.

**తషహ్హుద్: అత్తహియ్యాతు లిల్లాహి వస్సల్వాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్న బియ్యు వరహ్మా తుల్లాహి వ బరకాతుహు. అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహిస్సాలి హీన్. అష్హదు అంల్లాయిలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్." (బుఖారి)**

اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوَاتُ وَالطَّيِّبَاتُ اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ الصّٰلِحِيْنَ اَشْهَدُ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ-

**అర్థం :** సకల స్తోత్ర సంస్మరణలు, శారీరక ఆరాధనలు, పరిశుద్ధ ధనసంబంధమైన ఆరాధనలు సమస్తం అల్లాహ్ కోసమే. ఓ ప్రవక్తా! మీపై శాంతి నెలకొనుగాక. మాపైననూ, సజ్జనులైన దైవదాసుల మీదను శాంతి కలుగుగాక. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ (స) ఆయన దాసులనీ, ఆయన ప్రవక్తయని (కూడా) నేను సాక్ష్యం ఇస్తున్నాను."

అషహదు అంల్లా ఇలాహ ఇల్లల్లాహ్ అని చదివేటప్పుడు, 'లా ఇలాహ' అంటూ కుడిచేతి బొటనవ్రేలితో నడిమి వ్రేలిని పట్టి ఉంగరంలా చుట్టి చూపుడు వ్రేలుని, పైకిలేపి సంజ్ఞ చేయాలి. ఇల్లల్లాహ్ అంటూ దానిని క్రిందకు దించాలి. ఖాయిదాలో కూర్చున్నంత సేపు బొటన వ్రేలితో చేసిన వలయాన్ని అలానే ఉంచాలి. ఈ విధంగా రెండు రకాత్‌ల నమాజ్ పూర్తి అయిందన్నమాట.

ఒక వేళ మూడు లేక నాల్గు రకాత్‌ల నమాజ్ చేయవలసి ఉన్నట్లయితే తషహ్హుద్ చదివిన వెంటనే తక్బీర్ (అల్లాహు అక్బర్) పలుకుతూ లేచి నిలబడాలి. ఫర్జ్ నమాజ్ అయితే మిగతా రకాత్‌లలో తస్మియా (బిస్మిల్లాహి ర్రహ్మానిర్రహీమ్) చదివి కేవలం ఫాతిహా సూరానే పఠించి రుకూ చేయాలి.

అదే సున్నత్ నమాజ్ లేక నఫిల్ నమాజ్ అయితే మిగిలిన రకాత్‌లలో ఫాతిహా సూరాతోపాటు, మరో సూరాను కలిపి చదివి రుకూ, సజ్దాలు వగైరా చేయాలి.

రెండు రకాత్‌ల నమాజ్ అయితే కాయిదాలో తషహ్హుద్ తరువాత, మూడు లేక నాల్గు రకాత్‌ల నమాజ్ అయితే మూడు లేక నాల్గు రకాత్‌ల తరువాత కాయిదాలో తషహ్హుద్ చదివి మహాప్రవక్త (స) పై దరూద్ చదవాలి. దరూద్‌లు చాలా ఉన్నాయి. ఒక

దరూద్‌ను ఇక్కడ ఇస్తున్నాము. దీన్నే ప్రవక్త మహనీయులు తన సహచర మహాశయులకు నేర్పారు.

దరూద్:"అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదివ్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిం‌వ్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్‌త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నకహమీదుమ్ మజీద్."

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ
وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ
عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ
اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ
مَّجِيْدٌ -
اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ
وَّعَلٰٓى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ
عَلٰٓى اِبْرَاهِيْمَ وَعَلٰٓى اٰلِ
اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ

**అర్థం:** ఓ అల్లాహ్! హజ్రత్ ఇబ్రాహీం (అ.స) మరియు ఆయన ఆప్తులపై ఎలా కారుణ్యం కురిపించావో అలాగే (హజ్రత్) ముహమ్మద్ (సఅసం) మరియు ఆయన ఆప్తులపై కూడా కారుణ్యం కురిపించు. నిస్సందేహంగా నీవే స్తుతింపతగినవాడవు, గొప్ప మహత్తుగలవాడవు. ఓ అల్లాహ్! (హజ్రత్) ఇబ్రాహీం (అ.స)కు, ఆయన ఆప్తులకు ఎలా శుభాలు ప్రసాదించావో అలాగే (హజ్రత్) ముహమ్మద్ (సఅసం)కు, ఆయన ఆప్తులకు కూడా శుభాలను ప్రసాదించు. నిస్సందేహంగా నీవే స్తుతింప తగిన వాడవు, గొప్ప మహత్తు గలవాడవూను. ఈ దరూద్ చదివాక క్రింది దువాను కూడా పఠించాలి. ఈ దుఆను స్వయంగా మహాప్రవక్త (స) తమ అనుచరులకు ఉపదేశించారు.

"అల్లాహుమ్మ ఇన్నీ జలమ్‌తు నఫ్సీ జుల్మన్ కసీరంవ్ వలా యగ్ఫిరుజ్ జునూబ ఇల్లా అంత. ఫగ్ ఫిర్లీ మగ్ఫిరతమ్ మిన్ ఇందిక వర్‌హమ్‌నీ ఇన్నక అంతల్ గఫూరుర్ రహీం.
(ముస్లిం, తిర్మిజీ)

اَللّٰهُمَّ اِنِّيْ ظَلَمْتُ نَفْسِيْ ظُلْمًا
كَثِيْرًا وَّلَا يَغْفِرُ الذُّنُوْبَ
اِلَّا اَنْتَ فَاغْفِرْلِيْ مَغْفِرَةً
مِّنْ عِنْدِكَ وَارْحَمْنِيْ
اِنَّكَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِيْمُ -

**అర్థం:** "ఓ అల్లాహ్! నేను నా ఆత్మపట్ల ఎంతో అన్యాయం చేసుకున్నాను. పాపాలను నీవు తప్ప మరెవ్వరూ మన్నించజాలరు. కాబట్టి నన్ను నీ ప్రత్యేక క్షమానిధి ద్వారా క్షమించు. నన్ను కరుణించు. నిస్సందేహంగా నీవే మన్నించేవాడవూ కనికరించేవాడవూను."

ఈ దుఆ పఠించాక మొదట కుడివైపునకు ఆపై ఎడమ వైపునకు మెడను త్రిప్పుతూ **'అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహ్'** అని పలకాలి. ఇలా సలాం చేసేటప్పుడు దైవదూతలపై సలాం పంపుతున్నాను అనే సంకల్పం చేసుకోవాలి. ఒకవేళ జమాఅత్‌తో నమాజ్ చేస్తూ ఉంటే ముస్లిములందరికీ సలాం (శాంతి) పంపే సంకల్పం చేసుకోవాలి.

## నమాజ్ అయిన పిదప చదవవలసిన దువాలు

నమాజ్ పూర్తి చేసిన తరువాత దోసిలి ఒగ్గి ఎంతో వినమ్రంగా దువా చేయాలి (ప్రార్థించాలి).

నమాజ్ తరువాత ఇంకా ఇతర సమయాల్లో చేసే దువాలు అనేకం మహనీయ ముహమ్మద్ (స) హదీసుల ద్వారా ధృవపడినవి ఉన్నాయి. వాటిని తరువాత ప్రస్తావిస్తాము. రెండు దువాలను మాత్రం ఇక్కడ ఉదాహరిస్తున్నాము.

**1. రబ్బనా ఆతినా ఫిద్దున్‌యా హసనతంవ్ వ ఫిల్ ఆఖిరతి హసనతంవ్ వకినా అజాబన్ నార్.**

رَبَّنَا آتِنَا فِي الدُّنْيَا حَسَنَةً وَّفِي الْآخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ -

**అర్థం:** ప్రభూ! మాకు ఇహలోకంలోను మంచిని ప్రసాదించు. పరలోకంలోను మంచిని ప్రసాదించు. మమ్మల్ని నరకాగ్ని నుండి రక్షించు.

**2. అల్లాహుమ్మ అంతస్ సలాము వ మిన్‌కస్ సలామ్. తబారక్త యాజల్ జలాలి వల్ ఇక్రామ్.**

**(ముస్లిం)**

اَللّٰهُمَّ أَنْتَ السَّلَامُ وَمِنْكَ السَّلَامُ تَبَارَكْتَ يَاذَا الْجَلَالِ وَالْإِكْرَامِ

**అర్థం:** ఓ అల్లాహ్! నీవు సకల లోపాలకు అతీతుడవు. నీవే శాంతివి. అన్ని రకాల

శాంతులు రక్షణలు నీ ద్వారానే ప్రాప్తమవుతాయి. ఓ ప్రభూ! నీవే సర్వశుభాలకు సరోవరం. ఓ సర్వోత్తమ ప్రదాతా, నీవే సర్వోన్నతుడవు."

ఫర్జ్ నమాజ్ తరువాత మహాప్రవక్త (స) ఆయతల్ కుర్సీని మరియు 33 సార్లు 'సుబ్హానల్లాహ్'ను, 33సార్లు 'అల్ హమ్దు లిల్లాహ్'ను, మరియు 34 సార్లు 'అల్లాహు అక్బర్'ను చదవమని బోధించారు. చివరిగా

لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَحْدَهُ لَا شَرِيْكَ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ

**లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లాషరీకలహు, లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలా కుల్లిషైయిన్ కదీర్** కూడా చదవాలని ప్రబోధించారు.

(ముస్లిం, అబూదావూద్)

ఫర్జ్ నమాజ్ తరువాత ఇమామ్, సుదీర్ఘమైన దువాలు పఠించరాదు. అయితే 'అస్ర్' మరియు 'ఫజ్ర్' నమాజుల్లో, నమాజీలకు ఎలాంటి తొందర లేనట్లయితే సుదీర్ఘమైన దువాలు పఠించవచ్చు.

పైన పేర్కొన్న పద్ధతి ప్రకారమే స్త్రీలూ, పురుషులూ నమాజు చేయాలి. అయితే కొన్ని విషయాల్లో స్త్రీలు, పురుషులు నమాజుచేసే పద్ధతుల్లో కొంత వ్యత్యాసం ఉంది. ఆ వ్యత్యాసం ఏమిటో ఇక్కడ ప్రస్తావిస్తున్నాము.

1. 'తక్బీరె తహ్రీమా' చెప్పేటప్పుడు పురుషులు తమ చేతుల్ని చెవులవరకు పైకెత్తితే, స్త్రీలు కేవలం వారి భుజాల వరకే పైకెత్తాలి.
2. పురుషులు శాలువ లేక దుప్పటి పైన కప్పుకొని నమాజు చేసే చేతులు దాని బయటకు తీసి పైకెత్తాలి. కాని స్త్రీలు అలాకాక అన్ని సందర్భాల్లోను తమ చేతుల్ని కొంగు, లేక కప్పుకున్న వస్త్రం లోపల ఉంచే పైకెత్తాలి.
3. పురుషులు తమ చేతుల్ని నాభిస్థానం దగ్గర కట్టుకోవడం మంచిది. అయితే స్త్రీలు తమ చేతుల్ని తమ వక్షస్థలంపై కట్టుకోవడం తప్పనిసరి.
4. పురుషులు కుడిచేతి బొటన వ్రేలు మరియు చిటికిన వ్రేలితో ఎడమ మణికట్టును పట్టుకుంటే, స్త్రీలు మాత్రం అలాకాక కేవలం తమ కుడి అరచేతిని ఎడమ చేతి అరచేయి వెనుక భాగంపై పెట్టుకొంటే సరిపోతుంది.
5. పురుషులు 'రుకూ'లో తమ వీపు, తల సమంగా ఉంచడం అవసరమైతే, స్త్రీలు తమ చేతులు మోకాళ్ళకు అంది మోకాలిపై చేతివ్రేళ్ళను కలిపి ఉంచగలిగితే చాలు.

6. రుకూలో పురుషుని మోచేతులు అతని ప్రక్కలకు ఎడంగా ఉండాలి. అయితే స్త్రీలు తమ మోచేతుల్ని తమ ప్రక్కలతో కలిపి ఉంచాలి.
7. పురుషులు సజ్దాలో తమ బాహువుల్ని, చంకలకు ఉదరభాగానికి తొడలకు ఎడంగా ఉంచితే స్త్రీలు వాటన్నిటిని దగ్గరగా కలిపి ఉంచాలి.
8. పురుషులు తమ కాలివ్రేళ్ళపై పాదాలను నిలబెట్టి సజ్దా చేస్తే స్త్రీలు సజ్దాలో తమ పాదాలను మడిచి భూమిపై పర్చాలి.
9. పురుషులు 'కాయిదా' స్థితిలో కూర్చునేటప్పుడు తమ కుడిపాదాన్ని నిలబెట్టి ఎడమ పాదాన్ని పరిచి దానిపై కూర్చుంటే, స్త్రీలు మాత్రం తమ రెండు పాదాలను కుడివైపునకే మడిచి తొడల్ని కలిపి ఉంచి కూర్చోవాలి.
10. స్త్రీలు నమాజ్‌లో పరపురుషులకు వినబడేటంత బిగ్గరగా ఖుర్‌ఆన్ పఠించకూడదు.

**ఖుషూ:** పైన చెప్పబడిన నమాజు విధానం, అందులోని ఫర్జులు, సున్నత్‌లు మరియు దాన్ని భంగపరిచే విషయాలు, మక్రూహ్ విషయాలు- వీటన్నిటి సంబంధం నమాజు బాహ్య స్వరూపానికే పరిమితం. అయితే ఈ బాహ్య సలక్షణతకు తోడు అంతరంగ సలక్షణత అంటే హృదయం, మస్తిష్కాలలో సవ్యత అవసరం. ఒకవేళ మీరు నమాజులోని బాహ్య నియమాలన్నిటినీ పాటిస్తే బాహ్యంలో మీ నమాజు నెరవేరినట్లే. ఇప్పుడు మిమ్మల్ని ఎవ్వరూ 'బేనమాజీ' (నమాజు చేయనివాడు)గా భావించలేడు. కాని బాహ్య నియమాలన్నీ పాటించి మనస్సు మేధను మరెక్కడో లగ్నం చేసిన నమాజు నిర్జీవమైందని చెప్పవచ్చు. ఆత్మలేని శరీరం విలువ లేనిది, వ్యర్థమైనదీ అయినట్లే దైవ దృష్టిలో ఏకాగ్రతలేని అశ్రద్ధగా చేసే నమాజు కూడా ఎలాంటి విలువ లేనిదే. అయితే ఒక వ్యక్తి చేసే నమాజు ఎలాంటిదీ అన్న నిర్ణయం చేసే అధికారం మనకు లేదు. అల్లాహ్ మాత్రమే నిర్ణయించాలి. మనకు ఈ విషయంలో ఎలాంటి జోక్యం చేసుకునే హక్కు లేదని గమనించాలి.

## 'ఖుషూ' అంటే ఏమిటీ?

నిఘంటువుల్లో 'ఖుషూ' అంటే లొంగిపోవడం, వంగడం, ప్రశాంతత చెందడం అని అర్థాలున్నాయి. షరీఅత్ పరిభాషలో మనోమేధస్సుల్ని పూర్తిగా దైవం వైపునకే మరల్చడం, ఆయన సమక్షంలో వంచడం, వినమ్రతను దాస్యభావాన్ని కలిగి ఉండటాన్ని 'ఖుషూ' అంటారు. మనోమేధస్సుల్ని పూర్తిగా దైవం వైపునకే లగ్నం చేసినప్పుడు, శరీరంపై కూడా దాని ప్రభావం పడుతుంది. శారీరకంగా ఓ ప్రశాంతత, నిశ్చలత ఏర్పడుతాయి.

అలాగే మనిషి అంతర్యంలో దైవభక్తిభావం, ఖుషూ స్థితి ఏర్పడినప్పుడే బాహ్యంలోని నియమాలనూ సవ్యంగా పాటించడం సాధ్యమవుతుంది. ఓసారి ఓ వ్యక్తి నమాజు చేస్తూ తన గడ్డాన్ని ఆడించుకోవడం చూసిన మహాప్రవక్త (స) ఇలా అన్నారు.

لَوْ خَشَعَ قَلْبُهُ لَخَشَعَتْ
جَوَارِحُهُ - (مدارج السالكين)

"ఇతని మనస్సులో 'ఖుషూ' ఉన్నట్లయితే ఇతని శరీర అంగాలు కూడా శాంతం గానే ఉండేవి."

(మదారిజుస్సాలికీన్)

దీనిద్వారా అర్థం అయిందేమిటంటే అంతరంగ ఖుషూ ప్రభావం శారీరక చేష్టలపై కూడా పడుతుంది. కాని ఒకవేళ శరీర అంగాంగాలు బాహ్యంలో వినమ్రత ఉట్టిపడేలా కనిపించినా అతని హృదయంలో ఎలాంటి వినమ్రత లేకుంటే, దాన్ని మహాప్రవక్త (స) కపట ఖుషూ అని అన్నారు. అంటే అది ప్రదర్శనాబుద్ధితో పాటించే ఖుషూ అన్నమాట. ఓసారి మహాప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు. "ఖుషూయె నిఫాక్ (కపట ఖుషూ) నుండి రక్షణ కోరండి" అని. దానికీ సహాబా (ర.అన్) అడిగారు, దైవప్రవక్తా! ఖుషూయె నిఫాక్ అంటే ఏమిటి అని.

"శరీరం వినమ్రమై ఉన్నా, హృదయంలో వినమ్రత అంటూ లేకపోవడం" అని జవాబిచ్చారు దైవప్రవక్త (స).

ఇందుకే హజ్రత్ ఉమర్ (రఅన్) ఎవరైనా మెడవంచి నమాజు చేస్తూ కనిపిస్తే, 'మెడను పైకెత్తి నమాజు చేయండి, ఖుషూ అనేది మీ మెడల్లో కాదు, అది ఉండేది హృదయాంతరాళంలో" అని అనేవారు.

కాబట్టే మహాప్రవక్త (స) రుకూలో తరచూ ఈ దువాను పఠించేవారు.

خَشَعَ لَكَ سَمْعِيْ وَبَصَرِيْ
وَمُخِّيْ وَعَظْمِيْ وَعَصَبِيْ

"ఖషఅ లక సమ్'యీ వబసరీ వముఖ్ఖీ వఅజ్మీ వఅసబీ."

అర్థం: ఓ అల్లాహ్ నీ సమక్షంలోనే నా చెవులు, కళ్ళు, ఎముకలు, నరాలు సర్వం లొంగిపోయాయి.

ఈ దువాలో బాహ్యాంతరాళాల ప్రభావాలు పూర్తిగా ప్రతిఫలిస్తున్నాయి.

## ఖుర్ఆన్, హదీసుల్లో ఖుషూ ప్రాముఖ్యత

ఈ కారణంచేతనే ఖుర్ఆన్ మరియు హదీసుల్లో దీని ప్రాముఖ్యత గురించి

చెప్పబడింది. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది.

"ఖుషూ పాటిస్తూ నమాజ్ చేసేవారు తప్పక విజయం సాధిస్తారు."
(అల్‌మోమినూన్)

قَدْ اَفْلَحَ الْمُؤْمِنُوْنَ الَّذِيْنَ هُمْ فِيْ صَلَاتِهِمْ خٰشِعُوْنَ

పై వాక్యం ద్వారా, పరలోకమందు మోమిన్‌కు ప్రాప్తమయ్యే విజయం ఖుషూ ఫలితంగానే అని తెలుస్తోంది. మరో ఆయత్‌లో ఇలా ఉంది:

"సహనం ద్వారానూ, నమాజ్ ద్వారానూ సహాయాన్ని పొందండి. నమాజ్ చెయ్యడం నిస్సందేహంగా కష్టతరమయినదే. కాని హృదయాల్లో ఖుషూ (భయభక్తులు) గల వారికి మాత్రంకాదు. ఖుషూ గల వారెవరంటే - ఎవరి హృదయాల్లోనయితే తాము తమ ప్రభువును కలువ బోతున్నామన్న భావం, తాము ఆయన వైపునకే మరలిపోతున్నామన్న తలంపు దృఢమయి ఉంటుందో వారు."
(అల్ బఖర)

وَاسْتَعِيْنُوْا بِالصَّبْرِ وَالصَّلٰوةِ وَاِنَّهَا لَكَبِيْرَةٌ اِلَّا عَلَى الْخٰشِعِيْنَ الَّذِيْنَ يَظُنُّوْنَ اَنَّهُمْ مُّلٰقُوْا رَبِّهِمْ وَاَنَّهُمْ اِلَيْهِ رٰجِعُوْنَ ٥
(سورة بقره)

పైన ఓ హదీసు ఉదాహరించాము. మరో ప్రవచనం ఇలా ఉంది.

"ఎవడైతే నమాజులో ఖుషూ (భయభక్తులు) పాటించడో అతని నమాజు ఫలప్రదం కాదు."

لَا صَلٰوةَ لِمَنْ لَّا يَتَخَشَّعُ۔

మహాప్రవక్త (స) తరచూ తమ దువాల్లో ఖుషూ లేని హృదయం నుండి అల్లాహ్ శరణును వేడుకునేవారు.

"అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ ఖల్బిల్ ల్లాయఖ్షఉ."

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُبِكَ مِنْ قَلْبٍ لَّا يَخْشَعُ۔ (مسلم)

అర్థం: ఓ అల్లాహ్ ఖుషూ లేని హృదయం నుండి రక్షణకై నీ శరణు వేడుతున్నాను.

ఇందుకే సహాబా (ర.అన్), ధర్మనిష్ఠాపరులైన మహనీయులు అందరూ ఈ సద్గుణాన్ని పొందేందుకు ప్రత్యేక శ్రద్ధ వహించేవారు. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (ర.అన్) నమాజు చేసేటప్పుడు తమ మనోమేధస్సుల్ని దైవం వైపునకు ఎంతగా లగ్నం చేసేవారంటే, ఆయన శరీరావయాలన్నీ నిశ్చలమయిపోయి చూపురులకు, ఆయన చలనం లేని ఓ కొయ్యబొమ్మలా అనిపించేవారు.

## ఖుషూను ఎలా సాధించవచ్చు?

ఖుషూ సాధించేందుకు ఎలాంటి కృత్రిమమైన, షరీఅత్‌కు వ్యతిరేకమైన విధానాన్నీ పాటించరాదు. ఈ సుగుణం మూడు విషయాల అభ్యాసం వలన దానంతట అదే అలవడుతుంది.

1. మనిషి దైవం సమక్షంలో తన దాస్య భావాన్ని తన అసహాయతను, అల్లాహ్ ఘనతను ఆయన గొప్పదనాన్ని, వైభవాన్ని పరలోకంలో జవాబు చెప్పవలసి ఉన్నదన్న విశ్వాసాన్ని తన మనస్సులో దృఢంగా నాటుకోవాలి.

2. ఇస్లామీయ ఆజ్ఞలన్నిటినీ చిత్తశుద్ధితో సతతం పాటించాలి.

3. నమాజును, దువాలను నియమబద్ధంగా, ఇతోధికంగా పాటించాలి. ఫర్జులే కాక సున్నత్, నఫిల్ నమాజుల్ని కూడా నియమానుసారంగా చేయాలి. నిత్యజీవితంలో అనుదిన అవసరాలకుగాను హదీసుల్లో ప్రస్తావింపబడిన దుఆలు పఠిస్తూ ఉండాలి. ఏకాంతంలో పరలోక సాఫల్యం కోసం ఆవేదనతో విలపిస్తూ దైవాన్ని వేడుకోవాలి.

పైన ప్రస్తావించిన ఖుర్ఆన్ ఆయత్‌లో ఈ మూడు విషయాలు చెప్పబడ్డాయి. మొదటి ఆయత్‌లో సబ్ర్ (సహనం) గురించి చెప్పబడింది. సబ్ర్ అంటే స్థిరచిత్తంతో నిత్యతతో ఏ పనినైనా చెయ్యడం. ఆ తరువాత నమాజు ద్వారా సహాయాన్ని పొందాలని, దాని మీదట పరలోకంలో దైవ సాన్నిధ్యాన హాజరవడాన్ని గుర్తుంచుకోవాలని బోధించడం జరిగింది.

"ఏదైనా కష్టం వాటిల్లినప్పుడు మహాప్రవక్త (స) ఆందోళనతో నమాజ్‌కై ఉద్యుక్తులయ్యేవారు" అని హదీసు గ్రంథాల్లో ఆయన దివ్యచరితం నిక్షిప్తమై ఉంది.

## సామూహిక నమాజ్

పురుషులు ఫర్జ్ నమాజ్‌ల నిమిత్తం ప్రతిరోజు అయిదు పూటలా మస్జిద్‌కెళ్ళి జమాఅత్‌తో కలసి సామూహికంగా నిర్వహించడం చాలా అవసరం. సామూహిక నమాజ్

చేయవలసిన ఆవశ్యకతను గురించి ఖుర్ఆన్, హదీసుల్లో పలుచోట్ల నొక్కి చెప్పడం జరిగింది. ఇందులో మన ధార్మిక, ప్రాపంచిక ప్రయోజనాలు కూడా ఇమిడి ఉన్నాయి.

**"నమాజ్ చేసే వారితో కలసి నమాజ్ చెయ్యండి." (ఖుర్ఆన్)** وَارْكَعُوا مَعَ الرّٰكِعِيْنَ ○ (بقرہ)

అంతేగాక ఖుర్ఆన్‌లో నమాజ్‌ని నిర్ణీత వేళకు చేయడం విధి (ఫర్జ్)గా చేయబడిం దని కూడా ఉంది.

మహాప్రవక్త (స) అన్నారు: "ఒంటరిగా చేసే నమాజ్‌కంటే సామూహికంగా (జమాఅత్‌తో కలసి) చేసే నమాజ్ 27 రెట్లు మేలయినది."

మరొక సందర్భంలో ఆయనిలా హెచ్చరించారు:

"ఎవరైతే ఎలాంటి కారణం లేకుండా జమాఅత్‌లో పాల్గొనరో వారి ఇండ్లకు నిప్పెట్టాలని నా మనసు కోరుతోంది."

దైవప్రవక్త (స) వ్యాధిగ్రస్తులయి ఉన్న చివరి రోజుల్లో ఆయనకు నడిచే ఓపిక కూడా లేకుండాపోయింది. ఇద్దరు మనుషుల సహాయంతో ఆయన మస్జిద్‌కెళ్ళి జమాఅత్‌తో నమాజు చేశారు. ఒక సహాబి ఓ రోజు రాత్రంతా నమాజు చేయడం వల్ల ఫజ్ర్ వేళ నిద్రపట్టింది. ఫజ్ర్ నమాజుకై జమాఅత్‌లో పాల్గొనలేకపోయారు. ఈ విషయం హజ్రత్ ఉమర్ (రజి)కు తెలిసి "ఈయన ఒకవేళ రాత్రంతా నిద్రపోయి ఫజ్ర్ (నమాజుకై) జమాఅత్‌లో పాల్గొని ఉంటే ఇది రాత్రంతా చేసిన నఫిల్ నమాజ్ కంటే ఎంతో మంచిదయి ఉండేది."

ఇమామ్ అహ్మద్ (రహ్మాలై), ఇమామ్ షాఫయి (రహ్మాలై)ల దృక్పథాల ప్రకారం జమాఅత్‌తో కలసి (సామూహిక) నమాజ్ చేయడం ఫర్జ్. ఇమామ్ అబూహనీఫా రహ్మాలై దృష్టిలో ఇది సున్నతె మోక్కిదా.

## సామూహిక నమాజ్ ప్రయోజనాలు

సామూహిక నమాజ్ వల్ల ఒకవేళ ఎలాంటి ప్రయోజనం లేదనుకున్నా, ఇది దేవుడు, ఆయన ప్రవక్త (స) ఇచ్చిన ఆదేశం అయినందున దాన్ని పాటించడం చాలా అవసరం. దైవం, దైవప్రవక్త ఎలాంటి ప్రయోజనం లేకుండానే ఏ ఆదేశమూ ఇవ్వలేదు. జమాఅత్ వల్ల కలిగే కొన్ని లాభాలు చూడండి:

1) జమాఅత్ వల్ల పరస్పరం ఐకమత్యం, సానుభూతులు జనిస్తాయి. ముస్లింలు రోజూ అయిదుపూటలు పరస్పరం కలుసుకోవడం వల్ల ఒకరి కష్టసుఖాలు మరొకరు

తెలుసుకోగలరు. ఒకరిపై మరొకరికి సానుభూతి పెరుగుతుంది. ధనికులకు పేదవాళ్ళ స్థితిగతులు, వారి అవసరాలేమిటో తెలుస్తాయి. అందుచేత వారికి సహాయం చేసే అవకాశం లభిస్తుంది. ఎవరైనా వ్యాధిగ్రస్తులయితే ఆ సంగతి ఇతర ముస్లింలకు వెంటనే తెలిసి పోతుంది. దాంతో వారు రోగులను పరామర్శించడానికి వెళ్తారు. ఇలా చేయడం వల్ల వారి మధ్య పరస్పరం ప్రేమ, సంఘీభావం ఏర్పడుతాయి.

2) జమాఅత్‌తో నమాజ్ చేయడానికి ముస్లింలందరూ వస్తారు గనక వారిలో పండితులూ ఉంటారు, పామరులూ ఉంటారు. ఎక్కువ చదువుకున్న వాళ్ళూ ఉంటారు, తక్కువ చదువుకున్న వాళ్ళూ ఉంటారు. అప్పుడు బొత్తిగా చదువు రానివాళ్ళు, తక్కువ చదువుకున్న వాళ్ళు ధర్మానికి సంబంధించిన ఏదైనా విషయం తెలుసుకోదలిస్తే వారు దాన్ని సులభంగా తెలుసుకునే వీలుంటుంది. మరోవైపు అజ్ఞానులకు, ధర్మ పరిజ్ఞానంలేని వాళ్ళకు ధార్మిక విషయాలు తెలియజేసేందుకు కృషి చేయాలన్న బాధ్యతాభావం చదువుకున్న వాళ్ళలో జనిస్తుంది.

3) సామూహికంగా నమాజ్ చేయడం వల్ల దాన్ని చూసి ఇతర ముస్లింలలో కూడా నమాజ్ చేయాలన్న ఆసక్తి కలుగుతుంది.

4) జమాఅత్ ద్వారా సమానత్వం గురించిన భావం జనిస్తుంది. మస్జిద్‌లో ధనికులు, పేదలు, యజమానులు, సేవకులు, పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళు అందరూ ఒకే పంక్తిలో భుజానికి భుజం ఆనించి నిలబడతారు. దీనివల్ల దేవుని సన్నిధిలో ఆయన దాసులంతా సమానమే అన్న సమతాభావం వారిలో చోటు చేసుకుంటుంది.

5) జమాఅత్ ద్వారా ఇతరుల ముందు ఇస్లాం సామూహిక వైభవం వ్యక్తమవుతుంది. ఇస్లామియ ఆరాధన ప్రాముఖ్యం తెలుస్తుంది.

6) ముస్లిలందరూ ఒకచోట, కలసి నమాజ్ చేయడం, కలసి దుఆ చేయడం అనే పని దైవకారుణ్యం వర్షించడానికి, పుణ్యఫలం వృద్ధినొందడానికి కారణభూత మవుతుంది. ఒక దీపాన్ని మరొక దీపంతో వెలిగిస్తాం. అలాగే నమాజీలలో అనేక రకాల మనుషులుంటారు. కొందరు అధిక పుణ్యాత్ములు, మరికొందరు పుణ్యాత్ములు ఉంటారు. ధర్మకార్యాల్లో కొందరు ఎక్కువ నిష్ఠగలవారయి ఉంటే మరికొందరు తక్కువ నిష్ఠ కలవారయి ఉంటారు. అప్పుడు వీరంతా పరస్పరం కలుసుకోవడం వల్ల ఒకరి పుణ్య ప్రభావం మరొకరి మీద తప్పనిసరిగా పడుతోంది. ఒక మనిషి ఎలాంటి వ్యక్తులతో కలసి తిరుగుతాడో, స్నేహం చేస్తాడో, అతనిపై సాధారణంగా అలాంటి ప్రభావమే పడుతుంది. అదే విధంగా నమాజీలతో సహచర్యం చేయడం వల్ల, వారితో కలసి తిరగడం వల్ల

ఇతరుల్లో సత్కార్యాలు వృద్ధి అవుతాయి. సత్కార్యాలు పెరిగిన కొద్దీ దుష్కార్యాలు తగ్గి పోతాయి. చివరికి ఇది దైవకారుణ్యం వర్షించేందుకు కారణభూతమవుతుంది.

## సామూహిక నమాజ్ ఎవరికి వర్తిస్తుంది

1. ప్రాజ్ఞత వచ్చిన ప్రతి ముస్లిం పురుషునిపై జమాఅత్‌తో (సామూహిక) నమాజ్ చేయడం వాజిబ్‌గా నిర్ణయించబడింది. అయితే అతను స్థిరనివాసి అయి, ఆరోగ్యవంతుడయి, సామూహిక నమాజ్ చెయ్యకుండా వారించే కారణంలేని వాడయి ఉండాలి.
2. స్త్రీలు, పిల్లలపై సామూహిక నమాజ్ నిర్బంధం లేదు. అయితే మగ పిల్లలు మస్జిద్‌కు వెళ్ళడం మంచిదే. అప్పుడు వారి వరుస వేరుగా ఉండాలి. అదే విధంగా స్త్రీలు సామూహిక నమాజ్ చేయడం వాజిబ్ కాకపోయినప్పటికి వారొకవేళ ఇంట్లో సామూహిక నమాజ్ చేయదలచుకుంటే అలా చేసే అనుమతి ఉంది. దీని వివరాలు తరువాత వస్తాయి.
3. అదే విధంగా ఇండ్లకు దూరంగా ప్రయాణంలో ఉన్న వారిపై కూడా సామూహిక నమాజ్ వాజిబ్‌గా లేదు. కాని కొందరు వ్యక్తులు కలసి ప్రయాణం చేస్తున్నప్పుడు వారు సామూహికంగా నమాజ్ చేయడమే మంచిది.
4. అలాగే వ్యాధిగ్రస్తులపై, మరేదైనా అవాంతరం ఉన్నవారిపై కూడా సామూహిక నమాజ్ వాజిబ్‌గా లేదు.

## ఏ పరిస్థితుల్లో జమాఅత్‌లో పాల్గొనాల్సిన అవసరం లేదు

ఈక్రింది కారణాలు, అవాంతరాలు ఉన్నప్పుడు ఎవరైనా సామూహిక నమాజ్ చేయడాన్ని వదిలేస్తే అలాంటి వారిని జమాఅత్‌ని విడనాడిన వారని అనలేము. అయితే వీటిలోని కొన్ని పరిస్థితుల్లో వారు జమాఅత్‌లో పాల్గొంటే పాల్గొనకపోవడం కన్నా అదే ఉత్తమం. ఈ ఇబ్బందులు, కారణాలు ఇవి:

1. కుండపోతగా వర్షం కురుస్తున్నప్పుడు గొడుగు, రెయిన్‌కోట్ వగైరా లేని స్థితిలో మస్జిద్‌కు వెళ్తే దుస్తులు పూర్తిగా తడుస్తాయనో లేదా మరేదైనా నష్టం వాటిల్లు తుందనో భయం ఉన్నప్పుడు.
2. దారిలో అమితమైన బురద, రొచ్చు ఉండి, అది చెప్పులకు, బూట్లకు బాగా అంటు కుని కాళ్ళు జారుతాయన్న భయం ఉన్నప్పుడు. ఈ పరిస్థితి ఎక్కువగా గ్రామ ప్రాంతాల్లో ఎదురవుతుంది. పట్టణాల్లో రోడ్లు సాధారణంగా శుభ్రంగా ఉంటాయి.

3. ఎముకలు కొరికే చలి ఉన్నప్పుడు, శీతాకాలంలో జనం తిరగలేనంతగా మంచు కురిసే ప్రాంతాలకు ఈ ఆదేశం ఎక్కువగా వర్తిస్తుంది. లేదా చలిలో బయటికి వెళ్తే వ్యాధి అధికమవుతుందని భయమున్న వ్యాధిగ్రస్తులకు, బలహీనులకు వర్తిస్తుంది.
4. రాత్రివేళ నమాజ్ సమయంలో కటిక చీకటి ఆవరించి ఉన్నప్పుడు.
5. మస్జిద్‌కు వెళ్తే ఇంట్లో దొంగలు పడే ప్రమాదం ఉన్న స్థితిలో.
6. ప్రయాణం చేయడానికి నిర్ణయించుకుని, బండి బయలుదేరే వేళ పూర్తిగా దగ్గర పడినప్పుడు సామూహిక నమాజ్‌లో పాల్గొంటే బండి తప్పిపోతుందని, బండి తప్పిపోతే నష్టం కలుగుతుందని భయం ఉన్న స్థితిలో.
7. అంధుడు, వికలాంగుడు జమాఅత్‌లో పాల్గొనవలసిన అవసరం లేదు. అయితే అంధుడు లేక వికలాంగుడు సులభంగా మస్జిద్‌కు వెళ్ళగలిగే స్థితిలో ఉంటే అలాంటి వారు జమాఅత్‌ని విడనాడకూడదు. ఒక అంధుడు ఇంట్లోనే నమాజ్ చేసుకోవడానికి అనుమతి అడిగితే "నీకు అజాన్ వినిపిస్తుందా?" అని ప్రశ్నించారు దైవప్రవక్త (సఅసం). దానికి అతను వినిపిస్తుందని జవాబిచ్చాడు. "అయితే నీవు మస్జిద్‌కు వెళ్తూ ఉండ"మని దైవప్రవక్త (సఅసం) ఆదేశించారు.
8. మలమూత్ర విసర్జనకు తీవ్ర అగత్యం ఏర్పడినప్పుడు.
9. ఆకలిగా ఉండి, భోజనం కూడా సిద్ధంగా ఉన్నప్పుడు నమాజ్‌కు వెళ్తే మనసు భోజనం మీదే ఉంటుందని అనుకున్నప్పుడు.
10. ఎవరైనా రోగికి సపర్యలు చేసే బాధ్యత ఉన్నప్పుడు, ఆ రోగికి సేవచేసే వారు మరెవరూ లేనప్పుడు, నమాజ్ కోసం మస్జిద్‌కు వెళ్తే రోగికి బాధ కలుగుతుందని లేదా అతను ఆందోళన చెందుతాడని భావిస్తే అలాంటి వ్యక్తి కూడా సామూహిక నమాజ్‌లో పాల్గొనవలసిన అవసరం లేదు.

## ఇమామ్ మరియు ముక్తది

ఇమామ్ అంటే నాయకుడు. ముక్తది అంటే నాయకుడ్ని అనుసరించేవాడు అని అర్థం. అంచేత ఇమామ్ అయిన వ్యక్తికి నాయకత్వ సామర్థ్యం కూడా ఉండాలి. వ్యక్తిని ముక్తదీలు నాయకునిగా పరిగణించాలి. ఈ రోజుల్లో నమాజ్‌లో ఇమామత్ చాలా హీనమైన విషయంగా మారిపోయింది. ప్రజలు ఎలాంటి విలువ, ప్రాముఖ్యం లేని వ్యక్తిని ఇమామ్‌గా చేసుకుంటున్నారు. కాని ఇస్లాంలో ఇమామత్ ఎంతో విలువైన హోదాగా

పరిగణించబడింది. దైవప్రవక్తలు అందరూ స్వతహాగా తమ అనుచర సమాజాలకు ఇమామత్ వహించేవారు. మన ప్రియ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా స్వయంగా నమాజ్‌కు నాయకత్వం వహించేవారు. ఆయన తరువాత హజ్రత్ అబూబక్ర్ (రజి) యావత్తు ఉమ్మత్ (అనుచర సమాజం)లో కెల్లా శ్రేష్ఠులు. నమాజ్‌కు నాయకత్వం వహించమని ఆయన్ని దైవప్రవక్త (సఅసం) ఆదేశించారు. అదే విధంగా హజ్రత్ అబూబక్ర్ (రజి) తరువాత వచ్చిన ఖలీలఫాలందరు స్వయంగా నమాజ్‌కు ఇమామత్ వహించారు. ఈ కారణంగానే ఇస్లామీయ పాలనలో దేశాధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు లేదా ఖాజీ (న్యాయమూర్తి) మాత్రమే ఇమామత్ వహిస్తారు. మరొకరికి ఇమామత్ వహించే అధికారం లేదు.

ఇమామత్ ఎంతో విలువ బాధ్యతలతో కూడిన పదవో ఆలోచించండి. అంచేత మన నమాజ్‌కు నాయకత్వం వహించడానికి అందరికన్నా ఎక్కువ విద్యాజ్ఞానాలు ఆర్జించిన, ఎక్కువ శీలవంతుడైన వ్యక్తినే ఇమామ్‌గా నిర్ణయించాలి. నమాజ్ కొరకు ఇమామ్‌గా నిర్ణయించిన వ్యక్తిని ఇతర ప్రతి వ్యవహారంలోనూ మనం మార్గదర్శిగా చేసుకోవాలి. దైవప్రవక్త (సఅసం) ఇహలోకం వీడిపోయిన తరువాత ఖిలాఫత్ సమస్య వచ్చినప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ అబూబక్ర్ (రజి) చేతిపై బైత్ (శపథం) చేస్తూ ఇలా అన్నారు: "దైవప్రవక్త (సఅసం) నమాజ్ విషయంలో ఈయన్ని (హజ్రత్ అబూబక్ర్ (రజి)ని) మన ఇమామ్‌గా చేశారు. అలాంటప్పుడు ఆయన్ని మనం మన జీవితరంగా లన్నింటిలో ఇమామ్‌గా ఎందుకు అంగీకరించకూడదు?"

## ఎలాంటి వ్యక్తిని ఇమామ్‌గా చెయ్యాలి?

ఇమామ్‌ని ఎన్నుకునే అధికారం ముక్తదీలకుగాని, సాధారణ నమాజీలకుగాని ఉంటుంది. అయితే విద్యాసంపన్నుడైన మంచి వ్యక్తి ఉన్నప్పటికీ, అతడ్ని వదలి జ్ఞాన హీనుడ్ని ఇమామ్‌గా చేసుకుంటే అది దోషం. ఇమామ్ ఎంపికలో అనేక విషయాలను దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది.

1. మొట్టమొదటి అంశం ఖుర్‌ఆన్, హదీసుల జ్ఞానం కలిగి ఉండటంతోపాటు, వాటిని ఆచరించే వ్యక్తిని ఇమామ్‌గా చేసుకోవాలి. ఒకవేళ ఆచరణ లేకుండా కేవలం జ్ఞానం మాత్రమే ఉన్న వ్యక్తి అయితే అతని కంటే జ్ఞానం ఎక్కువగా లేకపోయినా ప్రవక్త సంప్రదాయాల్ని (గట్టిగా) పాటించే వ్యక్తే మెరుగు.
2. ధర్మజ్ఞానం కలిగిన వ్యక్తి ఎవరూ లేకపోతే నమాజీలలోనే అందరికన్నా బాగా (సరయిన రీతిలో) ఖుర్‌ఆన్ పఠించగల వ్యక్తిని ఇమామ్‌గా చేసుకోవాలి. బాగా

ఖుర్‌ఆన్ పఠించడమంటే అక్షరాలను సరిగా ఉచ్చరించాలని అర్థం. ఉదాహరణకు ఖై, ఖాఫ్, ఐన్, గైన్, షీన్ మొదలైన అక్షరాలను వాటి అసలైన ధ్వనితో ఉచ్చరించాలి. అలాగే జె-జ్వాత్, హె-హై లాంటి అక్షరాల మధ్యఉన్న వ్యత్యాసాన్ని గ్రహించి ఉచ్చరించాలి. ఒకవేళ ఖుర్‌ఆన్‌ని సరయిన రీతిలో బాగా పఠించేవాళ్ళు ఇద్దరు ఉన్నప్పుడు, వారిలో మంచి కంఠ స్వరం ఉన్న వ్యక్తిని ఇమామ్‌గా చేయడం మంచిది.

3. ఆ తరువాత సంపాదించడంలో, తినడంలో, ఇతర అన్ని విషయాల్లోనూ హలాల్, హరాంల వ్యత్యాసాన్ని పాటించే వ్యక్తి ఇమామత్‌కు అర్హుడవుతాడు-అతనికి కొద్దిపాటి జ్ఞానమే ఉన్నాసరే.
4. ఆ తరువాత అందరికన్నా ఎక్కువ వయస్సున్న వ్యక్తి అర్హుడు.
5. ఆ తరువాత అందరికన్నా ఎక్కువ గుణవంతుడు అర్హుడు.
6. ఆ తరువాత గంభీర వ్యక్తిత్వం కలిగిఉన్న మనిషి అర్హుడు.

## ఎవరి ఇమామత్ మక్రూహ్ అవుతుంది?

ఈ క్రింది వ్యక్తులు (సామూహిక) నమాజ్‌కు నాయకత్వం (ఇమామత్) వహించడం మక్రూహ్ (అవాంఛనీయం) అవుతుంది :

1. బిద్‌అతి, ఖుర్‌ఆన్, హదీసుల్లో ప్రస్తావించబడని పనిని చేయడం పుణ్యప్రదమని భావించే లేక చెప్పే వ్యక్తిని బిద్‌అతి అంటారు. ఉదా: ముహర్రంలో ప్రత్యేక సంతాపం ప్రకటించేవాళ్ళు, సమాధుల మీద పూలు, గలేబులు వేసేవారు, దైవేతరుల ముందు మొరపెట్టుకునే, మొక్కుబడులు చేసుకునేవాళ్ళు. ఒకవేళ ఇమామత్ కోసం ఇతరులెవరూ లభించకపోతే లేదా బిద్‌అతీని ఇమామ్‌గా చేయని పక్షంలో యుద్ధాలు, కలహాలు తలెత్తే ప్రమాదం ఉన్నప్పుడు మాత్రం బిద్‌అతీ వెనుకనే నమాజ్ చేయాలి. యుద్ధాలు, కలహాలు రేకెత్తే వాతావరణానికి తావీయకూడదు.
2. ఫాసిక్, ఖుర్‌ఆన్, హదీసుల్ని ఆచరించని వ్యక్తిని ; పాపాలకు, అపరాధాలకు దూరంగా ఉండనివాడ్ని ఫాసిక్ అంటారు.
3. మూర్ఖుడు, అజ్ఞాని.
4. అంధుడు, కాని పరిశుద్ధత వగైరా విషయాల పట్ల బాగా శ్రద్ధ చూపే తెలివయిన అంధుడయితే అతడ్ని ఇమామ్ చేయడంలో ఎలాంటి దోషం లేదు.

5. ఎల్లప్పుడూ హరామ్ (నిషిద్ధం) వస్తువుల్ని తినేవాడు. ఉదా: వడ్డీ తినేవాడు, లంచం తీసుకునేవాడు వగైరా. ఇలాంటి వ్యక్తి తప్ప ఇమామత్ వహించే అర్హత ఉన్నవారు ఇంకెవరూ లభించకపోతే, లేదా అతడ్ని ఇమామ్ చేయకపోతే పోట్లాటలు వచ్చే ప్రమాదం ఉన్నప్పుడు అతడ్నే ఇమామ్‌ని చేయాలి. ఎందుకంటే ఇటు జమాఅత్ కూడా అవసరమే, అటు జగడాలు, పోట్లాటలు లేకుండా చూడటం కూడా అవసరమే.

## కొన్ని ముఖ్య సూచనలు

1. ఎవరయినా ఒకతను ఒంటరిగా ఫర్జ్ నమాజ్ చేయడం ప్రారంభించిన తరువాత మరొక వ్యక్తి వచ్చి నమాజులో అతని పక్కన చేరితే, అతను నమాజ్‌లో ఖుర్ఆన్ మౌనంగా పఠిస్తుంటే, దాన్ని కాస్తా ఇప్పుడు బిగ్గరగా పఠించనారంభించాలి.
2. ఒకవేళ ఇమామ్ ఏదయినా కారణం వల్ల తయమ్ముమ్ చేసి నమాజ్ చేస్తుంటే లేదా మసహ్ చేసి నమాజ్ చేస్తుంటే లేదా మరేదయినా మార్గాంతరం లేని పరిస్థితిలో కూర్చొని నమాజ్ చేస్తుంటే, అతనికంటే మేలయినవాడు మరెవరూ లేకపోతే అతను ఇమామత్ చేయడంలో ఎలాంటి దోషం లేదు.
3. అదే విధంగా ఒక వ్యక్తి ఫర్జ్ నమాజ్ చేసిన తరువాత ఇమామ్ వెనుక మళ్ళీ అదే నమాజ్‌ని నఫిల్ సంకల్పంతో చేస్తే అందులోనూ ఎలాంటి దోషం లేదు. అయితే ఆ విధంగా రెండవసారి ఫజ్ర్, అస్ర్, మగ్రిబ్ వేళల నమాజ్ చేయకూడదు. జుహర్, ఇషా నమాజులు మాత్రమే చేయవచ్చు. కాని ఫర్జ్ నమాజ్ చేసిన వ్యక్తి అదే ఫర్జ్ నమాజ్‌కై జమాఅత్‌కు ఇమామత్ వహించడం ధర్మసమ్మతం కాదు.
4. ముక్తదీలకు ఇష్టం లేకుండా వారికి ఇమామత్ వహించడం మక్రూహె తహ్రీమీ అవుతుంది. అలాగే ఒక మస్జిద్‌కు ఇమామ్ ఉన్నప్పటికీ అతని అనుమతి లేకుండా వేరొక వ్యక్తి ఇమామత్ వహించడం కూడా మక్రూహె తహ్రీమి అవుతుంది.

## జమాఅత్‌లో నిలబడే పద్ధతి

1. ఇద్దరు వ్యక్తులు ఉన్నా జమాఅత్ నమాజ్ చేయవచ్చు. వాళ్ళిద్దరు కలిసే నమాజ్ చేయవలసి ఉంటుంది. అయితే ఇద్దరు సామూహిక నమాజ్ చేయవలసివస్తే వాళ్ళిద్దరు ఒకరి వెనుక మరొకరు నిలబడకుండా ఇమామత్ వహిస్తున్న వ్యక్తికి కుడివైపు రెండు మూడు అంగుళాలు వెనక్కి జరిగి రెండవ వ్యక్తి నిల్చోవాలి.

అయితే నమాజు జరుగుతున్న స్థితిలో మూడవ వ్యక్తివస్తే అతను ముక్తదీని మెల్లిగా వెనక్కి లాగి అతని పక్కన నిల్చోవాలి. ఒకవేళ ముక్తదీని వెనక్కి లాగడానికి వెనుక భాగాన తగినంత చోటు లేకపోతే ఇమామ్ కాస్త ముందుకు జరగవలసి ఉంటుంది. ఇమామ్ ముందుకు జరగడానికి కూడా చోటు లేకపోతే మూడవ వ్యక్తి అతని ఎడమ వైపున నిలబడాలి. ఒకవేళ ముక్తదీని వెనక్కి లాగడం, లేక ఇమామ్‌ని ముందుకు జరిపించడం మరిచిపోతే లేదా అలా చేయాలన్న విషయమే తెలియకపోతే స్వయంగా ఇమామే పరిస్థితి గ్రహించి ముందుకు జరగాలి; లేదా ముక్తదీ వెనక్కి జరిగి నిలబడాలి.

2. ఇద్దరు లేక అంతకన్నా ఎక్కువ మంది ముక్తదీలు ఉంటే ఇమామ్ నమాజ్‌కు ప్రారంభం నుంచే ముందు నిల్చోవాలి.

3. జమాఅత్‌లో ముక్తదీలు బాగా కలసి (పరస్పరం ఆనుకొని) తిన్నని వరుసలో నిలబడాలి. "పంక్తి వంకరగా ఉంటే మీ హృదయాల్లో కూడా వక్రత చోటు చేసుకుంటుంది" అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. ఆయన (సఅసం) ఇమామత్ వహిస్తున్నప్పుడు పంక్తులు సరిచేసుకోవాలని ప్రజలకు తాకీదు చేసేవారు.

4. ఒకవేళ పంక్తి నిండిపోయి ఉంటే ఆ తరువాత వచ్చిన వ్యక్తి పంక్తి వెనుక ఒంటరిగా నిలబడకూడదు. పంక్తిలోనుంచి ఒక ముక్తదీని మెల్లిగా వెనక్కి లాగి అతని ప్రక్కన నిలబడాలి.

5. సామూహిక నమాజ్‌లో ఒకేఒక బాలుడు ఉన్నప్పుడు అతడ్ని పెద్దల పంక్తిలోనే నిల్చోబెట్టుకోవాలి. అనేక మంది పిల్లలుంటే మాత్రం పెద్దల పంక్తి వెనుక వారికోసం వేరే పంక్తి ఏర్పాటు చేయాలి.

6. ఇమామ్ ముక్తదీలకన్నా ఒక మూరెడు ఎత్తయిన చోట నిలబడకూడదు. అలాగే మొదటి పంక్తిలోని ముక్తదీలు సయితం చూడలేనటువంటి చోటున కూడా ఇమామ్ నిల్చోకూడదు.

7. ఇమామ్ నమాజ్ చేయిస్తున్నప్పుడు ముక్తదీల అవసరాలను, వారి బాధలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ముక్తదీలు విసుగుచెందేటంత సుదీర్ఘ నమాజ్ చేయించ రాదు. అలా చేయించడాన్ని దైవప్రవక్త (సఅసం) వారించారు.

## ముఖ్తదీలకు సంబంధించిన ఆదేశాలు

ఇమామ్ వెనుక నమాజ్ చేసే వారినే ముక్తదీలు అంటారు.

1. ముక్తదీల నమాజ్ ఇమామ్ నమాజ్‌ని అనుసరించి ఉంటుంది. అయితే ముక్తదీలు నమాజ్‌ల ఫర్జులు నెరవేర్చడంలో ఇమామ్‌ని విధేయించడం విధి అయినప్పటికీ నమాజ్‌లోని వాజిబ్‌లు, సున్నత్‌లు, ముస్తహబ్‌ల విషయంలో మటుకు ఇమామ్‌ని విధేయించవలసిన అవసరం లేదు. ఉదా: ఇమామ్ వెనుక ముక్తదీలు ఫాతిహా సూరాని పఠించక పోవడమే మంచిది. ఒకవేళ ఫాతిహా సూరా పఠించినా అందులో దోషం లేదు. అదే విధంగా ఇమామ్ ఆమీన్ అనే పదాన్ని మెల్లిగా ఉచ్చరించినప్పుడు ముక్తదీలు బిగ్గరగా ఉచ్చరించినా, లేదా ఇమామ్ తన చేతుల్ని నాభిపై కట్టుకున్నప్పుడు ముక్తదీలు తమ చేతుల్ని రొమ్ముపై కట్టుకున్నా వారి నమాజులో ఎలాంటి దోషం రాదు.

2. ఇమామ్ యొక్క నమాజ్ ఏదయినా కారణంవల్ల చెడిపోతే మొత్తం ముక్తదీల నమాజ్ కూడా చెడిపోతుంది. ఒకవేళ ఇమామ్ నమాజ్‌ని సరిగానే నిర్వర్తించి, ముక్తదీ మటుకు స్వయంగా తన నమాజ్‌ని చెడగొట్టుకుంటే అప్పుడు అతని నమాజ్ రెండు విధాలుగా మారుతుంది. ఒకటి, నమాజ్‌లో జరిగిన ఈ దోషం వాజిబ్, సున్నత్ విషయంలోనయితే ముక్తదీ చేసిన ఈ నమాజ్ నెరవేరుతుంది. ఉదా: తషహ్హుద్ పఠించడం మరిచిపోతే లేదా ఇమామ్‌కు ముందే సజ్దాలోగాని, రుకూలోగాని వెళితే ముక్తదీ నమాజ్ మక్రూహ్ అవుతుందిగాని దాన్ని మళ్ళీ చేయనవసరం లేదు. రెండు, నమాజ్‌లో ఏదయినా ఫర్జ్ నెరవేర్చడం మరిచిపోతే ఆ నమాజ్‌ని మళ్ళీ చేసుకోవాలి. ఉదా: రుకూ చేయడం మరిచిపోతే, సజ్దాలో నిద్రిస్తే, ఒక సజ్దా మరచిపోతే లేదా నమాజ్ చేస్తున్నప్పుడు అపాన వాయువు వెలువడితే, శరీరం నుండి రక్తం స్రవిస్తే లేదా "తక్బీరె తహ్రీమా" పలకడం మరచిపోతే నమాజ్‌ని తిరిగి చేసుకోవలసి ఉంటుంది.

ముఖ్తదీలు మూడు విధాలుగా ఉంటారు. ముద్రక్, మస్బూఖ్, లాహఖ్.

1. మొదటి నుంచి చివరి వరకూ ఇమామ్ వెనుక నమాజ్‌లో పాల్గొంటున్న వ్యక్తిని "ముద్రక్" అంటారు.

2. ప్రారంభంలోని ఒకటి లేదా రెండు లేదా అంతకంటే ఎక్కువ రకాత్‌లు అయిపోయిన తరువాత జమాఅత్‌లో పాల్గొన్న వ్యక్తిని "మస్బూఖ్" అంటారు.

3. ప్రారంభం నుంచి జమాఅత్‌లో పాల్గొన్నప్పటికీ మధ్యలో ఉజూ భంగం కావడం వల్లనో లేదా నిద్రించడం వల్లనో ఒకటి లేక రెండు రకాతులు తప్పిపోయిన వ్యక్తిని "లాహఖ్" అంటారు.

## మస్బూఖ్ నమాజ్‌ని ఎలా పూర్తి చేయాలి

ముద్రక్ నమాజుని గురించి మనం గతంలో తెలుసుకున్నాం. ఇప్పుడు మస్బూఖ్, లాహఖ్‌లకు సంబంధించిన నమాజుల్ని గురించి తెలుసుకుందాం. మస్బూఖ్‌కు ఎన్ని రకాత్‌లు జమాఅత్‌లో లభించాయో అన్ని రకాత్‌లను అతను ముందుగా ఇమామ్ వెనక నెరవేర్చాలి. తరువాత ఇమామ్ మెడ తిప్పి సలాం చేయగానే మస్బూఖ్ లేచి నిలబడి తప్పిపోయిన రకాత్‌లను పూర్తి చేసుకోవాలి. అయితే ఏ వరుసక్రమంలో ఆ రకాత్‌లు తప్పిపోయాయో అదే వరుసక్రమంలో వాటిని నెరవేర్చాలి.

ఉదా వుతుంది. అంచేత రెండు సజ్దాల తరువాత కూర్చోకుండా నాల్గవ రకాత్‌కోసం లేచి నిల్చోవాలి. నాల్గవ రకాత్‌లో ఫాతిహా సూరా మాత్రమే పఠించాలి.

3. మగ్రిబ్ నమాజ్ వంటి మూడురకాత్‌లు గల ఫర్జ్ నమాజ్‌లో రెండు రకాత్‌లు తప్పిపోతే లేచి నిలబడి పాతిహా సూరా, మరోసూరా పఠించాలి. తిరగి రుకూ, సజ్దాల అనంతరం ఖాయిదాలో కూర్చోని తషహ్హుద్ పఠించాలి. ఎందుకంటే మస్బూఖ్‌కు ఇది ఖుర్ఆన్ పఠనాన్ని బట్టి మొదటి రకాత్, రకాత్ల సంఖ్యను బట్టి రెండవ రకాత్ అవుతుంది. తషహుద్ పఠించిన తరువాత లేచి నిలబడి మళ్ళీ ఫాతిహా సూరా, మరోసూరా పఠించాలి. తరువాత రుకూ, సజ్దాలు చేశాక కూర్చొని తషహుద్, దరూద్, దుఆలు పఠించి సలాం చేయాలి. ఎందుకంటే ఇది ఖుర్ఆన్ పఠనాన్ని బట్టి రెండవ రకాత్, రకాత్‌ల సంఖ్యను బట్టి మూడవ రకాత్ అవుతుంది.

ఒకవేళ ఒక రకాత్ మాత్రమే తప్పిపోతే లేచి నిలబడిన తరువాత మొదటి రకాత్‌లో మాదిరిగానే ఫాతిహా సూరా, మరో సూరా పఠించాలి. తరువాత రుకూ, సజ్దాలు చేశాక కూర్చొని తషహుద్, దరూద్, దుఆలు పఠించి సలాం చేయాలి. జుహర్, అస్ర్, ఇషా నమాజుల్లో మూడు లేక నాలుగు రకాత్‌లు తప్పిపోతే మస్బూఖ్ మూడుసార్లు ఖాయిదాలో కూర్చోవాల్సివస్తుంది. ఒకసారి ఇమామ్‌తో పాటు, రెండుసార్లు స్వయంగా తను నమాజ్ పూర్తిచేస్తున్న సందర్భంలో అయితే మగ్రిబ్ నమాజ్‌లో ఒకటి లేదా రెండు రకాత్‌లు తప్పిపోయినా మస్బూఖ్ మూడుసార్లు ఖాయిదాలో కూర్చోవాల్సివుంటుంది. ఒక రకాత్ తప్పిన పక్షంలో రెండుసార్లు ఇమామ్‌తో పాటు, ఒకసారి స్వయంగా కూర్చోవాల్సి ఉంటుంది. రెండు రకాత్‌లు తప్పిపోయినపుడు ఒకసారి ఇమామ్ వెంట, రెండోసారి స్వయంగా కూర్చోవాల్సి వస్తుంది.

4. మస్బూఖ్ ఇమామ్‌తోపాటు సలాం చేయకూడదు. మరచిపోయి ఒకవైపుకు సలాం చేస్తూ తరువాత తనకు కొన్ని రకాత్‌లు తప్పిపోయాయన్న సంగతి గుర్తుకు రాగానే

లేచి నిలబడి తప్పిపోయిన రకాత్లను పూర్తి చేసుకోవాలి. ఒకవేళ రెండువైపుల తిరిగి సలాం చేస్తే సలాం చేశాక కాస్సేపు అక్కడే కూర్చొని ఉంటే, తరువాత జరిగిన పొరపాటు గుర్తుకు రావడమో లేదా ఎవరైనా గుర్తుచేయడమో జరిగితే వెంటనే లేచి తప్పిపోయిన రకాత్‌లను పూర్తి చేసుకోవాలి, సహూ సజ్దా కూడాచేయాలి. అయితే మస్బూఖ్ ప్రాపంచిక విషయాలు ఏవీ మాట్లాడకుండా ఉన్న పక్షంలోనే ఇలా తప్పిపోయిన రకాత్‌లను పూర్తి చేసుకోవాలి. ఒకవేళ ప్రాపంచిక విషయాలు ఏవైనా అతని నోట వెలువడితే మొత్తం నమాజ్‌ని తిరిగి చేసుకోవాల్సి ఉంటుంది.

**ముఖ్య సూచనలు:** సామూహిక నమాజ్‌లో ఇమామ్ రుకూ స్థితిలో ఉన్నప్పుడు ఎవరైనా ముఖ్తదీ వచ్చి జమాఅత్‌లో కలసి రుకూలోకి పోతే అతనికి ఒక రకాత్ పూర్తిగా లభించినట్లే, అయితే సంకల్పం చేయకుండా, తక్బీరె తహ్రీమా (అల్లాహు అక్బర్) చెప్ప కుండా నేరుగా రుకూ స్థితిలోకి పోకూడదు. కొందరు తెలియక వచ్చి రాగానే రుకూ స్థితిలోకి పోతారు. ఇలా చేయకూడదు. తక్బీరెతహ్రీమా చెప్పడం ఫర్జ్ అని మనం లోగడ చెప్పుకున్నాం.

## లాహఖ్, నమాజ్‌ని ఎలా పూర్తి చేయాలి?

1. ఎవరైనా ఒక ముఖ్తదీ ఇమామ్ వెనుక నమాజ్ చేస్తుండగా మధ్యలో ఉజూ భంగమయిపోతే అతను తక్షణమే జమాఅత్ నుండి బయటికి వెళ్ళిపోవాలి. ఎవరితోనూ మాట్లాడకుండా ఉజూ చేసి వచ్చి ఇమామ్ వెనక తన నమాజ్‌ను పూర్తి చేసుకోవాలి. ఒకవేళ ఒంటరిగా నమాజ్ చేస్తున్నప్పుడు ఉజూకు భంగమయితే ఎక్కడ నుండి నమాజ్ తప్పిపోయిందో అక్కడ నుండి తిరిగి ఉజూ చేసివచ్చి నమాజ్ చేయాలి. అతను ఒకవేళ రుకూలో కాని సజ్దాలోగాని ఉన్నప్పుడు ఉజూ అవసరం ఏర్పడితే ఆ రకాత్ వృథా అయిపోతుంది. అతను తిరిగివచ్చి ఎక్కడి నుండి నమాజ్ తప్పిపోయిందో అక్కడినుంచి ప్రారంభించి దానిని పూర్తి చేసుకోవాలి. ఉజూ కోసం పోయి రావడంలో జమాఅత్ నమాజ్ ముగిసిపోయేటంతగా జాప్యం జరిగితే మాత్రం ఇమామ్ వెనుక మొత్తం నమాజ్‌ని ఎలా పూర్తి చేస్తాడో అలా అతను ఒంటరిగా మొత్తం నమాజ్‌ను తిరిగి చేయవలసి ఉంటుంది.

2. నమాజ్ చేస్తున్నప్పుడు ఇమామ్‌కు ఉజూ భంగమయిపోతే అతను వెంటనే తన స్థానంలో మరొకరిని ఇమామ్‌గా చేసి ఉజూ చేయడానికి వెళ్ళిపోవాలి. ఉజూ చేసివచ్చి జమాఅత్‌లో కలిసి పోవాలి. ఇమామ్ తన స్థానంలో మరొకర్ని ఇమామ్‌గా చేస్తే ఉజూ

చేసి వచ్చాక అతను ముఖ్తదీగా మారిపోతాడు. అంతేగాని ఇమామ్‌గా నియమించిన వ్యక్తిని ఇమామత్ స్థానం నుండి తొలగించకూడదు.

3. ఉజూ చేయడానికి వెళ్ళడం వగైరా పనుల కారణంగా తప్పిపోయిన నమాజ్‌ని ఇమామ్ వెనుక ఎలా చేస్తామో అలాగే చేయాలి. అంటే ఆ నమాజ్‌లో మస్బూఖ్ పఠించినట్లు ఖుర్‌ఆన్ పఠించకూడదు. ఫాతిహా సూరా, మరో సూరా పఠించడానికి ఎంత సమయం పడ్తుందో, అంత సమయం మౌనంగా నిలబడాలి. ఆ తరువాత రుకూ, సజ్దాలలో మాత్రం పఠించవలసిన దుఆలన్నీ యథాప్రకారం పఠించాల్సిందే. లాహఖ్‌కు సంబంధించిన సమస్యలు చాలా క్లిష్టమయినవి. అంచేత వీటిని గురించి తెలియనివారు ఇలాంటి పరిస్థితిలో "సలాం" చేసి నమాజ్‌ని భగ్నం చేయాలి; తరువాత ఉజూ చేసి వచ్చి తిరిగి నమాజ్ చేసుకోవాలి.

4. నమాజ్ చేస్తున్నప్పుడు ఎవరికైనా ఉన్మాదం రేకెత్తితే లేదా అపస్మారక స్థితిలో పడిపోతే లేదా గుస్ల్ చేసే అవసరం ఏర్పడితే అతని నమాజ్ చెడి (ఫాసిద్‌అయి) పోతుంది.

## స్త్రీలు-జమాఅత్

స్త్రీలు తమ ఇళ్ళల్లోనే ఒంటరిగా నమాజ్ చేసుకోవడం ఉత్తమం. అయితే వారు ఇంటిలోనే జమాఅత్ చేయదలచుకుంటే దానికి రెండు షరతులున్నాయి. మొదటిది ఇమామ్ మరియు ముక్తదీలు అంతా స్త్రీలే అయి ఉండటం. ఇలాంటి సందర్భంలో ఏ మహిళ అయితే ఇమామ్‌గా నిలబడుతుందో, ఆమె పురుషుల్లా అందరికంటే ముందు కాకుండా ఆ స్త్రీల వరుస (సఫ్) లోనే మధ్యలో నిలబడాల్సి ఉంటుంది. రెండోది ఇమామ్ పురుషుడై స్త్రీలు ముక్తదీలయి ఉండడం. ఆ సందర్భాల్లో, ఇమామ్ అందరికంటే ముందు గాను, స్త్రీ నమాజీలు వెనుకగాను సఫ్ చేసి నిలబడడం. అయితే పురుషుడు, నమాజీల్లో తనకు మహ్రమ్ (వివాహానికి నిషిద్ధమయిన) స్త్రీలు, ఉదాహరణకు తల్లి, చెల్లెలు, కూతురు లాంటి స్త్రీలు ఉన్నప్పుడే ఇమామత్ చేయాలి. లేదా ఆ ఇంటికి సంబంధించిన పురుషుడు ఆ సమయంలో అక్కడ హాజరై ఉండాలి.

## మస్జిద్

మస్జిద్‌ల నిర్మాణంలోని ముఖ్యమయిన ఉద్దేశ్యం, వాటిలో సామూహికంగా (జమాఅత్‌తో) నమాజు చేయాలన్నది. మస్జిద్‌లో నమాజ్ చేయకపోతే జమాఅత్‌తో నమాజు చేయాలన్న ఆదేశం నిష్ప్రయోజనమే అవుతుంది. జమాఅత్‌తో నమాజు చేయడం ఎంత ముఖ్యమో మస్జిద్ల నిర్మాణం అందులో జమాఅత్ తోటి నమాజ్ చెయ్యడం

కూడా అంతే ముఖ్యమయింది. దివ్య ఖుర్ఆన్‌లో మస్జిద్‌ని నిర్మించి వాటిలో నమాజ్ వ్యవస్థాపన చెయ్యాలనే ఆజ్ఞ ఇవ్వబడింది.

إِنَّمَا يَعْمُرُ مَسَاجِدَ اللَّهِ مَنْ آمَنَ بِاللَّهِ وَالْيَوْمِ الْآخِرِ وَأَقَامَ الصَّلَاةَ۔ (توبہ)

**"దైవ గృహాలయిన మస్జిద్‌లను నమాజీలతో కళకళలాడేలా చెయ్యడం, అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని విశ్వసించే, నమాజును స్థాపించేవారి బాధ్యత."**

**(తౌబా : 18)**

ఈ ఆయత్‌కు పూర్వం, మస్జిద్‌ల ఆవాస కార్యక్రమం ముష్రిక్ (బహు దైవా రాధకు)ల బాధ్యత కాదని తెలుపడం జరిగింది. దీనిద్వారా తెలిసేదేమంటే మస్జిద్‌లను నిర్మించడం, వాటిని నమాజీలతో కళకళలాడేలా చేసే బాధ్యత ముస్లిమ్‌లకు ప్రత్యేకంగా ఇవ్వడం జరిగింది.

హదీసులో : "ఎవరయితే అల్లాహ్ ప్రసన్నతకోసం మస్జిద్ నిర్మించాడో అతని కోసం అల్లాహ్ జన్నత్ (స్వర్గం)లో ఓ ఇల్లు కట్టిస్తాడు" అని ఉంది. (బుఖారి, ముస్లిమ్)

"ధరణిలో అన్నిటికంటే ఉత్తమమైన భూభాగాలు దైవం దృష్టిలో మస్జిద్‌లే" అని కూడా దైవప్రవక్త నుడివారు.

ప్రవక్త మహనీయులు, "ఎవరైతే చీకట్లో మస్జిద్‌కు వెడతారో వారికి ప్రళయం నాడు వెలుగు లభిస్తుందన్న శుభవార్తనివ్వండి" అన్నారు.

"మస్జిద్ 'రియాజుల్ జన్నహ్' (స్వర్గంలోని ఉద్యానవనాలు)" అని కూడా అన్నారాయన. (తిర్మిజీ)

మరో హదీసులో ఆయన (సఅసం)ఇలా సెలవిచ్చారు: "ఎలాంటి నీడ (ఛాయ) దొరకని ప్రళయ దినంనాడు దైవ కారుణ్యచ్ఛాయ ఏడురకాల వ్యక్తులకు లభిస్తుంది. వారిలో ఒకడు దైవ విధేయతలో కాలం గడిపిన యువకుడు. మరొకడు తన మనస్సును మస్జిద్‌తో కట్టబెట్టి ఉంచేవాడు."

అంటే ఒక నమాజ్ తరువాత మరో నమాజ్ కోసం మస్జిద్‌కు పోయేందుకు ఆత్రుతతో నిరీక్షించేవాడన్నమాట. (బుఖారి, తిర్మిజి)

మహాప్రవక్త (సఅసం) దివంగతులవడానికి పూర్వం కూడా ఇద్దరు వ్యక్తుల

సహాయంతో మస్జిద్‌లోనికి వెళ్ళి నమాజు చేశారు. ఈ విషయం, మస్జిద్‌కు ఎంత ప్రాముఖ్యత కలదో మనకు తెలుపుతోంది.

కొందరు సహాబాల (రఅన్) గృహాలు మస్జిద్‌కు ఎంతో దూరంలో ఉండేవి. వారు దీని ప్రాముఖ్యాన్ని గమనించి తమ ఇళ్ళు మస్జిద్‌కు దరిదాపుల్లో నిర్మించదలచారు. ఈ విషయం తెలిసిన మహాప్రవక్త (సఅసం) వారిని వారిస్తూ, "దాపుకు రాకండి, మనుషులు ఎంత దూరం నుండి మస్జిద్‌కు వస్తారో అంతే అధిక పుణ్యం వారికి వారి అడుగుల లెక్క ప్రకారం లభిస్తుంది" అన్నారు. (ముస్లిమ్)

ఓ హదీసులో ఇలా ఉంది:

"ఎవరైనా ఒక పిచ్చుక గూటివంటి మస్జిద్ కట్టించినా అతనికై అల్లాహ్ స్వర్గంలో ఇల్లు కట్టిస్తాడు. " (ముస్నదె అహ్మద్)

అంటే, ఎవరు ఎంతగా మస్జిద్ నిర్మాణంలో పాల్గొంటారో అల్లాహ్ వారికి దాని ప్రకారం స్వర్గంలో చోటు కల్పిస్తాడని దీని భావమని ముహద్దిసీన్ (హదీసు పండితులు) చెప్పారు.

## మస్జిద్ మర్యాదలు

1. మస్జిద్‌లో అధికంగా అలంకరణలు, ముస్తాబులు చేసే ప్రయత్నం చేయ కూడదు. మస్జిద్‌ను అందంగా అలంకరించే ఆజ్ఞ ఇవ్వబడలేదని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు. ఒకవేళ చందా కూడబెట్టి అలా చేస్తే ఇది మరీ తప్పు.

2. మస్జిద్‌లోనికి, పచ్చి ఉల్లి, వెల్లులు, పొగాకు లేక కంపుకొట్టే మరే పదార్థమో తిని ప్రవేశించకూడదు. అయితే కంపురాకుండా పరిశుభ్రంగా నోరు కడుక్కొని వస్తే ఫరవాలేదు.

3. మస్జిద్‌లో ప్రవేశించేటప్పుడు, اَللّٰهُمَّ افْتَحْ لِيْ اَبْوَابَ رَحْمَتِكَ **'అల్లాహుమ్మఫ్ తహ్‌లీ అబ్‌వాబ రహ్మతిక్'** (ఓ అల్లాహ్! నా కొరకు నీ కారుణ్య ద్వారాలు తెరువు)అని, బయటకు వెడిలే సమయంలో, اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ مِنْ فَضْلِكَ **'అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుకమిన్ ఫజ్లిక్'** (ఓ అల్లాహ్! నేను నీ అనుగ్రహాన్ని అర్థిస్తున్నాను) అనే దుఆలు పఠించాలి.

4. మస్జిద్ లోపల ప్రాపంచిక సంభాషణలు చెయ్యడం, గోల చెయ్యడం, క్రయ విక్రయాలు జరపడం, వాటి గురించి బేరసారాలు చెయ్యడం మక్రూహ్ విషయాలు. "ఏ

వ్యక్తి అయినా మస్జిద్‌లో తన వస్తువును బిగ్గరగా అరుస్తూ వెదుకుతుంటే అతనికి ఆ వస్తువు తిరిగి లభింప చేయవద్దని ప్రార్థించండి, మస్జిద్‌ను ఇలా కేకలు వెయ్యడానికి కాదు నిర్మించింది" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు. (ముస్లిం)

మరో హదీసులో ఇలా ఉంది:

"ఓ కాలం రాబోతోంది. అప్పుడు ప్రజలు మస్జిద్‌లో కేవలం ప్రాపంచిక సంభాషణలే చేస్తుంటారు." (బుఖారి, అబూదావూద్)

"అలాంటివారి సంభాషణలో పాల్గొనరాదు. దైవం వారి నమాజుల్ని స్వీకరించదు" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు.

" ఏ (దైవం) గృహాల గురించయితే అల్లాహ్ గౌరవించాలని, వాటిలో దైవ నామసంస్మరణ జరగాలని ఆదేశించాడో వాటిలో...." అని దివ్య ఖుర్‌ఆన్ చెబుతోంది.

దీనిద్వారా తెలిసిందేమిటంటే, మస్జిద్‌కు సంబంధించిన రెండు హక్కులు మనపై ఉన్నాయి. ఒకటి, దాన్ని గౌరవించాలి అన్నది, రెండోది అందులో కేవలం అల్లాహ్ నామస్మరణే జరగాలి. ఆయన్నే స్తోత్రించాలి అన్నది.

హజ్రత్ ఉమర్ (రఅన్) మస్జిద్‌లో బిగ్గరగా మాట్లాడేవారిని కఠినంగా వారించే వారు. ఓ సారి మస్జిద్‌లో ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకోగా విన్న హజ్రత్ ఉమర్ (రఅన్) మీరెక్కడివారు? అని అడిగారు. మేము 'తాయిఫ్' నుండి వచ్చాము అని వారు బదులిచ్చారు. "మీరేగనక మదీనా వాసులయి ఉంటే మిమ్మల్ని శిక్షించి ఉండేవాణ్ణి, మస్జిదె నబవీలో స్వరాన్ని పెంచి మాట్లాడుతున్నారా?" అని మందలించారు హజ్రత్ ఉమర్. ఆ ఇద్దరు వ్యక్తులు కొత్తవారు, మస్జిద్ మర్యాదలు బొత్తిగా వారికి తెలియనందునేమో హజ్రత్ ఉమర్ వారిని శిక్షించకుండా వదలివేశారు.

ఇంతకూ ధార్మిక వ్యవహారాలు, సామాజిక విషయాలు మస్జిద్‌లోనే కూర్చుని చర్చించడం ఉత్తమం.

5. మస్జిద్‌లో ఎవరైనా నమాజు చేస్తూ ఉన్నప్పుడు బిగ్గరగా ఖుర్‌ఆన్ పఠనంగాని, జిక్ర్ (దైవ నామస్మరణ) చేయడంగాని చేయరాదు. కొందరు జమాఅత్ తోటి నమాజ్ ముగిసిన తరువాత వచ్చి తమ నమాజ్‌ను బిగ్గరగా చేస్తూ ఉంటారు. అలాంటి వారు మెల్లిగా చేసుకోవాలి. ఇతరుల నమాజుకు అంతరాయం సృష్టించడం పాపం.

6. కొందరు జమాఅత్ ముగిసిన వెంటనే లేచి ఉపన్యసించడమో, ఏదయినా గ్రంథం చదివి వినిపించడమో చేస్తూ ఉంటారు. దీనివల్ల ఇతర నమాజీలకు, పారాయణం

చేసేవారికి అంతరాయం వాటిల్లుతుంది. అలా చేయకూడదు. అలా చేసేవారు మస్జిద్‌లోనే ఓ ప్రక్కకు జరిగి ఉపన్యసించడంగాని, గ్రంథ పారాయణం లాంటివి చేయడంగాని చేయాలి. అయితే, అలాంటి ఉపన్యాసంగాని, గ్రంథం చదవడంగాని ముందుగానే ప్రకటించబడి ఉన్నట్లయితే, లేక రోజు ప్రతి నమాజు తరువాత అలా చేసే నియమం ఏదయినా పెట్టుకుంటే మాత్రం, ఇతర నమాజీలు ప్రక్కకు జరిగి తమ నమాజును చేసుకోవాలి. గ్రంథ పారాయణం జిక్ర్ లాంటివి చేసుకోవాలి.

7. మస్జిద్‌లో పడుకోవడం, లేక అనవసరంగా కూర్చుని తమ సమయాన్ని వృధా పర్చడం మక్రూహ్. అయితే బాటసారులు, ఏతెకాఫ్ పాటించేవారు మస్జిద్‌లో పడుకోవచ్చు, ఉండవచ్చు, అయితే మస్జిద్ మర్యాదలు తెలియని బాటసారుల్ని, నమాజ్ చెయ్యని వారిని మస్జిద్‌లో కాలం గడపకుండా వారించాలి. మరే ఆసరా లేనివారు మస్జిద్‌లో నిద్రించవచ్చు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమ్ర్ (రఅన్) ఇలా అన్నారు:

"మేము మహాప్రవక్త (సఅసం) కాలంలో మస్జిద్‌లోనే ఉండేవారం, పడుకునే వారం. అప్పుడు మేమంతా యువకులమే."

8. మస్జిద్‌లలో యాచించడం లేక చందాలకు అప్పీళ్లు చేయడం మక్రూహ్.

ముఫ్తీ షఫీ మర్హూమ్ దివ్య ఖుర్ఆన్, బఖర సూరాలోని 114వ ఆయత్: "అల్లాహ్ ఆరాధనాలయాల్లో ఆయన నామస్మరణ చెయ్యడాన్ని నిషేధించి వాటి నిర్మివేశానికి పాల్పడేవానికంటే దౌర్జన్యపరుడయిన వాడెవడు?"గురించి వ్యాఖ్యానిస్తూ ప్రజలు నమాజ్, తస్బీహ్‌లలో లీనమై ఉన్నప్పుడు మస్జిద్‌లో తన కోసం యాచించడం లేక ధార్మిక కార్యాల కోసం చందాలు అడగడం నిషిద్ధం అని రాశారు! (ముఆరిఫుల్ ఖుర్ఆన్)

9. మస్జిద్ ద్వారాన్ని మూసి ఉంచకూడదు. అయితే సామాను వగైరాలు దొంగలించబడ్తాయనే భయం ఉంటే మాత్రం నమాజ్ వేళలు మినహా మూసి ఉంచవచ్చు.

10. మస్జిద్ ప్రాంగణంలో పుక్కిలించి ఉమ్మడం, వుజూ చేయడం మక్రూహె తహ్రీమి.

11. గుసుల్ తప్పనిసరి అయిన స్థితిలో ఉన్నవారు మస్జిద్‌లో ప్రవేశించడం గునాహ్ (పాపం).

12. మస్జిద్‌నే బాటగా మార్చడం ధర్మసమ్మతంకాదు. అయితే అత్యవసరమయిన పని ఉన్నప్పుడు మస్జిద్‌గుండా పోవచ్చు.

13. మస్జిద్‌లో స్థలం ఎక్కడ దొరికితే అక్కడనే కూర్చోవాలి. కొందరు మనుషుల

భుజాలపైనుండి దాటుకుంటూ వారిని జరుపుతూ ముందుకు పోతుంటారు. అలా చేయడం పాపం. మహాప్రవక్త (సఅసం) అలా చేయడాన్ని వారించారు. అయితే ఎలాంటి అవాంతరం, అడ్డులేకుండా ఉండి సునాయాసంగా ముందుకు పోగలిగితే ముందుకు పోవచ్చు.

14. కాలికి మట్టి వగైరా అంటినప్పుడు దాన్ని కడక్కుండా మస్జిద్‌లోకి ప్రవేశించ కూడదు.

15. పల్లెల్లో, సాధారణంగా ధోవతులు కడతారు. అలాంటివారు మస్జిద్ ప్రాంగణంలోనికి ప్రవేశించిన వెంటనే గోచి తీసివేసి మరీ ప్రవేశించాలి.

16. మస్జిద్ లోపల అజాన్ పలకడం మక్రూహ్.

17. మస్జిద్‌లో చెట్లు నాటడం మక్రూహ్. కొందరు ధర్మవేత్తలు దాన్ని క్రైస్తవ అనుకరణ అని అంటారు. అయితే చెట్లవల్ల మస్జిద్‌కు ఏదయినా లాభం ఉంటే అలా నాటుకోవడంలో తప్పులేదు.

18. పై భాగంలో మస్జిద్ ఉండి దాని క్రింది భాగంలో షాపులు వగైరాలు పెట్టవచ్చు. వుజూ ఖానా లేక మూత్రశాలలు కట్టవచ్చు.

19. మస్జిద్ గోడలపై దివ్య ఖుర్‌ఆన్ ఆయత్‌లు రాయడం, వాటిని అందంగా తీర్చిదిద్దడం చిత్రపటాలతో అలంకరించడం ధర్మవేత్తలందరి దృష్టిలోనూ మక్రూహ్‌యే. ముఖ్యంగా ఖిబ్లా వైపు గోడలపై ఈ అలంకరణలు చేయడం, చిత్రాలతో, శిల్పాలతో అలంకరించడం మరీ తప్పు. అందునా ఈ అలంకరణలకు గాను చందా డబ్బు వాడడం ఎంతో గర్హించదగ్గ విషయం. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్, అలా చేసేవారిపై జరిమానా విధించాలన్నారు.

## మస్జిద్‌లలో పెయింటు వాడకం

మస్జిద్‌లలో కంపుకొట్టే పదార్థాలు తినిగాని, త్రాగిగాని ప్రవేశించడాన్ని మహాప్రవక్త (సఅసం) వారించారు. ఉదా: పచ్చి ఉల్లిగడ్డ, వెల్లుల్లి తిని, సిగరెట్టు బీడిత్రాగి ప్రవేశించడం లాంటివి. ప్రస్తుత రోజుల్లో మస్జిద్‌లలో పెయింటు వాడడం జరుగు తోంది. ఈ పెయింటులో భరింపరాని వాసన ఉంటుంది కాబట్టి దీనితో కూడా 'మస్జిద్‌లను అలంకరించవద్దు' అనే మహాప్రవక్త (సఅసం) ఆదేశానికే వర్తిస్తుంది కాబట్టి కొందరు ధర్మవేత్తలు ఇలా రాస్తున్నారు.

"మస్జిద్ గోడలు తెల్లగా ఉండి వాటిపై ఎలాంటి నగిషీలు లేకుండా ఉండడం ఉత్తమం."

కాని ఫలూవా ఆలమ్‌గీరిలలో ఈ మాట కూడా రాసి ఉంది. 'సున్నం వగైరాలతో మస్జిద్‌లో పూలు, పత్రాలు చెక్కడం, లేక బంగారు పూత పూయడం మక్రూహ్ కాదు" అని.

ఈ విషయంలో ధర్మవేత్తలు ఇచ్చిన అనుమతి, దృఢత్వం మరియు గట్టితనాన్ని దృష్టిలో ఉంచుకుంటే ఇది మస్జిద్‌లలో అలంకరణ క్రిందికి రాదు. నేటి కాలంలో సాధారణంగా మస్జిద్‌లకు ద్వారాలు బిగించబడుతున్నాయి. గాలి ధారాళంగా ఆడడానికి కిటికీలు పెట్టబడుతున్నారు. తలుపులు, కిటికీలకు పెయింటు చేయని పక్షంలో అవి త్వరగా చెడిపోవచ్చు. కాబట్టి ఇనుము, కొయ్య దర్వాజాలకు పెయింటు చేయడంలో నష్టంలేదు. అయితే గోడలకు పెయింటు చేయడం మాత్రం అనవసరం.

## రెండవ జమాఅత్ గురించి

1. ఏ మస్జిద్‌లోనయితే ఇమామ్, ముఅజ్జిన్ నియమించబడి ఐదు పూటలా జమాఅత్ జరుగుతూ ఉంటుందో అలాంటి మస్జిద్‌లలో జమాఅత్ అయిపోయిన తరువాత ఇద్దరు ముగ్గురు నమాజీలు వస్తే మరో జమాఅత్ చేయకుండా వేరు వేరుగానే నమాజు చేసుకోవాలి. అయితే ఏ చోటులోనయితే మొదట జమాఅత్ జరిగిందో ఆ ప్రదేశాన్ని వదలి మరో చోట ఇంకొక జమాఅత్ చేయడంలో కూడా తప్పులేదు. (రద్దుల్ ముహ్తార్)

2. ఒకవేళ ఏ మస్జిద్‌లోనయినా అజాన్, జమాఅత్ నియమం ప్రకారం జరగక పోతే లేక ఆ మస్జిద్ బజారుల్లో లేదా జన సంచారమున్న మార్గాన ఉంటే ఆ మస్జిద్‌లో రెండవ లేక మూడవ జమాఅత్ చేసుకోవచ్చు. అలాంటి మస్జిద్‌లో ప్రతి జమాఅత్ పుణ్యం, మొదటి జమాఅత్ పుణ్యానికి సమానం.

3. ఏ మస్జిద్‌లలోనయితే జమాఅత్ నియమం ప్రకారం జరుగుతుందో, ఇమామ్ ముఅజ్జిన్ కూడా అందు నియమించబడి ఉన్నారో ఆ మస్జిద్‌లలో ఇంకో ఊరి నుండి ఎవరయినా నమాజీలు వస్తే వారు మరో జమాఅత్ చేయవచ్చు. రెండో జమాఅత్ చేయ కూడదు అనే షరతు ఆ వాడ మరియు ఊరి నమాజీల కోసమే. ఒక మస్జిద్‌లో జమాఅతె ఊలా (మొదటి జమాఅత్) జరిగిన తరువాత రెండో జమాఅత్ చేయరాదని హనఫీ ధర్మవేత్తలు పెట్టిన షరతులు, జమాఅత్‌తోనే నమాజు చేయాలి అనే మహాప్రవక్త (సఅసం) హదీసులను దృష్టిలో ఉంచుకుని పెట్టినవే. ఒకవేళ అనేక జమాఅత్‌ల సాధారణ అనుమతే ఇవ్వబడితే జమాఅతె ఊలా ప్రాధాన్యత ఇంకేముంటుంది? ఏ ఇమాములయితే దీని అనుమతి ఇచ్చారో వారి దృష్టితో అది సాధారణ అనుమతి కానేకాదు. కేవలం అనివార్యమయిన కారణాలకు, లేక తాత్కాలిక సమయాల్లో ఇచ్చిన అనుమతే అది.

## నమాజు సంకల్పాన్ని భంగపరిచి జమాఅత్‌లో చేరడం

ఎవరయినా వంటరిగా నమాజు ప్రారంభించగా తరువాత జమాఅత్ ఏర్పడి నట్లయితే అలాంటి సందర్భాల్లో అనుసరించడానికి రెండు మార్గాలున్నాయి.

## ఫర్జ్ నమాజు భంగపర్చడం

1. ఓ మార్గం ఏమిటంటే, అది ఫజ్ర్‌లో చేసే రెండు రకాతుల ఫర్జ్ నమాజయితే, ఆ వ్యక్తి మొదటి రకాత్‌లో ఉన్నా లేక రెండవ రకాత్ సజ్దా ఇంకా చేయకపోయినా ఈ రెండు సందర్భాల్లోను నమాజును భంగపరచి జమాఅత్‌లో చేరిపోవాలి. అయితే రెండో రకాత్ సజ్దా కూడా చేసివేస్తే మాత్రం తషహ్హుద్ వగైరాలు పూర్తిచేసి తన నమాజ్ పూర్తిచేసుకోవాలి. జమాఅత్‌లో మాత్రం చేరనవసరం లేదు.

2. మూడు రకాఅత్‌ల మగ్రిబ్ నమాజ్‌లో కూడా ఇదే విధానం వర్తిస్తుంది. రెండో రకాత్ సజ్దా చేయకపోయి ఉన్నట్లయితే నమాజును భంగపరచి జమాఅత్‌లో చేరిపోవాలి. రెండో రకాత్ సజ్దా చేసినట్లయితే నమాజును పూర్తిచేసుకోవాలి. జమాఅత్‌లో చేరనవసరం లేదు.

3. ఒకవేళ ఈ నమాజు నాల్గు రకాత్‌ల జుహ్ర్, అస్ర్ లేక ఇషా నమాజే అయితే మొదటి రకాత్ సజ్దా చేయని పక్షంలో నమాజును భంగపరచి జమాఅత్‌లో చేరిపోవాలి. మొదటి రకాత్ పూర్తి చేసినట్లయితే రెండు రకాఅత్‌లు పూర్తిచేసి సలామ్ పలికి తరువాత జమాఅత్‌లో చేరాలి. మూడవ రకాత్‌లు సజ్దా ఇంకా చేయకపోతే నమాజ్‌ను భంగపరచి జమాఅత్‌లో చేరిపోవాలి. మూడవ రకాత్‌లోనూ సజ్దా చేస్తే మాత్రం నమాజును పూర్తి చేసుకోవాలి. ఆ తరువాత ఒకవేళ అవకాశముండి జమాఅత్‌లో చేరితే జమాఅత్‌తో చేసిన నమాజు నఫిల్‌గా మారిపోతుంది. తాను స్వయంగా చేసినది ఫర్జ్ అవుతుంది. (మరాఖిల్ ఫలాహ్)

**గమనిక:** అయితే ఈ సందర్భంలో ఓ విషయం జ్ఞప్తియందుంచుకోవాలి. అదేమి టంటే వంటరిగా నమాజు పూర్తిచేసుకున్న తరువాత 'నఫిల్' సంకల్పంలో జమాఅత్‌లో చేరాలనుకుంటే అది ఫజ్ర్, అస్ర్ మరియు మగ్రిబ్ వేళలు కారాదు. కారణం, ఫజ్ర్ మరియు అస్ర్ తరువాత ఏ నఫిల్ నమాజ్ కూడా చేయరాదు. పోతే మగ్రిబ్‌లో చేసేది మూడు రకాతులే కాబట్టి మూడు రకాత్‌ల నఫిల్ నమాజు చేసేందుకు అనుమతి లేదు.

## సున్నతె ముఅక్కిదాను భంగపర్చడం

ఇప్పటివరకు చెప్పింది ఫర్జ్ నమాజును భంగపరచి జమాఅత్‌లో చేరే విషయం గురించి. రెండో మార్గం ఏమిటంటే తాను చేస్తున్న నమాజు సున్నత్ లేక నఫిల్ అయితే (ఉదాహరణకు జుహ్ర్ కంటే ముందు చేసే నాల్గు రకాఅత్‌ల సున్నతె ముఅక్కిదా). ఈ నమాజు ఒక రకాఅత్ కూడా పూర్తికాలేనప్పుడు దాన్ని భంగపరచి జమాఅత్‌లో చేరిపోవాలి. ఒక రకాఅత్ పూర్తయితే రెండో రకాఅత్‌ను కూడా పూర్తిచేసి జమాఅత్‌లో చేరిపోవాలి. మూడు పూర్తయితే నాల్గో రకాఅత్‌ను కూడా పూర్తిచేసి జమాఅత్‌లో చేరాలి. అయితే ఫజ్ర్ నమాజు సున్నత్‌లు మొదలెట్టినప్పుడు, తనకు ఫర్జ్‌లోని ఒక రకాఅత్ అయినా లభిస్తుంది అని నమ్మకం ఉంటే ఆ నమాజును భంగపర్చవద్దు. కాని రెండు రకాఅత్‌లు కూడా దాటిపోతాయేమోననే భయముంటే సున్నత్ చెయ్యకుండా ఫర్జ్‌లో చేరిపోవాలి.

**గమనిక:** ముక్తదీలు మస్జిద్‌లో ప్రవేశించగానే జమాఅత్ ఎప్పుడు ప్రారంభం అవుతుందనే విషయాన్ని మొదట తెలుసుకోవడం ముఖ్యం. జమాఅత్ ప్రారంభం కాబోతుందని తెలిస్తే సున్నత్‌లు ప్రారంభించకూడదు. కొందరు ఈ విషయాన్ని జ్ఞాపకం ఉంచుకొనక సమయం సందర్భం లేకుండానే సున్నత్ నమాజ్‌ను ప్రారంభిస్తారు. ఇలా చేయడం వల్ల అప్పుడప్పుడు జమాఅత్ ప్రారంభించడంలో ఆలస్యం జరుగుతూ నమాజీలకు అసౌకర్యం కలుగుతుంది.

## సున్నతె గైర్ ముఅక్కిదా మరియు నఫిల్

1. జుహ్ర్ మరియు ఫజ్ర్ తప్ప ఫర్జ్ నమాజు కంటే ముందు సున్నత్ చెయ్యడం అత్యవసరం కాదు. ఈ వేళల్లో ఎవరయినా సున్నత్ లేక నఫిల్ నమాజు ప్రారంభిస్తే పైన చెప్పిన సున్నతె ముఅక్కిదా ఆదేశాలే వీటికి వర్తిస్తాయి.

2. జమాఅత్ ప్రారంభం అయిన తరువాత ఎలాంటి సున్నత్‌గాని, నఫిల్ నమాజులుగాని ప్రారంభించడానికి వీలులేదు. అయితే ఫజ్ర్ సున్నత్‌లు ప్రారంభించవచ్చు. కనీసం ఒక రకాఅత్ అయినా అందే నమ్మకం ఉంటేనే అలా చేయాలి. ఆ ఆశ కూడా లేకపోతే సున్నత్ నమాజ్ ప్రారంభించడం మక్రూహ్. జమాఅత్ ప్రారంభం అయిన తరువాత ఫజ్ర్ యొక్క సున్నత్‌లు ప్రారంభించవలసి వస్తే ఆ వ్యక్తి మజ్జిద్‌లోని ఓ మూలలో నిలబడి దాన్ని చెయ్యాలి. ఫర్జ్ నమాజు చేసే స్థలంలో, నమాజీలకు దాపుగా దాన్ని చదవకూడదు.

## ఖిరాఅత్ (ఖుర్ఆన్ పఠనం)

దివ్య ఖుర్ఆన్ నమాజ్‌లో పఠించినా, లేక దాని పారాయణం చేసినా ఎలాంటి దోషాల్లేకుండా సరిగ్గా పఠించడం వాజిబ్ (దుర్రతుల్ ఫరీద్). కొన్ని ఆదేశిక సూత్రాలు ఇక్కడ రాయబడుతున్నాయి.

1. ఖుర్ఆన్‌లోని జబర్ (తలకట్టు), జేర్ (గుడి), పేష్ (కొమ్ము)లను సరిగా పలకాలి. ఎవరయినా జబర్, జేర్, పేష్‌లను మార్చి చదివితే ఖుర్ఆన్ అర్థం తారుమారవుతుంది. అర్థమే తారుమారయితే చదివేవాడికి పాపం అంటుతుంది. అలా నమాజులో పఠిస్తే నమాజే భంగపడుతుంది. అయితే అర్థాలు తారుమారు కాకుండా స్వల్పంగా అర్థంలో మార్పువస్తే మాత్రం నమాజులో ఏ లోపం రాదు.

2. ఖుర్ఆన్‌లో ఆయత్ గుర్తులు (వాక్యం చివరన ఉండే విరామ చిహ్నాలు) ఉన్న చోట్ల తప్పనిసరిగా ఆగిపోవాలి. ఎక్కడయితే వక్ఫె లాజిమ్ (విధిగా ఆగిపోవడం, అరబిక్ మీమ్ గుర్తు) ఉంటుందో అక్కడ ఆగిపోవడం ఫర్జ్ (విధి). అలా ఆగిపోకపోతే నమాజు భగ్నమవదు కాని అలా చెయ్యడం తప్పు, కావాలని చెయ్యడమయితే పాపం.

3. ఖుర్ఆన్‌ను కంఠస్థంచేసి చదివేటప్పుడు ఏదో ఓ పదం తప్పుగా చదివితే, ఆ పదం దివ్య ఖుర్ఆన్‌లో మరెక్కడయినా ఉన్నా లేదా దానివల్ల అర్థంలో ఎలాంటి మార్పు కూడా రాకుండా ఉన్నా అలాంటి సందర్భాల్లో నమాజు భగ్నం కాదు. కాని ఖుర్ఆన్‌లో లేనిది, లేక అర్థంలో వ్యత్యాసం తెచ్చేది పఠిస్తే నమాజ్ భగ్నమవుతుంది.

4. ఉచ్చారణ దోషాలు లేకుండా పఠించాలి. అంటే ఏ అక్షరం ఏవిధంగా ఉచ్చరించాలో అదేవిధంగా ఉచ్చరించాలి. అలా ఉచ్చరించలేకపోతే ఉచ్చరించే ప్రాక్టీసు చేయాలి. ప్రాక్టీసు చేసినా ఉచ్చరించలేకపోతే వీలున్నట్లే ఉచ్చరించవచ్చు. కాని అలా ఉచ్చరించగలిగి కూడా అశ్రద్ధగా ఉచ్చారణలను తారుమారుచేస్తే మాత్రం నమాజు భంగపడుతుంది. ఎందుకంటే ఉచ్చారణ మారడంవల్ల అర్థాలే మారి పోతాయి. దివ్యఖుర్ఆన్ అర్థం: మారిపోయేలా చదవడం మహా పాతకం. ఉదా: 'అల్హమ్దు లిల్లాహ్' అనే వాక్యం ఉంది. అల్హమ్దు లోని 'హ' అనే అక్షరం స్వరపేటిక దగ్గర గొంతు కండరాలను అదిమి ఉచ్చరించాల్సి ఉంటుంది. అలాకాక ఆ 'హ'ను కేవలం పైపైన్నే పలికితే అర్థం మారిపోతుంది. స్వరపేటిక దగ్గర గొంతు కండరాలను అదిమి ఉచ్చరించిన 'అల్హమ్దు లిల్లాహ్'కు అర్థం సకల స్తోత్రాలు అల్లాహ్ కోసమే అని వస్తుంది. కాని ఆ 'హ'ను ఒత్తి పలకక కేవలం పైపైన్నే

'అల్హామ్దు లిల్లాహ్' అంటే దానికి అర్థం సకల పనికిమాలిన (చెత్త) వస్తువులు అన్నీ అల్లాహ్ కోసమే అని వస్తుంది. దైవం క్షమించుగాక.

## ఖుర్ఆన్ పఠనం సందర్భంలో మరికొన్ని విషయాలు జ్ఞాపకం ఉంచుకోవాలి.

1. ఏ సూరా అయితే మొదటి రకాఅత్‌లో చదవబడిందో దాన్ని రెండో రకాఅత్‌లో చదవడం మంచిదికాదు. అయితే పొరపాటుగానో లేక మరో సూరా జ్ఞాపకం లేకనో చదివితే ఫరవాలేదు. అయితే మరికొన్ని సూరాలు కంఠస్థం చేసుకునే ప్రయత్నం చెయ్యడం అవసరం.

2. దివ్య గ్రంథంలో సూరాలు ఏ వరుస క్రమంలో రాయబడి ఉన్నాయో అదే వరుస క్రమంలో వాటిని నమాజ్‌లోనూ పఠించాలి. ఉదా: మొదటి రకాఅత్‌లో 'అలమ్‌తర' చదివితే రెండో రకాఅత్‌లో దాని తరువాత సూరాలు లిఈలాఫి ఖురైషిన్ లేదా 'ఇన్నా ఆతైనా' లేదా 'ఖుల్‌యా అయ్యుహల్ కాఫిరూన్' మొదలయిన సూరాలు పఠించాలి. ఖుర్ఆన్‌లోని సూరాల వరుస క్రమానికి వ్యతిరేకంగా, కావాలని, ఏ సూరానయినా పఠిస్తే అలా పఠించడం మక్రూహె తహ్రీమీ. కాని పొరపాటున పరధ్యానంగా అలా చేస్తే తప్పులేదు.

ఎవరయినా రెండు రకాఅత్‌లు లేక నాల్గు రకాఅత్‌ల నమాజు ప్రారంభించి పరధ్యానంగా మొదటి రకాఅత్‌లోనే ఖుర్ఆన్ చివరి సూరా అయిన 'ఖుల్ అవూజుబి రబ్బిన్నాస్' పఠిస్తే ఆ వ్యక్తి ప్రతి రకాఅత్‌లోను ఇక ఆ సూరానే తిరిగి పఠించాలి. దానిపై సూరాలు పఠించకూడదు. తెలియక అలా చదివినట్లయితే తప్పులేదు.

3. ఖుర్ఆన్ పఠనం రానివారు లేక నమాజులో పఠించే వచనాలు కంఠస్థం రానివారు కేవలం 'సుబ్హానల్లాహ్', 'అల్ హమ్‌దులిల్లాహ్' లేక మరే సద్వచనాన్నయినా పఠించి నమాజును పూర్తిచేయాలి. అయితే సతతం, ఖుర్ఆన్‌ను లేక వచనాలను కంఠస్థం చేసే ప్రయత్నం చేస్తూ ఉండాలి. అలా చేయకపోతే అది పాపంగా పరిగణించ బడుతుంది.

## ఇమామ్ ఖిరాఅత్ ఎలా చేయాలి

ఏ నమాజుల్లోనయితే ఉచ్ఛస్వరంతో ఖుర్ఆన్ పఠనం అవసరమో ఉదాహరణకు, మగ్రిబ్, ఇషా మరియు ఫజ్ర్ నమాజులు, వాటిలో ఇమామ్ అందరికి వినబడేటట్లు ఖుర్ఆన్ పఠించాలి. ఏ నమాజుల్లోనయితే మెల్లగా, తనకు మాత్రమే వినబడేటట్లు దివ్య

ఖుర్‌ఆన్ పఠించడం అవసరమో, ఉదా: జుహ్ర్ మరియు అస్ర్ నమాజుల్లో ఇమామ్ ధ్వని లేకుండానే ఖుర్‌ఆన్‌ను పఠించాలి(ఫతావా హిందియా). కాని కావాలని దీనికి భిన్నంగా చెయ్యడం పాపం,. తిరిగి నమాజు చేయవలసిందే. ఒకవేళ బయటికి పఠించే నమాజు వంటరిగా చేసే మాటయితే శబ్దంతో పఠించినా లేక ధ్వని లేకుండా పఠించినా తప్పులేదు కాని స్వరంతో పఠించడమే ఉత్తమం. అయితే మస్జిద్ ప్రతిధ్వనించేలా మటుకు పఠించరాదు.

## ఇమామ్‌కు లుక్మా ఇవ్వడం

ఇమామ్ నమాజులో ఖుర్‌ఆన్ పఠిస్తూ ఏదయినా వాక్యం మరచిపోయిన సందర్భంలో అప్పటికి మూడు వాక్యాలు పూర్తి చేసినట్లయితే రుకూ చేసి నమాజ్ పూర్తి చెయ్యాలి. అలాకాక మరచిపోయిన ఆ వాక్యాన్నే మాటిమాటికి పఠించడం సబబుకాదు. కాని మూడు ఆయత్‌లు చదివిన తరువాత కూడా ఎవరైనా మరచిపోయిన వాక్యాన్ని గుర్తుచేస్తే (లుక్మా ఇస్తే) ఇమామ్ దాన్ని స్వీకరించవచ్చు. నమాజులో ఎలాంటి లోపం రాదు. (ఫతావా ఆలంగీరి)

## ప్రవక్త సంప్రదాయసిద్ధమైన (మస్నూన్) ఖిరాఅత్

ప్రయాణంలో ఉన్న వ్యక్తి ఫాతిహా సూరా తరువాత తన ఇష్టమొచ్చిన ఏ సూరానయినా పఠించవచ్చు. కాని స్థిరవాసంలో ఉన్నవారు మాత్రం ఈ క్రింది మస్నూన్ పద్ధతినే అవలంబించాలి.

1. ఫజ్ర్ మరియు జుహ్ర్ నమాజుల్లో 'తివాలె ముఫస్సిల్'.
2. అస్ర్ మరియు ఇషా నమాజుల్లో 'ఔసాతె ముఫస్సిల్'.
3. మగ్రిబ్ నమాజులో 'ఖిసారె ముఫస్సిల్'.

అయితే ఈ పద్ధతినే పూర్తిగా అవలంబించాలన్నది సరయింది కాదు. అప్పుడప్పుడు దీనికి వ్యతిరేకంగా కూడా మహాప్రవక్త (సఅసం) పఠించినట్లు దాఖలాలున్నాయి.

## తివాలె ముఫస్సిల్

దివ్య ఖుర్‌ఆన్‌లోని ఇరవయి ఆరవ భాగం (పార, జుజ్)లోని హుజరాత్ సూరా నుండి ముప్ఫయో భాగం (చివరి జుజ్)లోని బురూజ్ సూరా అంటే 'వస్సమా అజాతిల్ బురూజ్' వరకు మొత్తం నాల్గు పారాల్లోని సూరాలు 'తివాలె ముఫస్సిల్' అంటారు.

## ఔసాతె ముఫస్సిల్

"తారిక్" సూరా (వస్సమాయి వత్తారిక్) నుండి 'లమ్‌యకు నిల్లజీన కఫరూ' వరకు గల పదమూడు సూరాలను అవ్‌సాతె ముఫస్సిల్ అంటారు.

## కిసారె ముఫస్సిల్

"ఇజాజుల్ జిలతిల్ అర్ద్" సూరా నుండి చివరి సూరా "ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్" వరకు గల సూరాలన్నింటినీ కిసారె ముఫస్సిల్ అంటారు.

గమనిక

ఈ సందర్భంలో ఇమామ్ దృష్టిలో ఉంచుకోవలసిన విషయం ఒకటుంది. అదేమిటంటే, సుదీర్ఘమయిన సూరాల పఠనంవలన ముక్తదీలు విసుగెత్తే అనుమానమున్నా లేక వారి పనుల్లో అంతరాయం కలిగే భయమున్నా, లేక వారు దాన్ని అంతగా ఇష్టపడరన్న సందేహమున్నా నమాజ్ తేలికగానే ముగించాలి. ముఖ్యంగా పల్లెల్లో ఈ విషయం దృష్టియందుండాలి. మహాప్రవక్త (సఅసం) ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, ఏ పిల్లవాడైనా వెనుక నమాజులో ఏడిస్తే తమ నమాజును క్లుప్తంగా ముగించేవారు– ఆ పిల్లవాని తల్లి బాధపడిపోతుందనే ఉద్దేశ్యంతో. అయితే ఎక్కడయితే సాధారణ నమాజీలు సుదీర్ఘమైన నమాజ్‌నే కోరుకుంటారో అక్కడ ఇమామ్ దీర్ఘమయిన నమాజే చేయాలి. ఎవరికయితే నమాజు ప్రాముఖ్యత తెలియదో, వారు ఇలాంటి నమాజువల్ల విసుగెత్తుతారు. వారందరికి దీని ప్రాముఖ్యత గూర్చి తెలియజేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. తేలికైన నమాజు అంటే చిన్న చిన్న సూరాలతో పూర్తిచేసే నమాజు. రుకూ మరియు సజ్దాల్లో మూడు మూడుసార్ల కంటే అధికంగా తస్బీహ్ ఇమాం చదవకూడదు. నమాజులోని అంగాలను (అర్‌కాన్) చకచకా నేరవేర్చడం, వచనాలను గడగడా చదివేయడం అని దీని భావం ఎంత మాత్రం కాదు. తాదీలె అర్కాన్ (నమాజులోని ప్రతి అంగాన్ని స్థిమితంగా నెరవేర్చడం) వాజిబ్ అనే విషయం ఇదివరకే చెప్పబడింది. అంతిమ దైవప్రవక్త (సఅసం) అధికంగా పైన పేర్కొన్న క్రమంలోనే నమాజులో దివ్య ఖుర్‌ఆన్‌ను పఠించేవారు. కాని ఆయన ఫర్జ్ నమాజుల్లో ఖుర్‌ఆన్‌లోని పెద్ద పెద్ద సూరాలనూ చిన్న సూరాలను చదివారు. ఉదాహరణకు ఆయన ఫజ్ర్ నమాజులో హుజ్రాత్ సూరాకు ముందున్న సూరాలూ చదివారు. మగ్రిబ్ నమాజులో 'వత్తూర్' మరియు ఫజ్ర్‌లో ఖుల్ అవుజుబి రబ్బిల్ ఫలక్, ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్ కూడా పఠించారు.

## వాజిబ్ మరియు సున్నత్ నమాజులు

ఇప్పటివరకు చెప్పిన వివరాలు అన్నిరకాల నమాజుల గురించిన ఉమ్మడి విషయాలు. ఫర్జ్ నమాజులకు సంబంధించిన విషయాలు కూడా ఇంతకు మునుపే చెప్పబడ్డాయి. అయితే కొన్ని ఆదేశాలు కేవలం సున్నత్, వాజిబ్, నఫిల్ నమాజులకు మాత్రమే ప్రత్యేకం. ప్రస్తుతం వాటి గురించే చెప్పబడుతోంది. ఫర్జ్ నమాజులు కాక, ఇతర సున్నత్, వాజిబ్ నమాజుల సంఖ్య కూడా ఇదివరకే చెప్పడం జరిగింది. ఇప్పుడు వేరు వేరుగా వేళ ప్రకారం చదివే సున్నత్, వాజిబ్ నమాజుల గురించి తెలుసుకుందాము.

## ఇషా నమాజ్

ఇషా నమాజు సమయంలో ఫర్జ్ రకాత్‌లకు ముందు ఎలాంటి సున్నత్‌లు ఉన్నట్లు మహాప్రవక్త (సఅసం) ఆచరణ ద్వారా ధృవపడలేదు. ఏ వ్యక్తి అయినా ఫర్జ్ నమాజు ముందు ఏదయినా నమాజుచేస్తే అది నఫిల్ క్రిందికి వస్తుంది. అంటే అతను చేసిన ఆ నమాజుకు నఫిల్ పుణ్యఫలం మాత్రమే ప్రాప్తం అవుతుందన్నమాట. హదీసు ప్రకారం అయితే ప్రతి అజాన్, ఇఖామత్‌ల నడుమ నమాజు ఉంది అని తెలుస్తోంది. ఈ హదీసును దృష్టిలో ఉంచుకొనే ఇషా ఫర్జ్ నమాజ్‌కు ముందు రెండు లేక నాల్గు రకాఅత్‌ల నమాజు తప్పకుండా చేయాలి. ఫర్జ్ నమాజు తరువాత రెండు రకాఅత్‌ల సున్నత్ అత్యవసరం. అదే కాకుండా మరింకేదైనా నఫిల్ నమాజ్ చేస్తే దాని అనుమతి కూడా ఉంది. రెండు రకాఅత్‌ల సున్నతె ముఅక్కిదా తరువాత మహా ప్రవక్త (సఅసం) తరచుగా నాల్గు రకాఅత్‌లు చదివేవారు. అయితే నఫిల్ నమాజుల్ని కూర్చునే చేయాలని అనుకోవడం సబబుకాదు. వాటన్నిటిని నిలబడే చేయడం ఉత్తమం. అయితే విత్ర్ నమాజు తరువాత చేసే రెండు రకాఅత్‌ల నఫిల్‌ను మాత్రం మహాప్రవక్త (సఅసం) కూర్చునే చేసినట్లు దాఖలాలు ఉన్నాయి. ఇషా ఫర్జ్ తరువాత రెండు రకాఅత్‌ల సున్నతె ముఅక్కిదా తరువాత మూడు రకాఅత్‌ల విత్ర్ నమాజు చేయడం వాజిబ్. అంటే అత్యవసరం.

## విత్ర్ నమాజ్ ఈవిధంగా చేయాలి

దాని మొదటి రెండు రకాఅత్‌లు మాత్రం ఇతర నమాజుల మాదిరిగానేచేసి మూడవ రకాఅత్‌లో సూరె ఫాతిహా, మరో సూరాను పఠించిన తరువాత, రుకూ చేసేముందు రెండు చేతుల్ని అల్లాహు అక్బర్ అంటూ చెవుల వరకు ఎత్తి తిరిగి కట్టుకొని దుఆయె ఖునూత్ పఠించాలి. దుఆయె ఖునూత్, దాని అర్థం ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

## దుఆయె ఖునూత్

"అల్లాహుమ్మ ఇన్నా నస్తయీనుక వ నస్తగ్ఫిరుక వ నూమినుబిక వ నతవక్కలు అలైక వ నుస్నీ, అలైకల్‌ఖైర్. వ నష్కురుక వలా నగ్ఫిరుక వ నక్లవు వ నత్రుకు మంయఫ్జురుక్. అల్లా హుమ్మ ఇయ్యాక నఅబుదు వలక నుసల్లి వనస్జుదు వ ఇలైక నస్అ వ నహ్ఫిదు వ నర్జూరహ్మతక వ నఖ్షా అజాబక ఇన్న అజాబక బిల్ కుప్ఫారి ముల్హిక్."

اَللّٰهُمَّ اِنَّا نَسْتَعِيْنُكَ وَنَسْتَغْفِرُكَ وَنُؤْمِنُ بِكَ وَنَتَوَكَّلُ عَلَيْكَ وَنُثْنِيْ عَلَيْكَ الْخَيْرَ وَنَشْكُرُكَ وَلَا نَكْفُرُكَ وَنَخْلَعُ وَنَتْرُكُ مَنْ يَّفْجُرُكَ اَللّٰهُمَّ اِيَّاكَ نَعْبُدُ وَلَكَ نُصَلِّيْ وَنَسْجُدُ وَاِلَيْكَ نَسْعٰى وَنَحْفِدُ وَنَرْجُوْ رَحْمَتَكَ وَنَخْشٰى عَذَابَكَ اِنَّ عَذَابَكَ بِالْكُفَّارِ مُلْحِقٌ۔

అర్థం: ఓ అల్లాహ్! మేము నీ సహాయాన్నే వేడుకుంటాం. నీ మన్నింపునే కోరుతాము. నీ పైన్నే విశ్వాసముంచాము. నిన్ను ఉన్నతంగా స్తోత్రిస్తాము. నీకు కృతజ్ఞులమై ఉంటాము. నీ ఆజ్ఞల్ని జవదాటము. నిన్ను ధిక్కరించేవారిని, నీ ఆజ్ఞాపాలన చేయనివారిని విడనాడుతాము. ఓ అల్లాహ్! నీ సన్నిధిలోనే మా నొసటిని పంచుతాము (సజ్దా చేస్తాము). నీ వైపుకే పరుగెడుతాము, వడివడిగా నడుస్తాము. నిశ్చయంగా నీ శిక్ష నీ కృతఘ్నులపై విరుచుకుపడుతుంది.

ఒక దుఆయె ఖునూత్ పైన రాయడం జరిగింది. ఇదే కాకుండా మరెన్నో దుఆయె ఖునూత్‌లు కూడా ఉన్నాయి. వాటిని మహాప్రవక్త (సఅసం) అప్పుడప్పుడు పఠించేవారు. అయితే ఓ దుఆయె ఖునూత్ విషయంలో హజ్రత్ హసన్ (రజిఅన్), నాకు మహాప్రవక్త (సఅసం)విత్ర్ నమాజులు చదివేందుకు ఈ దుఆ నేర్పారు" అని చెప్పారు. దాన్ని కూడా ఇక్కడ రాయడం జరిగింది.

"అల్లాహుమ్మహ్‌దినీ ఫీమన్‌హదైత వ ఆఫినీ ఫీమన్ ఆఫైత వతవల్లనీ ఫీమన్ తవల్లైత వ

اَللّٰهُمَّ اهْدِنِيْ فِيْمَنْ هَدَيْتَ وَعَافِنِيْ فِيْمَنْ عَافَيْتَ وَتَوَلَّنِيْ فِيْمَنْ

బారిక్‌లీ ఫీమా ఆతైత వ ఖినీ షర్రమాఖజైత ఫ ఇన్నక తక్జీ వలాయుక్జా అలైక ఇన్నహూ లా యజిల్లు మన్‌వాలైత వలా యఇజ్జు మన్ ఆదైత తబారక్త రబ్బనా వతఆలైత."

تَوَلَّيْتَ وَبَارِكْ لِي فِيمَا أَعْطَيْتَ وَقِنِي شَرَّ مَا قَضَيْتَ فَإِنَّكَ تَقْضِي وَلَا يُقْضَى عَلَيْكَ إِنَّهُ لَا يَذِلُّ مَنْ وَالَيْتَ وَلَا يَعِزُّ مَنْ عَادَيْتَ تَبَارَكْتَ رَبَّنَا وَتَعَالَيْتَ۔

## ఖునూతె నాజిలా

ఎప్పుడయినా అసాధారణ ఆపద వచ్చిపడినప్పుడు ఉదా: అంటురోగాలు ప్రబలినప్పుడుగాని లేదా ముస్లిమ్‌ల ధన మాన ప్రాణాలకు ముప్పువాటిల్లినప్పుడుగాని ఖునూతె నాజిలా చదవడం సున్నత్. స్వయంగా మహాప్రవక్త (సఅసం), యమామాలో అమరగతి పొందిన సహాబీల కోసం దీన్ని పఠించి, ముస్లిమ్‌ల కోసం దుఆ చేసి శత్రువుల్ని శపించారు. నలుగురు ఖలీఫాలు (రజిఅన్) (ఖుల్ఫాయె రాషిదీన్) మరియు ధార్మిక గురువులు ఈ ఖునూతె నాజిలాను చదివినట్లు దాఖలాలు ఉన్నాయి. దీన్ని చదివే పద్ధతి ఏమిటంటే ఫజ్ర్ నమాజ్ రెండవ రకాఅత్‌లో రుకూ తరువాత, చేతులు నిటారుగా వదిలేసి ఖునూత్ చదవాలి. దీనికోసం అని ప్రత్యేకమయిన దుఆ ఏదీ లేదు. మహాప్రవక్త (సఅసం) చదివిన ఏ దుఆనయినా ఇందులో పఠించవచ్చు. ఉదాహరణకు అల్లాహుమ్మ ఇహ్‌దినా ఫీమన్ హదైతలాంటిది. ఇదే కాకుండా మరో దుఆయె ఖునూత్ కూడా ఉంది. కాని అది సుదీర్ఘమయినందున ఇక్కడ వ్రాయడం కుదరలేదు. ఈ రెంటిని కలిపి చదివితే మంచిదే. విత్ర్ నమాజులో దుఆయె ఖునూత్ జ్ఞాపకం లేకుంటే మరే దుఆనయినా చదవవచ్చు. అయితే దీన్ని కంఠస్థం చేయడం అవసరం. దుఆయె ఖునూత్ చదవడం వచ్చి నమాజులో దాన్ని చదవడం మరచిపోతే సహూ సజ్దా చేయాలి. దుఆయె ఖునూత్ పూర్తిగా చదివిన తరువాత (మూడో రకాఅత్‌లో) రుకూ సజ్దాలు చేసి మూడో రకాఅత్ పూర్తి చేయాలి. ఎవరయినా విత్ర్‌లోని మూడో రకాఅత్‌లో వచ్చి చేరితే మిగిలిన రెండు రకాఅత్‌లు పూర్తి చేసుకోవాలి. తిరిగి దుఆయె ఖునూత్ చదువనవసరం లేదు.

**తరావీహ్:** రమజాన్ నెలలో ఇషా యొక్క ఫర్జ్ మరియు సున్నత్ నమాజుల తరువాత విత్ర్‌కు ముందు ఇరవై రకాఅత్‌ల తరావీహ్ నమాజ్ చేయడం సున్నతె

ముఅక్కిదా. దాని తరువాత విత్ర్ నమాజ్ జమాఅత్‌తో చేయడం ఉత్తమం. దీని గురించిన వివరాలు 'రోజా' అధ్యాయంలో చెప్పబడతాయి.

ఫజ్ర్: ఫజ్ర్ సమయంలో, ఫజ్ర్ నమాజులోని ఫర్జ్ రకాఅత్‌లకు ముందు రెండు రకాఅత్‌లు సున్నతె ముక్కిఅదా ఉన్నాయి. ఈ సున్నత్ చదువకనే ఫర్జు చదివితే ఆ తరువాతైనా దాన్ని చదువవలసిందే. ఫజ్ర్ సమయం ఉషోదయం నుండి సూర్యోదయం వరకు ఉంది. ఫజ్ర్‌లో రెండు రకాఅత్‌ల సున్నత్, ఆ తరువాత రెండు రకాఅత్‌లు ఫర్జ్ తప్ప మరే ఇతర నఫిల్ నమాజులు చదవడానికి వీలు లేదు. అయితే ఇషా నమాజు తప్పిపోతే దాని ఖజా చదవవచ్చు.

జుహ్ర్: జుహ్ర్ వేళప్పుడు ఆరు రకాఅత్‌లు సున్నతె ముఅక్కిదా ఉన్నాయి. నాల్గు రకాఅత్‌లు ఫర్జ్‌కు ముందు, రెండు రకాఅత్‌లు ఫర్జ్ తరువాత, అబూదావూద్, తిర్మిజీ హదీసుల్లో, ఫర్జ్‌కు ముందు నాల్గు, ఆ తరువాత నాల్గు రకాఅత్‌లు చదివే ప్రసక్తివచ్చింది. కాబట్టి ఫర్జ్ తరువాత రెండు రకాఅత్‌ల సున్నత్‌లే కాకుండా రెండు రకాఅత్‌ల నఫిల్ కూడా చదవడం మంచిది. ఒకవేళ మొదట చదువవలసిన నాల్గు రకాఅత్‌లు జమాఅత్‌లో చేరేందుకుగాని, సంకల్పం చేశాక జమాఅత్‌లో చేరేందుకుగాని భంగపరిస్తే వాటిని ఫర్జ్ అయిపోయిన తరువాత చదవాలి. అందునా అవి రెండు సున్నతె ముఅక్కిదా రకాఅత్‌లు చదివిన తరువాతే చదవాలి.

అస్ర్: అస్ర్ వేళలో ఎంలాంటి సున్నత్ తప్పనిసరిగా చదవాలన్న నియమం లేదు. కాని మహాప్రవక్త (సఅసం) ఒక్కొక్కప్పుడు నాల్గు రకాఅత్‌లు, మరొక్కప్పుడు రెండు రకాఅత్‌లు కూడా చదివేవారు. అందుకని ఈ సున్నత్ నమాజ్ చదవడం ఉత్తమం.

మగ్రిబ్: మగ్రిబ్ ఫర్జ్ నమాజుకు ముందు ఇంకే ఇతర నమాజులు చదవకూడదు. ఫర్జు తరువాత రెండు రకాఅత్‌లు సున్నతె ముఅక్కిదా ఉంది. ఆ తరువాత రెండు, నాల్గు లేక ఆరు రకాఅత్‌ల నఫిల్ చదవడంలో చాలా పుణ్యఫలం ఉంది. కొన్ని హదీసుల్లో ఇరవై రకాఅత్‌ల ప్రస్తావన కూడా వచ్చింది. దీన్ని సాధారణంగా 'సలాతుల్ అవ్వాబీన్' అని అంటారు. హదీసుల్లో సలాతుల్ అవ్వాబీన్ 'సలాతుజ్జుహా'కు మరో పేరు. అయినా దీన్ని సలాతుల్ అవ్వాబీన్ అనే అంటారు.

ఇప్పుడు అయిదు పూటల నమాజుల్లో, మొత్తం పదిహేడు రకాఅత్‌ల ఫర్జ్, పన్నెండు రకాఅత్‌ల సున్నత్, మూడు రకాఅత్‌ల విత్ర్ అయ్యాయి. ఈ పన్నెండు రకాఅత్‌లు సున్నతె ముఅక్కిదా అనబడతాయి. అంటే హదీసుల్లో వాటిని చదివే తాకీదు చేయబడిందన్నమాట. మహా ప్రవక్త (సఅసం) ఎల్లప్పుడు వాటిని నియమం తప్పకుండా చదివేవారు.

ఈ ముప్పయి రెండు రకాఅత్‌ల నమాజు చదవడం ప్రతి ముస్లిమ్‌కు తప్పనిసరి. ఇవేకాకుండా ఎవరైనా నఫిల్ నమాజు చదవదలిస్తే ఎన్నయినా చదవవచ్చు. నఫిల్ నమాజుల గురించి హదీసుల్లో ఎంతో తాకీదు చేయబడింది. నఫిల్ నమాజుల్ని హదీసులో "ముజబ్బిరాతుస్సలాత్"గా పేర్కొనడం జరిగింది. అంటే ఫర్జు మరియు సున్నత్ నమాజుల్లో ఏదైనా లోపాలు ఉంటే ఆ లోపాలు వీటి ద్వారా తొలగించబడతాయి అని అర్థం. ఇంతేకాకుండా ఫర్జ్ నమాజు తరువాత దైవ సాన్నిధ్యాన్ని పొందడానికి ఈ నఫిల్ నమాజులు ఎంతో సహాయపడతాయి. అయితే ముస్లిమ్ సమాజ సౌలభ్యంకోసం ఇది వారిపై అత్యవసరమయిన బాధ్యతగా మోపబడలేదు.

కొన్ని నఫిల్ నమాజుల గురించి ఇక్కడ చెప్పబడుతోంది. ఇవి మహాప్రవక్త (సఅసం) ఆచరించినట్లు ధృవపడినవే.

**సూచన:** పగటిపూట నఫిల్ నమాజు చేయవలసివస్తే రెండు లేక నాల్గు రకాఅత్‌ల కంటే అధికంగా కలిపి చదివేందుకు సంకల్పించుకోకూడదు. అదేవిధంగా పగటి నఫిల్ నమాజులు మెల్లగా (ఇతరులకు వినబడనట్లుగా) చదవడం మంచిది. రాత్రిపూట నఫిల్ నమాజుల్ని మన ఇష్టప్రకారం మెల్లిగాగాని, లేక పైకి వినబడే టట్లుగాగాని చదవవచ్చు. ఈ విషయం ఐచ్ఛికం. అయితే ప్రక్కన నిద్రబోతున్న వ్యక్తికి నిద్రాభంగం కలిగేంత బిగ్గరగా చదవటం భావ్యం కాదు.

**తహజ్జుద్ నమాజ్:** దీనివేళ ఇషా నమాజు ముగిసిన తరువాతనుండి మొదలయి ఉషోదయం వరకు ఉంటుంది. దీని ప్రస్తావన దివ్య ఖుర్‌ఆన్‌లోను హదీసుల్లోను ఉంది. మహాప్రవక్త (సఅసం) ప్రతిరోజూ రాత్రి దాదాపు నాల్గుగంటల పాటుని ద్రించి తహజ్జుద్ నమాజ్ కోసం మేల్కునే వారు. ఒక్కొక్కప్పుడు ఆయన రేయంతా తహజ్జుద్ నమాజులోనే గడిపేవారు. రాత్రిపూట నిలబడి తహజ్జుద్ నమాజ్ చేయడం వల్ల తరచుగా ఆయన పాదాలపై వాపు కనబడేది. ఆయన చదివే తహజ్జుద్ నమాజ్ గురించి హదీసు ఇలా వివరిస్తోంది. ఆయన నమాజ్ చేస్తున్నప్పుడు అపార దైవభీతి ఆవహించి ఆయన హృదయం నుండి ఓ శబ్దం వినవచ్చేది. ఆ శబ్దం కుండలో నీరు పోసి మరిగించినప్పుడు వచ్చే శబ్దంలా ఉండేది.

అయిదు పూటల నమాజ్ ఫర్జు (విధి)గాక పూర్వం మహాప్రవక్తపై ఈ తహజ్జుద్ నమాజు ఫర్జుగా చేయబడింది. కాని అయిదు వేళల నమాజు ఫర్జు (విధి) అయిన తరువాత ఇది నఫిల్‌గా మారిపోయింది. సహాబా (రజిఅన్) తరచుగా ఈ నమాజును చదివేవారు. వీరి గురించి ఇలా రాయబడింది. వీరు రాత్రిళ్ళు సర్వసంగ పరిత్యాగుల్లా దైవారాధనలో నిమగ్నులయ్యేవారు. పగటివేళ ధర్మయుద్ధం (జిహాద్)లో వీరయోధులుగా పాల్గొనేవారు."

సహాబా (రజిఅన్) తరువాత ధార్మిక గురువులందరు కూడా ఈ నమాజ్‌ను చేసేవారు. దీని పేరే దాబ్బతు స్సాలిహీన్‌గా ప్రతీతి చెందింది. అంటే సత్పురుషుల నమాజ్ అని అర్థం.

**రకాఅత్‌ల సంఖ్య:** ఈ నమాజ్‌లోని రకాఅత్‌లకు పరిమితం లేదు. రెండు, నాల్గు, ఆరు లేక ఎనిమిది–ఈ విధంగా ఎన్ని రకాఅత్‌లనైనా చదవవచ్చు. సాధారణంగా మహాప్రవక్త (సఅసం) ఎనిమిది రకాఅత్‌లనే చదివేవారు.

సమయం: దీని సమయం ఇషా౯ నుండి మొదలు ఉషోదయం వరకు ఉంది. అయితే నడిరేయి దాటిన తరువాత దీన్ని చదవడం మంచిది. ఎవరైనా తహజ్జుద్ చదివే అలవాటుండి, ఏ కారణాన్నైనా సుస్తీ ఏర్పడితే ఇషా యొక్క ఫర్జ్, సున్నత్ మరియు విత్ర్ తరువాత రెండు లేక నాల్గు రకాఅత్‌లు నఫిల్ చదువుకోవాలి. మహాప్రవక్త (సఅసం) సాధారణంగా ఇషా యొక్క సున్నతె ముఅక్కిదా తరువాత రెండు రకాఅత్‌ల చొప్పున నాల్గు రకాఅత్‌లు నఫిల్ చదివేవారు.

తహజ్జుద్ నమాజ్ చేయడం అలవాటు లేకపోతే దాన్ని అలవాటు చేసుకోవడం మంచిది. ఈ నమాజు దైవంతో మన సంబంధాన్ని పెంపొందిస్తుంది. ఇంతే కాదు ధర్మంపై నిలకడగా ఉండడానికి, దైవమార్గంలో వచ్చే కష్టనష్టాలను సహించడానికి ఎంతైనా సహాయపడుతుంది. దీనిద్వారా ఆత్మ ప్రక్షాళన జరుగుతుంది. మన ఆలోచనల్లో ఏకాగ్రత జనిస్తుంది. వాక్కులో బలం చేకూరి ఇతరులపై దాని ప్రభావం పడుతుంది. హృదయంలో శాంతి సంతృప్తులు జనిస్తాయి. ఈ సుగుణాలన్నీ మరే ఇతర నఫిల్ నమాజ్‌ల ద్వారాగాని, జిక్ర్ ద్వారాగాని సాధ్యం కావు. దివ్య ఖుర్‌ఆన్ కేవలం రెండే రెండు వాక్యాల్లో పై సుగుణాల గురించి ఇలా చెబుతుంది:

"నిద్ర నుండి లేచి చేసే ఆరాధన ద్వారా ఆత్మ ప్రక్షాళన, హృదయశాంతి, మనో స్థిమితం బాగా పెరుగుతాయి. చెప్పే మాటలు సరైనవిగా, సక్రమమైనవిగా వెలువడతాయి" (ముజమ్మిల్)

## హదీసులోని కొన్ని ప్రత్యేకతలు చెప్పబడ్డాయి

"మీరు రాత్రి నిద్రలేచి నమాజు చేయడం నియమంగా పెట్టుకోండి. ఇదే పద్ధతిని మీకు పూర్వం గతించిన సత్పురుషులు కూడా ఆచరించారు. నమాజ్ మిమ్మల్ని దైవానికి సన్నిహితం చేస్తుంది. మీ పాపాలను పారద్రోలుతుంది. పాపాలనుండి మిమ్మల్ని వారిస్తుంది." (తిర్మిజి)

ఎవరైనా తహజ్జుద్ చదవలేకపోతే, పగలుగాని రాత్రిగాని ఎప్పుడైనా రెండు లేక నాల్గు రకాఅత్‌లు నఫిల్ నమాజ్ తప్పక చదవాలి.

## తహియ్యతుల్ వుజు, తహియ్యతుల్ మస్జిద్

వుజూ చేసిన వెనువెంటనే రెండు రకాత్‌ల నఫిల్ నమాజ్ చదివితే ఎంతో పుణ్య ఫలం లభిస్తుంది. ఈ నమాజును తహియ్యతుల్ వుజూ అంటారు. దీని ప్రస్తావన హదీసులో ఉంది. ఇదే విధంగా మస్జిద్‌లో ప్రవేశించగానే రెండు రకాఅత్‌ల నఫిల్ నమాజు చదివినట్లయితే ఆ నమాజ్‌కు కూడా ఎంతో పుణ్యఫలం లభిస్తుంది. ఈ నమాజ్ తహియ్యతుల్ మస్జిద్‌గా పిలువబడుతుంది. కొందరు ఇమామ్‌లు దీన్ని ఆచరించడం వాజిబ్ అని చెబుతారు.

**ఇష్రాక్ నమాజు:** పై రెండు నమాజులే కాక ఇష్రాక్ నమాజు (సూర్యోదయం అయిన తరువాత కొంతసేపటికి చేసే నమాజు) కూడా ఉంది. దీనిలోను రెండు రకాఅత్‌లు చదవడం నఫిల్. హదీసులో ఈ నమాజుకు కూడా ఎంతో పుణ్యఫలం ఉందని చెప్పబడింది. మహాప్రవక్త (సఅసం) దీన్ని ఆచరించినట్లు ఆధారాలున్నాయి.

**సలాతుజ్జుహా:** అంటే బాగా పొద్దెక్కిన తరువాత రెండేసి రకాఅత్‌ల చొప్పున మొత్తం నాల్గు రకాఅత్‌లు చదవాలని హదీసులో ఉంది.ఎనిమిది రకాఅత్‌లు కూడా చదవవచ్చు. ఈ నమాజును 'చాష్త్' నమాజ్ అని కూడా అంటారు. దైవప్రవక్త (సఅసం) దీన్ని ఎంతో నియమంగా చేసేవారు. (బుకారి, ముస్లిం) సాధారణంగా మగ్రిబ్ తరువాతచేసే ఆరు రకాఅత్‌ల నమాజ్‌ను సలాతుల్ అవ్వాబీన్‌గా చెప్పుకోవడం కద్దు. అయితే హదీసు గ్రంథంలో సలాతుజ్జుహానే సలాతుల్ అవ్వాబీన్‌గా చెప్పడం జరిగింది. సలాతుల్ అవ్వాబీన్‌ను "ఎండ ముదిరి దాని వేడిమికి ఒంటె పిల్లల కాళ్ళు కాలేటప్పుడు చదివే నమాజ్" అని ముస్లిం హదీసులో ఉంది.

ఇవికాక ఇంకొన్ని నఫిల్ నమాజుల ప్రస్తావన హదీసుల్లో ఉంది. ఉదా: 1. సలాతుత్తస్బీహ్, 2. సలాతుల్ ఇస్తిఖార, 3. సలాతుల్ హజ్జ వగైరాలు. దైవప్రవక్త (సఅసం) సంతోషకరమైన లేక బాధాకరమైన ప్రతి విషయమూ విన్నప్పుడు నమాజ్‌కై నిలబడేవారు. సంతోష సమయాల్లో దైవానికి కృతజ్ఞతను తెలిపేందుకు, దుఃఖ సమయాల్లో దైవ సహాయం అర్థించడానికి. మనస్తాపం కలిగించే సందర్భం వచ్చినప్పుడల్లా మహాప్రవక్త

హ(జత్ ముహమ్మద్ (సఅసం) నమాజుకై నిలబడేవారని 'అబూదావూద్' హదీసులో ఉంది.

**సలాతుత్తస్బీహ్:** హదీసులో ఈ నమాజ్‌కు మంచి విలువ నీయబడింది. "దీన్ని ప్రతిరోజూ ఆచరించండి, అలా చేయలేని పక్షంలో వారానికోరోజు ఆచరించండి. ఇదీ సాధ్యం కాకుంటే నెలకోరోజు, అదీ కాకపోతే మీ జీవితంలో ఒక రోజైనా దీన్ని ఆచరించండి" అని ప్రవచించారు మహాప్రవక్త (సఅసం).

ఈ నమాజుచేసే తీరు (విధానం) ఏమిటంటే నాల్గు రకాఅత్‌ల నఫిల్ నమాజ్ సంకల్పం చేసి మొదటి రకాత్‌లో సనా మరియు ఫాతిహా సూరా చదివిన తరువాత పదిహేనుసార్లు ఈ క్రింది తస్బీహ్ చదవాలి.

**తస్బీహ్: "సుబ్హానల్లాహి వల్‌హందు లిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్"**

చదివి రుకూ చేయాలి. రుకూలో సుబ్హానరబ్బియల్ అజీం అనే తస్బీహ్ చదివిన తరువాత పైన చెప్పిన తస్బీహ్‌ను పదిసార్లు చదవాలి. సమిఅల్లాహులిమన్ హమిద అని నిటారుగా నిలబడి రబ్బనా వలకల్ హమ్‌ద్ అన్న తరువాత సజ్దా చేసేముందు పదిసార్లు చదవాలి. సజ్దాలో సజ్దా తస్బీహ్ (సుబ్హాన రబ్బియల్ ఆలా చదివిన తరువాత పదేసిసార్లు దాన్ని పఠించాలి. సజ్దా నుండి పైకిలేచి కూర్చుని రెండో సజ్దా చేసేముందు పదిసార్లు చదవాలి. రెండోసజ్దాలోను పదిసార్లు పఠించాలి. ఇలా రెండవ రకాత్‌లోను, మూడో రకాత్‌లోను మరియు నాల్గొ రకాత్‌లోను ఈ తస్బీహ్‌ను పఠించాలి. నమాజులో ఎక్కడైనా దీన్ని మరిచిపోతే నమాజులోని ఏ భాగం (రుక్న్)లో మరిచాడో తదుపరి రకాఅత్‌లో అదే చోట ఇరవై సార్లు చదవవలసి ఉంటుంది. కొందరి అభిప్రాయం ప్రకారం ఈ తస్బీహ్ తరువాత "లా హౌల వల ఖువ్వత ఇల్లాబిల్లాహిల్ అలీయిల్ అజీం" అనే వాక్యాన్ని కూడా చేర్చాలని ఉంది (అబూదావూద్) (అఫ్జలుల్ ఉతామ్ పే. 214). ఒకవేళ ప్రతి రకాత్‌లో ఒకసారైనా ఈ వాక్యాన్ని చదివితే సున్నత్ పూర్తి అవుతుంది.

**సలాతుల్ హాజ్జ:** హ(జత్ అబ్దుల్లా బిన్ అబీ అవుఫా (రజిఅన్) మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రకటించారని ఉటంకిం చారు. "మీలో ఎవరికైనా అల్లాహ్‌తోను, మరే వ్యక్తితోను ఏదయినా అవసరం బడితే, సక్రమంగా వుజూచేసి రెండు రకాఅత్‌ల నమాజు చేయాలి. ఆ తరువాత దైవాన్ని స్తోత్రించి దైవ ప్రవక్త (సఅసం)పై దరూద్ పంపి (చదివి) ఈ దుఆ చదవాలి.

దుఆ: లా ఇల్లాహ ఇల్లల్లాహుల్ హలీ ముల్ కరీం. సుబ్హాన రబ్బిల్ అర్షిల్ అజీమ్. అల్హమ్దులిల్లాహి రబ్బిల్ ఆల మీన్,. అస్ అలుక మూజిబాతురహ్మతిక వ అజాయిమ మగ్ఫిరతిక వల్ అస్మతు మిన్కుల్లి జంబిన్ వల్ గనీమతు మిన్కుల్లి బ[్రిన్ వస్సలామతు మిన్కుల్లి ఇస్మ్. లా తదాలీ జమ్బిన్ ఇల్లా గఫ్ఫర్తహు వలా హమ్మన్ ఇల్లా ఫ[్ర జ్తహు, వలా హాజతన్ హియలక్. రజన్ ఖజైతహుమా. యా అర్హమర్ రాహిమీన్.

(తిర్మిజీ, ఇబ్నెమాజ, హాకిమ్)

لا اله الا الله الحليم الكريم
سبحان رب العرش العظيم
الحمد لله رب العلمين اسئلك
موجبات رحمتك وعزائم
مغفرتك والعصمة من
كل ذنب والغنيمة من كل
بر والسلامة من كل اثم
لا تدع لي ذنبا الا غفرته
ولا هما الا فرجته ولا
حاجة هي لك رضا
قضيتها يا ارحم الراحمين
(ترمذی ابن ماجہ حاکم وغیرہ)

ఈ దుఆ తరువాత అల్లాహ్‌ను కావలసిన కోరిక నెరవేరడానికి దుఆ చేస్తే దైవచిత్తమయితే న్యాయమైన మన అవసరం తీరుతుంది.

**ముఖ్య సూచన :** సున్నత్, నఫిల్ నమాజులు ఇంటిలోనే చేయడం, మస్జిద్‌లో చేయడంకన్నా మేలు. మహా ప్రవక్త (సఅసం) సున్నత్ నమాజుల్ని ఎల్లప్పుడు ఇంటిలోనే చేసేవారు. "ఇళ్ళను గోరీలుగాను, గోరీలను ఇళ్ళగాను మార్చకండి" అని మహాప్రవక్త (సఅసం)ప్రవచించారు. (అంటే ఏ విధంగానయితే గోరీల ఆవరణ నమాజు కోసం, జిక్ర్ కోసం పనికిరాదో అదే విధంగా ఇళ్ళు గోరీల దిబ్బలా నమాజు, జిక్ర్ కోసం పనికి రాకుండా చేయకండీ అని దీని భావం) నేటి అశ్రద్ధ, ఏమరపాటుల కాలంలో సున్నత్ నమాజును మస్జిద్‌లోనే చదవడం అత్యుత్తమం. ఇలా చేయడం వల్ల ఇది ఇతరులకు ప్రేరణగా కూడా ఉంటుంది.

**నమాజుకు మక్రూహ్ వేళలు:** కొన్ని వేళల్లో ఫర్జ్‌గాని, సున్నత్‌గాని, నఫిల్ నమాజులుగాని చేయడానికి వీల్లేదు. కొన్ని వేళల్లో ఫర్జ్, సున్నత్ నమాజులయితే

చేయవచ్చుగాని నఫిల్ నమాజు మాత్రం చేయడానికి వీలులేదు. ఈ వేళల్ని ఈ క్రింది విధంగా వేరువేరుగా వివరించడం జరుగుతోంది.

## అన్ని రకాల నమాజులు మక్రూహ్ అయ్యే వేళలు:

1. సూర్యోదయం అయ్యేటప్పుడు, సూర్యుడు ఉదయించి ఒకటి లేక రెండు గజాల వరకు పైకి వచ్చినట్లయితే అప్పుడు నమాజు చదవవచ్చు.

2. సూర్యుడు నడి నెత్తిన ఉన్నప్పుడు, (ఇది జవాల్ సమయం) జవాల్ సమయం, వస్తువు నీడ ఓ వైపుకు ఒరగడానికి ముందు ప్రారంభం అయి ఆ నీడ ఓ వైపుకు ఒరిగిన తరువాత వరకు ఉంటుంది.

3. సాయంత్రం సూర్యుని రంగు పూర్తిగా అరుణంగా మారినప్పటినుండి అస్తమించేవరకు. అయితే ఆనాటి 'అస్ర్' నమాజు ఇంకా చేయకుండా ఉన్న వ్యక్తి మాత్రం ఆ వేళలో తన అస్ర్ నమాజును చదవాలి, అది మక్రూహ్ వేళ అయినా సరే.

4. జుమా ఖుత్బా (ప్రసంగం) ప్రారంభమయినప్పటి వేళ. అయితే ఆ సమయంలో ఖజా నమాజు ఏదయినా ఉంటే దాన్ని చేయవచ్చు.

## కేవలం నఫిల్ నమాజు మట్టుకే మక్రూహ్ అయ్యే వేళలు

1. ఉషోదయం తరువాత (అంటే సూర్యోదయం కంటే గంటన్నర ముందు) మొదలు సూర్యోదయం అయ్యేటంత మట్టుకు ఫజ్ర్ వేళ యొక్క సున్నత్, ఫర్జ్ నమాజు తప్ప ఇంకే నఫిల్ నమాజులు చదువ వీలులేదు. అయితే ఇషా నమాజు ఖజా అయివుంటే ఆ నమాజులోని ఫర్జ్, విత్రల ఖజాలను చదువవచ్చు.

2. అస్ర్ వేళకు చెందిన ఫర్జ్ నమాజు చేసిన తరువాత, సూర్యాస్తమయం అయి నంతమట్టుకు; ఫజ్ర్ ఫర్జ్ నమాజు చదివిన తరువాత సూర్యోదయం అయినంత మట్టుకు ఎలాంటి నఫిల్ నమాజుల్ని చేయకూడదు. అయితే ఫజ్ర్ సున్నత్ వేళ దాటిపోయి ఉండి సూర్యోదయం తరువాత దాన్ని చదవగలిగే వీలు చిక్కదు అని అనుకుంటే ఆ సున్నత్ నమాజును మాత్రం చదువవచ్చు.

3. సూర్యాస్తమయం తరువాత మగ్రిబ్ ఫర్జ్ నమాజు కంటే ముందు.

4. 'ఈదైన్' నమాజులు (ఈదుల్ ఫిత్ర్ మరియు ఈదుల్ అజ్హా) కంటే ముందు, ఇంటిలోను, ఈద్ గాహ్‌లోను ఇంకే ఇతరచోట్ల నఫిల్ నమాజ్ చదవడం మక్రూహ్. అయితే ఈ వేళల్లో ఫర్జ్, వాజిబ్ నమాజుల ఖజాలు, నమాజె జనాజా మొదలయినవి

చేయవచ్చు. ఇలానే సజ్దయే తిలావత్ (ఖుర్ఆన్ పారాయణంలో చేయవలసిన సజ్దా) కూడా చేయవచ్చు.

**ఖజా నమాజులు చేసే విధానం:** ఏదయినా అనివార్య కారణాల వల్ల నమాజు వేళ దాటి పోయినా, (ఖజా అయితే) లేక మరిచిపోయినా, లేక నిద్రించినప్పుడు దాటిపోయినా జ్ఞాపకం వచ్చిన వెంటనే, లేదా మేల్కొన్న వెంటనే ఖజా నమాజ్ చేయాలి. ఖజా నమాజుల్ని నెరవేర్చే విషయంలో కావాలని ఆలస్యం చేయడం పాపం. అయితే మక్రూహ్ వేళలో అది జ్ఞాపకం వచ్చినట్లయితే ఆ వేళ దాటిపోగానే దాన్ని నెరవేర్చాలి.

1. ఖజా నమాజుచేసే విధానం ఏమిటంటే ఉదా: ఒక జుహ్ర్ నమాజు వేళ దాటి పోయింది అనుకుంటే అలాంటి వ్యక్తి అస్ర్ నమాజుకు ముందు దాన్ని ఖజా చదవాలి. కాని అస్ర్ కూడా ఖజా అయింది అనుకుందాం. అలాంటప్పుడు మగ్రిబ్ నమాజు యొక్క ఫర్జ్ నమాజుకంటే ముందు ఖజా చదవకూడదు. మగ్రిబ్ వేళ ఫర్జ్ మరియు సున్నత్ చదివిన తరువాతే చదవాలి. ఇలానే ఇతర సమయాలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. కాని అది చదివే వేళ మక్రూహ్ వేళయి ఉండరాదు.

2. ఒకవేళ అనేక వేళల నమాజులు ఖజా అయినాయి అనుకుంటే వీలు చిక్కి నప్పుడల్లా (అది మక్రూహ్ సమయం కాకుంటే) వెంటనే నెరవేరుస్తూ ఉండాలి. జుహ్ర్ నమాజు ఖజా అయింది, మళ్ళీ జుహ్ర్ సమయమే రావాలి, అస్ర్ నమాజ్ ఖజా అయింది, తిరిగి అస్ర్ సమయమే రావాలి అని అనుకోకూడదు. సమయం దొరికిన వెంటనే చదవాలి. ఒక నమాజయినా, ఎన్ని నమాజులయినా సరే ఆలస్యం చేయడం పాపం.

3. ఎన్నో నమాజులు ఖజా అయినప్పుడు వాటిని ఒకే సమయంలో చదవడం కష్టం అవుతుంది. అనుకున్నప్పుడు ఆ వ్యక్తి ప్రతి నమాజు వేళప్పుడు తప్పిపోయిన నమాజుల ఖజా నెరవేర్చుకోవాలి.

4. ప్రాజ్ఞత వచ్చినప్పటి నుండి ఒక వ్యక్తి యొక్క అయిదు నమాజుల కంటే ఎక్కువ ఖజా కాలేదు, లేక ఖజా అయినా అతడు తన ఖజా నమాజులన్నింటిని ఇదివరకే నెరవేర్చి ఉన్నాడు అనుకున్నప్పుడు అలాంటి వ్యక్తిని షరీఅత్‌లో 'సాహెబె తర్తీబ్' అంటారు. అలాంటి వ్యక్తి ముందు తన ఖజా నమాజును పూర్తి చేసుకొని ఆ తరువాత ఇతర ఫర్జ్ నమాజును నెరవేర్చాలి. అయితే సాహెబె తర్తీబ్ కాని వ్యక్తి మాత్రం ఖజా నమాజులు నెరవేర్చిన తరువాతే ఇతర నమాజులు చేయాలన్న నియమం లేదు. అయితే అతడు కూడా ఖజా నెరవేర్చిన తరువాతే ఇతర ఫర్జ్ నమాజులు చేయడం ఉత్తమం. (అల్ బహ్రుర్రఖాయఖ్ సం.2, పు.86)

5. ఎవరైనా బేనమాజి (నమాజు చేయనివాడు) పశ్చాత్తాపపడి, ఇక నుండి నమాజులు సక్రమంగా చేస్తాను అని తౌబా చేస్తే ఇక అతడు అప్పటి నుండి నమాజును నియమం తప్పకుండా చేస్తూ ఉండాలి. అతడు ఇదివరకు ఎన్ని నమాజులు పోగొట్టు కున్నాడో ఉజ్జాయింపుగా అన్ని నమాజుల్ని ప్రతి నమాజు వేళలో ఒక్కొక్కటి లేదా రెండేసి నమాజుల చొప్పున ఖజా నెరవేర్చాలి. అలా చేయడం వాజిబ్. తౌబాతో పాపాలు పరిహరింపబడతాయి కాని అతడు వదిలేసిన నమాజులు మాత్రం మాఫీ కావు.

6. మొత్తం ఖజా నమాజులు నెరవేర్చకుండానే మరణ శయ్యపై చేరిన వ్యక్తి చనిపోయే ముందుగా మరణ శాసనం (వసియ్యత్) చేయాలి. ఆ వసియ్యత్‌లో తాను వదలివెళ్ళే ధనం నుండి మిగిలిపోయిన ఖజా నమాజులకై పరిహారం (ఫిదియా) చెల్లించ మని చెప్పాలి. ఒక పూట నమాజు ఫిదియా, ఒక 'రోజా' ఫిదియాకు సమానం.

## ఏ నమాజుల ఖజా చదవడం అవసరం

కేవలం ఫర్జ్, విత్ర్ నమాజుల ఖజాయే వాజిబ్. సున్నత్ నమాజుల ఖజా వాజిబ్ కాదు. కాని ఫజ్ర్‌కు సంబంధించిన సున్నత్ గురించి హదీసులో ఎంతో తాకీదు చేయబడింది. కాబట్టి ఏదయినా ఫజ్ర్ వేళ సున్నత్ నమాజు తప్పిపోతే దాని ఖజా మాత్రం మధ్యాహ్ననికి ముందే నెరవేర్చుకోవాలి. కాని రెండు మూడు రోజుల క్రితం తప్పిపోయి ఉంటే దాని ఖజా నెరవేర్చనవసరం లేదు.

**ముఖ్య సూచనలు :** ఎవరయినా నమాజు చదివిన తరువాత కొంత సేపటికిగాని లేదా రెండు రోజుల తరువాతగాని ఆ నమాజును తాను పరిశుద్ధత (తహారత్) లేకుండా చేశానని జ్ఞాపకం వస్తే లేక ఆ నమాజులో ఏదయినా ఫర్జ్ అంశం తప్పిపోయిందని గుర్తుకువస్తే అతడు వెంటనే ఆ నమాజు యొక్క ఖజా నెరవేర్చాలి. ఒకవేళ అతడు ఇమామ్ అయిఉంటే తన వెనుక నమాజ్ చేసిన ముక్తదీలందరికి ఆ విషయం తెలియజేయాలి. అంటే నా ఫలానా నమాజు చెడిపోయింది. మీరు ఆ నమాజును రిపీట్ చేసుకోండని చెప్పాలి. ఇమామ్ ఇంకొక ఊరికి వెళ్ళిన తరువాత అతనికి గుర్తుకు వస్తే ఉత్తరం ద్వారా జరిగిన లోపం ఏమిటో తప్పకుండా తెలియజేయాలి. ఇందులో ఎలాంటి సిగ్గుకు, నామోషీకి తావు ఇవ్వవద్దు. మక్రూహ్ సమయం కాకపోతే ఆ ఇమామ్ జమాఅత్‌తో దాని ఖజా నెరవేర్చాలి. ఏ నమాజుల్లోనయితే ఖుర్‌ఆన్ బిగ్గరగా చదవబడుతుందో ఆ ఖజా నమాజులు పగలు నెరవేర్చవలసి వచ్చినప్పుడు అందులో ఖుర్‌ఆన్‌ను బిగ్గరగా కాకుండా మెల్లగా చదవాలి. రాత్రి వేళల్లోనయితే చదివేవాని ఇష్టంపై ఆధారపడి ఉంటుంది.

## సహూ సజ్దా

సహూ అంటే మతిమరుపు నమాజు చదివేవాడు తన మతిమరుపుతో నమాజులోని ఏదయినా వాజిబ్ అంశం మరిచిపోతే అతనిపై షరీఅత్‌లో సజ్దా సహూ వాజిబ్ చేయబడింది. మనిషి ఏదయినా మంచి కార్యం చేపడితే షైతాన్ చూస్తూ ఊరుకోడు. ఎల్లప్పుడు అతణ్ణి మతిమరుపుకు లోనుచేస్తూ ఉంటాడు. నమాజుల్లోనయితే, దాసుడు తన దైవం మీద మనస్సును లగ్నం చేయకుండా ఉండేందుకు మతిమరుపుకు మరీ గురిచేస్తాడు. అందుకని హదీసులో, "ఎప్పుడయితే షైతాను మిమ్మల్ని నమాజులో మీ ధ్యాసను అల్లాహ్ నుండి తప్పించి ఏదయినా పొరపాటు చేయిస్తే నమాజు చివర్లో రెండు సజ్దాలు చేసుకోండి తద్వారా షైతాన్‌కు అవమానం కలుగుతుంది" అని ఉంది.

సజ్దా సహూ గురించి మరో హదీసులో ఇలా ఉంది:

"ఈ రెండు సజ్దాలు షైతాన్‌ను అభాసుపాలు చేస్తాయి." (ముస్లిమ్)

## సజ్దా సహూ ఎప్పుడు వాజిబ్ అవుతుంది?

నమాజులోని వాజిబ్‌లలో ఏ ఒక్క వాజిబ్‌గాని, అంతకంటే ఎక్కువ వాజిబ్‌లుగాని వదిలివేయబడితే అప్పుడు సజ్దా సహూ చేయడం తప్పనిసరి (అంటే వాజిబ్ అన్నమాట). సజ్దా సహూ చేయడం మరిచిపోతే తిరిగి నమాజు చేయాలి. కాబట్టి నమాజులో ఏ అంశాలయితే వాజిబో అవి నమాజీలందరికి గుర్తుండి ఉండాలి. లేకపోతే తన నమాజులో లోపం ఉండి తన నమాజునేగాక ఇతర ముక్తదీల నమాజు కూడా చెడగొట్టినవాడవుతాడు.

## సజ్దా సహూ చేసే విధానం

నమాజులోని చివరి ఖాయిదాలో తషహ్హుద్ చదివిన తరువాత మొదట కుడి వైపుకు అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్ అని తలత్రిప్పాలి. వెనువెంటనే రెండు సజ్దాలు చేయాలి. ఆ తరువాత తిరిగి తషహ్హుద్, దురూద్ మరియు దుఆ చదివి యధాప్రకారం రెండు వైపులా ముఖం త్రిప్పి సలాం చెప్పాలి. ఒక వాజిబ్ తప్పినా లేక అనేక వాజిబ్‌లు తప్పినా అన్నిటికి కలిపి ఒకేసారి సజ్దా సహూ చేయాలి. అనేక మార్లు కాదు.

## ముక్తదీ, మస్బూక్‌ల విషయంలో సజ్దా సహూ

1. ముక్తదీ నమాజులో ఏదయినా వాజబ్ తప్పిపోతే, ఇమామ్ వెనుక చేసే నమాజులో సజ్దా సహూచేయకూడదు. కాని ఇమామ్ చేసిన నమాజ్‌లోనే ఏదయినా

వాజిబ్ వదిలివేయబడితే అప్పుడు అతడు అందుకుగాను సజ్దా సహూచేస్తే అతని వెనుక ఉన్న ముక్తదీ కూడా ఇమామ్‌తోపాటు సజ్దా సహూ చేయాలి.

2. 'మస్బూక్' అంటే ఇమామ్ వెనుక ఒకటి లేక అంతకంటే ఎక్కువ రకాఅత్‌లు పోగొట్టుకున్నవాడు. అతని నమాజులో తాను జమాఅత్‌లో కలిసే లోపలే ఇమామ్ వల్ల నమాజులో ఏదయినా పొరపాటు జరిగి, అతడు సజ్దా సహూ చేస్తే ఈ మస్బూక్ కూడా ఇమాం వెంట సజ్దా సహూ చేయాల్సిందే. కాని తాను పూర్తి చేసుకునే రకాఅత్‌లతో తనవల్ల ఏదయినా పొరపాటు జరిగితే అతడు నమాజు చివరన సజ్దా సహూ చేయవలిసి ఉంటుంది.

## సజ్దా సహూ ఎప్పుడు వాజిబ్ అవుతుంది?

నమాజులోని ఏదయినా ఫర్జ్ వదలబడడంవల్ల నమాజే భంగం అవుతుంది. కాని ఆ నమాజులోని ఏదయినా వాజిబ్ వదిలివేయబడడంవల్ల సజ్దా సహూ వాజిబ్ అవుతుంది. నమాజయితే భంగపడదు. ఈ విషయం ఇదివరకే చెప్పబడింది. ఇప్పుడు సజ్దా సహూ ఏ సమయంలో చేయడం వాజిబో చెప్పబడుతోంది.

1. ఏదయినా వాజిబ్ వదిలివేయబడడం వలన ఉదా: ఫాతిహా సూరాలను పఠించడం మరిచినప్పుడు, తషహ్హుద్, దువాయె ఖునూత్ చదవడం మరిచినప్పుడు, రుకూ తరువాత నిటారుగా నిలబడడం మరిచి సజ్దా చేసినందుకు లేక సజ్దా నుండి లేచి సరిగా కూర్చొనక రెండో సజ్దా చేసినప్పుడు. పై సందర్భాలన్నింటిలోను సజ్దా సహూ చేయడం వాజిబ్.

2. ఏదయినా వాజిబ్‌ను నెరవేర్చేటప్పుడు ఆలస్యం జరిగితే, ఉదా: సనా తరువాత ఫాతిహా సూరా చదవడంలో లేక ఫాతిహా సూరా చదివిన తరువాత మరో సూరాను అందుకోవడంలో లేక తషహ్హుద్ చదివి దురూద్ చదవడంలో 'ఆలస్యం' జరిగితే సజ్దా సహూ  చేయడం వాజిబ్ అవుతుంది. అయితే కొంత ఆలస్యం జరిగితే సహూ సజ్దా వాజిబ్‌గాదు. కనీసం రుకూ మరియు సజ్దాలో చదివే సుబ్హాన రబ్బియల్ అజీం, సుబ్హాన రబ్బియల్ ఆలా అనే తస్బీహ్‌ను చదివినంతసేపు ఆగడం ఆలస్యం క్రిందికి వస్తుంది. ఆ ఆలస్యం మరిచిపోయి లేక ఏదో ఆలోచనలో ఏదో పరధ్యానంగా జరిగినా ఒకటే.

3. ఫర్జ్ అంశాలను నెరవేర్చడంలో ఆలస్యం జరిగినప్పుడు. ఉదా: సనా చదివిన తరువాత ఏదో ఆలోచిస్తూ ఖుర్ఆన్ ఆయత్‌లను చదవకపోవడం, ఫాతిహా సూరా మరో సూరా చదివి రుకూ చేయడంలో ఆలస్యం చేయడం. ఇలాంటి సందర్భాల్లో సజ్దా సహూ చేయాలి.

4. నమాజులో నెరవేర్చవలసిన ఫర్జ్ అంశాలను రెండుసార్లు నెరవేర్చడం, లేక వాటిని వెనుకా ముందు చేయడం, ఉదా: మూడు సజ్దాలు చేయడం లేక ఒకే రకాఅత్‌లో రెండు రుకూలు చేయడం లేక రుకూకంటే ముందు సజ్దాలోనికి వెళ్ళిపోవడం. ఇలాంటి సందర్భాల్లో సజ్దా సహూ వాజిబ్ అవుతుంది. కాని ఇక్కడ ఓ విషయం జ్ఞప్తి యందుంచుకోవాలి. అదేమిటంటే ఏదయినా ఫర్జ్ అంశాల్లో ఏదో ఒకటి అసలే నెరవేరకపోతే తిరిగి నమాజు చదవాలి. నమాజులోని ఫర్జ్‌లు ఏవో క్షుణ్ణంగా జ్ఞాపకముంచుకోవడం మంచిది.

5. ఏదయినా వాజిబ్ యొక్క రూపం మార్చడం ఉదాహరణకు:

(క) ఏ నమాజులోనయితే ఖుర్‌ఆన్‌ను బిగ్గరగా చదవవలసి ఉందో వాటిలో ఇమామ్ మెల్లిగా చదివినట్లయితే సజ్దా సహూ వాజిబ్ అవుతుంది. మరే నమాజుల్లో దివ్య ఖుర్‌ఆన్‌ను మెల్లిగా చదవాలో అందులో బిగ్గరగా చదివినా సజ్దా సహూ వాజిబ్ అవుతుంది. ఈ విషయంలో ఒక సందర్భంలో జ్ఞాపకం ఉంచుకోవాలి. అదేమిటంటే మొత్తం పారాయణం (ఖిరాత్) జరిగినా రెండు సందర్భాల్లోను సజ్దా సహూ చేయాల్సిందే.

(చ) మొదటి రెండు రకాఅత్‌లయి లేక ఒక రకాఅత్‌లో సూరా ముందు చదివి ఆ తరువాత పాతిహా సూరా చదివినా అప్పుడూ రూపం మారినట్లే. అందుకని సజ్దా సహూ చేయాలి.

(ట) ఇదే విధంగా ఫర్జులోని మొదటి రెండు రకాఅత్‌లలో లేక ఒక రకాఅత్‌లోను ఫాతిహా సూరా తరువాత మరో సూరాను చదవడం మరిచిపోయినా, అదే నాల్గు రకాఅత్‌ల నమాజయితే చివరి రెండు రకాఅత్‌లలో సూరాను కలుపుకొని చదవాలి. ఇలా చేయడంవల్ల నమాజు క్రమం తప్పుతుంది కనుక సజ్దా సహూ చేయాలి.

(త) ఒకవేళ సున్నత్ లేక నఫిల్ నమాజులో ఏ రకాఅత్‌లోనయినా మరో సూరాను కలపడం మరిచిపోతే కేవలం సజ్దా సహూ చేస్తే సరిపోతుంది.

## సజ్దా సహూ యొక్క సమస్యలు

పైన సజ్దా సహూ యొక్క సూత్రాలు చెప్పబడ్డాయి. ఇప్పుడు వాటికి సంబంధించిన కొన్ని వివరణలు ఇవ్వబడుతున్నాయి.

1. సున్నత్ మరియు నఫిల్‌లోని ప్రతి రకాఅత్‌లోను, ఫర్జ్ నమాజులోని మొదటి రెండు రకాఅత్‌లలోను సూరే ఫాతిహా తరువాత ఖుర్‌ఆన్ యొక్క కనీసం మూడు వాక్యాలయినా చదవాలి. ఒకవేళ వాటిలో ఈ మూడు ఆయత్‌లను చదవడం మరిచిపోతే సజ్దా సహూ చేయాలి.

2. ఫాతిహా సూరా మరో సూరా చదివిన తరువాత ఒక తస్బీహ్ చదివినంత సేపు ఏదో ఆలోచించుకుంటూ రుకూ చేయడం మరిచిపోయి ఆలస్యంచేస్తే సజ్దా సహూ చేయాలి. ఇదే విధంగా తషహ్హుద్, దురూద్ మరియు దుఆ చదివిన తరువాత కొంతసేపు ఎన్ని రకాఅత్‌లు చదివాను అని లెక్కవేస్తూ కూర్చొనో, మరేదో ఆలోచనలో పడిపోయో ఒక తస్బీహ్ చదివేటంత ఆలస్యం జరిగినా సజ్దా సహూ చేయడం వాజిబ్ అవుతుంది.

3. నమాజులో ఎవరయినా సజ్దా సహూ చేయవలసి ఉండి ఆ సజ్దా చేయడం మరిచిపోయి సలామ్ చేయడం అయిపోతే ఆ తరువాత అతడు ఎవరితోను మాట్లాడ కుండా ఉన్న పక్షంలో సజ్దా సహూ చేయాలి. ఆ తరువాత తిరిగి తషహ్హుద్, దురూద్ మరియు దుఆ చదివి మళ్ళీ సలామ్ త్రిప్పాలి.

సజ్దా సహూ చేయకపోతే మాత్రం ఆ నమాజును రిపీట్ చేయాల్సిందే.

4. అది నాల్గు రకాఅత్‌ల నమాజై మొదటి ఖాయిదాలోనో లేక రెండవ రకాఅత్ తరువాత తషహ్హుద్ చదవడం మరిచిపోయి పూర్తిగా నిలబడినా లేక నిలబడినట్లు అనబడినా ఆ తరువాత కూర్చోవలసి ఉందని జ్ఞాపకంవస్తే ఇక కూర్చోకూడదు. నమాజును పూర్తి చేసి చివరి రకాఅత్‌లో చివర సజ్దా సహూ చేయాలి. అయితే పూర్తిగా నిలబడకుండా కూర్చోడానికి దాపులోనే ఉన్నప్పుడు అతనికి జ్ఞాపకంవస్తే లేక ముక్తదీలు ఇమామ్‌కు లుక్మా (గుర్తింపు సంజ్ఞ) అందిస్తే ఇక కూర్చోవాలి. అలాంటప్పుడు సజ్దా సహూ అవసరం లేదు.

5. నాల్గు రకాఅత్‌ల నమాజులో, రెండో రకాఅత్‌నందు రెండుమార్లు తషహ్హుద్ చదివినా, తషహ్హుద్ తరువాత కొంత దురూద్ కూడా చదివి ఆ తరువాత అది రెండవ రకాఅత్ అని గుర్తుకువస్తే వెంటనే నిలబడి మిగిలిన రెండు రకాఅత్‌లను పూర్తిచేసుకోవాలి. చివరన సజ్దా సహూ చేయాలి. కాని అది నఫిల్ నమాజ్ అయి అందులోని రెండో రకాఅత్‌లో దురూద్ చదివితే సజ్దా సహూ వాజిబ్ కాదు అయితే తషహ్హుద్ రెండుసార్లు చదివితే మాత్రం సజ్దా సహూ చేయాలి.

6. ఒకవేళ అది రెండు లేక నాల్గు రకాఅత్‌ల నమాజు అయ్యి దాని చివరి రకాఅత్‌లో కూర్చోవడం మరిచి నిలబడితే సజ్దా కంటే ముందే పొరపాటు జరిగింది అని గుర్తుకువస్తే వెంటనే కూర్చోవాలి. సజ్దాసహూ చేసి నమాజును పూర్తిచేయాలి. కాని అది మూడు లేక అయిదో రకాఅత్ యొక్క సజ్దా చేస్తే అప్పుడు మరో రకాఅత్‌ను కలిపి ఆరు రకాఅత్‌లు చదవాలి. ఈ ఆరు రకాఅత్‌లు నఫిల్ అవుతాయి. ఆరో రకాఅత్‌లో సజ్దా సహూ చేయకుండా ఫర్జ్ నమాజును తిరిగి చదువుకోవాలి.

7. ఒకవేళ ఫర్జ్ నమాజులోని చివరి రకాత్‌లో తషహ్హుద్ చదివాక, రెండు రకాత్‌ల నమాజే అయింది అనుకొని నిలుచుని, ఆ తరువాత సజ్దా చేయకముందే తాను చదివేది అయిదో రకాత్ అని జ్ఞాపకం వస్తే వెంటనే కూర్చుండి సజ్దా సహూ చేసి నమాజును పూర్తి చేసుకోవాలి. ఒకవేళ అయిదో రకాత్ సజ్దా కూడా చేసేస్తే ఇక కూర్చోకుండా మరో రకాత్‌ను జోడించి ఆరు రకాత్‌లు పూర్తి చేసి చివరన సజ్దా సహూ చేసుకోవాలి. ఈ చివరి రెండు రకాత్‌లు నఫిల్ అయిపోతాయి. నాల్గు రకాత్‌లు మాత్రం ఫర్జ్ క్రిందనే ఉంటాయి. తిరిగి నమాజ్ చేయనవసరం లేదు. ఒకవేళ అయిదు రకాత్‌లు పూర్తిచేసి సజ్దా సహూచేసి సలామ్ త్రిప్పినా ఫర్జ్ నమాజు నెరవేరుతుంది. ఈ రెండు విధాలలోగల తేడా ఏమిటంటే, మొదటి విధంలో తషహ్హుద్ చదివినంతసేపు కూర్చోవడం మర్చిపోవడం. అలా కూర్చోవడం ఫర్జు కాబట్టి ఫర్జు నమాజు నెరవేరదు. మరోవిధం ప్రకారం తషహ్హుద్ అంతసేపు కూర్చోని లేవడం జరిగింది. కాబట్టి ఫర్జ్ నెరవేరింది. కేవలం ఓ ఫర్జ్ నెరవేర్చడంలో ఆలస్యం జరగడంవల్ల, ఓ వాజిబ్ నెరవేరలేదు కాబట్టి సజ్దా సహూ వాజిబ్ అయింది.

8. పై ఆదేశం ఫర్జు నమాజుకు సంబంధించింది. ఒకవేళ సున్నత్ లేక నఫిల్ నమాజులో మొదటి 'కాయిదా' మర్చిపోయి మూడో రకాత్‌లో సజ్దాకు ముందే జ్ఞాపకం వచ్చినప్పుడు వెంటనే కూర్చుని తషహ్హుద్ వగైరాలు చదివి సజ్దా సహూ చేయాలి.

9. నమాజులోని రకాత్‌ల సంఖ్యలో ఒకటి, రెండు లేక మూడు లేక నాలుగు ఎన్ని చదివాడో అర్థంకాక తికమక అయినట్లయితే, అప్పుడు తాను చదివిన రకాత్‌లు ఖచ్చితంగా ఇన్నే చదివి ఉంటానని గట్టి నమ్మకం కలిగినప్పుడు అన్నిటికంటే తక్కువ రకాత్‌లనే ఆధారంగా చేసుకోవాలి. ఉదా: మూడు లేక నాగ్గు రకాత్‌లలో అనుమానం వచ్చి ఎటు వైపు తేల్చుకోలేని సందిగ్ధం ఏర్పడినప్పుడు వాటిని మూడు రకాత్‌లగానే అనుకోవాలి. ఇలాంటి పరిస్థితిలో మూడో రకాత్‌లో కూర్చుని తషహ్హుద్ చదవాలి. ఎందుకంటే అది నాల్గో రకాత్ అయి ఉండవచ్చు. నాల్గో రకాత్‌లో తషహ్హుద్ చదివినంతసేపు కూర్చోవడం ఫర్జు. చివరన సజ్దా సహూ చేయడానికి గల కారణం ఏమిటంటే అది మూడో రకాత్ అయి ఉండవచ్చు. మూడో రకాత్‌లో కూర్చుని అతడు అదనమయిన పని చేశాడు కాబట్టి అందులోను సజ్దా సహూ చేయవలసిందే.

10. ఒకవేళ నమాజు పూర్తిచేసిన తరువాత మూడు చదివానో లేక నాలుగు రకాత్‌లను చదివానో అనే అనుమానంవస్తే ఆ అనుమానానికి ఆధారం లేదు. అయితే నమ్మకంగా తాను చదివిన రకాత్‌ల సంఖ్యలో ఒకటి వదిలానని జ్ఞాపకంవస్తే మాత్రం,

తాను అప్పటిదాక ఎవరితోను మాట్లాడకుండా ఉండి వుజూ కూడా ఉంటే వెంటనే లేచి నిలబడి ఆ ఒక్క రకాత్‌ను పూర్తి చేసుకొని చివరన సజ్దా సహూ చేసుకోవాలి కాని మాట్లాడినా, వుజూ లేకపోయినా అప్పుడు ఆ నమాజును తిరిగి చేయాల్సిందే.

11. ఒక్క నమాజులోనే ఎన్నో తప్పులు దొర్లినా ఒక్క సజ్దా సహూ మాత్రమే చేయాలి.

12. మూడు లేక నాల్గు రకాత్‌ల నమాజులో రెండు రకాత్‌ల తరవాతే మరచి సలామ్ త్రిప్పినట్లయితే, తాను ఎవరితోనూ మాట్లాడని పక్షంలో వెంటనే నిలబడి తక్కిన నమాజును పూర్తిచేయాలి. చివర్లో సజ్దా సహూ చేయడం ముఖ్యం. మాట్లాడినట్లయితే ఆ నమాజు తిరగి చేయవలసిందే.

13. విత్ర్ నమాజులో దుఆయే ఖునూత్‌కు బదులు నమాజులోని మరే దుఆనైనా తషహ్హుద్ చదివినా సజ్దా సహూ చేయనవసరం లేదు. కాని ఖుర్‌ఆన్‌లోని ఏదయినా సూరానుగాని లేక మూడు ఆయత్‌లనుగాని చదివితే మాత్రం సజ్దా సహూ చేయాలి. ఎందు కంటే విత్ర్‌లో చేతులు ఎత్తి కట్టుకున్న తరువాత ఖుర్‌ఆన్ తప్ప ఇతర దుఆలు మాత్రమే చదవడం ముఖ్యం. కాని ఎవరయినా దుఆయే ఖునూత్ కంఠస్థం చేయలేక దానికి బదులు ఖుర్‌ఆన్‌లోని ఏదయినా దుఆ చదివితే సజ్దా సహూ అవసరం లేదు.

14. ఫాతిహా సూరా తరువాత ఒకే రకాత్‌లో రెండు మూడు సూరాలు చదివినా సజ్దా సహూ చేయనవసరం లేదు. సరికదా నఫిల్ నమాజుల్లో అలా చేయడం ఉత్తమం.

15. ఫర్జ్ నమాజుల్లోని చివరి రెండు రకాత్‌లలో సూరే ఫాతిహా తప్ప ఇంకే సూరాగాని లేక ఆయత్‌గాని చదివేస్తే సజ్దా సహూ చేయనవసరం లేదు.

16. నమాజ్ ఆరంభంలో సనా చదవడం జ్ఞాపకం లేకపోయినా లేక రుకూ మరియు సజ్దాల్లో తస్బీహ్ చదవడం మరచిపోయినా లేక ఖాయిదాలో దరూద్, దుఆలు చదవడం మరిచిపోయినా అన్ని సందర్భాల్లోను సజ్దా సహూ చేయనవసరం లేదు.

17. ఫర్జ్ నమాజు యొక్క చివరి రకాత్‌లలో ఇమామ్‌గాని లేక ఒంటరి నమాజీ గాని ఫాతిహా సూరాను చదవడం మరిచిపోతే సజ్దా సహూ వాజిబ్ కాదు. కారణం, ఫర్జ్ చివరి రకాత్‌లలో ఫాతిహా సూరా చదవడం వాజిబ్‌కాదు కాని అదే సున్నత్, నఫిల్ నమాజుల్లో అలా మరచిపోతే మాత్రం సజ్దా సహూ చేయవలసిందే.

18. వేటివల్లనయితే సజ్దా సహూ వాజిబ్ అవుతుందో వాటిని కావాలని వదిలేస్తే ఆ వ్యక్తి పాపాత్ముడవుతాడు. అలాంటి వ్యక్తి ఆ తరువాత సజ్దా సహూ చేసినా అతని నమాజు నెరవేరదు. అతడు తిరిగి ఆ నమాజు చదవాల్సిందే.

19. నమాజులోని సున్నత్, ముస్తహీబ్ అంశాలను వదిలేస్తే సహూ వాజిబ్ కాదు అన్న విషయంపైన చెప్పబడింది. దీన్ని జ్ఞప్తియందుంచు కోవాలి.

## సజ్దయె తిలావత్ (పారాయణ సజ్దా)

తిలావత్ అంటే పఠించడం, పారాయణం చేయడం. దివ్య ఖుర్‌ఆన్‌లోని ఏదయినా సజ్దా ఆయత్ చదివినా లేక చదవగా విన్నా ఒక సజ్దా చేయడం వాజిబ్. దీన్నే సజ్దాయే తిలావత్ అంటారు.

## తిలావత్ సజ్దా ఆదేశం

తిలావత్ (పారాయణం) సజ్దా ఆయత్‌ను చదివినా లేక విన్నా, రెండు విధాలా సజ్దా తిలావత్ వాజిబ్ అవుతుంది. కావాలని ఎవరయినా సజ్దా చేయకుండా ఉంటే అది పాపం. అయితే ఏ వ్యక్తి అయినా నమాజు స్థితిలో ఉన్నప్పుడు నమాజు చేయని వ్యక్తి ఎవరయినా ఆ సజ్దా ఆయత్‌ను పఠిస్తే నమాజు చేస్తూ దాన్ని విన్న నమాజీపై నమాజు చేసే స్థితిలో సజ్దా చేయడం వాజిబ్‌కాదు. కాని అతడు తన నమాజునంతా పూర్తిచేసుకున్న తరువాత సజ్దయె తిలావత్ చేయాలి.

## సజ్దాల సంఖ్య

దివ్యఖుర్‌ఆన్‌లో మొత్తం పదునాల్గు స్థానాలున్నాయి. వాటిని చదివినా లేక విన్నా సజ్దయె తిలావత్ వాజిబ్ అవుతుంది. వాటి వివరణ ఇలా ఉంది:

తొమ్మిదో పారాలోని అరాఫ్ సూరా చివరన, పదమూడో పారాలోని సూరయె రఅద్ యొక్క రెండో రుకూలో, పదునాల్గో పారాలోని నహ్‌ల్ సూరా యొక్క ఆరో రుకూ చివరన, పదిహేనో పారాలోని బనీ ఇస్రాయీల్ సూరా చిరన, పదహారో పారాలో మరియమ్ సూరా యొక్క నాల్గొ రుకూలో, పదిహేడో పారాలోని సూరాయే హజ్‌లోని రెండో రుకూలో ఒక సజ్దా, చివరి రుకూలో మరో సజ్దా ఉంది. అయితే ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) దృష్టిలో ఇది వాజిబ్ కాదు. కాని దాన్ని చేసినా ఫరవాలేదు.

పందొమ్మిదో పారాలో రెండు సజ్దాలు ఉన్నాయి. ఒకటి ఫుర్‌ఖాన్ సూరా యొక్క అయిదో రుకూలోని చివర్లో, రెండోది నమల్ సూరా యొక్క రెండో రుకూలో.

ఇరవై ఒకటో పారాలో సజ్దా సూరా యొక్క రెండో రుకూలో, ఇరవై మూడో పారాలో సాద్ సూరా యొక్క రెండో రుకూలో.

ఇరవై నాల్గో పారాలో హామీమ్ సజ్దా సూరా యొక్క అయిదో రుకూలో.

ఇరవై ఏడో పారాలోని నజ్మ్ సూరా చివరన.

ఆ తరువాత ముప్ఫయ్యో పారాలో రెండు సజ్దాలు ఉన్నాయి. ఒకటి అన్ షిఖాఖ్ సూరాలో, రెండోది అలఖ్ సూరాలో.

## సజ్దయే తిలావత్ చేసే విధానం

1. ఒకవేళ నమాజులో ఏదయినా సజ్దా ఆయత్ చదివితే వెంటనే అల్లాహు అక్బర్ అంటూ సజ్దా చేసి మూడు సార్లు సుబ్హాన రబ్బియల్ ఆలా చదివి నిలబడి ఎక్కడనుండైతే ఖిరాఅత్ వదిలావో అక్కడి నుండి తిరిగి ప్రారంభించాలి. సజ్దా చేయని వ్యక్తి పాపాత్ముడవుతాడు. ఇమామ్‌తోపాటు ఆయన వెంట ఉండే నమాజీలు కూడా ఆ సజ్దా చేయాలి.

2. నమాజులో కాకుండా ఏదయినా సజ్దా పారాయణంచేస్తే వెంటనే నిలబడి అల్లాహు అక్బర్ అంటూ సజ్దా చేయడం ఉత్తమం. సజ్దా చేసిన తరువాత ఆ తరువాతి ఆయత్‌లు చదవాలి. కాని మొత్తం పారాయణం ముగించుకొని సజ్దా చేసినా సరిపోతుంది. వదిలేయడం మాత్రం పాతకం. కూర్చుని అలాగే సజ్దా తిలావత్ చేయొచ్చు. ఒకవేళ పూర్తి ఖుర్ఆన్ పారాయణం ముగించి అన్ని సజ్దాలు ఒకేసారి చేసినా చెయ్యొచ్చు. కాని తరావీహ్ లేక ఫర్జ్ నమాజుల్లో ఇలా చేయడం తగదు.

## సజ్దయే తిలావత్ నిబంధన

నమాజు చేయడానికి ఏ నిబంధనలైతే ఉన్నాయో తిలావత్ సజ్దా చేయడానికి కూడా ఆ నిబంధనలే ఉన్నాయి. నమాజును భంగపరిచే అంశాలు సజ్దా తిలావత్‌ను కూడా భంగపరుస్తాయి.

1. సజ్దా యొక్క ఒకే ఆయత్‌ను ఒకే చోట కూర్చుని లేక నిలబడి లేక పచార్లు చేస్తూ ఎన్నిమార్లు చదివినా (హాఫిజే ఖుర్ఆన్ కంఠస్థం చేయడానికి చదివిన విధంగా) ఒకే సజ్దా చేయడం వాజిబ్. కాని సమయం లేక స్థానం మారితే ఎన్నిసార్లు చదివినా అన్నిసార్లు సజ్దా చేయవలసిందే.

2. ఇదే విధంగా ఒకేచోట కూర్చుని సజ్దా యొక్క అనేక ఆయత్‌లను పఠించినా, ఎన్ని ఆయత్‌లయితే పఠించబడ్డాయో అన్ని సజ్దాలూ చేయవలసిందే.

3. కొంతమంది అజ్ఞానులు ఖుర్‌ఆన్ పైన్నే సజ్దా చేస్తూ ఉంటారు. దీనివల్ల సజ్దా నెరవేరదు. సజ్దా నమాజులో చేసినట్లే చేయవలసి ఉంటుంది.

4. ఎవరయినా పురుషుడు గుసుల్ చేయవలసిన స్థితిలో (అపరిశుద్ధతగా) ఉంటే లేక ఏ స్త్రీ అయినా హైజ్ (రుతుస్రావం)లో లేక నిఫాస్ (ప్రసూతి స్రావం) స్థితిలో ఉంటే వారు సజ్దయె తిలావత్ ఆయత్ విన్నప్పుడు సజ్దా చేయడం వాజిబ్ కాదు.

## ఖుర్‌ఆన్ అధ్యయనం

జీవితంలో మనం ఎన్నో రకాల గ్రంథాల్ని అధ్యయనం చేస్తుంటాం. ఒక్కొక్కప్పుడు మన జీవితాలన్నంతటిని అలాంటి గ్రంథాల అధ్యయనానికే కేటాయిస్తూ ఉంటాం. అయితే దైవగ్రంథం అయిన దివ్య ఖుర్‌ఆన్‌ను చదవడం, దాన్ని కంఠస్థం చేయడం, అర్థం చేసుకుని ఇతరులకు అర్థం అయ్యే రీతిలో బోధించడం లాంటి ఏ అవకాశానికి నోచుకోని ముస్లిమ్ చాలా దురదృష్టవంతుడనే చెప్పాలి.

అదే కాదు, ఆ వ్యక్తి మనస్సులో ఖుర్‌ఆన్‌పట్ల ఉండవలసిన గౌరవభావం లేకపోతే అతను బుద్ధిజ్ఞానాల్లో ఎంతటి గొప్పవాడయినా, భౌతికంగా ఎంత ఐశ్వర్యవంతుడు అయినా అవి అతని పాలిటి గొప్ప వైఫల్యాలే కాగలవు. అయితే దివ్య ఖుర్‌ఆన్‌ను పారాయణం చేసే, చదివే, అర్థం చేసుకొని ఇతరులకు బోధించే అవకాశమేగనక దేవుడు ఎవరికైనా కలిగిస్తే అది అతనికి ఓ వరం లాంటిదే. అదే గొప్ప విజయం కాగలదు-అలాంటి వ్యక్తికి ఈ ప్రపంచంలో భౌతికపరమైన ఎలాంటి వనరులు లభించకపోయినా సరే. ఈ విషయమై అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా సెలవిచ్చారు:

خَيْرُكُمْ مَنْ تَعَلَّمَ الْقُرْآنَ وَعَلَّمَهُ۔

**"మీలో ఖుర్‌ఆన్‌ను నేర్చుకుని ఇతరులకు నేర్పించేవాడే అందరి కంటే మేలయిన ముస్లిమ్."**

**(మిష్కాత్)**

ఈ హదీసులో మేలయిన ముస్లిమ్ కావడానికి దివ్య ఖుర్‌ఆన్‌ను చదవడం, చదివించడం చెప్పబడింది. ఎవరికైనా దాన్ని చదవడం (పారాయణం చేయడం), చదివించడం, కంఠస్థం చేయడంలాంటి సదవకాశం లభిస్తే అంతకంటే అదృష్టం మరొకటి ఉండదు. అదేవిధంగా ఆ అవకాశాన్ని వదులుకున్న వ్యక్తి చాలా దురదృష్ట వంతుడు. దివ్య గ్రంథాన్ని చదవ నేర్చుకోవడం, నేర్పించడం నాల్గు విధాలు.

ఎవరయినా మన మదర్సాల్లోలా దివ్యగ్రంథాన్ని చూచి చదవడం నేర్చుకున్నా, లేక దాన్ని కంఠస్థం చేసే ప్రయత్నం చేసినా, వారంతా ఈ అదృష్టానికి నోచుకున్నవారే. ఇది మొదటి విధం.

రెండో విధం ఏమిటంటే దివ్యఖుర్‌ఆన్ పదాలను చదువుతూ వాటి అర్థాన్ని అరబిక్ లేక ఇతర భాషల్లో తెలుసుకునే ప్రయత్నం చేయడం. ఈవిధానం సామాన్యంగా అరబి దర్స్‌గాహ్ (పాఠశాల) విద్యార్థులు అవలంబిస్తూ ఉంటారు.

మూడవ విధానం, దివ్యఖుర్‌ఆన్ పదాలను పిల్లలకు చదివించడం, చదవడం. ఈ విధానం మక్తబ్ (అధ్యయనశాల), హిఫ్జ్ తరగతుల్లో (కంఠస్థం చేసే తరగతులు)ని అధ్యాపకులు చేబడుతూ ఉంటారు.

ఇక నాల్గో విధానం ఏమంటే దివ్య గ్రంథం యొక్క అర్థం, దాని వ్యాఖ్యానాల్ని బోధించేవారు చేసేది. ఈ విధానం మన అరబిక్ పాఠశాలల్లోని అధ్యాపకులు అవలం బించేది.

ఈ నాల్గు విధానాలూ, మహాప్రవక్త (సఅసం) చెప్పిన పై హదీసుకు సంబంధిం చినవే.

సాధారణంగా మన సమాజంలో, దివ్య ఖుర్‌ఆన్‌ను చదవడం, నేర్పడం చేసేవారికి సరిఅయిన స్థానం ఇవ్వబడడం లేదు, సరికదా వారిని పనికిమాలిన వ్యక్తులుగా భావిం చడం జరుగుతోంది. ముఖ్యంగా మన పాఠశాలల్లో పిల్లలకు ఖుర్‌ఆన్ చదవడం నేర్పేవారిని సమాజంలో అతి తక్కువ స్థాయివారిగా గుర్తిస్తున్నారు. ఇలా చేయడం వలన మనం మహాప్రవక్త (సఅసం) వారి సూక్తులను కించపర్చడమేగాక దివ్య ఖుర్‌ఆన్ ఔన్నత్యాన్ని కూడా తగ్గించే ప్రయత్నం చేస్తున్నామన్న మాట. మన పండిత, పామర జనం దివ్య ఖుర్‌ఆన్‌ను చదవడం, చదివించడంలాంటి విషయంలో చేస్తున్న ఆలసత్వం అంతా ఇంతా కాదు. అయితే ఎవరికయితే దాని చదవడం, చదివించడం చేత అవుతుందో వారు కూడా ఈ మహత్కార్యానికి అంకితం అయ్యే బదులు, మొదట చెప్పినవారిలాగే దీన్ని కించపరచ డానికి వెనకాడడం లేదు.

మన సమాజంలో మన ధార్మిక పాఠశాలల్లో దివ్య ఖుర్‌ఆన్ అధ్యయనంకోసం, దాని ఔన్నత్యానికి తగ్గట్లు ప్రాథమిక స్థాయిని కూడా కల్పించలేకపోతున్నాం. దివ్య ఖుర్‌ఆన్ చదవనేర్చుకోవడం కోసం రోజుకు ఓ గంట సమయం కేటాయించడమే మనకు పెద్ద కష్టమయిపోతుంది. అది కూడా ఏడేళ్ళ వయస్సులో ఒకటి లేక రెండు సంవత్సరాలపాటు మాత్రమే. ఇదే ఇతర సబ్జెక్టులకయితే అనేక ఏళ్ళ తరబడి, గంటలకొద్ది బోధించబడతాయి.

కాబట్టే ఈ దర్స్‌గాహ్‌ల నుండి బయటకు వచ్చిన విద్యార్థులు ఇతర సబ్జెక్టులపైన్నే ఉత్సాహం చూపిస్తూ ఉంటారు. వెయ్యికి ఒక్క విద్యార్థి కూడా దివ్యఖుర్‌ఆన్ ఎడల ఆసక్తిని కనబర్చలేక పోతున్నాడు. చివరికి క్రొత్తగా ఉత్తీర్ణుడయిన విద్యార్థి దగ్గర సయితం తన సొంత ఖుర్‌ఆన్ కాపీ ఉండదు. ఉన్నా దాని మీద అతను స్వంతంగా రాసిన నోట్ ఉండదు.

ప్రస్తుతం దారుల్ హదీస్ (హదీసు సంస్థ), దారుల్ ఇఫ్తా (ధార్మిక తీర్పుల సంస్థ) నెలకొల్పే ప్రయత్నాలు ఎంతవరకు జరుగుతున్నాయో, దారుల్ ఖుర్‌ఆన్ (ఖుర్‌ఆన్ సంస్థ)నుగాని, దారుల్ తఫ్సీర్ (ఖుర్‌ఆన్ వ్యాఖ్యాన సంస్థ)నుగాని నెలకొల్పే ప్రయత్నాలు అంతగా జరగడంలేదు. దివ్యఖుర్‌ఆన్ కోసం, మన ధార్మిక పాఠశాలలు హిఫ్జ్ (కంఠస్థం)తోనే సరిపెట్టుకుంటున్నాయి. లేక 'జలాలీన్' రివిజన్‌ను లేక ఖుర్‌ఆన్‌లోని కొన్ని ప్రత్యేక సూరాలను ఎంచుకొని నేర్పించడం జరుగుతోంది. కాని ఖుర్‌ఆన్‌నే ప్రాతిపదికగా చేసుకొని అన్ని శాస్త్రాలు దాని వెలుగులోనే నేర్పించడం, దాని ప్రభావమే అన్ని సబ్జెక్టులపై ఉండేటట్లు చేయడం జరగడంలేదు.

ఇక్కడ మేము కొన్ని దివ్యఖుర్‌ఆన్ ఆయత్‌లను, మహాప్రవక్త (సఅసం) హదీసులను, ప్రవక్త అనుచరుల సుభాషితాలను, ఇంకా కొందరు ధార్మిక గురువుల సూక్తులను ఉటంకిస్తున్నాం. తద్వారా మన సమాజం, ధార్మిక పాఠశాలల్లో దివ్య ఖుర్‌ఆన్ ఎంత అన్యాయానికి గురిఅవుతుందో తెలుసుకోగలం.

ఇక్కడ సూరయె జుమర్, సూరయె అన్ఫాల్ నుండి రెండు ఆయత్‌లను రాస్తున్నాం. వీటి వెలుగులో మన ప్రవర్తనను మనమే గమనించవచ్చు.

"నిజమయిన మోమిన్‌లు (విశ్వాసులు) ఎవరంటే, అల్లాహ్ జిక్ర్ (ప్రస్తావన) వచ్చినప్పుడు వారి హృదయాలు కంపిస్తాయి. అల్లాహ్ అవతరింపజేసిన ఆయత్‌లను వారి ముందు పఠించే వారి విశ్వాసానికి బలం చేకూరుతుంది." (అన్ఫాల్)

إِنَّمَا الْمُؤْمِنُونَ الَّذِينَ إِذَا
ذُكِرَ اللَّهُ وَجِلَتْ قُلُوبُهُمْ
وَإِذَا تُلِيَتْ عَلَيْهِمْ آيَاتُهُ
زَادَتْهُمْ إِيمَانًا۔ (انفال)
اَللّٰهُ نَزَّلَ أَحْسَنَ الْحَدِيثِ
كِتَابًا مُتَشَابِهًا مَثَانِيَ تَقْشَعِرُّ

"అల్లాహ్ ఎంతో మేలయిన వాక్యాలను అవతరింపజేశాడు. అంటే, ఏదయితే గ్రంథంలో ఉన్నదో, దేని విషయాలయితే పరస్పరం ఒక్కటిగా ఉన్నవో, ఏదయితే పదే పదే వల్లిం చదుతుందో, దేని పఠనంవలన,

مِنۡهُ جُلُوۡدُ الَّذِيۡنَ يَخۡشَوۡنَ رَبَّهُمۡ ثُمَّ تَلِيۡنُ جُلُوۡدُهُمۡ وَقُلُوۡبُهُمۡ اِلٰى ذِكۡرِ اللّٰهِ‌ؕ

అల్లాహ్‌కు భయపడేవారి శరీరాలు కంపిస్తాయో, ఆ తరువాత దాని ప్రభావం వలన వారి శరీరాలు, హృదయాలు మెత్తబడి అల్లాహ్ స్తోత్రంలో లీనమయి పోతారు." (జుమర్)

ఈ వాక్యాలలో విశ్వాసికి ఉండాల్సిన రెండు గుర్తులు చెప్పబడ్డాయి. ఒకటి అల్లాహ్ భీతి వల్ల హృదయమే కాదు శరీరం కూడా కంపిస్తుంది. అదీకాక దాని ప్రభావం అతని పూర్తి వ్యక్తిత్వంపై పడుతుంది. రెండు, ఖుర్‌ఆన్ చదివినా లేక విన్నా విశ్వాసం మరింత దృఢమవుతుంది. ఒకవేళ ఖుర్‌ఆన్ చదివిన తరువాత ఈ సూచనలు కనిపించకపోతే ఇది ఓ దుశ్శకునంగా భావించాలి. సూరయె తౌబాలో ఇలా ఉంది:

فَاَمَّا الَّذِيۡنَ اٰمَنُوۡا فَزَادَتۡهُمۡ اِيۡمَانًا وَّهُمۡ يَسۡتَبۡشِرُوۡنَ ۝ وَاَمَّا الَّذِيۡنَ فِىۡ قُلُوۡبِهِمۡ مَّرَضٌ فَزَادَتۡهُمۡ رِجۡسًا اِلٰى رِجۡسِهِمۡ‌ؕ (توبہ)

"ఎవరయితే విశ్వసించారో వారి విశ్వాసాన్నయితే (అవతరించిన ప్రతి సూరా) నిజంగానే వృద్ధిపరిచింది. పైగా వారందుకు సంతోషపడుతున్నారు. అయితే ఎవరి హృదయాలకయితే (కాపట్య) రోగం అంటుకుందో, వారి పూర్వపు మాలిన్యాన్ని (ప్రతి కొత్త సూరా) మరింత పెంచింది."

ప్రవక్త పదవి అలంకరించక పూర్వం మహాప్రవక్త (సఅసం) హజ్రత్ ఖదీజా ధనంతో ఏ వ్యాపారం అయితే మొదలెట్టారో దానివలన అల్లాహ్ ఆయనకు ఎంతో ఐశ్వర్యం ప్రాప్తం చేశాడు. కాని దైవ దౌత్యం తరువాత ప్రవక్త పదవి బాధ్యతాభారం, ఆయనకు వ్యాపారంపై మనస్సును లగ్నంచేసే అవకాశం ఇవ్వలేదు. అందువల్ల వ్యాపారం దెబ్బతిన్నది. ఇదే పరిస్థితి సహాబా (అనుచరులు)కు కూడా ఎదురయింది. హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్ (రజిఅన్), హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్), హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజిఅన్) లాంటివారు గొప్ప గొప్ప వ్యాపారులు. కాని వీరంతా ఇస్లామ్ స్వీకరించిన తరువాత వారి వ్యాపారం అంతగా సాగలేకపోయింది. దీనికితోడు మరోవైపు మహాప్రవక్త (సఅసం)కు,

ఆయన అనుచరులకు సత్యతిరస్కారులు అనేక విధాలుగా బాధలు కూడా పెట్టి వారికి మనశ్శాంతి లేకుండా చేయడానికి ప్రయత్నించేవారు.

ఈ పరిస్థితిలో మనోస్థిమితానికి ఖుర్‌ఆన్‌లోని ఈ క్రింది ఆయత్ అవతరించింది.

وَلَقَدْ آتَيْنَاكَ سَبْعًا مِّنَ الْمَثَانِي
وَالْقُرْآنَ الْعَظِيمَ ۝ لَا
تَمُدَّنَّ عَيْنَيْكَ إِلَىٰ مَا
مَتَّعْنَا بِهِ أَزْوَاجًا مِّنْهُمْ
وَلَا تَحْزَنْ عَلَيْهِمْ - (حجر)

"మేము మీకు ఏడు ఆయత్‌ల సూరాను, ఖుర్‌ఆన్‌ను ఇచ్చాము. కాబట్టి మీరు అవిశ్వాసుల్లోని వివిధ తెగలకు మేము ఇచ్చిన సిరిసంపదల వైపు కన్నెత్తయినా చూడకండి. మీరు దాని గురించి బాధ కూడా పడకండి." (హిజ్ర్)

ఖుర్‌ఆన్ లాంటి గొప్ప వరం ముందు యావత్తు ప్రపంచ ఐశ్వర్యం కూడా గడ్డిపోచ లాంటిదే. కాబట్టి మీరు ఇలాంటి గొప్ప వరం పొందిన తరువాత అశాశ్వతమైన ఈ ప్రపంచ సిరిసంపద వైపు కన్నెత్తి కూడా చూడనవసరంలేదని ఈ ఆయత్‌లో బోధించ బడింది. ఈ సంబోధన మహాప్రవక్త (సఅసం)వైపే ఉన్నా ముస్లిమ్‌లందర్నీ ఉద్దేశించి చేసినదే. అలాగాకుండా ఈ ఆయత్ కేవలం దైవ ప్రవక్తను మాత్రమే ఉద్దేశించినదయితే ఆయన దృష్టిలో ఈ ప్రపంచ విలువ గడ్డిపోచ కంటే కూడా తక్కువే. ఒక హదీసులో మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు:

"ఎవరయితే ఖుర్‌ఆన్ చదివిన తరువాత ఇంతకంటే మేలయిన వస్తువు ఇంకెవ్వరి కయినా ఇవ్వబడిందని భావిస్తాడో, అతడు అల్లాహ్ ఈ (ఖుర్‌ఆన్ పఠన భాగ్యాన్ని) గొప్ప వరాన్ని చులకన చేసిన వాడవుతాడు." (అహ్యాఉల్ ఉలూమ్)

ఈ భావాన్నే హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్ (రజిఅన్) ఈ విధంగా చెప్పారు.

"ఎవరికయితే ఖుర్‌ఆన్ లాంటి గొప్పవరం లభించిందో అతడు, ఫలానావాడికి ఇలాంటి వరాలకంటే మిన్నయిన వరాలు ఇవ్వబడ్డాయని అనుకుంటే, అతడు ఈ గొప్ప వరాన్ని తక్కువగా అంచనావేసి అల్పమయిన వస్తువును మిన్నగా తలిచాడన్న మాట."

పైన చెప్పిన హదీసు, అబూబక్ర్ (రజిఅన్)గారి సూక్తి ఈ రెండూ దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ క్రింది ఆయత్‌కు వివరణ అని చెప్పవచ్చు.

يٰۤاَيُّهَا النَّاسُ قَدْ جَآءَتْكُمْ مَّوْعِظَةٌ مِّنْ رَّبِّكُمْ وَشِفَآءٌ لِّمَا فِى الصُّدُوْرِ ۙ وَهُدًى وَّرَحْمَةٌ لِّلْمُؤْمِنِيْنَ قُلْ بِفَضْلِ اللّٰهِ وَبِرَحْمَتِهٖ فَبِذٰلِكَ فَلْيَفْرَحُوْا هُوَ خَيْرٌ مِّمَّا يَجْمَعُوْنَ ○

(يونس)

“మానవులారా! మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి హితోపదేశం వచ్చేసింది. ఇది మనస్సుల్లోని వ్యాధులకు నివారణ, దీన్ని ఎవరయితే స్వీకరిస్తారో వారి కొరకు మార్గదర్శకం మరియు కారుణ్యం. ఓ ప్రవక్తా! అనండి, అల్లాహ్ తన అనుగ్రహం వల్ల, దయవల్ల దీన్ని పంపాడు. దీనికి ప్రజలు సంతోషంతో పొంగిపోవాలి. ప్రజలు కూడబెట్టే వాటన్నింటి కంటే ఇది ఉత్తమమయినది.” **(యూనుస్: 57,58)**

ఇక్కడ దివ్య ఖుర్ఆన్ నాల్గు విశేషాలు చెప్పబడ్డాయి. ఒకటి, ఇది సంపూర్ణమయిన ప్రబోధం అని, అంటే ఏ వస్తువులయితే మనిషికి ఇహపరాల్లో ప్రయోజనకరమయినవో వాటిని అది సూచిస్తోంది. ఇంకా ఏవయితే అతనికోసం నష్టదాయకాలో వాటిని గురించి హెచ్చరిక చేస్తుంది.

రెండోది, “షిఫావుల్లిమాఫిస్సుదూర్” అనేది. అంటే హృదయాల్లో ఉన్న రోగాలకు విరుగుడు అని అర్థం. ఎలాగయితే శరీరం రోగగ్రస్తమవుతుందో హృదయం కూడా రోగానికి గురి అవుతుంది. శరీర సంబంధమయిన రోగాలవల్ల మనిషి కొంత కాలం లేక కొన్ని రోజులపాటు బాధపడతాడు. కాని హృదయం (మనస్సు) రోగగ్రస్తమయితే అతని పరలోక జీవితం చెడిపోవడమే కాక ఈ ప్రపంచంలోనూ అతను అశాంతికి లోనవుతాడు.

హృదయానికి కలిగే పెద్ద రోగాలు, ‘కుఫ్ర్’ (దైవ తిరస్కారం), ‘షిర్క్’ (బహు దైవారాధన), ‘నిఫాక్’ (కపటం). ఈ రోగాలే కాకుండా ఇంకొన్ని రుగ్మతులు కూడా సోకుతాయి దీనికి. పైన చెప్పిన పెద్ద రోగాలు హృదయం నుండి దూరం అయినా ఈ చిన్న రోగాలు మనిషి యొక్క ఇహపరాల్ని సర్వనాశనం చేసేస్తాయి. ఆ చిన్న రోగాలు ఇవి: ‘హసద్’ (ఈర్ష్య) ‘కిబ్ర్ వ గురూర్’ (అహంభావం, గర్వం) ప్రాపంచిక పేరాశ, అధికార వ్యామోహం మొదలయినవి. కుఫ్ర్, నిఫాక్, షిర్క్‌లతోపాటు ఇవి కూడా ఉంటే మనిషి గొప్ప

సంకటంలో పడినట్లే. హృదయానికి సోకే ఈ రోగాలు ఎలాంటివంటే అవి హృదయంలో చోటుచేసుకోగానే, దైవం ఎంత కరుణించినా ఎంత ప్రసాదించినా సంతోషించడు మనిషి. అతనిలో కృతజ్ఞతాభావం జనించదు సరికదా ఇంకా కావాలన్న కోరికే బలపడుతూ పోతుంది. ఇలాంటి పేరాశనే దివ్య ఖుర్ఆన్ 'తకాసుర్'గా పేర్కొంది. అతని పేరాశ అతణ్ణి ఓ చోట నిలువనీయదు. ఈ పరిస్థితిలోనే అతని జీవితం అంతమవుతుంది.

దివ్య ఖుర్ఆన్ యొక్క మూడవ నాల్గవ విశేషాలు సన్మార్గం మరియు కారుణ్యం. అంటే ఈ గ్రంథం ఇహలోకంలో మానవులకు సన్మార్గం చూపుతుంది. ఎవరయితే ఈ ప్రపంచంలో దీని బోధనల్నీ చిత్తశుద్ధితో పాటిస్తారో వారిపై ఈ ప్రపంచంలో దేవుని కారుణ్యం కురుస్తుంది. ఇక పరలోక విషయానికొస్తే అక్కడ వారు అల్లాహ్ ప్రసాదించే అనంతమయిన కారుణ్యాన్ని ఎలాగూ పొందేవారే.

## దివ్యఖుర్ఆన్ పారాయణం మరియు హిఫ్జ్

పైన చెప్పినట్లుగా ఈ భూమి మీద అల్లాహ్ మనిషికి ఒసగిన అనేక వరాల్లో దివ్య ఖుర్ఆన్ కూడా ఒకటి. ఇది ఓ గొప్ప వరమే కాకుండా ఓ గొప్ప అమానతు (Trust) కూడా. ఈ అమానతును మోయడానికి దేవుడు భూమ్యాకాశాలు, పర్వతాలకు బదులు మోమిన్ (విశ్వాసి) హృదయాన్ని ఎన్నుకున్నాడు.

إِنَّا عَرَضْنَا الْأَمَانَةَ عَلَى السَّمٰوٰتِ وَالْأَرْضِ وَالْجِبَالِ فَأَبَيْنَ أَنْ يَحْمِلْنَهَا وَأَشْفَقْنَ مِنْهَا وَحَمَلَهَا الْإِنْسَانُ إِنَّهُ كَانَ ظَلُومًا جَهُولًا ۝

(احزاب)

**"మేము ఈ అమానతును (ఖుర్ఆన్‌ను) ఆకాశాలపై, భూమిపై, పర్వతాలపై అవతరింపజేసినప్పుడు అవి దీని బాధ్యతా భారాన్ని మోయడానికి సిద్ధం కాలేదు. దానికి భయపడ్డాయి. కాని మనిషి దీని భారాన్ని ఎత్తుకున్నాడు. నిశ్చయంగా అతను చాలా అన్యాయపరుడు, మూర్ఖుడు. (అంటే తీసుకున్న బాధ్యతను జ్ఞాన సంబంధమయిన కార్యంగా భావించి నిర్వహించడానికి బదులు మూర్ఖంగా దాన్ని నిరాకరిస్తున్నాడు)."**
**(అహ్‌జాబ్ - 72)**

ఒకవేళ ఈ భారాన్ని హిమాలయ పర్వత శిఖరాలపై అవతరింపజేసినా దాని బరువు బాధ్యతలతో ఆ పర్వతం గుండెపగిలి ముక్కలు ముక్కలుగా అయ్యేది.

"ఈ ఖుర్‌ఆన్‌ను మేము ఏదయినా పర్వతంపై అవతరింపజేస్తే, అది దైవ భయంతో అణగారిపోయి తునాతునక లుగా పగిలిపోయేదే." (హష్ర్ సూరా)

لَوْ اَنْزَلْنَا هٰذَا الْقُرْاٰنَ عَلٰى جَبَلٍ لَّرَاَيْتَهٗ خَاشِعًا مُّتَصَدِّعًا مِّنْ خَشْيَةِ اللّٰهِ

కాబట్టి దైవ వరం అయిన ఈ దివ్య ఖుర్‌ఆన్‌ను ఎల్లప్పుడు హృదయానికి దగ్గరగా ఉండేటట్లు చేసుకోవాలి. దీన్ని ప్రతిరోజూ పఠించాలి. దీన్ని వీలయినంత ఎక్కువగా కంఠస్థం చేసే ప్రయత్నం కూడా చేయాలి. దీని పారాయణం, కంఠస్థానికి సంబంధించిన మాధుర్యం, కేవలం దీన్ని అర్థం చేసుకొని చదవడంలోనే ఉంది. అయితే రుజుమార్గం పొందే ఉద్దేశం, ఆత్మ వికాసం, నైతిక పురోభివృద్ధి పొందాలన్న సంకల్పం ఉంటే దీన్ని అర్థం చేసుకోకుండా పారాయణం చేసినా సరిపోతుంది. తద్వారా దైవం ఎడల మనిషి సంబంధం సుదృఢం కావడం, ధర్మం ఎడల అతనిలో ప్రేమ జనించడం తప్పక జరుగు తుంది. దీని ద్వారా రుజుమార్గమూ పొందవచ్చు, పుణ్యమూ లభిస్తుంది. ఇంకా దైవ మార్గంలో స్థిరంగా నిలబడే భాగ్యమూ కలుగుతుంది.

## దివ్యగ్రంథం పట్ల ఉపేక్ష

దివ్య ఖుర్‌ఆన్ ఎంత సులభంగా కంఠస్థం అవుతుందో అంత సులభంగా మరే గ్రంథం కంఠస్థం కాదు. ఇది సృష్టికర్త అయిన అల్లాహ్ వాక్కుగనక, దాని పారాయణంలో ఏ మాత్రం ఉపేక్ష కలిగినా, ఏ మాత్రం తప్పులు దొరిలినా దివ్య గ్రంథం గౌరవోన్నతులకు భంగం కలుగుతుంది. దీని ఎడల ఉపేక్షాభావంవల్ల, ఇది ఎంత సులభంగా కంఠస్థ మయిందో అంత సులభంగానే దీన్ని మరచిపోవడం కూడా జరుగుతుంది. కాబట్టే మహాప్రవక్త (సఅసం) తరుచుగా సహబీ (రజిఅన్)ల దృష్టిని ఈ విషయం వైపుకు మళ్ళించేవారు. ఎన్నోమార్లు వివిధ రీతుల్లో ఈ విషయాన్ని విశదం చేసేవారు.

"దివ్య ఖుర్‌ఆన్‌ను నియమం తప్పకుండా పారాయణం చేస్తూ ఉండండి. దీన్ని గురించి పూర్తిగా శ్రద్ధ తీసుకోండి. దీని ఎడల

تعاهدوا القرآن هو الذی

ఉపేక్షా భావం వహిస్తే కట్టివేసిన ఒంటెను విప్పగానే ఎంత వేగంగా పారిపోతుందో అంత వేగంగా అది మీ అంతరంగాల నుండి పారిపోతుంది" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(బుఖారి, ముస్లిమ్)

نفسی بیدہ لھو اشد تفصیا
من الابل فی عقلھا۔
(بخاری ومسلم)

మహాప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు:

"ఏ వ్యక్తి హృదయంలోనయితే దివ్య ఖుర్‌ఆన్‌కు చెందిన ఒక భాగం అయినా దాచబడి ఉండదో ఆ హృదయం పాడు బడ్డ ఇల్లు లాంటిది." (తిర్మిజి)

ان الذی لیس فی جوفہ شیئ
من القرآن کالبیت الخرب
(ترمذی)

మరో హదీసులో ఆయన ఇలా ప్రవచించారు:

"ఖుర్‌ఆన్ జ్ఞానం కలిగిఉన్న ఓ ప్రజలారా! దీన్ని అగౌరవ పర్చకండి. దీని ఎడల ఉపేక్షా భావం కలిగి ఉండకండి. దీని పారాయణం చేసే హక్కు ఏదయితే ఉందో దాని ప్రకారం రేయింబగలు పారాయణం చేస్తూ ఉండండి. దీని పదాలను, అర్థాలను, దీని ఆజ్ఞలను వ్యాప్తి చేయండి. దీన్ని శ్రావ్యమైన కంఠస్వరంతో చదవండి. దీనిలో చెప్పబడిన విషయాల గురించి నిశితంగా ఆలోచించండి, ప్రపంచంలో దీని ప్రతిఫలం కోరకండి. పరలోకంలో దీని

(قال رسول اللہ صلی اللہ
علیہ وسلم یا اھل القرآن
لا تتوسدوا القرآن واتلوہ
حق تلاوتہ من آناء اللیل
والنھار وافشوہ وتغنوہ وتدبروا
ما فیہ لعلکم تفلحون۔
ولا تعجلوا ثوابہ فان لہ ثوابا
(مشکوۃ بحوالہ بیھقی)

ప్రతిఫలం అనంతం (అని తెలుసుకోండి)." (మిష్కాత్)

## గ్రంథ పారాయణం పట్ల ప్రతిస్పందన

దివ్య ఖుర్ఆన్ పారాయణం (తిలావత్) జరిగేటప్పుడు మహాప్రవక్త (సఅసం), ఆయన అనుచర సమాజం ఎలా ప్రతిస్పందించేవారో ఈ క్రింది నాల్గు సంఘటనల ద్వారా అర్థం చేసుకోవచ్చు.

అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ ఇలా ఉల్లేఖిస్తున్నారు:

ఓసారి మహాప్రవక్త (సఅసం) మెంబరుపై కూర్చుని ఖుర్ఆన్ వినిపించమని ఆయనను కోరారు. ఆయన, "దైవప్రవక్తా (సఅసం)! దివ్య ఖుర్ఆన్ మీపై అవతరిస్తోంది, నేనా తమకు ఖుర్ఆన్ వినిపించేది!" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించారు. అయితే మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "ఇతరుల నోట ఖుర్ఆన్ వినడాన్ని ఇష్టపడతాను నేను." ఆయన సూరె నిసా పారాయణం మొదలెట్టారు.

"మేము ప్రతి సమాజం నుండి ఓ సాక్షిని తెచ్చి, వీరిపై నిన్ను (ముహమ్మద్ (సఅసం)ను) సాక్షిగా నిలబెట్టినప్పుదు వీరు ఏం చేస్తారో ఆలోచించండి" అనే ఆయత్ పఠించినప్పుడు, మహాప్రవక్త 'ఇక చాలు' అని అన్నారు.

فَكَيْفَ إِذَا جِئْنَا مِن كُلِّ أُمَّةٍ بِشَهِيدٍ وَجِئْنَا بِكَ عَلَىٰ هَٰؤُلَاءِ شَهِيدًا ٥ (مشكوٰة)

నేను ఆయన ముఖార విందంపై దృష్టి సారించినప్పుడు ఆయన కళ్ళు కన్నీటితో నిండిపోయాయి."

فالتفت اليه فاذا عيناه تذرفان ـ (مشكوٰة)

హజ్రత్ అబూజర్ గప్ఫారి (రజిఅన్) ఇలా చెబుతున్నారు: ఓసారి మహాప్రవక్త (సఅసం) నమాజు ప్రారంభించారు. కేవలం ఒకే ఒక ఆయత్‌ను మాటిమాటికి పఠించడం మొదలెట్టారు. అలా పఠిస్తూనే తెల్లవారిపోయింది. ఆ ఆయత్ ఇది:

"ఇన్‌తు అజ్జిబ్‌హుమ్ ఫ ఇన్నహుం ఇబాదుక్. వ ఇన్ తగ్ఫిర్‌లహుమ్ ఫ ఇన్నక అంతల్ అజీజుల్ హకీం."

(మాయిదా)

إِن تُعَذِّبْهُمْ فَإِنَّهُمْ عِبَادُكَ وَإِن تَغْفِرْ لَهُمْ فَإِنَّكَ أَنتَ الْعَزِيزُ الْحَكِيمُ (مائده)

అర్థం: "ఓ అల్లాహ్! నీవు వారిని శిక్షించినట్లయితే వారు నీ దాసులే. నీవు క్షమిస్తే నీవే శక్తిమంతుడవు, వివేకవంతుడవూను."

సహాబా (రజిఅన్) దివ్య ఖుర్ఆన్ పారాయణాన్ని ఎంతో కట్టుదిట్టంగా, నియమంగా, వినయ విధేయతలు ఉట్టిపడుతూ చేసేవారు. ఓ రోజు సహాబా (రజిఅన్) (అనుచరులు) కూర్చుని తిలావత్ (పారాయణం) చేస్తూ ఉన్నారు. మహాప్రవక్త (సఅసం) ఆ దృశ్యాన్ని చూసి, "అల్లాహ్‌కు కృతజ్ఞతలు. దైవ గ్రంథం ఒక్కటే. మీలో (పారాయణం చేసేవారిలో) నల్లవారు, తెల్లవారు, అన్ని రకాల ప్రజలున్నారు." (అబూదావూద్)

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బినుల్ ఆస్‌కు పారాయణం అంటే మహా ఇష్టం. మహాప్రవక్త (సఅసం) ఆయన ఈ అభిరుచిని చూసి నెలకోసారి ఖుర్ఆన్‌ను పూర్తిచేయి అన్నారు. దానికి హజ్రత్ ఇబ్నుల్ ఆస్, "నాకు ఇంతకంటే ఎక్కువే శక్తి ఉంది దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నారు. "అయితే పదిహేను రోజులకోసారి పూర్తిచేయి" అన్నారు. ఆయన తిరిగి విన్నవించుకుంటే పది రోజుల్లో పూర్తి చేయమని అనుమతి ఇచ్చారు ఆయనకు. ఇంకా వేడుకుంటే వారానికి ఓసారి పూర్తిచేయి అంటూ అంతకంటే తక్కువ రోజుల్లో పూర్తిచేసే అనుమతి ఇవ్వలేదు. (అంటే ఒక్క రోజులో ఒక ఖుర్ఆన్‌ను పూర్తి చేయడం సున్నత్‌కు వ్యతిరేకం అన్నమాట).

ఎంత కష్టకాలంలోనయినా సహాబీల (రజిఅన్ పారాయణంలో ఎలాంటి మార్పు రాకుండా ఉండేది). ఖుర్ఆన్ పారాయణం పట్ల వారి ఉత్సాహం అలాంటిది మరి. హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) హత్య గావించబడుతున్నప్పుడు, అంటే ఆయన అమరగతి నొందేటప్పుడు కూడా ఖుర్ఆన్ పారాయణంలో నిమగ్నులయి ఉన్నారు. కాబట్టి ఆయన రక్తపు చుక్కలు ఈ ఆయత్‌పై పడ్డాయి.

فَسَيَكْفِيكَهُمُ اللَّهُ وَهُوَ السَّمِيعُ الْعَلِيمُ ٥

**"ఫ సయక్ఫీ కహుముల్లాహు వహువస్సమీ ఉల్ అలీం."**

అర్థం: వారికి అల్లాహ్ చాలు. ఆయన వినేవాడు, ఎరిగినవాడూను.

హజ్రత్ అబ్దుర్రహ్మాన్ సాయిబ్ (రజిఅన్) ఇలా చెబుతున్నారు: ఓ రోజు నా దగ్గరకు హజ్రత్ సఅద్ బిన్ లిఖాస్ (రజిఅన్) వచ్చారు. మీరు ఖుర్ఆన్ బాగా చదువుతారని విన్నాను అంటూ, నేను మహాప్రవక్త (సఅసం) చెప్పగా విన్నాను-ఖుర్ఆన్ దుఃఖం కోసం అవతరించింది. కాబట్టి దాని పారాయణం చేసేటప్పుడు ఏడ్వండి, ఏడ్పు రాకుంటే కనీసం విచార వదనంతోనయినా చదవండి. దాన్ని మధురమయిన కంఠస్వరంతో చదవండి." (ఇబ్నెమాజా)

హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ దివ్య గ్రంథం పారాయణం చేసేటప్పుడు ఎవ్వరితోను మాట్లాడేవారు కాదు. (బుఖారి)

ఖుర్ఆన్‌ను కంఠస్థం చేసే ఆసక్తి, ఉత్సాహం సహాబీ (రజిఅన్)లకు అధికంగా ఉండేది. బైరెమఊనాలో ఏ సహాబీలయితే అమరగతినొందారో వారిలో డెబ్బయి మంది హుఫ్ఫాజ్ (ఖుర్ఆన్‌ను కంఠస్థం చేసినవారు) ఉన్నారు. ఇదే విధంగా హ్రజత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజిఅన్)గారి ఖిలాఫత్ కాలంలో యమామా యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలోను డెబ్బయి మంది హుఫ్ఫాజ్ అమరగతులయినారు. ఈ సంఘటన తరువాత హ్రజత్ ఉమర్ (రజిఅన్)కు ఖుర్ఆన్‌ను సంకలనం చేసే ఊహ తట్టింది. ఆయన హ్రజత్ అబూబక్ర్ (రజిఅన్)ను దాని కోసం ఒప్పించారు. ఆయన హ్రజత్ జైద్ బిన్ సాబిత్ (రజిఅన్)ను ఈ పనికి నియమించారు. అప్పుడు ఖుర్ఆన్ ఓ చోట చేర్చి లిఖించబడింది.

## ఖుర్ఆన్ పారాయణ మర్యాదలు

దివ్య ఖుర్ఆన్‌ను, నమాజులోనయినా, నమాజు బయటనయినా పారాయణం చేసేటప్పుడు కొన్ని మర్యాదల్ని పాటించాల్సి ఉంటుంది. వాటిలో కొన్ని ఇక్కడ రాయబడుతున్నాయి.

1. ఖుర్ఆన్ పారాయణం చేసేటప్పుడు వుజూచేసి పూర్తి భయభక్తులతో మనస్సును దానియందు లగ్నంచేసి చదవాలి. ఇది గౌరవప్రదమయిన గ్రంథం. మహోన్నతుడు, సృష్టికర్త అయిన అల్లాహ్‌చే అవతరించబడిందనే తలంపుతో చదవాలి. పారాయణ ధ్యేయం కేవలం అల్లాహ్ ప్రసన్నతే తప్ప ఈ ప్రాపంచిక అవసరాల గురించి కాకుండా ఉండాలి. దివ్యఖుర్ఆన్ ఔన్నత్యాన్ని గురించి ఖుర్ఆన్‌లోను, మహాప్రవక్త (సఅసం)గారి హదీసుల్లోనూ తెలుపబడినట్లు పైన చెప్పుకున్నాం. 2. దివ్య ఖుర్ఆన్ గౌరవోన్నతులకు తగినట్లు దాన్ని ఆగిఆగి చదవాలి. దాని అర్థంపై దృష్టి ఉండాలి. ఖుర్ఆన్‌ను అర్థంచేసుకొని చదవమని ఖుర్ఆన్‌లో చెప్పబడింది. హదీసుల్లోను ఈ విషయం నొక్కి చెప్పబడింది. ప్రజలు ఖుర్ఆన్‌ని అర్థం చేసుకుని దానికి అనుగుణంగా నడుచుకోవాలనేదే ఖుర్ఆన్ అవతరణ ధ్యేయం. 3. దివ్య గ్రంథాన్ని ఉన్నత స్థానంలో ఉంచి మధురమయిన కంఠస్వరంతో చదవాలి. అందులోని ప్రతి పదాన్ని దానికున్న ఉచ్చారణ రీతిలోనే చదవాలి. ప్రతి వాక్యం చివర ఎక్కడయితే ఆగాలో అక్కడ ఆగిపోవాలి. మహాప్రవక్త (సఅసం) ఈ విషయాలన్నిటిని అవలంబించమని ఆజ్ఞ ఇచ్చారు. ఖుర్ఆన్‌లోను దీన్ని 'తర్తీల్' ఆగుతూ చదవమని చెప్పబడింది. 4. ఖుర్ఆన్‌కు సంబంధించిన ఏ ఆయత్‌నైనా కంఠస్థం చేసి మరిచిపోయే

వ్యక్తి అతి చెడ్డవాడని చెప్పారు మహాప్రవక్త (సఅసం). ఒక వాక్యానికే ఇంతయితే పూర్తి ఖుర్‌ఆన్ కంఠస్థం చేసి మరిచిపోతే ఎంత పాపమో అర్థం చేసుకోవచ్చు. 5. ఖుర్‌ఆన్ పారాయణం చేయడంలో ఎంతవరకైతే ఆసక్తి, ఉత్సాహం ఉంటాయో అంతవరకే చదవాలి. ఉత్సాహం నశించిన వెంటనే ఆపెయ్యాలి. అన్య మనస్కంగా చదవకూడదు. అయితే ఎవరికైతే ఖుర్‌ఆన్ చదవడానికి అసలే మనసొప్పదో ఆ వ్యక్తి మాత్రం మనసున్నా లేకపోయినా చదవాల్సిందే. విద్యార్థులకు చదువునందు మనసున్నా లేకపోయినా చదవడం తప్పదు కదా! 6. రోజుకు ఎప్పుడో ఒకప్పుడు ఖుర్‌ఆన్‌ను కొద్దిగానైనా చదవాలి. అన్నిటికంటే మేలైన సమయం ఫజ్ర్ నమాజు అయిన తరువాత సమయం. 7. ఖుర్‌ఆన్‌ను చూసి చదవడం, చూడకుండా చదవడంకంటే మిన్న. కొందరు నమాజు అయినాక వివిధ రకాల 'వజీఫాలు' గంటా అరగంట దాక చదువుతుంటారు. కాని ఖుర్‌ఆన్ తిలావత్‌లో నాల్గైదు నిమిషాలైనా వెచ్చించరు. ఇలా చేయడం సరైనదికాదు. దైవగ్రంథ పారాయణం కంటే మేలైన 'జిక్ర్' లేక 'వజీఫా' ఏదైనా ఉంటుందా దీన్ని వదిలేసి ఇతర వ్యాపకాలు అలవర్చుకోవడానికి? ఇంకో ప్రమాదకరమైన విషయం ఏమిటంటే కొందరు ముర్షిద్‌లు తమ మురీదులకు ఖుర్‌ఆన్ పారాయణం చేయవద్దు అని బోధిస్తారు. వారి ప్రకారం వారు చెప్పే వజీఫాలతో హృదయ మాలిన్యం పోయింతర్వాతనే ఖుర్‌ఆన్‌ను చదవాలి. అయితే ఖుర్‌ఆన్‌కంటే మేలైనది ఇంకే జిక్ర్ లేదా వజీఫా మనస్సును మలినాలనుండి శుభ్రపరుస్తుంది? వీరు ఇచ్చే ఆజ్ఞలనుండి అల్లాహ్ మనలను కాపాడుగాక. మహాప్రవక్త (సఅసం) ఓ హదీసులో ఇలా అన్నారు:

**"నమాజులోచేసే ఖుర్‌ఆన్ పారాయణం నమాజు బయట చేసే పారాయణం కంటే గొప్పది. ఇదే విధంగా నమాజు బయటచేసే పారాయణం తస్బీహ్, తక్బీర్‌ల కంటే మేలైనది."(మిష్కాత్)**

قرأة القرآن فی الصلوة افضل
من قرأة القرآن فی غير الصلوة
وقرأة القرآن فی غير الصلوة
افضل من التسبيح والتكبير
(مشكوٰة)

## ఖుర్‌ఆన్ ప్రత్యేకత

దివ్యఖుర్‌ఆన్‌కున్న అనేక ప్రత్యేకతల్లో కొన్ని ఇలా ఉన్నాయి:

ప్రపంచంలో దివ్య ఖుర్‌ఆన్ ప్రతులు ఎంత అధిక సంఖ్యలోనైతే ప్రచురించబడుతున్నాయో, చదువబడుతున్నాయో ప్రపంచంలో ఇంకే ఇతర గ్రంథం ఇంత అధిక

సంఖ్యలో ప్రచురించబడడంగాని చదవబడడంగాని జరగడం లేదు. ఒక్క దివ్యఖుర్‌ఆన్ అర్థంకాకపోయినా చదువబడి కంఠస్థం చేయబడుతోంది. ప్రపంచంలో ఉన్న ఖుర్‌ఆన్ హాఫీజుల్లో (గ్రంథం కంఠస్థం చేసినవారు) వేయోవంతు కూడా ఇతర గ్రంథాల హాఫీజ్‌లు ఉండరు. ఇంతేకాదు, దీన్ని ఎన్నిమార్లు చదివినా వైమనస్యం దరికి కూడా రాదు. ఖుర్‌ఆన్‌కున్న ఈ ప్రత్యేకతకు ఏ గ్రంథం సరితూగదు. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "దీన్ని మాటిమాటికి చదివినా ఇది పాతబడదు" ఇదేవిధంగా దీన్ని ఎవరైతే అర్థం చేసుకుంటారో, అధ్యయనం చేస్తారో వారికి కొంగ్రొత్త రహస్యాలు వెల్లడౌతూ ఉంటాయి. హృదయంలో కొంగ్రొత్త యదార్థాలు అవగతమవుతూ ఉంటాయి."

ఓ హదీసులో ఇలా ఉంది:

"దీన్ని చదవడం వలన పండితులు విసిగి పోరు. దీని అర్థ సంబంధమైన వింతలు విచిత్రాలు ఎప్పుడూ అంతంకావు."

ولا يشبع منه العلما ولا تنقضى عجائبه ---

## ప్రయాణీకుని నమాజు

ఎవరైనా తన స్వస్థలం నుండి కనీసం నలభై ఎనిమిది మైళ్ళ దూరం ప్రయాణం చేసే సంకల్పం చేసినట్లయితే ఆ వ్యక్తి షరీఅత్ పరిభాషలో 'ముసాఫిర్' (ప్రయాణీకుడు లేక బాటసారి) అనబడతాడు. అంతకంటే తక్కువ దూరం ప్రయాణం చేస్తే అది ప్రయాణం క్రిందికి రాదు. అలాంటివాడు "ముఖీం" (స్థిరనివాసి) క్రిందికే వస్తాడు.

నలభై ఎనిమిది మైళ్ళ ప్రయాణం కోసం సంకల్పం చేసి తన ఇంటినుండి బయలు దేరిన వ్యక్తి వెంటనే 'ముసాఫిర్' అయిపోతాడు. రైలుస్టేషను లేక బస్ స్టేషను తన ఊళ్లోనే ఉంటే అది నివాస స్థలం క్రిందే లెక్క. స్టేషను ఊరిబయట ఉంటే మాత్రం అతను ముసాఫిర్ కోవకే చెందుతాడు.

## వేగంగా వెళ్ళే వాహనాల ద్వారా ప్రయాణం

ఎవరైనా విమానం, రైలు, కారు లేక ఓడ ద్వారా ప్రయాణం చేస్తూ, నలభై ఎనిమిది మైళ్ళ కంటే ఎక్కువ దూరం వెళ్ళవలసి ఉన్నాసరే అతడు ముసాఫిర్‌గానే పరిగణించ బడతాడు. అతడు కొన్ని గంటల్లో గమ్యం చేరినా సరే. అంతదూరం కాకుంటే అది సఫర్ లేక ప్రయాణం అనబడదు. (ఫతావా ఆలంగీర్)

**ఖస్ర్ నమాజు:** ముసాఫిర్ (ప్రయాణికుని) కోసం అల్లాహ్, ఆయన ప్రవక్త, కొన్ని రాయితీలు ఇచ్చారు. ఏ వేళలోనైతే నాల్గు రకాత్‌ల ఫర్జ్ నమాజు చదువబడుతుందో ఉదాహరణకు జొహ్ర్, అస్ర్, ఇషా వీటిలో రెండేసి రకాఅత్‌లు మాత్రమే ముసాఫిర్ చదవ వలసి ఉంటుంది. సున్నత్ నమాజు చదవడంలో ఎలాంటి ఆంక్షలు లేవు. వీలుంటే చదవవచ్చు లేకుంటే వదిలివేయనూవచ్చు. అయితే విత్ర్ నమాజు, ఫజ్ర్ నమాజుల సున్నత్‌లు మాత్రం తప్పక చదవాలి. హదీసులో వాటి గురించి తాకీదు చేయబడింది. కాబట్టి వాటిని చదవడం మంచిది. షరీఅత్ పరిభాషలో ముసాఫిర్ చేసే నమాజును 'ఖస్ర్' అంటారు. ఈ ఆజ్ఞ హిజ్రీ శకం నాల్గవ సంవత్సరంలో అవతరించింది.

## కొన్ని అత్యవసర ఆదేశాలు

1. సఫర్ అంటే ప్రయాణంలో ఫజ్ర్ మగ్రిబ్ నమాజులు ఇంటిదగ్గర ఉన్నప్పుడు చేసినట్లుగానే పూర్తిగా చేయాలి. ఇదేవిధంగా నఫిల్ సున్నత్ నమాజులు చేయవలసి ఉంటే పూర్తి రకాత్‌లను చదవాలి. వాటిలో 'ఖస్ర్' లేదు. 2. ముసాఫిర్ ఎవరైనా, ముఖీమ్ (స్థిరనివాసి) అయిన ఇమాం వెనుక నమాజు చేయువలసివస్తే అతడు పూర్తి నమాజు చేయవలసి ఉంటుంది. 3. ఒకవేళ ఇమామత్ చేసే వ్యక్తి ముసాఫిర్ అయిఉండి ముక్తదీలు స్థిర నివాసులు అయిఉంటే, ఇమామ్ సలాము త్రిప్పిన తరువాత తాను ముసాఫిర్‌నని, మీరంతా మీ మిగిలిన నమాజును పూర్తి చేసుకొండని చెప్పాలి. 4. ఇమామ్ ముసాఫిర్ అయి, ముక్తదీల్లో కొందరు ముసాఫిర్లు మరికొందరు ముకీమ్‌లై ఉంటే, ముకీములైన ముక్తదీలు తమ నమాజు పూర్తి చేసుకోవాలి. ముసాఫిర్లు మాత్రం ఇమామ్‌తో పాటు సలాము త్రిప్పివేయాలి. 5. ఒకవేళ ముసాఫిర్ పొరపాటున నాల్గు రకాత్‌లు చదివితే, అతడు రెండు రకాత్‌ల తరువాత ఖాయిదా (తషహ్హుద్ చదవడం) చేస్తే అతడు తిరిగి నమాజు చేయనవసరం లేదు. కేవలం సజ్దా సహూ చేస్తే అది పూర్తి అవుతుంది. అటులనే అతడు రెండు రకాత్‌ల తరువాత కాయిదా చేయడం కూడా మరిస్తే మాత్రం చివరన సజ్దా సహూ చేయాలి. అతను చేసిన ఈ నాల్గు రకాత్‌లు నఫిల్ క్రిందికి వస్తాయి. తిరిగి ఆ (ఫర్జ్) నమాజును రిపీట్ (పునశ్చరణ) చేసుకోవాలి. 6. ఎల్లప్పుడు టూరు మీద ఉండే ఉద్యోగులు ఏ ఒక్క చోటకూడా నిలకడగా పదిహేను రోజులు ఆగరో అలాంటి ఉద్యోగస్తు లకు కూడా 'ఖస్ర్' నమాజు చేసే అనుమతి ఉంది. 7. ఎవరైనా దారిలో లేక తన గమ్యంలో నాలుగైదు రోజులు మాత్రమే ఆగుదామనుకుంటాడు. కాని ఆ తరువాత ఇంకా నాల్గైదు రోజులు ఉండవలసి వస్తుంది. ఈ విధంగా సాగుతుంది అతని ప్రయాణం. కాని

ఏ ఒక్కచోట కూడా వరుసగా పదిహేను రోజులు నిలకడగా ఉండే తలంపు మాత్రం అతనికి ఉండదు. అలాంటి వ్యక్తి ప్రయా ణంలో ఒకచోట ఎన్ని రోజులు ఉన్నాసరే అన్ని రోజులూ అతను ముసాఫిర్ క్రిందే పరిగణించబడతాడు. అంటే అతడు ఖస్ర్ చేస్తూనే ఉండాలి. 8. ఎవరైనా తన ఊరిని పూర్తిగా వదిలేసి మరోచోట నివాసం ఏర్పర్చు కుంటాడు, అక్కడే తన భార్యా పిల్లల్తో ఉంటాడు. అలాంటప్పుడు అతని స్థిర నివాసం అదే అవుతుంది. అతడు ఎప్పుడైనా తన పూర్వ నివాసానికి పోతే అప్పుడు అతడు ముసాఫిర్ అయిపోతాడు. 9. పెళ్ళి అయిన తరువాత స్త్రీ తన మెట్టినింట ఉంటూ ఉంటే ఆమె స్థిర నివాసం అదే అవుతుంది. 10. స్త్రీలు తమ ముహ్రమ్ బంధువు (ఎవరితో నైతే నికాహ్ నిషిద్ధమో, ఉదాహరణకు-తండ్రి, సోదరుడు, మేనల్లుడు, మేనమామ, తాత మొదలైనవారు) వెంట లేకుండా ఒంటరిగా ప్రయాణం చేయకూడదు. 11. స్త్రీలు ప్రయాణావస్థలో నమాజు చేయడానికి సిగ్గు పడకూడదు. 12. సఫర్ (ప్రయాణం)లో ఎవరి నమాజైనా ఖజా అయితే అతడు ఇంటికి తిరిగి వచ్చి ఖజా నమాజు చేసేటప్పుడు కూడా ఖస్ర్‌నే పాటించాలి. పూర్తి నమాజు చదవకూడదు. ఇదే విధంగా ఇంటిదగ్గర ఖజా అయిన నమాజులు ప్రయాణావస్థలో ఖజా చదివితే పూర్తిగానే చదవాలి.

## ముసాఫిర్ ఎప్పుడు ముఖీం అవుతాడు?

ముసాఫిర్ ఇంటికి తిరిగివచ్చిన తరువాతే పూర్తి నమాజు చేయాలి. లేక ఏ చోటనయినా పదిహేనురోజులు లేదా అంతకంటే ఎక్కువ రోజులు ఉండవలసివచ్చినా పూర్తి నమాజు చేయవలసిందే. ప్రయాణావస్థలో పదిహేను రోజులకంటే తక్కువ రోజులు ఉండదలిస్తే మాత్రం అతడు ఖస్ర్ నమాజు చేయవలసి ఉంటుంది.

## వాహనంపై నమాజు చేసే విధానం

1. రైల్లోగాని, బస్సులోగాని, లేక విమానంలోగాని ప్రయాణం చేస్తున్నప్పుడు దిగి నమాజు చేయడానికి వీలులేకున్నా, అలా దిగడం వల్ల వాహనంలోని తన సామాను దొంగిలించబడుతుందనే భయమున్నా లేక దిగి నమాజు చేస్తున్నప్పుడు తాను ప్రయాణం చేస్తున్న వాహనం వెళ్ళిపోతుందని అనుమానం ఉన్నా, వాహనం లోపల్నే నమాజు చేసుకోవాలి. 2. ఎలాంటి ఇబ్బంది లేకుండా వాహనంలోనే నమాజుకై చోటు లభిస్తే మరీ మంచిది. 3. నిలబడి నమాజు చేయడానికి వీలులేనట్లయితే కూర్చునే నమాజు చేయవచ్చు. కూర్చుని చేస్తున్నప్పుడు సజ్దా చేయడానికి తగిన చోటు లేకపోతే, రుకూ,

సజ్దాలు సైగలతో చేయవచ్చు. 4. ఇదే విధంగా నిలబడితే వాహనం కదిలి మనం పడిపోతామన్న భయముంటే కూర్చునే నమాజు చేయాలి. అయితే నమాజువేళ చివరి ఘడియల్లో మనం ప్రయాణం చేస్తున్న వాహనం, స్థిమితంగా నిలబడి నమాజు చేయడానికి వీలుగా ఏదయినా స్టేషనుకు చేరుతుందన్న ఆశ ఉంటే అలాంటి స్టేషన్ వచ్చే వరకు ఎదురుచూడటం మంచిది. దీనికి సంబంధించిన కొన్ని విషయాలు తయమ్ముమ్ అధ్యాయంలో చెప్పబడ్డాయి. అక్కడ చూసుకోగలరు.

## రోగి నమాజు

1. మనిషి జ్ఞానేంద్రియాలు పనిచేస్తూ పూర్తి స్పృహలో ఉన్నంత కాలం నమాజు ఏ సమయంలోనూ మాఫీ కాదు.

2. ఒకవేళ ఏదయిన అస్వస్థతగా ఉండి లేక ఇంకే కారణం వలన నిలబడే శక్తిలేకున్నా లేక నిలబడడం వల్ల భరింపరాని బాధ కలిగినా, ఒకవేళ అలా నిలబడ గలిగినా, తలతిరిగి పడిపోయే భయమున్నా, నిలబడగలిగే శక్తి ఉండి రుకూ, సజ్దాలు చేయలేకపోయినా–ఈ సందర్భాలన్నింటిలోను కూర్చుని నమాజు చేసే అనుమతి ఉంది. 3. కూర్చుని నమాజు చేయడంలోను రుకూ సజ్దాలు చేయలేని పరిస్థితి ఏర్పడితే సైగలతోనే రుకూ సజ్దాలు చేయాలి. 4. కూర్చునే శక్తి కూడా లేనప్పుడు పడుకొనే నమాజు చేయాలి. పడుకొని నమాజు చదవడంలో రెండు విధానాలు ఉన్నాయి. మొదటిది, వీపు వెనుక భాగంలో ఎత్తయిన దిండు లాంటిది పెట్టుకొని ఖిబ్లా దిశకు అభిముఖంగా కూర్చుని తలను కదిలించుచూ సైగలతో రుకూ సజ్దాలు చేయడం. అయితే కాళ్ళు మాత్రం ఖిబ్లా వైపు చాచకుండా ముడుచుకొని కూర్చోవాలి. మరో పద్ధతి, పడకపై వెల్లకిలా పడుకొని ముఖం ఖిబ్లావైపు ఉంచి సైగలతో నమాజు చేయడం. ప్రక్కకు ఒత్తిగిలి పడుకొని కూడా చేయవచ్చు. అలా నమాజు చేసేటప్పుడు శక్తి ఉంటే రెండు మోకాళ్ళను ముడుచుకొని పాదాలు పడకపై ఉంచుకోవాలి. మొత్తానికి ఎలా వీలుంటుందో అలా పడుకొని నమాజు చేయాలి.

5. ఇక పడుకొని సైగలతో కూడా నమాజు చేసే శక్తి లేకపోతే అలాంటి సందర్భంలో నమాజు మాఫీయే. అలాంటి స్థితిలో తలతో ఏమాత్రం సైగ చేయగలిగినా సరిపోతుంది. రుకూ సైగ విషయంలో కంటే సజ్దా సైగ విషయంలో తలను ఇంకొంచెం వంచి సజ్దా సైగ చేయాలి.

6. ఇమామ్ ఖిరాత్‌ను పొడిగించినప్పుడు ముక్తదీ అంతసేపు నిలబడలేక క్రింద

పడేటంత బలహీనంగా ఉన్నప్పుడు ముక్తదీ కూర్చోవాలి. కూర్చున్న స్థితిలో గోడలేక స్తంభానికి ఆనుకున్నా ఫరవాలేదు. ముఖ్యంగా ఇలాంటి అవస్థ తరావీహ్ నమాజులో రావచ్చు లేక బలహీనుడయిన ముక్తదీకి సాధారణ నమాజుల్లోను ఇలా జరగవచ్చు.

7. పక్షవాతం వచ్చినా, ఇంకేదయినా భరింపరాని రోగ బాధకులోనయినా లేక నీరు వాడడం వలన ఆరోగ్యం చెడిపోయే భయమున్నా తయమ్ముమ్ చేసి నమాజు చేయాలి. ఇస్తింజా చేయడంలో నీరు అనారోగ్యానికి కారణభూతం అవుతుందన్న భయం ఉంటే గుడ్డ లేక మట్టితో ఇస్తింజా స్థలాన్ని తుడుచుకొని నమాజు చేయాలి. ఒకవేళ గుడ్డతోగాని, మట్టితోగాని తుడువలేనంత బలహీనంగా ఉన్నప్పుడు అలానే నమాజు చేయవచ్చు. ఒకవేళ భార్య ఉంటే ఆమెతో ఈ పనిని చేయించాలి. కాని భార్య తప్ప ఇంకే ప్రాజ్ఞత వచ్చినా మనిషికి తన మర్మాంగాలను చూపడం ధర్మసమ్మతం కాదు–వారు తన తల్లిదండ్రులయినా, సోదరసోదరులయినా, కుమారులైనా సరే.

8. ఆరోగ్యంగా ఉన్నప్పుడు అయిన ఖజా నమాజుల్ని ఆలస్యం చేయకుండా రోగ స్థితిలోనే నెరవేర్చుకోవాలి. తిరిగి ఆరోగ్యవంతునిగా అవుతానని ఎదురు చూడకూడదు. మరణం ఎప్పుడు సంభవిస్తుందో ఎవరికి తెలుసు?

## జుమా నమాజు

శుక్రవారం రోజున జుహ్ర్ నమాజుకు బదులు చేసే నమాజునే జుమా నమాజు అని అంటారు. జుహ్ర్ నమాజులో ఫర్జ్ నాలుగు రకాఅత్‌లు అయితే ఇందులో కేవలం రెండు రకాఅత్‌లు మాత్రమే.

## జుమా ప్రాధాన్యత

జుమా నమాజు తాకీదు దైవ గ్రంథమైన ఖుర్ఆన్‌లోను, హదీసులోను ఉంది. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా చెప్పబడింది:

إِذَا نُودِيَ لِلصَّلٰوةِ مِنْ يَوْمِ الْجُمُعَةِ فَاسْعَوْا إِلٰى ذِكْرِ اللّٰهِ وَذَرُوا الْبَيْعَ ۚ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ إِنْ كُنْتُمْ تَعْلَمُوْنَ ○

**"ఎప్పుడయితే జుమా నమాజు కోసం అజాన్ చెప్పబడుతుందో త్వర పడుతూ మీ పనిపాటల్ని వది లేయండి. మీరు అవగాహన చేసు కుంటే ఇది మీకు మేలయినది."**

**(జుమా)**

## హదీసుల్లో మహాప్రవక్త (సఅసం) ప్రవచనాలు ఇలా ఉన్నాయి

1. "వారం రోజులన్నిటిలోను మేలయినది జుమా రోజు. ఇదే రోజున హజ్రత్ ఆదమ్ (అలైహి) సృష్టించబడ్డారు. ఇదే రోజు ఆయన స్వర్గంలో ప్రవేశింపజేయబడ్డారు. ఇంకా ఇదేనాడు ఖియామత్ (ప్రళయం) సంభవిస్తుంది." (ముస్లిమ్)

2. "జుమా రోజు, గత అనుచర సమాజాలకు ఉమ్మడిగా పవిత్ర దినం. కాని వారు దీనిలో భేదాభిప్రాయాలు సృష్టించారు. యూదులు శనివారాన్ని, క్రైస్తవులు ఆదివారాన్ని పవిత్రమయిన రోజుగా చేసుకున్నారు. దైవం ముస్లిమ్‌లకు సన్మార్గాన్ని ప్రసాదించినందు వల్ల వారు ఈ రోజు యొక్క ఔన్నత్యాన్ని యదాతథంగా ఉంచారు." (బుఖారి, ముస్లిమ్)

3. "జుమా రోజున ఓ ప్రత్యేక ఘడియ ఉంది. ఆ ఘడియలో ఏ దుఆ చేసినా అది తప్పక స్వీకరించబడుతుంది. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ సలామ్‌ను ఎవరో అడిగారు, ఆ ఘడియ ఏదీ అని. ఆయన ఆ ఘడియ అస్ర్ వేళ నుండి సూర్యాస్తమయం వరకు ఉంటుందన్నారు." (మిస్కాత్)

## నమాజె జుమా ఆదేశం

నమాజె జుమా ఫర్జె అయిన్. అంటే ప్రతి ముస్లిం దీన్ని తప్పనిసరిగా పాటించాలి. దీన్ని నిరాకరించేవాడు కాఫిర్ (అవిశ్వాసి) అవుతాడు. కావాలని వదిలివేసినవాడు ఫాసిఖ్ అవుతాడు. ఇది ఇస్లామియ చిహ్నాల్లో ఒకటి. అంటే ఇస్లామ్‌ను గుర్తించేవాటిలో ఒకటన్నమాట. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

"ముస్లిములు జుమా నమాజును వదిలేయకూడదు. అలాచేస్తే అల్లాహ్ వారి హృదయాలకు సీలుచేసి వేస్తాడు. ఆ తరువాత వారు ప్రమత్తతలోనే ఉండిపోతారు." (ముస్లిమ్)

మహాప్రవక్త (సఅసం) జుమా నమాజును చేయకుండా వదిలేసేవారి గురించి ఇలా అన్నారు. "ఎవరయితే జుమా నమాజు ఎలాంటి 'ఉజ్ర్' లేకుండా (అంటే అనివార్య పరిస్థితి లేకుండా) మానివేస్తారో, వారి ఇండ్లను తగులబెట్టాలనిపిస్తుంది నాకు."

## జుమా నమాజు ఎవరెవరికి ఫర్జు

జుమా నమాజు చేయడం తెలివిఉన్నవారు, ప్రాజ్ఞుడు, స్వతంత్రుడు, నిలకడగా ఉన్నవాడు (ముకిమ్), ఆరోగ్యవంతుడయిన ప్రతి ముస్లిమ్‌పై ఫర్జు చేయబడింది. ప్రాజ్ఞత పొందని పిల్లలు, రోగులు, అంధులు, బాటసారులు, స్త్రీలపై ఫర్జు చేయబడలేదు. అయితే

వీరు దీన్ని పాటిస్తే వారి జుమా నమాజు నెరవేరుతుంది. అప్పుడు వారు ఆనాటి జొహ్ర్ నమాజు చేయనవసరం లేదు.

## జుమా గురించి కొన్ని ముఖ్య విషయాలు

నమాజె జుమా నెరవేరడానికి కొన్ని విషయాలను గుర్తుంచుకోవాలి.

1. ఎక్కడైతే పదిహేను, ఇరవైమంది ముస్లిములు నివసిస్తూ వారిలో కనీసం పన్నెండుగురు అయినా నమాజుకు అర్హులో, ఇంకా ఆ ఊరిలో కనీసం అవసరాలకు సంబంధించిన వస్తువులు లభించగలవో, అక్కడ జుమా నమాజు పాటించడం ధర్మ సమ్మతం (జాయిజ్). ఆ నమాజులో ఇమామ్ కాక ముగ్గురు లేక నల్గురు నమాజీలు పాల్గొన్నా సరే. ముగ్గురికంటే తక్కువమంది పాల్గొన్నప్పుడు జుమాకు బదులు జొహ్ర్ నమాజునే చేయాలి.

2. జొహ్ర్ నమాజువేళ అయి ఉండడం అవసరం. ఒకవేళ జొహ్ర్ సమయం దాటి పోతే జుమా జాయిజ్‌కాదు.

3. ఖుత్బా ఇవ్వడం అంటే జుమా నమాజుకు ముందు రెండు ఖుత్బాలు (ప్రసంగాలు) చేయాలి. మొదటి ఖుత్బాలో దైవస్తోత్రం, మహాప్రవక్త (సఅసం)పై దరూద్ చదవడం ఆ తరువాత దివ్య ఖుర్‌ఆన్‌లోని కొన్ని ఆయత్‌లు పఠించడం లేక కొన్ని హదీసులు చదివి సమయానుకూలంగా ముస్లింలకు బోధించడం అవసరం. రెండో ఖుత్బాలో దైవస్తోత్రం,ప్రవక్తపై దరూద్ మరియు సలామ్ పంపి (చదివి) సహాబీలు (రజిఅన్), ధార్మిక గురువులు మరియు సామాన్య ముస్లిముల క్షేమం కోసం దుఆ చేయాలి. ఖుత్బా అరబీ భాషలోనే ఉండాలి. అయినా ఉర్దూ లేదా ఇతర ప్రాంతీయ భాషల్లో దానికి క్లుప్తమైన వివరణ ఇచ్చినా సరిపోతుంది. పైగా విద్యావిహీనులైన వారికి, పల్లె ప్రజలకు ఏదైనా ఖుర్‌ఆన్ ఆయత్ లేక హదీసు గురించి ప్రాంతీయ భాషలో వివరించడం ఎంతో మేలుచేస్తుంది. అయితే ఈ వివరణ ఓ సుదీర్ఘ ప్రసంగంగా మారకూడదు. ఖుత్బా, నమాజుకంటే దీర్ఘంగా ఉండకూడదు.

4. మొదటి ఖుత్బా చదివి కొంచెంసేపు కూర్చోవాలి, ఆ తరువాత లేచి రెండో ఖుత్బా చదవాలి.

5. ఖుత్బా నమాజుకంటే నడివి కాకూడదు.

6. ఖుత్బా జరిగే సమయంలో ఎలాంటి నమాజును ప్రారంభించకూడదు. అయితే ఇదివరకే ప్రారంభించిన నమాజును మాత్రం పూర్తి చేసుకోవాలి. కాని మాట్లాడడం,

మాటకు సమాధానం ఇవ్వడం, ఖుర్‌ఆన్ పారాయణం చేయడం, సలాం చేయడం, దానికి జవాబు పలకడం అన్నీ నిషేధం.

7. జుమా సమయంలో రెండుసార్లు అజాన్ పలకాలి. ఒకసారి ఖుత్బాకు ముందు, రెండసారి ఇమామ్ ఖుత్బా కొరకు మెంబరుపై కూర్చున్నప్పుడు, ముఅజ్జిన్ ఇమాం ఎదురుగా కొంచెం ఎడంగా నిలుచుని అజాన్ పలకాలి. కాని రెండోసారి అజాన్ మొదటిసారి అజాన్ అంత బిగ్గరగా కాకుండా నెమ్మదిగా పలకాలి. కొందరు ధర్మవేత్తలు ఈ రెండోసారి అజాన్‌కు జవాబు పలకడం మక్రూహ్ అన్నారు.

8. జుమా రోజున (మొదటిసారి) అజాన్ అయినప్పటినుండి నమాజుపూర్తి అయ్యేవరకు ప్రాపంచిక వ్యాపకాలన్నీ (అమ్మడం, కొనడం లాంటివి) వదిలేయాలి. అజాన్ తరువాత వ్యాపార వ్యవహారాల్లో లీనమవడం హరాం.

9. జుమా ఖుత్బాను లౌడ్ స్పీకర్ (మైకు)లో ఇవ్వవచ్చు.

## జుమా మర్యాదలు

1. జుమా రోజున పరిశుభ్రమవడం (స్నానం చేయడం వగైరాలు) శుభ్రమైన బట్టలు వేసుకోవడం, సువాసన ద్రవ్యాలు పూసుకోవడం సున్నత్. మహాప్రవక్త (సఅసం)వీటిని ఆచరించేవారు. ఆయనగారి ఈ సంప్రదాయం మూలంగానే సహబీలు, ధార్మిక గురువులు దీన్ని ఆచరించారు.

2. జుమా రోజున క్షవరం చేయించుకోవడం, గోళ్ళు కత్తిరించుకోవడం మరియు నాభిక్రింది వెంట్రుకల్ని తీసివేయడం సున్నత్.

3. ఖుత్బా హుందాగాను, బిగ్గరగాను ఏదో ముఖ్యమైన విషయం గూర్చి చెప్పబడు తుందన్నంత గాంభీర్యంగాను చదవాలి. మహాప్రవక్త (సఅసం) ఖుత్బా ఇచ్చేటప్పుడు, ఏదో సైనికదాడి జరగబోతుందన్నట్లుగా ఉండేది.

4. జుమా రోజున మస్జిద్‌లో ప్రవేశించిన తరువాత ఎక్కడ చోటుదొరికితే అక్కడనే కూర్చోవాలి. కొందరు, మనుషుల మెడలపై నుండి దాటి ముందు వరుసలోకి పోయే ప్రయత్నం చేస్తుంటారు. మహాప్రవక్త (సఅసం) దీన్ని వారించారు. అయితే ఉన్న చోటునుండి మొదటి వరుసలో సునాయాసంగా చేరగలిగే వీలుంటే మొదటి వరుసలోనికి వెళ్ళవచ్చు.

5. జుమా రోజున ఎవరు ఎంత పెందలకడగా మస్జిద్‌కు పోగలరో వారికి ఎంతో ఎక్కువ పుణ్యం ప్రాప్తమవుతుంది.

## మైక్ ద్వారా నమాజు

లౌడ్‌స్పీకర్ (మైక్) ద్వారా నమాజు చదవడం సరిఅయిందే. అరబ్ దేశాలకు చెందిన ధర్మవేత్తల ప్రకారం మైక్‌లో నమాజ్ చదువవచ్చు, అయితే మన దేశంలోని కొందరు ధర్మవేత్తలు, దీనివల్ల నమాజులో ఖుషూ, ఖుజూ (ఏకాగ్రత) భగ్నమవుతుంది అని అంటారు. కాని మైకులో నుండి వచ్చే శబ్దం అసలైన శబ్దమే అయినప్పుడు వీరి వాదనకు అర్థంలేదు. ప్రస్తుత కాలంలో గోడల్లో ఎవరికి తెలియకుండా ఇంకే ఇతర వస్తువుల్లోనైనా ఫిట్ చేసే యంత్రాలు వచ్చాయి. ఇమామ్‌కుగాని, ముక్తదీలకుగాని ఇవి ఇక్కడ ఉన్నాయి అన్న అనుమానమే రాదు. అదేవిధంగా ప్రసంగం (ఖుత్బా) లేక నమాజు సమయంలో కరెంటుపోయి ఏకాగ్రత చెడుతుంది అన్న వాదనకూడా ఉంది. అయితే ఇషా నమాజులోను, ఫజ్ర్ నమాజులోను అప్పుడప్పుడు కరెంటు ఫెయిల్ అవడం కద్దు. అలాంటి సమయాల్లో ఏకాగ్రతకు భంగం కలగదు? కరెంటుతో కాకుండా నేరుగా బేటరీతోనే పనిచేయించినప్పుడు ఈ ప్రశ్నే ఉత్పన్నం కాదు. నమాజీలు ఎక్కువగా ఉన్నప్పుడు మాత్రం లౌడ్‌స్పీకర్ ఉండవలసిందే. తక్కువగా ఉన్నప్పుడు దాని అవసరం అంతగా ఉండదు.

## పండుగ నమాజు

ఈద్ అంటే పండుగ ఏకవచనం. ఈదైన్ అంటే రెండు పండుగలు ద్వివచనం. షవ్వాల్ మొదటి తారీఖున వచ్చేది 'ఈదుల్ ఫిత్ర్' (అంటే రోజాను భంగంచేసే ఈద్) రెండవది జీహజ్జా పదవ తారీఖున వచ్చేది 'ఈదుల్ అజ్హా' లేక 'ఖుర్బానీ ఈద్' అని అంటారు.

## రెండు పండుగల ప్రాముఖ్యత

ఈ రెండూ ఇస్లామ్‌లో సంతోషదినాలు. అంటే పండుగలు. ఈ రెండు తప్ప ఇంకే రోజు కూడా ఇస్లామ్‌లో పండుగ దినం కాదు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) హిజ్రత్ చేసి మదీనా నగరానికి వెళ్ళినప్పుడు మదీనా ముస్లిములు రెండు రోజులు (రెండుసార్లు) పండుగ చేసుకునేవారు. ఆయన ఈ విషయమై అడగగా వారు, మేము ఇస్లామ్ స్వీకరించక మునుపు నుండి ఈ రెండు రోజులు పండుగ జరుపుకుంటూ వస్తున్నాం అని జవాబిచ్చారు. దానికి మహాప్రవక్త (సఅసం), ఈ రెండు రోజులకు బదులు మీకోసం వేరే మేలైన రెండురోజులు కేటాయించబడ్డాయి. అవి ఒకటి ఈదుల్ ఫిత్ర్, రెండు ఈదుల్ అజ్హా అని అన్నారు.

దీనిద్వారా తెలిసిందేమంటే ఈ రెండు రోజులు తప్ప ఇంకే రోజుకూడా పండుగ జరపడం, వంటకాలు చేసి తినడం ఆనందించడం లేక విచారం వెలిబుచ్చడం లాంటివి అన్నీ నిషిద్ధం. ముస్లింలు ఇలా చేయకుండా జాగ్రత్తపడాలి. ఇంకా దీని ద్వారా తెలిసిన మరో విషయం ఏమిటంటే ముస్లిములు ఇతర మతస్థులు జరుపుకునే పండుగలు కూడా జరుపుకోవద్దనేది.

## ఈదైన్ నమాజుల ఆదేశం

ఈ రెండు ఈద్‌లలో ప్రతి ముస్లింపై రెండేసి రకాత్‌ల నమాజు చేయడం వాజిబ్ అయింది. ఈ రెండు నమాజుల్లోను, జుమా నమాజుకోసం కావలసిన విషయాలు అన్నీ కావల్సిందే. ఏ విషయాలైతే వీటిలో హెచ్చు తగ్గులుగా ఉన్నాయో అవి ఇక్కడ రాయబడుతున్నాయి.

## జుమా మరియు ఈదైన్‌లోని తేడా

1. ఈదైన్ నమాజు కోసం, అజాన్‌గాని, ఇఖామత్‌గాని లేదు.

2. జుమా నమాజులో ఖుత్బా నమాజుకంటే ముందు ఇవ్వబడుతుంది. వీటిలో, నమాజు అయ్యాక ఖుత్బా చదువబడుతుంది. జుమా రోజున ఖుత్బా చదవడం వాజిబ్ అయితే ఈదైన్ నమాజులో అది సున్నత్. అయితే దాన్ని చదవకపోవడం మంచిదికాదు.

3. జుమా నమాజులో ఎలాంటి అదనపు 'తక్బీర్' లేదు. కాని ఈదైన్ నమాజులో ప్రతి రకాత్‌లో మూడేసి తక్బీర్‌లు అదనంగా చెప్పబడతాయి.

4. జుమా నమాజు ఖజా అయితే (తప్పిపోతే) జొహ్ర్ నమాజు చదవాలి. ఈదైన్ నమాజు ఖజా అయితే ఇక ఏమీ చదివేది లేదు. అయితే చాలామందికి నమాజు తప్పి పోయినప్పుడు వారు నమాజు చేయదలుచుకుంటే మరో చోట జమాఅత్‌తో నమాజు చేయవచ్చు.

## ఈదైన్ నమాజు వేళ

ఈదైన్ నమాజు చేసే వేళ సూర్యోదయం నుండి మధ్యాహ్నం కొంత ముందు వరకు ఉంటుంది. అనివార్య కారణాలవల్ల ఈదుల్ ఫిత్ర్ నమాజు షవ్వాల్ మొదటి తారీఖున చేయడానికి వీలు కలుగకపోతే రెండవ రోజు దాన్ని చేయవచ్చు. ఈదుల్ అజ్హా నమాజు జీహజ్జా యొక్క పదకొండు, పన్నెండు తారీఖుల వరకు చేయవచ్చు.

## ఈదైన్ నమాజు ఎలా చేయాలి

రెండు నమాజుల్ని ఈ విధంగా చదవాలి. ఇమామ్ మరియు ముక్తదీ ఇద్దరూ మొదట, ఈదుల్ ఫిత్ర్ లేక ఈదుల్ అజ్హాకు సంబంధించిన నమాజు రెండు రకాత్‌లు ఆరు తక్బీరులతో ఖిబ్లా దిశగా ముఖం త్రిప్పి చదువుతున్నాను అని సంకల్పం చేయాలి. ముక్తదీలు అయితే ఈ ఇమామ్ వెనక నిలబడి చదువుతున్నాను అని కూడా అనాలి. ఇలా సంకల్పం చేసిన తరువాత ఇమామ్ బిగ్గరగా ముక్తదీలు అయితే మెల్లగా అల్లాహు అక్బర్ అంటూ చేతులు చెవులదాకా పైకెత్తి దించి కట్టుకోవాలి. అలా చేతులు కట్టుకొని మొదట 'సనా' చదవాలి. సనా తరువాత ఇమామ్ తిరిగి అల్లాహు అక్బర్ అంటూ తన చేతుల్ని చెవుల వరకు ఎత్తి వదిలేయాలి. ముక్తదీలు ఇమామ్‌ను అనుకరించాలి. ఆ తరువాత ఇమామ్ బిగ్గరగానే అల్లాహు అక్బర్ అంటూ తిరిగి చేతులు పైకెత్తి వదిలేయాలి. ముక్తదీలు కూడా ఇమామ్‌ను అనుకరించాలి. మూడవసారి ఇమామ్ మొదటి రెండు తక్బీర్‌ల వలె అల్లాహు అక్బర్ అంటూ చేతులు పైకెత్తి ఆ తరువాత చేతులు క్రిందికి వదలకుండా కట్టుకోవాలి. తరువాత ఇమామ్ మెల్లగా తఅవ్వుజ్ మరియు తస్మియా చదివి, సూరె ఫాతిహా మరియు ఖుర్‌ఆన్‌లోని మరేదైనా సూరాను బిగ్గరగా చదవాలి. ఆ తరువాత రుకూ, సజ్దాలు చేసి ఒక రకాత్ పూర్తి చేయాలి.

రెండో రకాత్‌లో నిలబడి మొదట ఫాతిహా సూరా మరియు ఖుర్‌ఆన్ పఠించి ఇమామ్ రుకూలోనికి పోకుండా తక్బీర్ చెబుతూ తన రెండు చేతుల్ని చెవుల వరకు ఎత్తి క్రిందికి వదిలేస్తాడు. ముక్తదీలు కూడా అలానే చేయాలి. రెండోసారి ఇమామ్ తక్బీర్ చెబుతూ మొదటి తక్బీర్ లాగానే రెండు చేతులు క్రిందికి వదిలేస్తాడు. ముక్తదీలు కూడా అలానే చేయాలి. మూడవ తక్బీర్ కూడా ఇదే విధంగా పూర్తి అవుతుంది. ఇక నాల్గవ తక్బీర్ చెబుతూ ఇమామ్ రుకూలోనికి వెళ్ళిపోతాడు. ఆయన వెంట ముక్తదీలు కూడా రుకూ చేయాలి. సాధారణంగా ఇతర నమాజ్‌లు పూర్తి చేసుకున్నట్లే నమాజును పూర్తి చేయాలి. నమాజు అయిన తరువాత ఇమామ్ దుఆ చేసి మెంబర్ పైకి వెళ్ళిపోతాడు. నిలబడి ఖుద్బా చదువుతాడు. ముక్తదీలు నిశ్శబ్దంగా ఖుద్బా వినాలి. ఒకవేళ ఇమామ్ ఖుద్బా తరువాత కూడా దుఆ చదువవచ్చు.

ఈదైన్‌లోను జుమా వలే రెండు ఖుత్బాలు ఉంటాయి. ఈ రెండిటి నడుమ కూర్చోవడం సున్నత్. ఈదైన్ ఖుద్బాలో, ఖుద్బా ప్రారంభంలో, మధ్యలో అనేక సార్లు

اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ لَا اِلٰهَ اِلَّا اللّٰهُ وَاللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ وَلِلّٰهِ الْحَمْدُ

**"అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ లాఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వలిల్లాహిల్ హమ్‌ద్"** అనడం మరియు ఖుద్బాలో ఈదైన్‌కు సంబంధించిన విషయాలు చెప్పడం ఉత్తమం.

ఈదైన్ నమాజుల్లో సూరయె జుమా, సూరయె మునాఫికూన్, సూరయె ఆలా, సూరయె గాషియాలలో నుండి ఏవైనా రెండు సూరాలు చదవడం సున్నత్.

## షాఫయీ ఇమామ్

ఏ హనఫీ అయినా షాఫయీ ఇమామ్ వెనుక నమాజు చదివితే అతడు మొదటి రకాత్‌లో ఏడు తక్బీర్‌లు పలుకుతాడు. రెండో రకాత్‌లో అయిదు తక్బీరులు పలుకుతాడు. అలాంటప్పుడు ముక్తదీ ఆయన్ను అనుకరించాల్సిందే. కారణం హదీసు ప్రకారం ఇలా చెప్పవచ్చు అని ఉంది.

రెండు ఈద్‌ల రోజున పాటించవలసిన సున్నత్‌లు, ముస్తహిబ్‌లు:

1. గుసుల్ చేయడం, మిస్వాక్ చేయడం.

2. లభ్యమైన మేలైన వస్త్రాలను ధరించడం.

3. సువాసనలు పూసుకోవడం.

4. ఈద్‌గాహ్‌లోనే నమాజ్ చేయడం అంటే ఈదైన్ నమాజు ప్రతి మస్జిద్‌లోను చేయవచ్చు కాని ఈద్‌గాహ్‌కే వెళ్ళి చేయడం సున్నత్ అన్నమాట. మహాప్రవక్త (సఅసం), ఆయన సహాబీలు అలానే చేశారు.

5. ఈద్‌గాహ్‌కు కాలినడకనే వెళ్ళడం మంచిది. ఒకవేళ ఏదైనా కారణం ఉన్నా, ఈద్‌గాహ్ చాలా దూరంగాఉన్నా వాహనంపై వెళ్ళడంలో తప్పులేదు.

6. ఒకమార్గం గుండా వెళ్ళి మరో మార్గం గుండా తిరిగి రావడం.

**సూచన:** ఈద్ నమాజుకు ముందు ఎలాంటి నఫిల్ నమాజైనా చేయడం మక్రూహ్ (అవాంఛనీయం). ఒకవేళ ఫజ్ర్ నమాజు ఖజా (దాటిపోతే) అయితే దాన్ని ఇంటిలోనే నెరవేర్చాలి. ఈద్‌గాహ్‌లో చేయకూడదు.

## ఈదుల్ ఫిత్ర్ నాటి ప్రత్యేక కార్యక్రమం

1. ఈదుల్ ఫిత్ర్ నాడు నమాజ్ చేయడానికి ముందు ఖర్జూరాలు గాని మరేదైనా తీపి వస్తువుగాని తినడం సున్నత్. 2. సదఖా ఫిత్ర్ చెల్లించిన తరువాతే నమాజు కోసం బయలు దేరాలి. సదఖా ఫిత్ర్ గురించి రోజా అధ్యాయంలో చెప్పబడుతుంది. 3. ఈద్‌గాహ్‌కు వెళ్ళే మార్గంలో మెల్లగా (ఇతరులకు వినపడకుండా) తక్బీర్ పఠిస్తూ వెళ్ళాలి.

## ఈదుల్ అజ్హానాటి ప్రత్యేక కార్యక్రమం

1. ఈదుల్ అజ్హానాడు ఈద్‌గాహ్‌కు వెడుతూ బిగ్గరగా (బయటకు వినబడేటట్లు) తక్బీర్ పఠిస్తూ వెళ్ళాలి. 2. నమాజు ముందు ఏ పదార్థమూ తినకుండా ఉండాలి. నమాజైన తరువాత ఖుర్బానీ మాంసాన్ని తినాలి. ఒకవేళ ఖుర్బానీ మాంసం రావడానికి ఆలస్యం అయితే తినే ఏ పదార్థాన్నైనా తినవచ్చు. కొందరు ఖుర్బానీ మాంసాన్నే తినడం అవసరం అనుకుంటారు. ఇది సరయిన భావన కాదు. ఆనాడు ఖుర్బానీ చేయనివాడు నమాజైన వెంటనే భోజనం చేయవచ్చు. 3. ఖుర్బానీ ఇవ్వడమే ఈదుజ్జుహాలో చేయవలసిన ముఖ్యమైన పని. 4. ఏ వ్యక్తి పైన్నేతే సదఖా ఫిత్ర్ వాజిబో ఆ వ్యక్తిపై ఖుర్బానీ చేయడం కూడా వాజిబ్. అలాంటి వ్యక్తి ఖుర్బానీ ఇవ్వకపోతే తప్పిదం (గునాహ్) చేసిన వాడవు తాడు. ఖుర్బానీకి సంబంధించిన పూర్తి వివరాలు హజ్ అధ్యాయం తరువాత రాయ బడతాయి. 5. తక్బీరాతె తష్రీక్ చెప్పడం.

## అయ్యామె తష్రీక్ (తష్రీక్ చెప్పేదినాలు)

జీహజ్జా నెల తొమ్మిదో తారీఖు ఫజ్ర్ నమాజ్ తరువాత మొదలు పదమూడో తారీఖు వరకు గల ఈ అయిదు రోజుల్ని అయ్యామె తష్రీక్ అని అంటారు.

## తక్బీరాతె తష్రీక్ (తష్రీక్ యొక్క తక్బీరులు)

తొమ్మిది జీహజ్జ మొదలు అయిదు రోజుల వరకు ప్రతి ఫర్జ్ నమాజు తదుపరి చెప్పబడే తక్బీర్‌లను తక్బీరాతె తష్రీక్ అని అంటారు.

అర్ఫా రోజు నుండి అంటే జీహజ్జా తొమ్మిదో తారీఖు ఫజ్ర్ నమాజు నుండి పదమూడో తారీఖు అస్ర్ నమాజు వరకు ప్రతి ఫర్జ్ నమాజ్ తరువాత తక్బీరె తష్రీక్ ఒకసారి పలకడం వాజిబ్. ఈ తక్బీరులను పురుషులైతే బిగ్గరగాను, స్త్రీలైతే మెల్లగాను పలకాలి. (రద్దుల్ ముహ్తార్)

## తక్బీరె తష్రీక్

"అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వలిల్లాహిల్ హంద్."

اَللّٰہُ اَکْبَرُ اَللّٰہُ اَکْبَرُ لَا
اِلٰہَ اِلَّا اللّٰہُ وَاللّٰہُ اَکْبَرُ
اَللّٰہُ اَکْبَرُ وَلِلّٰہِ الْحَمْدُ ط

**అర్థం:** అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ తప్ప వేరే పూజ్యుడు లేడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరి కంటే గొప్పవాడు, అన్ని స్తోత్రాలు అల్లాహ్ కోసమే.

ఈ తక్బీరునే ఈద్‌గాహ్‌కు వెళ్ళేటప్పుడు దారిలో చెప్పాలి. ఈదుల్ ఫిత్ర్‌లో మెల్లగాను, ఈదుల్ అజ్హాలో కొంత బిగ్గరగాను పలకాలి.

## కొన్ని ముఖ్య సమస్యలు (మసాయెల్)

1. పురుషుల్లా స్త్రీలు, ఈద్ నమాజు వాజిబ్ కాని వారు (వ్యాధిగ్రస్తులు, బాటసార్లు వగైరా) ఈద్ నమాజుకు ముందు ఎలాంటి నఫిల్ నమాజు చేయకూడదు. ఈద్ నమాజ్‌కు ముందు నఫిల్ అందరికి మక్రూహ్. అయితే ఫజ్ర్ నమాజ్ ఖజా అయితే దాన్ని నెరవేర్చుకోవచ్చు.

2. కొన్ని అనివార్య కారణాలవల్లనైనా ఈదుల్ ఫిత్ర్‌ను రెండోరోజున, ఈదుల్ అజ్హాను మూడో రోజున చేయవచ్చు. ఆ కారణాలు క్రింద ఇవ్వబడనున్నాయి.

1. జోరుగా వర్షం కురుస్తున్నప్పుడు, 2. నెలవంక గురించి ఏమీ తెలియనప్పుడు, 3. నమాజు చదివించేవారు ఎవ్వరూ లేనప్పుడు, 4. మేఘం అలుముకున్నప్పుడు నమాజు చేసి ఆ మేఘం పూర్తిగా విడిపోయిన తరువాత అలాచేసిన నమాజు, వేళకు చేయలేదని తెలిసినప్పుడు.

**సూచనలు:** 1. ఈదుల్ ఫిత్ర్ నమాజు రెండో రోజున, ఈదుల్ అజ్హా నమాజు మూడో రోజున కూడా చేయవీలు లేకపోతే ఆ తరువాత ఆ నమాజులను చేయకూడదు.

2. ఈదైన్ నమాజు ఒకరిద్దరికి తప్పిపోతే వారు మరో మస్జిద్‌లోనికి వెళ్ళి నమాజు చేయాలి. ఎక్కడా నమాజు అందకపోతే దానికి బదులు నాల్గు రకాత్‌లు సలాతుజ్జుహ చదవాలి. అయితే కనీసం ఆరుగురికి ఎక్కడా జమాఅత్ లభించకపోతే వారు మరో జమాఅత్ చేయవచ్చు. (ఇల్‌ముల్ ఫిక్హా పేజి 173)

3. 'ఈదైన్ నమాజు'కు ఖజాలేదు. ఎవరికైనా ఏ కారణం చేతనైన ఈద్ నమాజు భంగపడితే దానికి అతడు ఖజాచేసే అవసరం లేదు.

4. ఎవరైనా, ఇమామ్ తక్బీరులు చెప్పిన తరువాత వచ్చి జమాఅత్‌తో కలిసిపోతే అతడు వెనువెంటనే తక్బీరులు చెప్పేయాలి. ఒకవేళ ఇమామ్ రుకూలోకి వెళ్ళిపోతే, అతడికి ఆ రుకూ మాత్రం అందితే ఆ రుకూలోనే తస్బీహ్‌కు బదులు మూడు సార్లు చేతులు ఎత్తకుండానే అతడు తక్బీరులు చెప్పాలి. అలా తక్బీరులు చెప్పే వీలు చిక్కని పక్షంలో మానేయాలి. అతని నమాజు నెరవేరుతుంది.

5. ఎవరికైన మొదటి రకాత్ దాటిపోతే సలాం తరువాత నిలబడి ఆ రకాత్‌ను పూర్తి చేసుకోవాలి. ఈ రకాత్‌లో ఖిరాత్ తరువాత మూడుసార్లు తక్బీర్లు చెప్పాలి, నిలబడగానే తక్బీరులు చెప్పకూడదు. కారణం ఏమిటంటే వెంటనే తక్బీరులు చెబితే తనకు అందిన రెండో రకాత్ తక్బీర్లు, ఈ తక్బీర్లు వెనువెంటనే చెప్పినట్లు అవుతుంది. ఇలా చెప్పాలని లేదు. కాబట్టి ఖిరాత్ అయిన తరువాతే తక్బీర్లు చెప్పవలసి ఉంటుంది.

6. ఒకవేళ ఇమామ్ మొదటి లేక రెండో రకాత్‌లో తక్బీర్లు చెప్పడం మరిచిపోతే అతడు రుకూలోనే ఆ తక్బీరులు చెప్పాలి తక్బీర్లకోసం తిరిగి నిలబడకూడదు. అలా నిలబడినా ఫరవాలేదు. అది జాయిజ్. ఒకవేళ తక్బీర్లు చెప్పడం మరిచిపోయినా నమాజు నెరవేరుతుంది. తిరిగి నమాజు చేయకూడదు. సజ్దా సహూ కూడా చేయనవసరం లేదు.

7. సాధారణ నమాజుల్లో వాజిబ్‌ను వదిలేస్తే సజ్దా సహూ చేయవలసి ఉంది. కాని ఈదైన్ నమాజులో ప్రజా సమూహం ఎక్కువగా ఉంటే సజ్దా సహూ చేయకూడదు. దీనివల్ల జమాఅత్‌లో గడబిడ జరుగుతుంది. అయితే కొంతమందే ఉంటే సజ్దా సహూ చేసుకోవచ్చు.

## నమాజె ఖుసూఫ్

సూర్య గ్రహణం పట్టినప్పుడు రెండు రకాత్‌ల నమాజ్ చేయడాన్ని షరీఅత్‌లో 'నమాజె కసౌఫ్' అంటారు.

"సూర్యగ్రహణం పట్టినప్పుడల్లా మహాప్రవక్త (సఅసం) సహాబీల (రజిఅన్)తో సహా సామూహిక నమాజు చేసేవారు." (మిష్కాత్)

**ఇది అల్లాహ్ సూచన:** సూర్యగ్రహణం ఎందుకు పడుతుంది అన్న దాన్ని గురించి ఇస్లామీ షరీఅత్ చర్చించదు. ఇస్లామీ షరీఅత్ గ్రహణానికి ప్రాముఖ్యం ఎందుకు ఇస్తుందంటే అది అల్లాహ్ సూచనల్లో ఓ సూచన. ఇక ఎవరైనా దీని వెలుగులో, దీనికి కారణం ఏమిటి అని తెలుసుకోదలిస్తే దాన్ని ఇస్లామీ షరీఅత్ అడ్డుకోదు. సరికదా ఇంకా తెలుసుకోవడానికే పురికొల్పుతుంది. ఎవరైనా ఇది అల్లాహ్ సూచనల్లో ఒక సూచన అన్న విషయంపై ఆలోచిస్తే, అనుశీలన జరిపితే సూర్యగ్రహణం దైవం యొక్క సృష్టిలీలగా అది ఓ దైవ సూచనగానే గుర్తిస్తాడు.

ఇస్లామీయ షరీఅత్ సూర్యగ్రహణం గురించి ప్రజల్లో ఉన్న అపనమ్మకాలు, ఇది ఓ కష్టకాలం అన్న మూఢ విశ్వాసాన్ని కొట్టిపారేస్తుంది. మహాప్రవక్త (సఅసం) కుమారుడైన హజ్రత్ ఇబ్రాహీం చనిపోయిన సంవత్సరమే సూర్యగ్రహణం పట్టింది. కొందరి మనస్సుల్లో ఇది హజ్రత్ ఇబ్రాహీం మరణంవల్లనే సంభవించిందనే తలంపు వచ్చింది.

అయితే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ఈ విషయం తెలియగానే ఇలా ప్రవచించారు.

" ఏ ఒక్కరి చావు వల్లనో పుట్టుక వల్లనో సూర్యగ్రహణం పట్టదు. ఇది అల్లాహ్ సూచన మాత్రమే."

## ప్రళయదిన జ్ఞాపకం

ఈ ప్రపంచ వ్యవస్థ ఏ విధంగానైతే నడుస్తోందో అందులో ఎప్పుడైనా పూర్తిమార్పు వచ్చేస్తే ప్రళయం (ఖియామత్) వచ్చేస్తుంది. కాని ఆ ప్రళయానికి ముందే అప్పుడప్పుడు చిన్నా పెద్దా మార్పులు వస్తుంటాయి. అప్పుడు విశ్వాసి (మోమిన్) హృదయంలో ఆ ప్రళయభీతి చోటు చేసుకుంటుంది. వెంటనే అతడు దానికోసం సిద్ధపడతాడు. కాబట్టి మహాప్రవక్త (సఅసం), ఆయన సహాబీలు (రజిఅన్) కూడా అలానే భీతిగొనేవారు. వర్షం జోరుగాకురుస్తున్నా, ఉరిమినా, తీవ్రంగా వీచినా సూర్యగ్రహణం లేక చంద్రగ్రహణం పట్టినా, వేళకానివేళ ఆకాశంపై మబ్బు తునకలు కనపడినా అన్ని సమయాల్లోను, వారి హృదయాల్లో ప్రళయదిన భావమే చోటు చేసుకునేది. ఈ సూచనలే ప్రళయానికి నాంది అవుతాయేమో అని భీతిల్లేవారు. సూర్యగ్రహాన్ని చూసి దైవప్రవక్త ఎలా ప్రతిస్పందించేవారో దాన్ని హజ్రత్ అబూ మూసా అష్అరీ ఇలా వివరిస్తున్నారు.

"ఓసారి సూర్యగ్రహణం పట్టింది. అప్పుడు మహాప్రవక్త (సఅసం) భయం భయంగా, ప్రళయం వస్తుందేమో అనేభావంతో మస్జిద్‌కు వెళ్ళారు. అక్కడ ఆయన రెండు రకాఅత్‌ల సుదీర్ఘమైన నమాజు చదివారు. అంతకు ముందు ఆయన (సఅసం) ఇంత సుదీర్ఘమైన నమాజు చదవలేదు." (బుఖారి, ముస్లిం)

## నమాజె ఖుసూఫ్ ఎలా చేయాలి

నమాజె కసాఫ్ చేసే విధానం ఏమిటంటే ముస్లింలు మస్జిద్‌లో సమావేశమై రెండు రకాత్‌లు జమాఅత్‌తో చదవాలి. ఈ రెండు రకాత్‌లలోను పొడవాటి సూరాలు చదవాలి. ఉదా: సూరాయె బఖరా, ఆలి ఇమ్రాన్ మొదలైనవి. ఇదేవిధంగా రుకూ సజ్దాల్లోను చాలాసేపు ఉండాలి. మహాప్రవక్త (సఅసం) సూర్యగ్రహణమప్పుడు చదివిన సుదీర్ఘమైన నమాజులాంటి నమాజు అంతకు ముందు ఆయన చదివినట్లు మేమూ చూడలేదన్నారు సహాబీలు. సూర్యగ్రహణం విడిచేవరకు ఇమామ్ బిగ్గరగా దుఆ చేస్తూనే ఉండాలి. ముక్తదీలు ఆమీన్ అంటూనే ఉండాలి.

**ముఖ్య సూచనలు:** 1. నమాజె కసౌఫ్‌లో ఖిరాత్ మెల్లగా చేయడం ఉత్తమం.

ఎవరైనా బిగ్గరగా చదివినా ఫరవాలేదు. 2. నమాజె కసోఫ్‌లో అజాన్, ఇఖామత్‌లు లేవు. అయితే ప్రజలను పిలవడానికి నమాజు కోసం ప్రకటన చేయవచ్చు. మహాప్రవక్త (సఅసం) అలా ప్రకటన చేయించారు. 3. ఏదైనా ఫర్జ్ నమాజు వేళ అయినా, మక్రూహ్ వేళ అయినా వస్తే నమాజ్‌ని, దుఆని ఆపివేయాలి.

## నమాజె ఖుసూఫ్

చంద్రగ్రహణం పట్టినప్పుడు చదువబడే నమాజ్‌ని నమాజె ఖసోఫ్ అంటారు. ఈ నమాజులోనూ రెండు రకాత్‌లు చదవడం సున్నత్. కాని దీనికోసమని జమాఅత్ అవసరం గాని, మస్జిద్‌కు వెళ్ళి చదువవలసిన పనిగాని లేదు. ఎవరి ఇళ్ళలో, వారు వేరు వేరుగా చదవడమే సున్నత్. నమాజె ఖసోఫ్ బిగ్గరగాను, మెల్లగాను చదువబడుతుంది. బిగ్గరగా చదవడమే ఉత్తమం.

## నమాజె ఇస్తిస్ఖా

ఇస్తిస్ఖా అంటే నీటి కోసం యాచించడం. అంటే వర్షం అవసరం ఉన్నప్పుడు అది కురవ కుండా ఉంటే అప్పుడు రెండు రకాత్‌ల నమాజ్ చేసి అల్లాహ్‌ను వర్షం కోసం వేదు కోవడం అన్నమాట. ఇది సున్నత్. మహాప్రవక్త (సఅసం) నమాజె ఇస్తిస్ఖాను అందరూ వినేటట్లు బిగ్గరగా చదివారు (బుఖారి, ముస్లిమ్), షరీఅత్‌లో దీన్ని నమాజె ఇస్తిస్ఖా అంటారు.

## నమాజె ఇస్తిస్ఖా విధానం

నమాజె ఇస్తిస్ఖా చేసే అవసరం ఏర్పడినప్పుడు దీన్ని గురించిన ప్రకటన చేయిం చాలి. ప్రజలంతా తమ వద్దనున్న అల్పమైన దుస్తులు ధరించి కడు దీన వదనులై ఏదో ఓ మైదాన ప్రదేశంలోనో లేక ఈద్‌గాహ్‌కో చేరుకోవాలి. ఆ పట్టణపు ఇమామ్ రెండు రకాత్‌ల నమాజ్ బిగ్గరగా చదివించిన తరువాత ఎత్తయిన ప్రదేశం (మెంబర్ లాంటి చోటు)లో నిలబడి బిగ్గరగా దుఆ చేయాలి. ముక్తదీలంతా ఆమీన్ అనాలి. ఒకవేళ కేవలం దుఆ మట్టుకే చేస్తే అది కూడా మహాప్రవక్త (సఅసం) ఆచారంలోనిదే.

## దుఆ ఇలా చేయాలి

దుఆ పూర్తి ఏకాగ్రతతో నమ్రత ఉట్టిపడేలా చేయాలి. మొదట తమ పాపాలను క్షమించమని, ఆ తరువాత వర్షాన్ని కురిపించమని అల్లాహ్‌ను వేడుకోవాలి. మహాప్రవక్త (సఅసం) ఈ విధంగానే దుఆ చేసేవారు. ఆయన దుఆలో ఈ క్రింది పదజాలం ఉండేది.

అల్లాహుమ్మ అస్ఖినా గైసమ్ ముగీసమ్ మరీ అమ్ మరీ అన్నాఫిఅన్ గైరజా(రిన్ ఆజిలన్ గైరఆజిలిన్ అల్హమ్దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అ(రహ్మా ని(రహీం మాలికి యౌమిద్దీన్. లాఇలాహ ఇల్లల్లాహు యఫ్ అలుమాయురీద్. అల్లాహుమ్మ లా ఇలాహ ఇల్లా అంతల్ గనియ్యు వ నహ్నుల్ ఫుఖరాఉ అన్జిల్ అలైనల్ గైసవజ్ అల్మా అన్జల్త లనా ఖూతంవ్వబలాగన్ ఇలాహీన్.

اَللّٰهُمَّ اَسْقِنَا غَيْثًا مُّغِيْثًا مَّرِيْئًا مَّرِيْعًا نَّافِعًا غَيْرَ ضَارٍّ عَاجِلًا غَيْرَ اٰجِلٍ اَلْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعَالَمِيْنَ ۝ اَلرَّحْمٰنِ الرَّحِيْمِ مَالِكِ يَوْمِ الدِّيْنِ ۝ لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ يَفْعَلُ مَا يُرِيْدُ ۝ اَللّٰهُمَّ لَآ اِلٰهَ اِلَّآ اَنْتَ الْغَنِيُّ وَنَحْنُ الْفُقَرَآءُ اَنْزِلْ عَلَيْنَا الْغَيْثَ وَاجْعَلْ مَآ اَنْزَلْتَ لَنَا قُوَّتًا وَّبَلَاغًا اِلٰى حِيْنٍ

అర్థం: ఓ అల్లాహ్! మాపై వర్షం కురిపించు. ఆ వర్షం మా అవసరాలకు సరిపోయేదిగా, ఎండిపోయిన భూమిని జలమయం చేసేదిగా, ఎండిన చేలను సస్య శ్యామలం చేసేదిగా, లాభదాయకమైనదిగా, నష్టం కలిగించనిదిగా చెయ్యి. ఇది చాలా త్వరగా కురిసేదిగా చెయ్యి ఆలస్యం అయ్యేదిగా చెయ్యకు. ఓ అల్లాహ్! నీవు తప్ప ఎవ్వడూ యజమాని కాడు. నీవే సమస్తం కలిగిన వాడవు. మేము యాచకులం. మాపై వర్షాన్ని కురిపించు. నీవు కురిపించే వర్షం మాకు ఉపాధికి మూలం అయ్యేదిగా, కొన్ని రోజుల వరకు మాకు అవసరం అయ్యేదిగా చెయ్యి."

ఈ దుఆ పదాలను ఖుత్బాలో కూడా చేరిస్తే మరీ మంచిది. మహా(ప్రవక్త (సఅసం) ఖుత్బా (ప్రసంగం)లో వీటిని పలికారు ఇక వర్షం కురువనారంభించినప్పుడు ఈ దుఆ చదవాలి. అల్లాహుమ్మ సయ్యెబన్నాఫియా."

اَللّٰهُمَّ صَيِّبًا نَّافِعًا

అర్థం: ఓ అల్లాహ్! బాగా వర్షం కురిపించు. అయితే ఈ వర్షం మాకు లాభదాయకమైందిగా చెయ్యి.

## దుప్పటిని త్రిప్పి కప్పుకోవడం

దివ్య ఖుర్ఆన్, హదీసుల జ్ఞానం ఉన్న వ్యక్తి ఎవరైనా నమాజు చదివిస్తే తాను పైన కప్పుకున్న దుప్పటిని ఖుత్బా ఇవ్వడానికి ముందు లేక ఖుత్బా ఇచ్చిన తరువాత త్రిప్పి కప్పుకోవాలి. ఇలా దుప్పటిని త్రిప్పడం అంటే, ప్రస్తుతం ఉన్న పరిస్థితికి పూర్తిగా భిన్నమైన పరిస్థితి నెలకొల్పమని యాచించడం అన్నమాట.

## వ్యాధి - మరణం

ఇస్లామి షరీఅత్‌లో ఏ విధంగానైతే జీవితానికి సంబంధించిన సూచనలు ఇవ్వబడ్డాయో అదే విధంగా వ్యాధికి, మరణానికి సంబంధించిన వివరణలు, సూచనలు కూడా ఇవ్వబడ్డాయి.

## ఇయాదత్ (రోగి పరామర్శ)

రోగిని చూడబోవడం, అతనికి సహాయ సహకారాలందించడాన్ని షరీఅత్ పరిభాషలో 'ఇయాదత్', అంటారు. ప్రపంచంలో ఏ ఒక్కడూ ఎప్పుడూ రోగానికి గురి కాకుండా ఉండడు. కాబట్టి ఇస్లామ్‌లో రోగిని పరామర్శించమని గట్టిగా తాకీదు చేయ బడింది. ఒక ముస్లింకు తన సోదరుని పరామర్శే కాదు ఇరుగుపొరుగులో, తన వాడలో ఎవరైనా వ్యాధికి గురిఅయినా, అతడు ముస్లిమ్ అయినా, ముస్లిమేతరుడైనా, పేదవాడైనా, ధనికుడైనా అతని పరామర్శకు తప్పకవెళ్ళాలి. మహాప్రవక్త (సఅసం) ఖుద్దుగా మునాఫికుల (కపటుల), యూదుల పరామర్శకు కూడా వెళ్ళేవారు. వాళ్ళంతా మహా ప్రవక్తకు శత్రువులయినాసరే.

అయితే ఓ ముస్లిమ్‌కు మరో ముస్లిమ్ యొక్క ఇయాదత్ చేయడం, అత్యవసరం. మహాప్రవక్త (సఅసం) ఒక హదీసులో ఓ ముస్లిమ్‌పై మరో ముస్లిమ్‌కు ఆరు హక్కులున్నా యని అన్నారు. వాటిలో రెండు ఇవి: ఒకటి, అతడు వ్యాధికి గురి అయినప్పుడు అతని ఇయాదత్ (పరామర్శ)కు వెళ్ళడం. రెండు, అతడు చనిపోతే అతని జనాజా నమాజ్‌లో పాల్గొనడం (బుఖారి, ముస్లిమ్). హజ్రత్ అయిషా (రజిఅన్) ఇలా చెబుతున్నారు: "మాలో ఎవరైనా వ్యాధికి గురి అయినప్పుడు మహాప్రవక్త (సఅసం) తమ కుడిచేతిని రోగి శరీరంపై త్రిప్పి ఈ దుఆ చదివేవారు."

దుఆ : "అజ్‌హిబిల్ బాస రబ్బన్నాసి వష్ఫి అంతష్షాఫీ లాషిఫాఅ ఇల్లాషిఫాఉక షిఫా అఁల్లాయు గాదిరుసఖ్మా."
(బుఖారి, ముస్లిమ్)

اَذْهِبِ الْبَاْسَ رَبَّ النَّاسِ وَاشْفِ اَنْتَ الشَّافِيْ لَا شِفَاءَ اِلَّا شِفَاؤُكَ شِفَاءً لَّا يُغَادِرُ سَقَمًا

**అర్థం :** ఓ ప్రభూ! ఈ బాధను దూరం చెయ్యి. స్వస్థత చేకూర్చు. నీవే స్వస్థతను చేకూర్చేవాడవు. ఏలాంటి వ్యాధి మిగలకుండా ఉండేటటువంటి స్వస్థత చేకూర్చు.

అప్పుడప్పుడు ఆయన ఈ దుఆను కూడా చేసేవారు:

"లాబాస అలైక తహూరన్ ఇన్షా అల్లాహ్"

لَا بَأْسَ عَلَيْكَ طَهُوْرٌ اِنْ شَآءَ اللّٰهُ

**అర్థం :** "భయపడకు. దైవచిత్తమయితే ఈ వ్యాధి నీ పాపాలను కడిగివేస్తుంది" (బుఖారి, ముస్లిమ్)

వ్యాధిగ్రస్తుడు తనకై తాను ప్రార్థించుకుంటే ఈ పదాలను వాడాలి.

"అల్లాహుమ్మ అష్ఫినీ షిఫా అఁవ్వలా యుగాదిరుసఖ్మా"

اَللّٰهُمَّ اَشْفِنِيْ شِفَآءً وَّلَا يُغَادِرُ سَقَمًا۔

**అర్థం :** ఓ అల్లాహ్ వ్యాధికి సంబంధించినది ఏ మాత్రం నాలో మిగలకుండా నాకు స్వస్థత చేకూర్చు.

ఇయాదత్ అంటే కేవలం రోగిని పరామర్శించటానికి పోవడమే కాదు. ఇయాదత్‌లో రోగి మంచి చెడులను చూడడం కూడా ఉంది. ఉదా: మందులు తెచ్చి ఇవ్వడం, అతనికి సుశ్రూషలు చేయడం అతని దగ్గర కూర్చుని మంచి మంచి మాటలు చెప్పి అతనికి ఊరట కలిగించడం కూడా ఇయాదత్.

## ఇయాదత్ మర్యాదలు

1. వ్యాధిగ్రస్తుని దగ్గరికి పోయినప్పుడు అతని దగ్గర కూర్చోవాలి. అతని తలపై చేయిపెట్టడమో లేక అతని చెయ్యిని తన చేతిలోనికి తీసుకునే అతని క్షేమం అడగాలి. 2. సాధ్యమైనంత వరకు రాత్రి వేళలో ఇయాదత్‌కు పోకూడదు. 3. రోగి కూర్చుని ఉండమని చెప్పనంత వరకు చాలా సేపటి వరకు అతని దగ్గర కూర్చోకూడదు. 4. ఇయాదత్‌కు పోయినప్పుడు రోగి ఇంటిలో అటుఇటు దృష్టిని సారించకూడదు.

## అవసాన కాలం

ఇంత వరకు చెప్పింది సాధారణ వ్యాధి గురించి. కాని ఏ ముస్లింకైనా అవసాన కాలం దాపరిస్తే అతణ్ణి పరామర్శించడమే కాకుండా ఇంకొన్ని విషయాల్ని దృష్టియందుంచుకోవాలి.

ఎప్పుడయితే ఇక మరణం సంభవిస్తుంది అని పూర్తిగా నమ్మకం కుదురుతుందో ఆ చనిపోయే వ్యక్తి దగ్గర కూర్చుని ఖుర్‌ఆన్‌ను పఠించాలి. 'యాసీన్' సూరాను చూచిగాని లేక కంఠోపాఠమయితే చూడకుండా కాని పఠిస్తే మంచిది. మహాప్రవక్త (సఅసం) చనిపోయేవాని దగ్గర యాసీన్ సూరాను పఠించమని సెలవిచ్చారు. చనిపోయేవారి దగ్గర కూర్చుండేవారు అతని చెవుల దగ్గరగా కలిమ (సద్వచనం) "లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్" చదువుతూ ఉండాలి. కారణం, దాన్ని విని అతడు కూడా కలిమా చదవాలని, తద్వారా అతని అంతం విశ్వాసిగా అవ్వాలని, ఒకవేళ తనే కలిమా పఠిస్తూ ఉంటే ప్రక్కనున్నవారు చదవనవసరం లేదు. కాని మాటి మాటికి కలిమా పఠించు అని బలవంతం పెట్టకూడదు. కారణం ఏమిటంటే ప్రాణంపోయే సమయం ఎంతో క్లిష్టమయిన సమయం-ఆ సమయంలో బాధ భరించక అతడు చిరాకుపడి తిరస్కరించవచ్చు. అలా తిరస్కరిస్తూ ప్రాణంపోవడం సరైనది కాదు. ఇదేవిధంగా ఇతని దాపున కూర్చున్న వారు అతని కోసం దుఆ చేస్తూ ఉండాలి. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. "ఆ సమయంలో ఎవరైనా దుఆ చేస్తే దానికి దైవ దూతలు 'ఆమీన్' అని అంటారు. (మిష్కాత్)

## ప్రాణం పోయిన తరువాత

చనిపోయేవాని ప్రాణం పోయిన తరువాత వెంటనే అతని అవయవాలను సరిచేయాలి. అంటే కాళ్ళు చేతులు సరిగా ఉండాలి. కళ్ళు మూసేయాలి. ఆ తరువాత కళ్ళు మూసివేస్తూ అతని పేరు పెట్టి దుఆ పఠించాలి.

اللهم اغفر لفلان وارفع درجته في المهتدين وافسح له في قبره ونور له فيه

"అల్లాహుమ్మగ్ఫిర్‌లి ఫలానిన్ వర్ ఫ అదరజతున్ ఫిల్ ముహ్తదీన వఫ్సహ్ లహూ ఫీ ఖబరతిన్ వనూర లహూ ఫీహి." ('ఫలానిన్' అన్నచోట అతని పేరును ఉచ్చరించాలి). (ముస్లిమ్, అబూదావూద్)

అతని రెండు కాళ్ళు నిటారుగా ఉండడానికి, నోరు తెరుచుకొని ఉండకుండా, మొదట ఓ గుడ్డ పేలకతో అతని రెండు కాళ్ళబొటన వ్రేళ్ళను, ఆ తరువాత మరో గుడ్డ పీలికను అతని గడ్డం క్రింది నుంచి తీసి తలపై ముడివేయాలి. ఆ తరువాత ఓ దుప్పటితో అతని పూర్తి శరీరాన్ని కప్పివేయాలి.

## మరికొన్ని ముఖ్య విషయాలు

1. చనిపోయిన తరువాత ఏదైనా సువాసన పదార్థాన్ని ముట్టించి అతని దాపున ఉంచాలి. అగరువత్తులు, సాంబ్రాణీ వగైరాలు. 2. గుసుల్ చేయవలసిన అవసరం ఉన్న పురుషులు, రుతుస్రావంలో ఉన్న స్త్రీలు అతని దరికి పోకూడదు. 3. చనిపోయి నప్పటినుండి, శవాన్ని గుస్ల్ చేయించే అంతవరకు దాని దగ్గర కూర్చుని ఖుర్‌ఆన్ వగైరాలు పఠించకూడదు. ఇది మక్రూహ్.

## గుస్ల్ మరియు కఫన్

ప్రాణం పోయిన వెంటనే అతణ్ణి ఖననం చేసే ప్రయత్నం జరగాలి. దఫన్ (ఖననం) చేయడంలో, అతని జనాజాలో చాలామంది పాల్గొంటారనే ఉద్దేశ్యంతో ఆలస్యం చేయకూడదు. అయితే అతి దగ్గరి బంధువుల కోసం కొంచెం వేచి ఉండడంలో తప్పులేదు.

## గుస్ల్ నీరు

శవానికి స్నానం చేయించే (గుస్ల్) నీరు గోరువెచ్చగా ఉండాలి. అందులో రేగు ఆకులు వేసి కొంచెం కాస్తే మరీ మంచిది. అయితే మరీ వేడి నీటితో గుస్ల్ ఇవ్వకూడదు. గోరువెచ్చగా ఉండాలి.

## గుస్ల్ చేయించే విధానం

మొదట శవాన్ని ఏదైనా గట్టి వస్తువు ఉదా: బల్ల బెంచీ, చక్క, లేక గట్టి ప్రదేశంపై పరుండబెట్టాలి. అతని బట్టలు తీసేసి కేవలం ఓ లుంగీ మాత్రమే కట్టాలి. ఆ తరువాత ఇస్తెంజా చేయించాలి. అంటే స్నానం చేయించే వ్యక్తి తన చేతికి ఓ గుడ్డ చుట్టుకొని శవం లుంగీ లోపల చేయివేసి అతని మలమూత్ర ప్రదేశాలను కడగాలి. ఆ తరువాత వుజూ చేయించాలి. వుజూ చేయించేటప్పుడు ముక్కులోగాని, నోటిలోగాని నీరు పోనివ్వకూడదు సరికదా స్నానం చేయించేటప్పుడు అతని ముక్కు, నోటిలోగాని నీరు పోకుండా ఉండేందుకు పరిశుభ్రమయిన దూదిని ఉంచాలి.

అయితే ఎవరి గురించైనా, అతడు చనిపోయేటప్పుడు, గుస్ల్ చేయవలసి ఉన్న పరిస్థితిలో ఉన్నాడని, స్త్రీ అయితే ఆమె రుతుస్రావంలోను, ప్రసూతి స్రావంలోనూ ఉన్నదని తెలిస్తే అలాంటి శవాల ముక్కుల్లోను, నోళ్ళల్లోను మెల్లమెల్లగా నీరు పోనివ్వాలి.

వుజూ అయిన తరువాత శవం తలను బాగా సబ్బుతోగాని కుంకుళ్ళతోగాని రుద్ది కడగాలి. తరువాత మయ్యత్‌ను ఎడమ ప్రక్కకు వత్తిగిల చేసి కుడిపార్శ్వంపై తల నుండి కాళ్ళ వరకు మూడుసార్లు నీటిని పోయాలి. అదేవిధంగా కుడి ప్రక్కకు వత్తిగిల చేస్తూ ఎడమ పార్శ్వంపై ఆ ప్రకారంగానే మూడుసార్లు నీరు పోయాలి. నీరుపోస్తూ మెల్లగా రుద్దడం కూడా చేయాలి. ఇప్పుడు గుస్ల్ పూర్తి అయినట్లే, ఇప్పుడు మయ్యత్ (శవం) లుంగీని తీసివేసి మరో లుంగీని తొడగాలి (కట్టాలి). అక్కడి నుండి ఎత్తుకొని మరో చోటకు తీసుకొని వచ్చి కఫన్ తొడగాలి. మయ్యత్ శరీరాన్ని కపన్ తొడిగే ముందు తుడిచి పొడి చేయాలి. ఎవరైనా పురుషుడు చనిపోయి, అతనికి స్నానం చేయించడానికి పురుషులెవరూ అక్కడ లభ్యం కాని సందర్భంలో అతని భార్య అతడికి గుస్ల్ ఇవ్వవచ్చు. భార్య తప్ప మరే స్త్రీ గుస్ల్ ఇవ్వకూడదు. ఇంకా మహ్రమ్ (నికాహ్‌కు నిషేధించబడిన) స్త్రీ అయినా గుస్ల్ ఇవ్వడానికి వీలులేదు. ఒకవేళ భార్యకూడా లేకపోతే 'ఆ మయ్యత్'కు తయుమ్మమ్ చేయించాలి. అప్పుడైనా మయ్యత్ (శవం)ను ఆ స్త్రీ తాకకుండా చేతికి గ్లౌజుల్లాంటివి తొడుక్కోవాలి. ఒకవేళ ఎవరి భార్య అయినా చనిపోతే భర్త ఆమెకు గుస్ల్ ఇవ్వడం సరైనది కాదు. అయితే అతడామెను చూడవచ్చు, బట్టల పైనుండి తాకవచ్చు. ఇతర ఇమామ్‌ల వద్ద ఇది ధర్మసమ్మతమే (సరైనదే).

## పురుషుల కఫన్

పురుషుల కోసం మూడు వస్త్రాలు కావాలి. ఒకటి చాదర్ (దుప్పటి) రెండు తహ్‌బంద్ (లుంగి) మూడు చొక్కా. చాదర్‌ను అఫాఫా అని, తహ్‌బంద్‌ను ఇజార్ అని, కుర్తాను కమీజ్ లేక కఫ్నీ అని కూడా అంటారు. చాదర్ నిడివి మనిషి నిడివికంటే ఒక మూర ఎక్కువగా ఉండాలి. వెడల్పు ఆ మయ్యత్ శరీరం అందులో చుట్ట వీలైనంత ఉండాలి. ఇదే విధంగా ఇజార్ వెడల్పు చాదర్ వెడల్పు అంతే ఉండాలి. అయితే దాని పొడవు చాదర్ పొడవుకంటే ఒక జానెడు తక్కువగా ఉండాలి. ఇక కుర్తా (కమీజ్ లేక కఫ్ని) కోసం చింపే గుడ్డ వెడల్పు మాత్రం చాదర్ లేక ఇజార్ అంటే ఉండాలి. కాని పొడవు మాత్రం మొడ నుండి తొడల వరకు వెనుకా ముందూ కప్పేటట్లు ఉండాలి. ఈ గుడ్డను మధ్య నుండి అందులో తల దూరేంత చించాలి. దీన్నే కుర్తా అంటారు.

ఇది కఫన్‌కు కావలసిన వస్త్రం. గుస్ల్ ఇవ్వడానికి తహ్‌బంద్, దస్తానా (గ్లౌజ్) కావాలి. గ్లౌజ్ చేతికి ధరించాలి, ఇస్తెంజా వగైరాలు చేయించడానికి. ఈ విధంగా పురుషుని కఫన్ కోసం పన్నెండు గజాల వస్త్రం సరిపోతుంది.

## స్త్రీల కఫన్

స్త్రీల కఫన్‌లో ఈ మూడు వస్త్రాలకు ఇంకా రెండు ముక్కలు అదనంగా కావాలసి ఉంటుంది. ఒకటి సర్‌బంద్ (తలగుడ్డ) రెండోది సీనాబంద్ (ఛాతిపై భాగాన్ని కప్పేగుడ్డ). సీనాబంద్ వెడల్పు ఇజార్ వెడల్పు అంత ఉండాలి. కాని పొడవు మాత్రం చంక నుండి మోకాలి వెడల్పు అంత ఉండాలి. సర్‌బంద్ కోసం ఓ గజం కంటే కొంత తక్కువ వెడల్పు, ఓ గజం కంటే కొంత ఎక్కువ పొడవు అవసరం.

స్త్రీ శవానికి గుస్ల్ ఇవ్వడానికి తహబంద్ దస్తానాలే కాకుండా పరదా కోసం ఓ చాదర్ (దుప్పటి) కూడా కావలసి ఉంటుంది. అయితే అది కొత్తదే కావాలన్న నియమం లేదు.

స్త్రీల కఫన్ కోసం 'పరాదా చాదర్' అందులోనుండి తీసుకొనకపోతే పద్దెనిమిది, పందొమ్మిది గజాలు సరిపోతాయి. ఒకవేళ చాదర్ కూడా కఫన్ వస్త్రాల నుండే తీస్తే మొత్తం ఇరవై ఒకటి లేక ఇరవై రెండు గజాలు కావలసి వస్తుంది.

**సూచన:** ఒకవేళ పరుషులను రెండు గుడ్డలలోను, స్త్రీలను మూడింటిలోనే కఫన్ తొడిగి ఖననం (దఫన్) చేసినా అది ధర్మసమ్మతమే. కాని అంతకంటే తక్కువ వస్త్రంలో ఎలాంటి అనివార్య పరిస్థితి లేనప్పుడు ధర్మసమ్మతం కాదు.

## కఫన్ తొడిగించే విధానం

కఫన్ తొడిగించే విధానం ఏమిటంటే మొదట ఏదైన శుభ్రంగా ఉన్న మంచంగాని, బల్లగాని లేక చాపగాని తెచ్చి దానిపై కఫన్ ఇచ్చేందుకు తీసిన చాదర్‌ను పరచాలి. దానిపై ఇజార్ ఇస్త్రాన్ని పర్చాలి. దానిపై చొక్కా యొక్క సగభాగం పరిచి మిగిలిన సగభాగం చుట్టి తలాపున ఉంచాలి. ఆ తరువాత మయ్యత్‌ను గుస్ల్ బల్లపైనుండి ఎత్తుకొనివచ్చి ఆ పరిచిన గుడ్డలపై పరుండబెట్టాలి. ఆ తరువాత చొక్కా యొక్క ఏ భాగం అయితే చుట్ట ఉంచ బడిందో ఆ భాగంలోని రంధ్రంలో మయ్యత్ తలను దూర్చి ఆ చుట్టిన గుడ్డను అతని మర్మాంగాల పైవరకు పర్చేయాలి. ఆ తరువాత తహబంద్ (లుంగీ)ను తీసివేసి ఇజార్ చాదర్‌ను మొదట ఎడమ భాగాన్ని, తరువాత కుడిభాగాన్ని చుట్టేయాలి. ఇదే విధంగా చాదర్‌ను కూడా చుట్టాలి. చాదర్ యొక్క రెండు చివరలను విడిపోకుండా గుడ్డ పేలికలతో

కట్టేయాలి. స్త్రీల కఫన్‌లో కుర్తా తొడిగించిన తరువాత ఆమె తల వెంట్రుకలను రెండు భాగాలుగా విడదీసి ఆమె రొమ్ముపై వేయాలి. తరువాత సర్‌బంద్ (తలగుడ్డ) వాటిపై వేయాలి. దాని తరువాత ఇజార్‌ను చుట్టి సీనాబంద్‌ను చుట్టికట్టేయాలి. ఆ తరువాత చాదర్‌ను చుట్టాలి.

## ముఖ్య గమనిక

1. కఫన్‌పైనా, మయ్యత్ నొసటిపైనా, సజ్దాలో భూమిపై తాకే అవయవాలపైన హారతి కర్పూరం వగైరాలను రుద్దడం మంచిది. 2. మయ్యత్‌కు గుస్ల్ ఇవ్వడానికి ఇంటిలోని పరిశుభ్రమయిన ఏ పాత్రనుగాని, వస్త్రాన్ని గాని ఉపయోగిస్తే తప్పులేదు. 3. కఫన్ కోసం ఉపయోగించే వస్త్రం మరీ విలువైనదిగా ఉండకూడదు.

## నమాజె జనాజా

'జనాజా' అంటే శవం లేక మయ్యత్. జనాజా అంటే శవాన్ని పరుండబెట్టి గుస్ల్ ఇచ్చే చెక్క లేక బల్ల లేక మయ్యత్‌ను ఎత్తుకొని వెళ్ళే పెట్టెలాంటి సాధనం. మయ్యత్ మన్నింపు (మగ్ఫిరత్) కోసం ఏ నమాజైతే చేయబడుతుందో దాన్నే జనాజా నమాజ్ అంటారు.

## జనాజా నమాజ్ ఆదేశం

జనాజా నమాజ్ చేయడం ఫర్జె కిఫాయా, ఊళ్ళో ఉండే కొందరు చేసి మరి కొందరు ఆ నమాజును చేయకపోయినా అందరిపై ఉన్న ఆ సమిష్టి బాధ్యత తీరుతుందని అర్థం. కాని ఏ ఊరిలోనైనా ఎవ్వరూ ఆ మయ్యత్ యొక్క జనాజా నమాజ్ చేయకపోతే అందరూ పాపం చేసిన వారి క్రిందే జమ అవుతారు. అయితే విషయం తెలిసినా, ఎలాంటి అవాంతరాలూ లేకుండా ఉన్నా నమాజులో మాత్రం అందరూ తప్పక చేరవలసిందే. విషయం తెలియకపోతే మాత్రం అతనిపై తప్పు ఉండదు.

## జనాజా నమాజ్ షరతులు

జనాజా నమాజ్ సరి అయింది అనడానికి రెండు షరతులు ఉన్నాయి. ఒకటి నమాజు చేసే వాళ్ళకు సంబంధించింది. రెండవది మయ్యత్‌కు సంబంధించింది.

1. జనాజా నమాజ్ చేసేవారు, ఇతర సాధారణ నమాజులకు అవసరమయిన అన్ని షరతుల్ని పాటించాలి. అయితే రెండు విషయాల్లో మాత్రం భేదం ఉంది. అదేమి

టంటే ఇతర నమాజులు తప్పిపోయే భయం ఉంటే తయమ్ముమ్ చేయడానికి వీలుండదు. కాని జనాజా నమాజ్ తప్పిపోతుందని అనుకుంటే వెంటనే తయమ్ముమ్ చేసి ఆ నమాజులో పాల్గొనాలి. ఇతర నమాజుల్లో రుకూ, సజ్దాలు ఉంటాయి. కాని ఈ నమాజులో రుకూ, సజ్దాలు ఉండవు.

2. రెండో షరతు మయ్యత్‌కు సంబంధించింది: (1) చనిపోయినవాడు ముస్లిమ్ అయి ఉండడం. (2) మయ్యత్ పరిశుద్ధ స్థితిలో ఉండడం. (3) కఫన్ పరిశుద్ధంగా ఉండడం. (4) మయ్యత్ (శవం) సతర్ (దాచవలసిన శరీర భాగాలు) కప్పబడి ఉండడం (5) మయ్యత్, నమాజె జనాజా చదివేవారి ముందు నేలపైగాని, మంచంపైగాని ఉండడం. అది వాహనం పైన్నో బండిపైన్నో ఉంటే జాయెజ్ కాదు.

## జనాజా నమాజ్ చేసేవిధానం

జనాజా నమాజ్ ఈ విధంగా చేయాలి. ముందు నమాజు చేసే వారి పంక్తులు సరి చేయాలి. ఇద్దరు నుండి పదిమంది వరకయితే ఒకే పంక్తిగా నిలబడాలి. అంతకంటే ఎక్కువ మంది పాల్గొంటే మూడు, అయిదు లేక ఏడు వరుసల్లో నిలబడాలి. మొత్తానికి బేసి సంఖ్యలో వరుసలను కట్టాలి. దీని తరువాత ఇమామ్, "అల్లాహ్ కోసం నేను జనాజా నమాజ్ చదువుతున్నాను. ఈ మయ్యత్ మన్నింపు కోసం వేడుకొంటున్నాను" అని సంకల్పం చేయాలి. ఇతర ముక్తదీలంతా ఈ విధంగానే సంకల్పం చేయాలి. ఆ తరువాత ఇమామ్ బిగ్గరగా తక్బీరె తహ్రీమ (అల్లాహు అక్బర్) అనాలి. ముక్తదీలు మాత్రం మెల్లగా పలకాలి. ఆ తరువాత తమ రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి దించి, ఇతర నమాజుల్లో కట్టుకున్నట్లే చేతులు కట్టుకొని నిలుచోవాలి. ఆ తరువాత ఇమాం, ముక్తదీలు సనా చదవాలి. ఈ సనాలో 'వతఆల జద్దుక' తరువాత 'వజల్ల సనావుక' కూడా చదవాలి. సనా చదివిన తరువాత చేతులు పైకి ఎత్తకుండా ఇమామ్ బిగ్గరగాను, ముక్తదీలు మెల్లగాను అల్లాహు అక్బర్ అనాలి. ఆ తరువాత ఇతర నమాజుల్లో చదివే దురూద్ అందరూ మెల్ల గానే చదవాలి. ఆ తరువాత ఇమామ్ మరి ఒకసారి అల్లాహు అక్బర్ అనాలి. ముక్తదీలు కూడా మెల్లగా అల్లాహు అక్బర్ అని అనాలి. ఇప్పుడు కూడా చేతులు పైకెత్తకూడదు. దీని తరువాత, ఒకవేళ ఆ మయ్యత్ ప్రాజ్ఞతగలిగిన (పెద్దవారిది) వారిది అయితే ఇమామ్ మరియు ముక్తదీలు ఈ దుఆ మెల్లగా చదవాలి.

దుఆ :

అల్లాహుమ్మగ్‌ఫిర్ లిహయ్యినా, వమయ్యితినా, వషాహిదినా, వగాయిబినా వసగీరినా, వకబీరినా, వజకరినా, వ ఉన్సానా. అల్లాహుమ్మ మన్ అహ్‌యయితహూ మిన్నా ఫ అహ్‌యిహీ అలల్ ఇస్లామ్. వమన్ తవప్ఫైతహూ మిన్నా ఫతవప్ఫహూ అలల్ ఈమాన్. అల్లాహుమ్మ లా తహ్‌రిమ్‌నా అజ్‌రహూ వలా తజిల్లనా బఅదహూ."

اَللّٰهُمَّ اغْفِرْ لِحَيِّنَا وَمَيِّتِنَا وَشَاهِدِنَا وَغَائِبِنَا وَصَغِيْرِنَا وَكَبِيْرِنَا وَذَكَرِنَا وَاُنْثَانَا. اَللّٰهُمَّ مَنْ اَحْيَيْتَهٗ مِنَّا فَاَحْيِهٖ عَلَى الْاِسْلَامِ وَمَنْ تَوَفَّيْتَهٗ مِنَّا فَتَوَفَّهٗ عَلَى الْاِيْمَانِ. اَللّٰهُمَّ لَا تَحْرِمْنَا اَجْرَهٗ وَلَا تُضِلَّنَا بَعْدَهٗ

అర్థం: ఓ అల్లాహ్! మా సజీవుల్ని, మా నిర్జీవుల్ని, హాజరుగా ఉన్నవారిని, హాజరుగా లేని వారిని, మా చిన్న వారిని మా పెద్ద వారిని మా పురుషుల్ని, మా స్త్రీలను మన్నించు. ఓ మా ప్రభూ! మాలో ఎవరినైతే సజీవునిగా ఉంచుతావో అతణ్ణి ఇస్లాం ధర్మంపై సజీవంగా ఉంచు. ఇంకా ఎవరినయితే మృతునిగాజేస్తావో అతణ్ణి ఈమాన్ స్థితిపై (విశ్వాసంపై) గిట్టించు. ఓ అల్లాహ్ అతని ప్రతిఫలాన్ని అతనికి దక్కించు. అతని తరువాత మమ్మల్ని మార్గభ్రష్టుల్ని చేయబాకు.

హదీసుల్లో ఈ దుఆ కూడా ఉంది.

"అల్లాహుమ్మగ్ఫిర్ లహు వర్‌హమ్‌హు వ ఆఫిహీవ అఫుఅన్‌హు వఅక్రిమ్ నుజులహు వ వస్సి మద్‌ఖలహు వ వగ్సిల్ హుబిల్ మాఇ వస్సల్‌జి వల్‌బర్ది వనఖ్ఖిహీ మినల్ ఖతాయా కమా యునఖ్ఖస్ సౌబుల్ అబ్‌యజు మినద్దనసి వ అబ్దిల్‌హు దారన్ ఖైరమ్ మిన్ దారిహి వ అహ్‌లన్

اَللّٰهُمَّ اغْفِرْ لَهٗ وَارْحَمْهُ وَعَافِهٖ وَاعْفُ عَنْهُ وَاَكْرِمْ نُزُلَهٗ وَوَسِّعْ مَدْخَلَهٗ وَاغْسِلْهُ بِالْمَاءِ وَالثَّلْجِ وَالْبَرَدِ وَنَقِّهٖ مِنَ الْخَطَايَا كَمَا يُنَقَّى الثَّوْبُ الْاَبْيَضُ مِنَ الدَّنَسِ وَاَبْدِلْهُ دَارًا

خَيْرًا مِّنْ دَارِهٖ وَاَهْلًا
خَيْرًا مِّنْ اَهْلِهٖ وَزَوْجًا
خَيْرًا مِّنْ زَوْجِهٖ وَاَدْخِلْهُ
الْجَنَّةَ وَاَعِذْهُ مِنْ عَذَابِ
الْقَبْرِ وَعَذَابِ النَّارِ ۔

ఖైరమ్ మిన్ అహ్‌లిహి వ జౌజన్ ఖైరమ్ మిన్ జౌజిహీ వ అద్‌ఖిల్ హుల్ జన్నత వ అఇజ్‌హు మిన్ అజాబిల్ ఖబ్రి వఅజాబిన్నార్."

(ముస్లిమ్)

**అర్థం:** ఓ అల్లాహ్ ఇతణ్ణి మన్నించు, ఇతనిపై కనికరించు. ఇతణ్ణి క్షమించు. ఇతణ్ణి నీ సంరక్షణలోనికి తీసుకో. ఇతనికి మంచి నివాసాన్ని కల్పించు. ఇతని గోరీని విశాలంగా చెయ్యి. ఇతణ్ణి నీటితోను, మంచుతోను, వడగళ్ళతోను కడుగు. తెల్లని వస్త్రం మురికి నుండి ఎలా పరిశుభ్రంగా కడగబడుతుందో ఇతని తప్పిదాలను అలానే శుభ్రంగా కడుగు. ఇతనికి ప్రపంచ నివాస గృహంకంటే మిన్నయైన నివాస గృహాన్ని, అతని కుటుంబం కంటే మేలైన కుటుంబాన్ని, ఇక్కడి జీవన భాగస్వామినికంటే ఉత్తమమైన జీవన భాగస్వామిని ప్రసాదించు. ఇతణ్ణి స్వర్గంలో ప్రవేశింపజెయ్యి. గోరీలోని యాతనల నుండి, నరకయాతనల నుండి ఇతణ్ణి రక్షించు.

పై రెండు దుఆలను కలిపి చదివితే మరీ మంచిది. లేక హదీసులో వచ్చిన ఇతర దుఆలనైనా చదవాలి.

ఈ దుఆలు పెద్దలకు 'ప్రాజ్ఞులయిన వారికి) సంబంధించినవి. ప్రాజ్ఞతకు రాని బాలల కోసం ఈ దుఆ చదవాలి.

اَللّٰهُمَّ اجْعَلْهُ لَنَا فَرَطًا
وَّاجْعَلْهُ لَنَا اَجْرًا وَّذُخْرًا
وَّاجْعَلْهُ لَنَا شَافِعًا وَّ
مُشَفَّعًا ۔

"అల్లాహుమ్మ అజ్ అల్‌హు లనా ఫరతవ్వజ్ అల్‌హులనా అజ్‌రవ్ వ జుఖ్‌రఁవ్ వజ్ అల్‌హూలనా షాఫిఅఁవ్ వ ముషఫ్ఫఅ."

**అర్థం:** ప్రభూ! ఈ బాలుణ్ణి మా మన్నింపుకు ముందుగా పంపబడినవానిగా, ఒక సాధనంగా చెయ్యి. ఇతణ్ణి మాకోసం ప్రతిఫలంగాను, పరలోకపు సొత్తుగాను చెయ్యి. ఇంకా ఇతణ్ణి మా గురించి సిఫారసు చేసేవానిగా చెయ్యి. ఎవరి సిఫారసు అయితే స్వీకరించబడుతుందో ఇతణ్ణి అలాంటి సిఫారసు చేసేవానిగా చెయ్యి.

ఒకవేళ మయ్యత్ ప్రాజ్ఞతకురాని బాలికదైతే దుఆలో స్త్రీలింగ వాచకమయిన పదాలను పెట్టాలి. అవి ఇలా ఉన్నాయి:

'అజ్అల్హు' బదులు 'అజ్అల్హా', 'షాఫిఅన్'కు బదులు 'షాఫిఅతన్', 'ముషఫ్ఫఅ'కు బదులు 'ముషఫ్ఫఅహ్' అని చదవాలి.

ఈ దుఆ చదివిన తరువాత ఇమామ్ బిగ్గరగాను, ముక్తదీలు మెల్లగాను తక్బీరు పలకాలి. ఆ తరువాత ఇతర నమాజుల్లో సలాం చెబుతూ ముఖం తిప్పినట్లు అస్సలాము అలైకుమ్ వ రహమతుల్లాహ్ అంటూ కుడి ఎడమలకు ముఖం తిప్పాలి. ఈ నమాజు తరువాత ఇంకెలాంటి దుఆ చేయకూడదు.

నమాజె జనాజాలో రెండు విషయాలు ఫరజులు. ఒకటి నిలబడి నమాజె జనాజా చేయడం, రెండు నాల్గు తక్బీరులు పలకడం.

నమాజె జనాజా మరియు 'ఖబ్ర్' (గోరి)కు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు:

1. సమాధి ఎదురుగా చేతులెత్తి దుఆ చేయడంలో తప్పులేదు. మయ్యత్ మన్నింపు (మగ్ఫిరత్) కోసం చేతులెత్తి దుఆ చేయడమే ఉత్తమం. మహాప్రవక్త (సఅసం) ఇలా చేశారని ముస్లిమ్ హదీసులో ఉంది.

2. ఏ శిశువైతే ప్రాణంతో పుట్టి చనిపోతుందో అలాంటి శిశువు కోసం నమాజె జనాజా చదవాలి. ఆ శిశువుకు పేరు కూడా పెట్టాలి.

3. నమాజె జనాజా మస్జిద్ లోపలగాని, గోరీలకు ఎదురుగాబెట్టిగాని చేయడం మక్రూహ్. మస్జిద్ లోపల చేయడం ఎందుకు మక్రూహ్ అంటే అది బ్రతికి ఉన్నవాళ్ళు నమాజు చేసే స్థలం. ఇక గోరీకి ఎదురుగా ఎందుకు పెట్టి చేయకూడదు అనంటే ప్రజల హృదయాల్లో గోరీల ఔన్నత్యం, వాటి గౌరవం పెరగకుండా ఉండేందుకు. గోరీకి ఎదురుగా నమాజు చేయడమే మక్రూహ్ అయినప్పుడు, మరి గోరీలను ముద్దు పెట్టుకొనే వారు, వాటిపై దుప్పట్లు పరిచేవారు, వాటి ఎదురుగా కూర్చుని ఆ గోరీలో ఉన్న మృతుణ్ణి వేడుకునేవారు ఎంత పెద్ద తప్పిదం చేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. మహాప్రవక్త (సఅసం) అందరికంటే అధికంగా దైవానికి ప్రియులు. ఆయనే తన గోరీ దగ్గర ఇదంతా చేయకూడదని నిషేధించారు. అలాంటప్పుడు ఇతర గోరీల లెక్కాపత్రం ఏదైనా ఉందా?

4. జనాజా తీసుకొని నడిచేవారు కలిమా వగైరాలు చదివితే ఇతరులకు వినబడకుండా చదవాలి. బిగ్గరగా చదవడం మక్రూహ్.

## ఆత్మహత్య

ఆత్మహత్య చేసుకోవడం హరామ్. అయితే ఆత్మహత్య చేసుకున్నవాని నమాజె జనాజా చేయాలి. అతణ్ణి ఖననం కూడా చేయాలి. ఆత్మహత్య హరామ్ అయినందున సుప్రసిద్ధ తత్వవేత్తలు, మత నాయకులు ఇతరుల గుణపాఠం కోసం అలాంటి వ్యక్తి నమాజె జనాజాలో పాల్గొనకూడదని అంటారు. (షామి-కితాబుల్ జనాయెజ్)

5. మయ్యత్‌ను గోరీలో దించి కుడి పక్కపై తూర్పు గోడకు ఆనించి ముఖం ఖిబ్లావైపు ఉండేటట్లు పరుండబెట్టాలి. సాధారణంగా వెల్లకిలా పరుండబెట్టి అతని ముఖాన్ని ఖిబ్లా వైపు తిప్పి ఉంచుతారు. ఇది సున్నత్‌కు వ్యతిరేకమే అయినా మక్రూహ్‌గాని, గునాహ్‌గాని కాదు. మయ్యత్‌ను సమాధిలో దించేటప్పుడు 'బిస్మిల్లాహి వ అలా మిల్లతి రసూలుల్లాహ్' అనే దుఆ చదవాలి.

6. మట్టి ఇచ్చే విధానం ఏమనంటే రెండు చేతుల (దోసిలి)తో మట్టి ఎత్తి మూడు సార్లు సమాధిలో వేయాలి. మొదటిసారి 'మిన్‌హా ఖలఖ్నాకుమ్', రెండోసారి 'వ ఫీహానుయీ దుకుమ్', మూడవసారి మట్టివేసేటప్పుడు 'వ మిన్‌హానుఖ్రిజుకుం తారతన్ ఉఖ్రా' అని చదవాలి. అంటే అల్లాహ్ ఈ విధంగా అంటున్నాడు, "మేము మిమ్మల్ని ఈ మట్టితోనే సృజించాము. ఇందులోకే తిరిగి పంపుతాము. తిరిగి ప్రళయంనాడు ఈ మట్టి నుండే మిమ్మల్ని లేపుతాము" అని అర్థం.

7. దఫన్ (ఖననం) చేసిన తరువాత కొంతసేపు సమాధి తలాపున నిలబడి సూరయె బఖ్రాలోని ప్రారంభ ఆయత్‌లు, కాళ్ళ వైపున నిలబడి బఖ్రా సూరాలోని చివరి ఆయత్‌లు చదవాలి. కాని ఖననం చెయ్యడం పూర్తి అయినాకే అందరు కలిసి దుఆ చేద్దాం అని నిరీక్షించుకుంటూ నిలబడడం సబబుకాదు. ప్రతి ఒక్కరూ వేరువేరుగా 'దుఆయె మగ్ఫిరత్' (మన్నింపు కోసం దుఆ చేయాలి. అందరు కలిసిచేసినా తప్పులేదు.)

8. ఖబ్రస్తాన్ (ఖనన వాటిక)చేరి అర్థంపర్థం లేని మాటలు, ప్రాపంచిక విషయాలు మాట్లాడకూడదు. తమ మరణం గురించి ఆలోచిస్తూ మరణాన్ని ప్రతి ఒక్కరూ తమ కళ్ళకు ఎదురుగా చూస్తున్నట్లు భావించాలి. ఈ విధంగానే ప్రజలు ఒక రోజు తమను కూడా ఈ నిశ్శబ్ద ప్రదేశానికి తీసుకొని వస్తారని, తమను కూడా ఈ విధంగానే ఖననంచేసి వెళ్ళిపోతారని ఆ తరువాత తాము తాము చేసిన కర్మలే మిగిలి ఉంటాయని తలచుకోవాలి.

9. జనాజా వెంబడి స్త్రీలు వెళ్ళడం మక్రూహె తహ్రీమీ (అంటే హరామ్‌కు దరిదాపున గల విషయం).

10. ప్రజలు అధికంగా పాల్గొంటారనే ఉద్దేశంతో నమాజె జనాజా కోసం ఆలస్యం చేయడం మక్రూహ్.

11. జనాజాకు ముందు వాహనంపై అనుసరించడం (నడవడం) మక్రూహ్.

12. గోరీని మరీ ఎత్తుగా ఉంచకూడదు. ఒంటె వీపులా ఉంచి ఒక జానెడు ఎత్తుమట్టుకే తయారు చేయాలి. దాన్ని అరుగులా కూడా చేయకూడదు. ఇదే విధంగా గోరీని దృఢం (కాంక్రీటు వగైరాలు)గా కట్టగూడదు. దానిపై గుంబద్‌గాని, ఖుబ్బాగాని (గోపురం) కట్టడం హరామ్. మహాప్రవక్త (సఅసం) రౌజా ముబారక్ (గోరీని)ను కొన్ని ధార్మిక ఉద్దేశాలననుసరించి దీనికి భిన్నంగా ఉంచడం జరిగింది.

13. ఒకవేళ అనేక జనాజాలు ఉంటే ప్రతిదాని నమాజె జనాజా వేరువేరుగానే చేయాలి. ఒకేసారి చేసినా తప్పులేదు.

14. ఎవరైనా నమాజె జనాజాలో మొదటి తక్బీర్ అయిన తరువాత వచ్చి చేరితే అతడు నమాజ్ పూర్తి అయిన తరువాత సలామ్ తిప్పే ముందు తనకు అందని తక్బీర్‌ను పలికి సలామ్ తిప్పాలి. తప్పిపోయిన దుఆను చదవనవసరం లేదు. తక్బీర్ పలకడం ఫర్జ్, దుఆ చదవడం సున్నత్ కనుక.

15. జనాజా నమాజును చదివించే హక్కు మొట్ట మొదటిగా ఇస్లామీ ప్రభుత్వపు ఉన్నతాధికారిది. ఆ తరువాత అతని సహాయకుడు, ఆ తరువాత మస్జిద్ ఇమామ్‌ది, ఆ తరువాత వాడలో మస్జిద్ ఇమామ్ ఆపై మయ్యిత్ సంరక్షకుడు ఆ హక్కును కలిగి ఉంటారు.

16. సంరక్షకుని అనుమతిలేనిదే మరెవ్వరూ నమాజె జనాజా చేయించడానికి వీలులేదు. ఎవరైనా చేస్తే తిరిగి చేయించే అవసరం కూడా లేదు. అయితే పైన చెప్పిన వారిలో ఎవ్వరూ సంరక్షకుని అనుమతి లేకుండానే చేయించవచ్చు. వారూ సంరక్షకుని లాంటి వారే.

17. ఇమామ్‌గాని, ఇంకే ముక్తదీగాని పొరపాటున తక్బీర్‌లు చెబుతూ చేతులు పైకెత్తినా నమాజు నెరవేరుతుంది. తిరిగి నమాజు చేయనవసరం లేదు.

18. ఎవరైనా ఓడలో ప్రయాణం చేస్తూ మరణిస్తే, తీరానికి చేరేంత వరకు ఆ శవం చెడిపోయేటంత దూరంగా తీరం ఉంటే, అలాంటి శవాన్ని గుస్ల్ ఇచ్చి కఫన్ తొడిగి నమాజె జనాజా చేసిన తరువాత సముద్రంలో పడవేయాలి.

19. ఖననం చేసిన తరువాత సమాధిని త్రవ్వి శవాన్ని బయటకు తీయడం (ధర్మసమ్మతం కాదు).

20. మనిషి ఎక్కడయితే చనిపోయాడో అతని భౌతికకాయాన్ని అక్కడి ఖనన వాటికలోనే ఖననం చేయాలి. అయితే అతని ఇంటివారుగాని, బంధువులుగాని ఒకటి రెండు మైళ్ళ దూరంలో ఉంటే అక్కడికి తీసుకొని వెళ్ళవచ్చు. మరీ దూరంగా ఉంటే తీసుకొని వెళ్ళటం ధర్మసమ్మతం కాదు.

21. బ్రతికుండగానే మనిషి తనకోసం కఫన్‌ను సిద్ధం చేసుకొని ఉంచుకోవడం ధర్మసమ్మతమే. కాని సమాధిని త్రవ్వి ఉంచుకోవడం మాత్రం మక్రూహ్ ఎందుకనంటే అతడు ఎక్కడ చస్తాడో అతనికేమి తెలుసు?

## నమాజె జనాజా- అస్ర్, ఫజ్ర్ నమాజ్‌ల తరువాత

22. అస్ర్ నమాజ్ అయిన తరువాత సూర్యుని రంగు ఎర్రగా మారేవరకు నమాజె జనాజా చేయవచ్చు. అలానే సజ్దె తిలావత్ కూడా చేయవచ్చు.

23. చనిపోయిన తరువాత ముస్లిమ్ మయ్యత్‌లను గురించి చెడుగా చెప్పుకో కూడదు. ఒకవేళ చనిపోయిన వానిలో ఏదైనా చెడు ఉండి ఉంటే అతన్ని పొగడనూ వద్దు. కాని అనవసరంగా అతని గురించి చెడ్డగా మాట్లాడుకోవడం పొరపాటు. మహాప్రవక్త (సఅసం), "మీ చనిపోయినవారి మంచితనాన్ని జ్ఞాపకం చేసుకోండి" అని అన్నారు. కాని అతని చెడును ప్రజలు ఓ ఆదర్శంగా చెప్పుకుంటే ఖుర్ఆన్, హదీసుల వెలుగులో ఆ తప్పును ఎత్తి చూపడం కూడా అవసరమే. కాని అంతకంటే మించ వీలులేదు.

## సంతాపాన్ని తెలియజేయడం

1. ఎవరింటిలోనైనా మరణం సంభవిస్తే ఆ ఇంటికి వెళ్ళి ఇంటి వారికి స్వాంతన వచనాలు చెప్పి ఓదార్చడం. సహనాన్ని పాటించమని ఉద్బోధించడం సున్నత్. దీన్నే షరీఅత్‌లో తాజియత్ అనంటారు. మహాప్రవక్త (సఅసం) స్వయంగా అలాంటి వారింటికి వెళ్ళి తాజియత్ చేసేవారు. సహనాన్ని పాటించమని ఉద్బోధించేవారు.

2. ఏ ఇంట్లోనయితే మరణం సంభవించిందో ఆ ఇంటికి భోజనం పంపడం కూడా తాజియత్‌లోని భాగమే. అయితే మూడు పూటలకంటే అధికంగా పంపకూడదు.

3. మూడు రోజులు దాటిన తరువాత తాజియత్ కోసం వెళ్ళడం మక్రూహ్. అయితే బయటినుండి వచ్చేవారికి ఈ షరతు లేదు.

4. కొందరు స్త్రీలు, మయ్యత్ ఇంట్లో మూడు రోజుల వరకు పొయ్యి రాజేయడం చెడ్డగా భావిస్తారు. ఇది పూర్తి అజ్ఞానమయిన ఊహ మాత్రమే. ఇలా అనుకొని పొయ్యి వెలిగించకుండా ఉండడం పాపం.

# జిక్ర్ మరియు దుఆ

ఇస్లాం రెండు రకాల ఆరాధనలను గూర్చి నొక్కి చెబుతోంది. మొదటిరకం, ఓ ప్రత్యేకమైన సమయం లేక వేళలో, ఓ ప్రత్యేక స్థలంలో, ఓ ప్రత్యేకమయిన రూపంలో, ప్రత్యేకమైన షరతులతో విధిగా చేయబడ్డవి. ఉదాహరణకు నమాజ్, రోజా, హజ్, జకాత్ లాంటివి. నమాజు గురించి దివ్య ఖుర్ఆన్‌లో ఇలా చెప్పబడింది:

إِنَّ الصَّلٰوةَ كَانَتْ عَلَى الْمُؤْمِنِيْنَ كِتَابًا مَّوْقُوْتًا (نساء)

"నమాజ్, వాస్తవానికి విశ్వసించిన వారిపై కాల నియమం ప్రకారం విధించబడిన ధర్మం" **(నిసా-103)**

రోజా గురించి ఇలా సెలవియ్యబడింది

فَمَنْ شَهِدَ مِنْكُمُ الشَّهْرَ فَلْيَصُمْهُ (بقره)

**"కనుక ఇక నుండి రమజాన్ నెలను ఎవరు చూస్తారో వారు ఈ నెల అంతా విధిగా ఉపవాసం ఉండాలి."**

**(బఖర -185)**

హజ్ విషయంలో ఇలా ఉంది:

اَلْحَجُّ اَشْهُرٌ مَّعْلُوْمَاتٌ (بقره)

"అల్‌హజ్జు అష్‌హురుమ్ మాలూమాత్"

**అర్థం:** హజ్ నెలలు అందరికి తెలిసినవే. ఇదేవిధంగా జకాత్, జిహాద్‌ల కోసం కూడా కొన్ని ప్రత్యేకమయిన షరతులు, సమయాలున్నాయి.

రెండోరకం ఆరాధనల విషయంలో, వాటిని నెరవేర్చడానికి సమయంగాని, సందర్భంగాని ప్రత్యేక షరతులుగాని లేవు. అదేవిధంగా వాటికి ఓ ప్రత్యేక రూపం అంటూ ఉండదు. వ్యక్తి ఇంటిలో ఉన్నా ఇంటికి బయటఎక్కడున్నా, ప్రయాణంలో ఉన్నా ఒకచోట నిలకడగా ఉన్నా, కూర్చుని ఉన్నా పడుకొని ఉన్నా, ఉపాధి సంపాదనలో ఉన్నా, ధర్మ యుద్ధం కోసం యుద్ధ మైదానంలో ఉన్నా, అతడు ఎల్లప్పుడు, అన్ని సందర్భాల్లోనూ దీన్ని నెరవేర్చగలడు. అది నోటి ద్వారానైనా, మనస్సులోనైనా సరే. ఇలాంటి ఆరాధనలు ఖుర్ఆన్ మరియు సున్నత్ దృష్టిలో జిక్ర్, తస్బీహ్, తహ్‌లీల్, తహ్‌మీద్, తక్బీర్, ఇస్తిఆజా మరియు ఇస్తెగ్ఫార్ అని అనబడతాయి.

**వజ్కురుల్లాహ జిక్రన్ కసీరఁవ్వ సబ్బిహూహు బుక్రతవ్వ అసీలా (అహ్జాబ్) అని ఖుర్ఆన్‌లో ఉంది.**

وَاذْكُرُوا اللّٰهَ ذِكْرًا كَثِيْرًا وَّ سَبِّحُوْهُ بُكْرَةً وَّاَصِيْلًا (الاحزاب)

అంటే, అల్లాహ్‌ను అధికంగా తలచుకుంటూ ఉండండి. మరియు ఉదయ సాయం సమయాల్లో ఆయన పవిత్రతను కొనియాడండి అని అర్థం.

**మరో చోట ఇలా ఉంది:**

**"అల్లజీన యజ్కురూనల్లాహ ఖియామఁవ్వఖుఊదన్ వఅలా జునూబిహిమ్" (ఆలి ఇమ్రాన్ -190)**

اَلَّذِيْنَ يَذْكُرُوْنَ اللّٰهَ قِيَامًا وَّقُعُوْدًا وَّعَلٰى جُنُوْبِهِمْ۔

**అర్థం:** నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా అన్నివేళలా అల్లాహ్‌ను స్మరించేవారే బుద్ధిమంతులు.

ఓ సహాబి (రజిఅన్) (అనుచరుడు) మహాప్రవక్త (సఅసం)ను (అయ్యా) షరీఅత్‌లో అనేక ఆజ్ఞలున్నాయి.(అయినా) దృఢంగా అమలుచేయుటకు నాకు మీరు ఓ బోధ చేయండి అని అడిగితే మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు:

**"లా యజాలు లిసానక రత్‌బమ్ మిన్ జిక్రిల్లాహ్"**

**(తిర్మిజి, ఇబ్నెమాజ)**

لَا يَزَالُ لِسَانُكَ رَطْبًا مِّنْ ذِكْرِ اللّٰهِ

**అర్థం:** దైవస్తోత్రం నీ నోట ఎప్పుడూ నానుతూనే ఉండాలి. స్వయంగా మహాప్రవక్త (సఅసం) ఎల్లవేళలా దైవధ్యానంలో నిమగ్నులై ఉండేవారు.

మొదటి రకం ఆరాధనలు విధిగా చేయబడ్డవే. అయితే రెండోరకం ఆరాధనలు విధిగా చేయబడకపోయినా అవి వాటి ఆధ్యాత్మిక ప్రభావంపరంగా వాటి ప్రాధాన్యత ఫర్జులకంటే తక్కువేమీ కాదు. అందుకే ఖుర్ఆన్, హదీసుల్లో జీవితపు ప్రతి మలుపులోను, ప్రతి సందర్భంలోను జిక్ర్ (దైవ నామస్మరణం), దుఆ (వేడుకోలు), ఇస్తిఆజా (అల్లాహ్ శరణు కోరడం), ఇస్తిగ్ఫార్ (మన్నింపు కోసం వేడుకోవడం), తహ్మీద్ (దైవస్తోత్రం చేయడం) తక్బీర్(అల్లాహ్ ఏకత్వాన్ని చాటడం అంటే అల్లాహు అక్బర్ అనడం) గురించి ప్రోత్సహించడమేకాదు అలా చేయమని తాకీదు కూడా చేయబడింది. మొదటిరకం ఆరాధనల్లో నమాజుకు సంబంధించినదంతా ఇదివరకే చెప్పుకున్నాం. రోజా,హజ్ మరియు

జకాత్ గురించినవి మునుముందు రాయబడతాయి. అయితే వాటికి ముందు రెండో రకమైన ఆరాధనలకు సంబంధించిన వివరం నమాజు తరువాత చెప్పబడుతోంది. దానికి కారణం ఏమిటంటే దీని సంబంధం నమాజుతోనే అధికంగా ఉంది.

## దుఆ మానవ నైజం

ఆరాధనల్లా దుఆ చేయడం లేక వేడుకోలు కూడా మానవ నైజంలోనే ఇమిడి ఉంది. మనకు కష్టకాలం దాపురించినప్పుడు సమస్యలు నలువైపుల నుండి చుట్టుముట్టినప్పుడు మన రెండు చేతులు దుఆకోసం తమంతట తామే అనుకోకుండా పైకి లేస్తాయి. ఈ పరిస్థితిలో కల్లోల హృదయం నుండి అనుకోకుండా బయలువెడలే పదాలు, అసహాయ స్థితిలో హృదయాంతరాళం నుండి బయటకు వెడలే వాక్యాలే దుఆ లేక వేడుకోలు. ఖుర్ఆన్ మనిషి ఈ సహజ పిలుపును ఈ విధంగా వర్ణిస్తోంది:

"మనిషికి కష్టకాలం దాపురించినప్పుడు అతడు నిలుచున్నా, పడుకున్నా, కూర్చున్నా అన్ని వేళలా తన ప్రభువును పిలుస్తాడు." (యూనుస్)

إِذَا مَسَّ الْإِنسَانَ ضُرٌّ دَعَانَا لِجَنبِهِ أَوْ قَاعِدًا أَوْ قَائِمًا۔
(یونس)

అయితే మనిషి ఈ నైజంలో సమతౌల్యాన్ని నిలిపి ఉంచేందుకు అల్లాహుత ఆలానే వేడుకోవడం అవసరం. ఎందుకంటే అల్లాహ్‌ను వేడుకోవడం అంటే ఓ సంపూర్ణమైన, ఉన్నతమైన, ఘనమైన వ్యక్తిత్వాన్ని గురించిన జ్ఞానం కలిగి ఉండడమే. ఆయనను మొరపెట్టుకోవడం అంటేనే మనిషి యొక్క గౌరవం సంరక్షించబడుతుందని అర్థం. తనలాంటి వారి ముందు యాచించడానికి చేయిచాపే నీచత్వం నుండి రక్షించబడతాడు. బహుదైవారాధకులు, సత్య తిరస్కారులైతే అప్పుడు అనేకమయిన దైవాలను ఆరాధిస్తారు గాని, కష్టకాలంలో మాత్రం ఏకైక దైవం అయిన అల్లాహ్‌నే స్మరిస్తారు. ఇలా నిజ దైవాన్ని దుఆ చేయడం అంటే ఏకేశ్వరవాదం మనిషి నైజంలో దాగి ఉందని, బహు దైవారాధనను ఆ నైజం ధిక్కరిస్తోందని అర్థం. అందుకనే కష్టకాలం వచ్చినప్పుడు మనిషి తన నైజానికి అతి చేరువలోనే ఉన్నందున ఇతర దైవాలు మటుమాయమై ఒకే ఒక దేవుడు అతని మనస్సులో మెదులుతాడు.

మనిషి మనోమస్తిష్కాలలో దైవసంస్మరణ పూర్తిగా పాతుకుపోవాలి. దేవుని ప్రేమ, ఆయన ఔన్నత్యం గురించిన బలమైన ప్రేరణ కలిగించే భావన ఏర్పడాలంటే ఇక ఎలాంటి ఇతర ప్రేమలకు, అనుబంధాలకు, ఔన్నత్యాలకు అందులో తావు లేకుండా

పోవాలి. ఇదే దుఆ లక్ష్యం. ఇదే జిక్ర్ ధ్యేయం. ఇంకా మనిషి హృదయంలో, అతని బాహ్యకదలికల్లో దీనత్వం అసహాయత భావాలు ఏర్పడాలి. ఇదే ఇస్లామీయ ఆరాధనల నుండి ఉద్భవించే గుణం. మనిషి ఏది యాచించదలచినా దేవుణ్ణే యాచించాలి. ఆయన ముందే కష్టాల్లో అయినా సుఖాల్లోనయినా, దారిద్ర్యంలోనయినా, సిరిసంపదల్లోనయినా ఏ పరిస్థితిలో ఉన్నాసరే అన్ని వేళలా అతడు సహనం వహించేవాడుగా, కృతజ్ఞుడుగానే ఉండాలి. అతని దృష్టి కారణంపై కాకుండా ఆ కారణాన్ని కలిగించిన ఆ దైవం పైన్నే ఉండాలి.

ఏ ఆరాధనలయితే ప్రత్యేక రూపంలో ప్రత్యేక సమయంలో, స్థల పరిమితులతో ఫర్జు (విధి) చేయబడిందో వాటి ధ్యేయం కూడా ఇలాంటి లక్షణాలను మనిషిలో కలిగించేదిగా ఉండాలి. ఉదాహరణకు నమాజునే తీసుకుందాం. దానిలోని ఒక్కొక్క భాగం (రుక్న్), దాని ఒక్కో రూపం, ఇంకా అందులో చదవబడే విషయాల నుండి ఈ లక్షణాలు బహిర్గతమవుతూ ఉంటాయి. ముఖ్యంగా సజ్దా ఫాతిహా పారాయణం ద్వారా అవి బాగా వ్యక్తం అవుతూ ఉంటాయి. కాబట్టేనేమో ఫాతిహాసూరాను ప్రతి రకాత్‌లోను తప్పక పఠించాలనే ఆదేశముంది. ఒక్కో రకాత్‌లో రెండేసి సజ్దాలు ఉండడానికి కారణం ఇదే కావచ్చు. తక్కిన రుకూ, ఖౌమా వగైరాలు ఒక్కొక్కసారే చేయడం ఫర్జు. అదే విధంగా ఒకే నమాజులోని ప్రతి రకాత్‌లో ఒకే సూరాను మాటిమాటికి చదవడం మంచిది కాదు అని చెప్పబడింది కూడా అందుకనే. ఫాతిహా సూరా ప్రాముఖ్యాన్ని తెలుసుకోవాలంటే మహాప్రవక్త (సఅసం) ప్రవచించిన ఈ హదీసె ఖుద్సి తప్పక చదవలసిందే.

قَسَمْتُ الصَّلٰوةَ بَيْنِىْ وَبَيْنَ عَبْدِىْ نِصْفَيْنِ وَلِعَبْدِىْ مَا سَاَلَ فَاِذَا قَالَ الْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعَالَمِيْنَ قَالَ اللّٰهُ حَمِدَنِىْ عَبْدِىْ وَاِذَا قَالَ الرَّحْمٰنِ الرَّحِيْمِ قَالَ اَثْنٰى عَلَيَّ عَبْدِىْ فَاِذَا

"అల్లాహుతఆలా ఇలా అన్నాడు. "నేను నమాజును నా నడుమ దాసుని నడుమ చెరిసగంగా విభజించాను. నా దాసుడు ఏది అడిగితే అది అతనికి లభిస్తుంది. నమాజీ "అల్‌హందులిల్లాహి రబ్బిల్ ఆలమీన్" అన్నప్పుడు దానికి దేవుడు "నా దాసుడు నా స్తోత్రం చేశాడు" అని జవాబిస్తాడు. దాసుడు "అర్రహ్మా నిర్రహీం" అని అన్నప్పుడు అల్లాహ్ "నా దాసుడు నన్ను పొగిడాడు"

అనంటాడు. దాసుడు "మాలికి యౌమిద్దీన్" అన్నప్పుడు అల్లాహ్ "నా దాసుడు నా ఔన్నత్యాన్ని కొని యాడాడు" అనంటాడు.

قَالَ مَالِكِ يَوْمِ الدِّيْنِ ٥
قَالَ مَجَّدَنِيْ عَبْدِيْ وَكَرَّةً
فَوَّضَ اِلَيَّ عَبْدِيْ فَاِذَا

ఓసారి మహాప్రవక్త(స) ఇలా కూడా అన్నారు:

"అల్లాహ్ అంటాడు - నా దాసుడు తనను తాను నాకు సమర్పించాడు. అతను ఇయ్యాక న అబుదు వ ఇయ్యాక నస్తయీన్ అనే విధేయతతో కూడిన పలుకులు ఉచ్ఛరించినప్పుడు అల్లాహ్ (దాసుని ఈ విధేయతా వచనాలకు సంబరపడి) "ఇది నా కోసం, నా దాసుని కోసం. నా దాసుడు ఏది యాచిస్తాడో అది అతనికి లభించింది" అని అంటాడు. అతడు "ఇహ్దినస్సిరాతల్ ముస్తఖీమ్, సిరాతల్లజీన అన్అమ్త అలైహిం గైరిల్ మగ్జూబి అలైహిం వలజ్జాల్లీన్" అని అన్నప్పుడు అల్లాహ్, "ఇదంతా నా దాసుని భాగం, అతడు ఏది కోరాడో అది అతనికి లభించింది" అని అంటాడు.
*(ముస్లిమ్, అబూదావూద్, తిర్మిజి)*

قَالَ اِيَّاكَ نَعْبُدُ وَاِيَّاكَ
نَسْتَعِيْنُ ٥ قَالَ هٰذَا بَيْنِيْ
وَبَيْنَ عَبْدِيْ وَلِعَبْدِيْ مَا
سَأَلَ فَاِذَا قَالَ اِهْدِنَا
الصِّرَاطَ الْمُسْتَقِيْمَ ٥
صِرَاطَ الَّذِيْنَ اَنْعَمْتَ
عَلَيْهِمْ غَيْرِ الْمَغْضُوْبِ
عَلَيْهِمْ وَلَا الضَّالِّيْنَ ٥
قَالَ اللّٰهُ هٰذَا لِعَبْدِيْ
وَلِعَبْدِيْ مَا سَأَلَ۔
(مسلم، ابوداؤد، ترمذی)

దాసుని అసహాయతను, దీనత్వాన్ని పూర్తిగా బహిర్గతం చేసేది సజ్దా స్థితే. ఈ స్థితి దైవానికి అతి చేరువలో ఉండేందుకు దోహదం చేస్తుంది. దీని గురించి మహాప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది:

"దాసుడు తన ప్రభువుకు అత్యంత చేరువలో ఉండేది సజ్దా స్థితిలోనే.

اَقْرَبُ مَا يَكُوْنُ الْعَبْدُ
مِنْ رَّبِّهٖ وَهُوَ سَاجِدٌ

**ఇలాంటి సందర్భంలో అధికంగా దుఆ చేయండి."** فَأَكْثِرُوا الدُّعَاءَ۔

**(ముస్లిమ్, అబూదావూద్)**

ఇలాగే ఇతర ఆరాధనలైన రోజా, జకాత్‌లోను ఈ తీరు ఎంత అధికంగా ఉంటే దాని ప్రతిఫలం కూడా అంతే అధికంగా ఉంటుంది.

మొత్తానికి, విశ్వాసం, దైవాజ్ఞాపాలన, ఆరాధనలు, ధ్యానం యొక్క ధ్యేయం, దాసుణ్ణి తన ప్రభువుతో దృఢమైన సంబంధం ఏర్పరచాలి అన్నదే. అతనితో దేవుని ఎడల ఇష్టం ఏర్పడాలి, పరలోక జవాబుదారి భావం జనించాలి. అతను తన అసహాయతను గుర్తించి సకల యాచనలు, సకల మొక్కులు, సృష్టితాలతో కాక ఆ ఏకైక సృష్టికర్తకే పరిమితం కావాలి. ఇదే ఈ ఆరాధనల ధ్యేయం. మనిషి అంతరాత్మలో, తాను ఈ భువిలో స్వతంత్రుడు కాదు. సరికదా తాను ఆ దైవానికి ప్రతినిధి, ఆయన వరాలను రక్షించేవాణ్ణి అనే భావన ఉద్భవించాలి. అతడు ఇక్కడ తన గొప్పతనాన్ని లేక ఔన్నత్యాన్ని చాటుకోవడానికిగాని ఇతరుల ఔన్నత్యంముందు తల ఒగ్గడానికిగాని పుట్టించబడలేదు అన్న భావనలన్నీ జిక్ర్ దుఆల ద్వారా పూర్తిగా అబ్బగలవు. జిక్ర్‌ను, దుఆను పూర్తి వివేచనతోనూ, మనస్సును పూర్తిగా లగ్నం చేసి గనక నిర్వహిస్తే, మనిషి విశ్వాసంలో దృఢత్వం, ఓ రకమైన తీయదనం, ఆరాధనల్లోను, దైవాజ్ఞాపాలనలోను నిలకడ, ప్రోత్సాహం లభిస్తాయి. ఖుర్‌ఆన్‌లో అవతరించిన జిక్ర్, దుఆ వాక్యాలు, హదీసు గ్రంథాల్లో మహాప్రవక్త (సఅసం) ద్వారా నిర్వహించబడిన జిక్ర్, దుఆల ఒక్కో పాదాన్ని మనం ఏకాగ్రతతో అర్థం చేసుకుంటూ వల్లిస్తే మన మనసుల్లో ఉన్న మాటనే పలుకుతున్నామా అనే అనుభూతి కలుగుతుంది.

అంతేగాక మనలను చుట్టుకొని ఉన్న కష్టాలను ఏకరువు పెట్టినట్లవుతుంది. ఈ పరిస్థితిలో మన హృదయానికి ఎంతో ఊరట కూడా కలిగినట్లనిపిస్తుంది. ఈ మహత్తర పదాల ద్వారా దైవ సమక్షంలో మనం ఏదైనా విజ్ఞాపన చేస్తున్నప్పుడు, మనకు ఆ దైవానికి మధ్యనున్న తెరలన్నీ తొలగిపోయాయా, మధ్యవర్తిత్వం అనే సంకెళ్ళన్ని తెగిపోయి నేరుగా దైవసన్నిధిలోకి చేరి మన విజ్ఞాపనను అందిస్తున్నామా అనిపిస్తుంది. దేవుడు తన నుండి దూరంగా ఎక్కడో ఉన్నాడు అనుకోవడం దాసుని పొరపాటు ఆయన స్వయంగా అతని వ్యక్తిత్వానికి అతి చేరువలోనే ఉన్నాడు.

**"నేను దాసునికి అతని ధమనికంటే అతి చేరువలో ఉన్నాను" అంటున్నాడు** وَنَحْنُ أَقْرَبُ إِلَيْهِ مِنْ حَبْلِ الْوَرِيدِ (ق)

దేవుడు ఖుర్‌ఆన్‌లో. మరో చోట ఇలా అంటున్నాడు.

"నా దాసుడు నిన్ను నా గురించి అడిగితే నేను అతనికి అతి చేరువ లోనే ఉన్నానని చెప్పు. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు అతని పిలుపుకు నేను సమాధానం ఇస్తాను."

(బఖరా)

وَاِذَا سَاَلَكَ عِبَادِیْ عَنِّیْ فَاِنِّیْ قَرِیْبٌ اُجِیْبُ دَعْوَةَ الدَّاعِ اِذَا دَعَانِ۔

(بقرہ)

ఈ కారణాల చేతనే ఖుర్‌ఆన్, హదీసుల్లో జిక్ర్, దుఆల గురించి బాగా తాకీదు చేయబడింది. గత ప్రవక్తలందరి బోధనల్లోనూ ఈ విషయానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. ఖుర్‌ఆన్‌లో ఎక్కడెక్కయితే దైవం వైపు పిలవడానికి ఆజ్ఞలు జారీ చేయ బడ్డాయో అక్కడ కొన్ని ప్రత్యేక దుఆల గురించిన ప్రస్తావన కూడా ఉంది.

ఇది దైవదాస్యం గురించిన విషయం కాబట్టి దీన్ని విడనాడడాన్ని దైవాగ్రహానికి చిహ్నంగా చెప్పబడింది.

ఖుర్‌ఆన్‌లోని సూరె మోమిన్‌లో ఇలా ఉంది:

"నీ ప్రభువు ఇలా అన్నాడు: ప్రజ లారా! నన్ను వేడుకుంటూ ఉండండి. నేను మీ వేడుకోలును స్వీకరిస్తాను. ఎవరయితే నన్ను ఆరాధించడానికి నిరాకరిస్తారో వారు త్వరలోనే అవ మానం పాలై నరకంలో ప్రవేశి స్తారు." (మోమిన్)

وَقَالَ رَبُّكُمُ ادْعُوْنِیْٓ اَسْتَجِبْ لَكُمْ اِنَّ الَّذِیْنَ یَسْتَكْبِرُوْنَ عَنْ عِبَادَتِیْ سَیَدْخُلُوْنَ جَهَنَّمَ دَاخِرِیْنَ ۝

(مومن)

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

"ఎవరయితే అల్లాహ్‌ను యాచించరో, అల్లాహ్ వారి ఎడల ఆగ్రహిస్తాడు." (తిర్మిజి)

مَنْ لَّمْ یَسْئَلِ اللّٰهَ یَغْضَبْ عَلَیْهِ ۔ (ترمذی)

మరో హదీసులో ఇలా ప్రవచించబడింది:

"దుఆయె ఆరాధనలకు ఆత్మ లాంటిది" ఇలా అన్న తరువాత మహాప్రవక్త (సఅసం) పైన చెప్పిన ఖుర్ఆన్ వాక్యం పఠించారు.
(తిర్మిజీ, అబూదావూద్)

اَلدُّعَاءُ هُوَ الْعِبَادَةُ

మరో హదీసులో

"దుఆయె ఆరాధ నల సారం" అని,

اَلدُّعَاءُ مُخُّ الْعِبَادَةِ

ఇంకో హదీసులో "దైవ సాన్ని ధ్యంలో దుఆ కంటే గౌరవప్రద మయినది ఇంకేది లేదు" అని దైవ ప్రవక్త (సఅసం) ప్రవచిం చారు.
(తిర్మిజి, ఇబ్నె మాజ)

لَيْسَ شَيْءٌ اَكْرَمَ عَلَى اللّٰهِ مِنَ الدُّعَاءِ

మహాప్రవక్త (సఅసం) ఏ జిక్ర్ దుఆలు అయితే చేసేవారో, అవన్నీ ఆయన సందేశానికి ఆచరణాత్మకమయిన ప్రతీకలుగా ఆయన దివ్యచరితానికి, సంప్రదాయానికి తార్కాణాలుగా నిలిచి ఉన్నాయి. ఈ విధంగా జిక్ర్‌కు, దుఆకు ఎంతో ప్రాముఖ్యత లభించి అవి ఆచరణ యోగ్యమయినవిగా ఉన్నాయి.

ఎవరైనా ఆయన సందేశం యొక్క సార్వజనీనతను తెలుసుకోగోరితే, ఆయన దివ్యచరితాన్ని అధ్యయనం చేయదలిస్తే, బహిరంగమయిన ఆచరణలకు తోడు ఆయన (సఅసం) గారు ఎవరికి కనబడకుండా ఏకాంతంలో వేడుకున్న వేడికోళ్ళలోని (దుఆలను) ప్రతి పదాన్ని అధ్యయనం చేయాల్సిందే. అలా అధ్యయనం చేసి అంతిమ దైవప్రవక్త (సఅసం) హృదయంలో రేకెత్తిన ఆలోచనలు, అనుభవాలను గనక తెలుసుకొనే ప్రయత్నం చేస్తే వాటిలో ఏకేశ్వరవాదన (తౌహీద్) భావం ఎంత ఉన్నతంగా ఉండేదో, ఆ ఏకేశ్వర వాదంపై నడిచేందుకు ఎంత పట్టుదల ఏర్పడిందో అదే విధంగా పరలోక జవాబుదారీ భావన ఎలా ఉండేదో అర్థం అవుతుంది. అవసరాలకు మొక్కులను తీర్చడం లాంటివి సృష్టితాలకు కాక సృష్టికర్తకే చెల్లుతుంది అని అర్థం అవుతుంది.

బహిరంగంగా చెప్పిన మంచి మాటలను గురించి రెండు రకాల అభిప్రాయాలు ఉండవచ్చు. (మహాప్రవక్త (సఅసం) విషయంలో అలా ఎన్నటికీ జరగడానికి వీల్లేదు).

కాని ఏకాంత విషయాలకు సంబంధించినంత వరకు మనిషికి ఎలాంటి ఆటంకం ఉండబోదు. ఏకాంతంలో మనిషి నిజస్వరూపం ఏమిటో బయటపడుతుంది. అతని భావాల్లో, పనుల్లో ఎలాంటి కాపట్యం ఉండబోదు.

పైన చెప్పినదంతా ఏదో ఊహాజనితమైందేమీ కాదు. పూర్తి యదార్థాలు. ఇక్కడ మేము దివ్యఖుర్ఆన్ మరియు మహాప్రవక్త (సఅసం) గారి కొన్ని పరిపూర్ణ దుఆలను వ్రాస్తున్నాము. మోమిన్ జీవితంలో దుఆ ప్రాధాన్యత ఏమిటో, అది ఎలా ఉండాలో అనే విషయాన్ని ఈ దుఆల వల్ల మీరు గుర్తించగలరు.

رَبَّنَآ اٰتِنَا فِى الدُّنْيَا
حَسَنَةً وَّفِى الْاٰخِرَةِ
حَسَنَةً وَّقِنَا عَذَابَ
النَّارِ (بقرہ)

"రబ్బనా ఆతినా ఫిద్దునియా హసనతంవ్వఫిల్ ఆఖిరతి హసనతం వ్వఖినా అజాబన్నార్."

**అర్థం:** ఓ మా ప్రభువా! మాకు ఈ ప్రపంచంలోను మేలు కలుగజేయి పరలోకం లోనూ విజయవంతులుగా చెయ్యి, మమ్ము నరకాగ్ని నుండి కాపాడు.

رَبَّنَا لَا تُؤَاخِذْنَآ اِنْ نَّسِيْنَآ
اَوْ اَخْطَاْنَا رَبَّنَا وَلَا تَحْمِلْ
عَلَيْنَآ اِصْرًا كَمَا حَمَلْتَهٗ
عَلَى الَّذِيْنَ مِنْ قَبْلِنَا
رَبَّنَا وَلَا تُحَمِّلْنَا
مَا لَا طَاقَةَ لَنَا بِهٖ وَاعْفُ
عَنَّا وَاغْفِرْ لَنَا وَارْحَمْنَا
اَنْتَ مَوْلٰىنَا فَانْصُرْنَا
عَلَى الْقَوْمِ الْكٰفِرِيْنَ ۝

'రబ్బనా లా తుఆఖిజ్‌నా ఇన్ నసీనా అవ్ అక్‌తానా రబ్బనా వలా తహ్‌మిల్ అలైనా ఇస్రన్ కమాహమల్‌తహు అలల్లజీన మిన్ ఖబ్లినా, రబ్బనా వలాతుహమ్మిల్‌నా మా లా తాఖత లనా బిహీ వఅపుఅన్నా వగ్‌ఫిర్‌లనా వర్ హమ్‌నా అన్‌త మౌలానా ఫన్ సుర్‌నా అలల్ ఖౌమిల్ కాఫిరీన్."

**అర్థం:** మా ప్రభూ! పొరపాటువల్ల జరిగే మా తప్పుల్ని పట్టబోకు. మా స్వామీ! మాకు పూర్వం వారిపై మోపిన భారాన్ని మాపై మోపకు. మా ప్రభూ! ఏ బరువైతే మోసే శక్తి మాలో లేదో, దాన్ని మాపైపెట్టకు. మమ్మల్ని మన్నించు, మమ్మల్ని క్షమించు, మమ్మల్ని కరుణించు. నీవే మాకు రక్షకుడవు. అవిశ్వాసులపై మాకు ఆధిక్యత ప్రసాదించు.

"రబ్బనా జలమ్‌నా అన్‌ఫుసనా వ ఇల్లమ్ తగ్‌ఫిర్ లనా వతర్‌హమ్‌నా లనకూనన్న మినల్ ఖాసిరీన్." (ఆరాఫ్)

رَبَّنَا ظَلَمْنَا أَنْفُسَنَا وَإِنْ لَّمْ تَغْفِرْ لَنَا وَتَرْحَمْنَا لَنَكُونَنَّ مِنَ الْخٰسِرِيْنَ - (اعراف)

అర్థం: ఓ మా ప్రభో! మేము మాపై ఎంతో జులుమ్ చేసుకున్నాము. నీవేగనక మన్నించకపోతే మేము ఘోర నష్టంలో పడిపోతాం.

పై రెండు దుఆలను పఠించేటప్పుడు మీ అంతరాత్మను పరిశీలించుకోండి. కన్నీటి పర్యంతమై, తెలియక చేసిన తప్పుల్ని గుర్తు చేసుకునే ప్రయత్నం చేయండి. ఆ తరువాత మీ హృదయ పరిస్థితి ఎలా ఉంటుందో గమనించండి.

"రబ్బనా లా తుజిగ్ ఖులూబనా బఅద ఇజ్ హదైతనా వహబ్‌లనా మిల్లదున్క రహ్మతన్ ఇన్నక అంతల్ వహ్హాబ్." (ఆలి ఇమ్రాన్)

رَبَّنَا لَا تُزِغْ قُلُوْبَنَا بَعْدَ إِذْ هَدَيْتَنَا وَهَبْ لَنَا مِنْ لَّدُنْكَ رَحْمَةً إِنَّكَ أَنْتَ الْوَهَّابُ - (آل عمران)

అర్థం: మా ప్రభూ! నువ్వు మాకు సరైన మార్గాన్ని చూపిన తరువాత ఇక మా మనస్సుల్ని వక్రమార్గం వైపునకు మళ్ళించకు. నీ విశేష కారుణ్యాన్ని మాకు ప్రసాదించు. నిస్సందేహంగా నిజమైన దాతవు నీవే.

ఈ దుఆను పఠించేటప్పుడు, సన్మార్గం, లభించాక కూడా విశ్వాసికి వక్రమార్గం వైపునకు పయనించే ప్రమాదం ఎల్లప్పుడూ ఉంటుందనే తలంపు మనస్సులో ఉండాలి. ఈ ప్రమాదం నుండి రక్షించబడాలంటే ఒకే ఒక మార్గం ఉంది. అదే దైవకారుణ్యం, మనపై ఉండాలన్నది, ఖుద్దుగా మహాప్రవక్త (సఅసం) ఇలా అంటూ ఉండేవారు:

"నా మనస్సులోను అప్పుడప్పుడు ఏవేవో భావాలు వస్తూవుంటాయి. నేను వాటిని పారద్రోలడానికి రోజుకు వందేసి సార్లు అస్తగ్ఫార్ చేస్తూ ఉంటాను." (అంటే దైవాన్ని మన్నింపు కోసం వేడుకుంటూ ఉంటాను). (ముస్లిం)

لَيُغَانُ عَلٰى قَلْبِيْ وَإِنِّيْ لَأَسْتَغْفِرُ اللّٰهَ فِي الْيَوْمِ مِائَةَ مَرَّةٍ - (مسلم)

ఇదే విషయాన్ని తెలిపే మరో దుఆ ఉంది:

రబ్బనగ్ఫిర్‌లనా జునూబనా వ ఇస్రా ఫినా ఫీఅమ్రినా వ సబ్బిత్ అక్దా మనా వన్‌సుర్‌నా అలల్‌ఖౌమిల్ కాఫిరీన్. (ఆలి ఇమ్రాన్)

رَبَّنَا اغْفِرْ لَنَا ذُنُوبَنَا وَإِسْرَافَنَا فِي أَمْرِنَا وَثَبِّتْ أَقْدَامَنَا وَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكَافِرِينَ (آل عمران)

**అర్థం:** ఓ మా ప్రభూ! మా తప్పుల్ని, పొరపాట్లను మన్నించు. మా పనుల్లో జరిగిన నీ హద్దుల అతిక్రమణను క్షమించు. మా పాదాలకు స్థిరత్వాన్ని ప్రసాదించు. అవిశ్వాసులకు ప్రతికూలంగా మాకు సహాయం చెయ్యి.

మహాప్రవక్త (సఅసం) నోట వెడలిన కొన్ని సమగ్రమైన దుఆలను చూడండి: హజ్రత్ అబూ బక్ర్ (రజిఅన్) ఓసారి ప్రవక్త మహనీయునితో "దైవప్రవక్తా! మీరు నాకు ప్రతిరోజు ఉదయం, సాయంత్రం పఠించగలిగిన ఓ మంచి దుఆను నేర్పు?" అని అడిగితే ఆయన (సఅసం) ఈ దుఆ చదమని చెప్పారాయనతో.

"అల్లాహుమ్మ ఫాతిరస్సమావాతి వల్ అర్జి ఆలిముల్ గైబి వష్షహాదతి రబ్బకుల్లి షైయిన్ వ్వమలీ కహూ అష్‌హదు అల్ లా ఇలాహ ఇల్లా అంత అఊజు బిల్ మిన్‌షర్రి నఫ్సీ వషర్రిష్షయితాన్ వషిర్కిహీ."
(అబూదావూద్, తిర్మిజి)

اَللّٰهُمَّ فَاطِرَ السَّمٰوَاتِ وَالْأَرْضِ عَالِمَ الْغَيْبِ وَالشَّهَادَةِ رَبَّ كُلِّ شَيْءٍ وَمَلِيكَهُ أَشْهَدُ أَنْ لَا إِلٰهَ إِلَّا أَنْتَ أَعُوذُ بِكَ مِنْ شَرِّ نَفْسِي وَشَرِّ الشَّيْطَانِ وَشِرْكِهِ

**అర్థం:** ఓ దేవా! భూమ్యాకాశాలను సృష్టించినవాడా! ప్రత్యక్షాన్ని, పరోక్షాన్ని ఎరిగిన వాడా! ప్రతి వస్తువుకు స్వామీ! నీవు తప్ప ఇంకెవరూ పూజ్యుడు లేడని నేను సాక్ష్యం ఇస్తున్నాను. నేను నా మనస్సు యొక్క షైతాను యొక్క చెడుగు నుండి అతడి షిర్క్ (బహుదైవారాధన కీడు) నుండి నీ శరణు వేడుకుంటున్నాను.

హజ్రత్ అబూహురైరా (రజిఅన్) మహాప్రవక్త (సఅసం) ప్రవచించారని ఇలా ఉల్లేఖిస్తున్నారు:

అల్లాహుమ్మ అస్‌లిహ్‌లీ దీనియల్లజీ హువ ఇస్మతు అమ్రీ, వ అస్లిహ్‌లీ దున్‌యా యల్లతీ ఫీహా మఆషీ వ

اَللّٰهُمَّ أَصْلِحْ لِي دِينِيَ الَّذِي هُوَ عِصْمَةُ أَمْرِي وَأَصْلِحْ

لِي دُنْيَايَ الَّتِي فِيهَا مَعَاشِي وَأَصْلِحْ لِي آخِرَتِي الَّتِي فِيهَا مَعَادِي وَاجْعَلِ الْحَيٰوةَ زِيَادَةً لِّي فِي كُلِّ خَيْرٍ وَاجْعَلِ الْمَوْتَ رَاحَةً لِّي مِنْ كُلِّ شَرٍّ۔

**అస్లిహ్‌లీ ఆఖిరతియల్లతీ ఫీహా మఆదీ, వజ్ అలిల్ హయాతి జియాదత్‌లీ ఫీకుల్లి ఖైరిన్, వ అజ్‌లిల్ మౌతరాహతల్లీ మిన్ కుల్లిషర్.**

**(ముస్లిమ్)**

**అర్థం:** ఓ దేవా! నా కొరకు నా ధర్మాన్ని సక్రమంగా ఉంచు. నా ప్రతి ఆచరణకు సహాయకారి అయి సంరక్షించేది ఆ మార్గమే. నా ప్రపంచాన్ని నా కొరకు చక్కదిద్దు. ఇందులోనే నేను జీవితం గడపవలసి ఉంది. నా పరలోకాన్ని నా కోసం అలంకరించు. తిరిగి నేను అక్కడికే చేరవలసి ఉంది. ఈ కొన్ని రోజుల జీవితంలోని సత్కార్యాలను, పుణ్యాలను అధికం చెయ్యి. మరణాన్ని కష్టాల నుండి, కడగండ్ల నుండి కడతేర్చేదిగా హాయిని గొలిపేదిగా చెయ్యి.

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్)మహాప్రవక్త (సఅసం) ఈ దుఆను కూడా పఠించేవారని ఉల్లేఖిస్తూ ఉన్నారు:

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఈ క్రింది దుఆ కూడా పఠించేవారు.

اَللّٰهُمَّ اِنِّي اَسْئَلُكَ الْهُدٰى وَالتُّقٰى وَالْعَفَافَ وَالْغِنٰى

**"అల్లాహుమ్మ ఇన్ని అస్అలుకల్ హుదా, వత్తుఖా, వల్ అఫాఫ వల్ గినా." (ముస్లిమ్ తిర్మిజి)**

ఓ అల్లాహ్! నేను నీ నుండి సన్మార్గాన్ని, భయభక్తులను సచ్ఛీలతను, స్వయం సమృద్ధతను వేడుకుంటున్నాను.

హజ్రత్ ఫాతిమా (రజిఅన్హా)కు మహాప్రవక్త (సఅసం) ఈ దుఆను నేర్పారని హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖిస్తున్నారు:

يَا حَيُّ يَا قَيُّومُ بِرَحْمَتِكَ اَسْتَغِيثُ اَصْلِحْ شَانِي كُلَّهُ وَلَا تَكِلْنِي اِلٰى نَفْسِي طَرْفَةَ عَيْنٍ

**"యాహయ్యు యాఖయ్యూమ్. బి రహ్మాతిక అస్తగీసు అస్లిహ్ షానీ కుల్లహూ, వలా తకిల్నీ ఇలా నఫ్సీ తర్ఫత అయినిన్."**

**(ముస్తదరిక్, హాకిమ్, నిసాయి)**

ఓ సజీవుడా! (ఎల్లప్పుడు జీవించి ఉండేవాడా!) నీ కారుణ్య కటాక్షాల ద్వారా ప్రతి పనిని, ప్రతి పరిస్థితిని చక్కదిద్దు. నన్ను ఓ క్షణం కూడా నా మనోవాంఛలకు దాసోహం కాకుండా చెయ్యి.

ఆ దుఆలను చదివేటప్పుడు దేవుని శరణు వేడడానికి, మనస్సు కీడుకంటే మించిన కీడు లేదని, ఇహపరలోకాల వినాశనానికి, కల్లోలానికి ఈ మనస్సే అసలు కారణం అని జ్ఞప్తియందుంచుకోవాలి.

మహాప్రవక్త (సఅసం) ఓసారి ఇలా ప్రవచించారు: రహ్మాన్‌కు (దైవానికి) అతి ప్రీతిపాత్రమయినవి రెండే రెండు పదాలున్నాయి. అవి పలకడానికి ఎంతో తేలికైనవి, ప్రళయ దినాన త్రాసులో ఎంతో బరువుగా తూగేవి.

అవి రెండు పదాలు ఇవి:

**1. సుబ్‌హానల్లాహి వ బిహమ్‌దిహి.**

**2. సుబ్‌హానల్లాహిల్ అజీమ్**

**(బుఖారి ముస్లిమ్)**

سُبْحَانَ اللّٰهِ وَبِحَمْدِهٖ سُبْحَانَ اللّٰهِ الْعَظِيْمِ - (بخاری، مسلم)

అర్థం:

1. పరిశుద్ధుడైన అల్లాహ్‌ను స్తుతిస్తున్నాను.

2. పరిశుద్ధుడయిన, గొప్పవాడైన అల్లాహ్‌ను స్తుతిస్తున్నాను.

మరో సమగ్రమయిన దుఆ ఎలా ఉందో చూడండి. ఈ దుఆలో మానవుని అవసరాలు కొన్ని తెలుపబడ్డాయి. ఆ అవసరాలు ఏవో అందరి దృష్టికి రావు సాధారణంగా.

"అల్లాహుమ్మ అఊజుబిక మిమ్ మున్‌కరా తిల్ అఖ్‌లాఖి, వల్ ఆమాల్. వల్ అహ్వాయి వల్ అద్‌వా. న ఊజుబిక మిన్‌షర్రి మస్‌త ఆజ మిన్‌హు నబియ్యుక ముహమ్మదున్ సల్లల్లాహు అలైహి వ సల్లమ వమన్ జారిస్సూయి ఫీదారిల్ ముఖామతి ఫఇన్నజారల్ బాదియతి

اَللّٰهُمَّ اَعُوْذُبِكَ مِنْ مُنْكَرَاتِ الْاَخْلَاقِ وَالْاَعْمَالِ وَالْاَهْوَاءِ وَالْاَدْوَاءِ نَعُوْذُبِكَ مِنْ شَرِّ مَا اسْتَعَاذَ مِنْهُ نَبِيُّكَ مُحَمَّدٌ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَمِنْ جَارِ السُّوْءِ فِيْ دَارِ الْمُقَامَةِ فَاِنَّ جَارَ الْبَادِيَةِ يَتَحَوَّلُ

వَغَلَبَةِ الْعَدُوِّ وَشَمَاتَةِ
الْأَعْدَاءِ وَمِنَ الْجُوعِ
فَإِنَّهُ بِئْسَ الضَّجِيعُ
وَمِنَ الْخِيَانَةِ فَبِئْسَتِ
الْبِطَانَةُ وَأَنْ نَرْجِعَ
عَلَى أَعْقَابِنَا أَوْ نُفْتَنَ
عَنْ دِينِنَا وَمِنَ الْفِتَنِ
مَا ظَهَرَ مِنْهَا وَمَا بَطَنَ وَمِنْ
يَوْمِ السُّوءِ وَمِنْ لَيْلَةِ السُّوءِ وَ
مِنْ سَاعَةِ السُّوءِ وَمِنْ صَاحِبِ
السُّوءِ (ترمذی عن ابی امامہ)

యతహవ్వులు, వ గల బతిల్ అదువ్వి, వషమాతతిల్ ఆదాయి, వమినల్ జూయి ఫ ఇన్నహూ బీసజ్జ జీవు, వ మినల్ ఖయానతి ఫబీసతిల్ బతానతు, వఅన్‌నర్జిఅ అలా ఆఖా బినా అవ్‌నఫ్‌తిన అన్ దీనినా వమి నల్ ఫితని మాజహర మిన్‌హావమా బతన్. వమిన్ యౌమిసస్సూయి మిన్‌లైలతిస్సూయి, వమిన్ సాఅతి స్సూయి, వమిన్ సాహిబిస్సూ."

(తిర్మిజి)

అర్థం:ఓ ప్రభూ! అవాంఛనీయమైన నైతికతలు, ఆచారాలు మనోవాంఛలు మరియు రోగాల నుండి మేము నీ శరణు వేడుతున్నాము. నీ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం) దేన్నుండయితే నీ శరణు జొచ్చారో ఆ విషయం గురించి మేము నీ శరణు కోరుతున్నాము. ఇంకా శాశ్వత నివాసంలో చెడ్డపొరుగువాని నుండి, శత్రువు ప్రాబల్యం నుండి, వైరుల ఎత్తిపొడుపుల నుండి, ఆకలిదప్పుల నుండి చెడ్డరహస్యమయిన ఖియానత్ నుండి (అమానుతులనుకాజేసే దుర్గుణం నుండి), వెనుకంజవేసే దుశ్చర్య నుండి లేదా కల్లోలంలో పడి ధర్మాన్ని వీడే దుష్కార్యం నుండి, కనబడేవి కనబడనివి అయిన యావత్తు చెడుగుల నుండి, చెడ్డ పగలు నుండి చెడ్డ రేయి నుండి, చెడు ఘడియల నుండి, చెడ్డ స్నేహితుని నుండి నీ శరణు వేడుకుంటున్నాము.

దేవుని వరం లభించడం, సంతోషాన్ని లేక ఆనందాన్ని పొందడం అనేది అల్లాహ్ ఒసగిన మహాభాగ్యం. అయితే ఓ వరం అనుకోకుండా లభిస్తే దాని ఆనందమే వేరు. అదే విధంగా కష్టకాలం, ప్రమాదం గురించి అల్లాహ్‌ను శరణు వేడుకోవడం అనేది సహజం. అదే అనుకోకుండా వచ్చి పడితే దాని గురించి వందసార్లయినా శరణు వేడుకో వలసి ఉంది. ఆపదలు ఎదురైన వారికే వాటి తీవ్రత తెలుస్తుంది. మహాప్రవక్త (సఅసం) ఒక దుఆలో మొదటి దాని గురించి వేడుకుంటే (అంటే సంతోషం ఆనందం గురించి) రెండో దాని గురించి శరణు కోరుకున్నారు.

اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ مِنْ فَجَاءَةِ الْخَيْرِ وَاَعُوْذُبِكَ مِنْ فَجَاءَةِ الشَّرِّ۔
(کتاب الاذکار نودی)

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక మిన్‌ఫజా అతిల్ ఖైరి వ అఊజుబిక మిన్ ఫజా అతిష్షరి."

(కితాబుల్ అజ్‌కార్)

అర్థం: ఓ దేవా! నేను అనుకోకుండా వచ్చిపడే ఆనందం, మరియు వరాల గురించి నిన్ను వేడుకుంటున్నాను. అదే విధంగా అనుకోకుండా వచ్చిపడే ముప్పు, కష్టకాలం నుంచి నీ శరణు కోరుకుంటున్నాను.

ప్రపంచ వ్యామోహం అన్ని రకాల చెడుగులకు, పాపాలకు మూలం. అదే విధంగా పరలోక సాఫల్యం అన్నిటికంటే మిన్న. మహాప్రవక్త (సఅసం) హృదయంలో ప్రపంచ వ్యామోహానికి తావేలేదు. అయినా ఆయన ఇలా వేడుకుంటూ ఉండేవారు:

اَللّٰهُمَّ لَا تَجْعَلِ الدُّنْيَا اَكْبَرَ هَمِّنَا وَلَا مَبْلَغَ عِلْمِنَا وَلَا غَايَةَ رَغْبَتِنَا وَلَا تُسَلِّطْ عَلَيْنَا مَنْ لَّا يَرْحَمُنَا۔
(ترمذی ونسائی)

"అల్లాహుమ్మ లా తజ్ అలిద్దున్‌యా అక్బరహమ్మినా వలా మబ్లగ ఇల్‌మినా, వలా గాయత రగ్బతినా, వలా తుసల్లిత్ అలైనా మల్‌లాయర్ హమ్‌నా." (తిర్మిజి, నిసాయి)

అర్థం: ఓ దేవా! ప్రపంచాన్ని మా ధ్యేయంగా చేయకు, అదే విధంగా దీన్నే సర్వంగా ఎంచడంగాని, దీన్ని పొందే తాపత్రయంగాని మాకు లేకుండా చెయ్యి (మాపై కరుణాకటాక్షాలు లేని కర్కశులైన) పాలకులను నియమించకు.

ప్రాపంచిక వ్యామోహాన్ని, భోగలాలసను దుష్టవాంఛలను మనస్సు నుండి తీసి వేసేది, పాపాల నుండి అసహ్యతను పుట్టించేది, ఇహలోకపు ఔన్నత్యభావనను చులకనగా చూసేటట్లు చేసేది, గొప్ప పరీక్షా సమయాల్లో సయితం మనిషిని నిలదొక్కుకునేటట్లు చేసేది దైవం ఎడల గల ప్రేమ ఒక్కటే. ఏ హృదయం అయితే ఈ దైవ ప్రేమను సంతరించుకొని ఉండగలదో ఆ హృదయానికి ఎలాంటి భయప్రలోభాలు కదిలించలేవు. ఎలాంటి సౌందర్యం, అందచందాలూ వంచించలేవు.

సాంప్రదాయకమయిన దైవప్రేమ, మనో ఏకాగ్రత లేని దైవసంస్మరణ చట్టానికి భయపడి చేసే ఆరాధనలు యదార్థమయిన దైవప్రేమకు సరితూగవు. ఎందుకంటే

అనవాయితీ ప్రదర్శనలు, ఆరాధనలు, దొంగ మార్గాలను, బోలెడు సాకుల్ని వెతుక్కోగలవు. త్వరగా అలసిపోనూగలవు. కాని యదార్థమయిన ప్రేమ ఇలాంటి సాకుల్ని వెతకదు. అలుపుసొలుపు లేకుండా పని చేస్తుంది.

దైవప్రవక్త (సఅసం) ఎంతో పకడ్బందీగా ఈ యదార్థ ప్రేమకోసం దుఆ చేసేవారు. ఒక దుఆ ఇలా ఉంది.

**"అల్లాహుమ్మజ్ అల్ హుబ్బక అహబ్బ ఇలయ్యి మిన్ నఫ్సీ వ అహ్లీ వమినల్ మా ఇల్‌బారిద్."**

**(తిర్మిజి)**

اَللّٰهُمَّ اجْعَلْ حُبَّكَ اَحَبَّ
اِلَيَّ مِنْ نَفْسِيْ وَاَهْلِيْ وَمِنَ
الْمَآءِ الْبَارِدِ (ترمذی)

"ఓ అల్లాహ్! నాకు నీ ప్రేమను, నా ప్రాణంకన్నా, నా ఇంటివారికన్నా, చల్లని నీళ్ళకన్నా ఎంతో ప్రియమయినదిగా చెయ్యి."

మరో దుఆ పదాలు ఇలా ఉన్నాయి:

**"అల్లాహుమ్మజ్ అల్ హుబ్బక అహబ్బల్ అష్యాయి ఇలయ్యి వజ్ అల్ ఖష్యతక అఖ్వఫల్ అష్యాయి ఇందీ, వ అఖ్ త అన్నీ హాజాతి ద్దున్‌యా బిష్షౌఖి ఇలా లిఖాయిక వ ఇజా అఖ్‌రర్‌త ఆయున అహ్లి దున్‌యా మినద్దునియా హుమ్ ఫ అఖ్రిర్ అయినీ మిన్ ఇబాదతిక్."**

**(కన్‌జుల్ ఆమాల్)**

اَللّٰهُمَّ اجْعَلْ حُبَّكَ اَحَبَّ
الْاَشْيَآءِ اِلَيَّ وَاجْعَلْ خَشْيَتَكَ
اَخْوَفَ الْاَشْيَآءِ عِنْدِيْ وَ
اَقْطَعْ عَنِّيْ حَاجَاتِ الدُّنْيَا
بِالشَّوْقِ اِلٰى لِقَآئِكَ وَاِذَا
اَقْرَرْتَ اَعْيُنَ اَهْلِ الدُّنْيَا
مِنْ دُنْيَاهُمْ فَاَقْرِرْ عَيْنِيْ
مِنْ عِبَادَتِكَ۔ (کنز الاعمال)

**అర్థం:** "ఓ అల్లాహ్! నాకు నీ ప్రేమను అన్నిటికంటే ప్రియమయినది గాను, నీ భయాన్ని అన్నిటికంటే భయంకరమయినవిగా చెయ్యి. నన్ను నీ దర్శనం కోసం ప్రేరేపించి ప్రపంచ వ్యామోహాన్ని నా నుండి తీసివేయి. ఇంకా నువ్వు ఈ ప్రపంచవాసుల కళ్ళను వారి ప్రాపంచిక వ్యామోహంలో చల్లబరిచినట్లు నా కళ్ళను నీ ఆరాధనలతో చల్లబడేటట్లు చెయ్యి."

అయితే ఈ ప్రేమ, ఈ ఆరాధనలు, ఈ ఆరాధనలను చేసే శక్తి, ఈ జిక్ర్, కృతజ్ఞతా

భావం అన్నీ ఆయన దయాదాక్షిణ్యాల పైన్నే ఆధారపడి ఉన్నాయి. కాబట్టే దైవప్రవక్త (సఅసం) తన ప్రియమైన ఓ సహాబీకి ఇలా తాకీదు చేశారు:

"ఓ ముఆజ్! అల్లాహ్ సాక్షి! నీవంటే నాకు ఎంతో ఇష్టం. నీకు ఇలా తాకీదు చేస్తున్నాను. ఈ దుఆ ఏ నమాజులోను విడువకుండా చేస్తూ ఉండు-

"అల్లాహుమ్మ అఇన్నీ అలా జిక్రిక వ షుక్రిక వ హుస్ని ఇబాదతిక్."

(మిష్కాత్)

يَا مَعَاذُ لَأُحِبُّكَ أُوصِيكَ

يَا مَعَاذُ لَا تَدَعَنَّ فِي كُلِّ صَلٰوةٍ اَنْ تَقُوْلَ اللّٰهُمَّ اَعِنِّيْ عَلٰى ذِكْرِكَ وَشُكْرِكَ وَحُسْنِ عِبَادَتِكَ - (مشكوٰة)

అర్థం: ఓ అల్లాహ్! నీ జిక్ర్, (నీ నామస్మరణ) నీ షుక్ర్ (నీ పట్ల కృతజ్ఞత) మరియు నీ మేలైన ఆరాధన కోసం నాకు సహాయపడు.

## దుఆ అదృష్టానికి, అల్లాహ్‌పై భరోసాకు వ్యతిరేకం కాదు

దుఆ చేయడం, దైవాన్ని వేడుకోవడం అనేది విధివ్రాతకు వ్యతిరేకం అని అనిపిస్తుంది కాని అది నిజం కాదు. దుఆ అదృష్టాన్ని గాని తవక్కుల్‌నిగాని (అల్లాహ్‌పై పూర్తి భారం మోపడానికిగాని) అడ్డుకోదు. సరికదా అలా చేయమని ప్రోత్సహిస్తుంది కూడా. పరిస్థితులు ఎంత దిగజారినప్పటికీ దైవంపై భారం వేసి ఉండటమే తవక్కుల్. దైవ గ్రంథంలో ఏ మహానుభావులకు సంబంధించి అయితే దుఆలు పొందుపరచబడి ఉన్నాయో వారంతా సత్యధర్మవైతాళికులే. తవక్కుల్ వహించడంలో ఉన్నతులు. దుఆ స్వీకరించబడడానికి తవక్కుల్ (అంటే అల్లాహ్‌పై పూర్తి భరోసా ఉండడం) ప్రాథమిక షరతు. కాబట్టే అస్హాబె మూసా (మూసా (అ.స.) అనుచరులు ముందు అల్లాహ్‌పై భరోసా ఉంచే తదుపరి దుఆ చేశారు.

"అలల్లాహి తవక్కల్నా, రబ్బనా లా తజ్ అల్నా ఫిత్నతల్ లిల్ ఖౌమిజ్జాలి మీన్." (యూనుస్)

عَلَى اللّٰهِ تَوَكَّلْنَا رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلْقَوْمِ الظّٰلِمِيْنَ

మేము అల్లాహ్‌పై భరోసా ఉంచాము. ఓ దేవా! మమ్మల్ని అత్యాచారాలకు గురి అయి పరీక్షింపబడే వారిగా చెయ్యకు.

## తఖ్దీర్ (అదృష్టం) రెండు రకాలు

ఒకటి తఖ్దీరె 'ముబ్రమ్' అంటే తప్పనటువంటి తఖ్దీర్. ఏది లభించబడి ఉందో అది జరిగి తీరేది. రెండో రకం తఖ్దిరె 'ముఅల్లఖ్' కొన్ని కర్మలు ఎటూ గాకుండా మధ్యస్థంగా ఉండిపోయి ఉంటాయి. 'తఖ్దీరె ముబ్రమ్'లో మార్పులు జరగడానికి వీల్లేదు. కాని 'తఖ్దిరె ముఅల్లఖ్' మాత్రం షరతులకు లోబడి ఉంటుంది. సదఖా, ఖైరాత్ (దాన ధర్మాలు), చికిత్స ఇంకా ఏదైనా సత్కార్యం చేస్తే అది మారిపోతుంది. ఏ కర్మకు (పనికి) అది షరతు అయితే ఆ కర్మగాని, ఆ కార్యంగాని నెరవేరిస్తే వ్యాధి నయమవవచ్చు. ఆయుష్షు పెరగవచ్చు. ఇంకా అనేక మార్పులూ సంభవించవచ్చు. అల్లాహ్ ఖుర్ఆన్‌లో ప్రస్ఫుటంగా ఈ విషయం చెప్పాడు.

يَمْحُو اللّٰهُ مَا يَشَاءُ وَيُثْبِتُ وَعِنْدَهُ أُمُّ الْكِتَابِ
(رعد)

**అల్లాహ్ దేన్నయినా చెరిపివేయదలచుకుంటే చెరిపివేస్తాడు. దేన్నయినా ఉంచదలచుకుంటే ఆపి ఉంచగలడు. ఆయన పరోక్ష (కనబడని) గ్రంథంలో ప్రతిదీ రాయబడి ఉంది (రఅద్)**

## దుఆ స్వీకరణకై షరతులు

దుఆ విషయంలో కొన్ని మర్యాదల్ని, షరతుల్ని పాటించవలసి ఉంది. వాటిలో కొన్ని షరతులెలా ఉన్నాయంటే అవేగనక పాటించబడకపోతే దుఆ స్వీకరించబడదు. ఆ షరతులు ఇలా ఉన్నాయి:

1. ధర్మసమ్మతమైన ప్రతి చిన్న అవసరం కోసం కూడా దైవాన్నే వేడుకోవాలి. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు–

لِيَسْئَلْ اَحَدُكُمْ رَبَّهٗ حَاجَتَهٗ كُلَّهَا حَتّٰى يَسْاَلَ شِسْعَ نَعْلِهٖ اِذَا انْقَطَعَ
(ترمذی)

**"మీరు మీ అన్ని అవసరాల గురించి దైవాన్నే వేడుకోవాలి. చివరికి మీ చెప్పు వారు తెగిపోయినా సరే దాని గురించి కూడా దైవాన్నే అడగాలి."**
**(తిర్మిజి)**

అయితే, షరీఅత్ ఏ వస్తువునయితే ధర్మసమ్మతంగానిదిగా పాపభూయిష్టమయినదిగా నిర్ణయించిందో దానిని అంటే ఒకరి హక్కుల్ని కొల్లగొట్టడం, ఒకరిపై జులుమ్

చేయడం లేక ఒకరితో సంబంధాల్ని త్రెంచుకోవడంలాంటి వాటి కోసం దుఆ చేయ కూడదు. దివ్యఖుర్‌ఆన్, హదీసుల్లో ఈ విషయాలు ప్రస్ఫుటంగా నిషేధించబడ్డాయి.

يُسْتَجَابُ لِلْعَبْدِ مَا لَمْ يَدْعُ بِإِثْمٍ أَوْ قَطِيعَةِ رَحِمٍ (مسلم)

దాసుని ప్రతి దుఆ స్వీకరించబడు తుంది. అందులో ఏదైనా పాప సంబంధ మయిన, ఒకరి రక్త సంబం ధాల్ని త్రెంచుకొనే విషయాలు తప్ప.

(ముస్లిమ్)

2. రెండో షరతు, దుఆ చేసే వాని సంపాదన ధర్మసంపాదన అయి ఉండడం. ఆ సంపాదనలో ఏదైనా అధర్మ సంపాదన కల్తీ ఉంటే అది తన ఇష్టప్రకారం సంపాదించి నదై ఉండకూడదు. హరామ్ సంపాదన (అధర్మ సంపాదన)లో నిండా మునిగి ఉన్నా దైవాన్ని చేతులెత్తి ఇలా వేడుకున్న ఓ వ్యక్తి ఉదాహరణను మహాప్రవక్త ఇచ్చారని అబూ హురైరా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు:

ثُمَّ ذَكَرَ الرَّجُلَ يُطِيلُ السَّفَرَ أَشْعَثَ أَغْبَرَ يَمُدُّ يَدَيْهِ إِلَى السَّمَاءِ يَا رَبِّ يَا رَبِّ وَمَطْعَمُهُ حَرَامٌ وَمَشْرَبُهُ حَرَامٌ وَمَلْبَسُهُ حَرَامٌ وَغُذِيَ بِالْحَرَامِ فَأَنَّى يُسْتَجَابُ لِذَلِكَ (مسلم)

దైవప్రవక్త (సఅసం) ధర్మ సంపాదన కోసం ప్రజలకు బోధ చేస్తూ ఓ వ్యక్తి గురించి ఇలా అన్నారు– ఓ వ్యక్తి సుదీర్ఘ ప్రయాణంలో ఉండి బాగా అలసిసొలసి ఓ ప్రభూ! నా ఈ విన్నపాన్ని ఆలకించు అని దైవాన్ని ఎంతో దీనంగా వేడుకుం టాడు. (దుఆ మన్నించబడడానికి ప్రయాణవస్థ సరైన సమయమే). అయినా అతని పరిస్థితి ఎలాంటిదంటే అతడు తినేది, త్రాగేది హరాం (అధర్మ సంపాదన నుండి). ఇంకా హరామ్ నుండే అతడు పోషించబడ్డాడు. మరి అలాంటి వ్యక్తి దుఆ ఎలా స్వీకరించ బడుతుంది?"

ధర్మవేత్తలు ఈ హదీసుల వెలుగులో ఇలా అన్నారు:

"దుఆకు రెండు పక్షాలు (రెక్కలు) ఉన్నాయి. ఒకటి ధర్మ సమ్మతమయిన ఆహారం, రెండోది సత్యాన్నే పలకడం" అని.

إِنَّ لِلدُّعَاءِ جَنَاحَيْنِ أَكْلُ الْحَلَالِ وَصِدْقُ الْمَقَالِ ـ

3. మూడోది, ముఖ్యమైనదీ అయిన విషయం. అదేమిటంటే ఒక్కొక్కసారి దుఆ చేసినా మన అవసరం తీరదు. లేదా దుఆ ఫలించడంలో ఆలస్యం అవుతుంది. అయినా మనం విసుగెత్తి దుఆను మాత్రం విడవకుండా చేస్తూ ఉండాలి. మనలో ఏదైనా లోపంవల్ల దుఆ ఫలించడంలో ఆలస్యం కావచ్చు.

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచిస్తున్నారు

"దాసుడు పాప సంబంధమయిన విషయాన్నిగాని లేక రక్త సంబంధాల్ని త్రెంచే విషయాన్నిగాని అర్థించకుండా ఉండనంత వరకు అతని దుఆ స్వీకరించబడుతూనే ఉంటుంది. ప్రధానంగా ఆ దుఆలో (తాజీల్ పాటించకుండా ఉండాలి." 'తాజీల్' అంటే ఏమిటి దైవప్రవక్తా! అని అడి గారు ఆయన అనుచరులు. ఆయన ఇలా అన్నారు: "తాజీల్ పాటిం చడం అంటే దుఆ చేసేవాడు, నేను ఈ విధంగా దుఆ చేశాను. కాని నా దుఆ స్వీకరించబడదని భావిస్తు న్నాను" అని అంటాడు. ఆ తరువాత అతడు విసుగెత్తి దుఆ చేయుడం మానేస్తాడు." (ముస్లిమ్)

يُسْتَجَابُ لِلْعَبْدِ مَا لَمْ يَدْعُ بِإِثْمٍ أَوْ قَطِيعَةِ رَحِمٍ مَا لَمْ يَسْتَعْجِلْ قِيلَ يَا رَسُولَ اللهِ مَا الْاِسْتِعْجَالُ قَالَ يَقُولُ قَدْ دَعَوْتُ فَلَمْ أَرَ يُسْتَجَابُ لِي فَيَسْتَحْسِرُ عِنْدَ ذَالِكَ وَيَدَعُ الدُّعَاءَ (مسلم)

దుఆ ఏ పరిస్థితిలోనూ వృథా పోదు అనే విషయం ముందు రాబోతోంది.

## దుఆ మర్యాదలు

1. దుఆ చేసేవాడు పూర్తి నమ్మకంతో, పూర్తి మనోబలంతో దుఆ చేయాలి. ఎందుకంటే తాను ఎవరితోనైతే దుఆ చేస్తున్నాడో ఆయన ఆధీనంలో సర్వవిశ్వమూ ఉంది. దుఆ చేసేటప్పుడు మనస్సులో ఎలాంటి అవమానానికి తావు ఇవ్వకూడదు. అలానే పరధ్యానంగా, ఏకాగ్రత లేకుండా దుఆ చేయకూడదు. ఏ దుఆ చేసినా పూర్తి ఏకాగ్రతతో చేయాలి.

దైవప్రవక్త ప్రవచనం ఇలా ఉంది:

**"మీరు అల్లాహ్ సన్నిధిలో ఏ విషయం గురించి అయినా దుఆ చేస్తే దాని స్వీకరణపై మీకు పూర్తి నమ్మకం ఉండాలి. మనస్సును ఎక్కడో ఉంచి దుఆ చేసేవాని దుఆను అల్లాహ్ స్వీకరించడు. (తిర్మిజీ)**

اُدْعُوا اللّٰهَ وَاَنْتُمْ مُوْقِنُوْنَ بِالْاِجَابَةِ اِنَّ اللّٰهَ لَا يَسْتَجِيْبُ دُعَاءً مِّنْ قَلْبٍ غَافِلٍ - (ترمذی)

రెండో హదీసులో ఇలా ఉంది:

**"మీలో ఎవరైనా దుఆ చేస్తే "ఓ అల్లాహ్! నీవు తలిస్తే నన్ను మన్నించు, నీవు తలిస్తే నాకు ఉపాధి ప్రసాదించు" అని వేడుకోకూడదు.**

وَلْيَعْزِمْ مَسْئَلَتَهُ اِنَّهُ يَفْعَلُ مَا يَشَاءُ (بخاری)

పూర్తి పట్టుదల, విశ్వాసంతో దుఆ చెయ్యాలి. ఎవ్వరిని యాచిస్తున్నాడో ఆయన తాననుకున్నది ఎలాగూ చేస్తాడు. అందువల్ల పూర్తి నమ్మకంతో దుఆ చెయ్యాలి.

2. సాధ్యమైనంత వరకు సరి అయిన మరియు మనో ఏకాగ్రత ఉండే సమయాల్లోనే చేయాలి. మహాప్రవక్త (సఅసం) ఏ సమయాల్లోనయితే తరచు దుఆ చేసేవారో, మరే సమయాల్లో దుఆ చేయమని బోధించారో, అవి అనేకం. వాటిలో కొన్ని సమయాల గురించి ఇక్కడ రాయడం జరుగుతోంది.

1. ఫర్జ్ నమాజుల తరువాత 2. రాత్రి ఆఖరు ఝాముల అంటే తహజ్జుద్ సమయంలో 3. ప్రయాణం చేస్తున్న సమయంలో 4. అజాన్, ఇఖామత్‌లో మధ్య సమయం 5. జుమా రోజున అస్ర్ నమాజు నుండి మగ్రిబ్ నమాజ్ మధ్య కాలంలో 6. షబెఖద్ర్ రాత్రి, ముఖ్యంగా రమజాన్ నెల ఇరవై ఏడవ రేయి 7. హజ్‌లోని వివిధ సమయాలు

మరియు వివిధ ప్రదేశాల్లో 8. రమజాన్ నెలలో 9. సజ్దా స్థితిలో 10. జుమా రాత్రి అంటే గురువారం పగలు ముగిసిన తరువాత వచ్చే రాత్రి అన్నమాట.

3. దుఆ చేతులెత్తి (దోసిలొగ్గి) చేయాలి. దుఆ అయిన తరువాత రెండు అరచేతులను ముఖంపై నులుపుకోవాలి. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారని హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజిఅన్) ఉల్లేఖిస్తున్నారు:

"మీ ప్రభువు ఎంతో వ్రీడ కలవాడు మరియు కరుణామయుడున్నూ. ఏ దాసుడైతే తన సమక్షమున దోసిలొగ్గి యాచిస్తాడో అతణ్ణి ఆయన రిక్త హస్తునిగా వాపసు చేయడానికి సిగ్గుపడతాడు."

దైవప్రవక్త (స) దుఆ అయిన తరువాత తన రెండు చేతుల్ని ముఖంపై రుద్దుకొనే వారు. అదే కాదు "దుఆ అయిపోయిన తరువాత మీ రెండు చేతుల్ని ముఖంపై త్రిప్పు కోండి" అని ఆదేశించారు కూడా.

4. సాధ్యమైనంత వరకు, ఇహపరలోక సాఫల్యం కోసం పనికి వచ్చే ఉమ్మడి దుఆలనే చేయాలి. వాటి పదాలు కూడా ముక్తసరిగా ఉండి విస్తృత భావం కలిగి ఉండాలి. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఇలా అంటారు:

يستحب جوامع من الدعاء
(ابوداؤد)

**"దైవప్రవక్త ఎల్లప్పుడూ ఉమ్మడి దుఆనే చేసేవారు."**

**(అబూ దావూద్)**

5. ఇమామ్, కేవలం తన ఒక్కడి కోసం ఏక వచనంలో దుఆ చేయకూడదు. ఎల్లప్పుడూ బహువచన ప్రయోగం చేసే దుఆ చేయాలి. ఉదాహరణకు "అల్లాహుమ్మగ్ఫిర్‌లి" అనే బదులు "అల్లాహుమ్మగ్ఫిర్‌లనా" అని అనాలి.

6. దుఆ అనేది వర్తమాన, భవిష్యత్ కాలాలకు సంబంధించిన కష్టనష్టాల గురించి నదై ఉండాలి. దానివల్ల వర్తమానంలో పైనబడిన కష్టాలు, దుఃఖాలు సహించడానికి మంచి సహనశక్తి పెరుగుతుంది. అదేవిధంగా భవిష్యత్కాలంలో ఏర్పడే కష్టనష్టాలు దూరం అయ్యే వీలూ కలుగుతుంది. హదీసులో ఇలా ఉంది:

ان الدعاء ينفع مما
نزل ومما لم ينزل فعليكم
عباد الله بالدعاء (ترمذی)

**"దుఆ అనేది వర్తమాన, భవిష్యత్కాలకు సంబంధించిన అవసరాలకు, వెతలకు ప్రయోజనకారి కాగలదు. కాబట్టి మీరు దుఆ చేయడం విధిగా చేసుకోండి." (తిర్మిజి)**

7. గతంలో చేసిన ఏదేని సత్కార్యాన్ని ప్రస్తావించి, దానిద్వారా తన అవసరాల్ని తీర్చమని దుఆ చేయడం మంచిది. (ముస్లిమ్, తిర్మిజి)

8. శుచీ, శుభ్రతలు కలిగిఉండి ఖిబ్లా వైపు ముఖం ఉంచేసి దుఆ చేయాలి.

9. దైవ స్తోత్రం (హమ్‌ద్) మరియు దరూద్ పఠించి దుఆ చేయాలి.

(బుఖారి, ముస్లిమ్)

## ఫర్జ్ నమాజ్ తరువాత దుఆ

కొందరు ఫర్జు నమాజు అయినాక దుఆ చేయకుండా ఉండటమే కాకుండా అలా చేయడాన్ని సమంజసం కాదు అంటారు. కాని ఫర్జ్ నమాజుల తరువాత చేసే దుఆ మన్నించబడుతుంది. ఈ మన్నింపును పొందే బదులు దాన్ని వదిలేయడం అంటే అర్థం లేని విషయం. దైవప్రవక్త (సఅసం) ఫర్జ్ నమాజులు అయిన తరువాత కుడి లేక ఎడమలకు తిరిగి కూర్చోవడం హదీసుల్లో ఉంది. చేతులెత్తి దుఆ చేయడం ఆ తరువాత ఆ చేతుల్ని ముఖంపై త్రిప్పుకోవడం గురించి ఆయన తాకీదు కూడా చేశారు. సాధారణంగా ప్రవక్త మహనీయులు దుఆలో ఎదురురొమ్ము వరకు తమ చేతుల్ని ఎత్తేవారు. అప్పుడప్పుడు ఇంకొంత ఎత్తు దాకా లేపారని, దానివల్ల చంకలోని తెలుపు కనబడేదని సహాబా (రజిఅన్) చెబుతారు. ఒకవేళ దీన్ని నమాజె 'ఇస్తిస్ఖా'లో చేశారు అని అనుకున్నా నమాజు తరువాత దుఆచేసే రుజువు లభించినట్లే కదా! అదీగాక ఇమామె తిర్మిజీ పేర్కొన్న ఈ హదీసు ఉండనే ఉంది:

عن الفضل بن عباس قال
قال رسول الله صلى الله
عليه وسلم الصلوة مثنى
مثنى تشهد فى كل ركعتين
وتخشع وتضرع وتمسكن
وتقنع يديك، يقول يرفعها
الى ربك مستقبلا ببطونها
وجهك وتقول يارب يارب
ومن لم يفعل ذالك فهو

దీన్ని హజ్రత్ ఫజల్ బిన్ అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించారు: "దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు- నమాజ్ రెండు రకాత్‌లు, ప్రతి రెండు రకాత్‌లలో 'తషహ్హుద్' ఉంది. ఇంకా ఏకాగ్రత, దైన్యమూ ఉన్నాయి. రెండు చేతులను తన ప్రభువు వైపునకు పైకెత్తడం. అలా ఎత్తడంలో రెండు అరచేతుల్ని తన ముఖం వైపునకు ఉంచుకోవడం ఉంది. (అలా చేతులు పైకెత్తి) ఓ

నా ప్రభూ! ఓ నా ప్రభూ!! ఓ నా ప్రభూ!!! అనడం ఉంది. అలా చేయనివాడు ఇలాంటి వాడు అలాంటి వాడు." ఇబ్నె ముబారక్ తప్ప, కొందరు ఈ హదీసులో ఎవరయితే ఇలా చేయరో వారి నమాజు లోపంతో కూడుకొని ఉంటుందని అన్నట్లు అబూ ఈసా తిర్మిజీ అన్నారు. (జామి ఉత్తిర్మిజి)

كذا وكذا قال ابو عيسى وقال غير ابن مبارك في هذا الحديث من لم يفعل ذالك فهو خداج

సఊది అరేబియాలోని "మజ్లిసుల్ బహూసుల్ ఇస్లామియా"కు చెందిన ధర్మవేత్తలు (ఉలమా) 1397 హిజ్రీలో, "అనేక హదీసుల ద్వారా ఫర్జ్ నమాజు తరువాత దుఆ చేయాలని, ముస్లిం ఉమ్మత్‌లో నమాజు తరువాత దుఆ చేయడం అనేది అనాదిగా వస్తున్న ఆచారం కాబట్టి దీన్ని కాదనడం సబబు కాదు" అని తీర్పునిచ్చారు.

## ఎవరి దుఆ మన్నించబడుతుంది

పైన చెప్పిన షరతులను మర్యాదల్ని పాటిస్తూ ఎవరయినా దుఆ చేస్తే ఇన్షా అల్లాహ్ అతడు చేసిన దుఆ మన్నించబడడంలో సందేహం ఏమాత్రం ఉండదు. కాని ముఖ్యంగా ఈ క్రింది వ్యక్తులు చేసే దుఆ తప్పక మన్నించబడుతుందని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

1. ఏ వ్యక్తి అయితే తన సంపన్నత, ఆరోగ్యం మరియు సుఖసంతోషాల కాలంలో అల్లాహ్‌ను మరిచిపోకుండా తన చేతుల్ని చాచి అల్లాహ్‌ను యాచిస్తూ ఉంటాడో అలాంటి వ్యక్తికి దారిద్ర్యం, కష్టనష్టాలు సంభవించినప్పుడు అల్లాహ్‌ను యాచిస్తే అల్లాహ్ తప్పక అతని దుఆను మన్నిస్తాడు.

దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది

"ఏ వ్యక్తి అయితే తన కష్టకాలంలో తన దుఆను అల్లాహ్ మన్నించాలి అని అనుకుంటాడో, అలాంటి వ్యక్తి తన కలిమి కాలంలో అధికంగా దుఆ చేస్తూ ఉండాలి. (తిర్మిజి)

مَنْ سَرَّهُ اَنْ يَّسْتَجِيْبَ اللّٰهُ لَهُ عِنْدَ الشَّدَآئِدِ فَلْيُكْثِرِ الدُّعَآءَ عِنْدَ الرَّخَآءِ (ترمذی)

2. తల్లిదండ్రులకు దుఆ తమ సంతానం కోసం.

3. ముసాఫిర్ (బాటసారి) దుఆ, 4. న్యాయశీలుడైన ఇమామ్ దుఆ, 5. పీడితుని దుఆ అతడు ప్రతీకారం తీర్చుకోనంతవరకు, 6. హాజీ దుఆ అతడు ఇంటికి చేరేటంత వరకు, 7. ముజాహిద్ (దైవమార్గంలో యుద్ధం చేసేవాని) దుఆ, 8. రోగి యొక్క దుఆ.

9. ఓ ముస్లిం తన ముస్లిమ్ సోదరునికై అతని పరోక్షంలో చేసే దుఆ.

వీరందరి గురించి చెప్పిన తరువాత దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

وَاَسْرَعُ هٰذِهِ الدَّعَوَاتِ اِجَابَةً دَعْوَةُ الْاَخِ بِظَهْرِ الْغَيْبِ۔ (بیہقی)

"వీరిలో అందరికంటే త్వరగా స్వీకరించబడే (మన్నించబడే) దుఆ. ఓ ముస్లిమ్ తన ముస్లిం సోదరుని కోసం అతని పరోక్షంలో చేసే దుఆయే" (బైహఖీ)

దుఆకు ముందు దైవస్తోత్రం చేసి, ఆపై దైవప్రవక్త (సఅసం)పై దరూద్ చదివి దుఆ చేయాలి. ఖుద్దుగా దైవప్రవక్త (స) తన సహాబీ (రజిఅన్)ను ఇలా చెయ్యమని చెప్పారు: ఓ వ్యక్తి మరో విధంగా దుఆ చేస్తే, ఆయన (సఅసం) 'నీవు తొందరపడ్డావు' అని అన్నారు. ఆ తరువాత ఇలా ప్రవచించారు:

اَيُّهَا الْمُصَلِّي اِذَا صَلَّيْتَ فَقَعَدْتَ فَاحْمَدِ اللّٰهَ بِمَا هُوَ اَهْلُهُ وَصَلِّ عَلَيَّ ثُمَّ ادْعُهُ

"ఓ నమాజీ (నమాజు చేసేవాడా)! నీవు దుఆ కోసం కూర్చున్నప్పుడు ముందుగా దైవ స్తోత్రం చెయ్యి. తరువాత నాపై 'దరూద్' చదువు. ఆ తరువాతనే దుఆ చెయ్యి." (తిర్మిజి, అబూ దాఊద్, నిసాయి)

## ఒకరిని దుఆ చెయ్యమని కోరడం

తమ చిన్నా, పెద్దలతో తనకోసం దుఆ చెయ్యమని కోరడం సున్నత్. హజ్రత్ ఉమర్ (రజిఅన్), దైవప్రవక్తను ఉమ్రా చేయడానికి అనుమతి ఇవ్వమని కోరగా ఆయనకు అనుమతినిస్తూ, ఇలా కూడా అన్నారు:

اَشْرِكْنَا يَا اَخِيْ فِيْ دُعَائِكَ وَلَا تَنْسَانَا ۔۔

"ఓ సోదరా! నీ దుఆలలో నన్ను కూడా చేర్చు. ఆ సమయంలో మమ్ము మరిచి పోకు. (అబూ దాఊద్, తిర్మిజీ)

దైవప్రవక్త (సఅసం) నోట ఈ మాట వినగానే హజ్రత్ ఉమర్ ఆనంద పరవశులై పోయారు. ఆ సమయంలో ఆయన నోట ఈ మాటలు వెలువడ్డాయి:

كَلِمَةٌ مَا يَسُرُّنِي اِنَّ لِي بِهَا الدُّنْيَا۔ (ابوداؤد، ترمذی)

"నా కోసం దైవప్రవక్త (సఅసం) పవిత్రమయిన నోట వచ్చిన మాటలకు బదులుగా ఈ ప్రపంచం అంతా నాకు లభించినా ఎలాంటి ఆనందం కలుగదు.

(అబూ దావూద్, తిర్మిజి)

## ధర్మసమ్మతమైన దుఆ ప్రయోజనకారే

దైవ సన్నిధిలో ఓ దాసుడు ఏదైన తన అవసరం కోసం చేతులు చాచి యాచిస్తాడో ఆ అవసరం తీరినా తీరకపోయినా అతను చేసిన దుఆ ప్రయోజనకరమైనదే. ఒకవేళ అతడు తన యజమాని, ప్రభువు అయిన అల్లాహ్‌ను ఏదైన ధర్మసమ్మతమయిన భౌతిక వస్తువును అడిగినప్పుడు దైవ దృష్టిలో ఆ వస్తువు అతనికి ప్రయోజనకారి కాకపోయి నట్లయితే దైవం అతని కోరికను తీర్చడు. అయితే ఆ సమయంలో ఆ వ్యక్తికి తన దైన్యతను, తన అశక్తతను ప్రదర్శించే అవకాశభాగ్యం లభించింది. అలాంటి సందర్భాలో అతనిపై వచ్చిపడే ఆపదలు దూరం చెయ్యబడతాయి. లేకుంటే ఆ దుఆ ప్రతిఫలం అతని పరలోకం కోసం దాచివేయబడుతుంది. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ (రజిఅన్) దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారని ఉల్లేఖిస్తున్నారు:

مَا مِنْ مُسْلِمٍ يَدْعُوا بِدَعْوَةٍ لَيْسَ فِيهَا اِثْمٌ وَلَا قَطِيعَةُ رَحِمٍ اِلَّا اَعْطَاهُ اللهُ بِهَا اِحْدٰى ثَلٰثٍ اِمَّا اَنْ يُّعَجِّلَ لَهُ دَعْوَتَهُ وَاِمَّا اَنْ يَّدَّخِرَهَا لَهُ فِي الْاٰخِرَةِ وَاِمَّا اَنْ يَّصْرِفَ عَنْهُ مِنَ السُّوْءِ مِثْلَهَا۔ (احمد)

ముస్లిమ్ యొక్క ప్రతి దుఆను, అందు పాపం, లేక బంధువుల నుండి తెగతెంపుల్లాంటి విషయాలు లేకుండా ఉంటే మూడు రూపాల్లోని ఏదో ఒక రూపంలో మన్నిస్తాడు. అతని అవసరాన్ని త్వరగా పూర్తిచేయడమో, దాన్ని పరలోకం కోసం దాచి ఉంచడమో లేక అతని అవసరానికి తగినవిధంగా అతని పాపాన్ని, లేక ఆపదలను దూరం చేయడమో చేస్తాడు." (అహ్మద్)

ఈ శుభవార్తను విన్న సహాబీలు (రజిఅన్), ఇలా అయితే మేము అధికంగా దుఆ చేస్తుంటాం అని అన్నారు. దైవప్రవక్త (సఅసం) “అల్లాహు అక్బర్– మీరు ఎంత దుఆ చేస్తూ ఉంటారో దైవకారుణ్యం, శుభం కూడా అంతకంటే విశాలమయినది” అని అన్నారు.

(ముస్నదె ఇమామె అహ్మద్)

## శపించకూడదు

వీలైనంత వరకు ఒకరిని దూషించడంగాని, చెడుగా సంబోధించడం గాని చెయ్యకూడదు. సాధ్యమైనంతవరకు అతణ్ణి శపించడంగాని చెయ్యకూడదు. యూదులు దైవప్రవక్త(సఅసం) సన్నిధికి వచ్చినప్పుడల్లా ‘అస్సాము అలైకుం’ “నువ్వు చావా” అని అనేవారు. హజ్రత్ అయిషా (రజిఅన్) వారు ఇలా అంటూ ఉండగా విని ఉగ్రులై వారిని దూషించారు. దైవప్రవక్త (స) ఆమెను వారించారు.

దైవప్రవక్త (సఅసం) విధిలేని సమయాల్లో ఇస్లామ్ శత్రువుల్ని శపించారు. అయితే ఈ శపించడంలో ఆయన ఎలాంటి స్వప్రయోజనాన్ని గాని, ప్రతీకారాన్ని గాని, కోపాన్ని గాని, స్వార్థాన్ని గాని రానివ్వలేదు. తల్లిదండ్రుల దుఆ తమ సంతానం కోసం ఓ వరమే. అయితే వారి శాపనార్థాలు వారి భవిష్యత్తు కోసం అపశకునాలు. చిన్న చిన్న విషయాల్లో సయితం తమ సంతానానికి శాపనార్థాలు పెట్టడం ప్రజల్లో అలవాటుగా మారిపోయింది. ఉదాహరణకు, నువ్వు చచ్చిపో అనో, సర్వనాశనం అయిపొమ్మనో, నీ గోరి కట్టా అనో ఇలాంటి అనేక శాపనార్థాలు పెడుతూ ఉంటారు. ముఖ్యంగా ఈ శాపాలు స్త్రీల నోటే ఎక్కువగా వస్తుంటాయి. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది:

لَا تَدْعُوا عَلٰٓى اَنْفُسِكُمْ
وَلَا تَدْعُوا عَلٰٓى اَوْلَادِكُمْ
وَلَا تَدْعُوا عَلٰٓى اَمْوَالِكُمْ

**“మీరు మీ కోసంగాని, మీ సంతానం కోసం గాని శాపాలు పెట్టుకోకండి. అదే విధంగా మీ ధనధాన్యాలను, మీ క్రింది వారిని మీ నోటితో తిట్టకండి.”**

ఇది ప్రవచించిన తరువాత తిరిగి ఆయన ఇలా అన్నారు:

“మీరు ఏ సమయంలోనయితే ఇలా శపిస్తున్నారో, అది మన్నింపువేళ అయి ఉండి, ఆ శాపం మన్నింపబడుతుందేమో మీకేమయినా తెలుసా? మీ కోపతాపాలు తగ్గాక చివరకు మీరే పశ్చాత్తాప పడతారు.”

## జిక్ర్, దుఆలలో ఏది ప్రాధాన్యం కలిగినది?

పైన చెప్పబడ్డ విషయాల్లో కొన్ని కేవలం దుఆ కోసమే ప్రత్యేకించబడ్డాయి. కాని అధిక విషయాలు జిక్ర్ మరియు దుఆలకే సంబంధించినవి. జిక్ర్ అయినా, దుఆ అయినా, తస్బీహ్ (దేవుని పవిత్రతను చాటే పదాలు) అయినా, తహ్‌లీల్ (దేవుని ఏకత్వాన్ని చాటే పదాలు) అయినా అన్నిటి ధ్యేయం తాను దైవదాసుణ్ణని ప్రకటించడం, దైవానికి అతి చేరువ అవడమే. అయితే నేను చేసిన అధ్యయనం (ఇక్కడ గ్రంథకర్త చేసిన అధ్యయనం) వెలుగులో నాకు అర్థం అయింది ఏమిటంటే దుఆ కంటే జిక్ర్ మరియు తస్బీహ్ స్థానమే కొన్ని సందర్భాల్లో కొంత గొప్పది అని. దుఆలో మనిషి దైన్యత బాగా ఉట్టిపడుతుంది. కాని దానికి తోడు మనిషిలో చిత్తశుద్ధి ఉన్నా, దానితోపాటు అతని అవసరం, అతని స్వార్థం లాంటివి ఇమిడి ఉంటాయి. దానికి భిన్నంగా జిక్ర్‌లో, దైవభీతి, దైవసాన్నిధ్యం లాంటి స్వార్థరహితమయిన అనుభూతులుంటాయి. దైవం ఎడల గల ప్రేమ ఈ జిక్ర్ ద్వారా ప్రస్ఫుటం అవుతుంది. దీని ద్వారా అసాధారణమయిన ఆత్మశాంతి మనిషికి లభిస్తుంది. ఈ మార్గమే దైవానికి అతి చేరువ అయ్యే మార్గం.

ఇమామ్ ఇబ్నె ఖైమ్ (రహ్మాలై) ఈ విషయం గురించి అతి దీర్ఘమయిన చర్చ జరిపారు. ఈ చర్చవల్ల మనకు జిక్ర్ మరియు దుఆలో ఏది మేలైనదో తెలుస్తుంది.

ఆయన ఇలా రాశారు: జిక్ర్ దుఆ కంటే మేలైనది. జిక్ర్ అనేది అల్లాహ్ యొుక్క పూర్తి గుణాలను, ఆయన వరాలను కీర్తించే ప్రక్రియ. దుఆలో దాసుడు తన అవసరాలను గురించి యాచిస్తాడు. అలాంటప్పుడు ఈ రెండు ఒకటి ఎలా అవుతాయి? కాబట్టి హదీసులో ఇలా ఉంది.

"ఎవరయితే నా జిక్ర్‌లో లీనమై దుఆ చేసే వీలు కలిగి ఉండడో అతనికి మేము యాచించే వారి కంటే అధికంగా ప్రసాదిస్తాము" కాబట్టే దుఆ చేసే ముందు దైవస్తోత్రం చేయడం అవసరంగా పెట్టబడింది.

(అల్ వాబిలుస్ సయ్యిబ్)

الذكر افضل من الدعاء الذكر
ثناء على الله عز وجل بجميع
اوصافه والائه والدعاء
سوال العبد حاجته فاين
هذا من هذا ولهذا جاء
في الحديث من شغله ذكري
عن مسئلتي اعطيته افضل
ما اعطي السائلين ولهذا
كان المستحب في الدعاء
ان يبدأ الداعي بحمد الله
تعالى والثناء عليه بين
يدي حاجته (الوابل الصيب)

అనేక హదీసుల వెలుగులో చెప్పబడిందేమిటంటే ఏ దుఆ అయినా జిక్ర్ లేకుండా మన్నించబడదు అని. కాబట్టి దుఆ కంటే జిక్ర్ మేలైనది. కొందరు దుఆయే జిక్ర్ కంటే మేలైనదిగా ఎంచుతారు. కారణం ఇందులోను దాసుడు తన అశక్తతను, దైన్యాన్ని చాటిచెప్పడం అనేది ఉంటుంది, దైవానికి దాసుని ఈ పరిస్థితి అంటే ఇష్టం, కాబట్టి సజ్దా స్థితి దైన్యాన్ని చాటి చెప్పే స్థితి, అందుకనే హదీసులో 'దాసుడు అన్నిటికంటే నాకు దగ్గరగా తన సజ్దా స్థితిలోనే ఉంటాడు' అని ఉంది అంటారు.

మొత్తానికి ఈ చర్చ ఓ ఆసక్తికరమయిన చర్చే. అయితే జిక్ర్ మరియు తస్బీహ్, తహ్లీల్ లేక దుఆ రెండూ దైవానికి అతి చేరువగా వెళ్ళే మార్గాలే.

## జిక్ర్ చేసే విధానాలు

దైవనామస్మరణ, ఎలా జరిగినా, ఏ పద్ధతిలో జరిగినా అది మోమిన్ హృదయంలో మాత్రం ఎల్లప్పుడు ఉండవలసిందే. ఎందుకంటే ఇది మోమిన్ గొప్ప ఆయుధం. అతని శక్తి, అతని శరీరానికి సిసలయిన ఆహారం కూడా అదే. షరీఅత్, జిక్ర్‌కు సంబంధించిన కొన్ని వ్యక్తిగత, సామూహిక రూపాల్ని పద్ధతుల్ని, సమయాల్ని నిర్ధేశించింది. ఉదాహరణకు నమాజ్, రోజా, హజ్, జకాత్ లాంటివి. అయితే ఇవి కాకుండా జిక్ర్, తస్బీహ్, తహ్మీద్ మరియు తహ్లీల్‌కు సంబంధించిన అనేక వ్యక్తిగత, సామూహిక విధానాలు ఉన్నాయి.

హితబోధ (వాజ్) చేసే సభలు, సమావేశాలు, ధార్మిక విద్యను గరిపే పద్ధతి, ధార్మిక విద్యను వ్యాపింపజేయడం లాంటివి కూడా జిక్ర్ క్రిందకే వస్తాయి. అదేకాదు సత్యధర్మ సంస్థాపనంలో చేసే ప్రతి కృషి కూడా జిక్రే. సూఫీలు నిర్వహించే ధ్యానకేంద్రాలు, మదర్సాలు, ఖాన్‌ఖాహ్‌ల జీవితం కూడా జిక్ర్‌లోని ఓ భాగం అనే చెప్పాలి. అయితే వీటిలో చిత్తశుద్ధి, దైవ చింతన అనేవి పూర్తిగా ఉండాలి. కేవలం ఆనవాయితీగా ఇందులో చేరడం కాదు. ఇక్కడ కొన్ని హదీసుల్ని పొందుపరుస్తున్నాం. వీటిద్వారా జిక్ర్ అంటే ఏమిటో తెలిసిపోతుంది.

హజ్రత్ ముఆవియా (రజిఅన్) ఓనాడు ఓ మస్జిద్‌కు వెళ్ళారు. అక్కడ కొందరు కూర్చుని దైవాన్ని గురించిన కొన్ని మంచి మాటలు మాట్లాడుకుంటున్నారు. ఆయన వారిని చూసి, మీరంతా ఇక్కడ కూర్చుని ఏం చేస్తున్నారు అని అడిగారు. మేము ఇక్కడ అల్లాహ్ జిక్ర్ చేస్తున్నాం అని జవాబిచ్చారు. మీరు కేవలం దీని కోసమే కూర్చున్నారా? అని అడిగారు హజ్రత్ ముఆవియా (రజిఅన్). అవును మేము కేవలం దాని కోసమే కూర్చున్నాం అని అన్నారు. అప్పుడు ఆయన ఈ హదీసును వినిపించారు.

ان رسول الله صلى الله عليه وسلم خرج على حلقة من اصحابه فقال ما اجلسكم ههنا قالوا جلسنا نذكر الله ونحمده على ما هدانا للاسلام ومن به علينا آلله ما اجلسكم الا ذالك قالوا آلله ما اجلسنا الا ذالك قال اما انى لم استحلفكم تهمة لكم ولكنه اتنى جبرئيل فاخبرنى ان الله عز وجل يباهى بكم الملئكة (مسلم)

దైవప్రవక్త (సఅసం) ఓ రోజు సహాబా (రజిఅన్) మజ్లిస్ (సమావేశం) చేయగా అక్కడికి వెళ్ళారు. ఆయన వారిని ఉద్దేశించి "మీరంతా దేనికోసం ఇక్కడ గుమికూడారు?" అని అడిగారు. వారు జవాబుగా, "దైవనామస్మరణ కోసం, ఆయన మమ్మల్ని ఇస్లాం వైపు మార్గం చూపినందుకు కృతజ్ఞతలు తెలుపుకోవడానికి ఇక్కడ కూడామ"న్నారు. దైవప్రవక్త (సఅసం) వారికి ఒట్టు వేస్తూ "మీరు నిజంగానే అందుకు ఇక్కడ కూర్చున్నారా" అని అడిగారు. "దైవసాక్షి! ఇంతకంటే వేరే ధ్యేయం మాకు లేదు" అని జవాబిచ్చారు ఆ సహాబా. "నేను మీ నుండి ప్రమాణం చేయించింది అనుమానం వచ్చి కాదు. మీ నోట దీని గురించి ధృవపర్చుకోవడానికి ఇప్పుడే నా వద్దకు హజ్రత్ జిబ్రీల్ (అస) వచ్చి పోయారు. ఆయన, దైవం మీ గురించి దూతల ఎదుట మిమ్మల్ని పొగుడుతున్నాడు అని చెప్పారు" అన్నారు దైవప్రవక్త (సఅసం).

(ముస్లిం)

ఈ సంఘటనలో చర్చకు సంబంధించిన విషయం ఉంది. అది సహాబా (రజిఅన్) తాము ఇస్లామ్ రుజుమార్గం వైపునకు ఎలా మరిలారో చెప్పుకోవడం ఉంది.

హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజిఅన్) దైవ ప్రవక్త ఇలా ప్రవచించారని ఉల్లేఖిస్తున్నారు:

**ఏ మనుషుల సమూహం అయినా దైవ స్మరణ కోసం కూర్చుంటుందో ఫరిష్తాలు (దైవదూతలు) ఆ సమూహాన్ని చుట్టుకుంటారు. దైవ కారుణ్యం ఆ సమూహాన్ని తన వడి లోనికి తీసుకుంటుంది. అప్పుడు శాంతి వారిపై అవతరిస్తుంది. అల్లాహ్ తనవద్ద గల ఫరిష్తాలతో దీని గురించి చెబుతాడు. (ముస్లిమ్)**

لا يقعد قوم يذكرون الله الّا حفتهم الملئكة و غشيتهم الرّحمة ونزلت عليهم السّكينة وذكرهم الله فيمن عنده - (مسلم)

ఈ రెండు హదీసులే కాకుండా మరో హదీసు కూడా ఉంది. దీనిద్వారా జిక్ర్ అంటే ఏమిటో అర్థమవుతుంది.

హజ్రత్ అబూ హురైరా (రజిఅన్) గారి ఓ సుదీర్ఘమయిన ఉల్లేఖనం ఉంది. దాని భావం ప్రకారం, అల్లాహ్ కొందరు దైవదూతల్ని నియమించి ఉంచాడు. వారు నిత్యం జిక్ర్ సమావేశాల్ని వెతుకుతూ ఉంటారు. ఎక్కడయినా ఓ జిక్ర్ సమావేశం జరిగితే వారు కూడా అందులో చేరిపోతారు. చేరి ఆ సమావేశంలో పాల్గొన్న వారందరిని తమ రెక్కలతో కప్పేస్తారు. ఆ మజ్లిస్ (సమావేశం) ముగిసిన పిదప అల్లాహ్ దగ్గరకు వెళ్ళిపోతారు. అల్లాహ్‌కు ఈ విషయం పూర్తిగా తెలిసినా, ఎక్కడి నుండి వచ్చారో అని అడుగుతాడు ఆ దేవదూతల్ని ఉద్దేశించి. ఓ అల్లాహ్ మేము నీ భూమిపై ఉన్న నీ దాసుల దగ్గర నుండి వస్తున్నాం, వారు నీ తస్బీహ్ (పవిత్ర నామాన్ని స్మరించడం), తహ్‌లీల్ (ఏకత్వాన్ని చాటడం), తక్బీర్ (ఔన్నత్యాన్ని చాటడం) మరియు తహ్‌మీద్ (స్తోత్రించడం) చేస్తున్నారు. దైవం వారిని అడుగుతాడు – వారేమని యాచిస్తున్నారు అని. నీ నుండి నీ స్వర్గాన్ని ఆశిస్తున్నారు అని బదులిస్తారు దేవదూతలు. అల్లాహ్ తిరిగి, వారు నా స్వర్గాన్ని చూశారా అని ప్రశ్నిస్తాడు. లేదు వారు నీ స్వర్గాన్ని తిలకించలేదు అని జవాబిస్తారు వారు. వారు దాన్ని చూసి ఉంటే వారి పరిస్థితి ఎలా ఉండేది అని అడుగుతాడు దైవం. వారేగనక దాన్ని చూసి ఉంటే మరింత ఆశపడే వారు, ఓ అల్లాహ్! వారు నీ శరణు వేడుతున్నారు అని

అంటారు దేవదూతలు. దేని నుండి శరణు వేడుతున్నారు అని అడుగుతాడు అల్లాహ్. నీ నరకం నుండి అంటారు దూతలు. వారు నరక భీకరత్వాన్ని చూశారా? అని అడుగుతాడు దైవం. లేదు ప్రభూ! వారు దాని భయంకరత్వాన్ని చూడలేదు అని దూతల జవాబు. దాన్నేగనక చూసి ఉంటే వారి పరిస్థితి ఏమై ఉండేది అని అడుగుతాడు అల్లాహ్, దాని నుండి మరింత శరణు కోరేవారు అని దేవదూతల జవాబు. ఇదే కాదు నీ నుండి మన్నింపు (ఇస్తెగ్ఫార్)ను కూడా కోరుకుంటున్నారు అంటారు దేవదూతలు. అప్పుడు దైవకారుణ్యం పొంగుతుంది. వారందరినీ మన్నించాను, వారడిగింది ఇచ్చాను. నరకం నుండి వారికి శరణం ప్రసాదించాను అంటాడు అల్లాహ్. ఫరిష్తాలు (దేవదూతలు) అంటారు, ప్రభూ! వారిలో ఒకడు చాలా పాపాత్ముడు కూడా ఉన్నాడు. దారిన పోతూ వారితో వచ్చి కూర్చున్నాడు (అతని గురించి ఆదేశం ఏమిటి) అని చెబుతారు. దైవం నుండి ప్రకటన వెలువడుతుంది,

"మేము అతణ్ణి కూడా మన్నించాము. ఇతడు వారి వెంట కూర్చున్నాడు గనుక వారి వెంట కూర్చున్న వాడు రిక్తహస్తుడు కాలేదు."
(బుఖారి, ముస్లిమ్)

وَلَهُ غَفَرْتُ لَهُمْ هُمُ الْقَوْمُ لَا يَشْقَىٰ لَهُمْ جَلِيسُهُمْ
(بخاری ومسلم)

ఇమామ్ నూదీ (రహ్మాలై) ఈ హదీసుల వివరణ ఇస్తూ ఇలా అంటారు:

"జిక్ర్ గొప్పదనం, తస్బీహ్, తహ్లీల్, తక్బీర్, తహ్మీద్‌ల మట్టుకే పరిమితం కాదు అని తెలుసుకోండి. దైవం కోసం ఇంకే మంచి పని (సత్కర్మ) చేసినా అలా చేసేవాడు 'జాకిర్' (జిక్ర్‌చేసేవాడుగానే) అనబడతాడు." (కితాబుల్ అజ్కార్)

اعْلَمْ اَنَّ فَضِيْلَةَ الذِّكْرِ غَيْرُ مُنْحَصِرَةٍ فِي التَّسْبِيْحِ وَالتَّهْلِيْلِ وَالتَّحْمِيْدِ وَالتَّكْبِيْرِ وَنَحْوِهَا بَلْ كُلُّ عَامِلٍ لِلّٰهِ تَعَالَىٰ بِطَاعَةٍ فَهُوَ ذَاكِرُ اللهِ تَعَالَىٰ۔

ఈ సందర్భంలో ఓ విషయం గుర్తుంచుకోవలసి ఉంటుంది. అదేమిటంటే జిక్ర్ ఎన్ని రూపాలున్నాయో వాటిలో ఏ జిక్ర్ అయినా, ఎల్లప్పుడూ మేలును చేకూర్చదు. అయితే సందర్భానుసారంగా ఓ జిక్ర్ మేలయినదిగా మరొకటి మేలు కానిదిగా ఉంటుంది.

ఉదాహరణకు దివ్యఖుర్ఆన్ పారాయణం మేలయిన జిక్ర్. అయితే మీరు దాన్ని రుకూలోనో సజ్దాలోనో తస్బీహ్‌లకు బదులుగా ఖుర్ఆన్ పారాయణం చేస్తే మక్రూహ్ అవుతుంది. ఇదే విధంగా నమాజు చదవనప్పుడూ, నమాజులోని ఖియామ్‌లోను ఖుర్ఆన్ పారాయణం చేయడం తస్బీహ్, తహ్‌లీల్‌ల కంటే మిన్న అయినది.

కాని సమయంతో ముడివడని ఈ సామూహిక జిక్ర్ లేకుండా కొన్ని సమయయాలతో ముడివడిన వ్యక్తిగత జిక్ర్‌లు కూడా ఉన్నాయి. వాటిని దైవ ప్రవక్త (సఅసం) మరియు సహాబా (రజిఅన్) నిత్యం పాటించేవారు. ఇక్కడ వాటినే చెప్పవలసి ఉంది. ఈ జిక్ర్‌ల సంబంధం జీవితంలోని ప్రతి రంగంతోనూ, ప్రతి సందర్భంతోను ముడివడి ఉంది. ఈ జిక్ర్ వగైరాలను, దుఆలను జీవితపు అలవాటుగా చేసుకుంటే వాటి ద్వారా విశ్వాసంలోను, కర్మల్లోను దృఢత్వం సంభవించి ఇన్శా అల్లాహ్ ఇవి దైవానికి చేరువ అవడంలోను, పరలోక సాఫల్యంలోను సహకారులవుతాయి. పైన చెప్పిన సామూహిక ఆరాధనల్లోనూ వీటివల్ల అసాధారణ ప్రయోజనం కలుగుతుంది.

జిక్ర్ మనస్సును కేంద్రీకరించి చేయాలి. కేవలం మొక్కుబడిగా ఉండకుండా ఆలోచన, అవగాహనలతో చేయాలని ఇమామ్ నూదీ (రహ్మలై) అంటారు.

## వ్యక్తిగత జిక్ర్‌లను ఎప్పుడు వదిలేయాలి

కొన్ని సందర్భాల్లో అనేక ధార్మిక, సామూహిక అవసరాలు వచ్చిపడుతూ ఉంటాయి. అలాంటి సందర్భాల్లో వ్యక్తిగతమయిన జిక్ర్‌లను వదలివేయవలసి ఉంటుంది. కొన్ని సందర్భాల్లో వాటిని వదలడం వాజిబ్ అవుతుంది. అలాంటి సమయాల్లో ఎవరయితే తమ జిక్ర్‌ను, తస్బీహ్‌ను వదలరో వారు గొప్ప తప్పిదం చేసిన వారవుతారు. కొన్ని సందర్భాల్లో ఇలా వదలకుండా ఉండడం పాపం క్రిందికి కూడా వస్తుంది. చాలా మంది జిక్ర్ చేసే వ్యక్తులు, అత్యవసరమయిన పనుల్లోను చివరికి ఫర్జ్ నమాజ్ యొక్క మొదటి తక్బీర్‌ను సయితం తమ తస్బీహ్ సంఖ్యను పూర్తి చేయడానికి వదిలేస్తారు (అంటే నమాజులో వచ్చి కలువరు). ఇలా ఎన్నటికీ చేయతగదు. ఎవరి ఇంటికైనా నిప్పంటుకున్నా, గ్రుడ్డివాడు ఎదురుగా ఉన్న వస్తువును ఢీకొని క్రింద పడిపోయే భయమున్నా, ఓ క్షతగాత్రుడు తమ గాయాలచే బాధపడుతున్నా ఇలాంటి సమయాలన్నిటిలోను చేస్తున్న జిక్ర్‌ను వదిలేసి నిప్పును ఆర్పడం, గ్రుడ్డివానికి దారి చూపడం, గాయపడిన వాని గాయాలకు చికిత్స చేయించడం జరగాలి. ఇమామ్ నూది (రహ్మలై) తనగ్రంథం కితాబుల్ అజ్‌కార్‌లో ఇలా రాస్తున్నారు.

"జిక్ర్ చేసే వ్యక్తికి కొన్ని సమయ సందర్భాలు ఎలాంటివి ఎదురవుతాయంటే అవి ఏర్పడినప్పుడు జిక్ర్‌ను వెంటనే నిలిపివేయడం ఉత్తమం. అలాంటి పరిస్థితి దాటిపోయిన తరువాత తిరిగి జిక్ర్ చేయాలి. ఉదాహరణకు జిక్ర్ చేసే పరిస్థితిలో ఎవరయినా సలాం చేసినట్లయితే ఆ జిక్ర్‌ను వదిలేసి ముందు ఆ సలాంకు జవాబు ఇవ్వాలి. ఆ తరువాత జిక్ర్ చేయాలి. ఇదే విధంగా ఏ వ్యక్తి అయినా తుమ్మి 'అల్‌హందులిల్లాహ్' అంటే దానికి వెంటనే జవాబు ఇవ్వాలి. ముఅజ్జిన్ అజాన్ పలుకుతూ ఉంటే మొదట ఆ అజాన్‌కు జవాబు పలకాలి. ఈలాగున్నే ఎక్కడయినా చెడు కనబడితే ముందు దాన్ని దూరం చేయాలి. మంచి మాట చెప్పవలసి వస్తే దాన్ని బోధించాలి. ఎవరయినా ఏదయినా అడిగితే ముందు దానికి సమాధానం ఇచ్చి ఆ తరువాతనే జిక్ర్ మొదలెట్టాలి." (కితాబుల్ అజ్‌కార్)

في احوال تعرض للذاكر
يستحب قطع الذكر
بسببها ثم يعود
بعد زوالها منها
اذا سلم عليه رد
السلام ثم عاد الى
الذكر وكذا
اذا عطس عنده
عاطس شمته
وكذا سمع المؤذن
اجابه وكذا اذا راى
منكرا ازاله او
معروفا ارشده اليه
او مسترشدا اجابه
ثم عاد الى الذكر.

ఇప్పుడు వివిధ సమయాల్లో చేయవలసిన కొన్ని జిక్ర్‌ల గురించి చెప్పబడుతోంది. అవి జీవిత నిత్యకృత్యాలుగా మార్చుకునే ప్రయత్నం చెయ్యాలి. నమాజుకు సంబంధించినవి అంటే మస్జిద్‌లోనికి వచ్చిపోయేవి, మలమూత్ర విసర్జన (ఇస్తంజా)కు సంబంధించినవి మరియు వుజూ వైగారాలకు సంబంధించినవి అయిన జిక్ర్‌లు ఏవయితే హదీసుల్లో ఉన్నాయో అవి ఇదివరకే చెప్పబడ్డాయి.

## ఉదయం సాయంకాలాలకు సంబంధించిన దుఆలు

ఉదయం సాయంకాల సమయాలకు సంబంధించిన అనేక దుఆలు దైవప్రవక్త (సఅసం) ఆచరణ ద్వారా రుజువవుతున్నాయి. వాటిలోని రెండు మూడు చిన్న దుఆలు ఇక్కడ రాయబడుతున్నాయి.

హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) గారి ఉల్లేఖనం ప్రకారం, ఈ దుఆను ఎవరయితే ఉదయం, సాయంకాలం పూటల్లో మూడుసార్లు చదువుకుంటే ఏదీ అతనికి నష్టం కలిగించదు అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

"బిస్మిల్లాహిల్లజీ లా యజుర్రు మ అఇస్మిహీ షైఉన్ ఫిల్ అర్జి వలా ఫిస్సమాయి వహువస్సమీ ఉల్ అలీమ్." (ముస్నదె అహ్మద్, తిర్మిజీ)

بِسْمِ اللّٰهِ الَّذِيْ لَا يَضُرُّ مَعَ اسْمِهٖ شَيْئٌ فِي الْاَرْضِ وَلَا فِي السَّمَآءِ وَهُوَ السَّمِيْعُ الْعَلِيْمُ (مسند احمد ترمذی)

అర్థం అల్లాహ్ నామమే అలాంటిది. ఆ నామం తోడుంటే ఏ వస్తువు భూమ్యా కాశాల్లో నష్టం వాటిల్ల చేయదు. ఆయన వినేవాడూ, అన్నీ తెలిసిన వాడూనూ.

1. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజిఅన్) గారు, దైవప్రవక్త (స) నోట సాయం సమయంలో ఈ దుఆ ఉండేదని (అంటే ఆయన దాన్ని పఠించేవారని) ఉల్లేఖించారు:

"అమ్సైనా వ అమ్సల్ ముల్కు లిల్లాహి లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీకలహు లహుల్ ముల్కు వలహుల్ హందు వహువ అలాకుల్లి షైఇన్ ఖదీర్. అల్లా హుమ్మ ఇన్నీ అస్అలుక మిన్ఖైరి హాజిహిల్లయి లతి వ ఖైరి మాఫీహా. అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ షర్రిహా వషర్రిమాఫీహా. అల్లాహుమ్మ ఇన్నీ

اَمْسَيْنَا وَاَمْسَى الْمُلْكُ لِلّٰهِ لَا اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْئٍ قَدِيْرٌ اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ مِنْ خَيْرِ هٰذِهِ اللَّيْلَةِ وَخَيْرِ مَا فِيْهَا اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُبِكَ مِنْ شَرِّهَا وَشَرِّ مَا فِيْهَا

**అఊజుబిక బినల్ కస్‌లి వల్ హరమి**
**వసూఇల్ కిబరి వ ఫిత్నతిద్దునియా**
**వ అజాబిల్ ఖబ్ర్."**

اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُبِكَ
مِنَ الْكَسَلِ وَالْهَرَمِ
وَسُوْٓءِ الْكِبَرِ وَفِتْنَةِ
الدُّنْيَا وَعَذَابِ الْقَبْرِ

అర్థం: ఈ సాయంకాలం ఇలా వచ్చింది. ఎలా అంటే మేము, ఈ విశ్వం అంతా అల్లాహ్ రాజ్యమే. సకల కృతజ్ఞతలు సకల స్తోత్రాలు ఆయనకే చెల్లు. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఏకైక ఆరాధ్యుడు. ఈ ఆరాధనలో ఆయనకు ఎవ్వరు భాగస్వాములు కారు. సకల సామ్రాజ్యం సకల అధికారం ఆయనదే. ఆయనకే అన్ని స్తోత్రాలు. ఆయన ప్రతిదీ చేయగల శక్తిమంతుడు. ఓ అల్లాహ్ నేను నీ నుండి, ఈ రాత్రి, ఈ రాత్రిలో లీనం అయి ఉన్న వాటన్నిటి మేలును కోరుతున్నాను. ఇంకా ఈ రాత్రి యొక్క చెడుగు నుండి, ఈ రాత్రిలో దాగి వున్న దాని చెడుగు నుండి నీ శరణు వేడుకుంటున్నాను. ఓ అల్లాహ్ నేను సోమరితనం నుండి, అధికమయిన వృద్ధాప్యం, మరియు ఆ వృద్ధాప్యం యొక్క బాధల నుండి నీ శరణు వేడుకుంటున్నాను." (ముస్లిమ్)

ఇంకా ఉదయం కూడా ఈ దుఆనే కొన్ని పదాల తేడాతో చదివేవారు.

**"అస్‌బహ్‌నా వ అస్‌బహల్ ముల్‌కు లిల్లాహి వల్‌హందు లిల్లాహి లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లాషరీకలహు లహుల్ ముల్కు వలహుల్ హందు వహువ అలాకుల్లి షైఇన్ ఖదీర్. అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక మిన్‌ఖైరి హాజిహిల్ యౌమ వ ఖైరి మాఫీహి వ అఊజుబిక మిన్‌షర్రిహీ వషర్రి మా ఫీహి."**

اَصْبَحْنَا وَاَصْبَحَ الْمُلْكُ
لِلّٰهِ وَالْحَمْدُ لِلّٰهِ لَآ اِلٰهَ اِلَّا
اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ
لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ
وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ۔
اَللّٰهُمَّ اِنِّیْ اَسْئَلُكَ مِنْ
خَيْرِ هٰذِهِ الْيَوْمِ وَخَيْرِ مَا
فِيْهِ وَاَعُوْذُبِكَ مِنْ
شَرِّهٖ وَشَرِّ مَا فِيْهِ۔

అర్థం: ఈ ఉదయం ఇలా అయింది. ఎలా అంటే ఈ సర్వ విశ్వం దేవుని సామ్రాజ్యం, ఆయన తప్ప వేరే ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు ఎవ్వరూ

భాగస్వామి లేడు. ఆయనదే ఈ సామ్రాజ్యం. ఆయన కొరకే సర్వస్తోత్రాలు. ఆయన ప్రతిదీ చేయకలిగిన శక్తి కలవాడు. ఓ అల్లాహ్ మేము నీ నుండి ఈ పగలు, ఈ పగలులో ఉన్న దాని మేలును కోరుతున్నాము. మరియు ఈ పగలు మరియు ఇందులో దాగి ఉన్న చెడుగు నుండి నీ శరణు కోరుతున్నాము. (ముస్లిమ్)

2. హజ్రత్ ముహమ్మద్ (స) గారి ఓ సేవకుడు హజ్రత్ సుబాన్ (రజిఅన్), దైవ ప్రవక్త (స) ఇలా ప్రవచించారని చెప్పారు: "ఏ ముస్లిమ్ అయినా ఉదయం సాయంకాలం ఈ వాక్యాలను మూడుసార్లు ఉచ్ఛరిస్తే అల్లాహ్ అతణ్ణి ప్రళయదినం నాడు సంతుష్టునిగా చేస్తాడు. ఇది అల్లాహ్‌పై ఉన్న హక్కు. ఆ వాక్యాలు ఇవి.

"రజీతుబిల్లాహి రబ్బంవ్ వ బిల్ ఇస్లామి దీనంవ్ వబి ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ నబియ్యా." (అబూ దావూద్)

رَضِيتُ بِاللهِ رَبًّا وَّبِالْإِسْلَامِ دِيْنًا وَّبِمُحَمَّدٍ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ نَبِيًّا

**అర్థం:** అల్లాహ్‌యే పోషకుడు ఇస్లామే నిజధర్మం. ముహమ్మద్ (స) దైవప్రవక్త అవడం అన్న విషయాలపై నేను సంతుష్టుడనయ్యాను.

3. దైవప్రవక్త (స) గారి మరొక ప్రత్యేక సేవకులు హజ్రత్ అనస్ (రజిఅన్) గారి ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స), హజ్రత్ ఫాతిమా (రజిఅన్‌హా)కూ ఈ క్రింది దుఆను ఉదయం సాయంకాలాలలో చదువుతూ ఉండమని బోధించారు:

యాహయ్యు యా ఖయ్యూము బి రహ్మతిక అస్త గీసు అస్‌లిహ్‌లీ షానీకుల్లహూ వ లాతకిల్‌నీ ఇలా నఫ్సీ తుర్ఫత అయిన్." (నిసాయి, హాకిమ్)

يَا حَيُّ يَا قَيُّوْمُ بِرَحْمَتِكَ أَسْتَغِيْثُ أَصْلِحْ لِيْ شَأْنِيْ كُلَّهُ وَلَا تَكِلْنِيْ إِلَى نَفْسِيْ طَرْفَةَ عَيْنٍ۔
(نسائی، حاکم)

**అర్థం:** ఎల్లప్పుడూ సజీవంగా ఉండేవాడా! ఈ విశ్వానికి ఆధారమా! దాన్ని నడిపే వాడా! నీ కారుణ్యం ద్వారా, నా ప్రతి పరిస్థితిని, ప్రతి పనిని చక్కదిద్దమని వేడుకుంటు న్నాను. ఒక క్షణం కోసం కూడా నన్ను నా మనస్సుకు బానిసగా చేయకు.

## నిద్రపోయేటప్పుడు చేసే దుఆ

నిద్ర కూడా ఓ తేలికపాటి మృత్యువే అని దివ్యఖుర్ఆన్‌లో చెప్పబడింది. అయితే నిద్రకూ మృత్యువుకు తేడాను గురించి దివ్యఖుర్ఆన్ ఇలా వివరిస్తోంది.

اَللّٰهُ يَتَوَفَّى الْاَنْفُسَ حِيْنَ مَوْتِهَا وَالَّتِيْ لَمْ تَمُتْ فِيْ مَنَامِهَا - (زمر)

"అల్లాహ్ మృత్యువు సమయంలో ప్రాణాలను హరిస్తాడు. నిదురలో ప్రాణాలు చావవు." (జుమర్)

కాబట్టి ప్రతి రోజు మనిషి నిదురించడం అంటే తన జీవితం యొక్క ఓ ఘట్టాన్ని పూర్తి చేసి మృత్యుహద్దుల్లోకి అడుగుపెడతాడన్న మాట. అతడు నిదుర నుండి మేల్కొన్నాడంటే దైవం తరఫున అతనికి తిరిగి జీవితం ప్రసాదించబడుతుందన్న మాట. ఇంకా నిదుర అనేది మరో విధంగా ఓ విలువైన వరం మనిషి రాత్రి కొన్ని గంటలు నిద్రించి పగటి అలుపును పారద్రోలుతాడు. కొద్ది సమయం కోసం అనేక మానసిక వత్తిడుల నుండి విముక్తి పొందుతాడు. కాబట్టి నిద్ర అనేది ఈ ప్రపంచంలో అతి విలువైనదని చెప్పవచ్చు.

ఎవరికైతే నిద్రపోయే వీలు చిక్కదో లేక నిద్రలేమిలాంటి వ్యాధికి గురి అయి ఉంటారో వారే దాని విలువను అర్థంచేసుకోగలరు. కాబట్టి ఒక దాసుని దాస్యానికి గుర్తు ఏమిటంటే అతడు జీవితంలోని ఈ ఘట్టంలో ప్రవేశించేటప్పుడు, ఆ ఘట్టం నుండి బయటకు వచ్చేటప్పుడు, తన దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆ దైవ సంఘర్షణతో ఈ ఘట్టంలో ప్రవేశించాలి. దాని ఆధారంగానే ఆ ఘట్టం నుండి బయటపడాలి.

హజ్రత్ ఆయిషా (రజిఅన్) గారు ఓ ఉల్లేఖనంలో ఇలా సెలవిచ్చారు: "దైవప్రవక్త (స) నిద్రకు ఉపక్రమించేటప్పుడు ఇఖ్‌లాస్ సూరాన్, ఫలఖ్ సూరాను, నాస్ సూరాను పఠించి తమ రెండు అరచేతులపై ఊదుకునేవారు. తరువాత ఆ అరచేతుల్ని తమ శరీరంపై నిమురుకునేవారు. ఇది ఆయన రోజువారి పనిగా ఉండేది." (బుఖారి, అబూదావూద్)

ఓ మారు దైవప్రవక్త (స) అస్వస్థతకు గురిఅయ్యారు. అప్పుడు హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఈ సూరాలను పఠించి తన చేతులపై ఊది దైవప్రవక్త (స) శరీరంపై నిమిరారు.

హజ్రత్ హుజైఫా (రజిఅన్) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) తమ పడకపై నిద్రకు ఉపక్రమించే ముందు తమ కుడి చేతిని తన చెక్కిలి క్రింద ఉంచుకొని కుడిప్రక్కకు ఒత్తిగిలి ఈ దుఆ చదివేవారు:

"అల్లాహుమ్మ బిఇస్మిక అమ్‌వాతు వ అహ్‌యా" (ముస్లిమ్)

اَللّٰهُمَّ بِاسْمِكَ اَمُوْتُ وَاَحْيَا (مسلم)

అర్థం: ఓ అల్లాహ్! నేను నీ నామంతోనే మరణిస్తాను. మరియు నీ నామంతోనే తిరిగి జీవిస్తాను.

## నిద్ర మేల్కొనేటప్పుడు చదివే దుఆ

దైవప్రవక్త (స) నిద్ర నుండి మేల్కొన్న తరువాత దైవానికి కృతజ్ఞత తెలిపే ఈ వాక్యాలు పలికేవారు:

"అల్‌హందులిల్లాహిల్లజీ అహ్‌యానా బఅద మా అమాతన వ ఇలైహి న్నుషూర్." (ముస్లిమ్)

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْٓ اَحْيَانَا بَعْدَ مَآ اَمَاتَنَا وَاِلَيْهِ النُّشُوْرُ۔ (مسلم)

అర్థం: మరణించిన తరువాత బ్రతికించే వానికి కృతజ్ఞతలు(సకల స్తోత్రాలు). మరణించిన తరువాత ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.

## భోజనం చేసే ముందు, చేసిన తరువాత చేసే దుఆలు

కడుపునిండా అన్నం లభించడం అనేది అల్లాహ్ ప్రసాదించే గొప్ప వరాల్లో ఒకటి. కడుపునిండా లభించని పక్షంలో ఓ సాధారణ వ్యక్తి యొక్క విశ్వాసం ప్రమాదంలో పడవచ్చు. కాబట్టి కడుపు నిండా భోజనం లభించినప్పుడు దైవానికి కృతజ్ఞతలు తెలుపు కోవడం, ఆయన్ను స్తోత్రించడం జరగాలి. దైవప్రవక్త (స) ఇలాంటి సందర్భాల కోసం సూచించిన దుఆల వల్ల ఈ భావం ఎల్లప్పుడు తాజాగా ఉంటుంది. ఆయన ఇలా ప్రవచించారు

'మీరు భోజనం చెయ్యడం ప్రారంభిస్తే 'బిస్మిల్లాహ్' అని ప్రారంభించండి. 'బిస్మిల్లాహ్' అని అనడం మరిచిపోతే అది జ్ఞాపకం వచ్చినప్పుడు "బిస్మిల్లాహి అవ్వలిహి వ ఆఖిరిహీ" అనండి. భోజనం ముగించాక ఈ దుఆ చేయండి.

"అల్‌హందులిల్లాహిల్లజీ అత్ అమన వసఖాన వజ అలన మినల్ ముస్లిమీన్".

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْٓ اَطْعَمَنَا وَسَقَانَا وَجَعَلَنَا مِنَ الْمُسْلِمِيْنَ (ابوداود، مسند احمد)

**భావం:** మమ్మల్ని తినిపించిన, త్రాపించిన ఆ దైవానికి కృతజ్ఞతలు. ఇంకా ఆయన మమ్మల్ని ముస్లిముగా చేసినందుకు కృతజ్ఞతలు. (అబూ దావూద్ – మస్నదె అహ్మద్)

## విందు భోజనానికి వెళ్ళినప్పుడు చేయవలసిన దుఆ

మీరు ఎప్పుడయినా మీ బంధువు ఇంటనో, స్నేహితుని ఇంటనో భోజనం చేస్తే, కేవలం ఆనవాయితీగా వారికి కృతజ్ఞతలు చెప్పవద్దు. అతని కోసం దైవ సన్నిధిలో దుఆ కూడా చేయండి. ఎలాగయితే అతడు మీ కోసం విందు ఏర్పాటు చేశాడో ఇతరులు కూడా అతనికి అలానే విందు ఏర్పాటు చేయాలి అనే భావన మీలో కలగాలి. దైవప్రవక్త (స) ఎప్పుడయినా ఇతరుల ఇంట భోజనం చేస్తే ఆ ఇంటివారి కోసం ఇలా దుఆ చేసేవారు:

اَللّٰهُمَّ اَطْعِمْ مَنْ اَطْعَمَنِىْ
وَاَسْقِ مَنْ سَقَانِىْ (مسلم)

"అల్లాహుమ్మ అత్ఇమ్ మన్ అత్
అమనీ వ అస్ఖి మన్ సఖాని."

**అర్థం:** ఓ అల్లాహ్! నాకు తినిపించిన వానికి నీవు తినిపించు. నాకు త్రాగేందుకు ఇచ్చిన వ్యక్తికి నీవు త్రాపించు. (ముస్లిం)

## మల విసర్జనకు ముందు చేయవలసిన దుఆ

మనిషి ఆరోగ్యం అతని జీర్ణాశయ ప్రక్రియ ఆరోగ్యంపై ఆధారపడి ఉంటుంది. అది ఒక రోజు కోసం చెడిపోతే మనిషి శారీరక బాధలను, మానసిక చిక్కుల్ని అనుభవిస్తాడు. ఇలాంటి సందర్భం ఎదురయిన వారికే ఆ బాధలు బాగా అర్థం అవుతాయి. కాబట్టి అలాంటి అనారోగ్యం ఏర్పడినప్పుడు భౌతికపరమయిన చికిత్సలకు తోడు ఆధ్యాత్మిక చికిత్స (అంటే దైవాన్ని వేడుకోవటం) కూడా జరగాలి. ఎందుకంటే ఆరోగ్యాన్ని వ్వడం, రోగాన్ని పారద్రోలడం దైవం చేతిలోనే ఉంది. మల విసర్జనకు ముందు, ఆ పని ముగిసిన తరువాత చేసే దుఆలు ఇది వరకే దుఆయె ఇస్తింజా అధ్యాయంలో చెప్పబడ్డాయి. చూడండి.

## మజ్లిస్ (సభ)కు సంబంధించిన దుఆ

సాధారణంగా మనిషి సభలో(మజ్లిస్) కూర్చున్నప్పుడు అతడు తప్పుడు మాటలు మాట్లాడకపోయినా కనీసం అర్థంలేని మాటలయినా అతని నోట తప్పక వెలువడతాయి. దీని చెడు ఫలితం నుండి రక్షించుకోబడాలంటే సభ నుండి లేచేటప్పుడు దైవానికి క్షమాపణ చెప్పుకోవాలి. ఆ దుఆ ఇది:

"సుబ్హానకల్లాహుమ్మ వబిహమ్దిక
అష్హదుఅంల్లా ఇలాహ ఇల్లా
అంత అస్తగ్ఫిరుక వ అతూబు
ఇలైక్."

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ
أَشْهَدُ أَنْ لَّآ إِلٰهَ إِلَّا
أَنْتَ أَسْتَغْفِرُكَ وَأَتُوْبُ
إِلَيْكَ -

అర్థం: దేవా! సకల లోపాలకు అతీతమయిన నీ పవిత్రతను కొనియాడుతున్నాను. నీ స్తోత్రం చేస్తున్నాను. నీవు తప్ప ఎవ్వరూ పూజ్యులు కారు అని నేను సాక్ష్యం ఇస్తున్నాను. నా పాపాల నుండి నీ మన్నింపు కోరుతున్నాను; నీ వైపుకే మరలుతాను.

(అబూదావూద్, తిర్మిజీ)

## బజారుకు వెళ్ళేటప్పుడు చేసే దుఆ

దైవప్రవక్త ముహమ్మద్ (స), ప్రపంచంలోని అతి మేలయిన ప్రదేశం మస్జిద్ అని, అతి చెడ్డదైన ప్రదేశం బజారు అని సెలవిచ్చారు. బజారుకు సంబంధించిన కీడు నుండి మనిషి ఎప్పుడు రక్షించబడతాడంటే క్రయవిక్రయాల కోసం షరీఅత్ నిర్ణయించిన హద్దుల్ని, పరిమితుల్ని దృష్టిలో ఉంచుకొని మసలుకోవాలి. అదే విధంగా బజారు కేవలం తన అవసరాలను తీర్చుకునేచోటు మాత్రమే, షికారు కొట్టే స్థలం కాదు అని తెలుసు కోవాలి. ఈ వైఖరి జనించేది అతడు తన మనోమస్తిష్కాల నుండి దైవధ్యానాన్ని మటుమాయం చేయకుండా ఉన్నప్పుడే. ప్రవక్త (స) బజారుకు వెళ్ళినప్పుడు సతతం ఈ దుఆ చేస్తూ ఉండేవారు:

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్
ఖైర హాజిహిస్సూఖి వఖై
రిమాఫీహా వ అఊజు బిక మిన్
షర్రిహా వ షర్రి మాఫీహా.
అల్లాహుమ్మ ఇన్నీ అఊజు బిక
అన్ ఉసీబ ఫీహా యమీనన్
ఫాజిరతన్ అవ్ సఫ్ఖతన్ ఖాసిర"

اَللّٰهُمَّ إِنِّيْٓ أَسْئَلُكَ خَيْرَ
هٰذِهِ السُّوْقِ وَخَيْرَ مَا
فِيْهَا وَأَعُوْذُبِكَ مِنْ
شَرِّهَا وَشَرِّ مَا فِيْهَا اللّٰهُمَّ
إِنِّيْٓ أَعُوْذُبِكَ أَنْ أُصِيْبَ
فِيْهَا يَمِيْنًا فَاجِرَةً
أَوْصَفْقَةً خَاسِرَةً -

అర్థం: ఓ అల్లాహ్! నేను ఈ బజారుకు సంబంధించిన మంచి విషయాలను, ఈ బజారులోని మంచిని నీ నుండి కోరుతున్నాను. ఇంకా నేను ఈ బజారుకు సంబంధించిన

చెడు నుండి మరియు ఈ బజారులోని కీడు నుండి నీ శరణు కోరుచున్నాను. ఓ అల్లాహ్ నేను అసత్య ప్రమాణం చేయడం గురించి, నష్టం వాటిల్లే వ్యవహారం చేయడం గురించి నీ శరణు వేడుతున్నాను." (తిబ్రాని, హాకిమ్)

మనిషి ఎంత మంచి స్థితిలో ఉన్నా తన స్థితిపట్ల తృప్తి పడదు. అందుకే దైవ ప్రవక్త(స) ప్రాపంచిక విషయాల్లో మనకంటే తక్కువ స్థోమత ఉన్న వారినే చూడండి, ధార్మికమైన విషయాల్లో మీ కంటే గొప్ప స్థోమతలు ఉన్న వారిపై దృష్టిని ఉంచండి అని సెలవిచ్చారు. యదార్థం ఏమిటంటే మనిషి ఈ దేశంలో వ్యాపించి ఉన్న వేలాది మంది నిరాశ్రయుల్ని, ఆకలితో అలమటించే వారిని వ్యాధిగ్రస్తుల్ని, అంగవికలురను, అంధుల్ని, కుష్టురోగుల్ని గనక తన దృష్టిలో ఉంచుకుంటే అతని నోట కృతఘ్నుతకు బదులు కృతజ్ఞతా వచనాలే వెలువడతాయి.

## కష్టాల్లో చిక్కుకున్న వారిని చూసి చేసే దుఆ

మహాప్రవక్త (స), ఎవరినైనా కష్టాల్లో చిక్కుకోగా చూస్తే ఈ దుఆ చదవండి అని సెలవిచ్చారు. దీనివల్ల కృతజ్ఞతాభావం పెల్లుబికి దైవచిత్తం అయితే మనిషి ఆ కష్టం నుండి సంరక్షించబడవచ్చు.

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ عَافَانِيْ مِمَّا ابْتَلَاكَ بِهٖ وَفَضَّلَنِيْ عَلٰى كَثِيْرٍ مِّمَّنْ خَلَقَ تَفْضِيْلًا

"అల్‌హమ్‌దులిల్లాహిల్లజీ ఆఫానీ మిమ్మజ్ తలాక బిహీ వ ఫజ్జలనీ అలా కసీరిమ్ మిమ్మన్ ఖలఖ తఫ్జిలా"

అర్థం: ఆ దైవానికి కృతజ్ఞతలు, ఎవరయితే మమ్మల్ని ఈ కష్ట నుండి రక్షించాడో తన అనేకమైన సృష్టితాల్లో నాకు అనుగ్రహాన్ని ఒసిగాడు. (తిర్మిజీ, నిసాయి)

## పిల్లల సంరక్షణ మరియు దిష్టి కోసం దుఆ

దిష్టి (చెడు దృష్టి) అనేది యదార్థం. దీని ప్రభావం అధికంగా పిల్లలపై పడుతుంది. దైవప్రవక్త (స) హజ్రత్ హసన్, హుసైన్ (రజిఅన్)ల రక్షణకు ఈ దుఆ చేసేవారు:

اَعُوْذُ بِكَلِمَاتِ اللّٰهِ التَّآمَّةِ مِنْ كُلِّ شَيْطَانٍ وَّهَامَّةٍ وَمِنْ كُلِّ عَيْنٍ لَامَّةٍ۔

"అఊజు బికలిమా తిల్లాహిత్తామతి మిన్‌కుల్లిషైతానివ్‌ం వ హామ్మతివ్‌ం వమిన్ కుల్లి అయినిన్ లామ్మహ్"

అర్థం: అల్లాహ్ యొక్క దృఢమైన కలిమాత్ (మాటల) ద్వారా షైతాన్ బారి నుండి విషపూరితమై ప్రాణాపాయంగల జంతువుల బారి నుండి, దిష్టి (చెడుదృష్టి) తగిలించే కళ్ళ బారి నుండి ఆయన శరణు వేడుకుంటున్నాను. (బుఖారి, తిర్మిజీ)

అబూ సయీద్ ఖుద్రి (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఎల్లప్పుడు జిన్నుల, మనుషుల చెడు దిష్టి నుండి అల్లాహ్ శరణు వేడేవారు అని తెలుస్తోంది. ముఅవ్విజతైన్ అంటే సూరే ఫలఖ్ (ఖుల్ అవూజుబిరబ్బిల్ ఫలఖ్) సూరె నాస్ (ఖుల్ అవూజు బిరబ్బిన్ నాస్) అవతరించిన తరువాత ఇతర దుఆలన్నిటిని వదిలేసి ఈ సూరాల ద్వారా శరణు వేడేవారు. ఏ పిల్లవానికైనా దిష్టి తగిలితే ఈ సూరాను చదివి ఊదడం ప్రయోజనకరం. వీటితో ఫాతిహా సూరాను కూడా కలుపుకొని చదివితే ఫలితం మరింత బాగుంటుంది. ఫాతిహా సూరాను కొందరు సహాబీలు (అనుచరులు) ఇతర వ్యాధుల కోసం దుఆగా ఉపయోగించారు. దైవప్రవక్త (స) ఈ విషయాలన్ని విని కాదనలేదు.

## ఋణ విమోచనకు దుఆ

మనిషికి వచ్చి పడే పెద్ద పెద్ద కష్టాల్లో, ఋణం (అప్పు) కూడా ఓ పెద్ద కష్టమే. అప్పు మనిషిని నీచునిగా మారుస్తుంది. మనిషిని తనను తన దృష్టిలోను ఇతరుల దృష్టిలోను దిగజారుస్తుంది. ఈ పీడ నుండి ఎంత త్వరగా విముక్తుడయితే అంత మంచిది. దాన్ని తీర్చేందుకు చేసే ప్రయత్నాలకు తోడు అల్లాహ్‌ను కూడా వేడుకోవాలి. దీని కోసం సూరా ఆలి ఇమ్రాన్‌లోని ఆయత్ "ఖులిల్లాహుమ్మ మాలికల్ ముల్కి తూతిల్ ముల్క" నుండి చివరి వరకు పఠించి ఈ దుఆ చేయాలి. దైవప్రవక్త (స) హజ్రత్ అలీ (రజిఅన్)కు ఈ దుఆ చదవమని తాకీదు చేశారు.

اَللّٰهُمَّ اكْفِنِيْ بِحَلَالِكَ عَنْ
حَرَامِكَ وَاَغْنِنِيْ بِفَضْلِكَ
عَمَّنْ سِوَاكَ - مسند احمد ترمذی

"అల్లాహుమ్మ అక్ఫినీ బిహలాలిక
అన్ హరామిక వ అగ్నినీ బిఫజ్లిక
అమ్మన్ సివాక్"

అర్థం : ఓ అల్లాహ్! హలాల్ (ధర్మసమ్మతమైన) ఉపాధి నివ్వు. హరామ్ (నిషిద్ధాల) నుండి రక్షించు. నీవైపు తప్ప ఇతరుల వైపు చూడకుండా చెయ్యి. (ముస్నదె అహ్మద్, తిర్మిజీ)

## బట్టలు తొడిగేటప్పటి దుఆ

బట్టలు తొడిగే మస్నూన్ విధానం (అంటే ప్రవక్త (స) సంప్రదాయం ప్రకారం ఏమిటంటే మొదట చొక్కా కుడిచేతిని తొడగాలి. పైజామా లేక ప్యాంటు అయితే కుడికాలు వేస్తూ ప్రారంభించాలి. ఆ తరువాత ఎడమకాలు. ఇక బట్టలు తీసేటప్పుడు ఎడమ చేయి, ఎడమ కాలిని తీయాలి. ఆ తరువాతనే కుడిచేయి, కుడి కాలిని తీయాలి. చెప్పులు, బూట్లు వగైరాలు తొడిగేటప్పుడు మొదట కుడికాలు ఆ తరువాత ఎడమ కాలిని పెట్టాలి. క్రొత్త వస్త్రం తొడిగేటప్పుడు చదవవలసిన దుఆ ఇది.

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ كَسَانِيْ هٰذَا الثَّوْبَ وَرَزَقَنِيْهِ مِنْ غَيْرِ حَوْلٍ مِنِّيْ وَلَا قُوَّةٍ

"అల్హమ్‌దు లిల్లాహిల్లజీ కసానీ హాజస్సౌబ వ రజఖ్‌నీహి మిన్ గైరి హౌలి మిన్నివ్‌వలా ఖువ్వహ్".

అర్థం: ఆ దైవానికి కృతజ్ఞతలు, ఎవరయితే ఈ క్రొత్త వస్త్రాన్ని తొడిగాడో నా ప్రయత్నానికి ఇందులో ఎలాంటి ప్రమేయం లేదు.

## తుమ్మినప్పటి దుఆ

ఎవరికైనా తుమ్ము వస్తే 'అల్‌హమ్‌దులిల్లాహ్' అనాలి. అలా ఎవరైనా పలుకగా వింటే జవాబుగా 'యర్‌హముకల్లాహ్' అనాలి. తుమ్మినవాడు తిరిగి దానికి జవాబుగా 'యహ్‌దీ కుముల్లాహువ యుస్లిహ్ బాలకుం" అనాలి. (బుఖారి)

## ప్రయాణపు దుఆ

ప్రయాణం అనేది జీవితంలోని అనివార్యమైన అవసరం. ముస్లిముల ఏ కదలిక కూడా దుఆను శుభాన్ని కోరకుండా ఉండకూడదు. ప్రయాణం మాటకు వస్తే అందులో మరీ శుభాన్ని కోరుకోవలసిన అవసరం ఉంది. ప్రయాణీకుడు ఇంటిని, ఇంటి వారిని వదిలి వెడతాడు. సుదీర్ఘ ప్రయాణంలో క్రొత్తవారు, క్రొత్త ప్రదేశాలు అతనికి తారసపడ తాయి. కొంత కాలం వరకు ఇంటికి ఇంటి వారికి దూరంగా ఉండవలసి వస్తుంది. ఆ సమయంలో అతని మనస్సులో అనేక ఆలోచనలు వస్తూ ఉంటాయి. ప్రయాణ సన్నాహాలు, ప్రయాణంలో కలిగే బడలిక, తాను చేరవలసిన గమ్యం గురించి ఆలోచన, గమ్యం చేరాక తన కార్యసిద్ధికి సంబంధించిన ఊహలు వగైరా, తన మనస్సును ఎల్లప్పుడు ఆలోచనల్లోనే

ముంచేస్తూ ఉంటాయి. ఈ సందర్భంలో అతనికి అల్లాహ్ మద్దతు ఆయన సంరక్షణ ఎంతైనా అవసరం. ఇక్కడ ఇవ్వబడ్డ ఈ దుఆలో ఈ అవసరాలు, ఊహలు ఎలా ఇమిడి ఉన్నాయో కొద్దిగా ఆలోచించండి. ఎంతో ఆలోచనా దృష్టితో మరెంతో మేధస్సును ఉపయోగించి ఇంతకంటే సంపూర్ణమైన దుఆను తయారు చేయడం ఎంతోకష్టం.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: దైవప్రవక్త (స) గారు వాహనంపై ఎక్కి కూర్చుని మూడుసార్లు అల్లాహు అక్బర్ అనడం, ఆపై ఈ క్రింది దుఆను చదవడం పరిపాటి.

**దుఆ**

سُبْحَانَ الَّذِیْ سَخَّرَ لَنَا
هٰذَا وَمَا كُنَّا لَهٗ مُقْرِنِيْنَ
وَاِنَّا اِلٰی رَبِّنَا لَمُنْقَلِبُوْنَ
اَللّٰهُمَّ اِنَّا نَسْئَلُكَ فِیْ سَفَرِنَا
هٰذَا الْبِرَّ وَالتَّقْوٰی وَمِنَ
الْعَمَلِ مَا تُحِبُّ وَتَرْضٰی
اَللّٰهُمَّ هَوِّنْ عَلَيْنَا سَفَرَنَا
هٰذَا وَاطْوِ عَنَّا بُعْدَهٗ
اَللّٰهُمَّ اَنْتَ الصَّاحِبُ
فِی السَّفَرِ وَالْخَلِيْفَةُ فِی
الْاَهْلِ اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُ
بِكَ مِنْ وَعْثَاءِ السَّفَرِ
وَكَاٰبَةِ الْمَنْظَرِ وَسُوْٓءِ
الْمُنْقَلَبِ فِی الْمَالِ
وَالْاَهْلِ ۔ (مسلم واحمد)

"సుబ్హానల్లజీ సఖ్ఖరలనా హాజా వమాకున్నా లహూ ముఖ్రినీన్. వ ఇన్నా ఇలా రబ్బినా లమున్ ఖలిబూన్. అల్లాహుమ్మ ఇన్నానస్ అలుక ఫీసఫరినా హాజల్ బిర్రి వత్తఖ్వా మినల్ అమలి మాతుహిబ్బు వతర్‌జా. అల్లాహుమ్మ హవ్విన్ అలైనా సఫరినా హాజా వత్ విఅన్నా బఅదహూ. అల్లాహుమ్మ అంతస్సాహిబు ఫిస్సఫరి వల్ ఖలీఫతు ఫిల్ అహ్లి. అల్లాహుమ్మ అన్నీ అఊజుబి కమిన్ వ ఇషా ఇస్సఫరి వ కాబతిల్ మన్‌జరి వసూఇల్ మున్ఖలిబి ఫిల్ మాలి వల్ అహ్లి"

(ముస్లిం, అహ్మద్)

అర్థం: దీన్ని మా కోసం విధేయతను పాటించేదిగా చేసిన ఆయన ఎంతో పవిత్రుడు. మాకు (ఇలా చేసే) శక్తి లేదు. చివరికి మేము ఆయన వైపుకే మరలవలసిన

వారం. ఓ అల్లాహ్ మేము మా ఈ ప్రయాణంలో పుణ్యకార్యాలను, నీ భయభీతుల్ని నీ ప్రసన్నతను కోరుతున్నాము. ఓ అల్లాహ్! మా కోసం ఈ ప్రయాణాన్ని సులభతరం చెయ్యి, ప్రయాణ భారాన్ని తగ్గించు. ఓ అల్లాహ్! ఈ ప్రయాణంలో నీవే మా మిత్రుడవు. మా ఇంటి వారికి సంరక్షకుడవు నీవే. ఓ అల్లాహ్! నేను నా ప్రయాణ కష్టాల నుండి, చూడరాని దృశ్యాల నుండి, నా ఇంటి వారి దగ్గరకు, నా సొత్తు వైపుకు చెడ్డ తిరోగమనం నుండి నీ శరణు వేడుతున్నాను.

ప్రయాణం నుండి తిరిగి వచ్చి కూడా ఇదే దుఆను చేసేవారు. అయితే ఆ దుఆలో కొన్ని పదాలను మాత్రం ఇలా చేర్చేవారు.

آئِبُونَ، تَائِبُونَ، عَابِدُونَ
لِرَبِّنَا حَامِدُونَ ٥ (مسلم)

**"ఆఇబూన, తాఇబూన, ఆబిదూన**
**లిరబ్బినా హామిదూన్"**

మేము తిరిగి వచ్చాము, తౌబా చేసేవారం, ఆరాధించేవారం ఇంకా మా ప్రభువుకు కృతజ్ఞతలు చెప్పుకుంటాము.

దైవప్రవక్త (స) ఏదేని ప్రయాణానికి బయలుదేరేటప్పుడు ఇతర దుఆలతో ఇలా పలికేవారు:

أَسْتَوْدِعُ اللّٰهَ دِيْنَكُمْ وَ
أَمَانَتَكُمْ وَخَوَاتِيْمَ
أَعْمَالِكُمْ (كتاب الاذكار)

**అస్తౌది ఉల్లాహ్ దీనకుం వ అమా**
**నతకుం వ ఖవాతీమ ఆమాలికుం."**

నేను నీ ధర్మాన్ని, నీ అమానుతును, కర్మల ముగింపును అల్లాహ్‌కే సమర్పిస్తున్నాను.

## ఇస్తిగ్ఫార్

దైవప్రవక్త (స) పూర్తిగా పాపరహితులే. అయినా ఎల్లప్పుడు ఇస్తిగ్ఫార్ (మన్నింపు) పదాలు ఆయన నోటి నుండి వెలువడుతూ ఉండేవి. ఈ పదాలు దైవంతో సంబంధం పెట్టుకునే మేలైన పదాలు. కాబట్టి ఇస్తిగ్ఫార్ పదాలను వల్లించడం ఎంతో అవసరం. దైవప్రవక్త (స) గారి పవిత్రమైన నోట వెలువడిన ఇస్తిగ్ఫార్ పలుకులు అనేకం ఉన్నాయి. అందులో ఒకటి సయ్యిదుల్ ఇస్తిగ్ఫార్. అది ఇలా ఉంది.

اَللّٰهُمَّ اَنْتَ رَبِّىْ لَآ اِلٰهَ اِلَّآ اَنْتَ خَلَقْتَنِىْ وَاَنَا عَبْدُكَ وَاَنَا عَلٰى عَهْدِكَ
وَوَعْدِكَ مَا اسْتَطَعْتُ وَاَعُوْذُبِكَ مِنْ شَرِّ مَا صَنَعْتُ اَبُوْءُ
لَكَ بِنِعْمَتِكَ عَلَيَّ وَاَبُوْءُ بِذَنْبِىْ فَاغْفِرْلِىْ فَاِنَّهٗ لَا يَغْفِرُ
الذُّنُوْبَ اِلَّآ اَنْتَ۔

**1.** అల్లాహుమ్మ అన్‌త రబ్బీ లా ఇలాహ ఇల్లాఅన్‌త ఖలఖ్ తనీ వ అనా అబ్దుల్ వ అనా అలా అహ్‌దిక, వ అదిక మస్‌తతత అతు వ అఊజుబిక మిన్‌షర్రిమా సనాతు అబూ అలక బినీ మతిక అలయ్య వ అబూఉ బిజంబీ ఫగ్ ఫిర్‌లీ ఫ అన్నహూ లా యగ్‌ఫి రుజ్జునూబ ఇల్లా అన్‌త.

ఈ క్రింది పదాలు కూడా ఎంతో పరిపూర్ణతను పొంది ఉన్నాయి.

**2.** అస్‌తగ్ ఫిరుల్లాహి రబ్బీ మిన్‌కుల్లి జన్‌బిఁవ్ వ అతూబు ఇలైహ్

اَسْتَغْفِرُ اللّٰهَ رَبِّىْ مِنْ كُلِّ ذَنْبٍ وَّاَتُوْبُ اِلَيْهِ۔

ఈ పదాలను రోజుకు పది, ఇరవై సార్లయినా పలుకుతూ ఉండాలి. ఖుద్దుగా దైవప్రవక్త (స) "నేను రోజుకు వందేసి సార్లు ఇస్తిగ్ఫార్ చేస్తుంటాను" అని అన్నారు. ఈ ఇస్తిగ్ఫార్ హృదయంపై ఏర్పడ్డ మలినాన్ని తొలగించే దివ్య ఔషధం. "నా హృదయంపై ఎప్పుడైనా మలినం లాంటిది ఏర్పడింది అనుకుంటే నేను ఇస్తిగ్ఫార్ చేస్తాను" అని దైవప్రవక్త (స) స్వయంగా అనేవారు.

## తౌబా

ఏదైనా పాపకార్యం చేసిన తరువాత పశ్చాత్తాపం అనేది ప్రతి మనిషిలోను కలుగుతుంది. ఈ పశ్చాత్తాప భావాన్ని నోటి ద్వారా ప్రకటించే ప్రక్రియే ఇస్తిగ్ఫార్. ఈ ఇస్తిగ్ఫార్‌ను, పాపం చేసినందుకు కాకుండా కేవలం దైవదాసుడు అయినందుకు మనిషి నోటితో పలికితే అది అతని మేలుకోసం, అతని ఆధ్యాతిక అంతస్థుల ఉన్నతి కోసం పనికి వస్తుంది. దైవప్రవక్త (స) చేసే ఇస్తిగ్ఫార్ ఇందుకు ఉదాహరణ.

## తౌబా అంటే ఏమిటి?

తౌబా అంటే, మరలడం, తిరిగి రావడం అని. దైవదాసుడు పాపం చేసినప్పుడు

దైవ కారుణ్యానికి దూరం అవుతాడు. అతడు తౌబా చేస్తే తిరిగి దైవకారుణ్యం వైపుకు మరలివస్తాడు అని అర్థం.

## తౌబా షరతులు

మనిషి చేసిన పాపాలు ఏవైనా దైవానికి సంబంధించినవి. అంటే అవి అల్లాహ్ హక్కులకు సంబంధించినవే అయి ఉండాలి. ఉదాహరణకు మత్తు పానీయాల సేవనం, వ్యభిచారం చేయడం, ధనాన్ని దుబారాగా ఖర్చు చేయడం లాంటివి. అప్పుడు తౌబా చేయాలి. ఈ తౌబాకు మూడు షరతులున్నాయి. ఒకటి, ఆ పాపాన్ని పూర్తిగా విడనాడడం, రెండోది ఈ పాపం చేసినందుకు పశ్చాత్తాపపడి నోటితో ఆ పశ్చాత్తాపాన్ని దైవం ముందు ఒప్పుకోవడం, మూడోది ఆ పాపం ఇక చేయబోనని దృఢంగా సంకల్పించుకోవడం.

అదే ఈ పాపం ప్రజల హక్కులకు సంబంధించినది అయినప్పుడు. ఉదాహరణకు, వడ్డీ తీసుకోవడం, ఒకరి హక్కును కొల్లగొట్టడం, అసత్యమాడి సరుకును అమ్మడం, ఒకరిని తిట్టడం (దుర్భాషలాడడం) పరోక్షంగా ఒకరిని నిందించడం లాంటివి జరిగినప్పుడు పై మూడు షరతులకు తోడు, వడ్డీ తీసుకున్న వానికి ఆ డబ్బు వాపసు చేయడం, భూమిని ఆక్రమిస్తే ఆ భూమిని అతనికి ఇచ్చివేయడం చేయాలి. అలా తిరిగి ఇవ్వలేని పక్షంలో సంబంధిత వ్యక్తి దగ్గర మాఫీ చేయించుకోవలసి ఉంటుంది. ఒకవేళ ఎవరైనా ఈ లోకంలో మాఫీ చేయించుకోక పోతే పరలోకంలో ఇతని పుణ్యఫలం అతనికి ఇవ్వబడుతుంది. (బుఖారి, ముస్లిమ్)

## దరూదె షరీఫ్

ఈ ప్రపంచంలో దైవం తరువాత, మనుషులపై, ఎవరి రుణం అయితే అధికంగా ఉందో అదే విధంగా పరలోకంలో ఎవరిపైనయితే అధికంగా దైవకారుణ్యం వర్షించబడుతుందో ఆ మహోన్నత వ్యక్తిత్వం అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స) గారి పవిత్ర వ్యక్తిత్వం.

కాబట్టి దైవనామస్మరణ తరువాత దైవప్రవక్త (స) ప్రస్తావన కూడా ముస్లిముల విశ్వాసంలోని భాగమే. ఈ ప్రస్తావన అజాన్ ద్వారా, ఇఖామత్ ద్వారా, నమాజులో తషహ్హుద్ ద్వారా, దరూదె షరీఫ్ ద్వారా జరుగుతుంది. కాని ఏ విధంగానయితే దైవ నామస్మరణకు తోడు ఆయనపై ప్రేమ అవసరమో అలాగే దైవప్రవక్త (స) ప్రస్తావనకు తోడు ఆయన వ్యక్తిత్వంలోగల ప్రేమానురాగాలు కూడా విశ్వాసంలోని భాగమే. దైవప్రవక్త (స) పేరు నాలుకపైకి రాగానే హృదయంలో ఓ విధమైన చల్లదనం, ఓ రకమైన హాయి,

నాలుకకు ఓ విధమైన రుచి అనిపిస్తుంది. దాహం కలిగినప్పుడు చల్లటి పానీయాన్ని త్రాగితే కలిగే అనుభూతే మనిషి సకల జ్ఞానేంద్రియాలపై ఆయన నామాన్ని ఉచ్ఛరించి నప్పుడు కలుగుతుంది. ఈ ప్రేమను ప్రకటించడానికి సరి అయిన పద్ధతి ఆయన (స) గారిప్రతి సున్నత్‌ను ఆచరించడం. ఈ సున్నత్‌ను ఆచరించడంలోను మరింత తన్మయత్వం పొందాలంటే దరూదె షరీఫ్‌ను రేయింబవళ్ళు ఉచ్ఛరిస్తూ ఉండాలి.

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:

"ఎవరైనా నా 'ఉమ్మతి' (నా సమాజంలో ఉండే ముస్లిం) నా కోసం దరూద్ మరియు సలాం పఠిస్తే కేవలం అవి నా దగ్గరకు చేర్చడానికే కొందరు దైవదూతలు ఈ భూమి మీద సంచరిస్తూ ఉంటారు." (నిసాయి, దారిమి)

ఇంకా ఆయన ఇలా ప్రవచించారు:

مَنْ صَلّٰى عَلَيَّ وَاحِدَةً صَلَّى اللّٰهُ عَلَيْهِ عَشْرًا

**"ఎవరైనా నాపై ఒక్కమారు దరూద్ మరియు సలాం పంపితే దైవం అతనిని పదిమార్లు కరుణాకటాక్షాలతో వీక్షిస్తాడు.**

మరో ప్రవచనంలో ఇలా ఉంది.

اَلْبَخِيْلُ الَّذِيْ مَنْ ذُكِرْتُ عِنْدَهٗ فَلَمْ يُصَلِّ عَلَيَّ۔

(ترمذی ۱)

**"నా పేరు ఎవరి ముందుర పలుకబడుతుందో అతడు నాపై దరూద్ చదవకుంటే అతడు ఓ పిసినారి వాడే" (తిర్మిజీ, అహ్మద్)**

إِنَّ الدُّعَاءَ مَوْقُوْفٌ بَيْنَ السَّمَاءِ وَالْأَرْضِ لَا يَصْعَدُ مِنْهَا شَيْءٌ حَتّٰى تُصَلِّيَ عَلٰى نَبِيِّكَ۔

**"దైవప్రవక్త (స) పై దరూద్ చదవనంతవరకు మీరు చేసే దుఆ భూమ్యాకాశాల మధ్యనే వ్రేలాడుతూ ఉంటుంది" అని హజ్రత్ ఉమర్ (ర.అన్) అన్నారు. (తిర్మిజీ)**

అన్నిటికంటే మేలైన దరూద్ నమాజులో చదివే దరూద్. ఇదే కాకుండా ఇంకే ఇతర పదాలతో ఆయన (స) పై దరూద్ పంపినా పుణ్యప్రదమైనదే. హదీసు గ్రంథాల్లో అనేక రకాల దరూద్‌లు ఉన్నాయి.

# రోజా
# (ఉపవాస వ్రతం)

'రోజా'ను అరబిక్ భాషలో 'సౌమ్' అని అంటారు. సౌమ్ అంటే తినడం, త్రాగడాలు మానుకోవడం అని అర్థం. షరీఅత్‌లో ప్రాతఃకాలం (సుబహ్ సాదిఖ్) మొదలు సూర్యాస్తమయం వరకు ఆహార పానీయాల్ని వదిలేయడం, స్త్రీ (సంభోగం)కు దూరంగా ఉండడం, చెడు విషయాల నుండి తమను తాము రక్షించుకోవడాన్నే 'సౌమ్' లేక 'రోజా' అని అంటారు. (షరహ్ వికాయ)

## రోజా ప్రాధాన్యత

దివ్యఖుర్‌ఆన్‌లోని కొన్ని ఆయత్‌లు (వాక్యాలు) ఇంకా అనేకమయిన హదీసుల ద్వారా రోజా ప్రాధాన్యతే కాదు దాని గొప్పదనం కూడా తేటతెల్లమవుతుంది ఇదేకాక రోజా ఇస్లామ్ మరియు విశ్వాసం (ఈమాన్) మౌలిక ఆరాధనల్లో ఒక ఆరాధన. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

كُتِبَ عَلَيْكُمُ الصِّيَامُ كَمَا كُتِبَ عَلَى الَّذِينَ مِن قَبْلِكُمْ لَعَلَّكُمْ تَتَّقُونَ (البقرة)

**కుతిబ అలైకుముసియాము కమా కుతిబ అలల్లజీన మిన్ ఖబ్లికుం లఅల్లకుమ్ తత్తఖూన్. (బకర)**

అర్థం : "విశ్వసించిన ఓ ప్రజలారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించబడింది. ఇదే విధంగా ఇది మీకు పూర్వం, ప్రవక్తల్ని అనుసరించే వారికి కూడా విధించబడింది. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది."

ఈ వాక్యం ద్వారా తెలిసేదేమంటే నమాజు వలెనే రోజా ఆదేశాలు దైవం ఇతర సమాజాలకు కూడా ఇచ్చాడని. దైవప్రవక్త (స)కు ముందు ఎందరు ప్రవక్తలు అయితే ప్రపంచంలో ప్రభవించారో వారందరూ ఈ రోజా గురించి తాకీదు చేశారు. దాన్ని ఫర్జుగానే ఎంచారు. గ్రంథం కలవారు నేటికీ రోజాను పాటించడం మనం చూస్తూ ఉన్నాము. వీరే కాకుండా ముష్రిక్ జాతుల్లో ఉపవాస వ్రతం సంప్రదాయాన్ని చరిత్రాత్మకమయిన దివ్యఖుర్‌ఆన్ ఆధారాన్ని నమ్మడానికి సరిపోతుంది. అయితే తేడా ఉన్నదల్లా రోజాల సంఖ్యలో, దాని సమయాల్లోనే. పూర్తిగా ఒక నెల రోజాలు ఫర్జు (విధి)

కావడం కేవలం ఒక ముస్లిమ్ సమాజం ప్రత్యేకత. దివ్యఖుర్ఆన్ 'మిన్ ఖబ్లికుం' అనే పదంతో ఓ చారిత్రాత్మకమయిన యదార్థాన్నే మన ముందుంచలేదు, ఈ రోజాలోని భౌతిక శ్రమను మీకంటే ముందు సమాజాలు కూడా భరించాయని చెప్పి ఆ శ్రమను సులభతరం చేసింది. దివ్యఖుర్ఆన్ ఈ ప్రపంచంలో దైవం ప్రసాదించిన ఓ గొప్ప వరం. ఇలాంటి మహాభాగ్యం గల గ్రంథం అవతరణ కూడా ఈ మాసంలోనే ప్రారంభం అయింది.

"షహ్రు రమజానల్లజీ ఉన్‌జిల ఫీహిల్ ఖుర్ఆన్." (అల్ బఖర)

شَهْرُ رَمَضَانَ الَّذِيٓ اُنْزِلَ فِيْهِ الْقُرْاٰنُ (البقرہ)

**అర్థం:** ఏ మాసంలోనయితే దివ్యఖుర్ఆన్ అవతరణ ప్రారంభం అయిందో అది ఈ రమజాన్ నెలే.

ఈ ఆయత్ ద్వారా తెలిసేదేమిటంటే ఖుర్ఆన్ రోజా మాసం నుండి అవతరించడం ప్రారంభం అయింది అని. దివ్యఖుర్ఆన్‌లో మరో ఆయత్ ప్రకారం రమజాన్ మాసంలోని "లైలతుల్ ఖద్ర్" అనే మహారాత్రి నుండే దీని అవతరణ ప్రారంభం అయింది అనేది తెలుస్తోంది. అయితే ఈ ఆయత్‌కు వివరణ ఇచ్చే వారి (ముఫస్సిరీన్)లో కొంత భేదాభిప్రాయం ఉంది. లైలతుల్ ఖద్ర్ ఇరవై అయిదవ రాత్రి అని ఒకరంటే మరొకరు ఇరవై ఒకటవ రాత్రి అని అంటారు. కారణం దైవప్రవక్త (స), లైలతుల్ ఖద్ర్ అనేది రమజాన్ మాసం చివరి దశకంలోని బేసి రాత్రుల్లో ఏదో ఒకటి అయి ఉంటుంది అన్నారు. కాబట్టి ఈ అయిదు బేసి రాత్రుల్లో ఏదో ఒకదానిలో దివ్యఖుర్ఆన్ అవతరణ ప్రారంభం అయింది.

ఖుర్ఆన్‌లోని మొదటి ఆయత్ "లఅల్లకుం తత్తఖున్"తోను, రెండవ ఆయత్ 'లఅల్లకుం తష్కురూన్'తోను అంతం అవుతుంది. లఅల్లకుం తత్తఖున్ భావం ఏమిటంటే, రోజా ద్వారా మీలో తక్వా, సద్వర్తన, దైవభీతి పుట్టాలి అని. అంటే రోజాను అవలంబించడం వల్ల దైవభీతిని తప్పక పుట్టిస్తుంది అని అర్థం. తక్వా అంటేనే దైవభీతి. ఈ దైవభీతి మూలంగా మీరు మీ భావోద్రేకాలను, మనోవాంఛల్ని అదుపు చేయగలుగుతారు. ఎంతో చెడ్డవాడు అనుకున్న మనిషి కూడా ఈ నెలలో కొంత బాగుపడటం మనం చూస్తూనే ఉన్నాం. ఇంకో ఆయత్ 'లఅల్లకుం తష్కురూన్'కు అనేక దృక్కోణాల నుండి అర్థంచేసుకుంటే ప్రతి దృక్కోణం కూడా కృతజ్ఞతను పట్టించేదిగానే కానవస్తుంది. గతించిన సమాజాలకు రోజాకు సంబంధించి ఏ ఆదేశం అయితే ఇవ్వబడిందో అందులో కొంత కఠినత్వం ఉండేది. వారు రాత్రులు తమ భార్యల వద్దకు పోయే వీలు లేదు. కాని ముస్లిమ్ సమాజానికి ఆ అనుమతి ఇవ్వబడింది. ఎవరయినా రోగగ్రస్తునిగా ఉంటే అతడు దాన్ని

ఖజా చేయవచ్చు. గర్భవతి అయిన స్త్రీకి, శిశువుకు పాలు పట్టే తల్లికి ఇందులో కొంత రాయితీ ఇవ్వడం జరిగింది. ఎవరయినా మరీ వృద్ధాప్యానికి వస్తే రోజాకు బదులు అతడు 'ఫిదియా' (పరిహారం) చెల్లించాలి. మరో దృష్టికోణంతో చూస్తే ఈ మాసంలో నిజంగానే అల్లాహ్ ఔన్నత్యం, ఘనత మరియు కృతజ్ఞతలను తెలిపే భావాలు మనిషిలో జనిస్తాయి. మనం రోజూ ఆహారం తీసుకునే వాళ్ళమే, త్రాగే వాళ్లమే అయితే అన్న పానీయాల విలువ రోజాను ఇఫ్తార్ (ఉపవాస విరమణ) చేసేటప్పుడు రోజాతో ఉన్న వాడికే బాగా అర్థం అయినట్లు మరొకరికి తెలియదు. ఒక్కొక్క ఆహార కబళం, ఒక్కొక్క నీటి బిందువు గొంతు నుండి క్రిందికి దిగుతున్నప్పుడు అది దైవం ప్రసాదించిన గొప్ప వరంలా అనిపిస్తుంది. ఇదివరకు ఎప్పుడు దాని రుచిని ఎరుగడా అన్నట్లు తోస్తుంది. ఏ కొంత ఆలోచన ఉన్న వానికి అయినా తనలో దైవం ఎడల కృతజ్ఞతాభావం పొడసూపక మానదు. ఈ భావనే ఇఫ్తార్‌లో చదివే దుఆలల్లో కనిపిస్తుంది. అదేకాకుండా కృతజ్ఞత యొక్క ఓ గొప్ప అంశం, అల్లాహ్ దివ్యఖుర్‌ఆన్ లాంటి వరాన్ని ఈ నెలలోనే ఒసగడం. ఇది మన భౌతిక జీవితం కోసం గొప్ప మార్గదర్శి మన ఆధ్యాత్మిక జీవితం కోసం సంజీవిని లాంటిది. మొత్తానికి రోజా మనిషిలో తక్వాను పుట్టించడమే కాకుండా కృతజ్ఞతాభావాన్ని కూడా పుట్టిస్తోంది. ఇది ఓ మహా ప్రసాదమే.

దివ్య ఖుర్‌ఆన్ వలెనే దైవప్రవక్త (సఅసం)గారి ప్రవచనాల్లో (హదీసుల్లో) రోజా గురించిన ఔన్నత్యం చెప్పబడింది. కొన్ని హదీసుల సారాంశం ఇక్కడ ఇవ్వబడింది.

దైవ ప్రవక్త (సఅసం) ప్రవచన సారాంశం, "అల్లాహ్ ఇలా చెబుతున్నాడు-ప్రతి పుణ్యకార్య ప్రతిఫలం దాసుల కర్మల పత్రంలో పది రెట్ల నుండి ఏడు వందల రెట్ల వరకు లభించబడుతుంది. కాని రోజా ప్రత్యేకంగా నా కోసం నేనే స్వయంగా దాని ప్రతిఫలం ఇస్తాను."

అంటే ఎలాగయితే దైవశక్తి అనంతమయిందో అలాగే "రోజా ప్రతిఫలానికి కూడా ఎలాంటి హద్దుల్లేవు అని అర్థం.

దైవప్రవక్త(స)ఇలా ప్రవచించారు: "రోజాదార్ రోజా వ్రతంలో ఉన్న వ్యక్తి నోటి వాసన దైవానికి కస్తూరికంటే ఎక్కువ ప్రియమైనది."

మరో హదీసులో ఇలా ఉంది:

"రోజా పాపాల నుండి కాపాడుకోవడానికి ఒక డాలు లాంటిది" కొన్ని హదీసులు ఇలా ఉన్నాయి.

"ప్రతి ఇంటికి ఒక ద్వారం ఉంటుంది. ఇబాదత్ (ఆరాధన) యొక్క ద్వారం రోజాయె."

"ఏ రోజాదార్ల రోజాలు స్వీకరించబడతాయో వారి కోసం ప్రళయంనాడు ఓ ద్వారం ఉంటుంది దాని ద్వారా వారు స్వర్గంలో ప్రవేశిస్తారు. ఆ ద్వారం పేరు 'రయ్యాన్' అంటే దాహం తీర్చేది అని."

"రోజా ప్రారంభం కాగానే షైతానులు బంధించబడతారు, నరక ద్వారం మూసేయబడుతుంది. స్వర్గద్వారాలు తెరువబడతాయి."

రోజా ప్రళయంనాడు దైవం ఎదుట సిఫారసు చేస్తుంది. ఓ ప్రభూ! ఇతడు నా గురించి అన్న పానీయాలను, తన మనోవాంఛలను వదిలేశాడు. నీవు ఇతణ్ణి మన్నించు అని అది ప్రాధేయపడుతుంది."

(పై హదీసులన్నీ బుకారి, ముస్లిమ్ ఇంకా ఇతర హదీసు గ్రంథాల్లో చెప్పబడి ఉన్నాయి).

అయితే ఈ సత్ఫలితం లభించేది రోజా స్వీకరించబడినప్పుడే. ఏ ఆరాధన అయినా స్వీకరించబడడానికి చిత్తశుద్ధి అనేది ఒక షరతు. ఆరాధనలో చిత్తశుద్ధి అంటే అది కేవలం దైవం కోసమే చేసేదై ఉండాలి. రోజా ఆరాధనలో ఇతర ఆరాధనలకంటే చిత్తశుద్ధి అధికంగా ఉంటుంది. మనిషి తలుచుకుంటే రహస్యంగా ఏదైనా తినవచ్చు. త్రాగవచ్చు లేక తన కామతృష్ణను తీర్చుకోనూవచ్చు. ఇలా చేసేటప్పుడు అతణ్ణి దైవం తప్ప ఇంకెవరునూ చూడలేరు. అయితే రోజా వ్రతం బూనిన వాడు ఎలాంటి పనులు చేయడు, కారణం అతడు అల్లాహ్ కోసమే రోజా వ్రతాన్ని పాటిస్తాడు కాబట్టే. "రోజా ప్రతిఫలాన్ని నేనిస్తాను" అని అన్నాడు దేవుడు.

కాని ఎంత చిత్తశుద్ధి ఉన్నా కొన్ని పనులు రోజాలోని చిత్తశుద్ధిని చెడగొట్టేస్తాయి. రోజా పాటించే వాడు వాటి మూలంగా పుణ్యఫలాన్ని పోగొట్టుకుంటాడు. ఉదాహరణకు రోజా పాటించి ఇతరుల్తో జగడమాడడం, దుర్భాషలాడడం, పరోక్ష నిందకు పాల్పడడం, చాడీలు చెప్పడం, హరామ్ సొత్తు ఉపయోగించుకోవడం లాంటివి. ఎవరయితే ఈ విషయాలకు దూరంగా ఉండరో వారి గురించి దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

مَن لَّمْ يَدَعْ قَوْلَ الزُّورِ وَالْعَمَلَ بِهِ فَلَيْسَ لِلَّهِ حَاجَةٌ

"ఎవరయితే తప్పుడు ప్రవర్తనను, అసత్య మాటలను, పాపాన్ని విడనాడడో, అలాంటి వ్యక్తితో అన్న

اَنْ يَّدَعَ طَعَامَهٗ وَشَرَابَهٗ
(بخاری)

పానీయాల్ని విడిపించే అవసరం అల్లాహ్‌కు ఎంత మాత్రం లేదు."
(బుకారి)

తప్పుడు ప్రవర్తన అంటే నోరు శరీరం యొక్క ప్రతి చెడు ప్రవర్తన అని అర్థం. ఈ సందర్భంగా దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

كَمْ مِّنْ صَائِمٍ لَيْسَ لَهٗ مِنْ صِيَامِهٖ اِلَّا الظَّمَاءُ -

"దాహార్తులుగా మిగలడం తప్ప వారికి ఏమీ లభించని రోజాదార్లు ఎందరో." (దారిమి-మిష్కాత్)

కాబట్టే, రోజా ద్వారా పాపాలు పరిహరించబడతాయి. కాని దాని కోసం రెండు షరతులున్నాయి అని దైవప్రవక్త ప్రవచించారు. ఒకటి ఈమాన్(విశ్వాసం) రెండు ఇహ్‌తిసాబ్ అంటే ఆత్మ పరిశీలన.

"ఎవరయితే విశ్వాసంతో, ఆత్మ పరిశీలనతో రోజా పాటిస్తాడో అతని పూర్వపు పాపాలన్నీ పరిహరించబడతాయి". ఈమాన్ అంటే అతనికి దైవం, పరలోకం మరియు దైవదౌత్యం ఎడల పూర్తి నమ్మకం ఉండడం. ఇహ్‌తిసాబ్ అంటే రోజా దైవం కోసమే పాటించడం మరియు ఆ రోజాను అన్నిరకాల దుష్కార్యాల నుండి పరిరక్షించడం అని. ఇందులో లేశమయిన ప్రదర్శనాబుద్ధి ఉండకూడదు.

ఈమాన్ మరియు ఇహ్‌తిసాబ్ షరతు విధించడం వలన తెలిసిందేమంటే, ఎవరైతే ఈమాన్, ఇహ్‌తిసాబ్ లేకుండా పస్తులుంటారో వారి ఈ పస్తులు, దాహార్తి రోజా అనబడదు. ఈ కారణంగానే నిరాహార దీక్ష, వ్రతాల్ని ఇస్లామీయ షరీఅత్‌లో రోజాగా పిలువబడవు. దివ్యఖుర్‌ఆన్‌లో చెప్పబడ్డ విషయాలకు అనుగుణంగా మనిషి రోజాను పాటిస్తే దానివలన అతడు తప్పక 'ముత్తకీ' అంటే దైవ భయంగల వాడిగా తయారవవచ్చు. అతని మనస్సు అతని కంట్రోలులో ఉంటుంది.

ఈ ప్రాధాన్యత ఉండడం వల్లనే దైవప్రవక్త (సఅసం) రమజాను మాసం ప్రారంభం కాక పూర్వం, ఇంకా రమజాను నెలలోను సహాబీల (రజిఅన్)కు రోజాను దైవేచ్ఛకు అనుగుణమయినదిగా తాకీదు చేస్తూ ఉండేవారు. ఆయన(సఅసం) మాటిమాటికీ, "ఎవరైతే ఈమాన్ ఇహ్‌తిసాబ్‌లతో రోజాను పాటిస్తాడో అతని మునుపటి పాపాలన్నీ పరిహరించబడతాయి" అని చెప్పేవారు. ప్రముఖ సహాబీ హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజిఅన్)

ఇలా ప్రవచించారు. దైవప్రవక్త (సఅసం) షాబాన్ నెల చివరి రోజుల్లో సహాబీల (రజిఅన్) సమావేశమందు ఓ ఉపన్యాసం ఇచ్చారు. అందులో ఓ మహా శుభకరమయిన మాసం మీపై తన నీడను ప్రసరించబోతోందని ఆయన (సఅసం) తెలిపారు. ఆ మాసంలోని ఒకానొక రాత్రి వెయ్యిరాత్రుల కంటే మేలయినది. దాని పగటి పూటల్లో రోజాలు విధిగా చేయబడ్డాయి. రాత్రుల ఆరాధనల్లో పుణ్యఫలం (దాగి) ఉంది. ఇందులో నఫిల్ పుణ్యం ఫర్జుకు సమానం. మరియు ఫర్జు పుణ్యఫలం డెబ్భై ఫర్జులకు సమానంగా లభిస్తుంది. ఇది సహనం వహించే నెల. సహనానికి ప్రతిఫలం స్వర్గం. ఇది పరస్పరం దయాగుణం కారుణ్యం చూపే నెల. ఈ మాసంలో మోమిన్ ఉపాధి అధికం అవుతుంది. ఎవరయినా రోజాదారునికి ఇఫ్తార్ చేయిస్తే అతనికి ఒక రోజుకు సరిపడే పుణ్యఫలం లభిస్తుంది. దీనికి సహాబా, ఓ దైవ ప్రవక్తా (సఅసం)! మాలో ప్రతివాడికి, తాను తిని ఇతరులకు ఇఫ్తార్ చేయించేటంత భోజనం ఉండదు కదా అని అడిగారు, దానికి దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. ఏమీ లేకపోతే (కనీసం) ఒక ఖర్జూరమయినా లేక ఒక గుక్కెడు నీళ్ళతో నయినా ఇఫ్తారు చేయించండి." (ముస్లిమ్, బుఖారి)

చూశారా! ఎందరో సహాబీల దగ్గర ఒకరికి ఇఫ్తార్ చేయించేటంత భోజనం కూడా ఉండేది కాదు. అయినా వారు రోజాలను పాటించేవారు. ఖుద్దుగా దైవ ప్రవక్త (సఅసం) రోజాపై రోజాలు ఉండే అవసరం ఏర్పడేది అంటే కడుపు నిండా భోజనం కూడా దొరికేది కాదు.

## రోజా ఎడల అశ్రద్ధ

విచారకరమయిన విషయం ఏమిటంటే ఈ కాలంలో ఇతర షరీఅత్ ఆజ్ఞల్లాగానే రోజా ఎడల ప్రజలకు ఎంతో అశ్రద్ధ ఏర్పడి ఉంది. కొన్నేళ్ళ క్రితం ఎన్ని పాపాలు చేసే ముస్లిమ్ అయినా రమజాన్ నెలలో మాత్రం రోజా పాటించి పవిత్రమయిన జీవితం గడపడానికి శాయశక్తుల కృషి చేసేవాడు. స్త్రీలయితే నూటికి నూరుపాళ్ళు రోజాలను పాటించేవారు. అయితే ఆ పరిస్థితి నేడు కానరావడం లేదు. సరికదా కొందరు సిగ్గు విడిచి రోజా దినాల్లో బాహాటంగా తినడం, త్రాగడం, ధూమపానం చేయడం మనం గమనిస్తుంటాం. వీరి మనస్సుల్లో రవ్వంతైనా దైవభీతి కానరాదు. రోజా పాటించడం వల్ల ఎంత ఎక్కువ పుణ్యఫలముంటుందో అదేవిధంగా రోజాను వదిలేయడం వల్ల లభించే పాపం కూడా అంతే ఎక్కువ ఉంటుంది. రోజా దినాల్లో సిగ్గు విడిచి తినే, త్రాగేవారికి పరలోకంలో కఠిన శిక్ష పడుతుంది.

## రోజా ఎప్పుడు ఫర్జు అయింది

దైవ ప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు మక్కాలో నివసించినంత కాలం నఫిల్ రోజాలు పాటిస్తూ ఉండేవారు. అప్పటి వరకు రోజా ఫర్జు (విధి) కాలేదు. ఆయన (సఅసం) మక్కా నుండి హిజ్రత్ చేసి మదీనాకు వెళ్ళిన ఒకటిన్నర సంవత్సరాలు దాటిన తరువాత గాని ఫర్జు కాలేదు. ఒకటిన్నర సంవత్సరాల తరువాత హిజ్రీ శకం రెండులో రమజాన్ పూర్తి మాసపురోజాలు ఫర్జు అయినాయి.

ప్రతి వివేకి, ప్రాజ్ఞత పొందిన స్త్రీ పురుషులపై పూర్తి రమజాన్ నెల రోజాలు ఫర్జు. ఈ విధిని తిరస్కరించిన వాడు కాఫిర్ (తిరస్కారి) అవుతాడు. ఇదేవిధంగా ఉజ్రె షరయీ (షరీఅత్‌లో అనివార్య పరిస్థితి) లేకుండా దాన్ని వదిలేవాడు ఘోర పాపాత్ములు, ఫాసిఖ్ (బహిరంగంగా దైవ ఆజ్ఞలను ఉల్లంఘించేవాడు) అవుతాడు. ఎవరయినా ఒక పూట నమాజ్‌ను వదిలేస్తే ఆ వ్యక్తి కేవలం ఒక పూట నమాజ్ చేసుకుంటే సరిపోతుంది. కాని ఎవరయినా ఒక రోజాను భంగపరిస్తే దానికి బదులు అతడు వరుసగా రెండు నెలలు రోజా పాటించాలి. అయినా రమజాన్ నెలలో ఒక రోజాకు లభించేటంత పుణ్యఫలం మాత్రం అతనికి లభించదు. రమజాన్ రోజాను కొత్త నెలవంక చూసిన తరువాత ప్రారంభించే ఆదేశం ఉంది. అదేవిధంగా తిరిగి కొత్త నెలవంకను చూసిన తరువాత పూర్తిచేసే ఆదేశం ఇవ్వబడింది. కాబట్టి ముందు చంద్రదర్శనానికి సంబంధించిన వివరాలు తెలుసుకుందాం.

## రమజాన్ నెలవంక దర్శనం

దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

“నెలవంకను చూసి రోజాను ప్రారంభించండి, నెలవంకను చూసే రోజాను చాలించండి. (బుకారి, ముస్లిమ్)

ఈ ఆదేశం ఆధారంగానే షాబాన్ నెల ఇరవై తొమ్మిదవ తేదీనాడు పడమర దిశగా ఆకాశం అంచున చంద్రవంక చూసే ప్రయత్నం చేయడం ముస్లిములపై వాజిబ్ చేయబడింది. ఆకాశం అంచు అంటే నెల పొడుపు కనబడే ప్రదేశం అని అర్థం. ఈ ప్రదేశం రుతువులను బట్టి మారుతూ ఉంటుంది. ఒకవేళ ఇరువై తొమ్మిదవ తేదీనాడే చంద్రవంక కనబడితే మరునాటి నుండే రోజా ప్రారంభించాలి. నెలవంక కనబడకపోతే ఆ నెల ముప్పై రోజుల నెల అని పరిగణించి మొత్తం ముప్పై రోజులు గడిపి రెండవ రోజు నుండి రోజాను ప్రారంభించాలి. అప్పుడు నెలవంక చూసినా చూడకపోయినా ఒకటే.

'మత్‌లా' (ఆకాశపు అంచున నెల పొడువు కనబడే ప్రదేశం)లో మబ్బుగాని, అధికంగా ధూళిగాని లేనప్పుడే ఈ ఆదేశం వర్తిస్తుంది. ఒకవేళ 29వ తారీఖున 'మత్‌లా' నిర్మలంగా ఉండకపోతే మరునాడు ఉదయం 10,11 గంటల వరకు ఇతర ప్రదేశాల నుండి చంద్రవంక కనబడడం గురించి వార్తవచ్చే వరకు, తినడంగాని, త్రాగడంగాని చెయ్యవద్దు. బహుశా ఎక్కడ నుండైనా చంద్ర దర్శన వార్త వస్తుందేమో అని వేచి చూడాలి. చంద్ర దర్శన వార్తవస్తే రోజాను కొనసాగించాలి. లేకుంటే ఆ రోజు తినవచ్చు, త్రాగవచ్చు.

1. 29వ తారీఖున 'మత్‌లా' నిర్మలంగా ఉండకపోవడం వల్ల చంద్రుడు కనబడక, 30వ తారీఖున చంద్ర దర్శన వార్త రాకపోతే ఆ పరిస్థితిలో రోజా సంకల్పం చేసి రోజాను కొనసాగించడం మక్రూహ్ అవుతుంది. కొదరు వార్తఇస్తే రమజాన్ రోజా అవుతుంది లేకుంటే అది నఫిల్ రోజా అవుతుంది అనుకుంటూ ఉంటారు. ఇదీ కూడా మక్రూహ్‌యు. షరీఅత్‌లో ఈ రోజాను 'అనుమానపు రోజు' అని అంటారు. ఈ రోజున దైవప్రవక్త (సఅసం) రోజా ఉండకూడదు అని సెలవిచ్చారు.

(అబూ దావూద్, తిర్మిజి, నిసాయి, ఇబ్నె మాజా)

2. కొందరు 30వ తారీఖు నాడు, ముప్ఫై రోజాలు పూర్తి అవుతాయి అనే ఉద్దేశ్యంతో రోజా ఉంటారు. ఇది కూడా మక్రూహ్ రోజాయే.

దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

"నెలవంకను చూసి రోజా ప్రారంభించండి, నెల వంకను చూసే రోజాను చాలించండి. అవి 29 రోజాలుగాని 30 రోజాలుగాని అయినా సరే."

## నెలవంక దర్శన సాక్ష్యం

'మత్‌లా' నెలవంక కనబడే ఆకాశపు అంచున సాధారణంగా అనేక మందికి నెలవంక కనబడనప్పుడు నమాజీ, దైవభీతి కల ఒక్క ముస్లిమ్, పురుషుడైనా స్త్రీ అయినా సరే, నేను నెలవంకను చూశాను అని సాక్ష్యం ఇస్తేచాలు, ఆ సాక్ష్యాన్ని స్వీకరించి మరునాటి నుండి రోజాను ప్రారంభించాలి. ఇది రమజాన్ నెలవంక గురించిన ఆదేశం. అయితే మబ్బువల్లనో లేక ధూళివల్లనో ఈద్ చంద్రుడు కనబడకపోతే ఒక మనిషి సాక్ష్యం సరిపోదు, అతడు ఎంత దైవభీతి పరాయణుడైనా, నమాజీ అయినా సరే. దానికి ఇద్దరు దైవభీతి కలవారు, సత్యం పలికే ముస్లిమ్ పురుషులు లేక ఒక పురుషుడు ఇద్దరు ముస్లిం స్త్రీల సాక్ష్యం కావలసి ఉంటుంది.

ఇది ఆకాశపు అంచు నిర్మలంగా లేకపోయినప్పుడు గల ఆదేశం. ఒకవేళ ఆ

ప్రదేశం నిర్మలంగా ఉన్నప్పుడు ఒకడి, ఇద్దరి సాక్ష్యం పనికేరాదు. ఈ పరిస్థితిలో చాలా మంది నెలవంకను చూసి ఉండాలి, వారి సాక్ష్యాన్ని త్రోసి వేయడం సులభం కాకుండాలి, అంటే ఆ వార్త 'ఖబ్రె ముస్తఫీజ్' అన్న మాట అంటే ఈ వార్త వదంతి కానిదై ఉండాలి. వదంతుల్లో చెప్పేవాడు వినేవాడు ఎవరో తెలియదు.

నెలవంక దర్శనం గురించిగల అనేక ఆధారాల్లో రెండు ఆధారాలు, 1.ఆకాశపు అంచు నిర్మలంగా ఉన్నప్పుడు, 2. ఆకాశపు అంచు నిర్మలంగా లేనప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి చెప్పడం జరిగింది. ఈ రెండు సందర్భాల్లోను సాక్ష్యం అవసరం. అయితే స్వతహాగా వార్త, సాక్ష్యం కాకుండా అనేక రకాలుగా చంద్రదర్శన ఆధారాన్ని తెలుసుకోవచ్చు. అవి ఇలా ఉన్నాయి:

## 1. షహాదత్ అలష్షహాద (సాక్ష్యానికి సాక్ష్యం)

అంటే దైవభీతి పరాయణులైన వారు ఇద్దరు. సాక్ష్యం చెప్పడానికి కొన్ని అనివార్య పరిస్థితుల్లో ఖాజీ వద్దకుగాని, ముఫ్తీ వద్దకుగాని పోలేక వారు తమలాంటి వారు, ఇద్దరు పురుషుల్ని తాము సాక్ష్యం పలుకుతున్నామని చెప్పి ఖాజీ వద్దకు పంపితే పోయినవారు, రాలేకపోయినవారి తరపున, ఫలానా వ్యక్తులు చంద్రుణ్ణి దర్శించారు మమ్మల్ని సాక్ష్యం చెప్పమని పంపించారు అని చెప్పడం. ఈ పరిస్థితిలో నెలవంక కనబడిన తీర్పు ఖాజీగాని, ముఫ్తీగాని చేసి ప్రకటించవచ్చు.

## 2. షహాదత్ అలల్ ఖజాఉల్‌ఖాజీ

ఖాజీగాని, ముఫ్తీగాని చంద్ర దర్శనం గురించిన సాక్ష్యాన్ని ఒప్పుకొని అక్కడ ఉన్న వారిలో ధర్మంపై నడిచే ఇద్దరు మనుషుల్ని మరో చోటగల ఖాజీ వద్దకు లేక ముఫ్తీ వద్దకు పంపించడం. పోయిన వారు, మా ముందు ఫలానా ఖాజీగారు లేక ముఫ్తీగారి ముందర నెల పొడుపు గురించి సాక్ష్యాలు వచ్చాయి, దాని ప్రకారం ఆ ఖాజీ లేక ముఫ్తీ చంద్రదర్శనం అయింది అని తీర్పునిచ్చారు అని చెప్పాలి. అలాంటప్పుడు మరోచోట ఆ సాక్ష్యం ఒప్పుకోబడుతుంది. చంద్ర దర్శనం అయిన తీర్పు ప్రకటించ బడుతుంది.

## 3. ఖాజీ ఉత్తరం (లేఖ) మరో ఖాజీ దగ్గరకు

ఓ ప్రదేశంలో ఉన్న ఖాజీగాని, ముఫ్తీగాని లేక ఓ బాధ్యతాయుతమయిన వ్యక్తి సమక్షంలో చంద్రుడు కనబడ్డాడనే సాక్ష్యం చెప్పబడింది. ఆ తరువాత వారి నుండి

ఈ షరతు ఇస్లామీయ ప్రభుత్వంలోని నమ్మకస్తులైన అధికారులు మాత్రమే విధించవలసి ఉంటుంది. కారణం ఏమంటే ఓ సామాన్య వ్యక్తి ఇచ్చిన సాక్ష్యంవల్ల దీన్ని నమ్మవచ్చు. పోతే చంద్రుడు ఎప్పుడూ అస్తమించడు, ఎక్కడో ఒకచోట కనబడుతూనే ఉంటాడు. అప్పుడు విమానాన్ని మరింత ఎత్తుకు తీసుకొని వెళితే చంద్రుడు తప్పక కనబడతాడు. అందుకని దాన్ని తగిన ఎత్తుకుమట్టుకే ఎగరేయవలసి వస్తుంది. కాబట్టి ఈ ప్రయత్నం కేవలం ఇస్లామీయ ప్రభుత్వానికే వదిలివేయవలసి ఉంది.

## చంద్రదర్శనం అన్ని ప్రదేశాల్లోను ఒకటిగా ఉండదు

నెలవంక దర్శనం అన్ని ప్రదేశాల్లోనూ ఒకేలాగ ఉండదు. కాబట్టి దీన్ని పరిశోధించిన 'ఉలమా' (ధర్మవేత్తలు) ఈ భేదాన్ని ఒప్పుకుంటారు. అయితే ఓ ప్రశ్న. అదేమిటంటే, భారతదేశం, పాకిస్తాన్, బంగ్లాదేశ్, నేపాల్‌లాంటి దేశాల ఆకాశపుటంచు ఒక్కటే కదా మరి అక్కడ రమజాను మరియు ఈద్‌లలో తేడా ఎందుకుంటున్నట్లు? ధర్మవేత్తలు, రేడియో, టీ.వి. లేక టెలిఫోన్ వార్తల ప్రకారం దీన్ని ఎందుకు ఒప్పుకోరు, అలా ఒప్పుకుంటే రమజాను ఈద్, బకరీద్ అంతటా ఒకేరోజు జరిగి తేడా లేకుండా పోతుంది కదా? సరికదా ఒక పట్టణంలోనే రెండేసి ఈద్‌లు జరుగుతాయి ఇలాంటప్పుడు సాధారణంగా ధర్మవేత్తలను తూలనాడడం జరుగుతుంది. వారికి తిరోగమనవాదాన్ని, సంకుచితత్వాన్ని అంటగడతారు. ఇవీ ఈ సందర్భంలో ఉద్భవించే ప్రశ్నలు. అయితే ఈ సందర్భంలో కొన్ని విషయాలను దృష్టిలో ఉంచుకుంటే పై ప్రశ్నలు అంత విలువైనవి కావు అనిపిస్తుంది. వీరు 'ఉలమా'ను అనవసరంగా నిందిస్తారు అన్నది అవగతం అవుతుంది.

మొదటి విషయం ఏమంటే చంద్రుడు ఆకాశపుటంచున ఉండడంలో, గట్టి సాక్ష్యంద్వారా దాన్ని తెలుసుకోవడంలో తేడా ఉంది. చంద్రుడు ఎప్పుడూ అస్తమించడు. సరికదా ప్రతి ప్రదేశంలోని ఆకాశపుటంచు ప్రకారం ఉద్భవించడమో అస్తమించడమో జరుగుతుంది. చంద్రుణ్ణి రెండు విధాలుగా చూడవచ్చు. ఒకటి ఆకాశపుటంచు నిర్మలంగా ఉండడం చంద్రుణ్ణి చాలామంది దర్శించడం. రెండోది ఒకచోట చంద్రుడు కనబడగా రమజాన్ లేక ఈద్ ప్రకటన రేడియో ద్వారా మరో పట్టణానికో రాష్ట్రానికో చేరడం. ఇక సాధారణంగా ప్రజలు కోరేది వార్తరాగానే దాన్ని నమ్మి ఆచరించడాన్నే. రేడియో ద్వారా ఈ దేశ ప్రధానమంత్రి చనిపోయాడు అని వార్తవస్తే ప్రతివాడు దాన్ని నమ్మేస్తాడు. అయితే ఓ హైకోర్టు కాదుకదా జిల్లాకోర్టు జడ్జికూడా ఏ కేసులోనైనా రేడియో, టీ.వి. లేక టెలిఫోను ద్వారా వచ్చే వార్తను సాక్ష్యంగా ఒప్పుకోడు. అయితే మీరు కోర్టు జడ్జి వైఖరికి తప్పుపట్టరు

కదా! కాని ఉలమా (ధర్మవేత్తలు)ల చంద్రదర్శనం సాధారణ వార్తకాదు, అది సాక్ష్యం అని అంటే వారపై మీరు సంకుచితత్వ నేరాన్ని రుద్దుతారు ఎందుకు?

రెండో విషయం ఏమిటంటే రమజాన్‌గాని, ఈద్‌గాని, బకరీద్‌గాని ఇతర జాతుల సాధారణ పండుగల్లాంటివి కావు. ఇవి ఆరాధనలు. అంటే చంద్రవంకను చూసిన తరువాతే ఓ ఆరాధన మొదలౌతుంది, సమాప్తమౌతుంది. అంతేకాకుండా ఈ చంద్ర దర్శనం పైన్నే మన అనేక పరస్పర అవసరాలు మరియు సామాజిక ఆదేశాలు ఆధారపడి ఉన్నాయి. కాబట్టే షరీఅత్‌లో "చంద్రవంకను చూసే రోజాను ప్రారంభించండి, నెలవంకను చూసే రోజాను విరమించండి" అని చెప్పబడింది.

దీనిద్వారా తెలిందేమిటంటే చంద్రుడు అక్కడ ఉండడం కాదు, దాన్ని చూడడం అన్నదే ముఖ్యం. చూడడంలో కూడా సాధారణ కంటితోనే చూడాలి అనేదే దాని ధ్యేయం. విమానమో, దూరదర్శనో లేక వాతావరణ నిపుణుల లెక్కలతో సంబంధం లేదని అర్థం.

ఇదే ఆదేశం నమాజు విషయంలో పనిజేస్తుంది. మన దేశంలో మగ్రిబ్, ఫజ్ర్ నమాజులు ఒకచోట ఒక గంటముందు జరిగితే మరోచోట ఓ గంట ఆలస్యంగా జరుగుతాయి. ఇలాంటప్పుడు మన ఏకత్వంలో ఏమైన మార్పువస్తుందా? రాదు. కాబట్టి అనవసరంగా ఏక కాలంలోనే అన్ని జరగాలి అని అనుకోవడం పొరపాటు. సహాబా (రజిఅన్) కాలంనుండి ఇప్పటివరకు చంద్రదర్శనంలోని ఈ భేదం వస్తూ ఉన్నదే. అయినా ఏ కాలంలోనూ ఈద్, బక్రీద్ వగైరాలు ప్రపంచమంతటా ఏక కాలంలో జరగాలనే ప్రయత్నం జరగలేదు; ఆ విషయంలో ఎలాంటి ఆక్షేపణా లేదు.

## చంద్రుణ్ణి చూసినప్పటి దుఆ

ప్రతి నెలా తొలిసారి నెలవంక కనబడినప్పుడల్లా ఈ దుఆ చదవాలి. "అల్లాహుమ్మ అహిల్లహు అలైనా బిల్ యుమ్నివల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి వత్తౌఫీఖి లిమా తుహిబు వ తర్జా రబ్బీ వ రబ్బుకల్లాహ్".

**నోటు:** ఎవరైనా చంద్ర దర్శనం చేసి, అతని సాక్ష్యం ఒప్పుకోబడకపోతే అతడు మాత్రం మరునాడు రోజా ఉడడం వాజిబ్, ఈద్ చేయకూడదు.

## రోజా

**రోజా కాల పరిమితి:** రోజా కాలపరిమితి ఉషోదయం మొదలు సూర్యాస్తమయం వరకు ఉంటుంది. అంటే రోజా పాటించే తలంపుతో అంతవరకు తినడం, త్రాగడాన్ని

మానివేయడం మరియు స్త్రీతో సంభోగంలో పాల్గొనకపోవడాన్ని రోజా అంటారు. తినడం త్రాగడం అనే భావంలోనే జీర్ణాశయంలోనికి మరేవిధంగానైనా ఆహారాన్ని లేక మందును చేరనీయకపోవడం కూడా ఇమిడి ఉంది. అదేవిధంగా స్త్రీతో సంభోగం అనే పదంలో కూడా, మనిషిలో కామవాంఛల్ని రేకెత్తించి, రేతస్ఖలనం జరిగేటట్లు చేసే ఇతరత్రా చేష్టలు, మనో వాంఛలు కూడా ఇమిడి ఉన్నాయన్నమాట. ఇక 'స్వప్నస్ఖలనం' విషయానికి వస్తే ఇది ఆ కోవలోకి రాదు. కారణం, ఇందులో మనిషి ప్రమేయం ఏమాత్రం లేదు.

**రోజా నియ్యత్ (సంకల్పం):** రోజా పరిపూర్ణతను సంతరించుకోవాలంటే దానికి తలంపు అనేది ముఖ్యం. అలా తలంపని తలంపుగా రోజా ఉండిపోతే రోజా అనబడదు. ఉదాహరణకు ఎవరైనా పగలల్లా ఏమీ తిననూ త్రాగనూ లేదు, ఆపై రోజా తలంపు లేక సంకల్పం కూడా లేదు. అలాంటప్పుడు ఆ వ్యక్తి రోజా పాటించినట్లుకాదు. అతని ఆ రోజా రోజా అనబడదు. అయితే ఆ సంకల్పం ఏదో నోటితోనే చేయనవసరం లేదు. మనస్సులో దాని సంకల్పం చేసుకుంటే చాలు. ఉదాహరణకు, రోజాకోసం 'సహరీ' భుజించడం లేక సహరీ సమయంలో ఏ వస్తువు తిన్నా తినకపోయినా ఆ సంకల్పంతో పుక్కిలించి ఉమ్మి వేయడం, నీళ్ళు త్రాగడం కూడా సంకల్పం క్రిందికే వస్తాయి. ఇక 'నియ్యత్' తప్పకుండా అరబీ భాషలోనే చేయాలనే నియమం కూడా లేదు. రోజా పాటించే వ్యక్తి తన మాతృ భాషలోనే 'నియ్యత్' (సంకల్పం) చెయ్యవచ్చు.

రమజాన్ రోజాల సంకల్పం రాత్రిపూటే చేసుకోవాలి. అలాకాకున్నా మధ్యాహ్నం లోపున చేసుకోవచ్చు. ఆ నియ్యత్ లేక సంకల్పంతో "ఈ రోజు నేను రమజాన్ రోజా పాటిస్తున్నాను" అంటే సరిపోతుంది. సంకల్పంతో రమజాన్ అనే పదం వాడకపోయినా కేవలం "ఈ రోజు నేను రోజా పాటిస్తున్నాను అని అన్నా రోజా నెరవేరుతుంది. అరబీ భాషలో చేయదలిస్తే ఇలా నియ్యత్ చేయాలి.

"నవైతు బి సౌమిల్‌యౌమ్"

## సహరీ

రోజా పాటించే తలంపుతో ఉషోదయానికి పూర్వం ఏదైతే తినడంగాని త్రాగడంగాని జరుగుతుందో దాన్నే 'సహరీ' అని అంటారు. సహరీ భుజించడం సున్నత్ మరియు పుణ్యప్రదం కూడా. ఒకవేళ సహరీ వేళ తినడానికి మనసొప్పకపోయినా, కొంచెం తీపివస్తువు తినడం లేక పాలుత్రాగడం అవసరం. పూర్తిగా ఏమీ తినడానికి

మనసొప్పకపోతే కొంచెం నీరైనా త్రాగాలి. సహరీ సంకల్పంతో ఏదైనా తినడం గాని త్రాగడం గాని తప్పనిసరి.

కొందరు ముందు జాగ్రత్తకోసం మూడూ నాల్గుగంటల రాత్రి ఉండగానే సహరీ భుజిస్తారు. అలా చేయడం మంచిదికాదు. సహరీ ఆలస్యంగా (అంటే చివరి ఘడియల్లో) భుజించడం సున్నత్. సహరీ భుజించడంలో కొన్ని విషయాల్ని జ్ఞప్తి యందుంచుకోవాలి.

1. ఒకవేళ రాత్రి నిద్రమేల్కొనక సహరీ భుజించకపోతే అలానే రోజాను పాటించాలి. సహరీ భుజించలేదని ఎవరైనా రోజాను పాటించకపోతే పాపంచేసిన వాడవుతాడు. 2. నిద్ర మేల్కొనడంలో ఎవరికైనా ఆలస్యం జరిగి, అది సహరీ సమయమే అనుకొని సహరీ భుజించి ఆ తరువాత అది సహరీ సమయం కాదు అని తెలిస్తే అలాంటి వ్యక్తి రోజా వ్యర్థం అయినట్లే. అలాంటి సందర్భంలో రమజాన్ నెల అయిన తరువాత ఆ రోజాను అతడు ఖజా పాటించాలి. అయితే ఆ రోజు పగలల్లా అతడు ఇతర రోజాదార్లలానే పస్తుంటూ గడపాలి. అంటే రోజా యొక్క గౌరవాన్ని పాటిస్తూ ఎలాంటి ఆహారపానీయాలు ముట్టుకోకూడదు. 3. సహరీ సమయం ఉన్నదా లేదా అనే సందిగ్ధం ఏర్పడితే అట్టి సందర్భంలో సహరీ భుజించకుండానే ఉండాలి.

## ఇఫ్తార్

సూర్యాస్తమయం అయిన తరువాత రోజా విరమించే ఉద్దేశ్యంతో ఏదయినా తినడాన్ని లేక త్రాగడాన్ని షరీఅత్‌లో 'ఇఫ్తార్' అంటారు. సహరీ భుజించడంలో ఎలాగైతే ఆలస్యం చేయడం పుణ్యప్రదమయినదో అదే విధంగా 'ఇఫ్తార్'లో త్వరపడడం కూడా పుణ్యప్రదమే. 'త్వరపడడం' అంటే, సూర్యుడు అస్తమించాడు అని నమ్మకం కుదిరిన వెంటనే రోజా ఇఫ్తార్ చెయ్యాలి. ఇంకొంచెం చీకటి పడిన వరకు ఆగుదామని ఎదురు చూడకూడదు.

"నా ఉమ్మత్ (సమాజం) రోజా విరమణలో త్వరపడుతున్నంత వరకు రుజుమార్గం (శుభం)పై ఉంటుంది" అని దైవ ప్రవక్త (సఅసం) ప్రవచించారు. రోజా విరమణలో ఆలస్యం చేయడం మక్రూహ్. ఎండు ఖర్జూరం, పండు ఖర్జూరం లేక నీటితో ఇఫ్తార్ చేయడం ఉత్తమం.

ఇఫ్తార్ ముందు ఈ దుఆ పఠించాలి.

ఎవరయినా ఆ సాక్ష్యాన్ని స్వీకరించి ఇద్దరు ధర్మపరులయిన ముస్లిముల ఎదుట, నేను షరయీ సాక్ష్యం (ధార్మిక సాక్ష్యం) ఆధారంగా చంద్ర దర్శనం అయినట్లు తీర్పు ఇచ్చాను అని రాసి దానిపై సంతకం పెట్టి కార్యాలయ ముద్ర ఉంటే దాన్ని వేసి ఆ ఇద్దరు ముస్లిము లకు ఆ ఉత్తరం ఇచ్చి ఇంకో ప్రదేశంలో ఉన్న ముఫ్తీకిగాని, ఖాజీకిగాని లేక బాధ్యతాయుత మయిన వ్యక్తికిగాని ఇచ్చి, అతని ముందు ఈ ఉత్తరం, మా సమక్షమునవే రాయబడిందని దీన్ని మీకు అందించమని మమ్ములను పంపించడం జరిగిందని చెప్పాలి. ఈ వార్తను ఆధారంగా చేసుకొని ఆ ఖాజీ లేక ముఫ్తీ లేక బాధ్యుడైన ఆలిమ్ చంద్ర దర్శనం అయిందని ప్రకటించవచ్చు. మొత్తానికి దీని ధ్యేయం ఏమంటే ఓ బాధ్యతాయుతమయిన ఉత్తరం అవసరం. అది సాధారణ వ్యక్తుల ఉత్తరం అయి ఉండకూడదు.

## 4. ఖబ్రె ముస్తఫీజ్

అంటే చంద్ర దర్శనం అయింది అనే వార్త సర్వ సాధారణం అయిపోవడం ఇలాంటి సందర్భాల్లో నమ్మవచ్చు. కాని ఇది చెప్పిన వాడెవడో, విన్న వాడెవడో తెలియకుండా వదంతి మాత్రం కాకుండా ఉండాలి.

రేడియో, టీవిలపై ఆలిమ్‌లు అంటే ధార్మికవేత్తల ఏదైనా ఓ సభగాని, నమ్మక మయిన హిలాల్ కమిటి (చంద్రదర్శనం కోసం నియమించిన కమిటి) సాక్ష్యాన్ని గ్రహించి పూర్తి నిజానిజాలు తెలుసుకొని తీర్పు ప్రకటించవచ్చు. కేవలం ప్రజల సమూహం చేసిన ప్రకటన సరిపోదు. ప్రస్తుత కాలంలో ప్రతివాడు ఓ ముఫ్తీ (ధార్మిక తీర్పులు ఇచ్చేవాడు)గా తయారైపోయాడు. కాబట్టి జాగ్రత్త అవసరం. ఇదే విధంగా అనేక ప్రదేశాల నుండి, ఫలానా చోటగల ఖాజీగాని, ముఫ్తీగాని రమజాన్ ప్రారంభం అయిందని లేక ఈద్ అవుతుందని ప్రకటనలు వస్తే స్థానిక ధర్మవేత్తలు ఆ వార్త నిజం అని నమ్మినప్పుడు చంద్ర దర్శన ప్రకటన చేయవచ్చు.

## క్రొత్త సాధనాలతో చంద్రుణ్ణి చూడడం

ఆకాశపుటంచు నిర్మలంగా ఉన్నప్పుడు చంద్రవంక దర్శనం ఏమంత కష్టం కాదు. అయితే ఆ అంచు దుమ్ము ధూళితో నిండి ఉండడమో లేక మబ్బులు పట్టి ఉండడమో జరిగితే లేక పది ఇరవై అంతస్తుల భవనాలు అనేకం ఉండడమో జరిగితే అప్పుడు దూరదర్శిని సహాయంతోగాని, విమానం నుండిగాని నెలవంకను చూసే ప్రయత్నం చేయడంలో తప్పులేదు.

"అల్లాహుమ్మ లకసుమ్తు
వ అలా రిజ్ఖిక అఫ్తర్తు"

اَللّٰهُمَّ لَكَ صُمْتُ وَعَلٰى رِزْقِكَ اَفْطَرْتُ۔

(ఓ అల్లాహ్! నేను నీ కోసమే ఉపవాసం పాటించాను, నీవు ప్రసాదించిన భుక్తితోనే ఉపవాసం విరమణ చేస్తున్నాను). (సహాహాసిత్తా)

ఇఫ్తార్ అయిన తరువాత ఈ దుఆ పఠించాలి.

"జహబజ్జమాఉ వబ్
తల్లతిల్ ఉరూఖు వ సబతల్
అజ్ర్ ఇన్శా అల్లాహ్."

ذَهَبَ الظَّمَاُ وَابْتَلَّتِ الْعُرُوْقُ وَثَبَتَ الْاَجْرُ اِنْ شَآءَ اللّٰهُ۔

(దాహం తీరింది, నరాలు చల్లబడ్డాయి, అల్లాహ్ చిత్తమయితే దీని ప్రతిఫలం కూడా లభిస్తుంది).

రోజా ఇఫ్తార్ చేయగానే మగ్‌రిబ్ నమాజు చేయాలి. ఇఫ్‌తార్ చేయడంలో సామూహిక నమాజ్ కొంత ఆలస్యం అయినా ఫరవాలేదు. (కబీరి పేజి 233)

రమజాన్ నెలలో ఇఫ్‌తార్ కారణంగా నమాజులో కొంత ఆలస్యం అయినప్పటికీ ఫరవాలేదు. కాకపోతే మరీ చీకటి పడేంత ఆలస్యం చేయకూడదు. మిగతా పదకొండు నెలల్లో మగ్రిబ్ అజాన్ కాగానే నమాజు చేయడం ఉత్తమం.

1. మబ్బులు క్రమ్మిన రోజుల్లో కొంత ఆలస్యంగా ఉపవాస విరమణ చేయాలి. సూర్యుడు అస్తమించాడు అని పూర్తిగా నమ్మకం కుదరనంత వరకు రోజా ఇఫ్తార్ చేయకూడదు.

2. సూర్యుడు అస్తమించాడు అని నమ్మకం ఏర్పడి ఇఫ్తార్ చేసిన తరువాత, సూర్యుడు ఇంకా అస్తమించలేదు అని తెలిస్తే ఆ రోజా మిగతా దినాల్లో ఖజా పాటించాలి.

3. ఇఫ్తార్ తరువాత సూర్యుడు అస్తమించాడో లేదో అనే సందిగ్ధం ఏర్పడితే, ఆ సందిగ్ధానికి ఆధారం లేదు. నమ్మకం కలగడం ముఖ్యం.

## రోజా పరిస్థితిలో చేయవలసిన పనులు

రోజా పాటించే సమయాన్ని అనవసరమయిన పనుల్లో, పనికిరాని మాటల్లో వెచ్చించకూడదు. ఉపాధి సంపాదన తరువాత మిగిలిన వేళల్ని ఖుర్ఆన్ పారాయణం నఫిల్ నమాజులు లేక ఇతరత్రా పుణ్యకార్యాల్లో వెచ్చించాలి. దైవప్రవక్త (సఅసం),

సహాబీలు (రజిఅన్) తీవ్రమైన ఎండాకాలంలో రోజాలు పాటిస్తూ దైవ మార్గంలో జిహాద్ చేశారు. ధర్మ ప్రచారం చేశారు. ఒకవేళ ఖుర్ఆన్ పారాయణం లేక మరేదయినా పుణ్యకార్యంలో పాల్గొనలేకపోతే నిద్రపోవడం మంచిది. ఎందుకంటే ఆ సమయాన్ని మనిషి అనవసరమయిన పనుల కోసం ఉపయో గించకుండా ఉంటాడు.

## రోజా మక్రూహ్ అవడానికి గల కారణాలు

రోజాలో తినడం, త్రాగడం, సంభోగించడంలాంటివి త్యజించడం ఫర్జ్ (విధి). వాటిలో దేనికైనా పాల్పడితే రోజా భంగపడుతుంది. సరికదా ఆ ఒక రోజాకు ప్రాయశ్చి తంగా రెండు నెలలు ఎడతెగకుండా రోజాలు ఉండాలి. కాని కొన్ని పనుల ఆచరణవల్ల రోజా అయితే భంగపడదు కాని మక్రూహ్ అవుతుంది. దానివల్ల రోజా పుణ్యఫలం తగ్గిపోతుంది. ఆ పనులు ఇలా ఉన్నాయి:

1. పరోక్ష నింద, చాడీలు చెప్పడం, పరుషంగా మాట్లాడ్డం. తిట్టడం, పెద్దగా అరవడం, అనవసరమయిన మాటల్లో లీనమవడం, జగడమాడడం.

2. ఆకలిదప్పులవల్ల కలిగే బాధలను వ్యక్తపర్చడం, ఆందోళన చెందడం.

3. ఏ పదార్థాన్నయినా నోటిలో ఉంచుకోవడం లేక నమలడం, అది తినే పదార్థం అయినా, తినని పదార్థం అయినా సరే.

4. తినే పదార్థాన్ని రుచిచూడడం. ఒకవేళ ఓ గృహిణి యొక్క భర్త లేక నౌకరు యొక్క యజమానిగనక అసహని, ముక్కోపి అయి వారి ఎడల అతిగా ప్రవర్తిస్తాడు అనే భయం ఉంటే వారు తమ నాలుక మొనతో ఏ పదార్థాన్నయినా రుచి చూసి వండే అనుమతి ఉంది.

5. రోజా స్థితిలో, పుక్కిలించడం, ముక్కు శుభ్రం చేయడంలో అతిగా ప్రవర్తించడం ద్వారా గొంతులోనికి నీరు పోవడం.

6. స్నానం (గుస్ల్) చేసే అవసరం ఏర్పడి, ఉషోదయం వరకు స్నానం చేయకుండా ఉండడం. తెల్లవారిన తరువాత లేక సూర్యోదయం అయిన తరువాత స్నానం చేయడం మరీ తీవ్రమయిన విషయం.

7. బొగ్గు నమలడం లేక పండ్ల పొడితో దంతధావనం చేయడం. ఇదేవిధంగా టూత్‌పేస్ట్ లాంటివి ఉపయోగించడం.

8. నోటిలో పెద్ద మొత్తంలో లాలాజలాన్ని నిలువ ఉంచి మ్రింగడం. లేక పల్లలో శనగగింజ కంటే తక్కువ పరిమాణంలోని ఏదేని పదార్థం ఇరుక్కొని ఉండినప్పుడు దాన్ని మ్రింగడం.

9. తనను తాను నియంత్రించుకోలేనని (కంట్రోలు చేసుకోలేనని) అనుకున్నప్పుడు స్త్రీని ముద్దాడడం లేక ఆమెను ఆలింగనం చేసుకోవడం మక్రూహ్. కాని అలాంటి భయం లేకుంటే ఫరవాలేదు. అయితే యవ్వనంలో ఉన్న ప్రతివ్యక్తీ ఈ పరిస్థితి దరిదాపుకు పోకూడదు. ఇంకా స్త్రీ, అధరాన్ని తన నోటిలోనికి తీసుకోవడం మక్రూహ్.

10. తన నోటితో నమిలి పిల్లవానికి ఏదయినా తినిపించడం.

## రోజా మక్రూహ్ కాని, భంగం కాని పరిస్థితులు

1. తల వెంట్రుకలకు నూనెను రాసుకోవడం. 2. శరీరంపై నూనెను మర్ధించడం. 3. సుర్మా పెట్టడం. 4. మిస్వాక్ చేయడం. మిస్వాక్ పచ్చిదయినా ఎండిదయినా, మధ్యాహ్నానికి ముందయినా ఆ తరువాతయినా సరే. 5. సువాసనను పులుముకోవడం లేక వాసన చూడడం. 6. మరచిపోయి తినడం త్రాగడం లేక స్త్రీ పక్కన కేవలం పడుకోవడం. ఒకవేళ రోజా పాటించేవాడు మరిచి ఏదయినా తినగా త్రాగగా ఎవరయినా చూస్తే అతడు వెంటనే అతనికి తెలియజేయనవసరం లేదు. 7. వాంతి అవడం. అది కొంచెం అయినా అధికమయినా. 8. నోటిలో సహజంగా ఊరే లాలాజలాన్ని మ్రింగడం. 9. అనుకోకుండా ఈగైనా, పొగైనా గొంతుద్వారా లోనికి వెళ్ళిపోవడం. 10. వేడి తీవ్రతవల్ల మాటిమాటికీ నోట్లో చన్నీళ్ళు తీసుకుని పుక్కిలించి ఉమ్మివేయడం. లేక శరీరాన్ని తడపడం, లేక వస్త్రాలను తడిపి వంటిపై వేసుకోవడం. 11. నిద్రలో స్వప్న స్ఖలనం కావడం. 12. రోజాను మరిచి స్త్రీతో సంభోగించనారంభించాడు లేక తిన త్రాగనారం భించాడు. కాని వెంటనే తన తప్పును తెలుసుకొని సంభోగాన్ని వదిలి ప్రక్కకు తప్పుకోవడం లేక తినడాన్ని త్రాగడాన్ని ఆపివేస్తే అతని రోజా భంగపడదు. అతడు తన ఆ రోజాను పూర్తి చేసుకోవాలి.

## రోజా భంగపడేదెప్పుడు

రోజా భంగపరిచే పరిస్థితులు రెండు రకాలు. ఒకటి, కేవలం ఆ రోజాకు ఖజా మాత్రమే పాటించే పరిస్థితులు. రెండవది, ఖజాతోపాటు 'కఫ్ఫారా' (ప్రాయశ్చిత్తం) కూడా చెల్లించవలసిన పరిస్థితులు.

## కేవలం ఖజా మాత్రమే పాటించే పరిస్థితులు

ఖజా అంటే బదులుగా పూర్తి చేయడం అని. రోజా ఖజా చేయడమంటే, రమజాన్ నెలలో ఒకరి రోజా లేవయినా వదిలివేయబడితే అతడు వాటిని రమజాన్ నెల అయి పోగానే బదులుగా పూర్తి చేసుకోవలసి ఉంటుంది. ఆ పరిస్థితుల్లో అతడు వదిలివేసిన రోజాలను పూర్తి చేసుకోవాలి. దాన్నే ఖజా చేయడం అంటారు. ఇది ముఖ్యం. ఆ పరిస్థితులు ఇలా ఉన్నాయి.

1. ఎవరయినా బలవంతంగా రోజాదారుని నోట్లో ఏ పదార్థాన్నయినా వేస్తే అది గొంతు నుండి పొట్టలోనికి వెళ్ళిపోవడం. 2. కావాలని వాటిని నోటినిండా తీసుకురావడం, లేక నోటిలోనికి వచ్చిన కొద్దిపాటి వాంతిని మ్రింగి వేయడం. 3. రోజా జ్ఞాపకం ఉంది కాని, నోటిలో నీరు పోసి పుక్కిలించేటప్పుడు అశ్రద్ధ వల్ల నీరు గొంతుదాటి పోవడం. 4. తినకూడని పదార్థాలు ఉదాహరణకు కాగితం, గులకరాయి, మట్టి, బొగ్గులాంటి వాటిని కావాలని మ్రింగడం. 5. పళ్ళలో రొట్టె లేక మాంసం యొక్క సన్నని ముక్క మిగులుండి తెల్లారిన తరువాత పళ్ళ పుల్ల (Tooth Pick) తో తోమడం వల్ల అది గొంతులోనికి వెళ్ళిపోవడం, అయితే ఆ పదార్థం శనగ గింజ పరిమాణం కంటే తక్కువ ఉన్నట్లయితే ఫరవాలేదు కాని, అదే శనగ గింజంత లేక అంతకంటే పెద్దదైతే రోజా పాటించవలసి ఉంటుంది. ఇది నోటిలో నుండే గొంతులోకి పోయినప్పటి మాట. కాని దాన్నే నోట్లో నుండి బయటకు తీసి తిరిగి మ్రింగేస్తే ఆ పదార్థం చిన్నదయినా పెద్దదయినా రోజాను ఖజా చేయ వలసిందే. 6. చెవిలో నూనె వేయడం. 7. ముక్కు ద్వారా ఏ పదార్థాన్నయినా పీల్చడం అది గొంతు ద్వారా లోనికి వెళ్ళిపోవడం. 8. పళ్ళ నుండి వచ్చే రక్తం అది ఉమ్మికంటే ఎక్కు వయితే మ్రింగడం. 9. మరిచిపోయి ఏదయినా తిన్న తరువాత, ఇక రోజా భంగపడిందని తలచి తిరిగి తినడం త్రాగడం. 10. ఉషోదయం తరువాత, ఇంకా సమయం ఉంది అని తలచి సహరీ భుజించడం. 11. సూర్యాస్తమయానికి పూర్వం, సూర్యుడు అస్తమించాడని తలచి ఇఫ్తార్ చేయడం. 12. రమజాన్ నెల రోజాలు కాకుండా ఇతర నఫిల్ లేక వాజిబ్ రోజాలను కావాలని భంగపర్చడం. 13. మధ్యాహ్నం వేళ తరువాత రోజా సంకల్పం చెయ్యడం.

ఈ పరిస్థితులన్నింటిలోను రోజా భంగపడుతుంది. బదులుగా మరో రోజాను పాటించవలసిందే.

## ఖజా (బదులు) రోజాను ఎప్పుడు పాటించాలి

రోజా ఖజా అయితే సంవత్సరంలోని పదకొండు నెలల్లో ఎప్పుడు పడితే అప్పుడు ఖజా (బదులు) పాటించాలి. కాని రమజాన్ మాసం అంతమవగానే ఖజా పాటించడం ఉత్తమం. ఖజా రోజాలు ఎడతెగకుండా ఉండనవసరం లేదు. ఉదాహరణకు ఎవరి వైనా మూడు నాల్గు రోజాలు ఖజా (విడువబడితే) అయితే అతడు వాటన్నిటిని ఒకే క్రమంలో ఒకేసారి పాటించనవసరం లేదు. ఒక్కొక్కటిగా రెండేసిగా అప్పుడప్పుడు పూర్తి చేసినా ఫరవాలేదు.

ఒకరికి గత రమజాన్ నెల రోజాలు ఖజా మిగిలి ఉన్నాయి. అప్పుడు ఆ వ్యక్తి మొదట ప్రస్తుత రమజాన్ నెల రోజాలను పాటించాలి. రమజాన్ గడిచిన తర్వాత ఖజాలు ఉండాలి కాని రమజాన్ నెలలో మరే రోజా నియ్యత్ చేయడం సబబు కాదు. ఒకవేళ వేరే రోజా సంకల్పం చేసిన ఆ రోజాను రమజాన్ నెల రోజా క్రిందే లెక్కించడం జరుగుతుంది.

కఫ్ఫారా అంటే దాచడం. షరీఅత్ పరిభాషలో, ఏదయినా పాపాన్ని దాచడం లేక అంతమొందించడం కోసం ఏదయితే బదులుగా ఇవ్వబడుతుందో అది కఫ్ఫారా. 'కఫ్ఫారా' వాజిబ్ అయ్యేందుకు కావలసిన పరిస్థితులు ఇలా ఉన్నాయి:

1. రమజాన్ మాసపు రోజా పాటిస్తూ కావాలని రోజాలో నిషిద్ధమయిన పని చేయడం. ఉదాహరణకు, తినడం త్రాగడం, స్త్రీ సంపర్కం వగైరాలు. తినడం అన్న పదంలో నోటిద్వారా కాక మరే పద్ధతి ద్వారానయినా కావాలని జీర్ణాశయంలోనికి లేక మెదడులోనికి ఏదయినా ఆహారాన్ని ప్రవేశపెట్టడం. ఈ పరిస్థితిలో కప్ఫారా వాజిబ్ కాదుగాని ఖజా మాత్రం వాజిబ్ అవుతుంది. ఇదేవిధంగా త్రాగడం అనే పదంలోను నీరుగాని, మందుగాని లేక ఏదైనా ద్రవపదార్థమే కాకుండా గుట్కా సిగరెట్టు, బీడీ వగైరాలు కూడా చేరి ఉన్నాయి. ఈ పదార్థాలను ఎవరయినా వాడితే అతడు కఫ్ఫారా చెల్లించవలసిందే.

2. రోజాలో ధర్మసమ్మతమయిన (జాయిజ్) ఏ పనయినా చేసి, ఉదాహరణకు తలకు నూనె రాయడం, కంట్లో సుర్మా పెట్టుకోవడం, సువాసన చూడడం, స్త్రీని ముద్దాడడం లాంటివి–ఆపై తన రోజా భంగపడిందని భ్రమించి కావాలని తినడం త్రాగడం వగైరాలు చేస్తే అతడు కప్ఫారా చెల్లించాల్సిందే. అయితే ఇక్కడ రెండు విషయాలు గుర్తుంచుకోవాలి.

(అ) ఆ వ్యక్తికి ఏ ఆలిమ్ (ధార్మిక జ్ఞానంకలవాడు) ఎవరయినా తప్పుడు ధార్మిక తీర్పునిస్తూ "నీవు రోజా భంగపరిచావు" అని అంటే అతడు కప్ఫారా చెల్లించ నవసరం లేదు.

(ఆ) ఆ వ్యక్తి చేసిన పనివల్ల చూసేవారికి రోజా భంగపడింది, అని అనిపించి నప్పుడు. ఉదాహరణకు మరిచిపోయి కడుపునిండా భుజించినా లేక స్త్రీని ఆలింగనం చేసుకోవడం వలన రేతస్సు బయటపడినా-అలాంటప్పుడు ఆ వ్యక్తి ఇంకేముందీ నా రోజా భంగపడింది అనుకొని తిరిగి తినడం లేక త్రాగడం చేసినా అతడు కప్ఫారా చెల్లించ నవసరం లేదు. కాని ఇదే పనిని రోజా స్థితిలో కావాలని చేసినప్పుడే పైన పేర్కొన్నట్లు ఖజా మరియు కప్ఫారా రెండూ చెల్లించాల్సిందే.

## రోజాను భంగపర్చినందుకు కప్ఫారా

రమజాన్ మాసపు రోజాలను కావాలని భంగపర్చడంవల్ల కప్ఫారా చెల్లించే విధం ఇలాగుంటుంది.

1. ఒక రోజాకు బదులు ఎడతెగకుండా రెండు నెలలు రోజాలు పాటించడం ఫర్జు (విధి). ఆ రెండు నెలల రోజాల్లో ఏ ఒక్క రోజా కూడా విడవబడినా తిరిగి రోజాలను ప్రారంభించాలి. కాబట్టి కప్ఫారా రోజాలను ప్రారంభించేటప్పుడు మనిషి బాగా ఆరోగ్య వంతుడై ఉండడం రోజాల నడుమ, ఏ రోజుల్లో రోజాలు పాటించడం నిషిద్ధమో ఆ రోజులు (ఉదాహరణకు ఈదుజ్జుహా యొక్క మూడు రోజులు) రాకూడదు.

2. కప్ఫారా రోజాలు పాటించే రోజుల్లో స్త్రీకి రుతుస్రావంవస్తే ఆ రుతుస్రావపు గడువుదాటిన వెంటనే రోజాలను ప్రారంభించాలి. ఎందుకంటే రుతుస్రావం అనేది ప్రకృతి సిద్ధమయినది. కాబట్టి వారికి ఈ అనుమతి ఇవ్వబడింది. అయితే ప్రసూతి వల్ల రోజాల్లో ఆటంకం ఏర్పడితే కప్ఫారా సరైందికాదు, కారణం ఇది ప్రతినెలా వచ్చేది కాదుగనుక.

3. ఎవరికయినా ఎడతెగకుండా రెండు నెలలపాటు రోజాలను పాటించే శక్తి లేకపోతే అరవై మంది నిరుపేదలకు రెండుపూటలా కడుపునిండా భోజనం పెట్టాలి. లేక సదఖయే ఫిత్ర్‌లో ఎంత ధాన్యం అయితే ఇవ్వబడుతుందో అంత ధాన్యం లేక దాని వెల వారికి ఇవ్వాలి.

ఒకవేళ ఒకే తడవ అరవై మందికి భోజనం పెట్టే శక్తి కూడా లేకపోతే అతడు ఒక నిరుపేదకు అరవై రోజులు భోజనం పెట్టడమో లేక అరవై రోజుల వరకు రోజూ ఒకనాటి ధాన్యం ఇచ్చినా ధర్మసమ్మతమే. కాని ఒకే మనిషికి అరవై రోజుల ధాన్యం లేక ఆ ధాన్యానికి సరిపడ విలువ (ధర) ఒక్కనికే ఇస్తే కప్ఫారా చెల్లదు.

ఒక మనిషికి ఒకనాటి బత్తెమే ఇవ్వాలి. ఒకవేళ ఒకే రమజాను నెలలోని మూడు లేక నాలుగు రోజాలు అలా వదిలివేయబడితే అప్పుడు కూడా ఒకే కప్ఫారా వాజిబ్

అవుతుంది. అయితే ఈ రోజాలు రెండు రమజాను నెలలకు సంబంధించినవయితే రెండు కప్ఫారాలను ఇవ్వాలి. రమజాన్ నెలకు సంబంధించిన రోజాలు కాకుండా ఇతర నఫిల్ రోజాలను భంగపరిస్తే వాటికి కప్ఫారా లేదు. ఖజా చేసుకుంటే సరిపోతుంది.

## రోజా పాటించకుండడానికి అనుమతి

కొన్ని అనివార్య పరిస్థితుల్లో ఓ ముస్లిమ్ రమజాన్ నెల రోజాలు పాటించ కుండేందుకు లేక రోజాను భంగపరచేందుకు అనుమతి ఉంది. ఆ అనివార్య పరిస్థితులు ఇవి:

## 1. ప్రయాణం

అంటే ఓ వ్యక్తి నలభై ఎనిమిది మైళ్ళ (డెబ్బై నాల్గు కిలోమీటర్లు) కంటే ఎక్కువ దూరం ప్రయాణం చేయడానికి సంకల్పించుకుంటే ఆ ప్రయాణం కాలినడకనగాని, రైలు బస్సు లేక విమానం ద్వారాగాని చేసినా సరే-అతనికి రోజాను వదిలేసే అనుమతి ఉంది. అయితే తన ప్రయాణంలో ఎలాంటి కష్టం కలగకపోతే రోజాను పాటించడం ఉత్తమం. దైవ ప్రవక్త (సఅసం) ప్రయాణంలో అప్పుడప్పుడు రోజాలను పాటించేవారు. ఇంకా రోజా లను విడిచిన సందర్భాలూ ఉన్నాయి. అదే కాకుండా తీవ్రమైన బాధా సమయంలో రోజా పాటించి దాన్ని 'ఇఫ్తార్' కూడా చేశారు. (ముస్లిమ్)

ఏ వ్యక్తి అయినా రోజా సంకల్పం చేసిన తరువాత ప్రయాణం ప్రారంభిస్తే ఆ వ్యక్తి ఆ రోజు రోజాను పూర్తి చేయడం అవసరం.

## 2. వ్యాధి

ఏ వ్యక్తి అయినా రోజా పాటిస్తే వ్యాధి తీవ్రమౌతుందన్న భయం ఉన్నా లేక ఆ రోజా వల్ల మరే క్రొత్త వ్యాధి వచ్చినా లేక వ్యాధి నయం అవడంలో ఆలస్యం జరిగే ప్రమాదం గనక ఉంటే ఆ వ్యక్తి రోజాను వదిలివేయవచ్చు. వ్యాధి అయితే లేదుగాని బలహీనతలో రోజా పాటిస్తే వ్యాధి తిరగబెడుతుంది అనుకున్నా వానికి కూడా రోజాను వదిలేసే అనుమతి ఉంది.

అయితే వ్యాధి సందర్భంలో, దైవభీతి కలిగిన ముస్లిమ్ డాక్టరు లేక వైద్యుడు ఆ రోగికి రోజాను వదలడానికి సలహా ఇవ్వవలసి ఉంటుంది. లేక స్వయంగా ఆ వ్యక్తికి రోజా పాటించడం వలన నష్టం వాటిల్లుతుందనే అనుభవం, నమ్మకమయినా ఉండాలి.

## గర్భవతి మరియు బిడ్డకు పాలుపట్టే స్త్రీ

ఏ స్త్రీ అయిన గర్భవతిగాని, పాలుపట్టే తల్లిగాని అయితే ఆమెకు తన ప్రాణానికి లేక పసిపాప ప్రాణానికి ముప్పు వాటిల్లుతుందని అనుకున్నప్పుడు, లేక పాప తీవ్రమయిన బాధకు గురి అవుతుందనే భయం ఉంటే రోజాను వదిలేయడం ధర్మ సమ్మతం. ఉదాహరణకు, రోజా పాటించే గర్భవతికి అపస్మారక స్థితి ఏర్పడడం లేక ఆమె పాలు ఎండిపోవడం వల్ల పిల్లవాడు ఆకలి బాధతో తల్లడిల్లడంలాంటివి.

అయితే ఎవరయినా డబ్బిచ్చి పిల్లవానికి ఇతర స్త్రీతో పాలుపట్టించే స్తోమత కలిగి ఉన్నప్పుడు లేక పిల్లవాడు పై పాలు త్రాగగలిగి, ఆ పాలవల్ల పిల్లవానికి ఎలాంటి ముప్పు వాటిల్లనప్పుడు ఆ స్త్రీ రోజా పాటించడం ఫర్జు.

## రుతుస్రావం, ప్రసూతి స్రావం

రుతు, ప్రసూతి స్రావాల పరిస్థితుల్లో కూడా స్త్రీలు రోజాలను వదిలేయాలి. శుభ్రత ఏర్పడిన వెంటనే రోజాలను ప్రారంభించాలి. ఎన్ని రోజాలయితే వదిలివేయబడ్డాయో వాటిని రమజాన్ మాసం తరువాత పూర్తి చేసుకోవాలి. రుతు, ప్రసూతిస్రావాల్లో వదిలి వేయబడిన నమాజులయితే మాఫీ అవుతాయిగాని, రోజాలు మాఫీ కావు అన్న విషయాన్ని గుర్తుంచుకోవడం ముఖ్యం. ఇంకా పైన చెప్పిన సందర్భాల్లోని అనివార్య పరిస్థితులు దూరం అయిపోయిన వెంటనే రోజాలను పూర్తి చేసుకోవాలి అన్న విషయాన్ని గుర్తించడం కూడా అవసరమే. అలా చేయని పక్షంలో పాపం చేసిన వారౌతారు.

## రోజాను పాటించి దాన్ని భంగపరిచే అనుమతి

ఎవరికైనా రోజా ఉన్న తరువాత 1. తీవ్రమయిన దాహం వేసినా 2. తీవ్రమయిన ఆకలి వల్ల ప్రాణం పోతుంది అన్నప్పుడు, 3. ఎవరికైనా అపస్మారకం ఏర్పడితే లేక, 4. మరే ఇతర వ్యాధి ఏర్పడితే లేక, 5. వ్యాధి ముదిరితే ఇలాంటి సందర్భాలన్నింటి లోను రోజాను భంగపర్చడం ధర్మసమ్మతం. ఉదాహరణకు (అ) ఎవరికైనా తీవ్రజ్వరం, కడుపులో లేక మూత్రపిండంలో, లేక చెవిలోనో తీవ్రమయిన నొప్పివచ్చి, ఆ వ్యక్తి గనక మందు త్రాగకపోతే ఆ జ్వరంగాని నొప్పిగాని తగ్గదు అని అనుకున్నప్పుడు ఆ వ్యక్తి మందు త్రాగి రోజాను భంగపర్చవచ్చు.

(ఆ) రైతు తీవ్రమయిన ఎండలో దున్నడమో నీరు కట్టడమో చేసినప్పుడు లేక కూలివాడు తననూ తన కుటుంబాన్ని పోషించుకోవడానికి ఎండలో కూలినాలి చేసినప్పుడు

వారికి తీవ్రమయిన దాహం కలిగి రోజాను భంగపర్చకపోతే వారు సొమ్మసిల్లి పడిపోతారు అన్నభయం ఉంటే వారు రోజాను భంగపర్చడం ధర్మసమ్మతం.

అయితే ఎవరయినా కూలివాణ్ణి పెట్టి దున్నించగలిగితే లేక ఎండలో పని చేయకుండానే తన కుటుంబాన్ని పోషించగలడు కాని, అతడు కేవలం ధనం సంపాదించే ఆశలో అలా ఎండలో పనిచేసి ఆ స్థితికి వస్తే ఆ వ్యక్తికి రోజాను భంగపరచే అనుమతి ఉంది. కాని అలా చేసినందుకు మాత్రం పాపాత్ముడు అవుతాడు.

2. ఇదేవిధంగా రోజాను పాటించకుండడానికి పైన చెప్పిన సందర్భాలే కాకుండా, ఆకస్మాత్తుగా మరింకేదయినా అవసరం ఏర్పడితే రోజాను భంగపర్చడం ధర్మసమ్మతమే. ఉదాహరణకు ఎవరైన అకస్మాత్తుగా రోగ గ్రస్తుడవడం, లేక అనుకోకుండా ప్రయాణం ఆసన్నమై ఆ ప్రయాణంలో రోజాను పూర్తి చేయడం అసంభవం కావడం లేక గర్భిణీ స్త్రీ లేక పాలుపట్టే స్త్రీ రోజాను ప్రారంభిస్తే ఆమెకో లేక పిల్లవానికో తీవ్రమయిన బాధ కలగడం, ఇదేవిధంగా ఎవరయినా అపస్మారక స్థితిలోనికి పోవడం లేక ఉన్మాది అవడం లాంటి అన్ని సందర్భాల్లోను రోజాను భంగపర్చడం ధర్మసమ్మతమే. ఈ రోజాకు బదులు కేవలం ఒక ఖజా రోజాను పాటించాలి. కప్ఫారా చెల్లించే అవసరం లేదు.

రోజాను పాటించలేని వృద్ధులు లేక నయమయ్యే ఆశలేని రోగగ్రస్తులుగనుక, రోజా పాటిస్తే ముప్పు వాటిల్లుతుందన్న భయం ఉంటే వారు రోజాకు బదులు 'ఫిదియా' చెల్లించే అనుమతి ఉంది.

## 'ఫిదియా'

ఫిదియా అంటే బదులివ్వడం. ధర్మ శాస్త్రంలో, నమాజు ఖజా అయినా లేక రోజా ఉండే శక్తి లేని సందర్భంలో ఏ దానం అయితే ఇవ్వబడుతుందో అది 'ఫిదియా' అనబడుతుంది.

ఒక్కో రోజాకు బదులు, ఓ నిరుపేదకు 'ఫిత్ర్ సదఖా'లో ఇవ్వబడేంత ధాన్యం ఇవ్వబడుతుంది. అంటే ఒకటిముప్పావు శేర్ల గోధుమలు లేక మూడున్నర శేర్ల 'జౌ' (ఓట్లు) లేక వాటిలో ఏ ఒక్కదాని ధరైనా చెల్లించాలి. అయితే ధర చెల్లించే సందర్భంలో పేదలకు లాభం చేకూరే ధరకట్టే ఇవ్వాలన్నది ఇక్కడ గుర్తుంచు కోవలసిన విషయం. ఒకవేళ ఓట్లు, గోధుమలకు బదులు మరేదైన ధాన్యం ఇస్తే ఆ ఒకటిముప్పావు శేర్ల గోధుమలు లేక మూడున్నర శేర్ల ఓట్ల ధరగలిగినంత ధాన్యాన్నే ఇవ్వాలి.

1. ఫిదియాలో ధాన్యం ఇవ్వకుండా ఓ నిరుపేదకు రెండుపూటల తృప్తిగా భోజనం పెడితే ఫిదియా తీరిపోతుంది. అయితే అతనికి పెట్టే భోజనం స్వయంగా తాను తినే భోజనమై ఉండాలి.

2. ఫిదియా ధాన్యం లేక దాని ధర ఒకరికన్న ఎక్కువ నిరుపేదల్లోను పంపవచ్చు.

ఫిదియా చెల్లించిన తరువాత ఆ వృద్ధునికి రోజా పాటించే శక్తి ఒనగూడినా లేక రోగి తిరిగి ఆరోగ్యవంతుడయిన అతడు వదలిన రోజాలన్నిటి ఖజాను పాటించడం వాజిబ్. అతడు ఏ ఫిదియా అయితే చెల్లించాడో దాని పుణ్యఫలం అతనికి వేరుగా లభిస్తుంది.

వృద్ధాప్యంవల్ల బలహీనులైనవారు, ప్రాణాంతకమైన వ్యాధుల్లో చిక్కుకున్నవారు తమ తమ ఫిదియాలను రమజాన్ మాసంలోనే చెల్లించాలి. శక్తి పుంజుకున్న తరువాత లేక వ్యాధి నయమయిన తరువాత ఖజా పాటిద్దాం అని ఎదురు చూడ్డం తగదు. అలా ఆలోచించడం పాపం. మరణ సమయం ఎప్పుడు ఆసన్నమవుతుందో తెలియదు. ఆ తరువాత వారు ఏమీ చేయలేరు.

## చనిపోయిన వ్యక్తి గురించిన ఆదేశం

రమజాన్ నెలకు సంబంధించి పాటించవలసిన రోజాలు ఏవైనా ఇంకా మిగిలి ఉన్నప్పుడు మరణం సంభవిస్తే అలాంటి సందర్భంలో రెండు మార్గాలున్నాయి. ఒకటి, ఆ వ్యక్తి ఫిదియా చెల్లించమని మరణ శాసనం చేయడం, రెండవది చేయకపోవడం.

1. అతడు చనిపోయేటప్పుడు అలా ఫిదియా చెల్లించమని వసియ్యత్ (మరణ శాసనం) చేస్తే, అతని వారసులు అతని ఆస్తిలో మూడింట ఒకవంతు సొత్తునుండి అతని రోజా లేక నమాజుకు సంబంధించిన ఫిదియా చెల్లించాలి. ఆ తరువాత మిగిలిన మూడింట రెండు వంతుల సొమ్మును తాము పంచుకోవాలి. ప్రతి నమాజుకు ఓ ఫిదియా ఉంది.

ఒకవేళ రోజా లేక నమాజుకు సంబంధించిన ఫిదియా సొమ్ము అతను వదిలిన మూడింట ఒకవంతు సొమ్ముకంటే ఎక్కువైతే అంతసొమ్ము మట్టుకే ఖర్చు చేయాలి. మిగిలిన ఫిదియాలు చెల్లించడం వారసుల బాధ్యత కాదు. అయితే సంతోషంగా వారు దాన్ని చెల్లిస్తే అది వారి ఇష్టం. శవ కఫన్ దఫన్ (ఖననఖర్చు)కు అయ్యే ఖర్చులు మృతుడు ఎవరికైనా అప్పు ఇవ్వవలసి ఉంటే ఆ అప్పులు తీరిన తరువాతే మిగిలిన సొమ్మునుండి ఫిదియా చెల్లించాలి.

2. రెండవది, మరణించిన వ్యక్తి తన మరణానికి ముందు ఎలాంటి వసియ్యత్ (వీలునామా) చేయకపోతే వారసులు ఫిదియాను చెల్లించడం, చెల్లించకపోవడం అనేది వారి ఇష్టం. అయితే ఫిదియాను చెల్లించడమే ఉత్తమం. ఎందుకంటే మరణించినవాడు వదిలివేసిన ఆస్తినుండి ప్రయోజనం పొందుతూ ఉండడంవల్ల ఆ కృతజ్ఞతాభావంతో ఫిదియా చెల్లిస్తే అతడికి పరలోకంలో ప్రయోజనం కలగడమే కాకుండా చెల్లించే వారికి కూడా పుణ్యఫలం లభిస్తుంది. ఇదే కాకుండా మరణించేవాడు వసియ్యత్ చేద్దామనుకున్నా ఆ అవకాశం అతనికి చిక్కలేదేమో. కాని ప్రాజ్ఞతకు రాని (మైనర్) వారసులు, ఫిదియా చెల్లించమని చెప్పినా వారి వాటానుండి ఫిదియా చెల్లించకూడదు.

## నిషిద్ధమైన ఉపవాస దినాలు

ఈ క్రింది దినాల్లో నఫిల్, ఫర్జ్ ఇంకా ఇతర రోజాలను పాటించడం హరాం (నిషిద్ధం).

1. ఈదుల్ ఫిత్ర్ రోజున, 2. ఈదుల్ అజ్హా రోజున, 3. అయ్యామె తష్రీక్, అంటే ఈదుల్ అజ్హారోజే కాకుండా దాని తరువాత వచ్చే పదకొండు, పన్నెండు, పదమూడవ తారీఖులు.

**కొన్ని ముఖ్య సూచనలు:** 1. రోజాను వదిలివేయడం, ఖజా చేయడంలాంటి అనుమతిని, షరీఅత్ మనకిచ్చింది మన భౌతిక బలహీనతలవల్లనే. అయితే ఈ అనుమతిని సాకుగా తీసుకొని లేక వాటిద్వారా ప్రయోజనం పొంది ఎవరైనా రోజా భంగపరిస్తే లేక అసలే రోజాను పాటించకపోతే జనం ఇక్కడ అతణ్ణి దూషించకపోయినా దైవం దృష్టిలో మాత్రం అతడు నీచుడే, శిక్షార్హుడే. ఇక్కడ దైవదాసులు అతని ప్రత్యక్ష నడవడి, ప్రదర్శనను చూసి మోసపోవచ్చు. కాని దైవం మన ఆంతర్యాలను కూడా బాగా ఎరుగు. ఇదేకాకుండా ఖజా రోజాలకు, రమజాన్ నెలలో పాటించే రోజాలకు లభ్యమయ్యే పుణ్యఫలం లభ్యంకాదనే విషయాన్ని గ్రహించాలి. దైవప్రవక్త (సఅసం) గారి ఓ ప్రవచనంలో రమజాను మాసపు ఒక రోజా పుణ్యఫలానికి ఇతర పదకొండు నెలల మొత్తం రోజాల పుణ్యఫలం కూడా సరితూగవు అని ఉంది. (తిర్మిజీ, అబూదాఊద్)

2. ఎవరికైనా రోజాను భంగపర్చడం లేక దాన్ని వదిలేయడం లాంటి అగత్యమే కలిగితే వారు సాధ్యమైనంత వరకు ఆ విషయాన్ని ఇతరులకు తెలియకుండా దాయాలి. ఇతరుల ముందు తినడం త్రాగడం చేయకూడదు. అదే విధంగా రోజాను పాటించే మహిళలకు వండిపెట్టే శ్రమ ఇవ్వకూడదు–అనివార్యమైతే తప్ప. మొత్తానికి రోజాను

గౌరవించడం ఎంతో అవసరం. ఓసారి హ(జత్ ఉమర్ (ర.అన్) రమజాన్ నెలలో అనుకో కుండా సారా త్రాగిన ఓ త్రాగుబోతును శిక్షిస్తూ, "మా పిల్లలు సైతం (రమజాన్) రోజాలను పాటిస్తారు నీవు ప్రాజ్ఞుడై ఉండి కూడా మత్తు పానీయాలను త్రాగుతావా, సిగ్గులేదూ!" అని అన్నారు.

ప్రస్తుత కాలంలో రోజాలను పాటించేవారిని శిక్షించేవాడు ఎవరూ లేకపోయినా, పరలోకంలో పడే శిక్ష ఇహలోక శిక్షకంటే ఎన్నో వేల రెట్లు కఠినమైనదని ముస్లిములు గ్రహించాలి.

3. నమాజు విషయంలో, "పిల్లలు ఏడు సంవత్సరాల వయస్సుకు చేరినప్పటి నుండి వారిని నమాజు చేయమని ఆదేశించండి, పది సంవత్సరాలు నిండితే వారిని కొట్టి చేయించండి" అని దైవప్రవక్త (సఅసం) చెప్పినట్లు ఒక హదీసులో ఉంది. అందువల్ల ఏడేళ్ల వయస్సు కలిగిన పిల్లలకు రోజాను పాటించే అలవాటు వేయాలి. వాళ్ళు పదేళ్ళ వాళ్ళైతే కఠినంగా మందలించి రోజాలను పాటించే అలవాటు వేయాలి. పైన హ(జత్ ఉమర్ (ర.అన్) గారి ప్రవచనం ప్రకారం ఆనాడు అరేబియా దేశంలో తీవ్రమైన ఉష్ణోగ్రత ఉండే నడి ఎండాకాలంలోనూ పిల్లలు సయితం రోజాలు పాటించేవారు అని తెలుస్తోంది.

4. ప్రయాణంలో ఉన్న వ్యక్తి, ప్రయాణ కారణంగా రోజా సంకల్పం చేయలేదు కాని మధ్యాహ్నానికి ముందే అతని ప్రయాణం పూర్తిఅయి పోయి అప్పటివరకు ఏమీ తినక, త్రాగకపోతే అతడు ఆ దినం రోజా సంకల్పంచేసి రోజా పాటించాలి.

5. రుతుస్రావం వల్ల ఒకామె రోజాను వదిలేసింది. అయితే రాత్రిపూట ఆమె రుతుస్రావం ఆగిపోయింది, అలాంటప్పుడు ఆమె వెంటనే రోజా సంకల్పం చేసుకోవాలి. అప్పటి కప్పుడు గుస్ల్ (స్నానం) చేయకపోయినా పగటివేళ స్నానం చేయవచ్చు.

(బెహిస్తీ జేవర్– మూడవభాగం)

## రోజాలో ఇన్జెక్షన్

సాధారణంగా ధర్మవేత్తలు సూదిద్వారా మందు ఎక్కించడం (ఇన్జెక్షన్) వల్ల రోజా భంగపడదు అని అంటారు. షరీఅత్‌లో, కేవలం మలమూత్రద్వారాలు, ముక్కు చెవుల ద్వారా మందు లేక ఆహారం జీర్ణాశయం లేక మెదడు వరకు చేరే విషయమే చెప్పబడింది కాబట్టి, సూది ద్వారా మందు కండరాల్లోనికి ఎక్కించడం లేక నరాల ద్వారా రక్తంలోనికి ఎక్కించడం ద్వారా రోజా భంగపడదంటారు. అయితే నా దృష్టిలో (రచయిత దృష్టిలో) మందుగాని, ఆహారంగాని జీర్ణాశయం లేక మెదడు దాకా చేరడమే ముఖ్యం అయితే, ఈ

రోజుల్లో ఇన్జెక్షన్ల ద్వారానే శరీరానికి పుష్టిని కలిగించే మందులు ఉనికిలోకి వచ్చాయి. కాబట్టి కేవలం కండరాలకిచ్చే సూదులవల్లే (ఇంట్రా మస్క్యులర్) రోజా భంగపడదు. దీనిద్వారా మందు నేరుగా జీర్ణాశయం లేక మెదడు వరకు చేరదు. కాని నరాల సూది (ఇంట్రావీనస్) ద్వారా మందు జీర్ణాశయానికి, మెదడుకు చేరుతుంది. ఈ విషయమై ధర్మవేత్తలు పునఃపరిశీలించవలసి ఉంది. ఇన్జెక్షన్ చేయించుకోవడం వల్ల భంగపడిన రోజాను కేవలం ఖజా మాత్రమే పాటించాలి.

## సుదీర్ఘమైన రేయింబవళ్ళు సంభవించే చోట

ఉషోదయం లగాయత్తు సూర్యాస్తమయం వరకు రోజా సంకల్పంలో తినడం, త్రాగడం, సంభోగంలో పాల్గొనడం మానేయడాన్నే రోజా అంటారని పైన చెప్పడం జరిగింది. సాధారణంగా ప్రపంచం మొత్తంలో తొమ్మిది, పది గంటలు మొదలు పద్నాలుగు గంటల వరకు పగలుంటుంది. ఇదే విధంగా ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు అత్యధిక ఉపవాస సమయం పదిహేనున్నర గంటలు ఉంటుంది. కాని భూగోళం పైన్నే 'లీప్ లాండ్' టండ్రాలాంటి ప్రదేశాల్లో పగటికాలం ఇరవైరెండు, ఇరవై నాల్గు గంటలు లగాయత్తు కొన్ని నెలల వరక్కూడా ఉంటుంది. ఇలాంటి ప్రదేశాల్లో ప్రజలు రోజాలు పాటించాలంటే సాధ్యంకాదు. ఇక్కడివారు ఇఫ్తార్ చేయడం (రోజాను విరమించడం) కంటే వేరే మార్గం కానరాదు.

ధర్మవేత్తలు రోజాను భంగపరిచేందుకు ఏ కారణాలైతే సూచించారో ఉదాహరణకు తీవ్ర ఆకలిదప్పులు, వ్యాధి ముదరడం, పాలుపట్టే స్త్రీ ఇంకా రోజా పాటించలేని వయోవృద్ధులు, రోగులు వగైరాలు, ఆ రోజా బదులు ఫిదియా ఇవ్వచ్చు అనే అనుమతి ఉంది. ఇలాంటి ప్రదేశాల్లో ఉండే వారికి కూడా రోజా ఇఫ్తార్ చేయడం, ఫిదియా చెల్లించడం లాంటి సదుపాయం, అనుమతి కావలసి ఉంది.

దివ్యఖుర్ఆన్‌లో రోజా విషయం చెప్పిన వెంటనే "అల్లాహ్ మీకు సౌలభ్యంగలుగ జెయ్యాలనే అభిలసిస్తున్నాడు. మిమ్మల్ని కష్టపెట్టాలనే తలంపు ఆయనకు లేదు" అని సెలవిచ్చాడు. దైవ ప్రవక్త(సఅసం) ఈ సందర్భంలోనే "ధర్మం సులభమైంది. దాన్ని సులభంగానే ఉంచండి కష్టతరమైందిగా చేయకండి" అని ప్రవచించారు.

## తరావీహ్ నమాజు

రమజాన్ మాసంలో ఇషాలోని ఫర్జు, సున్నత్ నమాజుల తరువాత, విత్ర్ నమాజుకు ముందు చేసే నమాజును షరీఅత్‌లో తరావీహ్ నమాజు అంటారు. తరావీహ్

'తర్వీహా'కు బహువచనం. ఈ పదం 'రాహత్' (తీరిక లేక రిలాక్స్) అనే మూలపదం నుండి వచ్చింది. తరావీహ్‌లో ప్రతినాల్గు రకాఅత్‌ల తరువాత కొంతసేపు హాయిగా కూర్చోడం జరుగుతుంది. కాబట్టి దీన్ని హాయినిపొందే నమాజు అంటారు.

## తరావీహ్ నమాజు ఆదేశం

ప్రాజ్ఞత కలిగివున్న స్త్రీ పురుషులందరూ తరావీహ్ నమాజు చేయడం సున్నతె ముఅక్కిదా. అయితే స్త్రీలు తరావీహ్ నమాజు తమ ఇండ్లలోనే చేసుకోవాలి. పురుషులు మస్జిద్‌లో సామూహికంగా చేయాలి. ఊరు లేక వాడలోని మస్జిద్‌లో ఏ ఒక్కరూ తరావీహ్ నమాజు సామూహికంగా (జమాఅత్‌తో) చేయకపోతే ఆ ఊరు వాడలోని వారంతా దుష్టులతో సమానం. రమజాన్ నెలలో ఎప్పుడైనా ఓ నఫిల్ నమాజ్ చేస్తే దాని పుణ్యఫలం ఇతర నెలల్లో చేసిన ఫర్జు నమాజులకు సమానం. అయితే తరావీహ్ నమాజు గురించి ఎంతో తాకీదు చేయడం జరిగింది. దైవప్రవక్త (సఅసం) స్వయంగా ఈ నమాజు చేశారు దాన్ని చేయమని ప్రజలను ఆదేశించారు. తరావీహ్ నమాజులో దైవ ప్రవక్త (సఅసం) వెనుకచేరే వారిలో మస్జిద్ క్రిక్కిరిసి పోయేది. సహాబా (రఅన్) గార్ల ఇంతటి ఉత్సాహాన్ని చూసి ఈ నమాజు మీపై ఫర్జు చేయబడుతుందేమోనన్న భయం వేస్తుందని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. ఓ రోజైతే ఆయన తరావీహ్ నమాజును చాలాసేపటి వరకు పొడిగించారు. అప్పుడు సహాబా (రఅన్) ఇలానే పొడిగిస్తే సహరీ వేళ దాటిపోదుగదా అని అనుకున్నారు కూడా.

## తరావీహ్ నమాజు వేళ

తరావీహ్ నమాజు వేళ ఇషా నమాజు అయినప్పటినుండి ఉషోదయం వరకు ఉంటుంది.

## తరావీహ్ నమాజులో ఖుర్ఆన్ పారాయణం

తరావీహ్ నమాజులో ఒకసారి మొత్తం ఖుర్ఆన్‌ను ఆసాంతం పారాయణం చేయడం సున్నత్. దైవ ప్రవక్త (సఅసం) రమజాన్ మాసంలో హజ్రత్ జిబ్రీల్ (అలైహి)కు పూర్తి ఖుర్ఆన్‌ను చదివి వినిపించేవారు. ఆయన పరమపదించిన సంవత్సరం రెండుసార్లు పూర్తి ఖుర్ఆన్‌ను చదివి జిబ్రీల్ (అస) దేవదూతకు వినిపించారు. హజ్రత్ ఉమర్ (రజిఅన్) తరావీహ్ జమాఅత్‌ను నిర్వహించడమే కాకుండా ఆ జమాఅత్‌లో పూర్తి ఖుర్ఆన్‌ను వినిపించే జాగ్రత్త తీసుకునేవారు.

**ముఖ్యాంశాలు:** 1. తరావీహ్‌లో ఖుర్ఆన్ వినిపించడానికి, దివ్యఖుర్ఆన్ పారాయణంలో పాటించవలసిన మర్యాదలను జాగ్రత్తలను అవలంబించాలి. అనవసరంగా, పారాయణ మర్యాదలు పాటించకుండా హద్దునుదాటి ఖుర్ఆన్ పఠిస్తే ఖుర్ఆన్ ఎడల అమర్యాద పాటించినట్లయితే పాపం అంటవచ్చు.

2. నమాజీలకు కష్టం లేకుండా వారికి అర్థమయ్యే రీతిలో ఖుర్ఆన్‌ను తరావీహ్‌లో ఎంతైనా పఠించవచ్చు. అయితే నమాజు చేసేవారికి అది కష్టం అనిపిస్తే, లేక జమాఅత్ భంగపడుతుందని భయం ఉంటే నమాజీలు ఐచ్ఛికంగా వినగలిగినంతే పఠించాలి. నమాజీలకోసం ఫర్జే సులభతరం చేయబడినప్పుడు ఇది కేవలం సున్నత్ నమాజే కదా! అల్లామా షామీ రద్దుల్ ముహ్తార్ పేజీ 339లో ఇలా రాశారు. "మన కాలంలో ప్రజలకు కష్టం కానంతమటుకే తరావీహ్‌లో ఖుర్ఆన్ పఠించాలి" (రద్దుల్ ముహ్తార్).

(ఈ మాట నేటికి నూటాయాభై సంవత్సరాల క్రితం రాయబడింది. ఇప్పటి కాలం ఆ కాలంకంటే ఎంతో చెడ్డకాలం.)

ఒకవేళ తరావీహ్ నమాజులో పూర్తి ఖుర్ఆన్‌నే పఠించదలిస్తే ఏదో ఒక సూరా ప్రారంభంలో 'బిస్మిల్లాహి ర్రహ్మానిర్రహీం' బిగ్గరగా వినబడేటట్లు చదవాలి. కొందరు ఖుర్ఆన్ పూర్తి అయ్యేటప్పుడు "ఖుల్‌హువల్లాహుఅహద్" సూరాను మూడుమార్లు పఠిస్తారు. ఇలా పఠించడం సరిఅయింది కాదు. సరికదా దీన్ని తప్పకుండా చదవాలి అని అనుకుంటే అది మక్రూహ్ కూడాను. (సూరాను, రిపీట్ చేయడం అనేది మక్రూహ్ కాదు కాని నేటి కాలంలో ప్రజలు అలా చదవడాన్ని విధిగా తలుస్తున్నారు. అందుకే అలా చదవడం మక్రూహ్ అయింది.) (బెహిష్తీగౌహర్)

## తరావీహ్ నమాజు రకాతులు

దైవప్రవక్త (సఅసం) మూడు రోజులమట్టుకే తరావీహ్ నమాజును జమాఅత్‌తో చేశారు. మొదటిరోజు క్లుప్తంగానే చేశారు. రెండోరోజు అంతకంటే కొంత దీర్ఘంగా (నిడివైన) చేశారు. మూడో రోజు ఆయన ఈ నమాజును చాలా సేపటి వరకు పొడిగించారు. అప్పుడు సహాబా (రఅన్)ఇలా పొడిగిస్తే సహరీవేళ కూడా దాటి పోతుందేమో అని భయపడ్డారు. నాల్గోరోజు దైవప్రవక్త (సఅసం) తన హుజ్రా నుండి బయటకు రాకుండా "ఈ నమాజు కోసం మీ ఉత్సాహం చూస్తూ ఉంటే ఇది మీపై ఫర్జు (విధి) చేయబడుతుందేమోనని భయమేస్తోంది" అని అన్నారు. ఈ మూడు రోజుల్లో ఆయన ఎన్ని రకాఅత్‌ల నమాజు చేశారో వాటి సంఖ్య గురించి సహాబీల (ర.అన్) అంచనా వేరు వేరుగా

ఉంది. కాని హ(జత్ ఉమర్ (రఅన్) తన ఖిలాఫత్ కాలంలో మస్జిద్ నబవీలో ఇరవై రకాత్‌ల నమాజు చేయడం, చేయించడం జరిగింది. సహబీ (ర.అన్) కూడా ఈ నమాజులో పాల్గొన్నారు. ఎవరూ హ(జత్ ఉమర్ (ర.అన్)గారి ఈ అభి(ప్రాయంలో విభేదించలేదు. ఈ కారణంచేతనే ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై), ఇమామ్ షాఫాయీ (రహ్మాలై), ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై) దాఊద్ జాహిరా (రహ్మాలై) ఇరవై రకాత్‌లనే ఒప్పుకున్నారు. దీన్నే తక్కిన వారు ఆచరించారు. ఇక ఇమామ్ మాలిక్ (రహ్మాలై) గురించి ఎన్నో ఉల్లేఖనాలు ఉన్నాయి. వాటిలో ఒక ఉల్లేఖనం ఇరవై రకాఅత్‌లకు సంబంధించింది కూడా ఉంది. అయితే అత్యధిక ఉల్లేఖనాలు ముప్పైఆరు రకాఅత్‌లవే. కొందరు ధర్మవేత్తలు అంతకంటే అధికం కూడా రాశారు. కొందరు సహాబీలు విత్ర్ నమాజు కాకుండా 8 లేక 10 రకాఅత్‌లు చదివినట్లు దాఖలాలూ ఉన్నాయి. మనదేశానికి చెందిన అహ్లె హదీసు వర్గంవారు దీన్నే అనుసరిస్తున్నారు. కాని వీరు ఇరవై లేక అంతకంటే ఎక్కువ రకాత్‌లు నమాజు చేసేవారిని సున్నత్‌కు వ్యతిరేకమనడం, వారితో పోట్లాడ్డం సమంజసం కాదు. ఎందుకంటే ముస్లిముల ఏకాభి(ప్రాయం (ఇజ్మా) ఇరవై లేక అంతకంటే ఎక్కువ రకాత్‌లే కాబట్టి ముస్లిం సమాజంలోని అధిక భాగం దీన్నే ఒప్పుకుంటుంది కాబట్టి నేటికీ మక్కా-మదీనాల్లో ఇరవై రకాఅత్‌ల నమాజే చేయబడుతోంది.

## తరావీహ్‌లో డబ్బిచ్చి ఖుర్ఆన్ పఠింపజేయడం

సాధారణంగా (ప్రజలు ఏదో కొంత ముట్టజెప్పి 'హాఫిజ్' ద్వారా తరావీహ్‌లో ఖుర్ఆన్ పారాయణం చేయించడం పరిపాటి అయింది. ఈ కారణంగా హాఫిజ్‌లు డబ్బు ఎక్కువగా లభిస్తుందన్న ఆశతో ఇల్లూ, ఊరు వదిలి సుదూర (ప్రదేశాలకు వెళుతుంటారు. కాని, తరావీహ్ నమాజులో డబ్బిచ్చి ఖుర్ఆన్ పారాయణం చేయించడం ధర్మసమ్మతం కాదని ధర్మవేత్తలు రాశారు. (క్రీ.శ. ముఫ్తి కిఫాయతుల్లాహ్, హాఫిజ్‌ను ఉప ఇమామ్‌గా ఖరారు చేసుకొని వచ్చే డబ్బును ఇమామత్‌కు ఇచ్చే వేతనంగా భావించవచ్చు అని అంటారు. కాని మౌలానా థాన్వీ (రహ్మాలై) ఈ సాకును సరైంది అని అనుకోరు. ఆయన ఇలా రాస్తున్నారు.

"దైవానికి దాసునికి మధ్య జరిగే ఒప్పందాల్లో ఇలాంటి సాకులు వెతకడం ధర్మసమ్మతం కాదు". (ఇమ్‌దాదుల్ ఫతావా సంపుటం 1, పేజీ 485)

ధర్మవేత్తలు, ధార్మికతీర్పులు ఇచ్చేవారి దృష్టిలో ఖుర్ఆన్‌ను ఉపాధిగా చేసుకోవడాన్ని నిరసిస్తున్న ఖుర్ఆన్ ఆయత్‌లు, హదీసులు ఉన్నందున ఇలా (ప్రతిఫలం ఆశించి ఖుర్ఆన్‌ను పఠించడాన్ని ధర్మవేత్తలు ఖండిస్తున్నారు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై)

లాంటివారు ఆరాధనలు, అనుసరణలపై డబ్బు తీసుకోవడం నాజాయెజ్ (ధర్మసమ్మతం కాదు) అని అంటారు. ఎందుకంటే ఆరాధనలుగాని, అనుసరణలుగాని పుణ్య ఫలాపేక్షవల్ల చేసేవే. డబ్బు సంపాదించడానికి కాదు.

కాని ఆ తరువాత వచ్చిన ధర్మవేత్తలు, ధర్మ విద్యకు ఇమామత్ కోసం డబ్బు తీసుకోవడం అనివార్యమైతే అలా చేయడం ధర్మసమ్మతం అని అంటారు. ఎందుకంటే దాని అనుమతి అసలే లేకపోతే ధర్మవిద్య కుంటుపడి నమాజ్ వగైరాలు సరిగా నెరవేర్చబడవు. ఇవి ధర్మంలో విధిగా పాటించవలసిన విధులు. వాటిని నెరవేర్చడం ప్రతి ముస్లింపై ఫర్జ్ (విధి) చేయబడింది.

తరావీహ్‌లో పూర్తి ఖుర్‌ఆన్ పఠించడం లేక వినడం సున్నత్. 'అలంతర' అనే సూరా పఠించి లేక కొంత ఖుర్‌ఆన్‌ను పఠించైనా ఈ సున్నత్‌ను నెరవేర్చవచ్చు. కాబట్టి దానికి డబ్బివ్వడం లేక తీసుకోవడం రెండూ ధర్మసమ్మతం కావు. అల్లామా షామీ 'ఈసాలె సువాబ్' (మరణించిన వారికి పుణ్యాన్ని అందజేయడానికి) డబ్బు తీసుకుని ఖుర్‌ఆన్ పారాయణం చేయడం కూడా తరావీహ్‌లో ఖుర్‌ఆన్ పఠించి డబ్బు తీసుకోవడం లాంటిదేనని అభిప్రాయపడ్డారు. ఎలాగైతే అది ధర్మసమ్మతం కాదో ఇది కూడా ధర్మసమ్మతం కాదని ఆయన అంటారు. ఆయన ఇలా రాశారు:

"మొత్తానికి, మనకాలంలో, ఖుర్‌ఆన్ పఠించి డబ్బు తీసుకునే సంప్రదాయం ఏర్పడిన విషయం గురించి చెప్పాలంటే, ఖుర్‌ఆన్ అధ్యాయాలను పఠించి డబ్బు తీసుకోవడం ధర్మసమ్మతం కాదని అంటారు. ఎందుకంటే ఇందులో పారాయణం చేసేవానికే పుణ్యఫలం, మన్నింపులు ఉన్నాయి. ఇక్కడ పారాయణం కేవలం డబ్బుకోసమే చేయడం జరుగుతోంది. పారాయణం చేసేవాని చిత్తమే సరి అయినది కాకపోతే దానికి పుణ్యఫలం ఎలా ఉంటుంది. ఆ పుణ్యఫలం డబ్బిచ్చే వానికి ఎలా ముడుతుంది? వాస్తవం ఏమిటంటే డబ్బు లేకుండా ఈ కాలంలో ఎవరూ ఎవరి కోసమూ పారాయణం చేయరు. వారు ఖుర్‌ఆన్‌ను ఉపాధిగా, ప్రపంచాన్ని సంపాదించే ఓ సాధనంగా చేసుకున్నారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్" (రద్దుల్ ముహ్‌తార్ సంపుటం 5, పేజీ 53)

తరావీహ్ నమాజులో ప్రతి నాలుగు రకాత్‌ల తరువాత కొంతసేపు కూర్చుని విశ్రాంతి తీసుకోవడం ఉత్తమం. దీన్నే 'తరావీహ్' అని అంటారు. ఈ విరామ సమయంలో నమాజీలు జిక్ర్, తస్బీహ్ వగైరాలు చదవవచ్చు. లేక నిశ్శబ్దంగా కూర్చోవచ్చు లేక నఫిల్ నమాజులైనా చేయవచ్చు. అది వారి ఇష్టంపై ఆధారపడి ఉంది.

## విత్ర్ నమాజ్

జమాఅత్‌తో తరావీహ్ నమాజు చేసే వారు విత్ర్ నమాజు కూడా జమాఅత్‌తో చేస్తే మంచిది.

ఎవరైనా ఇషా నమాజు జమాఅత్‌తో (సామూహికంగ) చేయలేకపోయినట్లయితే వారు ముందుగా ఫర్జు నమాజు చేయాలి. ఆ తరువాత సున్నత్ నమాజుచేసే తరావీహ్‌లో కలవాలి. తప్పిపోయిన తరావీహ్ నమాజును నాలుగు రకాతుల తరువాత లభించే విరామసమయంలో చేసుకుపోవాలి.

కొందరు ఇషా నమాజ్‌లోని ఫర్జును వేరుచేసి వితర్ నమాజుకోసం జమాఅత్‌చేస్తే అది ధర్మసమ్మతం కాదు. ఎందుకంటే ఫర్జు నమాజే జమాఅత్‌తో చేయనప్పుడు సున్నత్ నమాజుకు ఫర్జు నమాజుకంటే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడం సరికాదు.

మూడు రాత్రులలోపు కాలంలో ఖుర్‌ఆన్‌ను పూర్తిగా పఠించవచ్చు కాని ఈ రోజుల్లో పాటిస్తున్న 'షబీనాలు' (రాత్రిపూట పూర్తి ఖుర్‌ఆన్‌ను పఠించడం) నిజానికి ఖుర్‌ఆన్ ఎడల పరిహాసమాడినట్లున్నాయి. అందుకని ఈ వైఖరికి దూరంగా ఉండాలి.

సాధారణంగా ఏ మస్జిద్‌లోనైనా, పది పదిహేనురోజుల్లో ఖుర్‌ఆన్ పారాయణం పూర్తి అయిపోతే ఆ తరువాత ప్రజలు తరావీహ్ నమాజు చేయడంలో బద్ధకిస్తూ ఉంటారు. అలా జరగకూడదు. తరావీహ్‌లో పూర్తి ఖుర్‌ఆన్‌ను వినడమే సున్నత్‌కాదు. పూర్తి మాసంలో తరావీహ్ నమాజ్ చేయడం కూడా సున్నతె, ఆ తరావీహ్‌లో పూర్తి ఖుర్‌ఆన్ పఠించినా పఠించకపోయినాసరే.

## చివరి దశకం (అష్‌రా)

రమజాన్ పూర్తిమాసం శుభ మాసమే. కాని దాని చివరి పది రోజులు ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. దైవప్రవక్త (సఅసం) దీనికి ఎంతో ప్రాముఖ్యత ఉంది అని ప్రవచించారు.

كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَجْتَهِدُ فِي الْعَشْرِ الْاَوَاخِرِ مَا لَا يَجْتَهِدُ فِي غَيْرِهٖ- (مسلم)

హజ్రత్ ఆయిషా (రజిఅన్)గారి ఉల్లేఖనం ఇలా ఉంది. "దైవప్రవక్త (సఅసం) రమజాన్ నెల చివరి పది దినాల్లో ప్రార్థనలు చేయడానికి ఎంత శ్రమపడే

**వారో, అంత శ్రమ మరే రోజుల్లో పడేవారు కాదు." (ముస్లిమ్)**

హజ్రత్ ఆయిషా (రజిఅన్)గారి మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది.

**"రమజాన్ నెల చివరి దశకం ప్రారంభం కాగానే దైవప్రవక్త (సఅసం) దాని కోసం సమాయత్తమయ్యేవారు. రాత్రంతా జాగరణ చేస్తూ, ఇంటి వారిని కూడా మేలుకొలిపేవారు (బుఖారి, ముస్లిమ్)**

كَانَ رَسُوْلُ اللّٰهِ إِذَا دَخَلَ الْعَشْرُ شَدَّ مِئْزَرَهٗ وَأَحْيٰى لَيْلَهٗ وَأَيْقَظَ أَهْلَهٗ (بخاری ومسلم)

ఈ దశకంలో, రెండు ముఖ్యమైన పనులు చేయాల్సి ఉంది. ఒకటి ఏతెకాఫ్ పాటించడం. రెండోది 'లైలతుల్ ఖద్ర్'ను (మహారాత్రిని) వెదకడం. ఇక్కడ రెండు కార్యాలకు సంబంధించిన వివరణ ఇవ్వబడుతోంది.

## ఏతెకాఫ్

ఏతెకాఫ్ అంటే నివసించటం, లేక ఏదో ఓ చోట తనను తాను మరుగుపరుచుకోవడం. షరీఅత్ పరిభాషలో, రమజాన్ మాసంలోని చివరి దశకంలోనో లేక ఇతర దినాల్లోనో, ప్రాపంచిక పన్నుల్ని వదిలేసి, భార్యాపిల్లలతో ఎలాంటి సంబంధం పెట్టుకోకుండా మస్జిద్‌లోనే లేక ఇంట్లో నమాజు చేసే స్థలంలోనో ఉండిపోవడాన్నే ఏతెకాఫ్ అంటారు. (దర్రెముఖ్తార్ సంపుటం 2, పేజీ 179)

ఏతెకాఫ్ ప్రస్తావన దివ్యఖుర్ఆన్‌లోనూ ఉంది. హదీసు గ్రంథాల్లో దీని ఔన్నత్యాన్ని గురించి ఎంతో చెప్పబడింది. దైవప్రవక్త (సఅసం) రమజాన్ నెల చివరి పదిరోజుల్లో మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటించేవారు. ఆయనతో పాటు సహాబా (రజిఅన్) కూడా ఏతెకాఫ్ పాటించేవారు. దైవప్రవక్త (సఅసం) ఏతెకాఫ్‌కు ఎంతో ప్రాముఖ్యతను ఇచ్చేవారు. ఏ కారణంగానైనా ఏతెకాఫ్ వదిలివేస్తే ఆయన దాన్ని ఈద్‌మాసంలో (షవ్వాల్ మాసం)లో నెరవేర్చేవారు. ఈనాడు దైవప్రవక్త (సఅసం) పాటించిన ఈ సంప్రదాయం వదిలేయబడుతోంది. దీన్ని తిరిగి పునరుజ్జీవింపచేసే అవసరం ఎంతైనా ఉంది. ఏ ఊరులేక వాడలోనయితే ఏ ఒక్క వ్యక్తి కూడా ఏతెకాఫ్ పాటించని పక్షంలో ఆ ఊరి లేక వాడ వారంతా పాపాత్ములు అయిపోతారు. ఇది సున్నతె ముఅక్కిదా కిఫాయా.

ఏతెకాఫ్‌లోని గొప్ప ప్రయోజనం ఏమిటంటే మనిషి ప్రాపించిక వ్యాపకాలకు వేరై, కోరికలు కామవాంఛలకు దూరమై కొన్ని రోజుల వరకు ఎడతెగకుండా దైవారాధనలో, దైవస్మరణలో మునిగిపోతే దైవంతో అతని సంబంధం దృఢమవుతుంది. అతని హృదయంలో దైవం ఎడల ప్రేమ, ఓ విధమైన తేజస్సు జనిస్తాయి. ఇలా కొంతకాలం వరకు అనవసర పనుల్లో అనవసర విషయాల్లో తలదూర్చకుండా దైవస్మరణే పనిగా పెట్టుకోవడం వల్ల పూర్తి జీవితంలో చెడులనుండి దూరంగా ఉండాలని, తన మనస్సును నియంత్రించు కోవాలని, ఎల్లప్పుడు దైవం గురించే ఆలోచించాలనే భావం అతని మనస్సులో కలుగు తుంది.

రమజాన్ ఇరవైయో తారీఖునాడు అస్ర్ నమాజు చేసి ఏతెకాఫ్‌లో కూర్చోవాలి. ఈద్ నెలవంక కనబడగానే ఈతికాఫ్ విరమించాలి.

## స్త్రీల మోతకఫ్ (ఏతెకాఫ్ చేసే ప్రదేశం)

పైన చెప్పిందంతా పురుషులకు సంబంధించిన విషయం. స్త్రీలు మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటించడం మక్రూహ్ తహ్రీమీ వారికోసం ఏతెకాఫ్‌కు మైలేన ప్రదేశం వారు ప్రతిరోజు అయిదుపూటలా నమాజు చేసే ప్రదేశమే. నమాజు కోసం ఓ ప్రత్యేకమైన స్థలం ఏదీ లేకపోతే ఇంట్లో పరిశుభ్రమైన ఏ ప్రదేశంలోనైనా ఏతెకాఫ్ పాటించవచ్చు.

## ఏతెకాఫ్ రకాలు

ఏతెకాఫ్ మూడు రకాలు. 1. ముస్తహిబ్, 2. సున్నత్, 3. వాజిబ్

ముస్తహిబ్ ఏతెకాఫ్‌ను ఎప్పుడైనా ఏ రోజుల్లోనైనా పాటించవచ్చు.

'సున్నతె ముఅక్కిదా కిఫాయా' రమజాన్ నెల చివరి ధశకంలో పాటించబడే ఏతెకాఫ్.

'వాజిబ్ ఏతెకాఫ్ నజ్ర్ (మ్రొక్కుబడి కింద) పాటించే ఏతెకాఫ్?

## ఏతెకాఫ్ షరతులు

ఏతెకాఫ్ పాటించడం మూడు షరతులకు లోబడి ఉంటుంది.

1. పురుషులు మస్జిద్‌లోను, స్త్రీలు వారి ఇండ్లలోను పదిరోజులపాటు పాటించడం.

2. ఏతెకాఫ్ సంకల్పం చేయడం. ఏతెకాఫ్ నియ్యత్ (సంకల్పం) లేకుండా ఎవరైనా మస్జిద్‌లో పదిరోజులు ఉండిపోతే అతని ఏతెకాఫ్ నెరవేరదు. ఇమామ్ అబూహనీఫా

(రహ్మాలై) నియ్యత్ చేయడం అనేది ఏతెకాఫ్ షరతుల్లో ఒకటి అని అంటారు. ఇతర ఇమామ్‌లు దాన్ని షరతుల క్రిందికి జమకట్టరు.

3. హదసె అక్బర్ అంటే జనాబత్, రుతుస్రావం, ప్రసూతి స్రావాలు లేకుండా ఉండడం.

రమజాన్ మాసం కాకుండా వేరే మాసాల్లో నఫిల్ ఏతెకాఫ్‌లు పాటించే అనుమతి కూడా ఉంది. ఈ ఏతెకాఫ్‌లో రోజా పాటించే అవసరమూ లేదు. అయితే ఇక్కడ చెప్పే ఏతెకాఫ్ మాత్రం మస్నూన్ ప్రవక్త సంప్రదాయమైన ఏతెకాఫ్. కాబట్టి రోజా పాటించడం అవసరం. ఇదేవిధంగా వాజిబ్ ఏతెకాఫ్‌అయితే అందులోనూ రోజా పాటించాలి. ఉదాహరణకు ఎవరైనా ఏతెకాఫ్ పాటిస్తాను అని దైవాన్ని మ్రొక్కుకుంటే దాన్ని వాజిబ్ ఏతెకాఫ్ అని అంటారు. ఏతెకాఫ్‌లో పురుషుడు ఏ కారణంగానైనా రోజా భంగం చేయవలసి వస్తే అంతటితో అతని ఏతెకాఫ్ కూడా భంగం అయినట్లే. అదే విధంగా ఏ స్త్రీకైనా ఏతెకాఫ్ కాలంలో రుతుస్రావం జరిగితే ఆమె ఏతెకాఫ్ కూడా భంగం అయిపోతుంది.

## ఏతెకాఫ్‌లో నిషిద్ధమైన విషయాలు

రెండు రకాల పనులు ఎతెకాఫ్‌లో నిషిద్ధం (హరాం). మొదటి రకం 1. ఎలాంటి అవసరం లేకుండా ఎతెకాఫ్ స్థానం నుండి బయటికి వెళ్ళటం హరాం. పురుషులకోసం పూర్తి మస్జిదే ఎతెకాఫ్ స్థానం. స్త్రీలకు వారు ఎతెకాఫ్‌లో కూర్చున్న తమ ఇంటిలోని ప్రత్యేక ప్రదేశం. ఏ అవసరాలకైతే మనిషి బయటకు వెళ్ళవచ్చో అవి రెండు రకాలు. 1. మనిషి నిత్యకృత్యాలు. మలమూత్ర విసర్జన, గుసుల్ వాజిబ్ అయినప్పుడు, అలాగే భౌతిక అవసరాలైన ఆకలి, దాహాలను తీర్చుకొనుటకు వగైరాలు. రెండవది ధార్మిక అవసరాలను తీర్చుకొనడం ఉదాహరణకు జుమా నమాజు కోసం జామా మస్జిద్‌కు వెళ్ళటం, జనాజా నమాజు చేయంచేవారు లేకపోతే జనాజా నమాజు చేయించటానికి వెళ్ళటం వగైరాలు. అయితే ఈ అవసరాలకు సంబంధించి కొన్ని ముఖ్య విషయాలు గుర్తుంచుకోవాలి.

1. మస్జిద్‌లో మూత్రశాల లేక, లెట్రిన్ ఉంటే వాటిద్వారా తన అవసరాలు తీర్చుకోవాలి. కాని మస్జిద్‌లో లేక మస్జిద్ దరిదాపుల్లో మల, మూత్ర విసర్జన శాలలు లేకపోయినట్లయితే, అతని ఇల్లు కూడా దగ్గరిలో లేకపోతే తనకు దగ్గరగా ఉన్న ప్రదేశానికి వెళ్ళాలి. అయితే దగ్గరగా ఉన్న మల మూత్ర విసర్జనశాలల్లో సరి అయిన మరుగు లేక మరేవైనా

అడ్డంకులు ఎదురైతే అలాంటప్పుడు దూరంగా ఉన్న తన ఇంటిగ్గాని, మరే దూరప్రదేశాని కైనా వెళ్ళవచ్చు.

2. గుసుల్ చేయటానికి అతడు మస్జిద్ నుండి బయటకు ఎప్పుడు వెళ్ళవచ్చంటే ఆ గుస్ల్ 'షరయీ గుస్ల్' అయి ఉండాలి. అంటే అతడికి స్వప్న స్ఖలనం వగైరా జరిగితే అతడు మస్జిద్ నుండి బయటికెళ్ళి గుస్ల్ చెయ్యవచ్చు. కాని, కేవలం శరీర శుభ్రతకోసం స్నానం చెయ్యడానికి బయటికి వెళ్ళటం ధర్మసమ్మతం కాదు.

3. జుమా నమాజు కోసం జామామస్జిద్‌కు వెళ్ళే అవసరం ఏర్పడితే అతడు సున్నత్ నమాజ్ చేసే వెళ్ళాలి. ప్రసంగం, నమాజు పూర్తి అయిన వెంటనే తిరిగి వచ్చెయ్యాలి. మిగిలిన సున్నత్ నమాజులు తన స్థానంలోనే చెయ్యాలి. ఒకవేళ సున్నత్ నమాజులు అక్కడే చేసినా ఫరవాలేదు.

4. అన్నపానీయాలు తెచ్చేవారు లేకపోయినా అతడు మస్జిద్ నుండి ఇంటికి వెళ్ళి భోజనం చేసిరావచ్చు. అలాగే బావి నుండి నీళ్ళు తోడుకోనూవచ్చు.

5. మస్జిద్‌లోపల ఉజూ నీళ్ళ సదుపాయం లేకున్నా అక్కడ అతనికి నీళ్ళు అందించే వారూ లేకపోయినా ఉజూ నీళ్ళ కోసం మస్జిద్‌నుండి బయటికి వెళ్ళవచ్చు.

6. ఏదైనా అవసరం కోసం మస్జిద్‌నుండి బయటికెళ్తే ఆ అవసరం నెరవేరిన తరువాత ఒక నిమిషం కూడా బయట గడపకూడదు. ఎవరితోనూ అనవసరంగా మాట్లాడకుండా వెంటనే వెనక్కి తిరిగి వచ్చెయ్యాలి.

7. వుజూ చేసేటప్పుడు పూర్తి శరీరం మస్జిద్ నుండి బయటికి రాకుండా వుజూ నీరు మస్జిద్‌లో పడకుండా జాగ్రత్తపడాలి. ఇలాంటి వీలులేకపోతే మస్జిద్ నుండి బయటికి వచ్చి వుజూ కోసం కేటాయించబడిన ప్రదేశంలో కూర్చొని వుజూ చేయవచ్చు.

8. మరచిపోయికూడా "ముతకిఫ్"ను అంటే మస్జిద్‌ను కొంచెం సేపటి కోసమైనా వదిలేయకూడదు. దీనివల్ల 'ఎతెకాఫ్' భంగం పడుతుంది.

మస్జిద్ నుండి బయటికి వెళ్ళటమంటే ఏ ప్రదేశంలోనైతే సాధారణంగా నమాజు చెయ్యబడుతుందో ఆ భాగమంతా మస్జిద్‌కిందే లెఖ్ఖ. మరెక్కడైతే నమాజులు చెయ్యబడవో సరికదా అవి ఇతర పనులకోసం, ఉదా॥ మలమూత్ర విసర్జన శాలలు, బాత్‌రూంలు (స్నానాల గదులు) వుజూ చేసే స్థలం, లేక వుజూ కోసం కూర్చొనే దిమ్మె లేక చెప్పులు వదిలే స్థలం ఇవన్నీ మస్జిద్‌భాగం కిందికి రావు. ఈ ప్రదేశాల్లో అనవసరంగా వెళ్ళటం మస్జిద్ నుండి బయటికి వెళ్లటం అనబడుతుంది. దీనివల్ల ఎతెకాఫ్ భంగపడుతుంది.

**రెండవ రకం:** రెండవరకపు పనులు ఏవైతే ఎతెకాఫ్ పరిస్థితుల్లో హరాం లేక, మక్రూహ్ తహ్రీమీ అయిఉన్నాయో అవి ఇలా ఉన్నాయి:

1. సంభోగించటం అది ఉద్దేశపూర్వకంగానో, లేక మరచిపోయే ఎలాగైనా సరే, మస్జిద్‌లోపల అయినా లేక బయట అయినా, అన్ని పరిస్థితుల్లోనూ ఇవి ఎతెకాఫ్‌ను భంగపరుస్తాయి.

2. స్త్రీని ముద్దాడటం, ఆలింగనం చేసుకోవటం. ఈ పనుల వల్ల ఎతెకాఫ్ భంగపడదు కాని అలా చేయటం ధర్మసమ్మతం కాదు అది మక్రూహె తహ్రీమి కిందికి వస్తుంది.

3. ఎతెకాఫ్ స్థితిలో ప్రపంచ పనుల్లో లీనమవ్వటం కూడా మక్రూహె తహ్రీమీయే. అయితే ఇంట్లో ఇతరులు ఎవ్వరూ గృహ అవసరాలను పూర్తిచేసేవారు లేకపోతే వాటిని అవసరం మేరకు చేసుకోవచ్చు.

4. ఇది కూడా ఆరాధన అనుకొని ఎతెకాఫ్‌లో మౌనంగా కూర్చోవటం కూడా మక్రూహె తహ్రీమి. అంటే అతడు ఏదైనా ధార్మిక కార్యం చేస్తూ ఉండాలి. ఉదా॥ దివ్య ఖుర్‌ఆన్ పారాయణం, నఫిల్ నమాజులు చేయటం, జిక్ర్ చేయటం లేక, ఏదైనా ధార్మిక గ్రంథం లేక వ్యాసము వ్రాయటంలో లీనమవ్వాలి.

## లైలతుల్ ఖద్ర్

రమజాన్ చివరి దశకంలో చేయవలసిన మరో పని లైలతుల్ ఖద్ర్ అన్వేషణ. చివరి దశకంలో అయిదు బేసి రాత్రులు వస్తాయి. వాటిలో ఒకటి ఎంతో శుభకరమైన, ఘనమైన రాత్రి. దాన్నే ఖుర్‌ఆన్, హదీసుల్లో 'లైలతుల్ ఖద్ర్' అని చెప్పటం జరిగింది. దాని శుభాన్ని, గొప్పతన్నాన్ని వర్ణిస్తూ దివ్య ఖుర్‌ఆన్‌లో ఓ సూరాయే అవతరించింది. హదీసుల్లోనూ దీని గొప్పతనాన్ని చెప్పటం జరిగింది.

అరబీ భాషలో లైలతుల్ ఖద్ర్ అంటే మహోన్నతమైన ఘనమయిన మహారాత్రి అని అర్థం. లైల్ అంటే రాత్రి అని, ఖద్ర్ అంటే అంచనావేయటం, నియమించటం, గౌరవించటం అని అర్థం. ఈ రాత్రిని లైలతుల్ ఖద్ర్ అని అనటానికి కారణం సంవత్సరం మొత్తంలో ఏదైతే జరగవలసి ఉందో దాని పూర్తి రేఖా చిత్రము ఆ రాత్రే తయారవుతుందన్నమాట. మానవుల ఉపాధి నిర్ణయం, జీవన్మర్ణాల నిర్ణయం, మనుషుల కర్మల

గురించిన నిర్ణయం జరిగిపోతాయి. ఎవరైతే ఆ రాత్రి దైవసన్నిధిని ఆరాధనలో నిమగ్నమై ఉంటాడో అతడు దైవం దృష్టిలో గౌరవనీయుడవుతాడు. దైవ దూతలు అతనికోసం దుఆ చేస్తారు. దైవ గ్రంథంలో ఈ రాత్రి వెయ్యి రాత్రులకంటే శ్రేష్ఠమయిన రాత్రి అని చెప్పబడింది.

إِنَّا أَنزَلْنَاهُ فِي لَيْلَةِ الْقَدْرِ ۝ وَمَا أَدْرَاكَ مَا لَيْلَةُ الْقَدْرِ ۝ لَيْلَةُ الْقَدْرِ خَيْرٌ مِّنْ أَلْفِ شَهْرٍ ۝ تَنَزَّلُ الْمَلَائِكَةُ وَالرُّوحُ فِيهَا بِإِذْنِ رَبِّهِم مِّن كُلِّ أَمْرٍ ۝ سَلَامٌ هِيَ حَتَّىٰ مَطْلَعِ الْفَجْرِ ۝

"ఇన్నా అన్ జల్ నాహు ఫీలైలతిల్ ఖద్ర్ వమాఅద్రాక మాలైలతుల్ ఖద్ర్. లైలతుల్ ఖద్రిఖైరుమ్మిన్ అల్ ఫిషహ్ర్. తన జ్జలుల్ మలాయికతు వర్రూహు ఫీహా బిఇజ్నిరబ్బిహిం మిన్ కుల్లి అమ్రిన్ సలాముున్ హియహత్తా మత్లయిల్ఫజ్ర్".

అర్థం: మేము దీని (ఖుర్ఆన్)ని ఘనమైన రాత్రియందు అవతరింపజేశాము. ఆ ఘనమైన రాత్రి ఏమిటో మీకు తెలుసా? ఆ ఘనమైన రాత్రి వేయి నెలలకంటే కూడా ఎంతో శ్రేష్ఠమయినది. ఆ రాత్రిని ఆత్మ, దైవదూతలు తమ ప్రభువు అనుమతితో ప్రతి ఆజ్ఞను తీసుకొని అవతరిస్తారు. ఆ రాత్రి అంతా తెల్లవారే వరకు పూర్తిగా శాంతి శ్రేయాలే అవతరిస్తూ ఉంటాయి.

ఈ సూరా ద్వారా ఈ క్రింది కొన్ని విషయాలు తెలుస్తున్నాయి.

1. ఈ రాత్రినుండే ఖుర్ఆన్ అవతరణ ప్రారంభమయింది, 2. ఈ రాత్రి వెయ్యి రాత్రుల కంటే శ్రేష్ఠమయినరాత్రి, 3. ఈ రాత్రిలో దైవ దూతలు దైవాదేశాలు తీసుకొని అవతరిస్తారు, 4. ఇది సంపూర్ణంగా శాంతి, శుభాల రాత్రి, 5. ఉషోదయానికి అంతమవుతుంది.

హదీసులో దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

تَحَرَّوْا لَيْلَةَ الْقَدْرِ فِي الْوِتْرِ مِنَ الْعَشْرِ الْأَوَاخِرِ ۔ (بخاری و مسلم)

"ఈ ఖద్ర్ రాత్రిని రమజాను నెల చివరి పది రోజులలోని బేసి రాత్రులలో అన్వేషించండి".

(బుఖారి, ముస్లిం)

దీని ద్వారా అర్థమయ్యేదేమిటంటే ఈ శుభప్రదమైన రాత్రి రమజాను నెల 21,23,25,27,29 తేదీలలో ఏదోఒక రాత్రిన సంభవిస్తుంది."

ఈ రాత్రిన వహీ దైవ దూత హజ్రత్ జిబ్రీల్ (అలైహిస్సలాం) దేవదూతల ఓ బృందాన్ని తీసుకొని భూమిపైకి దిగివస్తారు. ఈ రాత్రి ఏ దైవదాసుడయితే నిలబడి, లేక కూర్చొని దేవుని ఆరాధనలో లీనమై ఉంటాడో అతనికోసం ఆయన దుఆ చేస్తారు అని హదీసులో ఉంది.

ఓసారి దైవప్రవక్త (సఅసం) రమజాన్ నెల ప్రారంభం కావడానికి రెండు మూడు రోజుల ముందు ఇలా సెలవిచ్చారు.

"రమజాన్ మాసము మన సమీపంలోకి వచ్చేసింది. ఇందులో ఓ రాత్రి వెయ్యి నెలలకంటే శ్రేష్ఠమయిన రాత్రి ఉంది. ఎవరైతే ఈ రాత్రిని పోగొట్టుకుంటాడో (దైవారాధనలో గడపకుండా వృథాచేస్తాడో) అతడు దాని శుభాలన్నింటినీ పోగొట్టు కున్నట్లే.

దైవం ఈ భాగ్యాన్ని ఎవరికైతే ప్రసాదిస్తాడో అతడు ఈ రాత్రిని తప్పకుండా అన్వేషించి ఆరాధనలో లీనమవ్వాలి.

## లైలతుల్ ఖద్ర్‌ను గుర్తించటం

దీన్ని దేవుడు బహిరంగపరచనూ లేదు. దీన్ని గుర్తించే సూచనా చూపలేదు. ఎందుకంటే తనదాసులు దీని అన్వేషణపట్ల ఆసక్తి కలిగి వీలైనంత ఎక్కువగా దైవారాధనలో గడపాలని, అందులోనే లీనమవ్వాలని ఆయన కోరుతున్నాడు. దీని గుర్తింపు దాసుని శ్రద్ధాసక్తులపై ఆధారపడిఉంది. ఎరికైనా దైవం ఈ రాత్రిని ప్రసాదిస్తే అతడు ఆ రాత్రే లైలతుల్ ఖద్ర్ అని అనుకుంటే నఫిల్ నమాజ్ చెయ్యటం మాత్రమే కాకుండా అతడు ఈ దుఆను కూడా అధికంగా పఠిస్తూ ఉండాలి. హదీసులో ఈ దుఆ ఇలా ఉంది.

"అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వ ఫఅఫు అన్నీ"

اَللّٰهُمَّ إِنَّكَ عَفُوٌّ تُحِبُّ الْعَفْوَ فَاعْفُ عَنِّي ۔ (مشکوۃ)

**అర్థం :** ఓ అల్లాహ్ నువ్వే పూర్తిగా క్షమించేవాడివి. క్షమించటం అంటే నీకు ఎంతో ఇష్టం. కనుక నన్ను క్షమించు (మిష్కాత్)

ఎవరైతే ఎతెకాఫ్ చేస్తుంటారో వారికి తెలిసినా తెలియకపోయినా ఈ వరాన్ని తప్పక పొందుతారు. దైవం ఈ అవకాశాన్ని ప్రతి మోమిన్‌కూ ప్రసాదించుగాక!

## నఫిల్ రోజాలు

ఫర్జ్ రోజాలే కాకుండా దైవ ప్రవక్త (సఅసం) నఫిల్ రోజాలను కూడా ఎక్కువగా పాటించేవారు. ఈ నఫిల్ రోజాలకు సంబంధించిన వివరాలు ఇక్కడ వ్రాయబడు తున్నాయి. దైవం ఎవరికైతే ఈ భాగ్యం ప్రసాదిస్తాడో వారు ఈ దినాల్లో తప్పకుండా రోజాలను పాటించాలి.

1. ముహర్రం నెల పదవతేదీనాడు రోజా పాటించటంవల్ల ఎంతో పుణ్యం లభిస్తుం దని హదీసులో ఉంది. రోజా ఫర్జ్ కాక పూర్వం ఈ రోజు దైవప్రవక్త (సఅసం) ఆయన సహాబీలు (రజిఅన్) ప్రతి యేడూ క్రమం తప్పకుండా ఈ రోజాను పాటించేవారు.

కొందరు అజ్ఞాన ముస్లిములు ఈ రోజుకు చెందిన శుభాలను హజ్రత్ హుసైన్ (రజిఅన్)గారి షహాదత్ (అమరగతి) వల్ల వచ్చింది అని అనుకుంటారు. ఇలా అనుకో వడం పెద్ద పొరపాటు. ఈ రోజు ప్రాముఖ్యత గురించి దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. ఆయనకు పూర్వం ఇతర దైవప్రవక్తలు కూడా దీని ఔన్నత్యాన్ని తెలిపారు. అయితే హజ్రత్ హుసైన్ (రజిఅన్) అమరగతినొందినది దైవప్రవక్త (సఅసం) పరమపదించిన యాభై సంవత్సరాల తరువాత. మొహర్రం పదోతేదీ రోజు ఔన్నత్యానికి హజ్రత్ ఇమామ్ హుసైన్ (రజి) అమరగతి సంఘటనకు ఎలాంటి సబంధమూ లేదు.

దైవప్రవక్త (సఅసం) ఏ రోజు అయితే ప్రాముఖ్యతను, ఔన్నత్యాన్ని తెలుపలేదో ఆ రోజును మనం గొప్పదిగా అనుకోవటం పాపం. దీనికి దూరంగా ఉండాలి. ఇస్లాం మార్గంలో ఎందరైతే అమరగతినొందారో వారి అమరగతి ఎంతో ప్రాముఖ్యం గలది. దైవం వద్ద వారికి గొప్ప ప్రతిఫలం ఉంది.

అంతేకాని, ఒకరి అమరగతి కారణంగా ఓ ప్రత్యేకరోజున శోకించటం, అనేది షరీఅత్‌లో విలువలేని విషయం. సరికదా ఇది నిషిద్ధం కూడా! ఉదా॥ దైవ ప్రవక్త (సఅసం) గారి ప్రియమైన పినతండ్రి హజ్రత్ హమ్‌జా (రజిఅన్)గారి షహాదత్, హజ్రత్ ఉమర్ (రజిఅన్) గారి షహాదత్, హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్)గారి షహాదత్, హజ్రత్ అలీ (రజిఅన్) గారి షహాదత్, హజ్రత్ హుసైన్ (రజిఅన్) గారి షహాదత్, హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజిఅన్)గారి షహాదత్‌లాంటి వాటికి ఇస్లామీయ చరిత్రలో ఎంతో ప్రాముఖ్యం ఉంది. అందులో సందేహంలేదు. కాని, ఈ తారీకుల్ని ఉన్నతమైనవని, పవిత్రమైనవని, శుభమైనవని అనుకోవటం శుద్ధతప్పు.

ఈ కారణంగానే హదీసుల్లో ప్రత్యేకంగా జుమారోజున్నే రోజాలు పాటించటం నిషేధించబడింది. అలా నిషేధించకపోతే ప్రజల మనస్సుల్లో ఆ రోజు హద్దులేని ప్రాముఖ్యత బలంగా నాటుకుపోయే ప్రమాదం ఉంటుంది. ఆ రోజుకున్న ప్రాముఖ్యత దానికి తప్పకుండా ఉంది. కాని దాని ప్రేమలో పడి ప్రజలు హద్దులు మీరి పోవచ్చని ఆ రోజు ఉపవాసం పాటించకూడదని దాన్ని నిషేధించటం జరిగింది.

2. ఇస్లామీయ మాసపు 13,14,15 తేదీల్లో రోజాలు పాటించటం పుణ్యప్రదమని హదీసులో ఉంది. ఈ తారీకుల్లో దైవ ప్రవక్త (సఅసం) ఎప్పుడోగాని రోజాలు వదిలేసేవారు కాదు. చివరికి ఆయన ప్రయాణంలో ఫర్జ్ రోజాలను వదిలేసే అనుమతి ఉన్నప్పటికీ ఈ నఫిల్ రోజాలను మాత్రం తప్పకుండా పాటించేవారు. ఈ రోజాల షరీఅత్ పరిభాషలో "అయ్యామెబైజ్" రోజాలు అనబడతాయి.

3. జిల్‌హజ్జా నెల తొమ్మిదో తారీకు, అంటే ఈదుల్ అజ్‌హాకు ఒకరోజు ముందు, అర్ఫా రోజున రోజా పాటించటం కూడా పుణ్యప్రదమే.

4. అదే విధంగా షాబాన్ నెల పదిహేనవ తేదీనాడు, షవ్వాల్ నెలలో ఆరు రోజులు రోజాలను పాటించటం కూడా ప్రవక్త సంప్రదాయమే. షాబాన్ నెల 15వ తారీఖునాడు పగలు రోజా పాటించటం రాత్రి ఆరాధన చెయ్యటం, ఖబరస్తాన్ (ఖననవాటిక)కు వెళ్ళి మగ్ఫిరత్ (పాప క్షమాపణ) దుఆ చెయ్యటం గురించి కూడా హదీసులో ప్రస్తావన ఉంది.

కాని సాధారణంగా ఆ రోజు షబేబరాత్ పేర పండుగ చేసుకోవటం, బాణాసంచా కాల్చటం లాంటి ధర్మ వ్యతిరేక కార్యాలు ముస్లిముల్లో వ్యాపించాయి. ఇవి తప్పుడు ఆచారాలు. ఇవి ఘోర పాపానికి దారి తీస్తాయి. కనుక వీటికి దూరంగా ఉండాలి. పండుగలు చేసుకొనే రోజులు ఇస్లాంలో కేవలం రెండే రెండు. ఒకటి ఈదుల్ ఫిత్ర్. రెండవది, ఈదుల్ అజ్‌హా అని ఇదివరకే చెప్పటం జరిగింది.

## నఫిల్ రోజాలకు సంబంధించి కొన్ని ముఖ్య సూచనలు

1. ఒకవేళ ఎవరైనా నఫిల్ రోజా పాటించేటప్పుడు అతనింటికి ఓ అతిథి వచ్చినా లేక అతడే మరెవరింటికైనా అతిథిగా వెళ్ళినా ఓ విషయం గుర్తుంచుకోవాలి. అదేమిటంటే వచ్చిన అతిథితో భోజనం చేయకపోతే నొచ్చుకుంటాడేమో అని అనుకున్నప్పుడు లేదా ఎవరైనా మిమ్మల్ని భోజనానికి పిలిచినప్పుడు వెళ్ళమంటే అతనికి కోపం వస్తుంది అన్న ఆలోచన ఉన్నప్పుడు, నఫిల్ రోజాను భంగపరచి ఆ తరువాత దాని ఖజా పాటించాలి.

2. ఎవరైనా రాత్రికే నఫిల్ రోజా పాటిస్తానని సంకల్పం చేసి ఆ సంకల్పం ఉషోదయానికి ముందే మారిపోతే దానికి ఖజా పాటించనవసరం లేదు. కాని ఉషోదయం అయిపోయిన తరువాతవరకు ఆ సంకల్పంతో ఉండి తరువాత దాన్ని మార్చుకుంటే మాత్రం దానికి ఖజా పాటించాల్సిందే.

## స్త్రీల విషయం

స్త్రీలు తమ భర్త అనుమతి లేనిదే నఫిల్ రోజాలు పాటించకూడదు. వారు (భర్త) ఇంటిపట్టున లేనప్పుడు రోజా పాటించడంలో తప్పులేదు.

## రమజాన్ సదఖా (దానం)

రమజాన్ మాసంలో నఫిల్ ఆరాధనల పుణ్యఫలం ఫర్జు ఆరాధనలకు సమానంగా లభించినట్లే ఈ మాసంలో దానధర్మాలు చేస్తే వాటి పుణ్యఫలం కూడా అధికంగానే ఉంటుంది. హజ్రత్ ఆయిషా (ర.అన్) దైవ ప్రవక్త (సఅసం) విషయమై చెబుతూ "ఆయన ప్రతి కాలంలోను పేదలకు సహాయం చేసేవారు, దాన ధర్మాలు చేసేవారు, అయితే ప్రత్యేకంగా రమజాన్ మాసంలో దానధర్మాలు చేసే భావన ఆయనలో మరింత అధిక మయ్యేది" అని అన్నారు.

దైవప్రవక్త (సఅసం), రమజాన్ మాసాన్ని "షహరుల్ మువాసాత్" (ఇతరుల ఎడల జాలి, కరుణతో ప్రవర్తించే మాసం) అని ప్రవచించారు. ఆయన గురించి ఖుకారి, ముస్లిమ్ హదీసు గ్రంథాల్లో "ఆయన ఎంతో గొప్పదాత, రమజాన్ నెలలో ఆయన దాతృత్వం మరింత పెరిగిపోయేది" అని ఉంది.

అంటే ఈ మాసంలో ఓ ముస్లిమ్‌లో పొడసూపవలసిన విశేషం ఏమిటంటే అతడు తన పేద సోదరుల ఎడల జాలిగుండెతో ప్రవర్తించాలి. వారికి ఎంత సహాయం చేయగలిగితే అంత చేయాలి. అయితే సాధారణ దానధర్మాలు కనికరించడాలే కాకుండా, దైవ ప్రవక్త (సఅసం) ప్రతి ముస్లిమ్‌పై మరో సదఖాను తప్పనిసరైనదిగా చేశారు. దాన్నే షరీఅత్ పరిభాషలో 'సదఖాయె ఫిత్ర్' (ఫిత్రాదానం) అని అంటారు. అంటే రోజాలు పూర్తి చేసినందుకు దైవానికి కృతజ్ఞతగా చేసే సదఖా అన్నమాట.

## ఫిత్రా దానం ప్రాముఖ్యత ప్రయోజనాలు

ఓ ముస్లిమ్ రమజాన్ రోజాలను పూర్తి చేసినప్పుడు అతని మనస్సులో ఓ విధమైన ఆనందం, దైవం ఎడల కృతజ్ఞతాభావం కలుగుతుంది. అల్లాహ్ అనుగ్రహంవల్ల తాను

పూర్తి నెలరోజులపాటు ఉపవాసాలు ఉండగలిగానన్న కారణం వల్లనే ఈ భావన. ఇతర మతాలకు చెందిన వారు తమ సంతోషాన్ని, ఆనందాన్ని ప్రదర్శించడానికి రకరకాలైన మార్గాల్ని ఎంచుకుంటారు. కాని ఇస్లామ్ ఆనందం, విచారాల సందర్భాలు ఎలా గడపాలో సూచించింది.

కాబట్టి రోజాలు పూర్తవగానే ఆ ఆనందాన్ని కృతజ్ఞతలను తెలిపేందుకు ఎలాంటి సాంస్కృతిక కార్యక్రమాన్నిగాని ఎలాంటి ఆటపాటల్నిగాని మరే రకమయిన మేళతాళాలను ఉపయోగించిగాని జరిపే అనుమతి ఇస్లాం ఇవ్వలేదు. పైగా ఆ రోజు ఫిత్రాదానం ద్వారా పేదసాదలకు సహాయం చేయమని, దైవారాధనలో ఎక్కువగా పాల్గొనమని ఓ పరిమితికి లోబడి, తాను తిని ఇతరులకు పెట్టి ఆనందించమని ఆదేశించింది. పిల్లలు మాత్రం ఆటలాడి తమ ఆనందాన్ని ప్రకటిస్తారు.

రమజాన్ మాసాంతాన వచ్చే ఈ పండుగను ఈదుల్ ఫిత్ర్ అని అంటారు. అంటే రోజాను పూర్తి చేసిన ఆనందదాయకమైన రోజు అన్నమాట. ఫిత్రాదానంవల్ల కేవలం నిరుపేదలకు ప్రయోజనం కలగడం, రోజాలు పూర్తైన సంతోషంలో పండుగ చేసుకోవడమే కాదు, దీని ద్వారా ఒనగూడే మరో గొప్ప ప్రయోజనం కూడా ఉంది అది ఏమిటంటే మనిషివల్ల జరిగిన చిన్నపాటి తప్పులకు ఈ పిత్రా దానం ప్రాయశ్చిత్తంగా మారుతుంది.

ప్రముఖ సహాబీలు (ప్రవక్త అనుచరులు) హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రఅన్), హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రఅన్) ఇలా అంటారు:

فَرَضَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ زَكٰوةَ الْفِطْرِ طُهْرَ الصِّيَامِ مِنَ اللَّغْوِ وَالرَّفَثِ وَطُعْمَةً لِّلْمَسَاكِيْنِ۔ (مشكوٰة)

**"దైవ ప్రవక్త (సఅసం) ఫిత్రా దానాన్ని ఎందుకు విధించారంటే దీనివల్ల రోజాలలో పొరపాటున జరిగిన తప్పులనుండి, (మనసులో రేకెత్తే) చెడు ఆలోచనల నుండి రోజాలు పరిశుద్ధం అవుతాయి. దీని ద్వారా పేదలకు సహాయం అంది వారి పొట్ట గడుస్తుంది."**

దైవప్రవక్త (స) ఫిత్రా దానాన్ని వాజిబ్ చేశారన్న విషయం ఈ హదీసు ద్వారా మనకు తెలుస్తోంది.

## ఫిత్రా ఆదేశం

1. సద్ఖయె ఫిత్ర్ ప్రతి ముస్లిమ్‌పై వాజిబ్ చేయబడింది. వారు స్త్రీ అయినా,

పురుషుడు అయినా ఎవరి వద్దనయితే 1. అయిదుంబావు తులాల బంగారం 2. ముప్పైఆరు తులాల వెండి 3. వాటి ఆభరణాలు 4. ఈ వెండి బంగారాలకు సమానమైన డబ్బు అవసరానికి మించి ఉన్నా లేక పైన చెప్పిన వెండి, బంగారాలకు సరిపడ విలువగల వస్త్రాలు, పాత్రలు, ఫర్నీచరు ఇతర గృహోపకరణాలు అవసరానికి మించిఉన్నా లేక 6. ఇంతే విలువగల సరకు షాపులో ఉన్నా లేక 7. ఇంట్లో సంవత్సరానికి సరిపడే ధ్యానం పోగా అంతే విలువైన ధ్యానం మిగిలి ఉన్నా అతనిపై సదఖయె ఫిత్ర్ వాజిబ్ అవుతుంది. ఇదే విధంగా ఒకరి వద్ద వెండి బంగారాలు, డబ్బు, వ్యాపార సామగ్రి అయితే లేదుగాని రెండు గృహాలున్నాయి. ఒక దానిలో తానుంటూ రెండవది ఖాళీగానో లేక అద్దెపైన్నో నడుస్తూ ఉంటే అతనిపై కూడా ఫిత్రా దానం వాజిబ్ అవుతుంది. అయితే ఆ ఇంటి అద్దె అతని జీవనోపాధి అయితే మాత్రం అతనిపై ఫిత్రా దానం వాజిబ్ కాదు.

2.ఎవరివద్దనైనా దాదాపు నాలుగువేల రూపాయలు నగదు, ఆభరణాలు, గృహోపకరణాలు అయితే ఉన్నాయిగాని అతడు రుణగ్రస్తుడు. వాటిన్నిటిని కలిపి అప్పు తీరగా పైన చెప్పిన వెండీ, బంగారాలకు సరిపడ విలువగల డబ్బుగాని, సామానుగాని మిగిలిఉంటే అతనిపై కూడా ఫిత్రాదానం వాజిబ్ అవుతుంది.

## ఎవరెవరి తరపున ఫిత్రా దానం చెల్లించడం వాజిబ్

ఏ వ్యక్తి పైన్నేతే ఫిత్రా దానం చెల్లించడం వాజిబ్ అయిఉందో, అతడు తన ఫిత్రాను మాత్రమే దానం చేయడం ఒక్కటే వాజిబ్‌కాదు, యుక్తవయస్సుకు రాని తన సంతానం తరపున కూడా ఫిత్రా దానాన్ని చెల్లించడం వాజిబ్ (విధి). తల్లి తన పిల్లల తరపున ఫిత్రాను చెల్లించనవసరం లేదు. అయితే భార్య వద్ద పైన చెప్పిన పరిమితికి సమానమైన డబ్బుగాని, ఆభరణాలుగాని ఉన్నట్లయితే ఆమె తన ఫిత్రాను సొంతంగా చెల్లించాలి. భర్తపై ఆ బాధ్యత లేదు. అయితే ఆమె తరపున ఫిత్రా ఇస్తే అతనికిది పుణ్యాన్ని ఆర్జించి పెడుతుంది.

ఎవరైనా ఏదైనా కారణంవల్ల రోజాలు పాటించలేకపోతే అతనిపై కూడా సదఖాయె ఫిత్ర్ చెల్లించడం వాజిబ్.

ఈ ఫిత్రా దానం చెల్లించాల్సిన సమయం, పండుగ రోజున నమాజుకు పూర్వమే. అయితే పండుగకు రెండు మూడు రోజుల ముందే ఈ దానాన్ని తీసి అగత్యపరులకు చెల్లిస్తే వారు కూడా తమ అవసరాలను తీర్చుకుని పండుగ చేసుకోవచ్చు. పండుగనాడు వారి ఇంట తినేందుకు తాగేందుకు ఏమీ లోటు లేకుండా ఉంటుంది. హదీసు ప్రకారం దైవ

ప్రవక్త (సఅసం) ప్రజలందరిని పండుగకు రెండు రోజుల ముందే సమావేశపరిచి సదఖాయె ఫిత్ర్ తీసి చెల్లించాలని తాకీదు చేసేవారు.

ఎవరైనా ఒకటి రెండు రోజుల పూర్వమే చెల్లించలేకపోతే ఈద్ నమాజుకు ముందు తప్పకుండా చెల్లించి నమాజుకు వెళ్ళాలి. ఒకవేళ నమాజుకు పూర్వం దాన్ని చెల్లించలేకపోతే ఫిత్రా దానం అయితే తీసి ప్రక్కన పెట్టాడు కాని అప్పుడు ఎవరికి చెల్లించలేకపోతే నమాజుకాగానే దాన్ని దాని హక్కుదారులకు అందజేయాలి.

ఎవరైనా పొరపాటున లేక ఏదైనా అనివార్య కారణాల వల్ల పండుగకు ముందు గాని, పండుగ నాడుగాని ఫిత్రా దానం చెల్లించలేకపోతే అది మాఫీకాదు. దానిని తరువాతైనా అతడు చెల్లించాల్సిందే.

## ఫిత్రా దానంలో వేటిని ఇవ్వవచ్చు?

ఫిత్రా దానంలో అన్ని రకాల ధాన్యం, గోధుమలు, ఓట్లు, శనగలు, వడ్లు, సజ్జలు, నగదు డబ్బు ఇవ్వడం ధర్మసమ్మతమే. కూరగాయ ల్లాంటివి సదఖా దానంలో ఇవ్వడానికి వీలులేదు.

## సదఖాయె ఫిత్ర్ పరిమాణం (గోధుమలు, ఓట్లు)

ఫిత్రా దానంలో ఎవరైనా గోధుమలుగాని, గోధుమ పిండిగాని ఇస్తే అతడు ఎనభై తులాల శేరులో ఒకటి ముప్పావు శేర్లు (1 3/4 శేర్లు) గోధుమలుగాని, గోధుమ పిండిగాని ఇవ్వాలి. ఒకవేళ ఓట్లు (బార్లి) ఇస్తే ఎనభై తులాల శేరులో దానికి రెట్టింపు అంటే మూడున్నర శేర్లు ఓట్లు గాని దాని పిండిగాని ఇవ్వాలి. 1 3/4 శేర్లు అంటే నేటి తూకం ప్రకారం 1.750 కిలోలు అవుతుంది. 2. గోధుమలు, ఓట్లేగాకుండా ఇంకేధాన్యాలైతే ఉన్నాయో ఉదాహరణకు శనగలు, బియ్యం, ఒడ్లు, సజ్జలు, జొన్నలు, బటాణీలు, కందులు, పెసలు వగైరా వీటంతటికి 1 3/4 శేర్ల (కిలోల) గోధుమలుగాని 3 1/2 శేర్ల (కిలోల) ఓట్ల ధరకు సమానమైన ధర ఇవ్వాలి.

ఈ కాలంలో, సదఖాయె ఫిత్ర్ (ఫిత్రాదానం)లో ధాన్యానికి బదులు రెండు కిలోల ఓట్ల ధర ఎంతవుతుందో అంత ఇవ్వడం మేలైన పద్ధతి. రైతులు మాత్రం ఏది సులువో దాన్నే అవలంబించాలి.

ధర కట్టడంలో, పేదలకు లాభదాయకమైన ధర ఏ ధాన్యంలో ఉంటుందో (గోధమలు లేక ఓట్లు) అదే ధర చెల్లించాలి, ఉదాహరణకు గోధుమల ధర ఎక్కువగాను

తక్కువ గాను ఉండవచ్చు. ధాన్యాన్ని బట్టి దేని ధర అధికమో ఆ ధరను చెల్లించడమే సబబు.

ఒక ఫిత్రాను ఒకరికైనా లేక ఎక్కువమందికైనా ఇవ్వవచ్చు. అనేకమంది వ్యక్తుల ఫిత్రా ఒక వ్యక్తికి ఇచ్చినా ధర్మసమ్మతమే. ఒక మనిషికి ఇచ్చే ఫిత్రా దానంతో అతడు తన చిన్నపాటి అవసరాలను తీర్చుకోగలగాలి రెండు మూడు పూటలు భార్యా పిల్లలతో తృప్తిగా భుజించేటట్లు ఉండాలి.

ఎవరైతే ఫిత్రా చెల్లించడానికి అర్హులుకారో వారందరికి ఫిత్రా దానాన్ని ఇవ్వవచ్చు. అలాగే ఎవరికైతే జకాత్ చెల్లించడం ధర్మసమ్మతమో వారికే చెల్లించాలి. జకాత్ గురించిన వివరణ ముందు రాబోతుంది.

## ముస్లిమేతరులు

జకాత్‌లో ఫిత్రా దానంలో తేడా ఉంది. జకాత్ ముస్లిమేతరులకు ఇవ్వబడదు. ఫిత్రాదానం ముస్లిమేతరులకు కూడా ఇవ్వవచ్చు.

ఫిత్రా దానానికి ఎక్కువ అర్హత గలవారు పేద బంధువులే. ఆ తరువాత స్నేహితులు, ఆ పిదప పొరుగువాళ్ళు. వాళ్ళు ముస్లిములైనా, ముస్లిమేతరులైనా కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోవాలి. సాధ్యమైనంతమట్టుకు ఫిత్రా దానాన్ని ఇతరులకు తెలియకుండా ఇవ్వాలి. ఇచ్చిన వారికి మాటి మాటికి ఇచ్చానని చెప్పి వారి మనస్సును నొప్పించకూడదు. అంతేకాదు మీ ముఖ కవళికల్తో, వారు పేదవారు, మీరు వారికి సహాయం చేస్తున్నారన్న భావాన్ని కూడా వ్యక్తం చేయకూడదు. మనం చెల్లించే సదఖా ఫిత్ర్‌తో ఏ ఒక్కరినీ ఉద్ధరించలేము.

మనం మన విధిని నిర్వర్తించాం, అంతే. దీనికి ప్రతిఫలం మనకు దైవంవద్ద లభిస్తుంది. ఇలా డెప్పి పొడిచి దానం చేయడమంటే దాన ప్రతిఫలాన్ని చేజేతులా నాశనం చేసుకోవడమే. దానం చేసి డెప్పి పొడవడాన్ని ఖుర్‌ఆన్ కఠినంగా వారించింది.

"పేదవానికి సహాయం చేసేటప్పుడు మీ కుడి చేయి ఏమి ఖర్చుపెట్టిందో (మీ ఎడమ చేతికి) తెలియకూడదు"ని ఒక హదీసులో ఉంది.

# జకాత్

నమాజు, రోజాల్లా జకాత్ కూడా ముస్లిములపై ఫర్జుగా (విధి) విధించడం జరిగింది. కాబట్టి ఈ రెంటి తరువాతనే జకాత్ గురించి చెప్పుకుంటారు. సాధారణంగా హదీసు, ఫికహ్ గ్రంథాల్లో జకాత్ ప్రస్తావన నమాజు ప్రస్తావన తరువాతే వస్తుంది. అయితే ఇక్కడ మాత్రం దీనికి సంబంధించిన వివరణ రోజా వివరణ తరువాతే చెబుతున్నాం.

నమాజ్, రోజా, జకాత్ – ఈ మూడు ఆరాధనలు ఫర్జు ఆరాధనలు. ఇదే కాకుండా ఆ మూటి ప్రాధాన్యతల్లోగాని, ఆరాధనా విషయంలోగాని, ఫర్జు స్థాయిలోగాని ఎలాంటి తేడా లేదు. కొన్ని విషయాల్లో మాత్రం వీటిలో కొంత తేడా ఉన్నమాట వాస్తవం.

1. మొదటి తేడా ఏమిటంటే నమాజు రోజాలు శారీరకమైన ఆరాధనలు. జకాత్ మాత్రం ఆర్థిక సంబంధమై ఆరాధన. అంటే నమాజు రోజాలో నెరవేర్చే పనులు మనిషి తన శరీర అవయవాల కదలికతో నెరవేరుస్తాడు. కాని జకాత్ అలాకాదు. అది అతని డబ్బుకు సంబంధించిన ఆరాధన. అంటే మనిషి తన దగ్గర ఉన్న సొమ్ములోని ఓ నియమిత భాగాన్ని అల్లాహ్ మార్గంలో ఖర్చు బెట్టినప్పుడే ఈ ఆరాధన నెరవేరుతుందన్న మాట.

2. రెండో తేడా ఏమిటంటే, నమాజ్, రోజాలు ప్రతి ముస్లిమ్‌పై విధించబడ్డ ఫర్జులు- అతడు ధనవంతుడైనా, పేదవాడైనా అతనింట తిండికి ఉన్నా లేకున్నా, అతడు బంగళాలో నివసించినా, పూరిగుడిసెలో నివసించినా సరే. జకాత్ మాత్రం భుక్తికి సంబంధించిన బాదరబందీలు లేని వారిపై, తమ దైనందిన జీవన అవసరాలకుపోగా కొంత డబ్బు మిగిలి ఉండే వారిపై మాత్రమే ఫర్జు.

3. మూడో తేడా ఏమిటంటే, నమాజు, రోజాలు కేవలం దైవం హక్కులు. జకాత్ దైవం హక్కుకు తోడు దైవదాసుల హక్కుకూడా. అంటే నమాజు రోజాల ద్వారా మనిషి తాను దైవదాసుడైనందున తనపై ఏర్పడిన హక్కును నెరవేరుస్తాడు.

నమాజు, రోజాల ద్వారా ఇతర దైవదాసులకు ఎలాంటి ప్రయోజనం లభించదు. ఏదైనా ప్రయోజనంగనక లభిస్తే అది నమాజుచేసే వానికి శారీరకంగా, ఆధ్యాత్మికంగా లభించే ప్రయోజనం. కాని జకాత్ ఫర్జు అయ్యేది మాత్రం, దైవ దాసుడు తన సొమ్మును దైవంచే ఒసగబడిన ఓ అమానతు (ట్రస్టు) అని అనుకుంటాడు. ఆ అమానతును ఎక్కడ ఖర్చు పెట్టమని దైవం ఆదేశిస్తే దాన్ని అక్కడ ఖర్చుబెడతాడు. అయితే అతడు ఏదైతే ఖర్చుబెడతాడో అది దైవదాసులపైన్నే ఖర్చు పెడతాడు. ఈ విధంగా అది దైవదాసుల హక్కు

కూడా అయింది. ఇక ఎవరైనా జకాత్ ఇవ్వకపోతే ఓ వైపు అతడు దైవహక్కుని కొల్లగొట్టినవాడు, దైవం తన దగ్గర దాచిన అమానతును కాజేసినవాడు అవుతాడు. మరోవైపు అతడు ఎందరో దైవదాసుల హక్కుల్ని కాజేసినవాడూ అవుతాడు.

## ఇస్లామ్‌లో జకాత్ ప్రాధాన్యత

శారీరక ఆరాధనల్లో, నమాజు రోజాల గురించి ఖుర్ఆన్, హదీసు గ్రంథాల్లో ఏ విధంగానయితే తాకీదు వచ్చిందో ఆర్థిక ఆరాధనల్లో జకాత్ గురించి కూడా గట్టిగా తాకీదు చేయడం జరిగింది. ఖుర్ఆన్‌లో అనేకచోట్ల ఈ విషయం గురించి "నమాజును స్థాపించండి, జకాత్‌నివ్వండి" అని ప్రస్తావించడం జరిగింది.

దివ్యఖుర్ఆన్‌లో ఎవరయితే దైవమార్గంలో తమ సొమ్మును ఖర్చుబెడతారో వారి ఉపమానం ఓ ధాన్యపు గింజలాటింది, ఆ గింజనుండి ఏడు వెన్నులు (పుట్టి) ప్రతి వెన్నులో వందేసి గింజలు ఉంటాయి అని చెప్పడం జరిగింది అంటే జకాత్‌పై పెట్టే ఖర్చులో ఒక్కో పైసాకు ఏడేసి వందల పుణ్యఫలాలు లభిస్తాయి అన్నమాట.

مَثَلُ الَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ فِيْ سَبِيْلِ اللّٰهِ كَمَثَلِ حَبَّةٍ اَنْۢبَتَتْ سَبْعَ سَنَابِلَ فِيْ كُلِّ سُنْۢبُلَةٍ مِّائَةُ حَبَّةٍ ۝ (بقرہ)

"ఎవరు తమ సంపదను అల్లాహ్ మార్గంలో ఖర్చుచేస్తారో, వారి ఖర్చు ఉపమానం ఇలా ఉంటుంది: ఒక్క విత్తనాన్ని నాటితే, అది మొలిచి ఏడు వెన్నుల్ని యీనుతుంది: ప్రతి వెన్నుకు నూరేసి గింజలు ఉంటాయి".

(బకరా-261)

اَلَّذِيْنَ يَكْنِزُوْنَ الذَّهَبَ وَالْفِضَّةَ وَلَا يُنْفِقُوْنَهَا فِيْ سَبِيْلِ اللّٰهِ فَبَشِّرْهُمْ بِعَذَابٍ اَلِيْمٍ ۝ (سورۃ توبہ)

"ఎవరయితే బంగారాన్ని, వెండిని నిలువచేసి వాటిని దైవ మార్గంలో ఖర్చు పెట్టరో వారికి వ్యధాభరితమైన శిక్షకు సంబంధించిన శుభవార్తను అందజేయండి." (తౌబా - 34)

దైవప్రవక్త (సఅసం) గారు జకాత్‌దానం చెల్లించమని గట్టిగా తాకీదు చేశారు. ఓ హదీసు ప్రకారం, పై ఆయత్ అవతరించగానే, సహాబా(రఅన్) (ప్రవక్త అనుచరులు), అసలు డబ్బే కూడబెట్టవద్దేమో, ఉన్నదంతా అల్లాహ్ మార్గంలోనే ఖర్చు పెట్టేయాల్సిందేమో

అని అనుకున్నారు. ఇప్పటికే మీరు ఉన్నదంతా దైవమార్గంలో ఖర్చుపెట్టేశారాయే. కాబట్టి వారికి ఇది కొంత కష్టంగానే అనిపించింది. ఇదేగనక ఫర్జ్ అయితే వారికి కొంత కష్టమే. వీరి ఈ పరిస్థితి చూసి హజ్రత్ ఉమర్ (రఅన్) దైవప్రవక్త (సఅసం) సన్నిధికి హాజరై వీరి పరిస్థితి గురించి అడిగారు. దానికి దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

**"అల్లాహ్ జకాత్‌ను ఫర్జ్ చేసిందే మీదగ్గర మిగిలిఉన్న ధనాన్ని శుద్ధపరచడానికే. మిగిలివున్న ధనానికి 'విరాసత్' (వారసత్వం) జారీచేశాడు. అంటే ధనం మొత్తం ఖర్చు చేయించదలిస్తే విరాసత్ జారీ చేసేవాడు కాడు కదా!"**

**(అబూదాఊద్)**

إِنَّ اللّٰهَ لَمْ يَفْرِضِ الزَّكٰوةَ إِلَّا لِيُطَيِّبَ مَا بَقِيَ مِنْ أَمْوَالِكُمْ وَإِنَّمَا فَرَضَ الْمَوَارِيثَ۔

(ابوداؤد)

జకాత్ చెల్లించిన తరువాత మనిషి సొమ్ము మొత్తం పరిశుద్ధమైపోతుంది అని పై హదీసు ద్వారా తెలుస్తోంది. దైవప్రవక్త (సఅసం), "నా దగ్గర ఉహద్ కొండ అంత బంగారం ఉంటే ఆ మొత్తాన్ని మూడు రోజుల్లో దానం చేస్తాను" అని అనేవారు. ఆయన ఓ సారి హజ్రత్ బిలాల్ (రఅన్)తో ఇలా అన్నారు. "ఓ బిలాల్! ఖర్చు చేసెయ్. ఆకాశాల స్వామి తగ్గిస్తాడని భయపడకు" (అంటే దైవ మార్గంలో ఖర్చు పెడితే తరగదు. నీవు ఎవరి మార్గంలోనయితే ఖర్చు బెడుతున్నావో ఆయన భూమ్యాకాశాలకు ప్రభువు) ఎవరిపైన్నైతే జకాత్ ఫర్జ్ అయ్యి వారు దాన్ని చెల్లించరో వారి గురించి ఆయన ఇలా ప్రవచించారు:

"ఎవరి వద్దనైతే సొమ్ము ఉండి అందుండి అతడు జకాత్ చెల్లించకపోతే ప్రళయ దినం నాడు అతనికోసం అగ్నిపలకలు తయారుచేయబడతాయి. ఆ పలకల్ని నరకాగ్నిలో బాగా ఎర్రగా వేడిచేసి వాటితో అతని రెండు ప్రక్కలకు, వీపుకు నుదుటిని వాతలు పెట్టడం జరుగుతుంది. ఇవి చల్లబడిన తరువాత తిరిగి వాటిని వేడిచేసి వాతలు బెట్టడం జరుగుతుంది". (మిష్కాత్)

"ఎవరికైతే అల్లాహ్ ధనం సంపదలు ఇచ్చాడో, అందుండి వారు జకాత్ నివ్వరో ప్రళయదినం నాడు వారి ఆ సంపద, వెంట్రుకలు లేనటువంటి తలగలిగిన ఓ భయంకర విష సర్పం రూపంలో ప్రత్యక్షమవుతుంది. అది వారి మెడలకు చుట్టుకొని 'నేను నీ సంపదను నేను నీ నిధిని' అంటూ కాటేస్తూ ఉంటుంది" అని దైవప్రవక్త (సఅసం) గారు ప్రవచించారు. (బుకారి)

ఓసారి ఆయన సన్నిధికి ఇరువురు స్త్రీలు హాజరయ్యారు. వారిద్దరి చేతులకు బంగారు కంకణాలున్నాయి. దైవ ప్రవక్త (సఅసం) "వాటికి జకాత్ చెల్లించారా?" అని అడిగారు. లేదు అని వారు బదులియ్యగా, "దీనికి బదులుగా మీకు అగ్ని కంకణాలను తొడిగించడం ఇష్టమా" అని అడిగారు. వారు, ఓ దైవప్రవక్తా! లేదు మేము దాన్ని కోరడం లేదు అన్నారు. అప్పుడు ఆయన వారిద్దరిని ఉద్దేశించి "అయితే వీటికి జకాత్ చెల్లించండి" అని హితబోధ చేశారు. (తిర్మిజీ)

ఆభరణాలంటే స్త్రీలకు ఎంతో మక్కువ. వారు ఈ హదీసు గురించి ఎంతో ఆలోచించవలసి ఉంది.

ఎవరయితే తమ వద్ద ధన సంపద ఉంచుకుని జకాత్ చెల్లించడం లేదో వారు ప్రళయ దినం నాడు ఎంత గొప్ప యాతనలను కూడబెట్టుకుంటున్నారో గ్రహించాలి. ఈ ప్రపంచంలో ఈ సంపద కారణంగానే మనిషికి అన్ని రకాల సుఖ సంతోషాలు లభిస్తాయి. వీటి మూలంగానే రోగాలు, కష్టాలు దరికి రాకుండా చూసుకుంటాడు. కాని అతడు జకాత్ ఇవ్వకపోతే ఈ ధన సంపదే ప్రళయం నాడు అతనికి అగ్ని పరుపుగా కఠినమైన కడగండ్లకు కారణభూతంగా మారుతుంది.

జకాత్ ప్రాధాన్యత గురించి అంచనా వేయదలిస్తే ఈ సంఘటనను ఓసారి మననం చేసుకోవాలి. దైవప్రవక్త (సఅసం) పరమపదించిన తరువాత కొందరు పల్లె వాసులైన నవ ముస్లిములు దీని ప్రాముఖ్యతను అర్థం చేసుకోకుండా దాన్ని చెల్లించడానికి నిరాకరించారు.

వీరు జకాత్ చెల్లింపును నిరాకరిస్తున్నారన్న వార్త హజ్రత్ అబూబక్ర్ (రఅన్) గారికి చేరగానే ఆయన వారిపై జిహాద్ (ధర్మయుద్ధం)ను ప్రకటించారు. ఇది విన్న హజ్రత్ ఉమర్ (రఅన్) వారి దగ్గరకు వచ్చి సద్వచనాన్ని (కలిమాను) పఠించిన ముస్లిముల గురించి "వారితో యుద్ధం చేయడానికి వీలు లేదని, ముస్లిమ్ అయిన తరువాత వారి ధన ప్రాణాలు రక్షించబడతాయి" అనిదైవ ప్రవక్త (సఅసం) ప్రవచించారు కదా అని అడిగారు. అప్పుడు హజ్రత్ సిద్దీఖ్ (రఅన్), అవును "ఇది నిజమే కాని దీనికి తోడు దైవప్రవక్త (సఅసం) పెట్టిన షరతు ఏమిటంటే "ఒకవేళ కలిమాను పఠించిన వాడు ఆ కలిమా హక్కును నెరవేర్చకపోతే వారితో యుద్ధం చేయండి అని కూడా అన్నారు. ఏ విధంగా నమాజు కలిమాకు సంబంధించిన ఓ హక్కో, జకాత్ కూడా ఓ హక్కే. వీరు దీన్ని నిరాకరిస్తున్నారు" అని అన్నారు. ఈ జవాబు విన్న హజ్రత్ ఉమర్ (రఅన్) తన అభిప్రాయాన్ని మార్చుకున్నారు. అంటే దీనిద్వారా, ఈ హక్కు గురించి జిహాద్ కూడా చెయ్యొచ్చు అన్నవిషయం తేలిందన్నమాట.

## జకాత్ దైవం హక్కు, దైవదాసుల హక్కు

ఫర్జ్ ఆరాధనల్లో నమాజ్, రోజా, హజ్ అనేవి కేవలం దైవసంబంధమైన హక్కులే. కాని జకాత్‌కు ఉమ్మడి విలువ ఉంది. ఓ వైపు అది దైవం హక్కైతే మరోవైపు దైవదాసుల హక్కుకూడా. ఎవరైతే జకాత్‌నివ్వడో అతడు అనేకమంది దైవదాసుల హక్కుల్ని కొల్లగొడుతున్నాడన్నమాట. దైవప్రవక్త (సఅసం) ఓసారి హజ్రత్ ముఆజ్‌ను యమన్‌కు పంపిస్తూ, దేవుని ఏకత్వం, నమాజు గురించి బోధిస్తూ "అల్లాహ్ వారిపై సదఖాను ఫర్జు చేశాడు. దాన్ని వారి ధనవంతులనుండి వసూలుచేసి వారి పేదలకు పంచిపెట్టు" అని సెలవిచ్చారు. (బుఖారి, ముస్లిమ్)

దైవప్రవక్త (సఅసం)గారి ఈ ప్రవచనం దివ్యఖుర్ఆన్‌లోని హష్ర్ సూరాకు సంబంధించిన ఆయత్ "లాయకూన దూలతన్‌బైనల్ అగ్ నిమాఅ మిన్‌కుం"కు వివరణలాంటిది, అంటే ఈ జకాత్‌కు సంబంధించిన ఓ ధ్యేయం, ఎలాంటి ఆసరాలేని దైవదాసుల సహాయం అని అర్థం. ఇదేకాకుండా ఇది అల్లాహ్ నిర్ణయించిన ఓ బాధ్యత కాబట్టి ఇది అల్లాహ్ హక్కైంది.

## జకాత్ ధ్యేయం

జకాత్ యొక్క మౌలికమైన ధ్యేయం ఏమిటంటే ధనం ఓ చోట కేంద్రీకరించ బడడానికి వీలులేదు. సరికదా అది ఎంత వీలైతే అంతగా ప్రజల్లో తిరుగాడుతూ ఉండాలి.

పరలోక ప్రయోజనాలేకాకుండా జకాత్‌కుసంబంధించినవి ప్రాపంచిక ప్రయోజనాలు కూడా ఎనలేనివే. దీనిద్వారా పేదలకు సహాయం అందుతుంది. స్నేహం, సుహృద్భావ వాతావరణం నెలకొంటుంది. ధనపిపాస తగ్గుతుంది. ఇలా ధనపిపాస తగ్గినప్పుడు మనిషిలో నైతిక విలువలు, సౌమ్యం, నమ్రత ఉద్భవిస్తాయి. దీని మూలంగా ప్రపంచంలోని దారిద్ర్యరేఖకు దిగువ ఉన్నవారికి, పేదసాదలకు ఎంత మేలు కలుగుతుందో ఆలోచించండి.

## జకాత్ అంటే

అరబ్బీ భాషలో జకాత్ అంటే పరిశుద్ధమవడం, అభివృద్ధిచెందడం. సరీఅత్ పరిభాషలో, కేవలం దైవసంతుష్టి కోసం, ఆయన ఆదేశానుసారంగా పరిమితమైన, నియమితమైన సొమ్మును, ఆ సొమ్ముకు హక్కుదారుడైన ముస్లిముకు ధారాదత్తం చేసి అతణ్ణి దానికి యజమానిగా చేయడాన్ని జకాత్ అంటారు. దీనికితోడు మరో షరతు ఏమిటంటే

జకాత్ ఇచ్చేవాడు, జకాత్ తీసుకునేవానినుండి ఎలాంటి ప్రయోజనాన్ని పొందకూడదు. ఒకవేళ ఏవిధమైన ప్రయోజనం పొందినా లేక దాన్ని ఆశించినా అది జకాత్ ఇవ్వడం క్రిందికి రాదు. షరీఅత్‌లో ఈ ఆర్థిక ఆరాధనను జకాత్ అని అనడానికి కారణం వ్యక్తికి సంబంధించిన మిగతా సొమ్ము పరిశుద్ధమైపోతుంది. దానిద్వారా అతని పుణ్యాలు, సత్కర్మలు పెరుగుతాయి. తత్కారణంగా అతడు పరలోకంలో నరకయాతన నుండి రక్షింపబడతాడు. అదేకాకుండా జకాత్ ద్వారా అనేక పేదలకు ధనం లభించి వారు తమ పేదరికాన్ని దారిద్ర్యాన్ని పారద్రోలగలుగుతారు.

## జకాత్ ఆదేశం

ఆ ప్రాజ్ఞత, స్పృహ కలిగివున్న ప్రతి ముస్లిమ్‌పై ప్రతిఏడూ జకాత్ ఫర్జు-ఎవరైతే "సాహెబె నిసాబ్" (జకాత్ చెల్లించే ఆర్థికస్తోమతగలవాడో) అతని ఆ సొమ్ముపై పూర్తి ఒక్క సంవత్సరం గడిచిపోయిందో. దీన్ని ఫర్జుకాదు అని నిరాకరించిన వాడు 'కాఫిర్' అవుతాడు. ఫర్జుగా భావించి దాన్ని చెల్లించనివాడు 'ఫాసిక్' మరియు ఘోరమైన పాపానికి ఒడిగట్టినవాడవుతాడు. ఇస్లామీయ ప్రభుత్వం అతనికి కఠినమైన శిక్ష విధిస్తుంది. హజ్రత్ అబూబకర్ (రజి) గారు ఎలాంటి చర్యగైకొన్నారో పైన చెప్పడం జరిగింది.

## సాహెబె నిసాబ్ భావం

వెండి, బంగారాలు లేక సొమ్ము వగైరాలు వేటిపైన్నైతే జకాత్ వాజిబ్ (విధి) అవుతుందో దాన్ని షరీఅత్‌లో 'నిసాబ్' అంటారు. (అంటే జకాత్‌కు నిర్ణయించిన ధన పరిమితి). ఎవరివద్దనైతే ఈ పరిమితికి సమానమైన ధనం వగైరాలు ఉంటాయో అతణ్ణి 'సాహెబెనిసాబ్' అని అంటారు. ఉదాహరణకు ఒకరివద్ద కనీసం 52 1/2 తులాల వెండి లేక 7 1/2 తులాల బంగారం ఉంటే అతనిపై జకాత్ వాజిబ్ అయిందన్నమాట. అతడు అందులో నుండి నలభయ్యోవంతు (2 1/2 శాతం) జకాత్ తీయాలి. వెండిబంగారాల ఈ కనీస పరిమితిని 'నిసాబ్' అని, దాన్ని కలిగివున్న ప్రతివాణ్ణి సాహెబె నిసాబ్ అని అంటారు.

## జకాత్ ఫర్జ్ అయ్యే వస్తువులు ఇవి

దిగువ ఆరు రకాల వస్తువులపై జకాత్ ఫర్జ్ చేయడం జరిగింది.

1. వెండి బంగారాలు, తత్సంబంధమైన అన్నిరకాల వస్తువులు, ఉదాహరణకు ఆభరణాలు, పాత్రలు, నాణేలు వగైరా.

2. అన్ని రకాల వ్యాపార సామగ్రి. 3. నగదు రూపాయలు. అవి రూపాయల రూపంలో ఉన్నా, నోట్లు, పౌనులు, డాలర్లు, సేవింగ్ సర్టిఫికేట్లు, బాండ్లు, ప్రభుత్వ సర్టిఫికేట్ల రూపంలో ఉన్నా. 4. వ్యసాయ సంబంధమైనవి. ధాన్యం, పండ్లు ఫలాలు కూరగాయలు వగైరా. 5. వ్యాపారం కోసం పెంచే పశువులుగాని, సంతతి వృద్ధిచేయడానికి లేక పాలకోసం పెంచేవి అయినా సరే. ఒకవేళ వ్యాపారం చేసే ఉద్దేశ్యం ఉన్నట్లయితే జకాత్ వాజిబ్ అవుతుంది. వీటన్నిటి వివరం, ఎలా జకాత్ చెల్లించాలో వేరు వేరుగా రాయబడుతుంది. 6. నిధినిక్షేపాలు (గనులు)

**సంకల్పం :** జకాత్ చెల్లించే సంకల్పం ఉండడం ముఖ్యం. ఏ సొత్తునైతే జకాత్ సంకల్పంతో ఖర్చుచేయడం జరుగుతుందో అది మాత్రమే జకాత్ చెల్లించినట్లుగా పరిగణించబడుతుంది. అంటే జకాత్ చెల్లింపు నెరవేరిందన్నమాట. తలవనితలంపుగా ఎలాంటి సంకల్పం లేకుండా ఎంతసొమ్ము ఖర్చుబెట్టినా అది జకాత్ కోవలోనికి రాదు. అదే సత్కార్యం కోసం ఖర్చు బెడితే దానికి పుణ్యఫలం వేరుగా లభిస్తుంది.

## వెండిబంగారాలు, తత్సంబంధమైన వస్తువుల జకాత్

వెండి బంగారాల జకాత్‌లో వాటి నలభయ్యోవంతు (రెండున్నరశాతం) చెల్లించడం ఫర్జు. ఒకరివద్ద రెండొందల 'దిర్హం'లు ఉన్నాయి. అంటే 52 1/2 తులాల వెండి లేక ఆభరణాలు లేక తత్సంబంధమైన ఇతర సామాను ఉంటే దాని నలభయ్యోవంతు (1/40) జకాత్ చెల్లించాలి. అంతకంటే తగ్గితే ఆ వ్యక్తిపై జకాత్ ఫర్జుకాదు.

ఇదే విధంగా ఒకరివద్ద ఇరవై 'మిస్కాళ్ళ' బంగారం (7 1/2 తులాలు) లేక ఆభరణాలుంటే అందులోనుండి నలభయ్యోవంతు (1/40) జకాత్‌గా చెల్లించాలి. అంతకంటే తక్కువగా ఉంటే జకాత్ వాజిబ్‌కాదు (అంటే చెల్లించనవసరంలేదు). 52 1/2 తులాల పరిమాణం నేటి తూనికల్లో 612 గ్రాములు 7 1/2 తులాల పరిమాణం 87 గ్రాముల 500 మిల్లీగ్రాములు.

1. వెండి బంగారాల నిసాబ్ (పరిమితి) దేనికి అదే. అంటే రెంటిలో ఏది నిసాబ్‌కు చేరితే దానిపై జకాత్ చెల్లించడం వాజిబ్. అంటే ఆ లోహాల్తో చేయబడిన ఇతర వస్తువుల విలువ కూడా దాన్తో కలుపబడుతుంది.

**నిసాబ్ (పరిమితి) ప్రమాణం :** ధర్మవేత్తలు వెండి, బంగారాల పరిమితి విషయంలో, వెండిని ప్రమాణంగా తీసుకోవాలా లేదా బంగారాన్ని ప్రమాణంగా తీసుకోవాలా అన్న విషయంలో తర్జన భర్జనలు జరిపారు.

కొందరు బంగారం విషయమై ఓ షరతుకూడా బెట్టారు. అదేమంటే ఇరవై మిస్కాళ్ళ బంగారం రెండొందల దిర్‌హంల విలువకు సమానమైతే దానిపై కూడా జకాత్ వాజిబ్ అవుతుంది. కాని ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) రెంటి నిసాబ్‌లు వేరువేరంటారు. విలువ వగైరాలను పరిగణించారు. ఇమామ్ అహ్మద్ (రహ్మాలై) గారి అభిప్రాయం కూడా ఇదే.

## నిసాబ్ పరిమితి కంటే అధికంగా ఉన్న దానిపైనే జకాత్

జకాత్‌లో వెండి బంగారం ఏనిసాబ్ అయితే ఖరారు చేయడం జరిగిందో అంతకంటే అధికమైన దానిపై జకాత్ వాజిబ్ అవుతుందని కొందరు ఇమామ్‌లంటారు. వీరు ప్రమాణంగా తీసుకున్న హదీసు చివర "అంతకంటే అధికంగా ఉన్నదానిపై నలబయ్యో వంతు 1/40 అంటే రెండొందల దిర్‌హంలనుండి అయిదు దిర్‌హంలు అని ఉంది కాబట్టే. అయితే ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) నిసాబ్‌కంటే అధికమైన డబ్బు, దాని అయిదోవంతుకు చేరితేనే జకాత్ వాజిబ్ అవుతుంది అంటారు. అంటే యాభై రెండున్నర తులాల వెండికంటే అధికమైన 10 1/2 తులాల వెండిపై జకాత్ వాజిబ్ అవుతుంది అని అర్థం. అంతకంటే తక్కువ దానిపై జకాత్ వాజిబ్‌కాదు.

వీరు దైవప్రవక్త (సఅసం)గారి ప్రవచనంలో "రెండువందల దిర్హంల వెండి (52 1/2 తులాలు) ఉన్నట్లైతే దానిపై అయిదు దిర్హంల జకాత్ ఉంది. ఆ తరువాత ఏ జకాత్ లేదు. అందులో తిరిగి నలభై దిర్హంలు పెరిగితే తప్ప" అని చెప్పబడిన విషయాన్ని ఆధారంగా చేసుకొని పై సూత్రాన్ని రూపొందించారు. (రద్దుల్ ముహ్తార్ సం:2, పు 28)

2. వెండి బంగారం జకాత్ సంవత్సరం గడిచిన తరువాతే వాజిబ్ అవుతుంది. అంటే వెండిగాని బంగారంగాని లేకవాటి ఆభరణాలు గాని ఓ వ్యక్తి దగ్గర ఉన్నాలేక అవి అతని వద్దకు వచ్చి సంవత్సరం గడిచినా.

3. వెండి బంగారం జకాత్‌ను కంసాలితో తూయించి లేక స్వంతంగా తూచి ఇవ్వాలి. జకాత్‌లో నాలుగైదు రూపాయలు ఎక్కువపోయినా ఫరవాలేదు గాని తగ్గితే మాత్రం పాపం.

4. వెండి బంగారాలతో తయారైన వస్తువులు ఎన్నున్నా అవన్నీ వెండి బంగారాల కోవకే చెందుతాయి. ఉదాహరణకు ఆభరణాలు, వెండి పాత్రలు లేక వస్త్రాలపై వెండి బంగారాలతో చేసిన జరీ వగైరాలు. ఈ వస్తువులు ఉపయోగంలో ఉన్నా లేకున్నా అన్నీ నిసాబ్ పరిమితిలోనికి వస్తే మాత్రం వాటిపై జకాత్ వాజిబే.

5. వెండి బంగారాల్లో లేక వాటితో తయారైన ఆభరణాల్లో కొంతకల్తీ ఉంటే, ఆ కల్తీ బంగారం కంటే తక్కువగా ఉన్నట్లైయితే అది వెండి, బంగారాలుగానే భావించబడ్తాయి.

ఒకవేళ ఆ కల్తీ అంతకంటే ఎక్కువైతే అవి కల్తీ ఆభరణాలుగానే భావించబడతాయి. ఉదాహరణకు ఒకరి దగ్గర నలభై తులాల వెండి ఆభరణాలు ఉన్నాయి. వాటిలో 10 తులాల సీసంగాని, రాగిగాని కలిస్తే అది వెండిగానే భావించబడుతుంది. కాని నలభై తులాల్లో ఇరవై ఒక్క తులాలసీసం లేక రాగి కలిసి ఉంటే అది సీసంలేక రాగిగానే భావించబడుతుంది. ఇలాగే బంగారం కూడాను.

ఇదేవిధంగా ఎక్కడైన వెండి బంగారాల నాణాలు చలామణిలో ఉన్నా వాటిలో కల్తీని బట్టే అది వెండా లేక బంగారమా అని నిర్ణయించుకోవాలి. అయితే అందులో నామమాత్రంగా బంగారంగాని వెండిగాని ఉన్నా, లేక మొదటనే అవి లేకున్నా దాని గురించిన ఆదేశం ముందు రాబోతోంది.

6. ఒకరివద్ద నిసాబ్‌కు సరిపడ వెండిగాని, బంగారంగాని లేవు అవి కొద్దికొద్దిగా మాత్రమే ఉన్నాయి. అప్పుడు రెంటి విలువ (ధర)ను లెక్కకట్టాలి. ఆరెంటి విలువ కలిసి నిసాబ్‌కు సరిపోతే జకాత్‌వాజిబ్ అవుతుంది. ఉదాహరణకు, ఒకరివద్ద పాతిక తులాల వెండి వస్తువులున్నాయి. పన్నెండణాల (ముప్పావుతులం) ఎత్తు బంగారపు చెవిపోగులు (Ear Rings) లేక మరేదైన వస్తువు ఉంది. అలాంటప్పుడు ఆ పన్నెండణాల ఎత్తు బంగారం ధరకు వెండి ఓ ముప్పై అయిదు తులాలు లభిస్తుంది అనుకుందాం. అప్పుడు ఇరవై అయిదు తులాల వెండిలో ముప్పావుతులం బంగారానికి వచ్చే వెండి ముప్పై అయిదు తులాలను కలుపగా మొత్తం అరవై తులాల వెండి అవుతుంది. అప్పుడు ఆ వ్యక్తి సాహబెనిసాబ్ అయ్యాడు. ఇప్పుడతడు అరవై తులాల వెండి జకాత్ ఇవ్వవలసిందే. ఒకవేళ ఆరెంటిని కలిపిన తరువాత కూడా నిసాబ్ పరిమితికి చేరకపోతే జకాత్ వాజిబ్ కాదు.

7. వెండిబాగారాల జకాత్‌లో వెండి బంగారాలు గాని లేదా వాటి ధరనుగాని చెల్లించాలి. రెండు విధాలు ధర్మసమ్మతమే.

ఉదాహరణకు నోట్లు, బాండ్లు, డాలర్లు, పౌండ్లు వగైరాలు. మూడోరకంలో హోల్తో తయారైన నాణాలు ఉదాహరణకు నేటికాలంలో భారత్ పాక్‌లలో చెలామణిలో ఉన్న నాణాలు. నోట్లు చిల్లర వగైరా. వెండిబంగారు నాణాల లెక్క మాత్రం వెండిబంగారాల నిసాబే. కాగితం లేక ఇతర ధాతువులతో తయారైన నాణాల రూపం ఏదైనా అవి నిసాబ్ పరిమితికి సమానం అయితే అంటే వెండి 52 1/2 తులాలకు చేరితే వాటిపై జకాత్ వాజిబ్ అవుతుంది.

## ఇతర ధాతువులు లేక కాగితపు నాణాల నిసాబ్

నోట్లు, బాండ్లు, సేవింగ్ సర్టిఫికేట్లు లేక వెండి బంగారాలు లేకుండా ఇతరనాణాలన్నీ కలిసి 52 1/2 తులాల వెండి విలువకు సమానమైతే దానిలో నలభైయ్యోవంతు (1/40) జకాత్ తీయడం వాజిబ్.

ఉదాహరణకు నేటి నాణాల ప్రకారం ఇరవై అయిదు రూపాయలకు ఒక తులం వెండి వస్తుందనుకుందాం. అలా 52 1/2 తులాల వెండి ఖరీదు పదమూడొందల రూపాయలే అవుతుంది. ఎవరి వద్దనైనా 1300 రూపాయలు అవసరం కంటే అధికంగా ఉండి వాటిపై ఓ సంవత్సరం గడిస్తే సంవత్సరం చివరన దాని1/40 వంతు దాదాపు 32 రూపాయలు జకాత్‌గా తీయాలి. వెండి ధర పెరిగితే ఆ ప్రకారంగానే డబ్బూ పెరుగుతుంది. మొత్తానికి మౌలికంగా వీటి ప్రమాణం 52 1/2 తులాలవెండే. ఇదే విధంగా అంతకంటే ఎంత అధికమైన దాని 1/40 వంతు తీయవలసి వస్తుంది. అంటే నూటికి రెండున్నర రూపాయలు, వెయ్యికి ఇరవై అయిదు రూపాయలు, రెండువేలకు యాభై రూపాయలు, పదివేలకు రెండొందల యాభై రూపాయలు, ఒక లక్షకు రెండువేల అయిదొందల రూపాయలు అన్నమాట. రూపాయల జకాత్‌లోను, వెండి బంగారాల జకాత్‌లోను రెండు విషయాలు గమనించ దగ్గవి.

1. ఇవి అవసరమైన దానికంటే మిగులుగా ఉండడం. 2. ఇవి చేరి ఒక సంవత్సరం పూర్తి అయి ఉండడం.

## అవసరమైనదాని కంటే మిగులుగా ఉండడమంటే

అవసరాలు రెండు రకాలు. ఒకటి ప్రాథమికావసరాలు (నిత్యావసరాలు). తిండి, బట్ట, ఇల్లు, చికిత్స, వృత్తిపని వారైతే వారి పనిముట్లు వగైరాలు ఈ కోవకు చెందుతాయి. ఉదాహరణకు ఒకనివద్ద రెండువేల రూపాయలు ఒక సంవత్సరకాలం నుండి ఉండి పోయాయి. కాని అతని ఇల్లు వర్షానికి పడిపోయింది. దానివల్ల ఎన్నో ఇబ్బందులు

ఎదురవుతున్నాయి. ఇల్లు బాగు చేసుకుంటే ఆ రెండువేలు ఖర్చైపోతాయి. అలాంటి వ్యక్తి పై జకాత్ వాజిబ్‌కాదు. లేక అతని ఇల్లు ఎంతో ఇరుకైనది. కూతుళ్ళు కోడళ్ళు అనేక మందిన్నారు. ఉండడానికి కష్టంగా ఉంది. ఇంటిని పెంచవలసివస్తే ఆ డబ్బంతా ఖర్చయిపోతుంది. కాబట్టి అలాంటి రూపాయలపై జకాత్ ఫర్జుకాదు. ఇదే విధంగా అతడు ఓ ప్రాణాంతకమైన వ్యాధికి గురై ఉన్నాడు. అతని వద్ద ఉన్న డబ్బుపై జకాత్ వాజిబ్ అవుతుంది. కాని అతడు ఆ డబ్బును తన చికిత్సకోసం ఖర్చు పెట్టదలిస్తే అతనిపై జకాత్ వాజిబ్‌లేదు. లేక అతని వద్ద డబ్బే ఉంది కాని జీతం చాలా తక్కువ. ఆ డబ్బు నుండి అతడు ప్రతినెల కొంత తీసి తిండి బట్టకోసం ఖర్చు పెట్టగా సంవత్సరం చివరన అందుండి పోగా మిగిలిన డబ్బు జకాత్ వాజిబ్ అయ్యేంతటిదికాదు. అలాంటి సందర్భాల్లో కూడా జకాత్ వాజిబ్ కాదు. ఇలాగునే ఓ ముస్లిం వడ్రంగి దగ్గర కొంత డబ్బుంది. ఈతడు దాన్ని తన వృత్తికోసం అంత డబ్బుల్లేక అంతకంటే కొంచెం తక్కువ డబ్బుబెట్టి పనిముట్లను కొంటే ఆ డబ్బుపై కూడా జవాత్ వాజిబ్‌కాదు.

రెండోది అప్రధానమైనవి లేక నిత్యావసరంకానివి. ఉదాహరణకు-విలాసాల కోసం లేక పెళ్ళిళ్ళు, ఖత్నా (సుంతీల), అకీకా లేక వారు శుభకార్యంలో డంబాచారం కోసం డబ్బును దాచిపెడితే దానిపై మాత్రం జకాత్ వాజిబ్ అవుతుంది. ఇలాగే కుమారుని పైచదువులకోసం డబ్బు దాచి ఉంచినా ఆ డబ్బుపై కూడా జకాత్ వాజిబ్ అవుతుంది.

అయితే ఈ విషయంలో, ఆ అవసరం జాయిజ్ (ధర్మ సమ్మతమైనది) అయినదై సమయానికి ఏర్పడినదై ఉండాలి. అయితే ఆ అవసరం అయితే ధర్మ సమ్మతమేగానీ అది సమయానికి ఏర్పడినదికాకుండా ఉంటే మాత్రం జాకత్ వాజిబ్ అయినట్లే. ఉదాహరణకు ఓ వ్యక్తి నేను వృద్ధుడనై పోయిన తరువాత దాన్ని ఖర్చు బెడ్తాననో, లేక కూతురి పెళ్ళి చేస్తాననో లేక ఇల్లు కట్టిస్తాననో లేక వ్యాపారం చేద్దామనో లేక గృహోపకరణాలను కొందామనో దాచి ఉంచితే ఆ సందర్భాలన్నిటిలోను జకాత్ చెల్లించడం వాజిబ్. ఎందుకంటే అవసరం మాత్రం ధర్మ సమ్మతమైందేకాని అది ప్రస్తుతం ఏర్పడలేదుకాబట్టి.

ఇదే విధంగా ఎవరైనా హజ్ చేయడానికి డబ్బు కూడబెట్టినా ఆ డబ్బుపైకూడా జకాత్ చెల్లించాల్సిందే.

## సంవత్సరకాలం గడవడమంటే

సంవత్సరం గడవాలి అన్నదానికి భావం ఏమిటంటే పూర్తి సంవత్సరం వరకు ఆ వ్యక్తి దగ్గర జకాత్ వాజిబ్ అయ్యేటంత డబ్బు ఉండాలి అని. ఈ సందర్భంలో కొన్ని విషయాల్ని జ్ఞప్తియందుంచుకోవాలి.

1. ఎవరివద్దనైనా సంవత్సరారంభంలో జకాత్ వాజిబ్ అయ్యేటంత ధనముండి అది సంవత్సరం పూర్తిగాక పూర్వమే ఖర్చైపోయినా లేక దొంగలించబడినా ఆ డబ్బుపై జకాత్ వాజిబ్ లేదు.

2. ఒకరివద్ద సంవత్సారంభంలోను, సంవత్సరాంతంలోను జకాత్ పరిమితికి సమానమైన డబ్బుంది కాని అది మధ్యలో మాత్రం ఏదో ఓ కారణం వల్ల తగ్గిపోయింది. అలాంటప్పుడు సంవత్సరారంభంలోనూ, సంవత్సరాంతంలోనూ ఎంతడబ్బైతే అతని దగ్గర ఉండిందో దానికి మాత్రమే జకాత్ వాజిబ్ అవుతుంది. ఉదాహరణకు ఒకరి వద్ద ముహర్రమ్ మాసంలో పదమూడొందల రూపాయలు ఉన్నాయనుకుందాం. రంజాన్ మాసంలో అందులోనుండి రెండొందలు ఖర్చు అయిపోయాయి లేక దొంగలించబడ్డాయి. సంవత్సరం చివరి నెల జిల్‌హజ్జాలో తిరిగి ఆ రెండు వందల రూపాయలు వచ్చి కలిశాయి. ఈ కొన్ని నెలల కాలంలో తగ్గిపోయిన కారణంగా జకాత్ మాఫి కాదు. సరికదా అతడు పదమూడొందల రూపాయలపై జకాత్ ఇవ్వవలసిందే, అది వాజిబ్. మొత్తానికి సంవత్స రారంభం, సంవత్సరాంతాన్నే లెక్కలోకి తీసుకోవాలి, మధ్యకాలాన్ని కాదు.

3. సంవత్సరారంభంలో ఎవరి వద్దయినా పదమూడు వందల రూపాయలు ఉన్నాయి (పదమూడువందల రూపాయలు ఒకానొక కాలంలో నిసాబ్ పరిమితిగా పరిగణించబడేది). సంవత్సరం పూర్తి అయ్యేటప్పటికి అవి పదిహేను వందలైపోయాయి. అప్పుడు పదిహేను వందల రూపాయలపై జకాత్ ఇవ్వవలసిందే. ఇదే విధంగా సంవత్స రాంతాన ఎంత డబ్బు పెరిగిపోతుందో అంతటికీ జకాత్ ఇవ్వాలి. ఇలాంటి సందర్భాల్లో సంవత్సర ఆరభంలో ఎంత డబ్బైతే ఉందో దాన్ని అసలుగా భావించడం జరుగుతుంది. ఆ తరువాత ఎంతైతే పెరుగుతుందో జకాత్‌కూడా పెరుగుతుంది. సంవత్సర ప్రారంభంలో అయిదు వందల రూపాయలే ఉండి సంవత్సరాంతానికి అవి పదమూడు వందలైపోతే ఆ పదమూడు వందలు అయినప్పటి నుండే సంవత్సరం ప్రారంభం అయింది. అప్పటినుండి అతడు సాహబెనిసాబ్ అయ్యాడన్నమాట. అప్పటినుండి సంవత్సర కాలమంతా ఎంత డబ్బు పెరిగిపోతుందో ఆ మొత్తం డబ్బుపై జకాత్ చెల్లించడం వాజిబ్ అవుతుంది.

## పారిశ్రామిక పెట్టుబడులపై, షేర్లపై జకాత్

ఒకవేళ ధనం ఏదైన భాగస్వామ్యసంబంధమైన వ్యాపారంలో గాని ఏదైన పరిశ్రమలోగాని పెట్టుబడిగా పెట్టడం జరిగితే మరో విధంగా చెప్పాలంటే షేర్లుకొంటే ఆ ధనంపై ప్రతి ఏటా లాభాలు వస్తుంటే ఆ అసలు పెట్టుబడి దానిపై వచ్చే లాభం రెంటిపైనా

జకాత్ వాజిబ్ అవుతుంది. ఈ జకాత్‌ను ఆ యజమాని ఉమ్మడి మూలధనంపై తీస్తాడు. అయితే ఏలాభం అయితే వ్యక్తులకు లభించిందో దానిపై జకాత్ వేరువేరుగా తీయాల్సి ఉంటుంది. ఒకవేళ అందరుకలిసి యాజమాన్యానికి అనుమతినిస్తే ఉమ్మడిగా జకాత్ తీయవచ్చు. మేనేజరు జకాత్ తీసిన తరువాతే లాభాన్ని పంచుతాడు.

ఆయిమ్మా (ఇమాముల)నడుమ, ప్రతివ్యక్తి వేరువేరుగా జకాత్ తీయాలా లేక ఉమ్మడిగా కూడా జకాత్ తీయవచ్చా అన్న విషయంలో కొంత భేదాభిప్రాయం ఉంది. ఇమామ్ అబూహనీఫా (రహ్మా) ఇమామ్ మాలిక్ (రహ్మాలై)లు, ఇద్దరు లేక అంతకంటే ఎక్కువ మంది ఏదైన వ్యాపారంలో చేరితే ఆ చేరిన వారి పెట్టుబడి లాభాలు కలిసి నిసాబ్‌కు చేరకపోతే జకాత్ వాజిబ్ కాదంటారు.

ఇమామ్‌షాఫయీ (రహ్మా), ఉమ్మడిసొమ్ము ఒకవ్యక్తి సొమ్ము క్రిందికే వస్తుంది అని అంటారు.

(రద్దుల్ ముహ్తార్ సం. 2పుట 34, హిదాయతుల్ ముజ్‌తహిద్ సం-1పుట 133)

ఈ భేదాభిప్రాయం ఏర్పడ్డానికి కారణం ఏమిటంటే దైవప్రవక్త (సఅసం) అయిదు ఓకియాల వెండి అంటే 52 1/2 తులాలు వెండి కంటే తక్కువ ఉన్నదానిపై జకాత్ వాజిబ్ కాదు అని ప్రవచించారు. అయితే ఈ ప్రవచనంలో ఇది ఒకే వ్యక్తి సొమ్ము గురించా లేక ఉమ్మడి సొమ్ము గురించా అన్నదానికి వివరణ లేదు కాబట్టే. ఇమామ్ అబూహనీఫా, ఇమామ్ మాలిక్ మొదటి విషయాన్ని దృష్టిలో ఉంచుకున్నారు. ఇమామ్‌షాఫయీ మాత్రం రెండో విషయాన్ని దృష్టిలో ఉంచుకొని చెప్పిన విషయం ఇది.

## వ్యాపార, పారిశ్రామిక సామాగ్రులపై జకాత్

ఒకరివద్ద వ్యాపార సంబంధమైన లేక పారిశ్రామిక సంబంధమైన సామగ్రి ఉంటే అట్టి సామగ్రిపై కూడా జకాత్ వాజిబ్. వస్త్రాలు, పుస్తకాలు, కాగితం, ఎండుఫలాలు, మసాలా, ధాన్యం, కర్ర, ఇనుము, రాగి, ఇత్తడి, అల్యూమినియం, ప్లాస్టిక్ వగైరాలు లేక షాపు లేక కార్ఖానా ఉంటే అందులో తయారయ్యే సామానులపై ఉదాహరణకు రేడియో, టి.వి., మోటార్ సైకిలు కారు విమానం వగైరాలు తయారైతే ఆ తయారైన వాటిపై వాటి విడిభాగాలపై కూడా జకాత్ వాజిబ్ అవుతుంది.

దైవప్రవక్త (సఅసం) సహచరులను వ్యాపారసామగ్రిపై జకాత్ తీయమని తాకీదు చేసేవారు. అయితే దీనికి రెండు షరతులున్నాయి.

1. వాటిపై పూర్తి ఒక సంవత్సరం గడవడం. సంవత్సరం గడవడానికిపైన చెప్పిన వివరణే వర్తిస్తుంది. అంటే సంవత్సరారంభంలో అతడు సాహెబెనిసాబ్ అయితే దానిపై సంవత్సరంలో ఎత వృద్ధి అయిందో సంవత్సరం చివరన వాటంతటిపై జకాత్ వాజిబ్ అవుతుంది.

2. ఈ సామగ్రంతా వ్యాపారంకోసమే అయిఉండడం. ఒకవేళ ఈ సామానులు తన ఉపయోగం కోసం లేక అలంకరణ కోసం ఎన్ని కూడబెట్టుకున్నా సరే, తన అవసరానికి మిగులు సామానులు అనవసరంగా కూడబెట్టుకోవడం సరైనది కాకపోయినా వాటిపై జకాత్ వాజిబ్ కాదు. ఉదాహరణకు మీ ఇంట పెద్దపెద్ద దెగ్చాలు, రాగికళాయిలు, ఫర్నిచర్, విలువైన ఉన్ని, నూలుబట్టలు లేక ధాన్యం ఉంటే వాటిపైన జకాత్ వాజిబ్‌కాదు. అది ఎంత అధికంగా ఉన్నాసరే. ఇలానే అధ్యయనం కోసం మేధావులు ఉంచుకునే గ్రంథాలపై కూడా జకాత్ ఉండదు. అయితే అవి వ్యాపారం కోసమైతే జకాత్ వాజిబ్ అవుతుంది.

## యంత్రాలు, వాటి విడిభాగాల గురించిన ఆదేశం

ఒకవేళ ఒకరివద్ద కార్ఖానా ఉంది. అందులో ఏదైనా వస్తువు తయారవుతుంది. అలాంటప్పుడు తయారైన వస్తువులు ఎంత అమ్మబడినా, ఎంత స్టాక్ చేసినా వాటిపైనా జకాత్ వాజిబ్. అయితే ఏ యంత్రాలైతే ఆ కార్ఖానాలో బిగించబడి ఉన్నాయో లేక సామాను తయారుచేసే ఇతర యంత్రాలు ఏవైతే ఉన్నాయో వాటిపై జకాత్ లేదు. ఇదే విధంగా ఏ వ్యక్తి అయితే వృత్తిపై జీవనం గడుపుతాడో అతని వద్ద ఉన్న పనిముట్లు అవి ఎంత ఖరీదైనవి అయినా సరే జకాత్ వాజిబ్‌కాదు. ఉదాహరణకు గడియారాలు బాగుచేసే రాయి, వడ్రంగి, కమ్మరి, మోటారు సైకిళ్ళ మెకానికులు లేక ఇతర వృత్తలకు పనికివచ్చే పనిముట్లు ఆ కోవకు చెందనవే. అంటే వాటిపై జకాత్‌లేదు. ఇవిమౌళికమైన అవసర సామగ్రి అని ధర్మవేత్తలు నిర్ధారించారు.

## జరీ, వెండి బంగారు గొలుసులు వగైరా

స్త్రీల వస్త్రాలపై ఉండే మేలిమి వెండి బంగారాల జరీ, జాలర్లు నిసాబ్ పరిమితికి చేరితే దానిపైనా జకాత్ వాజిబ్ అవుతుంది. ఇదే విధంగా వెండి బంగారాల గడియారపు కేసులున్నా లేదా గడియారపు చైనులున్నా అవి నిసాబ్ పరిమితికి చేరితే జకాత్

వాజిబ్ అవుతుంది. అయితే ఉత్తవెండి లేక బంగారాల కవరింగ్ అయితే మాత్రం జకాత్ వాజిబ్ కాదు.

## అద్దె ఇండ్లు, అద్దె సామానులు ఫ్యాక్టరీల కట్టడాలు వగైరా

జకాత్ ఉద్దేశ్యం, అధిక రాబడి కలవారి ఆదాయం నుండి ఓ భాగం తీసి తక్కువ ఆదాయం వారికి ఇవ్వడమే. ఇలా చేయడం వలన ధనం ఓ చోట నిలకడగా ఉండక చేతులు మారుతూ ఉండాలి. అందుకే ఇస్లామీయ షరీఅత్ భూమి నుంచి వచ్చే పంటకు తోడు ప్రతి వస్తువు పరిమితిని నిర్ణయించింది. ఇవి గాకుండా జీవితానికి అవసరమైన వస్తువులు వ్యాపార నిమిత్తం కూడబెట్టినా వాజిబ్ అవుతుంది. ఉదాహరణకు ఫర్నిచరు, పాత్రలు, వస్త్రాలు వగైరాలు అవి స్వంత వాడకం కోసమైతే జకాత్ వాజిబ్ కాదు అన్న విషయం ఇది వరకే చర్చించడం జరిగింది. అయితే వాటిని ఎవరైనా అద్దెకు ఇస్తే వచ్చే ఆదాయంపై జకాత్ వాజిబ్ అవుతుంది. అద్దెకిచ్చే వస్తువులపై కాదు.

వ్యాపారంలో అద్దెలో ఉన్న మౌళికమైన భేదం ఏమిటంటే ఇందులో కొనుగోలు అన్న విషయమే లేదు. కొనుగోలు చేస్తే మనిషి దానికి యజమాని అవుతాడు. ఇక్కడ అద్దె లాభాన్ని పంచుకోవడం జరుగుతుంది. అంటే తాత్కాలికంగా సామానుల యజమాని ఇతరులకు వాడకానికి ఇస్తాడు. అంటే లాభపడే అవకాశం ఇచ్చి ఆ లాభానికి ప్రతిఫలం తీసుకుంటాడు. ఉదాహరణకు కార్లు, బండ్లు, ఓడలు, విమానాలు, ఫర్నిచరు వగైరా అద్దెపై నడిస్తే ఆ సామానులపై జకాత్ ఉండదు. వాటిపై వచ్చే లాభంపైనే వాజిబ్ అవుతుంది. అయితే కొందరు పూర్వపు ధర్మవేత్తలు, మరికొందరు ఆధునిక పండితుల ప్రకారం అద్దెకు నడిచే పెద్దపెద్ద సామానులు ఉదాహరణకు విమానాలు, ఓడలు, కార్లు, బస్సులు, పెద్ద పెద్ద కర్మాగారాలు యంత్రాలు బిగించబడిన పెద్ద పెద్ద కట్టడాలు పెద్ద పెద్ద భవంతులు వగైరాలు ఆనాటి వస్తువులు, అద్దె ఇండ్లలాంటివి కావు, ఇది అద్దెకంటే ప్రదర్శన కోసం ఉంచేవి కాబట్టి వాటిపై కూడా జకాత్ చెల్లించాలి అని అంటారు.

## వర్తక సామాగ్రుల పరిమితి (నిసాబ్)

వర్తక సామగ్రి పరిమితి కూడా డబ్బు పరిమితి లాంటిదే. అంటే ఆ సామగ్రి (సరుకు) ధర యాభై రెండున్నర తులాల వెండి ధరకు చేరితే దానిపై జకాత్ వాజిబ్ అవుతుంది. ఆ తరువాత ఎంత సరుకు పెరుగుతూ ఉంటుందో లెక్కించి దానిపై 1/40 వంతు జకాత్ ఇవ్వవలసి ఉంటుంది. అంటే అసలు ప్రమాణం వెండి బంగారం

అన్నమాట. వీటిలో ఏదేని ఒకదాని ధరకు సమానంగా జకాత్ ఇవ్వడం జరుగుతుంది. అబూదావూద్ హదీసులో

"ఒకవేళ బంగారం పరిమితికి చేరకుండా వెండే ఆ పరిమితికి చేరితే జకాత్ ఇవ్వ వలసి వస్తుంది" అని ఉంది.

ఒకవేళ ఎవరైనా డబ్బుకు లేక వ్యాపార సామగ్రికి వెండికి బదులు బంగారపు ధర కడితే అలా చేయడం ధర్మ సమ్మతమే, అయితే వెండి ధరను కట్టడమే ఉత్తమం. ఎందుకంటే ఈ పద్ధతిలో జకాత్ పొందే వారికి ప్రయోజనం కలుగుతుంది. బంగారం ధర కడితే కట్టేవాడికి లాభం కలుగుతుంది. జకాత్‌లో సొంత లాభానికి బదులు జకాత్ పొందేవారికి ప్రయోజనం కలిగించడమే దృష్టిలో ఉంచుకోవాలి. మీలో దయాగుణం పట్టాలన్నది, పేద లకు లాభం చేకూర్చాలన్నది కూడా జకాత్ ఉద్దేశ్యం. బంగారం నిసాబ్ కావడంలో కొంత భేదాభిప్రాయం ఉంది గాని వెండి నిసాబ్ యొక్క ప్రమాణంగా చేయడంలో అందరు ఇమాములు ఏకీభవించారు అన్నది గుర్తించాలి.

## పంటలపై జకాత్

పంటపై ఇచ్చే జకాత్‌ను షరీఅత్‌లో "ఉష్ర్" అంటారు. దీని గురించిన ఆదేశాలు డబ్బు, వ్యాపార సామగ్రికి భిన్నమైంది. దివ్య ఖుర్‌ఆన్, హదీసుల్లో వీటిని గురించి వేరు వేరుగా చెప్పడం జరిగింది. దివ్యగ్రంథంలో దీని ప్రస్తావన రెండు చోట్ల వచ్చింది.

يَاأَيُّهَا الَّذِينَ آمَنُوا أَنْفِقُوا مِنْ طَيِّبَاتِ مَا كَسَبْتُمْ وَمِمَّا أَخْرَجْنَا لَكُمْ مِنَ الْأَرْضِ -

"విశ్వసించిన ప్రజలారా! మీ మేలైన సంపాదనకు సంబంధించిన దాని నుండి దైవమార్గంలో ఖర్చు బెట్టండి. ఇంకా మేము భూమి నుండి పంట రూపంలో ఏదైతే ఇచ్చామో" (ఆలి ఇమ్రాన్)

మరోచోట....

وَهُوَ الَّذِي أَنْشَأَ جَنَّاتٍ مَعْرُوشَاتٍ وَغَيْرَ مَعْرُوشَاتٍ وَالنَّخْلَ وَالزَّرْعَ مُخْتَلِفًا أُكُلُهُ وَالزَّيْتُونَ

"అల్లాహ్‌యే నిటారు చెట్లుగల పలు రకాల తోటలనూ, ద్రాక్షతోటలనూ, ఖర్జూరపు తోటలనూ సృష్టించాడు. పొలాలను పండించాడు. వాటి

వَالرُّمَّانَ مُتَشَابِهًا وَّغَيْرَ مُتَشَابِهٍ كُلُوْا مِنْ ثَمَرِهٖٓ اِذَآ اَثْمَرَ وَاٰتُوْا حَقَّهٗ يَوْمَ حَصَادِهٖ وَلَا تُسْرِفُوْا اِنَّهٗ لَا يُحِبُّ الْمُسْرِفِيْنَ (الانعام)

ద్వారా రకరకాల ఆహారపదార్థాలు లభిస్తాయి. జైతూన్ మరియు దానిమ్మ చెట్లను ఉద్భవింపజేశాడు. వాటిపండ్లు రూపంలో ఒక్కటేకాని, రుచిలో వేరు. అవి పండినప్పుడు వాటి పంటను తినండి. పంటను కోసేటప్పుడు మీపై ఉన్న అల్లాహ్ హక్కును చెల్లించండి. హద్దులు మీర కండి. హద్దులు మీరే వారిని అల్లాహ్ ప్రేమించడు. (అల్అన్ఆమ్-141)

దైవప్రవక్త(సఅసం) సహచరుల్తో ధ్యానం, పండ్లు చివరికి తేనె వగైరాల నుండి ఉష్రను తీయించేవారు. ఆయన ఇలా ప్రవచించారు:

"భూమినుండి ఏదైతే పండుతుందో అది సదఖా"అని.

కొందరు భారతదేశ భూములు ఉష్ర భూములు కావు అని అంటారు. అయితే మౌలానా అబ్దుస్సమద్ రహ్మాని మర్హూమ్ గారు ఎంతో అధ్యయనం చేసి "కితాబుల్ ఉష్ర వజ్జకాత్" అనే గ్రంథం రాశారు. ఆయన అందులో ప్రస్తుతం ముస్లిముల దగ్గరున్న భూములన్నీ ఉష్ర భూములే అని రుజువుచేశారు.

## ఉష్ర ఫర్జు అయినవారు

ప్రతి ముస్లిమ్పై పురుషుడైనా స్త్రీ అయినా ప్రాజ్ఞుడైనా కాకున్నా, తెలివిగలవాడైనా పిచ్చివాడైనా ఉష్రఫర్జు.

## పంటల్లో వేటిపై ఉష్ర వాజిబ్ అవుతుంది?

భూమినుండి పండిన పంటల్లో మనిషి వేటితోనైతే లాభపడతాడో దానిపైనా ఉష్ర వాజిబే. అన్ని రకాల ధాన్యం ఉదాహరణను ఒడ్లు, గోధుమలు, వరి, శనగలు, బటాణీలు, మసూర్, కంది, సజ్జ, జొన్న వగైరాలు, అన్నిరకాల పండ్లు అంటే మామిడి, జామ, కమలాలు, రేగు, పనస, సీతాఫలం, యాపిల్, దానిమ్మ, ద్రాక్ష మొదలైనవి. అన్నిరకాల ఎండు ఫలాలు అంటే ఖర్జూరం, బాదమ్, కిష్మిష్, మునక్కా అక్రోట్, చిరంజీ వగైరాలు

అన్నిరకాల కూరగాయలు, ఉదాహరణకు దోసకాయలు, ఖర్బూజాలు, తర్బూజా, సొరకాయ, ఆలుగడ్డ, వంకాయలు, బెండ, చిలకడదుంప ఇలాగే చెరుకు, చెర్రి వగైరాలు అన్నిటిపై ఉష్ర్ వాజిబ్ అవుతుంది.

## ఉష్ర్ నిసాబ్‌కు ఇతర జకాత్‌లకు గల తేడా

వెండి బంగారాలు, డబ్బు, వ్యాపార సామగ్రికి ఉష్ర్‌కు నడుమ కొన్ని అంశాల తేడా ఉంది.

1. ఉష్ర్ కోసం ఎలాంటి నిసాబ్ (పరిమితి)లేదు. పంట ఏదైనా ఎంతైనా సరే అందులో పదోవంతు (1/10) తీయాలి. ఇందులో సంవత్సరం గడవాలన్న షరతూ లేదు. సరికదా ఏది పండినా అది ఉపయోగించకముందే దాని ఉష్ర్ తీయవలసి ఉంటుంది.

2. పొలం లేక చేలోనైనా రెండో పంట పండించినా ఉష్ర్ కూడా మరోసారి తీయవలసి ఉంది. పంట ఎన్ని సార్లు పండిస్తే అన్నిమార్లు ఉష్ర్ తీయాలి.

3. పండిన పంట పూర్తి ఒక సంవత్సరం వరకు నిలువ ఉండాలనే షరతు కూడా లేదు. ఉదాహరణకు కూరగాయలు కొన్ని రోజుల కంటే ఎక్కువ నిలువ ఉండవు. కాని వాటిలోను ఉష్ర్ ఉంది.

4. ఉష్ర్‌లో ప్రాజ్ఞత కలిగి ఉండడం, వివేకి అయి ఉండడం అనే షరతు కూడా లేదు. ఒకవేళ ఎవరైనా ఉన్మాది అయినా లేక పిల్లవాడే అయినా అతని భూమిలోను లేక తోటలో నుండి ఏదైనా పండితే అందుండి జకాత్ తీసుకోబడుతుంది.

5. భూమికి యజమాని అయి ఉండాలన్న షరతు కూడా లేదు. ఒకరు ఇతరుల పొలాన్ని కౌలుకు తీసుకొని దున్నినా లేక ఏ పండ్ల తోటైనా, పండ్ల కోసం ఆ పంటకాలానికి కొంటే ఈ రెండు పరిస్థితుల్లోను అతడు ఉష్ర్ ఇవ్వాల్సిందే. ఉదాహరణకు ఓ ముస్లిమ్ మామిడి లేక జామ లేక రేగుతోటను కొన్నాడనుకొందాం. అతడు ఆ ఫలాలను కోసేటప్పుడు వాటి ఉష్ర్ తీయాలి. ఈ విషయమును మునుముందు వివరంగా రాబోతోంది.

## పాలుకు వ్యవసాయం చేయడం

ఒకవేళ ఎవరైనా పాలుకు వ్యవసాయం చేస్తే ప్రతిభాగస్తునికి తమతమ భాగపు 'ఉష్ర్' వేరువేరుగా ఇవ్వవలసి ఉంటుంది. ఏకంగా పూర్తిధాన్యపు ఉష్ర్‌ను తీసి మిగిలిన దాన్ని పంచుకున్నా అది ధర్మసమ్మతమే.

## ఉష్ర్ పరిమాణం

పటంలో ఇచ్చె ఉష్ర్‌కు సంబంధించి రెండు పద్ధతులు ఉన్నాయి. మొత్తం పంటలో పదో వంతు 1/10 ఇవ్వడం ఒక పద్ధతి అయితే మొత్తం పంటలో ఇరవయ్యోవంతు అంటే అర్థఉష్ర్ (1/20) ఇవ్వడం రెండవపద్ధతి.

## ఉష్ర్

కృత్రిమంగా ఎలాంటి నీటిపారుదల లేకుండా కేవలం వర్షాధారమైన పంటైతే, ఉదాహరణకు సజ్జ, జొన్న, కంది మరియు ఖరీఫ్ కాలపు ఇతర పంటలు లేదా నది ఒడ్డున పండిన పంట (అంటే వాగు వెల్లువ వల్ల పండిన పంట) లేక పండ్ల తోటల ఫలసాయం వగైరాలు. ఉదాహరణకు మామిడి, జామ, రేగు, ఖర్జూరం, కొబ్బరి వగైరాలు. వీటన్నింటిలో పదోవంతు (ఉష్ర్) తీయడం ఫర్జు. అంటే పది మణుగుల్లో ఒక మణుగు, ఒక మణుగు (పదిసేర్లు)లో ఒక సేరులేక పది ఫలాల్లో ఒకఫలం. లేక తోట ఎంత ధరకు అమ్ముడుపోతే ఆ ధరలో 1/10వ (అంటే వేయి రూపాయలైతే వంద రూపాయలు).

## అర్థ ఉష్ర్

ఒకవేళ ఈ పంటను నీటిపారుదల ద్వారా పండిస్తే ఉదాహరణకు బావి నుండి మోట ద్వారా, చెరువునుండి గూడవేసి, లేక ట్యూబ్‌వెల్ కాలువ ద్వారా నీటని తీసుకొని సేద్యం చేసో లేక తోటను సిస్తు చెల్లించి పండించిన సందర్భాలన్నింటిలోను ఇరవయ్యో వంతు (1/20) అంటే ఉష్ర్‌లో సగం ఇవ్వడం ఫర్జు. అంటే ఇరవై మణుగుల్లో ఒక మణుగు. ఇరవైశేర్లలో ఒక శేరు అన్నమాట. ఉదాహరణకు ఎక్కడైనా రబీ కాలంలో పండించిన ఓట్లు, గోధుమలు, బటాణీలు వగైరాలు నీటి పారుదలతో పండించబడితే లేక ఫలాలైనా, కూరగాయలైనా, పండ్లతోటలైనా నీరుకట్టపండిస్తే వాటన్నిటిలోను సగం ఉష్ర్ (అంటే 1/20వ వంతు).

ఎక్కడైతే రెండు విధాలుగా పంట పండించడం జరిగితే (అంటే నీటి పారుదల ద్వారా మరియు వర్షాధారంగాను) అవి మూడు రకాలు.

1. ఆ పంట ఎక్కువ భాగం నీటిపారుదల ద్వారా జరిగితే ఇరవయ్యే వంతు ఉష్ర్ (5శాతం) ఇవ్వాలి. ఉదాహరణకు రబీ పంట పండేచోట నీరు కట్టిన తరువాత వర్షం కురిస్తే అది లెక్కలోనికి తీసుకోబడదు. ఇరవయ్యో వంతు (1/20) ఇవ్వవలసిందే. అయితే ఇంకా నీరుకట్టలేదు. అంతలోనే వర్షం కురిసి ఆ వర్షంతోనే ఆ పంట పండితే ఇరవయ్యో భాగానికి బదులు పదవభాగం అంటే (10శాతం) ఉష్ర్ తీయాలి.

2. పంట అధిక భాగం వర్షం ద్వారా గాని వర్షం లేకుండా గాని పండడం, పంట కోసేటప్పుడో లేక పంట వేసేటప్పుడో ఒకటి లేక రెండు సార్లు నీరు కడితే దానికి 10వ వంతు ఇవ్వాలి. ఉదాహరణకు ఖరీఫ్ పంట నీరుకట్టి నాటడం జరిగింది. ఆ తరువాత వర్షంలోనే పెరిగింది. వర్షం ద్వారానే తయారైంది. కాని చివరకాలంలో ఒకసారి నీరు కట్టాము. ఈ సందర్భంలో దాని పదో వంతు ఇవ్వవలసిందే.

3. ఖరీఫ్ పంట వేసింది, పెరిగింది వర్షం ఆధారంగానే అయినా ఆ తరువాత రెండు మూడు మార్లు నీరు కట్టడం జరిగితే పదవ వంతుకు బదులు 20వ వంతు ఇవ్వవలసి ఉంటుంది.

## కొన్ని ముఖ్య గమనికలు

1. ఎంత పంటైతే పండుతుందో ఆ పంట మొత్తంపై ఉష్ర్ లేక అర్ధ ఉష్ర్ ఇవ్వడం వాజిబ్. అందులో నుండి వ్యవసాయానికి అయిన ఖర్చులు, అంటే అరక, దున్నడం, నీరుకట్టడం, కూలీలు, విత్తనాలు, వగైరా ఖర్చులు ఏమీ మినహాయింపబడవు. ఉదాహరణకు ఒకరి పొలంలో పది బస్తాల ధాన్యం అయితే అందులో అయిదు బస్తాలు ఖర్చుల క్రింద తీసి మిగతా అయిదు బస్తాలకు ఉష్ర్ కట్టడం భావ్యం కాదు. పంటమొత్తం పది బస్తాలకు ఉష్ర్ తీయవలసిందే.

2. ఎవరైనా ఉష్ర్ చెల్లించకుండా చనిపోతే అతని సొత్తు నుండి జకాత్ తీసుకోబడదు. అయితే అతడు మరణశాసనం చేస్తే అతని ఆస్తిలోని 3వ భాగం నుండి దాన్ని తీర్చవచ్చు. వారసులు దాన్ని చెల్లిస్తే అది ఉత్తమం.

3. ఏ పంటలోనైతే ఉష్ర్ తీయటం వాజిబో, దాన్ని ఉపయోగించకమునుపే ఉష్ర్‌ను తీయాలి. ఉష్ర్ తీయకుండా ఆ పంటను ఉపయోగిస్తే అది ధర్మసమ్మతం కాదు. అయితే ఉష్ర్ తీసే సంకల్పం ఉంటే ఉపయోగించుకోవడంలో తప్పులేదు. ఇస్లామీయ ప్రభుత్వం ఉన్నట్లైతే అతనినుండి జుర్మానా (పెనాల్టీ)గా ఉష్ర్ అంతధాన్యంగాని, దాని విలువగాని ప్రభుత్వం తీసుకుంటుంది.

4. ఎవరైన వ్యవసాయం చేయగలిగి లేక చేయించగలిగి ఉండి కూడా తన భూమిని బీడుగా ఉంచితే అతడు కూడా అందరిలాగా ఉష్ర్ తీసి చెల్లించాల్సిందే. అంటే భూమిలో మామూలుగా ఎంత పంట పండుతుందో దాని ఉష్ర్‌గాని, అర్ధఉష్ర్‌గాని చెల్లించాలి. షరతు, భూమిని బీడుగా ఉంచకుండా ఉండేందుకు విధించబడిన షరతు.

5. ఎవరైనా తన పంటను కోయకమునుపు లేక తోట పండ్లు కోయకమునుపే వాటిని అమ్మివేస్తే అవి రెండు విధాలు.

1. అతడు పంటను గాని పలాలను గాని పంటకు పూర్వమే అమ్మితే ఉష్ర్ చెల్లింపు బాధ్యత కొనగోలు చేసిన వానిపై ఉంటుంది. 2. రెండో విధం, పంట లేక పలసాయం పండి కోతకు వచ్చినపుడు అమ్మితే ఉష్ర్‌ను అమ్మేవాడు చెల్లించాలి.

6. ఏదైతే పండిందో దాన్నే ఉష్ర్‌లో ఇవ్వాలి. లేక దాని ధరనైనా ఇవ్వాలి. రెండు విధాలు సరైనవే.

7. ఎవరైనా తన ఇంట ఏదైనా చెట్టు నాటినా లేక తన పెరటిలో ఏదైనా కూర గాయలు పండించినా అలాంటివాటిలో ఉష్ర్‌లేదు.

8. పంట ఎలాంటిదో అలాంటిదే ఉష్ర్‌లో ఇవ్వాలి. ఓ చేలో మంచి ధాన్యం లేక ఓ చెట్టుకు మంచి ఫలాలు పండితే వాటిని ఇంటి ఉపయోగం కోసం ఉంచుకొని నాసిరకాన్ని ఉష్ర్‌లో ఇవ్వకూడదు. సాధ్యమైనంత మట్టుకు మేలైన దాన్నే ఇవ్వాలి. లేక మేలైన ధాన్యం నాశిరకం రెండు కలిపైనా ఇవ్వాలి.

## పశువుల జకాత్

పశువులు జకాత్ రెండు విధాలు. పల్లెల్లోని ప్రజలు పశువులు పెంచి వాటి పాడి త్రాగుతారు. నెయ్యి వగైరాలు ఉపయోగిస్తారు. అదే విధంగా వాటి పేడ పొలాల్లో వేస్తారు. ఇది మొదటి విధం.

మరోవిధం ఏమిటంటే పశువుల వల్ల పై ప్రయోజనాలున్నా, అవి కేవలం ఆ ధ్యేయం కోసమే పెంచబడవు. పశుగణాభివృద్ధికోసం, వ్యాపారం కోసం పెంచబడతాయి పశువుల వర్తకులు పెంచినట్లుగా. ఇది రెండో విధం.

ఈ రెండో విధమైన పెంపకానికి గల ఆదేశం వ్యాపార సామగ్రికి సంబంధించిన ఆదేశంలాంటిదే. వీటి విలువను కట్టి 1/40వ వంతు జకాత్ చెల్లించాలి. ఈ పశుగణం వ్యాపారం కోసం కాకుండా కేవలం పశుగణాభివృద్ధికోసం, స్వప్రయోజనం కోసం పెంచడం జరిగితే, వాటికి రెండు షరతులున్నాయి. ఆ షరతులే గనక ఉంటే వాటిపై జకాత్ వాజిబ్ అవుతుంది. లేకుంటే వాజిబ్ కాదు.

మొదటి షరతు, అవి 'సాయమా' అంటే సంవత్సరంలోని అధిక భాగం బీళ్లల్లోని మేత మేయడం లేక అడవి ఆకులు, గడ్డి మేసి జీవించేవి. ఎప్పుడో ఒకప్పుడు వాటికి మేత వేయడం మాత్రమే జరుగుతుంది.

రెండో షరతు, పాడికోసం, జాతిని అభివృద్ధి చేసి మరే ఇతర ప్రయోజనాలకోసం, కేవలం సరదాకోసం పెంచబడేవి అయి ఉండడం.

ఈ రెండు షరతులు పెట్టడం మూలంగా, స్వారీ కోసం లేక వ్యవసాయం కోసం, గుర్రపు బండి, ఎడ్లబండి వగైరాలకోసం, సామానులు మోయడం కోసం ఉపయోగపడే ఎడ్లు, గుర్రాలు, గాడిదలు వగైరాలపై జకాత్ వాజిబ్ కాదు.

ఇప్పుడు జకాత్ క్రిందకు వచ్చే పశువుల 'నిసాబ్' (పరిమితి) వేరు వేరుగా రాయ బడుతోంది. వీటికి పైన చెప్పిన రెండు షరతులు అన్వయిస్తే జకాత్ వాజిబ్ అవుతోంది. అన్వయించకపోతే వాజిబ్ కాదు.

## మేకల నిసాబ్

ఎవరి వద్దైనా ఒకటి లగాయతు ఇరవైతొమ్మిది వరకు మేకలుంటే వాటిపై జకాత్ వాజిబ్‌కాదు. నలభై పూర్తి అయితే వాటి నిసాబ్ పూర్తి అయినట్లు, అతడు జకాత్ చెల్లించాలి.

మేకల జకాత్‌కు సంబంధించిన వివరణ ఈ క్రింది విధంగా ఉంది.

| జకాత్ ఫర్జు అయిన సంఖ్య | జకాత్ వివరం |
|---|---|
| 1 నుండి 39వరకు | జకాత్‌లేదు |
| 40 నుండి 120 వరకు | ఒకమేక |
| 121 నుండి 200 వరకు | రెండు మేకలు |
| 201 నుండి 399వరకు | మూడు మేకలు |
| 400 పూర్తి అయితే | నాల్గుమేకలు |
| 400 కంటే అధికమైతే | ప్రతి 100కు ఒక మేక |

దుంబా, గొర్రెలకు

'దుంబా' మరియు గొర్రెలకు ఇవ్వవలసిన జకాత్ కూడా మేకలకు చెల్లించవలసిన జకాత్ లాంటిదే. ఎవరి వద్దైనా 40 మేకలు, 40 గొర్రెలు ఉంటే వాటి జకాత్ వేరువేరుగా చెల్లించాలి. అయితే పాతిక మేకలు, పాతిక గొర్రెలుంటే 50 మేకలకు సరిపడు జకాత్ ఇవ్వాలి. ఈ రెండు జాతులకు నిసాబ్ పూర్తి కాలేదు కదా అని అనుకోవడానికి వీల్లేదు.

2. గొర్రెలు, మేకల జకాత్‌లో ఆడా మగా అనే షరతు ఏదీలేదు. రెంటిపైనా జకాత్ తీయవలసిందే. కాని ఒక సంవత్సరం వయసుకంటే తక్కువగా ఉన్న పిల్లలపై జకాత్

వాజిబ్ కాదు. అయితే రెండు రకాలు కలగలిసి ఉంటే ఆ రెంటి మొత్తంపై జకాత్ వాజిబ్ అవుతుంది. (దుర్రె ముఖ్తార్-మేకల జకాత్ అధ్యాయం)

## ఆవు, గేదెల నిసాబ్

| జకాత్ వాజిబ్ అయ్యేసంఖ్య | జకాత్ వివరం |
|---|---|
| 1 నుండి 29వరకు | జకాత్ ఏదీ లేదు. |
| 30 అయితే | ఒక సంవత్సరపు దూడ లేక దాని ఖరీదు. |
| 40 అయితే | రెండేళ్ల దూడ లేక దాని ఖరీదు. |
| 60 అయితే | ఒక సం॥ రెండు దూడలు లేక వాటి ఖరీదు. |
| 70 అయితే | ఒకటి ఒక సం॥పు దూడ మరొకటి రెండు సం॥ల దూడ లేక వాటి ఖరీదు. |
| 80 అయితే | రెండేళ్ళ వయసుగల రెండు దూడలు లేక వాటి ఖరీదు. |
| 90 అయితే | ఒక సంవత్సరపు 3 దూడలు లేక వాటి ఖరీదు. |
| 100 అయితే | ఒక సం॥రెండు దూడలు మరియు రెండు సంవత్సరపు ఒకదూడ లేక వాటి ఖరీదు. |

**ముఖ్య గమనిక:**

1. ఇలాగే సంఖ్య ఎంత పెరుగుతూ పోతే వాటి జకాత్‌కూడా పెరుగుతుంది. ఈ జకాత్ చెల్లించేందుకు సులువైన మార్గం ఏమిటంటే 30 మరియు 40ను ప్రమాణంగా చేసుకోవాలి. 60కంటే అధికంగా ఉండే సంఖ్యలో 30,40 సంఖ్య ప్రకారం జకాత్ చెల్లించాలి. ఉదాహరణకు 70లో ఒక సంవత్సరపు దూడ. ఇది 30 పశువుల జకాత్. రెండేళ్ళ దూడ 40 పశువుల జకాత్. ఇదే విధంగా ఎన్ని ముప్పైలు లేక నలభైలైతే అన్నే ఒక సంవత్సరం లేక రెండు సంవత్సరాల దూడలు పెరుగుతూ పోతాయి. ఉదాహరణకు 120 ఉన్నాయనుకోండి. వీటిలో 4 దూడలు ఒక సంవత్సరపు వయస్సు కలిగినవి లేక రెండు సంవత్సరాలవి మూడు దూడలు ఇవ్వవలసి ఉంటుంది. రెండు పద్ధతులూ ధర్మ సమ్మతమైనవే. పదిలోపు సంఖ్యపై జకాత్ ఉండదు. ఉదాహరణకు 40 మరియు 60, 60 మరియు 70కి నడుమ గల సంఖ్య 5,7,9లకు సంబంధించిన సంఖ్య ఇందులో జకాత్ లేదు. కేవలం 40, 60 లేక 70కి మాత్రమే జకాత్ ఇవ్వాలి.

2. ఆవులు, గేదెల్లో దేనికి అదే నిసాబ్ పూర్తి కాకపోయినా రెంటిని కలిపినప్పుడు నిసాబ్ పూర్తైతే కలిపి జకాత్ ఇవ్వాలి.

## జకాత్ చెల్లించే విధానం, ముఖ్య ఆదేశాలు!

1. డబ్బు, వ్యాపార సామగ్రి లేక పశువులు అయితే వాటిపై సంవత్సరం పూర్తి కాగానే జకాత్ తీయడం ఫర్జు. అదే ధాన్యం అయితే పంటమార్పిడి కావడంతోటే 'ఉష్ర్' తీసి పంచడం ఫర్జు. కానిపక్షంలో అది పాపం. ఎవరైనా సంవత్సరం పూర్తికాకమునుపే జకాత్ చెల్లించినా జకాత్ చెల్లింపు నెరవేరినట్లే. లేక రెండు సంవత్సరాల జకాత్ కలిపి ఇచ్చినా నెరవేరుతోంది. కాని మొదటే చెల్లించడంలో గల షరతు ఏమిటంటే చెల్లించిన తరువాత ఆ గడువుకులోపు ఏదైనా వ్యాపార సామగ్రి వచ్చినా డబ్బు గనకా వస్తే దాని జకాత్ వేరుగా తీసి చెల్లించాలి.

2. జకాత్ చంద్రమాన మాసం నుండే చెల్లించనారంభించాలి. లెక్కల్లో చిక్కువచ్చి నట్లనిపిస్తే ఆ చెల్లింపును క్రీస్తు శక సంవత్సరం ప్రకారం కూడా చెల్లించవచ్చు. అయితే అలాంటప్పుడు కొంత డబ్బు ఎక్కువగా తీయడం మంచిది. కారణం జకాత్ చంద్రమాన నెలల ప్రకారం చెల్లించడం ఫర్జు. చంద్రమాన సంవత్సరం కొంత చిన్నది కనుక.

3. ఉష్ర్‌గాని, జకాత్‌గాని తీసేటప్పుడు, ఫలానా ధనం నేను దైవం కోసం ఉష్ర్ గానో, జకాత్‌గానో తీస్తున్నాననే సంకల్పం ముఖ్యం.

4. జకాత్ డబ్బు లేక ధాన్యం వెంటనే ఖర్చు పెట్టేయడం అంత ముఖ్యం ఏమీకాదు. ఒకవేళ ఎవరైనా జకాత్ లేక ఉష్ర్ సంకల్పంతో ధనాన్నిగాని, ధాన్యాన్నిగాని తీసిప్రక్కన బెట్టేసి సంవత్సరం మొత్తంలో కొద్ది కొద్దిగా పేదలపై ఖర్చు పెడదామనుకుంటే అది ధర్మ సమ్మతమైనదే.

5. జకాత్ చెల్లించేవాడు, ఎవరైనా వచ్చి జకాత్‌ను అర్థించిన తరువాతే దాన్ని చెల్లిద్దాం అని ఎదురు చూడ్డం తగదు. అతడు అగత్యపరులను వెదికి వారికి జకాత్ చెల్లించాల్సిందే.

6. సదఖా, దానం వగైరాలు ఎవరికి కనబడకుండా రహస్యంగా ఇవ్వడమే మేలైనది. అయితే ఇతరులు చూస్తూ ఉండగా ఇవ్వడం కూడా ధర్మ సమ్మతమే. దివ్య ఖుర్ఆన్‌లో రెండు విధాలను అవలంభించే అనుమతి ఉంది. ధర్మవేత్తలు ఫర్జు ఆరాధనలు అందరికి కనబడేటట్లు ప్రస్ఫుటంగా చేయడం, అదే నఫిల్ అయితే ఎవరికి కనబడకుండా రహస్యంగా చేయడం ఉత్తమమని రాశారు. కాబట్టి జకాత్ చెల్లింపు అందరూ కనబడేటట్లు

చేయడం సబబే. అయితే జకాత్ ఎవరికైతే ఇవ్వడం జరుగుతోందో అతని పేరును కూడా ప్రకటించడం అని కాదు దీని ఉద్దేశ్యం. ఈ విషయంలో దైవప్రవక్త ప్రవచనాలన్నీ కూడా దృష్టిలో ఉంచుకోవడం ముఖ్యం. ఆ ప్రవచనం ప్రకారం "కుడిచేతితో దానం చేస్తే ఎడమ చేతికి కూడా తెలియకుండా ఉండాలి" అన్నదే.

7. ఆగత్యపరునికి జకాత్ చెల్లిస్తే లేక ఉష్రను ఇస్తే, అతనికి ఇది జకాత్ అనిగాని, ఉష్ర్ అనిగాని చెప్పి ఇవ్వనవసరం లేదు. ఇలా చెప్పి ఇవ్వడంలో అతని మనస్సు నొచ్చుకుంటుందని తెలిస్తే చెప్పకుండానే చెల్లించడం ఉత్తమం. ముఖ్యంగా తమ దగ్గరి బంధువులకు, మిత్రులకు చెప్పకుండానే చెల్లించాలి.

8. జకాత్‌లో నగదు డబ్బైనా ఇవ్వవచ్చు లేక ఏదైని వస్తువు, ఉదాహరణకు వస్త్రాలు, ధాన్యం లేక పేద విద్యార్థులైతే పుస్తకాలు వగైరా కొని ఇవ్వవచ్చు.

9. మీపై వాజిబ్ అయినా జకాత్ మొత్తం ఏకంగా ఒకే వ్యక్తికి ఇవ్వకూడదు. అయితే ఒకరి అప్పుతీర్చడానికి ఆ ధనమంతా ఇస్తే తప్పులేదు. లేక అతనికి పిల్లలు చాలా మంది ఉంటే ఇది చందా అని చెప్పికూడా ఇవ్వవచ్చు.

10. ఎవరికైనా జకాత్ ధనాన్ని ఇది ఇనాము అని చెప్పిగాని, నీకు ధారాదత్తం చేస్తున్నాననిగాని ఇచ్చి మనస్సులో జకాత్ సంకల్పం చేసుకుంటే జకాత్ చెల్లింపు నెరవేరుతుంది. ఉదాహరణకు పేద నౌకర్ల పిల్లలకు ఈదీ (పండుగనాడిచ్చే ఇనాము) లేక ఇనాముల పేరున ఇచ్చేసి జకాత్ నియ్యత్ చేసుకుంటే జకాత్ నెరవేరుతుంది. అయితే నౌకర్ల జీతభత్యాల్లో నుండి దాన్ని లెక్కించడం జరగకూడదు. ఇదే విధంగా తమ నిరుపేద బంధుమిత్రుల పిల్లలకు కూడా ఇనామ్, ఈదీ పేర జకాత్ ధనాన్ని, ధాన్యాన్ని ఇవ్వవచ్చు.

అయితే మరీ చిన్న పిల్లలు, అమాయకులైన వారికి ఇవ్వకూడదు. ప్రాజ్ఞతగల వారికి, డబ్బువిలువ ఏమిటో తెలిసినవారికి ఇవ్వవచ్చు.

11. జకాత్ ఇచ్చే వాడికి ఎవరైనా అప్పుబడి (రుణగ్రస్తునిగా) ఉండి, ఆ రుణ గ్రస్తుడే జకాత్ పొందడానికి అర్హుడు కూడా అయి ఉంటే జకాత్ ధనం క్రింద ఆ అప్పు మాఫీ చేయవీలు లేదు. అప్పును మాత్రమే మాఫీ చేయవచ్చు.

(దుర్రె ముఖ్తార్ సంపుటి 1 పుట 130)

12. జకాత్‌గాని ఉష్ర్‌గాని తనే స్వంతంగా ఇవ్వక దాన్ని మధ్యవర్తి ద్వారా అర్హులైన వారికి అందించినా సరిపోతుంది. అది ధర్మసమ్మతమే.

13. జకాత్ డబ్బును, ఉష్ర్ ధనాన్ని ప్రక్కన పెట్టడం కంటే చెల్లించడమే ఉత్తమం.

కాని లెక్కించి డబ్బుగాని, ధాన్యంగాని తీసి ప్రక్కన పెట్టే సంకల్పం మాత్రమే చేసి వాటిని తీయకుండా అందులోనే ఉంచి అవసరం వచ్చినప్పుడు తీసి ఇవ్వవచ్చులే అని అనుకున్నా అదీ ధర్మ సమ్మతమే. అయితే ఎలాంటి కారణం లేకుండా అలా చేయడానికి వీలులేదు. ఎందుకంటే ఆ తరువాత దురాశకు లోనైపోవడం కాని ఇంటి ఖర్చుల్లో అదికూడా ఖర్చయి పోవడంగాని జరిగితే హరాం (నిషిద్ధమైన దాన్ని) తిని పెద్ద పాపానికి ఒడిగట్టిన వాడవుతాడు.

14. ఏదైనా సొమ్ము ఉమ్మడి సొమ్మై అది జకాత్ పరిమితికి వస్తే దానిపై జకాత్ వాజిబ్ కాదు. ప్రతి భాగస్వామికి సంబంధించిన భాగాన్ని వేరుపర్చి చూడాల్సివస్తుంది, అందులో జకాత్ వాజిబ్ అవుతుందా లేదా అని. వేరువేరు రుణాలపై జకాత్ వాజిబ్ అయితే ఆ భాగస్వాములు స్వంతంగా జకాత్ చెల్లించాలి.

15. ఒకరి వద్ద హరాం (నిషిద్ధ) మార్గాల ద్వారా అంటే లంచం, వడ్డీ (ఈ వడ్డీ బ్యాంక్ వడ్డీ అయినా, స్వతహాగా వడ్డీ వ్యాపారం చేసినా) వగైరాలతో ధనం కూడపెడితే. నిషిద్ధమార్గాల ద్వారా సంపాదించడం ఘోరమైన పాపం. అలాంటి ధనంతో ఎలాంటి ఆరాధన నెరవేరదు-అందుకని జకాత్ వాజిబ్ అవదు. అయితే ఆ హరాం సొత్తుతో కొంత హలాల్ (ధర్మసమ్మతమైన) సొమ్ము చేరిఉంటే రెంటి జకాత్ తీయవలసిందే. అయితే అతని వద్ద మాత్రం ఉన్నదాంతో హరాం మార్గాల ద్వారా సంపాదించిందే అయితే ఆ ధనాన్నంతా ఎలాంటి పుణ్య ఫలాపేక్ష లేకుండా దానం చేయాల్సిందే.

16. ఇస్లామీయ ప్రభుత్వంలో జకాత్ ఎగ్గొట్టే వారికి జైలు శిక్ష వేయబడుతుంది. వారి ధనాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది. అతని నుండి జకాత్ వసూలు చేయబడుతుంది.

17. జకాత్ ఇచ్చే సంకల్పం ఉండి ఆ తరువాత అతడు మరణిస్తే అతని తరకా (మృతుడు వదిలివెళ్ళిన ఆస్తి)లోని 1/3వ వంతు నుండి జకాత్ వసూలు చేయబడుతుంది.

## అప్పుగా ఇచ్చిన డబ్బుపై జకాత్

ఎవరిపైన్నయితే జకాత్ వాజిబ్ అయిందో ఆ వ్యక్తి అదే డబ్బును ఎవరికైనా అప్పుగా ఇస్తే ఆ అప్పుగా ఇవ్వబడిన డబ్బుకు సంబంధించిన జకాత్‌ను కూడా అతడే చెల్లించాలి. అదేవిధంగా అతడు ఏదైనా వస్తువును అమ్మితే ఆ ధర ఇంకా కొన్నవాడు అతనికి చెల్లించకపోయినా దాని జకాత్ అమ్మినవాడు చెల్లించాల్సిందే. అప్పుగా లేక అరువుగా ఇచ్చిన డబ్బు మూడు విధాలు.

1. ఎవరికైనా డబ్బు అప్పుగా ఇచ్చినా లేక ఏదేని వస్తువు అమ్మగా ఆ ధర ఇంకా తన దగ్గరికి చేరకపోయినా ఆ డబ్బుకు సంబంధించిన జకాత్ తిరిగి ఆ డబ్బు తన చేతికి వచ్చినప్పుడు చెల్లించాలి, అయితే ఆ డబ్బు చేతికి రావడమన్నది రెండు విధాలుగా ఉంటుంది. అనేక సంవత్సరాల డబ్బు అంటే సాంవత్సరిక వాయిదాలు ఒకేసారి వసూలు అయితే రుణగ్రస్తుని వద్ద ఉన్న సంవత్సరాలన్నింటికి జకాత్ కట్టి ఇవ్వవలసి ఉంటుంది అన్నది ఒకటి. మరోవిధం ఏమిటంటే ఎంత వసూలు అవుతూ పోతుంటే దానికి తగ్గట్టు జకాత్ చెల్లిస్తూ పోవడం. అయితే వసూలు చేయబడే డబ్బు జకాత్ పరిమితి (నిసాబ్)కి 1/5 వంతు కంటే తగ్గినట్లయితే జకాత్ వాజిబ్‌కాదు. ఉదాహరణకు మూడు వందల రూపాయలు వసూలైతే ఆ మూడొందల రూపాయల జకాత్ చెల్లించాలి. ఆ తరువాత వసూలు అయినప్పుడల్లా చెల్లిస్తూపోవాలి. దీన్నే ఫిక్హా (ధార్మిక) భాషలో 'దైనెకవీ' అని అంటారు.

2. అప్పుకు మరోరూపం ఏదంటే జకాత్ లేనటువంటి వస్తువులు ఉదాహరణకు ఇల్లు, ఫర్నిచర్, తొడిగే వస్త్రాలు, వాహనం, వ్యవసాయానికి పనికివచ్చు ఎద్లు వగైరాలు అమ్మగా వాటి ధర ఇంకా తన చేతికి రాకపోవడం. ఈ ధనం జకాత్ వాజిబ్ అయ్యేటంత పరిమితి అంటే 52 1/2 తులాల వెండి విలువకు సమానం అయితే ఈ ధర తన చేతికి అందగానే జకాత్ చెల్లించాలి. ఆ డబ్బు ఒకేసారి వసూలు కాకపోతే జకాత్ వాజిబ్ అవదు. ఒకవేళ ఆ డబ్బు 52 1/2 తులాల వెండి విలువకంటే అధికం అయ్యిఆ ధనం ఎన్నో సంవత్సరాల తరువాత వసూలు అయినా ఆ సంవత్సరాలన్నిటిపైనా వాజిబ్ అవుతుంది. ఇలాంటి అప్పును 'దైనె ముతవస్సిత్' అని అంటారు.

3. మూడో రూపం, సామానుకు బదులుగాని, డబ్బుకు బదులు కానిది. అయితే అది లభిస్తుందనే ఆశ గలది. ఉదాహరణకు స్త్రీల మెహ్ర్, ఇనాము డబ్బులాంటిది. అది చేతికి వచ్చిన తరువాత ఒక సంవత్సరం గడిస్తే గాని దానిపై జకాత్ వాజిబ్‌గాదు. దీన్ని 'దైనె జయీఫ్' అంటారు. ఈ దైనె ఖవీ, దైనె ముతవస్సిత్ ఇంకా దైనె జయీఫ్‌ల గురించి రెండు విషయాలు తెలుసుకోవడం ముఖ్యం.

అప్పుఇచ్చే వాడి దగ్గర మరో ఇతర ధనం దేనిపైనైతే జకాత్ వాజిబ్ అవుతుందో, ఉండకుండా ఉండాలి. ఒకవేళ అప్పుఇచ్చిన తరువాత కూడా అతని దగ్గర డబ్బు మిగిలి ఉంటే మాత్రం, అప్పు ఇచ్చిన ధనం తక్కువ వసూలు అయినా ఎక్కువ వసూలైనా ఆ డబ్బంతటికి జకాత్ ఇవ్వవలసి ఉంటుంది.

మరో విషయం ఏమిటంటే ప్రారంభం నుండే అతని దగ్గర జకాత్ పరిమితికి సరిపోయే డబ్బు ఉంది. దాన్నిసంవత్సరం పూర్తిగా గడవకమునుపే అప్పుకు సంబంధించిన డబ్బు చేతికి వస్తే దాన్ని కూడా ముందు తన దగ్గర ఉన్న డబ్బులోనే జమ అయింది అనుకోవాలి. అయితే తన వద్ద జకాత్ వాజిబ్ అయ్యేంత ధనం ఏదీ లేకపోతే వసూలు అయిన తరువాత అది నిసాబ్ పరిమితికి చేరితే గడిచిన సంవత్సరాలకు సైతం జకాత్ చెల్లించాలి. నిసాబ్‌కు సమానమైన ధనం వసూలు కాకపోతే జకాత్ వాజిబ్ కాదు.

4. మూడోరూపం, ఇతరులకైతే అప్పిచ్చి ఉన్నాడు. కాని అది తన చేతికి వచ్చే నమ్మకం మాత్రం లేకపోవడం. ఆ తరువాత అనుకోకుండా వసూలైతే ఆ గడిచిన కాలాన్నంతటికి కలిపి జకాత్ చెల్లించాలి. దీన్ని 'మాలె జిమార్' అంటారు.

## ప్రావిడెంట్ ఫండ్

ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయుల ఏ డబ్బైతే ప్రావిడెంట్ ఫండ్ (ప్రఆఓ) నిసాబ్ పరిమితికి చేరుతుందో దానిపై కూడా ప్రతి సంవత్సరం జకాత్ వాజిబ్ అవుతుంది. సంవత్సరాంతానికి లెక్కచూసి దాని జకాత్ ప్రతి సంవత్సరం చెల్లిస్తూ ఉండాలి. ప్రస్తుతానికి అది చేతికి అందకపోయినా అది వారి సొత్తే. ఎవరైనా ఉద్యోగం వదిలేసినా, రిటైరైనా అతనికి అందేదే. లేక చనిపోయినా అతని వారసులకైనా అందుతుంది. ఆ డబ్బు చేతికి అందిన తరువాత ఒకేసారి అన్ని సంవత్సరాలను కలిపి జకాత్ చెల్లించినా సరిపోతుంది.

బ్యాంకుల్లో జమ చేసిన డబ్బు లేక ఫిక్స్‌డ్ డిపాజిట్లు ఎవరైనా బ్యాంకుల్లో డబ్బు జమ చేసినా అతడు ఆ డబ్బుకు యజమానే. ఆ సమయంలో అది తన చేతిలో లేకపోవచ్చు అయినా ఆ డబ్బును ఖర్చు చేసే హక్కు అతనికుంది. కాబట్టి ఆ డబ్బుపై జకాత్ వాజిబ్ అవుతుంది. ఇదే విధంగా ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో జమ చేసిన డబ్బుకు కూడా జకాత్ వాజిబ్ అవుతుంది. దాన్ని వారు తమ ఇష్టప్రకారం డిపాజిట్ చేశారు కాబట్టి.

ప్రావిడెంట్ ఫండ్‌లో ప్రభుత్వం రికవరీ చేసే డబ్బు గురించి ధర్మవేత్తల్లో భేదాభిప్రాయం ఉంది గాని తమ ఇష్టప్రకారం జమ చేసే డబ్బుపై జకాత్ వాజిబ్ అవడాన్ని ధర్మవేత్తలందరు అంగీకరించారు. ఇది ఎలాగంటే మనం మన ఇష్టప్రకారం ఎవరికైనా అప్పుగా ఇస్తాం, ఎవరివద్దయినా అమానతుగా ఉంచుతాం. అయినా ఆ డబ్బు మనచేతిలో ఉండకపోయినా మనం జకాత్ చెల్లిస్తాం.

ఈ జమ అయిన డబ్బుపై బ్యాంకులు ఏ వడ్డీ అయితే కట్టి ఇస్తాయో దానిపై జకాత్ లేదు. అది హరాం సొత్తు. దాన్ని మీరు ప్రతి సంవత్సరం తీసో, లేక అది ఎప్పుడూ మీ

చేతికి అందుతుందో అప్పుడు ఆగత్యపరులకు, అవసరం ఏర్పడ్డ వారికి పుణ్యఫలాన్ని ఆశించకుండా ఇవ్వవచ్చు. లేక ఆ ధనంతో ఊరువాడలోని అపరిశుభ్రతను దూరం చేయించవచ్చు. సొంత అవసరాలకు మాత్రం ఉపయోగించవీల్లేదు. సామాజికమైన పనుల్లో ఉపయోగిస్తే, ఇది వడ్డీ ధనం అని తెలియజేయాల్సి ఉంటుంది.

## భార్య మహర్

భార్యకు చెల్లించవలసి ఉన్న మహర్ ధనం భర్తపై ఉన్న ఓ రుణభారమే. వెంటనే ఇచ్చేసే సంకల్పం ఉంటే మాత్రం ఆ మెహ్ర డబ్బుపై జకాత్‌లేదు. అయితే సర్వ సాధారణంగా భర్త భార్య మెహ్ర చెల్లించడాన్ని వాయిదా వేయడం పరిపాటి అయి పోయింది ఈ కాలంలో, చివరకు ఆ భార్యే ఆ ధనాన్ని మాఫీ కూడా చేస్తోంది. ఇలాంటి సందర్భాలలో మాత్రం మహర్ ధనానికి జకాత్‌నివ్వడం వాజిబ్ అవుతుంది. (ఫత్వా ఆలంగీరి)

ప్రాజ్ఞతకు చేరని బాలబాలికలకు జకాత్ లేదు. ఎందుకంటే జకాత్ షరతుల్లో ప్రాజ్ఞతకు చేరడం, వివేకి అయి ఉండడం కూడా ఉన్నాయి. వారి డబ్బుకు జకాత్ లేదు. (హదాయా) అయితే ఇమామ్ మాలిక్, ఇమామ్ షాఫయీ, ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై) బాలురిపై జకాత్ వాజిబ్‌కాదు కాని వారి సొత్తుపై మాత్రం జకాత్ ఉందని, దాన్ని వారి సంరక్షకుడు తీసి చెల్లించాలని అంటారు.

ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) కూడా, సొంత ఖర్చులక్రింద, ఇతరుల హక్కుల్ని తీర్చినట్లుగానే ఆ సొమ్ము నుండి జకాత్ తీసి చెల్లించాలని అంటారు.

## నిధినిక్షేపాల జకాత్

భూమి నుండి బయటబడేది, లేక త్రవ్వితీసేవి నిధినిక్షేపాలు. ఇవి మూడు విధాలు: 1. మాదన్, 2.రుక్కాజ్, 3. కన్జ. 'కన్జ' అంటే మనిషి దాన్ని ఎప్పుడో ఒకప్పుడు పాతి పెడితే బయటబడేది, 'మాదక్' అంటే అల్లాహ్ భూగర్భంలో దాగిఉన్న ఖనిజసంపద. ఇక 'రుక్కాజ్' అంటే భూమినుండి వెలువడేవీ, ఎవర్కైనా లభించేవి. ఇవి రెండు రకాలు: ఒకటి ఘనపదార్థం, రెండోది ద్రవపదార్థం, తిరిగి ఘన పదార్థాల్లోను రెండు రకాలు: ఒకటి కరిగించి వంచడానికి పనికి వచ్చేవి. వాటి పై ముద్రకూడా పడేవి. ఉదాహరణకు బంగారం, వెండి, ఇనుము, సీసం, తగరం, రాగి, ఇత్తడి వగైరాలు. రెండోది కరిగించి గాని మరే విధంగా ముద్ర వేయడానికి పనికిరానివి. ఉదాహరణకు సున్నము, సుర్మా, ఉప్పు, వివిధ రకాల రాళ్ళు, రత్నాలు వగైరా.

## ద్రవపదార్థాల్లో పెట్రోలు, కిరసనాయిలు, తార్కోల్ వగైరా

ఈ పైవస్తువుల జకాత్‌లో పుఖహా (ధర్మవేత్తలు)లో భేదాభిప్రాయం ఉంది. హజ్రత్ అబూహనీఫా (రహ్మాలై) మొదటి రకం మాదన్ మరియు రుక్కాజ్‌ల్లో 'ఖమ్స్' (1/5) మాత్రమే ఉంటుంది. మిగిలిన 'కన్జ్'కు ఏమీ ఉండదు అంటారు.

ఇమామ్ షాఫయీ (రహ్మాలై) ఇమామ్ అహ్మద్, ఇమామ్‌మాలిక్ (రహ్మాలై) 'మదన్', రుక్కాజ్‌లో తేడా ఉంది అంటారు. కాబట్టి రుక్కాజ్‌కు ఇరవైశాతం అంటే 'ఖమ్స్' ఉంది, మాదన్ ఇంకా ఇతర డబ్బుకు 2 1/2 శాతమే జకాత్ ఉంది అంటారు. వాటిపై సంవత్సరం పూర్తిగా గడవాలి అన్న షరతు ఏదీలేదని, అవి లభించినతోడనే దాన్నుండి జకాత్ తీసి చెల్లించాలని పుఖహాలందరూ ఒప్పుకుంటారు. ఖమ్స్‌గాని జకాత్‌గాని తీయగా మిగిలిందంతా అతని సొత్తే.

ఇక ఈ జకాత్ ధనాన్ని ఎలా ఖర్చు చేయాలా అన్న దానికి ఇమామ్ అబూహనీఫా, ఇమామ్ మాలిక్ (రహ్మాలై)లు యుద్ధధనం (మాలె గనీమత్) ఎలా ఖర్చు పెట్టాలో అలా ఖర్చు పెట్టాలంటారు. అంటే సమాజ సంక్షేమ కార్యకలాపాల్లో వాటిని ఖర్చు పెట్టాలి. ఇది ప్రభుత్వం ద్వారా జరగాలి అంటారు వారు. ఇక ఇమామ్ షాఫయీ (రహ్మాలై) మాత్రం జకాత్ ఎలా ఖర్చు చేస్తామో అలా ఖర్చు చేయాలి అంటారు.

## తేనెకు సంబంధించిన జకాత్

అనేక హదీసుల్లో తేనెపై జకాత్ ఉందని ఉంది. అందుకే ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై) లు తేనె నుండి జకాత్ తీయాలంటారు. హజ్రత్ అబూ సయ్యారతల్ ముత్‌యీ (రఅన్), దైవ ప్రవక్త (సఅసం) సన్నిధికి వెళ్ళి దైవ ప్రవక్తా! నా దగ్గర తేనె తుట్టెలున్నాయి అని విన్నవించుకోగా "దానిపై ఉష్ర్‌చెల్లించు" అన్నారు.

అదే విధంగా ఉమర్‌బిన్ షు అయిబ్, తన తండ్రి ద్వారా ఆయన తండ్రి, ఆయన తండ్రి ద్వారా దైవ ప్రవక్త (సఅసం) తేనెపై ఉష్ర్ తీసుకున్నారు అని చెప్పగా విన్నారు. అయితే ఇతర ఇమామ్‌లు ముహద్దిస్‌లు ఇవి 'జయీఫ్' (బలహీనమైన) హదీసులు కాబట్టి తేనెపై జకాత్ వాజిబ్ కాదు అంటారు. అయితే ఇమామ్ అబూహనీఫా మాత్రం ఇతర వ్యవసాయ పంటల్లాగే ఇది కూడా వ్యవసాయ సంబంధమైనదే, దీన్ని తూచి ఇవ్వడం కూడా జరుగుతుంది, దాన్ని నిలువ ఉంచవచ్చు అందుకే ఉష్ర్ వసూలు చేయబడుతుంది అంటారు. (హదాయా సంపు-1 పుట 182)

## భూమినుండి వెడలే ద్రవపదార్థాలు

భూగర్భం నుండి బయటకు వచ్చే కిరసనాయిలు, పెట్రోలు, తార్‌కోల్ లాంటి ద్రవ పదార్థాలు, గంధకం, రత్నాలు వగైరాలకు ఉష్ర్ లేదని అంటారు. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై). అయితే ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై) ఉష్ర్ లేదు గాని జకాత్ మాత్రం ఉంది అంటారు. అంటే రెండున్నర శాతం. వీరు దివ్య ఖుర్‌ఆన్ "వమిమ్మా అఖ్రజ్నాలకుమ్ మినల్ అర్ద్" (మీ కోసం మేము భూమి నుండి బయట పెట్టిన వాటి నుండి ఖర్చు చేయండి) అనే వాక్యాన్ని ఆధారంగా చేసుకొని చెప్పిన మాటలివి. ప్రస్తుతం పెట్రోలు వగైరాలు ద్రవ బంగారం లాంటివి కాబట్టి ఇమామ్ అహ్మద్‌గారి మస్‌లక్ ప్రకారం జకాత్ తీయవలసిందే.

## సముద్రం నుండి బయటకువచ్చే ముత్యాలు, పగడాలు వగైరాలు

సముద్రగర్భం నుండి బయటకు తీసే ముత్యాలు, పగడాలు లాంటి విలువైన వస్తువుల గురించి ఇమామ్ అబూహనీఫా జకాత్ గాని, ఉష్ర్ గాని లేదంటారు. అదే ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్, ఇమామ్ అబూయూసుఫ్ ఇందులో ఖమ్స్ ఉంది అంటారు (ఇరవైశాతం). అంటే 1/5 జకాత్‌గా తీయాలి. మిగతా 4/5 సొంత దారుడిదే. దీనికి వీరు కొన్ని ఆధారాల్ని కూడా చూయిస్తారు.

## జకాత్ పొందే హక్కుదారులు

దివ్య ఖుర్‌ఆన్‌లోను, ప్రవక్త ప్రవచనాల్లోను జకాత్ చెల్లించకున్న తాకీదు ఎలా ఇవ్వడం జరిగిందో అలానే ఉష్ర్ జకాత్ చెల్లించే తీరుకూడా చూపడం జరిగింది. అదే విధంగా జకాత్ ఎలాంటి వారికి చెల్లించాలో ఏఏ వ్యక్తులకు ఇవ్వకూడదో కూడా విశదంగా చెప్పడం జరిగింది. దివ్య ఖుర్‌ఆన్ ఎనిమిది రకాల వ్యక్తులను హక్కు దారులుగా ఖరారు చేసింది. అంటే జకాత్ సొమ్ముకు ఈ క్రిందనీయబడిన ఎనిమిది మంది అర్హులు అని.

إِنَّمَا الصَّدَقَٰتُ لِلْفُقَرَآءِ وَالْمَسَٰكِينِ وَالْعَٰمِلِينَ عَلَيْهَا وَالْمُؤَلَّفَةِ قُلُوبُهُمْ وَفِى

"ఈ సదఖాత్ అయితే అసలు లేమితో బాధపడేవారు మరియు నిరు పేదల కొరకు, సదఖాత్ వ్యవహారాలకై నియుక్తులైన వారి కొరకు, ఎవరి హృదయాలనైతే గెలుచు కోవడం అవసరమో వారి కొరకు,

الرِّقَابِ وَالْغَارِمِينَ وَفِي سَبِيلِ اللَّهِ وَابْنِ السَّبِيلِ فَرِيضَةً مِنَ اللَّهِ وَاللَّهُ عَلِيمٌ حَكِيمٌ

బానిసల విమోచనానికి, రుణగ్రస్తుల సహాయానికి, దైవమార్గంలో బాట సారుల సహాయానికి వినియోగిం చాలి. ఇది అల్లాహ్ తరపున ఉన్నది. అల్లాహ్ అన్ని ఎరిగినవాడు, వివేక వంతుడు" (తౌబా **60**)

దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

"జకాత్ పంపకాన్ని దైవం, ఏ ప్రవక్తకు గాని, ప్రవక్తేతరునికిగాని వదలిపెట్టలేదు. సరికదా దాన్ని ఖర్చుబెట్టే విధానాన్ని స్వయంగా నిర్ణయించాడు" అని ప్రవచించారు. అంటే ఖుర్ఆన్ హదీసుల్లో జకాత్ మరియు ఉష్ర్ హక్కుదారులు ఎనమండుగురు. వీరి వివరణ ఇలా ఉంది:

'ఫుక్రా' ఇది ఫకీర్‌కు బహువచనం. ఫకీర్ అనేవాడు బొత్తిగా ఏమీ లేనివాడు కూడా కాడు. అయితే తన దగ్గర ఉన్న దాంతో భార్యాపిల్లల అవసరాలు కూడా తీర్చలేడు. ఇంకా తను స్వయంగా ఉష్ర్, జకాత్ చెల్లించేటంత ధనం ధాన్యం వగైరాలు లేనివాడు కూడా అయి ఉంటాడు. ఇంకా, కష్టబడి, కూలీనాలి చేస్తూ తమ భుక్తిని సంపాదించు కోగలరు కాని, ఏదో ఒక ధార్మిక సేవలో నిమగ్నులై ఉండడం వలన వారికి అలా కూలి చేసికొని పొట్టబోసుకొనే అవకాశం లభించని వారు. ఇలా వారూ, వారి భార్యాపిల్లలు అతి కష్టంగా తమ జీవనం వెళ్ళబుచ్చుతూ ఉంటారు. ఉదాహరణకు, దైవమార్గం వైపుకు పిలిచేవారు, ధార్మిక పాఠశాలల బోధకులు, ధార్మిక విద్యనభ్యసించే విద్యార్థులు (అంటే ఈ విద్యార్థుల తల్లిదండ్రులు కూడా నిరుపేదలై జకాత్ పొందడానికి అర్హులై ఉండాలి) వగైరాలు ఈ 'ఫుక్రా' కోవకు చెందినదే. సరికదా దివ్య ఖుర్ఆన్ ఈ 'ఫుక్రా' గురించి మరోచోట వివరణ ఇచ్చింది. వారి పరిస్థితులను చూసి స్వయంగా వారికి సహాయం చేయాలి. వాళ్ళే వచ్చి అడిగితేనే సహాయం చేద్దాం అని ఎదురు చూడకూడదు.

لِلْفُقَرَاءِ الَّذِينَ أُحْصِرُوا فِي سَبِيلِ اللَّهِ لَا يَسْتَطِيعُونَ ضَرْبًا فِي الْأَرْضِ يَحْسَبُهُمُ الْجَاهِلُ أَغْنِيَاءَ مِنَ التَّعَفُّفِ

"అల్లాహ్ మార్గంలో నిమగ్నమైన కారణంగా తమ జీవనోపాధి కొరకు భూమిపై తిరిగే అవకాశం లేక, లేమికి గురి అయినవారు ప్రత్యేకంగా ధన సహాయానికి అర్హులు, వారిని

تَعْرِفُهُمْ بِسِيمَاهُمْ لَا يَسْأَلُونَ النَّاسَ إِلْحَافًا

(بقره)

ఎరగని మనిషి వారి ఆత్మాభిమానం చూసి వారు భాగ్యవంతులని భావిస్తాడు, వారి ముఖాలను చూసి మీరు నిజస్థితిని గ్రహించగలరు. లోకుల వెంటపడి సహాయం చేయమని బ్రతిమాలే మనుషులు కారు వారు. మీరు వారికి సహాయార్థం ఏమి ఖర్చు చేసినా, అది అల్లాహ్‌కు తెలియకుండా ఉండదు" (అల్‌బకరా - **273**)

అదేవిధంగా, నిశ్చింతగా జీవనం గడుపుతూ, అనుకోకుండా ప్రమాదాలకు గురి అయినవారు, తమ దగ్గర ఉన్న సొమ్ముతో ఆ ప్రమాదాన్ని ఎదుర్కోలేనివారు. ఉదా॥ వర్షం వల్ల ఇల్లు పడిపోయినా, వరదల్లో కొట్టుకుపోయినా, అగ్ని ప్రమాదంలో కాలిపోయినా, నిలువనీడలేకపోయినా, అదేవిధంగా వ్యాపారంలో నష్టం వాటిల్లినా, పంట నాశనం అయిపోయినా ఉద్యోగం నుండి బర్తరఫ్ అయిపోయి వారి భార్యాపిల్లలు పస్తులుండే పరిస్థితి ఏర్పడినా, వీరందరికి జకాత్ ఉష్ర్‌ల నుండి సహాయం చేయొచ్చు.

2. 'మసాకేన్' ఇది మిస్కిన్‌కు బహువచనం. 'సుమాన్' జడత్వం, నిశ్శబ్దత అనే పదం నుండి ఏర్పడినది. మిస్కిన్ అంటే, 'పస్తులు, నిరుద్యోగం వలన ఇల్లు ఎలాంటి చడీచప్పుడు లేకుండా నిశ్శబ్దంగా ఉంది. వండటం, తినడం, పొయ్యిని రాజేయడం లాంటి ఏ సందడీ లేదు అని అర్థం.

ఏదైనా ప్రమాదం వల్ల ఆర్థికంగా బక్కచిక్కినవాళ్ళు లేక ఉపాధిని సంపాదించే శక్తిని కోల్పోయి ఇల్లు గడవనివారు, ఇల్లు గడిచినా పిల్లాజెల్లా ఎక్కువవడం వల్ల పూర్తిగా కడుపు నిండనివారు, అదేవిధంగా ఏ పని చేయలేని కుంటి, గ్రుడ్డి, వికలాంగులు, పక్షవాతం వచ్చినవారు, కుష్టు వ్యాధిగ్రస్తులు, రోగులు, వృద్ధాప్యం పైబడడం వలన అశక్తులైన వారు, ఎలాంటి అండదండలు లేనివారు, నిరుపేద అనాధలు వింతంతువులు అందరూ మసాకీన్ కిందకే వస్తారు. ఇలాంటి వారందరికి జకాత్ సొమ్ము నుండి ఆదుకోవచ్చు .

3. ఆమిలీసన్: ఇది ఆమిల్ అన్న పదానికి బహువచనం. ఆమిల్ అంటే కార్యనిర్వాహకులు. అయితే షరీఅత్‌లో ఆమిలీన్ అంటే, జకాత్, సదఖా, ఉష్ర్ వగైరాలను

వసూలు చేయడం, దాన్ని పరిరక్షించడం, లెక్కలు రాయడానికి నియమించబడినవారు అని అర్థం, వారి జీతబత్యాలు జకాత్ పద్దునుండే చెల్లించవచ్చు.

ఈ పద్దులో ఖర్చుబెట్టే అవసరం ఇస్లామీయ ప్రభుత్వం ఉన్నప్పుడు ఏర్పడుతుంది. అయితే ఎక్కడైనా ఇలా ముస్లిములు ఇలాంటి ఓ వ్యవస్థను స్థాపించి తమ జకాత్, సదఖా, ఉష్రలు ఓ చోట జమచేసి ఖర్చు బెడితే దానికోసమని ఒకరిద్దరిని నియమిస్తే వారి జీతబత్యాలు కూడా జకాత్ పద్దునుండే చెల్లించవచ్చు. అయితే ఈ విషయంలో చాలా జాగ్రత్తగా మసులుకోవాలి.

4. వల్ముఅల్లఫతుల్ఖులూబుహుం: అంటే ప్రజల్ని ఇస్లాం ధర్మం వైపుకు త్రిప్పుకోడానికి లేక ఇస్లామ్ ధర్మంపై నిలకడగా ఉంచడానికి, శత్రువుల పన్నాగాల నుండి ఏర్పడే సంకటం నుండి రక్షింపబడడానికి ఏదైనా డబ్బు అవసరం వస్తే జకాత్ ఉష్ర పద్దుల నుండి ఖర్చుపెట్టవచ్చు. వీరిలోను రెండు రకాలు. ఒకటి ముస్లిమేతరులు, రెండోది. ముస్లిములు. ముస్లిమేతరుల్లో కూడా రెండు రకాలు:

1. ఎవరైతే ఇస్లాంవైపు మొగ్గుచూపుతారనే ఆశ ఉన్నవాళ్ళు మరెవరి వల్లనైతే ఏదో ఒక ప్రయోజనం కలుగుతుంది అన్న ఆశ ఉన్నవాళ్ళు.

2. ఫలానా వారి బారినుండి రక్షణ పొందుదాం అన్న ఉద్దేశ్యం ఉన్నవాళ్ళు వీరేగనక ముస్లిములైతే వీరిలోను అనేక రకాలున్నాయి.

1. ఇస్లామ్ స్వీకరించారు కాని వారు మనస్సులు డోలాయమానంగా ఉన్నాయి. వాటిని పటిష్ట పరిచేందుకు. 2. ఓ శత్రురాజ్య సరిహద్దులో ఉన్న ముస్లిములు–వీరికి సహాయం చేస్తే సరిహద్దును కాపాడుతారు అన్న ఆశ ఉన్నప్పుడు. 3. ప్రముఖులకు సహాయం చేస్తే ఆ సహాయం ఇతరుల్ని ఇస్లామ్ వైపుకు మొగ్గేటట్టు చేసే సందర్భంలో.

5 **వఫిర్రిఖాబ్:–** రఖ్బాకు బహువచనం. రఖ్బా అంటే మెడ అని. ఇక్కడ ఎవరి మెడలైతే ఇతరుల ఆధీనంలో ఉన్నాయో అని అర్థం. ఉదాహరణకు యుద్ధ ఖైదీలు, బానిసలు లేక ఒకరికి రుణపడి వారి ఆధీనంలో ఉన్నవారు అని. వీరందరికి జకాత్ సొమ్మునుండి సహాయం చేసి విడిపించవచ్చు.

**6. గారిమీన్:–** గారిమ్‌కు బహువచనం. ఒకరిపై ఏదైనా భారం ఉంటే ఆ భారం మోసేవాడిని 'గారిమ్' అంటారు. ఇక్కడ ఎవరిపైన్నయితే అప్పు లేక జామీను వగైరాల భారం ఉందో వారు వాటిని తీర్చే స్థితిలో లేరు. వీరిపై ఉన్న అప్పుల బరువు లేక జామీనుల బరువును దింపడానికి జకాత్, ఉష్ర ధనం నుండి డబ్బు చెల్లించవచ్చు. జామీను అంటే

ఏదైనా జగడాన్ని రూపుమాపడానికి ఓ పక్షం వారికి డబ్బుకడ్తాను అని జామీను ఉండడం. లేక ఓ అప్పుల్లో చిక్కుకున్నవారికి అప్పు తీరుస్తానని మాటివ్వడం, ఆ తరువాత తీర్చలేకపోతే ఆ డబ్బును జకాత్‌సొమ్ము నుండి చెల్లించవచ్చు.

అప్పుగాని, జమానత్తుగాని, సత్కార్యం కోసం తీసుకొని ఉండాలి. అలానే ఆ అప్పైనా ఏదో ఒకటి అనుకోని ప్రమాదం కోసమో లేక భార్యాపిల్లల పోషణ కోసమో, లేక ధార్మిక విద్య సందర్భంగా తీసుకున్నదై ఉండాలి. ఏదో దుష్కార్యం కోసం, దుబారా ఖర్చుల కోసం, పిల్లల లౌకిక విద్య కోసం అయి ఉండకూడదు.

7. **ఫీసబీలిల్లాహ:** దైవమార్గంలో ఖర్చుపెట్టడం. అంటే అసలు ఇస్లామ్ ఉన్నతి కోసం శత్రువుతో పోరాడేవారు లేక దానికి సిద్ధంగా ఉన్నవారని అర్థం. జకాత్ నుండే వారికి అన్ని విధాల మద్దతు ఇవ్వవలసి ఉంది. అయితే, ఎవరైతే ధార్మిక కార్యంలో నిమగ్నమై కష్టాలను ఎదుర్కొనేవారు, లేక హజ్‌కోసం వెడుతూ మార్గమధ్యంలో దోపిడికి గురైన వారు లేక డబ్బు పోగొట్టుకున్నవారు–వీరు నిజానికి నిరుపేదలు కాకపోయినా సరే–వీరంతా ఫీసబీలిల్లాహ్ కోవకు చెందినవారే. జకాత్ పద్దు నుండి వీరికి సహాయ పడవచ్చు. ప్రస్తుత కాలం ధర్మవేత్తలు కొందరు ప్రతి సత్కార్యాన్ని 'ఫీసబీలిల్లాహ్' అంశంలోనే చేర్చారు. వీరు ఈజిప్టుకు చెందిన అల్లామా రషిద్‌రజా (రహ్మాలై) మౌలానా సయ్యద్ సులైమాన్ నద్వి (రహ్మాలై) వగైరాలు.

8. **ఇబ్నుస్సబీల్:** అంటే బాటసారి. అంటే ఎవరైనా ప్రయాణంలో ఉండి అతనికి డబ్బు అవసరం ఏర్పడితే అతడు ఇంటి దగ్గర ధనవంతుడే అయినా–అతణ్ని జకాత్ సొమ్ముతో ఆదుకోవచ్చు. అతడు ఇంటికి వెళ్ళి వాపసు చేయనవసరం లేదు. వాపసు చేసినా ఉత్తమమే. ఎవరైతే తను భార్యాపిల్లల పోషణార్థం విదేశాలకు వెళ్ళదలచి కిరాయి డబ్బు లేక బాధపడుతున్నారో వారి టికెట్టు ఖర్చు జకాత్ నుండి చెల్లించవచ్చు.

## యాజమాన్య సమస్య

జకాత్‌కు సంబందించిన పై ఎనిమిది రకాల వ్యక్తుల్లో తగిన వాడ్ని ఆ జకాత్ సొమ్ముకు యజమానిగా చేయాలి. ఆ వ్యక్తికి గాని సంస్థకుగాని దాని యాజమాన్య హక్కును ఇవ్వకుండా ఆ సొమ్మే వారి సంక్షేమం కోసం ఖర్చు చేస్తే జకాత్ చెల్లింపు నెరవేరదు. అందుకే నలుగురు ఇమాములు, ఇతర ధర్మవేత్తలంతా, మస్జిదులకోసం మదర్సాల కోసం (ధార్మిక పాఠశాలకోసం) లేక వైద్యశాలలకోసం, అనాథ శరణాలయాల నిర్మాణంలో లేక వాటికి తగిన ఇతర అవసరాలను తీర్చడానికి ఖర్చు పెట్టడం ధర్మ

సమ్మతం కాదు అని అంటారు. ఇది వారందరి ఏకాభిప్రాయం. ఈ ఖర్చువల్ల లాభం పొందే వారు పేదవారే అయినా వారికి యాజమాన్యపుహక్కును ఇవ్వనందున జకాత్ చెల్లింపు నెరవేరదు.

అయితే అనాధ శరణాలయాల్లో అనాధలకు పెట్టే తిండి, ఇచ్చే బట్టలు గనక యాజమాన్య పద్ధతిలో జరిగితే దాన్ని మట్టుకే ఆ ధనం జకాత్‌కు సంబంధించింది. ఇలాగే వైద్యశాలల్లో ఏ మందులైతే పేదలకు యాజమాన్యం ఇస్తుందో ఆ ధనం కూడా జకాత్‌లో జమకట్టవచ్చు. ఇదేవిధంగా వారసులు లేని శవానికి ఖనన సంస్కారాలు జకాత్ డబ్బుతో చేయడానికి వీలులేదు. ఎందుకంటే శవం యజమానిగా బాధ్యతలు నిర్వహించలేదు కాబట్టి. అయితే జకాత్ తగు వ్యక్తికి ఇచ్చిన తరువాత ఆ వ్యక్తి తన ఇష్టప్రకారం ఆ సొమ్మును వారసులులేని వ్యక్తి శవసంస్కారానికి ఖర్చుపెడితే అది చెల్లుతుందిగాని నేరుగా ఖర్చు పెట్టడానికి వీలులేదు. అదేవిధంగా ఆ చనిపోయిన వ్యక్తి అప్పుల్లో ఉన్నప్పుడు ఆ అప్పుల్ని జకాత్ ధనంతో నేరుగా తీర్చడానికి వీలులేదు. అయితే ఆ శవానికి సంబంధించిన వారసులు పేదలై జకాత్ పొందడానికి అర్హులైతే వారిని ఆ జకాత్ ధనానికి యజమానులుగా చేస్తే, ఆ తరువాత వారు తమ ఇష్ట ప్రకారం ఆ డబ్బుతో ఆ చనిపోయిన వాని అప్పులు తీర్చవచ్చు. అదేవిధంగా ప్రజాసంక్షేమ పనులైన, బావి త్రవ్వించడం, వంతెన నిర్మించడం, రోడ్డు వేయడం లాంటి పనుల్లో ఖర్చుబెట్టినప్పుడు ఆ ధనంతో జకాత్ పొందేవారికి కూడా ప్రయోజనం కలుగుతుంది కాని ఆ ధనంపై వారికి యాజమాన్యపు హక్కు లేకపోవడంవల్ల జకాత్ నెరవేరదు.

## ముఖ్యమయిన విషయాలు

1. తాలీఫెఖల్బ్ (మనస్సు నిలకడగా ఉంచడం)కోసం తప్ప మరే ఖర్చుకోసం ముస్లి మేతరులకు ఉష్ర్, జకాత్‌ల డబ్బు ఇవ్వకూడదు. అయితే ఇతర దానధర్మాలు వారికి ఇవ్వవచ్చు. ఉష్ర్, జకాత్‌లు ముస్లిముల హక్కు.

2. పై ఎనిమిది పద్దుల్లో ఏ పద్దులోనైనా జకాత్ చెల్లించాలి. అయితే ఏ పద్దుల్లో ఖర్చు పెట్టడం ఎక్కువ అవసరమవుతుందో ఆ పద్దుల్లోనే ఖర్చుపెట్టాలి.

3. ఎవరి వద్దనైనా నాలుగైదు అద్దెఇళ్ళు ఉండి వాటి ఆదాయంలో తన భార్యాపిల్లల పోషణ కూడా సరిగా జరగడంలేదు. తన దగ్గర జకాత్ చెల్లించగల స్థోమత కలిగిన ఎలాంటి వెండి, బంగారాలుగాని, బ్యాంకు బ్యాలన్సుగాని లేనట్లయితే ఆ వ్యక్తికి జకాత్ చెల్లించవచ్చు. (ఫతావా ఆలంగీరి, సంపుటం 1, పుట 189)

4. ఎవరి వద్ద అయినా వేయి రూపాయల లోపు సామానులు, ఫర్నీచరు, పాత్రలు, ట్రంకు పెట్టెలు వగైరాలు ఉన్నాయో వాటిపై జకాత్ వాజిబ్ కాదు. అవి ఇంటి అవసరాల కోసమే పనికి వస్తున్నాయి. అదీగాక ఆ వ్యక్తి పూట గడవని పరిస్థితుల్లో ఉన్నప్పుడు అతనికి కూడా జకాత్ పుచ్చుకునే అర్హత ఉంది. అయితే గృహాలంకరణలకు తగిన సామానంతా ఉంటే మాత్రం అతడికి జకాత్ ఇవ్వడానికి వీలులేదు. ఆ సామానులు అమ్మి తన అవసరాలు తీర్చుకొని ఉంటే తప్ప.

5. ఒకరి వద్ద రెండువేల రూపాయలు లేక ఆ రెండువేల రూపాయలకు సరిపడా వ్యాపార సామగ్రి అతని ఇంట్లోనైనా షాపులోనైనా ఉంది. కాని అతడు రెండు వేలకు సరిపడు డబ్బు రుణపడి ఉన్నాడు. అలాంటప్పుడు ఆ వ్యక్తికి కూడా జకాత్ చెల్లించవచ్చు.

6. ఒకవ్యక్తి జకాత్ పుచ్చుకోడానికి అర్హుడా? కాదా? అన్న అనుమానం పొడసూపి నప్పుడు, పూర్తిగా నమ్మకం కుదిరే వరకు అతడికి జకాత్ లేక ఉష్ర్ సొమ్మును ఇవ్వడానికి వీల్లేదు. ఆరా తీయడం అంటే ఇతరుల్ని అతని గురించి అడిగి తెలుసుకోవడం కాదు. అతని గురించి ఆలోచించేటప్పుడు తనకు ఏది సరైంది అని తోచితే అలా నడుచుకోవాలి. ఎలాంటి ఆరా తీయకుండా జకాత్ సొమ్ము చెల్లించి ఆ తరువాత అతడు పేదవాడా?కాదా? అన్నది తెలిసినప్పుడు, అతడు నిజంగానే దానికి అర్హుడుకాదు అని తెలిస్తే అతనికి ఇచ్చిన డబ్బు జకాత్ చెల్లింపు క్రిందకి రాదు. అతడే పేదవాడై అర్హుడయితే మాత్రం చెల్లింపు నెరవేరుతుంది.

7. ఉష్ర్ జకాత్‌కు సంబంధించిన డబ్బు నిరుపేదలైన తమ నౌకర్లకూ కూడా ఇవ్వవచ్చు. అయితే ఇచ్చానని వారిని దెప్పి పొడవడంగాని, వారి జీతాల్లో కోత విధించడం గాని చేయకూడదు. అలా చేస్తే జకాత్ విధి నెరవేరదు.

## అపరిచితునికి జకాత్ ఇవ్వడం

ఎవరైనా అపరిచితునికి అతడు అర్హుడే అనుకొని జకాత్ చెల్లించాక ఆ తరువాత గాని అతడు అర్హుడు కాదు అని తెలిస్తే జకాత్ చెల్లింపు నెరవేరినట్లు. అయితే తీసుకునే వానికి మాత్రం అతడు పొందిన ధనం ఉష్ర్ లేక జకాత్‌కు సంబంధించినది అని తెలిస్తే అతడు దాన్ని తిరిగి ఇచ్చివేయాలి.

## ఏ కోవకు చెందిన వారికి జకాత్ చెల్లించకూడదు

ఈ క్రింది వారికి జకాత్ ఇవ్వడానికి వీల్లేదు. ఇచ్చినా అది నెరవేరదు.

1. నిసాబ్ పరిమితికి సమానమైన ధనంగాని, సామానులుగాని ఉన్న వ్యక్తి.

2. 'సాదాత్' అంటే తమను తాము సయ్యద్ వంశానికి సంబంధించిన వారుగా ప్రకటించుకునే వారు. ఉదాహరణకు హుస్నే, హుసైనీ, అల్వీ, జాఫరీ వగైరాలు.

3. తల్లిదండ్రులు, తాత నాయనమ్మ; తాత అమ్మమ్మలు వారి వల్ల దండ్రులు, ఆపైన అంటే ముత్తాత ముత్తాత భార్య; తల్లి తండ్రి, ఆయన తండ్రి, అదేవిధంగా అమ్మమ్మ, అమ్మమ్మ తల్లి వగైరాలు.

4. కుమారుడు, కుమార్తె, కుమారుని కుమారుడు కుమార్తెలు, కుమార్తె కుమారుడు, కుమార్తెలు వారికి క్రిందివారు అంటే వారి సంతానం.

5. భర్త తన భార్యకు, అదేవిధంగా భార్య తన భర్తకు జకాత్ చెల్లించవీల్లేదు.

6. ముస్లిమేతరులకు.

7. ధనవంతుల ప్రాజ్ఞత పొందిన సంతానం.

8. మస్జిద్ నిర్మాణంలో జకాత్ డబ్బు వెచ్చించ వీల్లేదు. అదేవిధంగా శవ సంస్కారాలకు గాని, మృతుని అప్పు తీర్చడానికి గాని జకాత్ ధనం వినియోగించ కూడదు.

(షరహ్‌లికాయ-సంపుటం 1 పుట 298)

## జకాత్ ధనం పొందడానికి అసలు హక్కుదారులు

1. జకాత్ పొందడానికి అసలు హక్కుదారులు తమ సమీప బంధువులు. ఉదాహరణకు సోదరులు, సోదరుల సంతానం, సోదరి, వారి సంతానం, తండ్రి సోదరీ సోదరులు, తల్లి సోదర సోదరీలు, తల్లి తోబుట్టువులు అత్తమామలు, బావ, బావమరుదులు, మారు తండ్రి, మారు తల్లి వగైరాలు లేక వారుగాక ఇంకెవరైనా దగ్గరి బంధువులు. వీరికి జకాత్ ధనంతో ఆదుకుంటే రెండింతల పుణ్యఫలం లభిస్తుంది. "బంధువుల్లో జకాత్ చెల్లించడంవల్ల రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది: ఒకటి జకాత్ చెల్లించినందుకు రెండవది బంధువులను చేరదీసినందుకు" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

2. పైన చెప్పిన వారి తరువాత మిత్రులు, పొరుగువారు హక్కుదారులవుతారు. ఆ తరువాత పట్టణం లేక గ్రామాలలోని ఇతరులకు చెల్లించవలసి ఉంటుంది.

3. ధార్మిక ప్రయోజనం బాగా లభించగలదు అన్న విద్యార్థులకు, మత ప్రచారకులకు, దైవసందేశాన్ని వ్యాపింపచేసేవారికి, ధార్మిక పాఠశాలల ఉపాధ్యాయులకు ఇవ్వడం మేలు.

## మరో చోటికి జకాత్‌ను పంపించడం

సాధ్యమైనంత మటుకు ఎక్కడయితే జకాత్ తీస్తామో అక్కడే ఖర్చుబెడతాము. అయితే పెద్ద అవసరం ఏర్పడినప్పుడు ఆ డబ్బును మరోచోటికి తరలించవచ్చు. ఉదాహరణకు తన బంధువు లేక మిత్రుడు మరోచోట ఉంటున్నాడు లేక ఏదో అవసరం ఉండి వెళ్ళాడు అతడు సహాయం కోసం అర్థించినప్పుడు జకాత్ డబ్బును మరోచోటికి పంపించవచ్చు. లేక ఓ విద్యార్థి ఇంటిని వదిలి ఓ ధార్మిక పాఠశాలలో సుదూర ప్రదేశంలో ఉండి విద్యనభ్యసిస్తున్నాడు, అతనికి ఏదో అత్యవసరమైన ధార్మిక అవసరం ఏర్పడ్డప్పుడు జకాత్ ధనం మరోచోటికి పంపించవచ్చు. ఇలాంటి అవసరాల్లో ఖర్చు పెట్టడంలో పుణ్యఫలం అధికం. ముఖ్యంగా ధార్మిక విద్వాంసుల్ని ఆదుకోవడంలో మరింత ప్రయోజనం ఉంది. విద్వాంసునిపై ఖర్చుపెట్టడం అజ్ఞానిపై ఖర్చుపెట్టడం కంటే నయం.(ఫలూవా హిందియా-సంపుటం1,పుట 196)

## ప్రభుత్వానికి జకాత్ చెల్లించడం

పైన చెప్పినదంతా వ్యక్తిగతం జకాత్ చెల్లించే విధానం. ఒకవేళ ఎక్కడైనా ఇస్లామీయ ప్రభుత్వం తరపున ఉష్ర్ జకాత్ వసూలు చేసే వ్యవస్థ నెలకొంటే అలాంటప్పుడు ఉష్ర్, జకాత్‌ల ధనం ప్రభుత్వపరం చేయాలి. అవసరమైన చోట్లలో దాన్ని ఖర్చు బెడుతుంది. జకాత్ చెల్లించగానే అతని బాధ్యత తీరిపోతుంది. అయితే ప్రభుత్వ ఉద్యోగులు మాత్రం పైన చెప్పిన క్రమంలో దాన్ని ఖర్చు చేయాల్సి ఉంటుంది. ప్రభుత్వం ఆ క్రమంలో జకాత్ ధనాన్ని ఖర్చు చేయనట్లయితే దాన్ని సావధానపర్చవలసి వస్తుంది. అలా ఖర్చుపెట్టమని అప్పటికి ప్రభుత్వం అలా నడవకపోతే కొన్ని సందర్భాల్లో జకాత్ ఇవ్వడం ఆపడం కూడా చేయవచ్చు. దైవప్రవక్త (సఅసం) ఉష్ర్, జకాత్ వసూలు చేయ డానికి తమ కార్యకర్తల్ని పంపేటప్పుడు “వారి ధనవంతులనుండి వసూలు చేసి వారి పేదలపై ఖర్చు పెట్టండి” అని తాకీదు చేసి మరీ పంపేవారు. (మిష్కాత్)

## ఇతరుల్ని మధ్యవర్తులుగా చేయడం

నేరుగా తన జకాత్ ధనాన్ని దాని హక్కుదారునికి ఇవ్వకుండా ఎవరినైనా మధ్యవర్తిగా చేసి, నా జకాత్‌ను ఫలానా వారికి ఇవ్వండి అని అతనికి అప్పచెబితే అది చెల్లుతుంది. మదర్సాలకు సంబంధించిన ప్రతినిధులు ఇచ్చినట్లుగా మరో విధమేమిటంటే, ఎవరైనా ఒకరికి ఇంత మొత్తం డబ్బు ఫలానా వారికి జకాత్ పద్దు క్రింద ఇచ్చేయి, ఆ

తరువాత నేను ఇచ్చేస్తాను అని అనగా ఆ వ్యక్తి ధనాన్ని ఫలానా వ్యక్తికి ఇచ్చివేసి తరువాత ఆ డబ్బు వసూలు చేసుకున్నా జకాత్ చెల్లింపు నెరవేరుతుంది.

## పేదల కోసం గృహనిర్మాణం, బట్టల్ని కుట్టించడం

జకాత్ పద్దునుండి నిరుపేదల కోసం లేక మతకలహాల్లో దెబ్బతిన్న ముస్లిముల ఇళ్ళు నిర్మించడం, కుట్టించిన బట్టలు లేక బట్టల తానులు ఇంకా ఇతర వస్తువులు కొని వారికి పంచిపెట్టడం లాంటివన్నీ సరైన పద్ధతులే. సరికదా అలా చేయడం అత్యవసరం కూడా. అయితే స్థానిక ధర్మవేత్తల్ని ఈ విషయంలో సంప్రదించడం మంచిది.

## మదర్సాలకు (ధార్మిక పాఠశాలలకు) జకాత్ చెల్లింపు

దైవప్రవక్త (సఅసం) గారి సహచరుల (సహాబీల) కాలం అంతమైన తదుపరి, ఇస్లామీయ ధర్మబోధన, ధార్మిక విద్యావ్యాప్తి వాటి పరిరక్షణలు ఆ తరువాత వచ్చిన గురువులు, విద్యావేత్తల భుజస్కంధాలపై పడింది. నేటివరకు ఆ విద్యావ్యాప్తి జరుగుతూనే ఉంది. ప్రభుత్వ ధనం సహాయం కోసం ఎదురు చూడకుండా ధర్మవేత్తలు స్థాపించిన ధార్మిక పాఠశాలలు ధార్మిక విద్యావ్యాప్తికి తోడ్పడుతూ వస్తున్నాయి నేటివరకు.

ధార్మిక పాఠశాలల్ని ఆర్థికంగా ఆదుకోవడం ప్రతి ముస్లింవిధి, బాధ్యత. ఫుఖరాఅ, మసాకీన్, ఫీసబీలిల్లాహ్ అనే పద్దులో జకాత్ ధనాన్ని ఖర్చుపెడుతున్నారు ముస్లిములు. అయితే ఈ పద్దుల క్రింద ఖర్చుపెట్టే జకాత్ ధనం ధార్మిక పాఠశాలలకు అందజేయవచ్చు. అదేవిధంగా ఈ ధనాన్నే కాకుండా ఇతరపద్దుల నుండి కూడా ధార్మిక పాఠశాలలకు సహాయం చేయడం ముస్లింల విధి. ధార్మిక విద్యపై ఎలాంటి ఖర్చును భరించని దేశాలు ఉదాహరణకు భారతదేశం, ఆఫ్రికాల్లో అక్కడి ముస్లిములే వాటిని ఆదుకోవలసి ఉంది. అరేబియా, మలేషియాలాంటి ముస్లిం దేశాల్లో మాత్రం అక్కడి ప్రభుత్వాలే ఆ ఖర్చు భరిస్తున్నాయి. మన దేశంలో అలా కాదు.

ప్రభుత్వ అండదండలతో నడిచే మదర్సాల గురించి చెప్పుకునేటప్పుడు వాటి నిర్వాహకులు రెండు విషయాలను దృష్టిలో ఉంచుకోవాలి.

1. జకాత్ నుండి వచ్చే ఆదాయాన్ని ఉపాధ్యాయుల జీతబత్యాలకు ఉపయోగించకుండా ఉండడం.

2. జకాత్ చెల్లించే సామర్థ్యం గల (సాహబెనిసాబ్) తల్లిదండ్రులకు సంబంధించిన ప్రాజ్ఞత పొందని సంతానం గనక ఆ పాఠశాలల్లో చదువుతూ ఉంటే ఆ పిల్లలపై జకాత్

ధనాన్ని ఖర్చుపెట్టకుండా ఉండడం, అయితే మిగతా విద్యార్థులకోసం మాత్రమే దాన్ని ఖర్చుపెట్టాలి.

## జకాత్ చెల్లింపుకు పూర్వమే ధన నష్టమవడం

జకాత్ వాజిబ్ అయిన వ్యక్తి అశ్రద్ధ వల్లనో లేక ఇతర కారణాల వల్లనో జకాత్ ధనం తీయలేకపోగా అలాంటి సందర్భంలోనే అతని పూర్తి సొత్తు దొంగల పాలవడమో, పోగొట్టుకోవడమో జరిగింది. అలాంటప్పుడు ఆ వ్యక్తి జకాత్ చెల్లించడం వాజిబ్ అవునా కాదా అన్న ప్రశ్న ఉత్పన్నమవుతుంది.

ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) జకాత్ చెల్లించడం వాజిబ్‌కాదు అంటారు. అతని పూర్తి ధనం నష్టం కాకుండా కొంతభాగమే నష్టం జరిగితే, ఆ పోగొట్టుకున్న ధనం మట్టుకే జకాత్ ఉండదు. మిగిలిన సొమ్ముకు అతడు జకాత్ చెల్లించవలసిందే.

ఇకపోతే తక్కిన ముగ్గురు ఇమామ్‌లు, ఇమామెమాలిక్, ఇమామెషాఫయీ, ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై)ల దృష్టిలో, ఆ ధనం తాను నష్టపోయినప్పుడు ఆ వ్యక్తికి జకాత్ చెల్లించే స్తోమత ఉందా లేదా అని చూడాలి. స్తోమత లేకపోతే జకాత్ ఉండదు. కాని ధననష్టం జరిగినా తాను జకాత్ చెల్లించే స్థితిలో ఉండగలిగితే మాత్రం జకాత్ చెల్లించవలసిందే.

(అల్ ముగ్నీ సంపుటం2, పుట 39, రద్దుల్ ముహ్తార్ సం. 2 పుట20)

ఇమాముల నడుమ గల ఈ భేదాభిప్రాయానికి కారణమేమిటంటే, ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై) జకాత్ అనేది ధనంపై లెక్కకట్టి చెల్లించడం జరుగుతుంది. కాబట్టి అదే పోగొట్టుకున్నప్పుడు ఇక జకాత్ ఉండదు అంటారు. మిగిలిన ఇమాములు ముగ్గురూ జకాత్ ధనం మీద కాదు దాని యజమాని స్తోమతపై వాజిబ్ అవుతుంది. కాబట్టి అతని వైఖరి ఎలాంటిదో చూసి తీర్పు ఇవ్వడం జరుగుతుంది అంటారు.

## జకాత్‌ను తప్పించుకోవడానికి వెదికే సాకు

జకాత్ ఎగ్గొట్టడానికి కొందరు ఓ సాకును వెదుకుతారు. సంవత్సరం పూర్తి కాబోతుంది అనగానే తమ ధనాన్ని భార్య పేర 'హిబా' (అంకితం) చేస్తారు. మరు సంవత్సరం భార్య తన భర్తకు లేక కుమారునికి హిబా చేసేస్తుంది. ఈ వైఖరి గర్హనీయమైంది. ఇస్లామీయ ప్రభుత్వంలో ఇలా చేసిన వారికి శిక్షబడుతుంది.

## చివరిగా ఓ ముఖ్య విషయం

జకాత్ కేవలం ఆరాధనాభావంతో దైవమార్గంలో ఖర్చుపెట్టాలని పైన చెప్పడం జరిగింది. ఇతర తలంపులేమీ ఉండడానికి వీల్లేదు. జకాత్‌లో తీయబడిన ధనం అతని సొత్తుకాదు. అది కేవలం అర్హుల హక్కు. ఈ అర్హుల వివరణ కూడా పైన చెప్పడం జరిగింది. మొత్తానికి తేలిందేమిటంటే మీరు ఎవరికైతే జకాత్ ధనమిచ్చి ఆదుకుంటున్నారో వాళ్ళు మీకు ఏ విధంగాను రుణపడిలేరు. సరికదా వాళ్ళ హక్కును మాత్రమే వారికి అందజేస్తున్నా రంతే. మీపైఉన్న రుణభారాన్నే మీరు మీ భుజస్కంధాల నుండి దింపుకొని హాయిని అనుభవిస్తున్నారు.

కొందరైతే, జకాత్ ధనమిచ్చి, నేను ఫలానా వారికి ఏదో ఒరగబెడ్తున్నాను, వారికి మేలు చేకూరుస్తున్నాను అన్నట్లు తమ నడవడిక ద్వారా, వైఖరి ద్వారా తెలియ చేస్తుంటారు. అలాగే ఇతరులతో చెబుతూ గ్రహీత మనస్సును బాధిస్తూ ఉంటారు. ఎత్తి పొడుస్తూ ఉంటారు. ఇలాంటి వారు అసలు జకాత్ చెల్లించకుండా ఉండడమే నయం. దైవగ్రంథం అయిన దివ్య ఖుర్ఆన్‌లో, కేవలం దైవాన్ని సంతుష్టపరచడానికి, కేవలం ఆయన మార్గంలోనే సదఖా, దాన ధర్మాలు చేసేవారిని పొగడడం జరిగింది తప్ప, ఇలా బాధపెట్టి మనసుల్ని నొప్పించి దెబ్బపొడిచే వారి గురించి కాదు.

"అల్లాహ్ మార్గంలో ధన వ్యయం చేసి, ఆ తరువాత తమ దాతృత్వాన్ని మాటి మాటికి చాటనివారి, గ్రహీతల మనస్సును గాయపరచని వారి ప్రతిఫలం వారి ప్రభువు వద్ద ఉంది. వారికి ఏ విధమైన భయం కాని, ఖేదంకాని ఉండవు"

(బకరా-162)

اَلَّذِيْنَ يُنْفِقُوْنَ اَمْوَالَهُمْ فِيْ سَبِيْلِ اللّٰهِ ثُمَّ لَا يُتْبِعُوْنَ مَآ اَنْفَقُوْا مَنًّا وَّلَآ اَذًى لَّهُمْ اَجْرُهُمْ عِنْدَ رَبِّهِمْ وَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُوْنَ (بقرہ)

మరోచోట : "ఎవరైతే తమ సంపదను స్థిరచిత్తంతో కేవలం అల్లాహ్ సంతోషం పొందే ఉద్దేశ్యంతో వ్యయపరుస్తారో, వారి ధనాన్ని మెట్ట ప్రదేశంలో ఉన్న తోటతో పోల్చవచ్చు. భారీ వర్షం కురిస్తే, అది రైతుకు పంటనిస్తుంది. ఒకవేళ భారీవర్షం కురవక, సన్నని జల్లుపడినా, అదే దానికి చాలు. మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది." (బకరా-265)

మరెవరైతే దానధర్మాలు చేసి దెప్పిపొడిచి గ్రహీతను బాధిస్తారో వారి గురించి ఇలా సెలవియ్యడం జరిగింది.

قَوْلٌ مَّعْرُوفٌ وَّمَغْفِرَةٌ
خَيْرٌ مِّنْ صَدَقَةٍ يَّتْبَعُهَآ
اَذًى ؕ وَاللّٰهُ غَنِيٌّ حَلِيْمٌ

"మనస్సును గాయపరిచే దానం కంటే, మృదుభాష్యం, క్షమాబుద్ధి ఎంతో మేలైనవి. అల్లాహ్ అన్నిటికి అతీతుడు, అత్యంత సహనశీలుడు."
(బకరా-263)

అంటే అల్లాహ్‌కు మీ జకాత్ అవసరం ఎంత మాత్రంలేదు. ఆయన మీ పొరపాట్లను, పాపాల్ని గమనిస్తూనే ఉన్నాడు. అయినా మిమ్మల్ని సహించి మన్నిస్తూనే ఉన్నాడు. చెప్పొచ్చిందేమిటంటే జకాత్ ధనాన్ని అర్హులైనవారికి చెల్లించేవారు దేవుడికి గాని, ఆయన దాసులకుగాని ఏమీ ఒరగబెట్టడం లేదు. ప్రతి కదలికను చూస్తూ సహించే ఆ దేవుడు మిమ్మల్ని ఎలా నిలదీయడంలేదో మీరూ, అతని దాసులకు ధన సహాయం చేసి వారిని బాధించకండి. అదేకాదు దివ్యఖుర్ఆన్ అంతటితో ఊరుకోక, ఇలా చేస్తే మీరిచ్చే దానధర్మాలు, జకాత్ వగైరాలన్ని బూడిదలో పోసిన పన్నీరులా అవుతాయి.

لَا تُبْطِلُوْا صَدَقٰتِكُمْ بِالْمَنِّ
وَالْاَذٰى كَالَّذِىْ يُنْفِقُ مَالَهٗ
رِئَآءَ النَّاسِ وَلَا يُؤْمِنُ بِاللّٰهِ
وَالْيَوْمِ الْاٰخِرِ فَمَثَلُهٗ كَمَثَلِ
صَفْوَانٍ عَلَيْهِ تُرَابٌ فَاَصَابَهٗ
وَابِلٌ فَتَرَكَهٗ صَلْدًا ؕ
(بقره)

"మీరు మీ దాన ధర్మాలను, దెప్పి పొడిచి, గ్రహీత మనస్సును గాయ పరచి, మట్టిలో కలపకండి. అతడు చేసిన ధన వ్యయాన్ని ఈ విధంగా పోల్చవచ్చు: ఒక కొండరాతిపై ఒక మట్టి పొర ఏర్పడి ఉంది. దానిపై భారీ వర్షం కురవగా, ఆ మట్టి కాస్తా కొట్టుకు పోయింది. చివరకు మిగిలింది ఉత్త కొండరాయి మాత్రమే. అలాంటి వారు తాము దానం చేస్తున్నామని భావించి చేసే పుణ్యకార్యంవల్ల వారికి ఎలాంటి ప్రయోజనమూ కలుగదు. (బకరా-264)

వర్షం కురిసిన తోడనే మట్టి నుండి విత్తనాలు మొలకొత్తుతాయి. కాని కొండ రాతిపై ఏర్పడిన మట్టిపొర స్థిరమైన మట్టిపొర కాదు, వర్షం కురిసిన తరువాత అందుండి అంకురార్పణ జగడం అంటుంచి ఆ మట్టి అంతా వర్షపు నీటి ప్రవాహానికి కొట్టుకుపోయి

వృధా అవుతుంది. అచ్చం ఇలాగే, దానధర్మాలు చేసే సంకల్పం, చిత్తశుద్ధి, దైవమార్గంలో ఖర్చు పెడుతున్నాననే తలంపు లేకుండా కేవలం గ్రహీతను దెప్పి పొడవడానికే దాన ధర్మాలు చేస్తే అది బండరాతిపై పడి ఉన్న మట్టిలా కొట్టుకుపోయి వృధా అయిపోతుంది. అలాంటి దానధర్మాలు చేసేవాడు ఉత్తబండరాయిగా మిగిలిపోతాడు.

కాబట్టి దానధర్మాలు చేసేటప్పుడు, చేసే దానం మూడోకంటికి కనబడకుండా గోప్యంగా చేయాలని కూడా తాకీదు చేయడం జరిగింది. అందుకే జకాత్ చెల్లించేటప్పుడు గ్రహీతకు ఇది జకాత్సొమ్ము అని చెప్పి ఇవ్వడం ఏమాత్రం సబబు కాదు. బంధుమిత్రుల విషయంలో దీన్ని పాటించకపోతే మరిన్ని చిక్కులు వచ్చిపడతాయి. తమకు సహాయం అందచేసింది జకాత్ సొమ్ముతో అని తెలిస్తే వారు నొచ్చుకుంటారు.

అలా సహాయపడదలిస్తే వారి పిల్లల్లో స్పృహగల వారిని ఎంచుకొని, వారికి పండుగ బహుమానంగానో మరేదో బహుమానం రూపంలోను ఇస్తే సరిపోతుంది. అయితే మరీ చిన్న పిల్లలు దీనికి పనికిరారు. అదేవిధంగా మధ్య తరగతి కుటుంబాల్లోను జకాత్ ధనాన్ని పొందే అర్హతగల వారుంటారు. వారు ఎవరిని నోరు విప్పి జకాత్ ఇవ్వమని అడుగరు. ఎవరైనా సహాయం చేస్తూ ఇది జకాత్ అని చెప్పి ఇస్తే బాధపడిపోతారు. అలాంటి వారికి కూడా ఏదో ఓ నెపంతో జకాత్ నుండి సహాయపడవచ్చు.

కొందరికి ఎంతో కొంత ఆస్తి ఉంటుంది. అద్దె ఇండ్లనో, పొలం అనో ఉంటాయి. అది కాకుండా వేరే రూపంలో నెలసరి, సాలుసరి ఆదాయం కూడా వస్తూ ఉంటుంది. అయితే వారు అధిక సంతానం కలిగి ఉండడం వలస ఆ ఆదాయం వారికి సరిపోక పోవచ్చు. ఈ కోవకు చెందిన వారికి కూడా జకాత్ ధనంతో ఆదుకోవాలి. ఈ విషయాన్ని పెడచెవిన పెట్టే వారికి దివ్యగ్రంథం ఇలా గుర్తుచేస్తోంది.

"సతతం ప్రవహించే పిల్ల కాలువ లతో, ఖర్జూరం, ద్రాక్ష మొదలైన సకల ఫల సంభరితమై పచ్చగా అలరారే తోట మీలో ఎవరికైనా ఉండి, అతడు వయోభారంతో కృంగి, సంపా దనాపరులు కాని చిన్న పిల్లలు ఉన్న అతినాజుకు తరుణంలో, ఆ తోట తీవ్రమైన వడగాడ్పులకు గురై మాడి పోవడం మీలో ఎవరికైనా సమ్మతమా? మీరు యోచించ గలందుకు ఈ విధంగా అల్లాహ్ తన హితవు లను విశదపరుస్తాడు". (బకరా 265)

ఇలాంటి పరిస్థితి స్వయంగా మీకు ఏర్పడినప్పుడు ఇతరులు మిమ్మల్ని ఆదుకో వాలని ఎదురుచూడరా! మిమ్మల్ని ఎవరూ ఆదుకోకుండా, కనికరించకుండా ఉంటే మీ హృదయావేదన ఎలా ఉంటుంది? అలాగే ఇతరుల పేదరికాన్ని, కడగండ్లను గురించి కూడా ఆలోచించి వ్యవహరించాలి.



# హజ్

ఇస్లామీయ ఆరాధనలు రెండు రకాలని, వాటిలో ఒకటి శారీరక ఆరాధన, మరొకటి ఆర్థిక సంబంధమైన ఆరాధన అని ఇదివరకే చెప్పడం జరిగింది. శారీరక ఆరాధనల్లో నమాజు, రోజాలు వస్తాయి. ఇక ఆర్థిక సంబంధమైన ఆరాధనలలో జకాత్, సద్ఖాలు ముఖ్యం. అయితే ఈ రెండు రకాల ఆరాధనల కలయికతో ఏర్పడిందే హజ్. దీన్ని కూడా ఇస్లాంలో ఫర్జ్ (విధి) చేయడం జరిగింది. అంటే ఈ ఆరాధనతో మనిషికి శారీరక శ్రమతోపాటు డబ్బుకూడా ఖర్చు అవుతుందన్నమాట.

## హజ్ ప్రాముఖ్యత-శుభాలు

గతించిన ప్రవక్తల ప్రతి సమాజంలో నమాజ్, రోజా, జకాత్ లాంటి ఆరాధనల్నీ ఫర్జుగా చేయబడినట్లే హజ్ ఆరాధన కూడా ఆయా ప్రవక్తల సమాజాల్లో విధిగా చేయడం జరిగింది. అయితే అసలైన హజ్ ఆరాధనా విధానం మాత్రం హజ్రత్ ఇబ్రాహీం (అలైహి)గారి జ్ఞాపకచిహ్నంగా మిగిలిపోయింది ఆయా సమాజాల్లో. హజ్రత్ ఇస్మాయీల్ (అలైహి) సంతతికి చెందిన అరబ్బులు ఆయన బోధనల్ని మరిచి బహుదైవారాధన (షిర్క్)లో చిక్కుకుపోయారు. వీరికి దైవదౌత్యంపైగాని, పరలోకంపైగాని ఎలాంటి విశ్వాసం లేకుండా పోయింది. పొద్దస్తమానం యుద్ధకార్యకలాపాల్లో నిమగ్నమై ఉండడం, దారిదోపిడీలు, హత్యాకాండకు పాల్పడడం, మత్తు పానీయాలుసేవనంలో తలమునకలై ఉండటం వారికి అలవాటయిపోయింది. అయితే వారిలో హజ్రత్ ఇస్మాయీల్ (అలైహి) గారి ప్రభావం మాత్రం కొంత మిగిలిపోయింది. ఆ ప్రభావం కారణంగా వారు హజ్ కాలం రాగానే తాము చేసిన దుష్కార్యాలకు ప్రాయశ్చిత్తంగా తౌబా (క్షమాపణలు వేడుకోవడం) చేసుకునేవారు. మక్కా నగరానికి వచ్చి కాబా గృహాన్ని సందర్శించి హజ్ చేసి వెళ్ళేవారు.

గతించిన ధార్మిక నియమాల ప్రకారం (షరీఅత్ల ప్రకారం) ఇస్లాంధర్మంలోను ఈ హజ్ ఆరాధనను ఫర్జ్ (విధి)గా చేయడం జరిగింది. అయితే గతంలో వలె, పూర్తిగా నగ్నంగా తయారై హజ్ చేయడం, వీరంగం వేస్తూ హజ్ చేయడం నృత్యగానాలతో హజ్ చేయడంలాంటి చేష్టలన్నిటిని ఇస్లామ్ నిషేధించింది. అంతిమ దైవగ్రంథంలో అనేకచోట్ల హజ్కు సంబంధించిన నియమ నిబంధనలు సూచించబడ్డాయి. ఓ చోట దీన్ని ఫర్జు (విధి)గా పరిగణిస్తూ ఇలా చెప్పడం జరిగింది:

"ఈ గృహానికి వెళ్ళే శక్తి గలవారు దాని హజ్‌ను విధిగా చేయాలి. ఎవడయితే ఈ ఉత్తర్వును ధిక్క రిస్తాడో, అతడు, అల్లాహ్‌కు ప్రపంచ ప్రజల అవసరం ఎంతమాత్రం లేదు అని స్పష్టంగా తెలుసు కోవాలి".
(ఆలి ఇమ్రాన్-97)

وَلِلّٰہِ عَلَی النَّاسِ حِجُّ الْبَیْتِ مَنِ اسْتَطَاعَ اِلَیْہِ سَبِیْلًا ۝
(آل عمران)

మరోచోట ఇలా ఉంది:

"హజ్ మాసాలు అందరికీ తెలిసినవే, ఈ నిర్ణీత మాసాల్లో హజ్ చేసే సంకల్పం ఉన్న వ్యక్తి అప్రమత్తుడై మెలగాలి. హజ్ సమయంలో అతడు కామచేష్టలకు, పాప కార్యాలకు, ఘర్షణలకు దూరంగా ఉండాలి. మీరు చేసే ఏ పుణ్య కార్యమయినా అల్లాహ్‌కు తెలుస్తుంది. హజ్ యాత్రకు ప్రయాణ సామాగ్రిని తీసుకువెళ్ళండి. భయభక్తులు అన్నిటి కంటే ఉత్తమమైన సామాగ్రి కనుక వివేకవంతులారా! నాకు అవిధేయత చూపకండి." (బకరా-197)

اَلْحَجُّ اَشْھُرٌ مَّعْلُوْمٰتٌ ۚ فَمَنْ فَرَضَ فِیْھِنَّ الْحَجَّ فَلَا رَفَثَ وَلَا فُسُوْقَ وَلَا جِدَالَ فِی الْحَجِّ ۭ وَمَا تَفْعَلُوْا مِنْ خَیْرٍ یَّعْلَمْہُ اللّٰہُ ۭ وَتَزَوَّدُوْا فَاِنَّ خَیْرَ الزَّادِ التَّقْوٰی ۡ وَاتَّقُوْنِ یٰٓاُولِی الْاَلْبَابِ (بقرہ)

పై వాక్యంలో ఈ మూడు పదాలు 1. 'రఫ్స్' అంటే కామవాంఛల్ని రేకెత్తించే చేష్టలు, 2. 'ఫుసూక్' పాప కార్యాలకు సంబంధించిన చేష్టలు, 3. 'జిదాల్' అంటే ఘర్షణలు కొట్లాటలు పుట్టించే పనులు అని వాడడం జరిగింది. ఈ మూడు కార్యకలాపాలు హజ్ ఆరాధనను నాశనం చేస్తాయి. విచారించవలసిన విషయం ఏమిటంటే హజ్ చేసేటప్పుడు ఈ మూడు విషయాలను గురించి శ్రద్ధ వహించేవారు బహు అరుదు. ముఖ్యంగా జిదాల్ (ఘర్షణలు కొట్లాటలు) దృశ్యాలు హజ్ సందర్భంలో బాగా కనబడుతుంటాయి.

దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) హజ్ ప్రాముఖ్యాలనేకం లెక్కించారు. ఓసారి

ఆయన హజ్ గురించి చెబుతూ "ప్రజలారా! మాపై హజ్ ఫర్జుగా చేయబడింది. కనుక హజ్ చేయండి" అని సెలవిచ్చారు. దీని ప్రాధాన్యతను దృష్టిలో ఉంచుకొని ఓ వ్యక్తి ప్రవక్తా! ఈ హజ్ ధర్మాన్ని ప్రతి సంవత్సరం నెరవేర్చాలా? అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సఅసం) ఎలాంటి సమాధానం ఇవ్వకుండా మిన్నకుండిపోయారు. ఆ తరువాత ఆయన ప్రజల్ని సంబోధిస్తూ "నేనే గనక యేటేటా దీన్ని విధిగా ఆచరించాలి అని అంటే అల్లాహ్ ప్రతి సంవత్సరం మీపై ఫర్జుగా చేసేవాడే. ఆ తరువాత మీరు దీన్ని ప్రతియేటా నిర్వహించలేక పోయేవారు. కాబట్టి నేను ఏ ఆదేశం ఇస్తానో దాన్ని అమలుచేయండి. మరే విషయాల గురించి నేను వారిస్తానో ఆగిపోండి. అనవసరంగా ప్రశ్నించకండి. గత జాతులన్నీ అందుకే నాశనమయ్యాయి." (ముస్లిమ్, నిసాయి)

హజ్ చేయడం జీవితంలో ఒక పర్యాయమే ఫర్జు (విధి). దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు.

"కేవలం ప్రసన్నత కోసం హజ్ చేసే వాడు హజ్ యాత్రలో కామచేష్టలకు, పాప కార్యాలకు, ఘర్షణలకు దూరంగా ఉంటే అతడు అప్పుడే తల్లి గర్భంనుండి జన్మించిన శిశువులా పాపాలకు అతీతుడుగా మరలి వస్తాడు." (బుకారి, ముస్లిమ్)

హజ్ చేయడం ద్వారా పాపాలన్నీ కడగబడతాయి అనడంలో ఏమాత్రం సందేహం లేదు. అయితే దివ్యఖుర్ఆన్, హదీసు గ్రంథాల్లో దీనికోసం ఏయే షరతులు పెట్టడం జరిగిందో వాటిని పూర్తిగా పాటించవలసి ఉటుంది. ఓ వ్యక్తి దైవప్రసన్నత కోరకుండా, కేవలం కీర్తి ప్రతిష్ఠలకోసం లేక ప్రదర్శనాబుద్ధితో లేక వ్యాపారం కోసమే హజ్ చేస్తాడో ఆ వ్యక్తి పాపాలకు దూరంగా ఉండే బదులు హజ్ కాలంలోనే పాపాలకు ఒడిగట్టిన వాడవుతాడు. హజ్‌లాంటి ఆరాధనను వ్యాపారంకోసం, బ్లాక్ మార్కెటింగ్, స్మగ్లింగుకోసం వాడుకునే వ్యక్తి పాపాలు ఎలా కడగబడతాయిమరి!

## హజ్ విషయంలో లభించవలసిన శుభాలు ఎలా లభిస్తాయి!

హజ్ చేసే స్తోమత ఉండి కూడా హజ్ చేయనివారిని గురించి దైవప్రవక్త(సఅసం) ఇలా సెలవిచ్చారు.

"ప్రయాణసామగ్రి (దారిబత్తెం) వాహనం, దైవగృహం దాకా వెళ్ళొచ్చే స్తోమత ఉండి కూడా ఒక వ్యక్తి హజ్‌కు వెళ్ళకపోతే దైవం దృష్టిలో, అతడు హజ్ చేయకుండా చనిపోవడానికి యూదుడై క్రైస్తవుడై మరణించడానికి నడుమ ఎలాంటి తేడా లేదు". అంటే ఆ ఇద్దరూ ఒకటే అన్నమాట. (తిర్మిజి)

وَلِلّٰهِ عَلَى النَّاسِ حِجُّ الْبَيْتِ مَنِ اسْتَطَاعَ إِلَيْهِ سَبِيلًا ۚ وَمَن كَفَرَ فَإِنَّ اللّٰهَ غَنِيٌّ عَنِ الْعَالَمِينَ ـ

"ఈ గృహానికి వెళ్ళే శక్తిగలవాడు దాని హజ్‌ను విధిగా చేయాలి. ఈ ఉత్తర్వులను ధిక్కరించేవాడు, అల్లాహ్‌కు ప్రపంచ ప్రజల అవసరం ఎంతమాత్రం లేదని స్పష్టంగా తెలుసు కోవాలి."

అంటే హజ్ చేయకుండా ఉండడం దైవ తిరస్కారం (కుఫ్ర్)తో సమానమన్నమాట.

మహాప్రవక్త (సఅసం) కేవలం తాకీదు చేసి ఊరుకోలేదు ఆ తాకీదును చేతల ద్వారా కూడా అమలు చేసి చూపించారు హిజ్రీశకం ఆరులో ఆయన వేలాది మంది సహాబా (రఅన్) (అనుచరగణం)ను వెంటబెట్టుకొని 'ఉమ్రా' చేసే ఉద్దేశంతో మక్కాకు బయలుదేరారు. కాని దైవ తిరస్కారులైన నాటి ఖురైషీలు 'హుదైబియా' అనే చోట ఆటంకం ఏర్పరచడం వల్ల 'ఉమ్రా' నిర్వహించకుండా వెనుదిరిగి రావలసి వచ్చింది మరుసటి సంవత్సరం హిజ్రీశకం ఏడులో మరింతమందితో వెళ్ళి 'ఉమ్రా' నిర్వహించారు. ఆ తరువాత హి.శ ఎనిమిదిలోనూ ఉమ్రా చేసి వచ్చారు. హి.శ తొమ్మిదిలో ఆయన హజ్రత్ అబూబక్ర్ (ర.అన్)తో సహా ఇతర సహబీలను పంపి "అజ్ఞాన కాలం నాటి ఆచారా లన్నింటిని తుదముట్టించడం జరిగింది" అన్న ప్రకటన చేశారు:

ఆ తరువాత హి.శ. 10లో అనేక వేలమంది అనుచరగణంతో కలసి హజ్ చేయ డానికి బయలుదేరారు. మార్గంలో అనేకమంది ప్రజలు వచ్చి చేరడంతో యాత్రకుల సంఖ్య లక్షకు పైగా అయింది. వారందరితో కలిసి ఆయన చివరి హజ్ గావించారు. ఆ హజ్‌లో ఆయన చరిత్రాత్మకమైన ప్రసంగం చేశారు. ఆ ప్రసంగం 'ఖుద్బయె హజ్జతుల్‌విదా' అంటే చివరి హజ్ ప్రసంగంగా ప్రఖ్యాతిగాంచింది.

ఆయన నిర్యాణం తరువాత, సాధారణ సహబీలు (అనుచరులు) కూడా ఈ విధి నిర్వహణలో ఎలాంటి నిర్లక్ష్యాన్ని చూపలేదు. నలుగుర ఖలీఫాలు, హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్, హజ్రత్ ఉమర్‌ఫారూఖ్, హజ్రత్ ఉస్మాన్,హజ్రత్ ఆలీ (ర.అన్)లు తమతమ పాలనా కాలాల్లో ఇస్లామీ జగత్తుకు సంబంధించిన బాధ్యతాయుత అధికారుల్ని ఈ సందర్భంలో పిలిపించి వారి ఆధీనంలోని దేశాల పరిస్థితిని తెలుసుకునేవారు. అవసరమైన సలహాలను ఆదేశాల్ని ఇచ్చి పంపేవారు. ఇస్లామీయ జగత్తులోని ప్రతి ప్రాంతం నుండి ముస్లిములు హజ్ కోసం వస్తూ ఉండేవారు కాబట్టి, ఏదైనా ఆదేశం ఇవ్వవలసివస్తే బహి రంగంగానే ప్రజా సమూహంలో వాటిని ప్రకటించేవారు. ఇలా ప్రకటించడం మూలానా ఈ ఆదేశాలు రాజ్యంలోని మూలమూలలకు చేరేవి.

హ(జత్ ఉమర్ (ర.అన్) కాలంలో కొత్తగా అనేక జాతులు పెద్ద ఎత్తున ఇస్లామ్ స్వీకరించాయి. ఉదాహరణకు క్రైస్తవులు, యూదులు, మజూసీలు, సాయిబీలు క్రొత్తగా ఇస్లాం స్వీకరించారు. వారికి హజ్ ఆరాధన గురించి అంతగా అవగాహన లేకపోవడం వలన, హజ్ చేసే స్తోమత ఉండికూడా వారిలో చాలామంది దాన్ని నిర్వహించడానికి బద్ధకించేవారు.

"అందుకని హ(జత్ ఉమర్ (ర.అన్) నమాజ్‌ను, జకాత్‌ను వదిలేసిన వారిలో స్తోమత కలిగి ఉండికూడా హజ్ చేయని వారితో జిహాద్ చేస్తాను జాగ్రత్త" అని ప్రకటిం చాల్సి వచ్చింది. అదేకాదు ఇలా కూడా ప్రకటించాల్సి వచ్చింది.

1. హజ్‌చేసే స్తోమత ఉండి కూడా, హజ్ చేయకపోతే అలాంటి వారిపై నా ప్రతినిధుల్ని పంపి ఆరాతీసి 'జిజియా' విధించాలనుకుంటున్నాను".

పై వ్యాఖ్యాల్ని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే 'హజ్' ఆరాధనకు ఇస్లామ్ ధర్మంలో గల ప్రాధాన్యత ఏమిటో అర్థం అవుతుంది. ఆ ఆరాధనను విస్మరించే వారిని దైవప్రవక్త (సఅసం), ఆయన సహబీలు ఎలా అసహ్యించుకున్నారో అవగతం అవుతుంది.

## హజ్ ప్రయోజనాలు

హజ్ చేయడం వల్ల ఒనగూడే ప్రయోజనాల్లో ముఖ్యమయింది ప్రళయదిన దృశ్యం కళ్ళ ముందు మెదలడం, ప్రళయం రోజున ప్రతి వ్యక్తి తాను ఖననం చేయబడ్డ దుస్తుల్లో (కఫన్) తిరిగి లేస్తాడు. ఎటుచూసినా తెల్లటి కఫన్ దుస్తులు కప్పుకున్న ప్రజలే దర్శన మిస్తారు. హజ్ సమయంలోను, అరఫాత్ మైదానంలో హాజీలంతా ఒకే రకమైన దుస్తుల్లో కనచూపు మేరకు కనబడతారు. ఈ దృశ్యం ప్రళయాన్ని గుర్తుకు తెస్తుంది.

అదే కాకుండా హజ్‌లో నిర్వహించే ప్రతి అంశం ప్రళయంనాటి ఏదో ఒక భయం కర సంఘటనను, సన్నివేశాన్ని గుర్తుకు తెస్తుంది. హజ్ నిర్వహణలో దైవం ఎడల మక్కువ. అభిమానం పెరిగి హజ్ (హజ్‌యాత్రికుడు) వాటిని తన చేతల ద్వారా ప్రకటిస్తాడు. ఇంతకంటే కావలసిందేముంటుంది ఓ హాజీకి!

హజ్ సందర్భంలో మనిషి కామ సంబంధమైన కోరికల్ని, మనోవాంఛల్ని అణచు కోవాలని దృఢంగా నిశ్చయించుకుంటాడు. అతడిలో నిబిడీకృతంగా ఉన్న అహంకారం అణిగిపోతుంది. సహనం, సామరస్యం అతనిలో చోటుచేసుకుంటాయి.

ఇలాంటి ఆధ్యాతిక ప్రయోజనాలే కాకుండా అనేక ప్రాపంచిక లాభాలు కూడా హజ్ ద్వారా పొందవచ్చు. ప్రపంచంలోని ముస్లిం దేశాల ప్రజల్తో కలిసి మాట్లాడే అవకాశం కలుగుతుంది. ప్రపంచంలో విస్తరించి ఉన్న ముస్లిములంతా ప్రతిదేశం నుండి అక్కడ

హాజరవుతారు కాబట్టి. ఇక ప్రయాణం చేసే అవకాశం లభించడం వల్ల ఎన్నో అనుభవాలు కలిగి మరెన్నో కొత్త విషయాలు తెలుసుకునే అవకాశం లభిస్తుంది. అంతే కాదు హజ్ మూలంగా ఇస్లామీయ ఔన్నత్యం చాటబడుతుంది. మనిషికి కష్టపడే అలవాటూ పడుతుంది.

## హజ్ ఫర్జ్ అయిన సంవత్సరం

హజ్రత్ ఇబ్రాహీం (అలై) సమాజంలో ఆదినుండే హజ్ ప్రాముఖ్యం సంతరించుకొని ఉంది. అయితే అది హిజ్ర్ శకం రెండు, లేక మూడులో మాత్రమే విధిగా నిర్ణయించబడింది. హజ్‌కు సంబంధించిన ఆదేశాలు, అది విధిగా నిర్ణయించిన విషయం దివ్య ఖుర్ఆన్‌లోని బకరా సూరా, ఆలి ఇమ్రాన్, హజ్ అనే అధ్యాయాల్లో ప్రస్తావించ బడ్డాయి. బకరా అధ్యాయంలో అధిక భాగం హి.శ. రెండులోను, ఆలి ఇమ్రాన్‌లో అధ్యాయం ఎక్కువభాగం హి.శ. మూడులోను అవతరించాయి. అంటే 'బద్ర్' యుద్ధా నంతరం అవతరించనారంభించాయి అన్నమాట. అందుకే 'హజ్' యాత్ర హి.శ. మూడు లోనే విధి ఫర్జ్ అయి ఉండాలి. కాని ఖురైషీ దైవతిరస్కారులు ప్రారంభించిన యుద్ధ క్రమం వల్ల మహాప్రవక్త (సఅసం), ఆయన అనుచరగణం హజ్ నిర్వహించే సౌలభ్యం పొందలేక పోయారు. హి.శ. ఆరులో అహ్జాబ్ యుద్ధం ముగిశాక గాని కొంత తీరిక లభించలేదు. ఆ సంవత్సరమే 'ఉమ్రా' కోసం వారు సన్నద్ధులవడం జరిగింది.

మక్కా నగరంలో నివసించినంత కాలం దైవప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు కాబా గృహాన్ని సందర్శిస్తూనే ఉండేవారు. 'హిజ్రత్' అనంతరం వారికి ఈ భాగ్యం కరువైంది. అయితే కాబా గృహాన్ని సందర్శించాలనే కోరిక మాత్రం పరవళ్ళు తొక్కేది వారి మనస్సుల్లో. కాబట్టి హజ్‌యాత్ర ఫర్జ్ అయిన మూడేళ్ళ తరువాత 'ఉమ్రా' నిర్వహించే సంకల్పంతో హిజ్రిశకం ఆరులో పద్నాలుగు వందల మంది సహాబీలతో సహా మదీనా నుండి మక్కాకు బయలుదేరారు. కాని ఖురైషీ దైవతిరస్కారులు ఆటంక పరిచారు. దైవప్రవక్తను, ఆయన అనుచరుల్ని వాళ్ళు 'హుదైబియా' అనే చోట అటకాయించడం జరిగింది.

ఆ సందర్భంలోనే దైవప్రవక్త (సఅసం) వారితో ఓ సంధి (ఒడంబడిక) కుదుర్చు కున్నారు. ఆ ఒడంబడిక లేక సంధి 'సులహయే హుదైబియా' అనే పేరుతో ప్రసిద్ధి గాంచింది. ఆ తరువాత సంవత్సరం మరలా ఉమ్రా కోసం సమాయత్తమవడం, మరుసటి సంవత్సరం తిరిగి హిజ్రీ శకం 8లో మక్కా విజయం జరిగాయి. మక్కా విజయం సందర్భం లోనూ సహాబీలతో పాటు ఉమ్రా పాటించారు. ఇక హి.శ. 10లో ఆయన హజ్ చేశారు.

అదే 'హజ్జతుల్‌విదా' (వీడ్కోలు హజ్). ఆ తర్వాత నాలుగైదు నెలల్లోనే దైవప్రవక్త (సఅసం) పరమపదించారు.

## హజ్ అంటే

ఎవరైనా ఔన్నత్యంగల వ్యక్తినిగాని, ఓ పవిత్రతను సంతరించుకున్న ఏదేని ప్రదేశాన్నిగాని సందర్శించడాన్ని అరబీ భాషలో హజ్ అంటారు. అయితే ఇస్లామీయ షరీఅత్ పరిభాషలో మాత్రం హజ్ చేసే కాలంలో కాబా గృహాన్ని సందర్శించడం 'అరఫాత్' మైదానంలో ప్రవేశించడాన్ని 'హజ్' అంటారు.

## ఖానయే కాబా (కాబా గృహం)

మక్కా నగరంలో ఓ ముఖ్యమైన ప్రదేశం ఉంది. దాన్నే మనం 'ఖానయే కాబా' (కాబాగృహం) అని పిలుస్తాం. కాబాగృహం దగ్గర, దాని పరిసరాల్లో హజ్‌కు సంబంధించిన సకల నియమాలు పాటించబడతాయి. ఈ గృహాన్ని దివ్యఖుర్‌ఆన్, బైతుల్‌అతీక్ (పురాతన గృహం). మస్జిదెహరాం (పవిత్ర మస్జిద్), దైవగృహం, మక్కా ఖిబ్లాగా చెప్పబడుతోంది. మనం అయిదు పూటలా ఈ గృహం వైపుకే తిరిగి నమాజు చేస్తాం. కాబా గృహం దిశగా ముఖం పెట్టి మల మూత్ర విసర్జన చేయడం తప్పు. దైవారాధన కోసం ఈ భువిపై నిర్మించబడ్డ ప్రప్రథమ ఆరాధానాలయం మక్కా నగరంలో నిర్మించబడిందని చెప్పడం జరిగింది దివ్యఖుర్‌ఆన్‌లో. అంటే దీన్ని ప్రప్రథమంగా హజ్రత్ ఆదం (అలైహి) తమ స్వహస్తాలతో నిర్మించారు.

ఆ తరువాత నూహ్ (అ) నాటి జలప్రళయంలో ఈ కట్టడం పడిపోగా తిరిగి హజ్రత్ ఇబ్రాహీమ్(అ) దీన్ని నిర్మించారు. ఈ విషయం దివ్యగ్రంథంలో ఉంది. ఆయన తరువాత అనేకమార్లు అది పడిపోవడం తిరిగి నిర్మించబడటం జరిగింది. హజ్రత్ ఇబ్రాహీం తోపాటు ఆయన కుమారుడు హజ్రత్ ఇస్మాయీల్ (అ) దీని నిర్మాణంలో చేయూత నిచ్చారు.

హజ్రత్ ముహమ్మద్ (సఅసం)కు దైవప్రవక్త పదవి లభించక మునుపు ఓ మారు వరదల్లో ఈ కట్టడం పడిపోయింది. ఖురైషీయులు దీనిని పునర్నిర్మించారు. నిర్మాణం పూర్తయిన తర్వాత హజ్రె అస్వద్ (నల్లరాయి)ని దాని స్థానంలో ఎవరు పెట్టాలన్న విషయమై వారిలో వివాదం, ఘర్షణ ప్రారంభమైంది. ప్రతి తెగ ఈ పవిత్రమైన రాయిని తానే దాని స్థానంలో ఉంచాలని పట్టు పట్టింది. ఈ వివాదం ఎంతకూ సమసిపోదూ అని గ్రహించి

దైవప్రవక్త హజ్రెఅస్వద్‌ను ఓ వెడల్పాటి దుప్పటిలో ఉంచి ప్రతి తెగకు సంబంధించిన వారు దుప్పటి పైకెత్తమని చెప్పారు. వారు అలానే చేశారు. అలా పైకెత్తబడ్డ దుప్పటి హజ్రె అస్వద్ స్థానంలోనికి రాగానే ఆయన తన చేతుల్తో ఆ రాయిని దాని స్థానంలో ఉంచారు. అందరూ ఈ తీర్పును ఎంతో మెచ్చుకుని హర్షించారు. ఆ వివాదం ఇలా సమసిపోయింది.

ఖురైషీయులు కాబాను నిర్మించేటప్పుడు కాబాకు సంబంధించిన హతీమ్ అనే భాగాన్ని వేరుగా చేసి కట్టారు. హజ్జతుల్ విదా సందర్భంలో దైవప్రవక్త ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ "ఈ ఖురైషీయులు ఇస్లాం ధర్మానికి ప్రమాదం కలిగించే వారు కాకుండా ఉంటే దీన్ని (హతీమ్‌ను) తిరిగి ఇబ్రాహీం(అ) కాలంలో ఉన్నట్లుగానే నిర్మించేవాణ్ణి" అని అన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) గారు ఖలీఫా అయ్యాక దైవప్రవక్త (సఅసం) కోరిక మేరకు హతీమ్‌ను కాబాతో కలిపి కట్టారు.

అయితే హజ్జాజఇ బిన్ యూసుఫ్ అనేవాడు అబ్దుల్లా బిన్ జుబైర్‌ను జయించాక తిరిగి హతీమ్‌ను కాబా నుండి వేరు చేసి కట్టాడు. ఆ తరువాత వచ్చిన ఖలీఫాలు హతీమ్ తిరిగి కలిపి కడదామనుకున్నప్పుడు హజ్రత్ ఇమామ్ మాలిక్ రహ్మాలై వారిని వారిస్తూ ఇలా కడుతూ పడవేస్తూ పోతుంటే ఇదొక అలవాటుగా మారిపోతుందని హెచ్చరించారు. అందుకే ఆ కట్టడం ప్రస్తుతం పూర్వస్థితిలోనే ఉండిపోయింది. అయితే దానికి మరమ్మత్తులు మాత్రం జరుగుతున్నాయి.

హజ్‌లో ఏ నిబంధనలు పాటించాలో చెప్పేముందు హజ్‌కు సంబంధించిన కొన్ని పారిభాషిక పదాలను కొన్ని ప్రదేశాల పేర్లను వివరించడం అవసరం.

## పారిభాషిక పదాలు

**1. మీకాత్ :** హజ్‌కు వెళ్ళేవారు మక్కా చేరకమునుపే ఓ ప్రత్యేకమైన ప్రదేశంలో ఆగి స్నానాలు చేసి ఇహ్రాం (హజ్ వస్త్రాలు) ధరిస్తారు. ఈ ప్రత్యేక ప్రదేశాన్నే 'మీకాత్' అంటారు. ఎవరయినా పొరపాటున ఈ ప్రదేశంలో ఇహ్రాం కట్టుకోకపోతే తిరిగి ఈ ప్రదేశానికి వచ్చి ఇహ్రాం కట్టుకుని వెళ్ళవలసి వస్తుంది. భారత పాక్‌ల నుండి వచ్చేవారి మీకాత్ ప్రదేశం 'యలమ్‌లం' కొండ.

ఇదేవిధంగా ఇతర దేశాలనుండి వచ్చే వారికి వేరువేరు మీకాత్‌లు ఉన్నాయి. మదీనా వైపు నుండి వచ్చే వారి మీకాత్ 'జుల్‌హలీఫా'. కూఫా, బస్రా, బగ్దాద్ వైపు నుండి వచ్చే వారి కోసం 'జాతె అరక్', టర్కీ సిరియా వైపునుండి వచ్చే వారి కోసం 'హుజ్‌ఫా' మీకాత్‌లు. భారత, పాకిస్తాన్ వారు ముఖ్యంగా విమానం ద్వారా వచ్చే వారు బొంబాయి

లోనే ఇహ్రాం కట్టుకోవచ్చు. లేదా జిద్దా చేరాక అయినా ఇహ్రాం కట్టుకోవచ్చు అంటారు ధర్మవేత్తలు. అయితే మీకాత్ ప్రదేశానికి వెళ్ళే ఇహ్రాం కట్టుకోవడం ఉత్తమం.

**2. ఇహ్రామ్:** హజ్ లేక ఉమ్రా చేసే సంకల్పంతో ఓ ప్రత్యేకమైన వస్త్ర ధారణ చేయడం, తల్బియా పలకడం.

**3. తల్బియా:** ఇహ్రామ్ కట్టుకున్న లగాయితు హజ్ పూర్తి అయినంతవరకు కూర్చున్నా, లేచినా హజ్ నిబంధనలు పాటించినా ఏ దుఆ అయితే పఠించబడుతుందో అదే తల్బియా.

**తల్బియా పదాలు:**

**లబ్బైక్ అల్లాహుమ్మా లబ్బైక్. లబ్బైక్ లా షరీక లక లబ్బైక్. ఇన్నల్ హమ్‌ద వన్నిఇమత్ లక. వల్ ముల్క లాషరీక లక. (బుకారి)**

لَبَّيْكَ اللّٰهُمَّ لَبَّيْكَ. لَبَّيْكَ
لَا شَرِيْكَ لَكَ لَبَّيْكَ
إِنَّ الْحَمْدَ وَالنِّعْمَةَ
لَكَ وَالْمُلْكَ لَا شَرِيْكَ
لَكَ. (بخاری ومسلم)

**అర్థం :** హాజరయ్యాను ఓ అల్లాహ్ హాజరయ్యాను. హాజరయ్యాను నీకు సాటి మరెవ్వరూ లేరు. సకల స్తోత్రాలు నీకే. సకల వరాలు నీవే. సకల లోకాల పరిపాలనా నీవే. నీకు భాగస్వామే లేదు.

**4. తహ్‌లీల్ :** సద్వచనం అంటే లా ఇలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్రసూలుల్లాహ్ అని పలకడమే. దీన్ని 'తహ్‌లీల్' అంటారు.

**5. తవాఫ్:** కాబాగృహం చుట్టూ ఏడు ప్రదక్షిణలు చేయడాన్ని 'తవాఫ్' అని అంటారు. తవాఫ్ చేసే ప్రదేశమే మతాఫ్.

**6. ఉమ్రా:** ఇహ్రామ్ ధరించి కాబా ప్రదక్షిణ చేయడం, సఫా-మర్వా కొండల మధ్య సయీ చేయడం (వడవడిగా నడవడం) ఉమ్రా. ఇది హజ్ కాలంలో కాకుండా ఇతర కాలంలో కూడా చేయవచ్చు. ఇది ఎంతో పుణ్యప్రదమైనది.

**7. ఇహ్రామ్ :** మీకాత్ ప్రదేశానికి చేరి ఓ ప్రత్యేకమైన దుస్తులను ధరించడం తల్బియా పలకడాన్ని ఇహ్రామ్ అంటారు. ఇహ్రామ్ అంటే నిషిద్ధం చేసుకోవడం. దీన్ని ఇహ్రామ్ అని అనడానికి కారణం ఏమిటంటే దీన్ని కట్టుకున్న తర్వాత హలాల్ (ధర్మసమ్మతం) అయిన అనేక విషయాలు 'హరాం' (నిషిద్ధం) అవుతాయి. ఇహ్రామ్ కట్టిన వ్యక్తిని మొహ్రిమ్ అని అంటారు.

## హజ్ మరియు ఇహ్రామ్ రకాలు

హజ్ మూడు రకాలు 1. ఇఫ్రాద్, 2. తమత్తో, 3. ఖిరాన్. ఈ తేడాలు ఇహ్రామ్ కట్టేటప్పుడు చేసే సంకల్పంపై ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఇలా ఇహ్రామ్ కూడా మూడు రకాలదవుతుంది.

**8. ఇఫ్రాద్ :** కేవలం హజ్ కోసమే కట్టే ఇహ్రామ్‌ను ఇఫ్రాద్ అని అంటారు. ఇలాంటి ఇహ్రామ్‌ను కట్టే వ్యక్తిని ముఫ్రీద్ అంటారు.

**9. తమత్తో :** హజ్ కాలంలోనే ఇహ్రామ్ కట్టి ఉమ్రా చేయడం. ఆ తరువాత కొన్ని రోజులు ఆగి ఇహ్రామ్ విప్పేయడం జరుగుతుంది. ఇలాంటి హజ్ విధానాన్ని తమత్తో అంటాం. ఆ తరువాత హజ్ విధుల్ని నిర్వహించడానికి జిల్‌హజ్జా ఎనిమిదో తేదీనాడు తిరిగి ఇహ్రామ్ కట్టుకోవడం జరుగుతుంది. 'ఉమ్రామ్', 'హజ్'కు నడుమ కొన్ని రోజులు, హరాం అయిన వస్తువులు తిరిగి హలాల్ అవుతాయి గనుక ఆ వెసులుబాటు కలగడం వలన హాజీ ప్రయోజనం పొందుతాడు. అందుకని ఈ ఇహ్రామ్‌ను కూడా ఇహ్రామె తమత్తో అని అంటారు. ఈ పద్ధతి ప్రకారం హజ్ చేసేవాడు 'ముతమత్తా' గా పిలువబడతాడు.

**10. ఖిరాన్:** హజ్ మరియు ఉమ్రాలకోసం ఒకేసారి ఇహ్రామ్ కట్టి మొదట ఉమ్రా చేయడం ఆ తరువాత హజ్ నిర్వర్తించడం. ఈ రకమైన పద్ధతిని ఖిరాన్ అని అంటారు. ఈ విధానాన్ని పాటించేవాడు 'ఖారిన్' అనబడతాడు. ఖిరాన్ అంటే కలపడం అని, ఈ పద్ధతిలో ఉమ్రా, హజ్ రెండూ కలుస్తాయి గనుక దీన్ని 'ఖిరాన్' అన్నారు.

**11. సయీ :** సఫా, మర్వా కొండల నడుమ వడివడిగా నడవడంగాని లేక పరుగిడడాన్ని 'సయీ' అంటారు. సయీ అనే పదానికి అర్థం వడిగా నడవడం అని.

**12. షౌత్ :** కాబా చుట్టూ ఒక ప్రదక్షిణ చేయడంగాని, సఫా మర్వాల నడుమ ఓసారి పోయి రావడంగాని 'షౌత్' అవుతుంది.

**13. ఇస్తీలామ్ :** 'హజ్రెఅస్వద్'ను (నల్లరాయిని) చేత్తో తాకడం లేక చుంబించడం లేక రెండు అరచేతుల్ని దానికి అభిముఖంగా చేసి వాటిని చుంబించడం 'ఇస్తీలాం' అనబడుతుంది.

**14. ఉకూఫ్ :** అరఫాత్ మైదానం మరియు 'ముజ్‌దలిఫా' కు చేరి అక్కడ కొంత సేపు ఆగడాన్ని 'ఉకూఫ్' అంటారు. ఉకూఫ్ అంటే ఆగడం అన్నమాట.

**15. రమీ :** రమీ అంటే విసరడం, 'జమ్రా'పైకి గులకరాళ్ళను విసరడాన్ని 'రమీ'

అంటారు. ఇవి మూడు రకాలు. 1. జమ్రయె ఊలా, 2. జమ్రయె 'ఉస్తా', 3. జమ్రయే అక్బా.

**16. రమల్ :** రొమ్ము విరిచి నడవడం, లేక చేతులను ఊపుతూ ఠీవిగా నడవడం. తవాఫ్‌లోని మూడు ప్రదక్షిణల్లో చేతులు ఊపుతూ, రొమ్మును కొంత విరిచి ఠీవిగా నడవడం. ఇది మహాప్రవక్త (సఅసం) గారి సున్నత్ (సంప్రదాయం)కు గుర్తుగా చేయడం జరుగుతుంది. ఆ సంప్రదాయం ఎలా వచ్చిందంటే, మక్కా నుండి మదీనాకు హిజ్రత్‌చేసి వెళ్ళిన తరువాత దైవప్రవక్త (సఅసం) అనుచరులు అక్కడి వాతావరణం సరిపడక బలహీనులైపోయారు. తిరిగి ఆయన హజ్ చేయడానికి మక్కా వెళ్ళినప్పుడు దైవ తిరస్కారులు కొందరు ఆయన శారీరక బలహీనతను చూసి ఎగతాళి చేశారు. అందుచేత దైవప్రవక్త (సఅసం), ముస్లిములు ఒకరి దృష్టిలో బలహీనులుగా కనబడకూడదనే ఉద్దేశ్యంతో అనుచరుల్ని కొంత ఠీవిగా నడవమని ఆదేశించడం జరిగింది.

**17 ఇజ్తిబా:** తవాఫ్ ప్రారంభించేముందు పురుషులు తమతమ అంగ వస్త్రపు కుడి అంచును కుడి చంకలో నుండి బయటకు తీసి ఎడమ భుజంపై వేసుకోవాలి. దీన్నే షరీఅత్‌లో ఇజ్తిబా అన్నారు. స్త్రీలు అలా చేయడం మక్రూహ్.

**18. తహ్‌లీఖ్ :** తహ్‌లీఖ్ అంటే తల గొరిగించుకోవడం. హజ్ నియమాలను కొన్నింటిని నిర్వర్తించిన తరువాత తల వెంట్రుకలు గొరిగించుకోవడం జరుగుతుంది. ఇదే తహ్‌లీఖ్ అంటే. ఇది కేవలం పురుషులకే. స్త్రీలకు కాదు.

**19. తక్సీర్ :** తక్సీర్ అంటే పొట్టివిగా చేయించుకోవడం (తగ్గించటం) వెంట్రుకల్ని గొరిగించుకోకుండా పొట్టిగా కత్తిరించుకోవడాన్ని తక్సీర్ అని అంటారు.

**20. అఫాకీ :** మీకాత్ పరిధిలో నివాసం ఉండనివాడు. ఉదాహరణకు భారతీయుడు, బంగ్లాదేశీయుడు, పాకిస్తాన్ పౌరుడు వగైరాలు.

## హజ్‌కు సంబంధించిన ప్రదేశాలు

**1. హరమ్:** హరం అంటే పరిశుద్ధమైనది, పవిత్రమైనది అని. ఏ ప్రదేశ పరిశుద్ధత దృష్ట్యా, కొన్ని హలాల్ (ధర్మ సమ్మతమైన), కొన్ని ముబాహ్ (నిషిద్ధం కానివి) వస్తువులు కూడా హరామ్ (నిషిద్ధం) అయిపోగలవో, భూమండలంలోని ఆ ప్రత్యేకమైన పవిత్ర స్థలాన్ని షరీఅత్ పరిభాషలో 'హరం' అని అంటారు. మక్కా చుట్టూ కొన్ని మైళ్ళ పరిధిగల భూభాగం ఈ హరంలోనిదే. ప్రజలు గుర్తించడానికి నలువైపులా గుర్తులు స్థాపించడం జరిగింది. ఈ హరమ్‌లో ఏ జంతువునైనా బాధించడం నిషిద్ధం. సరికదా ఎవరైనా నీడ పట్టున కూర్చుని ఉంటే వారి దగ్గరకు వెళ్ళి వారిని బాధించడం కూడా నిషిద్ధమే.

**2. మస్జిదె హరామ్:** హాజీలు అయిదు పూటలా నమాజు చేసే పవిత్రమైన మస్జిద్. ఈ మస్జిద్‌లోని ఓ భాగంలోనే 'ఖానయెకాబా' (దైవగృహం), 'హతీమ్'లు ఉన్నాయి. ఈ మసీదులో ప్రవేశించడానికి అనేక ద్వారాలు ఉన్నాయి.

**3. హతీమ్ :** ఒకానొక కాలంలో దైవగృహ భాగంగా అలరారి, ప్రస్తుతానికి దానికి బయటవున్న ఓ ప్రత్యేక ప్రదేశం. కాబా గృహాన్ని గౌరవించినట్లే దీన్ని కూడా గౌరవించాలి. తవాఫ్‌లో ఇది కూడా చేరి ఉంది.

**4. హజ్రె అస్వద్:** కొంత ఎరుపు ఛాయ కలిగిన నల్లని రాయి. ఇదికాబా గృహానికి తూర్పు ఓ మూలన గోడలో పెట్టి ఉంది. తవాఫ్ చేసేటప్పుడు దీన్ని తాకే అవకాశం లేక చుంబించే అవకాశం గల ఎత్తులో ఉంది. ఈ రాయి స్వర్గం నుండి అవతరించింది గనుక చుంబిస్తారు దీన్ని. అయితే ఈ చుంబనం భక్తి పూర్వకమైన చుంబనం కాదు. కేవలం ప్రేమతో చుంబించే చుంబనం మాత్రమే. దీనికి లాభనష్టాలు కలిగించే ఎలాంటి శక్తి సామర్థ్యాలు లేవు. ఇస్తిలాం చేసేటపుడు పఠించే దుఆలోనే ఈ విషయం నిబడీకృతం అయివుంది.

హజ్రత్ ఉమర్ (రజిఅన్)దీన్ని చుంబించేటప్పుడల్లా ఇలా సంబోధించేవారు. "ఓ రాయీ! కేవలం నీవు ఒక శిల మాత్రమే. నీలో లాభనష్టాలు కలిగించే శక్తి సామర్థ్యాలు ఏమాత్రంలేవు. దైవప్రవక్త (సఅసం) నిన్ను చుంబించడం చూడకపోయి ఉంటే నేనెప్పుడు నిన్ను చుంబించేవాణ్ణి కాదు."

ఈ పలుకుల వల్ల అర్థం అయిందేమిటంటే, విగ్రహారాధకులు, బహుదైవారాధకులు, విగ్రహాలు, పటాల ముంగిట ఏ భావంతో మోకరిల్లుతున్నారో ముస్లిములు మాత్రం ఆ భావంతో దాన్ని చుంబించడం లేదు అని. ఈ రాయి ఓ జానెడు వెడల్పు, అంతకంటే కొంత ఎక్కువ పొడవు కలిగి ఉంది.

**5. రుక్నెయమాని:** ఇది కాబా గృహపు నాల్గోమూల. ఇక్కడకు చేరిన హజీ ఈ భాగాన్ని తన చేతుల్తో లేక కుడి చేతితో తాకి హజ్రె అస్వద్‌వైపుకు కదలాలి. ఇదే కాకుండా ఇంకొన్ని భాగాలున్నాయి. ఉదాహరణకు రుక్నెఇరాకీ, రుక్నెషామా వగైరాలు.

**6. మకామె ఇబ్రాహీం:** ఇక్కడ ఓ రాయి ఉంది. దీనిపైకి ఎక్కే హజ్రత్ ఇబ్రాహీం (అ.స) కాబా గృహాన్ని నిర్మించారు. దీన్ని ఆధారంగా చేసుకునే ఆయన తన వాహనం ఎక్కేవారు, దిగేవారు. ఈ రాతిపై ఆయన పాద ముద్రలున్నాయి. ఇది కాబా గృహానికి ఎదురుగా ఉంది. దీనిచుట్టూ ఇనుప చువ్వల గ్రిల్ నిర్మించబడి ఉంది.

**7. మాజాబె రహ్మత్:** రహ్మత్ అంటే కారుణ్యం. మాజాబ్ అంటే వర్షపు నీరు పడే గొట్టం. ఇక్కడ నిలబడి దుఆ చేస్తారు. ఇక్కడే హ|జ్రత్ ఇస్మాయీల్ (అస) సమాధి ఉందని ప్రతీతి.

**8. ముల్తజమ్:** ముల్తజమ్ అంటే పైన వేసుకోదగ్గ వస్తువు. దీన్ని పైనవేసుకొని వేడుకోవడం ప్రవక్త (సఅసం) సంప్రదాయం. కాబట్టి దీన్ని ముల్తజమ్ అన్నారు. ఇక్కడ దుఆ చేసే చిత్ర విచిత్ర దృశ్యాలు కానవస్తాయి.

**9. జమ్‌జమ్:** కాబా గోడకు ముప్పై రెండు గజాల దూరంలో ఓ లోతైన కోనేరు (ఊటబావి) ఉంది. దీన్ని జమ్‌జమ్ కోనేరు అని అంటారు. హ|జ్రత్ ఇస్మాయీల్ (అస) కోసం అల్లాహ్ ఊటబావిని సృష్టించాడు. నేటికి ఇది పుష్కలంగా నీటిని అందిస్తోంది. ఈ బావి నీరు నిలబడి త్రాగడం సున్నత్ (సంప్రదాయం).

**10. సఫా-మర్వా:** అనే రెండు ప్రదేశాలున్నాయి. వాటినడుమ పరుగిడుతారు. అంటే సయీ చేస్తారన్నమాట. మొదట ఇవి రెండు కొండలు. ప్రస్తుతం భూమట్టానికి కేవలం నాల్గు అడుగులు మాత్రమే ఉండిపోయాయి.

**11. మీలీనె అక్‌జరీన్:** సయీ చేసేటప్పుడు రెండు గుర్తులు కనబడతాయి. వీటి నడుమ కొంత వడివడిగా లేక పరుగిడునట్లు నడవాలి. ఈ రెండు గుర్తులే 'మీలీనె అక్ జరీన్' అని అంటారు. ఇవి ఆకు పచ్చరంగులో ఉన్నాయి.

**12. అరఫాత్:** ఓ విశాలమైన మైదానం. దీని వైశాల్యం సుమారు పన్నెండు చదరపు మైళ్లు. ఈ మైదానం మక్కాకు తొమ్మిది మైళ్ళు, మినాకు సుమారు ఆరు మైళ్ళ దూరంలో ఉంది. ఈ మైదానంలో ప్రతి హాజీ జిల్‌హజ్జా తొమ్మిదవ తేదీన కొంతసేపు ఆగడం విధి. దీని మధ్యలోనే ఓ కొండ ఉంది. దీన్ని జబలె రహ్మత్ అని పిలుస్తారు. జబ్ల్ అంటే కొండ, రహ్మత్ అంటే కారుణ్యం. అంటే కారుణ్య గిరి అన్నమాట.

**13. మినా:** మక్కాకు మూడు మైళ్ళ దూరంలోని ఓ ప్రదేశాన్ని 'మినా' అంటారు. జిల్‌హజ్జా ఎనిమిదవ తేదీన, ఆ తర్వాత హాజీలు ఇక్కడ రమీ సంప్రదాయం నిర్వర్తిస్తారు. మినాలో గల మస్జిదుల్లో కెల్లా పెద్ద మస్జిద్ పేరు మస్జిదెఖైఫ్. ఈ పవిత్రమైన మస్జిద్‌లో డెబ్భైమందిప్రవక్తలు నమాజు చేశారు. డెబ్భై మంది ప్రవక్తల సమాధులు ఇక్కడ ఉన్నాయి.

**14. ముజ్‌దలిఫా:** మినా, అరఫాత్‌లకు నడుమ ఉన్న ఓ ప్రదేశం ఇది. ఉకూఫె అరఫాత్ (అరఫాత్ మైదానంలో ఆగడం) తరువాత ఇక్కడికి వెళ్ళవలసి ఉంటుంది హాజీ.

**15.** జమ్‌రహ్: గులకరాళ్ళు విసిరే చోటు. ఇదివరకు చెప్పినట్లుగా ఇవి మూడు. 1. జమ్రయె ఊలా, 2. జమ్రయె ఉస్తా, 3. జమ్రయె అక్బా.

మనమిప్పుడు హజ్ విధానం, దాని ఫర్జ్‌లు సున్నత్‌లు, ముస్తహిబ్‌లు, మక్రూహ్‌లను గురించి చెప్పుకుందాం. హజ్ చేసేవాళ్ళు దీన్ని బాగా గుర్తెరిగి ఉండాలి. వాటి ప్రకారం హజ్ చేయాలి. లేకపోతే శ్రమ, డబ్బు అంతా వృధా అవుతాయి.

## హజ్ ఆదేశం; అది ఫర్జ్ కావడానికిగల షరతులు

జీవితంలో కనీసం ఒకసారి హజ్ చేయడం ఫర్జ్ (విధి). ఈ ఫర్జ్‌ను కాదన్నవాడు (తిరస్కరించిన వాడు) కాఫిర్ అయ్యేటంతటి మహత్తరమైన ఆరాధన ఇది. ఇక తనపై ఫర్జ్ (విధిగా నెరవేర్చవలసినది) అయిన ఈ ఆరాధనను నిర్వహించనివాడు ఫాసిక్, ఫాజిర్ (దుర్మార్గుడు, పరమ పాపాత్ముడు) అవుతాడు. అయితే హజ్ ప్రతి ముస్లిమ్‌పై ఫర్జ్‌కాదు. కొన్ని షరతులకు లోబడి ఇది ఫర్జ్ అవుతుంది. ఆ షరతులు పూర్తిగాకపోతే ఇది ఫర్జ్ కాదు. ఆ షరతులు ఇవి:

1. ముస్లిమ్ వివేకిగాను, ప్రాజ్ఞతగల వారిగాను ఉండాలి. ప్రాజ్ఞతకు చేరని పిల్లలు, పిచ్చివాళ్ళపై – వారి దగ్గర ఎంత ధన సంపదలు ఉన్నా సరే హజ్ ఫర్జ్ కాదు. 2. ఆరోగ్య వంతుడై ఉండడం అవసరం. అంటే ప్రయాణం చేయవీలులేని వ్యాధులు ఆ వ్యక్తికి ఉండ కుండా ఉండాలి. అంటే ప్రయాణ కాలంలో, ఆ వ్యాధి ముదిరే అవకాశమున్నా, కుంటి వాడు, గ్రుడ్డివానిగా ఉన్నా, లేక మరింత వృద్ధుడై పోయినా అలాంటి వారిపై హజ్ ఫర్జ్ కాదు. 3. జాదెరాహ్ కలిగి ఉండడం. అంటే ప్రయాణానికి వాహనం, దారిబత్తెం కూడా అతని దగ్గర సమృద్ధిగా ఉండాలి. తన పోషణలో ఉన్న వారికి తాను తిరిగి వచ్చే వరకు పోషణ ఖర్చు ఇచ్చి వెళ్ళవలసి ఉంటుంది. 4. అతడు ఎవరికి రుణగ్రస్తునిగా ఉండకుండా ఉండడం. అప్పు తీర్చిన తరువాత దారిబత్యానికి మిగిలి ఉంటే అతడు హజ్ చేయడానికి వెళ్ళవచ్చు. 5. ఎవరికి జామీనుగా కూడా ఉండకుండా ఉండటం. తాను ఎవరికైనా జామీనుగా ఉంటే ఆ జామీను కాలంలో హజ్ చేయడం సబబుకాదు. ఆ కాలంలో అతని అవసరం పడవచ్చు. 6. మార్గం ప్రమాదరహితమై ఉండడం. ప్రాణానికి ముప్పు వాటిల్లే ప్రమాదం ఉంటే అతనిపై హజ్‌ఫర్జ్ కాదు. ఉదాహరణకు యుద్ధ కాలం: సాధారణంగా మార్గంలో ఓడలు ముంచివేయడం జరుగుతున్నప్పుడు, విమానదాడులు జరుగుతున్నప్పుడు లేదా ఇతర ఏదైనా ప్రమాదం వాటిల్లుతున్నప్పుడు. 7. చండశాసనుడైన పాలకుని తరపున అడ్డంకులు ఎదురై ఉండడం, ఖైదులో పడకుండా ఉండడం. 8. అది హజ్ కాలం అయి ఉండడం. అంటే హజ్ కోసం ఏ కాలం నిర్ణయించ బడుతుందో ఆ కాలంలోనే హజ్

ఆచరించడం. అంతకంటే ముందుగానో, ఆ తరువాతనో హజ్ నియమాలను పాటిస్తే హజ్ నెరవేరదు.

## స్త్రీల గురించి: స్త్రీల కోసం పై ఆదేశాలతోపాటు మరిరెండు షరతులున్నాయి

1. వారు ఒంటరిగా వెళ్ళకూడదు, సరికదా వారి వెంట భర్తగాని లేక ఎవరో ఒక 'మహ్రిమ్' గాని తప్పకుండా ఉండాలి. 'మహ్రిమ్' అంటే నికాహ్‌కు నిషిద్ధం అయిన వ్యక్తి. ఈ వావివరసల గురించి 'నికాహ్' అనే అధ్యయంలో చర్చింబడుతుంది. 2. రెండో షరతు వారు 'ఇద్దత్' కాలంలో ఉండకూడదు. ఆ ఇద్దత్ తలాక్‌కు సంబంధించినదైనా, మరణానికి సంబంధించినదైనా. ఇది కూడా నికాహ్ అధ్యయంలోనే చర్చించడం జరుగుతుంది.

## హరామ్ (అధర్మ) సంపాదన ద్వారా హజ్

ఎవరైనా పూర్తిగా అధర్మంగా (హరాం ద్వారా) సంపాదించి అంటే లంచం, ఇన్స్యూరెన్సు, లాటరీ, బ్యాంకు ఉద్యోగం ద్వారా సంపాదించి ఆ డబ్బుతో హజ్ ఆచరిస్తే ఫర్జ్ మాత్రం నెరవేరుతుంది కాని, అతను పాపాత్ముడుగా ఉండిపోతాడు. అయితే ధర్మంగా సంపాదించిన దానిలో కొంత అధర్మ సంపాదన కూడా కలిస్తే, ఆ డబ్బుతో హజ్ చేయవచ్చు. హరాం సొత్తు కలిగిఉన్నవాడు ఆ సొమ్ముకు యజమాని కానేకాడు. అందుకని వెంటనే పుణ్యఫలాపేక్ష లేకుండా పేదసాదలకు ఆ డబ్బును పంచిపెట్టాలి.

## హజ్‌కు సంబంధించిన 'ఫర్జ్‌లు'

## హజ్‌లో మూడు విషయాలు ఫర్జ్ (విధి)

1. ఇహ్రాం కట్టడం (ధరించడం), 2. అరఫాత్ మైదానంలో కొంతసేపు ఆగడం (ఉఖూఫె అరఫాత్), 3. తవాఫె జియారత్. అంటే కాబా ప్రదక్షిణ చేయడం.

## హజ్‌లోని షరతులు

ఫర్జ్ మాత్రం పైన చెప్పిన మూడు విషయాలే. అయితే ఈ మూడింటికి తోడు మరి కొన్ని షరతులు కూడా ఉన్నాయి. ఇవి లేకపోతే ఆ ఫర్జ్‌లు నిర్వహించడానికి వీలుపడదు.

1. తర్తీబ్ అంటే వరుసక్రమం. ఈ మూడు ఫర్జ్‌ల్ని నిర్వహించడానికి వరుస క్రమాన్ని పాటించాలి. మొదట ఇహ్రామ్ కట్టడం, తదుపరి అరఫాత్ మైదానంలో ఆగడం, ఆ తరువాత కాబా గృహ ప్రదక్షిణ చేయడం.

2. కాలం అంటే ఈ ఫర్జ్‌లను నిర్వర్తించడానికి ఏయే సమయాలు ఖరారు చేయడం జరిగిందో వాటిని దృష్టిలో ఉంచుకోవడం అవసరం. ఉదాహరణకు హజ్ కాలంలోనే హజ్ చేయడం. మీకాత్ వద్దనే ఇహ్రామ్ కట్టడం, జిల్‌హజ్జ తొమ్మిదవ తేదీనే అరఫాత్‌లో ఆగడం, జిల్‌హజ్జ పదవ తేదీన 'ముజ్‌దలిఫా'కు వెళ్ళడం. ఆ తరువాతనే 'రమీ' చేయడం. తదుపరి 'తవాఫె జియారత్' (కాబాగృహ ప్రదక్షణ) నిర్వహించడం. వీటిని దృష్టిలో ఉంచుకోకపోతే హజ్ నెరవేరదు.

3. మకాన్: అంటే హజ్‌కు సంబంధించిన ప్రతి కార్యక్రమం దానికి కేటాయించిన స్థలంలోనే నిర్వహించడం.

## వాజిబాతెహజ్ (హజ్‌కు సంబంధిచిన వాజిబ్‌లు)

హజ్‌లో వాజిబ్ (తప్పనిసరి) అయినవి ఇలా ఉన్నాయి.

1. జిల్ హజ్జా పదవ నాటి రాత్రి ముజ్‌దలిఫాలో ఆగడం. 2. రమీ చేయడం, అంటే జమ్రతుల్ అక్బాపై గులకరాళ్ళు విసరడం. 3. సయీ, సఫా, మర్వాల నడుమ పరుగిడడం. 4. హల్ఖ్ లేక తఖ్‌సీర్. అంటే రమీ తరువాత తలను గొరిగించుకోవడం. లేక వెంట్రుకలను కత్తిరించుకోవడం. పురుషులైతే పూర్తిగా తల గొరిగించుకోవడం ఉత్తమం. కాని స్త్రీలు మాత్రం కొన్ని వెంట్రుకలను మాత్రమే కత్తిరించుకోవాలి. 5. తవాఫె సద్ర్ చేయడం. అంటే ఇతర ప్రాంతాల నుండి వచ్చిన హాజీలు మక్కా నగరాన్ని వీడేటప్పుడు కాబా ప్రదక్షిణం చేయడం. దీన్ని 'తవాఫె విదా' అంటే వీడ్కోలు ప్రదక్షిణ అని కూడా అంటారు.

ఇవేగాకుండా కొన్ని విషయాలు వాజిబ్, సున్నత్, ముస్తహిబ్‌లుగా కూడా ఉన్నాయి. వాటి వివరణ ప్రతి ఫర్జ్ గురించి చెప్పేటప్పుడు చెప్పడం జరుగుతుంది.

ఇహ్రామ్: ఇహ్రామ్ గురించి పైన చెప్పడం జరిగింది.

**ఇహ్రాం:** దీన్ని గురించి గతంలో చెప్పడం జరిగింది. అయితే ఇహ్రామ్ ఎలా కట్టాలో (ధరించాలో) ఇప్పుడు చెప్పడం జరుగుతుంది.

హజ్ యాత్రికుడు 'మీకాత్' ప్రదేశానికి చేరకమునుపే ఇహ్రామ్ కట్టేందుకు సిద్ధపడి ఉండాలి. ఎవరైనా మీకాత్‌కు చేరుకోకమునుపే ఇహ్రామ్ కట్టుకుంటే అది ధర్మ సమ్మతమైనదే. అయితే మీకాత్ ప్రదేశం దాటిపోయిన తరువాత కూడా అతడు ఇహ్రామ్ కట్టుకోకపోతే అది 'మక్రూహె తహ్రీమీ' కాగలదు. మొత్తానికి మక్కా భూభాగం, అంటే 'హరమ్'లో అడుగిడకమునుపే ఇహ్రామ్ తప్పకుండా కట్టుకోవాలి. (మస్నూన్)

## ఇహ్రామ్ కట్టుకునే సాంప్రదాయక (మస్నూన్) విధానం

1. ఇహ్రామ్ కట్టుకోవడానికి పూర్వమే క్షవరం చేయించుకోవడం, గోళ్ళు కత్తిరించుకోవడం, చంకల్లో వెంట్రుకల్ని నాభికి దిగువన ఉండే వెంట్రుకల్ని తీసివేయడం 'ముస్తహిబ్' ఎందుకంటే ఇహ్రామ్ కట్టుకున్న తరువాత ఇవన్నీ చేయడం నిషిద్ధం కాబట్టి. ఆ తరువాత శుభ్రంగా గుస్ల్(స్నానం) చేసి సువాసనలు పూసుకోవాలి. బహిస్టు ప్రసూతి స్రావాలు ఆగిపోయిన మహిళ గుస్ల్ చేయడం వాజిబ్. (దుర్రెముక్తార్)

2. గుస్ల్ ముగించాక పురుషులు తాము ధరించే బట్టల్ని తీసేసి కుట్టులేనటువంటి వస్త్రాన్ని లుంగీగా చుట్టుకోవాలి. దానిపై న్నుండి మరో బట్టను అంగవస్త్రంగా కప్పుకోవాలి. ఈ రెండూ తెల్లనివై క్రొత్త వస్త్రాలైతే మంచిది. తెల్లటివి క్రొత్తవి కాకపోయినా ఉతికిన బట్టలు మాత్రమై ఉండాలి.

3. ఇహ్రామ్ కట్టుకొని అంటే ఈ వస్త్రధారణ చేసి మక్రూహ్ సమయం కాకపోయి నట్లయితే ఇహ్రామ్ నమాజు సంకల్పంతో ఏకాగ్రతతో రెండు రకాత్‌లు నఫిల్ నమాజు చేయాలి. ఈ రెండు రకాత్‌లలో ఖుల్‌యా అయ్యుహల్ కాఫిరూన్, 'ఖుల్‌హువల్లాహూ అహద్' సూరాలు పఠించడం ప్రవక్త (సఅసం) ఆచారం.

4. నమాజ్ పూర్తయ్యాక హజ్ అయితే హజ్ సంకల్పం, లేక ఉమ్రా చేస్తుంటే ఉమ్రా సంకల్పం చేసుకోవాలి.

## హజ్, ఉమ్రాల సంకల్పం ఎలా చేయాలి

### హజ్ సంకల్పం:

**"అల్లాహుమ్మా ఇన్నీ ఉరీదుల్‌హజ్జఫ ఫస్సిర్‌హులీ వతకబ్బల్‌హు మిన్నీ నవైతుల్ హజ్జ ముఖ్లిసల్లిలాహితఆలా"**

(**అర్థం:** ఓ అల్లాహ్! నేను హజ్ చేయాలని సంకల్పించుకున్నాను. దీన్ని స్వీకరించు. నా కోసం సులువైనదిగా చెయ్యి. నేను ఈ హజ్ కేవలం అల్లాహ్ కోసమే చేస్తున్నాను.)

ఉమ్రా చేయాలని ఉంటే హజ్ అనే పదానికి బదులు ఉమ్రా అనే పదాన్ని పలకాలి. ఖిరాన్, హజ్ ఉమ్రా కలిపి చేసేవాడైతే ఆ రెంటి సంకల్పం చేస్తూ 'హజ్ వ ఉమ్రా' అనే రెండు పదాల్ని చేర్చాలి.

**తల్బియా:** సంకల్పం చేసుకున్న వెంటనే వినబడేటట్లు తల్బియా చెప్పడం

ప్రారంభించాలి. ముఫ్రిద్ మరియు ఖారిన్‌లు పదవ జిల్‌హజ్జనాడు 'జమ్రతుల్ అక్బా' పైన 'రమీ' చేసేటంతవరకు తల్బియా పలుకుతూనే ఉండాలి. నమాజ్ చేయడమే కాకుండా తల్బియా కూడా ప్రతి సందర్భంలోను పలకాలి. మెట్టప్రదేశాన్ని ఎక్కేటప్పుడు పల్లానికి దిగేటప్పుడు, వాహనం ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు తల్బియా పలుకుతూనే ఉండాలి. 'ముతమత్తా' అయితే హజ్రె అస్వద్‌ను చుంబించిన తరువాత తల్బియాను మానేస్తాడు. తల్బియా పదాలు ఇదివరకే రాయబడ్డాయి. వాటినే వల్లిస్తూ ఉండాలి. తల్బియా అరబీ భాషలో చెప్పలేకపోతే మీ మాతృభాషలోనైనా లేక మీకు వచ్చిన ఏ భాషలోనైనా చెప్పవచ్చు.

ఇహ్రామ్ కట్టుకున్నాక హజ్‌కు సంబంధించిన ఒక ఫర్జ్ పూర్తి అయినట్లే. ముహ్రిమ్ ఇహ్రామ్ కట్టుకున్నాడు కాబట్టి అతడిపై అనేక హలాల్ (ధర్మ సమ్మతమైన) విషయాలు హరామ్ (నిషిద్ధం) అయ్యాయి. ఇంకా అనేక విషయాలు మక్రూహ్ అయిపోయాయి.

## స్త్రీల ఇహ్రామ్:

స్త్రీలు ఇహ్రామ్ ఇలానే కట్టుకోవాలి. అయితే మూడు విషయాల్లో మాత్రం స్త్రీ పురుషుల ఇహ్రామ్‌లో తేడా ఉంది.

1. పురుషుడు ఇహ్రామ్‌లో కుట్టిన దుస్తులు తొడగడం నిషిద్ధం. కాని స్త్రీలు ఇహ్రామ్‌కు పూర్వం ఎలా కుట్టిన బట్టలు కట్టారో ఇహ్రామ్‌లోను కుట్టిన దుస్తుల్ని కట్టవచ్చు. వారి దుస్తులు ఘుమఘుమలాడే సుగంధ ద్రవ్యాలు మాత్రం పులిమి వుండకూడదు. 2. పురుషులకు ఇహ్రామ్ స్థితిలో తలపై ఎలాంటి ఆచ్ఛాదన కప్పుకునే అనుమతి లేదు. కాని స్త్రీలు ఇహ్రామ్‌కు పూర్వం వెంట్రుకల్ని కనబడేటట్లు ఉంచడం ఎలా హరామో ఇహ్రామ్ స్థితిలోను అంతే హరాము. తలను బహిర్గతం చేయడం మరింత పాపం. అయితే ముఖం మాత్రం కనబడేటట్లు ఉండాలి. ఎవరైనా 'నాన్ ముహ్రిమ్' ఎదురయితే చాటుకు తప్పు కోవాలి. ముఖం మాత్రం కప్పుకోవడం నిషిద్ధం. 3. పురుషులు అందరికి వినబడేటట్లు బిగ్గరగా తల్బియా పలుకుతారు. కాని స్త్రీలు మాత్రం ఎవరికీ వినబడకుండా మెల్లిగా తల్బియా పలకాలి. అంటే స్త్రీల కంఠస్వరం ముహ్రిమ్‌కు వినబడకూడదు.

## ఇహ్రామ్ పరిస్థితిలో చేయకూడని పనులు

1. జగడమాడడం, పొట్లాటలకు దిగడం, 2. అసత్యమాడడం, 3. పరోక్షంగా నిందించడం, 4. అపనిందలు మోపడం, 5. దుర్భాషలాడడం, బెదిరించడం లాంటివి. ప్రతి ముస్లిమ్ పైన పేర్కొన్న విషయాలు అన్ని సందర్భాల్లోనూ చేయకూడదు. అంటే

హరాం చేయబడ్డ పనులు. అయితే ఇహ్రామ్ పరిస్థితిలో మాత్రం దీనికి ఒడిగడితే వాటి పాపం మరింత పెరుగుతుంది. "హజ్ సందర్భంగా జగడాలకు, కొట్లాటలకు దూరంగా ఉండమని దివ్యగ్రంథం ప్రత్యేకంగా హెచ్చరిస్తోంది. అయితే హజ్ కాలంలోనే ఈ నేరాలు అధికంగా జరుగుతూ ఉండటం నేడు మనం చూస్తున్నాం. ఈ అయిదు విషయాలకు తోడు, సాధారణ పరిస్థితుల్లో ధర్మసమ్మతమైనవి, పుణ్యకార్యాలుగా భావించబడేవి కొన్ని పనులు ఇహ్రామ్ పరిస్థితిలో 'హరామ్' (నిషిద్ధాలు)గా మారిపోతాయి. అవి:

1. భూమిపై సంచరించే జంతుజాలాన్ని వేటాడడం, 2. శరీరంలోని ఏ భాగంలో వున్న వెంట్రుకలనైనా గొరిగించుకోవడం లేక కత్తిరిచడం, 3. గోళ్ళు, మీసాలు కత్తిరించు కోవడం, 4. మేజోళ్ళు వేసుకోవడం, 5. 'అమామా' లేక టోపి తొడగడం, 6. స్త్రీని కౌగిలించుకోవడం లేక సరసాలాడడం.

దివ్యగ్రంథం ముఖ్యంగా 'రఫ్స్' (కామచేష్టల)కు దూరంగా ఉండమని తాకీదు చేసింది. కామ ప్రేరకమైన ప్రతి విషయమూ 'రఫ్సే'.

పైవన్నీ కావాలనో, అనుకోకుండానో జరిగినా, మేల్కున్నప్పుడో లేక నిద్రావస్థలో జరిగినా, ప్రతి సందర్భంలోను కప్పారా(ప్రాయశ్చిత్తం) చెల్లించాల్సిందే. కొన్నిటికి 'కప్పారా', 'ఖుర్బానీ' (దానం) చేయడంతో సరిపోతుంది.

అంటే ఇహ్రామ్ కట్టినవాడు పైన చెప్పిన వాటిలో దేనికి పాల్పడినా కొన్ని సందర్భాల్లో ఖుర్బానీ ఇవ్వడం, మరికొన్ని సందర్భాల్లో కేవలం సదాఖా ఇవ్వడం సరిపోతుంది. ఇప్పుడు ఆ విషయాలు వివరంగా తెలుసుకుందాం.

## 1. వేట

వేటాడడం అంటే కేవలం వేటాడడమే కాదు, వేటాడేవారిని ప్రోత్సహించడం, సలహాలివ్వడం, సహాయపడడం కూడా వేటాడడం క్రిందికే వస్తాయి. ఉదాహరణకు, ఎవరైనా వేటాడితే ఆ జంతువును జిబహ్ చేయడానికి కత్తినందించడం, వేట కోసం సొంత తుపాకిని ఇవ్వడం, మందుగుండు సామగ్రినివ్వడం కూడా వేట క్రిందికే వస్తాయి. దానికి కఫ్ఫారా చెల్లించాలి. కఫ్ఫారా మరియు సదఖా గురించిన వివరణ ముందు రాబోతుంది. 2. పక్షి రెక్కల్ని, అది ఎగరలేని విధంగా పీకేయడం కూడా వేట క్రిందికే వస్తుంది.

## 2. వెంట్రుకల్ని గొరిగించుకోవడం

1. తల, గడ్డం లేక మీసాలకు సంబంధించిన వెంట్రుకల్ని 1/4 వంతు లేక అంత

కంటే మించి గొరిగించుకోవడం లేక కత్తిరించుకోవడం జరిగితే ఒక ఖుర్బానీ 'కఫ్ఫారా'గా ఇవ్వాలి. ఇక ఇహ్రాం స్థితిలో పూర్తి గడ్డాన్నే గీకేసుకుంటే చెప్పేదేముంది? అసలు ఓ ముస్లిమ్ గడ్డాన్ని గొరిగించుకోవడమే హరాం. ఇక ఇహ్రామ్ స్థితిలో దాని పాపం ఎంత పెరుగుతుందో ఆలోచించారా? గడ్డాన్ని గొరిగించుకొని ఒక ఖుర్బానినిస్తే అది ఇహ్రామ్ పరిస్థితిలో గడ్డం గొరిగించుకున్నందుకు ప్రాయశ్చిత్తం. అయితే గడ్డం గీకించుకున్న తప్పిదానికి మాత్రం ప్రాయశ్చిత్తం ఏది? 2. ఎవరైనా ఒక చంక లేక రెండు చంకలు లేక నాభిక్రింది వెంట్రు కల్ని గొరిగితే అతడు ఒక ఖుర్బానీ ఇవ్వాలి. 3. ఉజూ చేయడంలో, లేక గొక్కునేటప్పుడు లేక దువ్వుకునేటప్పుడు ఏ రాలిపోయే వెంట్రుకలకు కూడా పూర్తి సదఖా చేయాలని కొందరు ధర్మవేత్తలు అంటారు. అయితే కొందరు మాత్రం పాపలా, బేడా దానం చేస్తే సరిపోతుందంటారు.

## 3. గోళ్ళు కత్తిరించుకోవడం

1. ఇహ్రామ్ పరిస్థితిలో గోళ్ళను కత్తిరించుకోవడం నిషిద్ధం. ఒక చేతికి సంబంధిం చిన మొత్తం గోళ్ళు కత్తిరిస్తే ఒక ఖుర్బానీ ఇవ్వాలి. అయితే ఒక చేతికి సంబంధించిన మొత్తం గోళ్ళు కత్తిరించుకోకుండా కేవలం ఒకటి లేక రెండు వ్రేళ్ళ గోళ్ళే కత్తిరిస్తే సదఖా మాత్రం ఇవ్వాలి. 2. రెండు చేతుల మొత్తం గోళ్ళు కత్తిరించినాసరే ఒక ఖుర్బానీయే ఇవ్వాలి. అయితే ఆ గోళ్ళే రెండుదఫాలుగా కత్తిరిస్తే మాత్రం రెండు ఖుర్బానీలు ఇవ్వడం అవసరం. ఎన్ని దఫాలుగా కత్తిరిస్తే అన్ని ఖుర్బానీలు ఇవ్వాలి.

## 4. కుట్టిన బట్టలు ధరించడం

చొక్కా, లాగు, షేర్వాని, బనీను, స్వెట్టరు లాంటి కుట్టిన దుస్తుల్లో ఏదైనా సరే తొడగడం 'హరాం' (నిషిద్ధం). వాటిలో దేన్నైనా పగలంతా తొడుక్కుంటే ఒక ఖుర్బానీ చేయడం వాజిబ్ (విధి) ఇలాగే 'ఇహ్రాం' లో ఏ శరీర భాగాలయితే కప్పుకోకూడదో అవి తల, పూర్తి ముఖం, చెవులు, ముక్కు, కళ్ళు వగైరా, వాటిలో దేన్నైనా ఒక నిమిషం కోసం కప్పుకున్నా (దాచేసినా) నిషేధాన్ని ఉల్లంఘించినట్లే. అనివార్యపరిస్థితుల్లో తప్ప. పగలంతా ఇలాగే కప్పుకొని ఉంటే ఒక ఖుర్బానీ వాజిబ్ (విధి) అవుతుంది.

ఉదాహరణకు 1. టోపి తొడుక్కోవడం, తలపాగా చుట్టుకోవడం కాలికి మేజోళ్ళు, చేతులకు గ్లౌజులు వేసుకోవడం, అంగవస్త్రం లేక చేతి రుమాలు (దస్తీ)తో ముఖాన్ని కప్పు కోవడం లాంటివి హరామ్ (నిషిద్ధం). కొంతసేపు వరకు వేసుకుంటే మాత్రం

'సదఖా'(దానం) చేయాలి. 2. వ్యాధి కారణంగా కుట్టిన బట్టలు తొడగడం లేక గడ్డాన్ని లేక ముఖాన్ని, తలను కప్పుకోవడం అనివార్యమయితే అలా చేసుకోవచ్చు. అయితే ఇందుకుగాను కఫ్ఫారా చెల్లించాలి. అంటే ఒక ఖుర్బానీ ఇవ్వాలి. 3. తల, ముఖమే కాకుండా శరీరంలో మరే భాగంపైన్నైనా ఎలాంటి కారణం లేకుండా పట్టి (బ్యాండేజి) కట్టుకుంటే ఇది 'మాక్రూహె తహ్రీమీ' అవుతుంది. అయితే అనివార్య కారణాలవల్ల జరిగిందయితే మాత్రం ఇది ధర్మసమ్మతమైనదే. 4. ఇహ్రాం కోసం ఉపయోగించిన వస్త్రంలోను లేక 'తహ్‌బంద్' (లుంగీ)లోను ముడివేయడం. ఏదైనాత్రాటితో దాన్ని బిగించడం లేక సేఫ్టీపిన్ను (ఫిన్నీను) పెట్టడం కూడా మక్రూహ్‌యే. 5. కుట్టిన వస్త్రాన్ని కేవలం శరీరంపై వేసుకోవలసి వచ్చినప్పుడు ఏ శరీర భాగాలయితే కప్పబడకుండా ఉండాలో అవి కప్పబడకుండా ఉంటే మాత్రం ఫరవాలేదు.

## 5. సువాసన ద్రవ్యాలు, అత్తర్ల వాడకం

1. ఇహ్రామ్ కట్టుకునేటప్పుడు సువాసన ద్రవ్యాలు పులుముకోవడం ముస్తహిబ్ (అభిలషణీయం). కాని ఆ తరువాత ఎలాంటి సువాసనల్ని వాడడమైనా నిషిద్ధమే. అవి వస్త్రానికి పులుముకున్నా, ముక్కు ద్వారా పీల్చినా లేక సుగంధ ద్రవ్యాలు తిన్నా, త్రాగినా ఇవన్నీ నిషిద్ధాలే.

ఉదాహరణకు, అత్తర్లు సెంట్లు, పులుముకోవడం, వాటిని ముక్కు దగ్గర పెట్టి వాసన చూడడం సాఫ్రాన్ (కేసరి), కస్తూరి, కర్పూరం, అంబర్, లవంగాలు,యాలకులు ఇలాంటివే ఇతర సుగంధ ద్రవ్యాలను సువాసన కోసం ఇహ్రాం వస్త్రంలో కట్టుకోవడం లేక వాటిని నోట్లో వేసుకోవడం నిషిద్ధం. వాటిలో దేన్ని వాడినా ఒక ఖుర్బానీ ఇవ్వవలసిందే. అయితే ఈ పదార్థాలు ఆహార పదార్థాల్లో (భోజన పదార్థాల్లో ) వేసుకొని వండుకొని తినవచ్చు. ఆ భోజన పదార్థాల్లో వాసనలు వచ్చినాసరే. అయితే అలా చేయడం మంచిది కాదు.(ఆలంగీరి)

పొగాకును, అది జర్దా రూపంలో తిన్నా, పొగలా పీల్చినా మక్రూహ్‌యే. ఇలాగే సిగరెట్లు, చుట్ట వగైరాల జోలికి కూడా పోకూడదు.

2. కమలా ఫలాలు, నిమ్మకాయల్లాంటి సువాసనల్ని వెదజల్లే ఫలాలను వాసన చూడటం కూడా మక్రూహ్‌యె. అయితే ఇలా వాసన చూడటం వల్ల ఖుర్బానీ ఇచ్చే అవసరం ఏర్పడదు. (ఆలంగీరి, సంపుటం-1 పేజీ 242)

ఈ ఫలాలను భోజన పదార్థాల్లో వేసుకొని వండుకుంటే మాత్రం మక్రూహ్ కాదు.

3. స్త్రీలు గోరింటాకు పెట్టుకోవడం కూడా నిషిద్ధమే. పెట్టుకుంటే మాత్రం ఒక ఖుర్బానీ ఇవ్వాలి.

## స్త్రీ సంపర్కం

ఇహ్రామ్ కట్టుకున్న వాడు (ముహ్రీమ్) ఆ పరిస్థితిలో స్త్రీ ద్వారాగాని, మరో రూపంలోగాని తన కామవాంఛను తీర్చుకోవడం లేక కామసంబంధమైన కోరికల్ని రేకెత్తించే సంభాషణలుగాని చేయడం పెద్ద నేరం. ఈ విషయం ఖుర్ఆన్, హదీసుల్లో నిక్కచ్చిగా చెప్పడం జరిగింది. ఖుర్ఆన్, హదీసు గ్రంథాలు 'రఫస్' జోలికి పోవద్దు అంటున్నాయి. కామవాంఛల్ని రేకత్తించేవి, ప్రేరేపించేవి, కామాన్ని తీర్చుకునే చేష్టలే 'రఫస్'. అంటే సంభోగానికి తోడు ప్రేమకలాపాలు, చుంబన ఆలింగనలు లాంటివన్నీ దీని క్రిందికే వస్తాయి. ఈ విషయంలో మరికొన్ని వివరాలను జ్ఞప్తియందుంచుకోవాలి.

1. ఎవరైనా తొమ్మిదవ తేదీ జిల్‌హజ్జాకు పూర్వమే స్త్రీతో సంభోగిస్తే అతని హజ్ 'ఫాసిద్' అవుతుంది. అంటే భంగమవుతుంది. ఇక అతడు మరుసటి ఏడు ఆ హజ్‌కు ఖజా బదులు పాటించాలి. ఇంకా తాను చేసిన ఈ తప్పిదానికి ప్రతిగా ఖుర్బానీ కూడా ఇవ్వాలి.

2. స్త్రీని ఆలింగనం చేసినప్పుడు లేక చుంబించినప్పుడు ఉభయులకు వాటి వల్ల మధురానుభూతులు కలిగితే ఆ ఇద్దరూ పాపం చేసినట్లే. దీనికి కఫ్ఫారా చెల్లించాలి. ఈ కఫ్ఫారా రెండు విధాలు.

1. కొన్ని తప్పిదాలకు ప్రతిగా మేకనో, గొర్రెనో లేక ఒక దుంబానో ఖుర్బానీగా చెల్లించాలి.

2. కొన్ని సందర్భాల్లో కేవలం 'సదఖా' (దానం) మాత్రమే ఇవ్వడం.

సదఖా అంటే సదఖయె ఫిత్ర్‌లో ఇచ్చే సదఖా. అయితే ఈ రెంటిలోను గల తేడా ఏమిటంటే ఫిత్రా (ఈదుల్ ఫిత్ర్ నాడు ఇచ్చేది) అనేకమంది నిరుపేదల్లో పంచి పెట్టవచ్చు. కాని ఈ సదఖా మాత్రం ఒకే నిరుపేదకు ఇవ్వాలి.

**నోట్:** 'ముఫ్రిద్' చేసిన తప్పులకు ఒక సదఖా లేక ఒక ఖుర్బానీ ఇవ్వవలసి ఉంటుంది. అదే 'ఖారీన్' చేసిన తప్పైతే రెట్టింపు సదఖా గానీ రెట్టింపు ఖుర్బానీ గాని ఇవ్వాల్సి ఉంటుంది. 'ముతమత్తా' ఇహ్రాం విప్పేస్తే ముఫ్రిద్‌గా మారిపోతాడు లేకపోతే ఖారిన్‌గానే మిగిలి ఉంటాడు.

## ఇహ్రామ్‌లో 'ముబాహ్' (చెల్లుబాటు) అయినది

1. ముఖం, తల కప్పబడకుండా కుట్టిన వస్త్రాన్ని శరీరంపై వేసుకోవడం. 2. డబ్బు వగైరాల రక్షణకోసం నడుముకు పట్టా కట్టుకోవడం, పర్సు, సంచిలాంటివి దగ్గర ఉంచుకోవడం. 3. శరీరాన్ని రుద్దుకోకుండా స్నానం చేయడం. 4. నీడలో కూర్చోడం లేక గొడుగులాంటిది వాడడం. 5. పెంపుడు జంతువులైన ఒంటె, ఆవు, మేక, గొర్రె, దుంబా లేక కోడిని జిబాహ్ చేయడం లేక వాటి పాలు పితకటం, త్రాగడం. 6. తలగడ పెట్టుకోవడం. 7. నూనె, నెయ్యి వగైరాలు వంటలో ఉపయోగించటం, త్రాగడం లేదా వాటిని శరీరంపై పులుముకోవడం. అయితే ఆ నూనెలు సువాసనలు వెదజల్లేవి అయి ఉండకూడదు. 8. పాములు, తేళ్ళు, కందిరీగల్లాంటి ప్రమాదకరమైన జంతువుల్ని, కీటకాల్ని, ఎలుకలు, కాకులు, నల్లులు, దోమలు, పేలు వగైరా నష్టం కలిగించే వాటిని చంపవచ్చు. అయితే నల్లుల్ని మంచం నుండి లేక దుస్తులనుండి తీసి మండే నేలపై వేసి చంపడం లేక వేడి నీరు పోసి చంపడం సరిఅయింది కాదు. కొందరు ధర్మవేత్తలయితే మూడు, నాలుగు నల్లులు లేక పేలకంటే అధికంగా చంపితే ఒక సదఖా తప్పకుండా చేయాలి అంటారు. కాబట్టి ఈ విషయంలో జాగ్రత్త పడడం అవసరం.

## తవాఫ్

హజ్‌లోని రెండో విధి తవాఫ్. తవాఫ్ చేసే ప్రదేశాన్ని 'మతాఫ్' అంటారు. తవాఫ్ మూడు రకాలు. ఒక రకం సున్నత్ (ప్రవక్తగారి ఆచారం) అయితే రెండో రకం 'ఫర్జ్' అంటే విధిగా చేయవలసింది. ఇక మూడో రకం వాజిబ్.

## 1. తవాఫె కుదూమ్

తవాఫె కుదూమ్ లేక తవాఫె తహియ్యాత్ అంటే హరమ్ (కాబా) భూభాగంలోనికి ప్రవేశించడం మరియు దానికి సలామ్ చేసే తవాఫ్ అన్నమాట. ఇది సున్నతె ముఅక్కిదా (తప్పకుండా ఆచరించవలసిన ప్రవక్తగారి ఆచారం).

మక్కా భూభాగానికి చెందకుండా బయటనుండి వచ్చేవారు హజ్జె అఫ్‌రాద్ లేక ఖిరాన్ సంకల్పంతో వస్తే వారి పైన్నే ఈ తవాఫ్ వాజిబ్ అవుతుంది. ముఫ్రిద్‌కు, ఖారిన్‌కు గల తేడా ఏమిటంటే, 'ఖారిన్' మొదట 'ఉమ్రా'కు సంబంధించిన తవాఫ్ చేస్తాడు. ఆ తరువాత తవాఫె కుదూమ్ చేస్తాడు. ముఫ్రిద్ కేవలం 'తవాఫె కుదూమ్' మాత్రమే చేస్తాడు. ఇక 'ముతమత్తా' అయితే తవాఫె కుదూమ్ చేయనవసరం లేదు. తవాఫె కుదూమ్ మస్జిదె హరాంలోనికి ప్రవేశించిన తోడనే చేయవలసి ఉంటుంది.

## 2. 'తవాఫె జియారత్ లేక తవాఫె ఇజాఫా

ఈ తవాఫ్ చేయడం ఫర్జ్ (విధి). ఇది హజ్ అంశాల్లో ఒకటి. దీన్ని వదిలేస్తే హజ్ భంగపడినట్లే. హాజీ పడ్డ కష్టం అంతా వృథా పోతుంది. దీన్ని నిర్వర్తించలేకపోతే మరుసటి సంవత్సరం తిరిగి నెరవేర్చాల్సి ఉంటుంది.ః

## 3. తవాఫె జియారత్ చేసే కాలం

ఇది నిర్వర్తించవలసిన మంచి సమయం పదవ తేదీ జిల్‌హజ్జా. అప్పటికే 'హలక్' ఖుర్బానీలు ముగించి ఉండాలి. అయితే అనివార్య కారణాలవల్ల దాన్ని ఆరోజు నిర్వర్తించ లేకపోతే మరునాడు, ఆనాడు చేయలేని పక్షంలో పన్నెండో తేదీనాడు చేయాలి. ఇక పన్నెండో తేదీనాడు కూడా చేయలేకపోతే మరుసటి సంవత్సరం చేయవలసి ఉంటుంది.

## 4. తవాఫె విదా లేక తవాఫె సదర్

హజ్ పూర్తి అయ్యాక మక్కాను విడిచివెడుతున్నప్పుడు మరోసారి కాబా తవాఫ్ (ప్రదక్షిణ) చేయాలి. ఈ తిరుగు ప్రయాణం నాటి తవాఫును తవాఫె సదర్ లేక తవాఫె విదా అంటారు. ఈ తవాఫ్ చేయడం వాజిబ్. మక్కా వాసులకు తవాఫె కుదూమ్ గాని తవాఫె విదాగాని ఉండవు. కారణం వారు ఎక్కడ్నుంచీ రారు మరెక్కడికీ పోరు కాబట్టి.

## తవాఫ్ చేసే మస్నూన్ (సాంప్రదాయక) విధానం

ఆఫాకీ (మక్కాకు చెందనివారు) మక్కా నగరానికి వచ్చి చేరగానే మొదట 'మస్జిదె హరాం'లో ఎంతో భక్తి శ్రద్ధలతో ప్రవేశించాలి. పవిత్ర కాబా గృహంపై దృష్టి పడగానే 'తక్బీర్' (అల్లాహు అక్బర్) 'తహ్లీల్' (లా ఇలాహ ఇల్లల్లాహ్), ఆ తరువాత దరూద్ పఠించి ఈ దుఆ చేయాలి.

"అల్లాహుమ్మగ్ ఫిర్‌లీ జునూబీ వఫ్ తహ్‌లీ అబ్వాబరహ్మతిక్"

اَللّٰهُمَّ اغْفِرْلِيْ ذُنُوْبِيْ وَافْتَحْ لِيْ اَبْوَابَ رَحْمَتِكَ۔

(ఓ అల్లాహ్! నా పాపాలను క్షమించు, నా కోసం నీ కారుణ్య ద్వారాలను తెరువు)

ఆ తరువాత తవాఫ్ చేసే ప్రయత్నం చేయాలి. 'మస్జిదెహరామ్' నుండి బయలు దేరేటప్పుడు ఈ దుఆ పఠించాల్సి ఉంటుంది.

"అల్లాహుమ్మఫ్ తహ్‌లీ అబ్‌వాబ ఫజ్‌లిక్, వ సహ్హిల్ అబ్వాబ రిజ్ఖిక"

اَللّٰهُمَّ افْتَحْ لِيْ اَبْوَابَ فَضْلِكَ وَسَهِّلْ لِيْ اَبْوَابَ رِزْقِكَ۔

(ఓ నా ప్రభూ! నా కోసం నీ దయాదాక్షిణ్యాల ద్వారాలను తెరువు. భక్తి మార్గాల్ని నాకోసం సుగమం చెయ్యి)

తవాఫ్ చేసేవాడు తవాఫ్‌కు ముందు తన దుప్పటిని (పైన కప్పుకునే వస్త్రాన్ని) కుడి చంకక్రింది నుండి తీసి ఎడమభుజంపై వేసుకోవాలి. అంటే నేరుగా పైన కప్పుకో కుండా క్రాసుగా కప్పుకోవాలన్నమాట. దీన్నే షరీఅత్ పరిభాషలో 'ఇజితిబాఅ' అని అంటారు. ఇజితిబాఅ తరువాత కాబా వైపు ముఖం త్రిప్పి 'సంగెఅస్వద్' (నల్ల రాయి, రుక్నె యమానీకి) నడుమ నిలబడి తవాఫ్ చేసే సంకల్పం చేయాలి. తవాఫ్ అంటే ప్రదక్షిణ.

"అల్లాహుమ్మ ఇన్నీ ఉరీదు తవాఫ బైతికల్ ముహర్రమ ఫయస్సిర్‌హు లీ వతకబ్బల్‌హు మిన్నీ"

اَللّٰهُمَّ اِنِّيْ اُرِيْدُ طَوَافَ بَيْتِكَ الْمُحَرَّمِ فَيَسِّرْهُ لِيْ وَتَقَبَّلْهُ مِنِّيْ

(ఓ అల్లాహ్! నేను నీ పవిత్ర గృహ ప్రదక్షిణ చేయదలిచాను. దీన్ని నా కోసం సుగమంగా చెయ్యి, దీన్ని స్వీకరించు).

సంకల్పం అయిన తరువాత దైవ గృహం (కాబా) వైపే తన ముఖాన్ని ఉంచి కుడి వైపుకు నడవాలి. హజ్రె అస్వద్ దగ్గరకు రాగానే రెండు అరచేతుల్ని హజ్రె అస్వద్ వైపుకు ఉండేటట్లు పైకి లేపాలి. ఆ తరువాత "బిస్మిల్లాహి, వల్‌హమ్దులిల్లాహి, వల్లాహుఅక్బర్. వలా ఇలాహ ఇల్లల్లాహు వస్సలాతు వస్సలాము అలారసూలిల్లాహి" అని పఠించి హజ్రె అస్వద్‌కు ఇస్తిలాం చేయాలి. ఇస్తిలామ్ అయ్యాక ఈ దుఆ పఠించాలి.

"అల్లాహుమ్మ ఈమానమ్‌బిక వ ఇత్తిబా అల్‌లిసున్నతి నబియ్యిక ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వసల్లమ్."

اَللّٰهُمَّ اِيْمَانًا بِكَ وَاتِّبَاعًا لِسُنَّةِ نَبِيِّكَ مُحَمَّدٍ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

( ఓ అల్లాహ్! నేను నిన్ను విశ్వసిస్తున్నాను. ఈ తవాఫ్‌గాని, ఇస్తిలామ్‌గాని నీ ప్రవక్త (సఅసం) సంప్రదాయానికి అనుగుణంగానే చేస్తున్నాను. )

ఆ తరువాత కాబా ద్వారం వైపుకు కదలాలి. హజ్రెఅస్వద్ దాటగానే కాబాగృహాన్ని తన ఎడమ వైపున ఉంచి 'హతీం'కు ఆవల నుండి నడవాలి. హతీమ్ ప్రదేశం కూడా కాబా గృహంలోనే చేరిఉంది. దాన్ని తప్పిస్తే తవాఫ్ అసంపూర్తిగా మిగిలిపోతుంది. కాబాకు నాలుగు ప్రక్కలు (గోడలు) ఉన్నాయి. మొదటిదాన్ని రుక్నె 'ఇరాకీ' అని, రెండోదాన్ని రుక్నె 'షామీ' అని, మూడోదాన్ని 'రుక్నె యమాని' అని అంటారు. ఇక నాల్గో ప్రక్కన హజ్రె

అస్వద్ అతికించబడి ఉంది. ఇలా పూర్తి కాబాగృహాన్ని చుట్టి హ(జైఅస్వద్ దగ్గరకు చేరుకోవాలి. మళ్ళీ ఇస్తిలాం చేయాలి. ఇలా చేస్తే ఒక 'షౌత్' (ప్రదక్షిణ) పూర్తి అయినట్లు. ఇలాగే మొత్తం ఏడు (7) ప్రదక్షిణలు చేయాల్సి ఉంటుంది. పురుషులైతే మొదటి మూడు ప్రదక్షిణల్లో 'రమల్' చేయాలి. తవాఫ్ చేసేటప్పుడూ, ఆ తరువాత మరికొన్ని ప్రదేశాల నుండి నడవవలసి ఉంటుంది. ఆ ప్రదేశాలు ముల్తజిమ్' 'మిజాబెరహ్మత్', 'ముస్తజార్', రుక్నెఇరాకీ, రక్నెయమానీలు. ఈ ప్రదేశాలన్నిటిలోను కొంత తడవు ఆగి దుఆ చేయాలి.

## ముల్తజిమ్ దగ్గర చేసే దుఆ

ముల్తజిమ్ దగ్గర దోసిలొగ్గి శ్రద్ధగా ధర్మసమ్మతమైన ఏ దుఆ అయినా చెయ్యవచ్చు. అయితే ముఖ్యంగా చేయదగ్గ దుఆ మాత్రం ఇది:

يَاوَاجِدُ يَامَاجِدُ لَا تُزِلْ
عَنِّيْ نِعْمَةً اَنْعَمْتَهَا عَلَيَّ

"యా వాజిదు యామాజిదు లా తుజిల్ అన్నీ ని ఇమతన్ అన్ అమ్తహా అలయ్య"

(ఓ శక్తి స్వరూపా! ఓ గౌరవోన్నతులు గలవాడా! నాకు ఏ వరాలయితే ఒసిగావో దాన్ని వెనక్కు తీసుకోకు)

## మిజాబె రహ్మత్ వద్ద చేసే దుఆ

'మిజాబె రహ్మత్' క్రింద నిలబడి గద్గదస్వరంతో ఈ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ اِيْمَانًا
لَا يَزُوْلُ وَيَقِيْنًا لَا يَنْفَدُ وَ
مُرَافَقَةَ نَبِيِّكَ مُحَمَّدٍ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
اَللّٰهُمَّ اَظِلَّنِيْ تَحْتَ ظِلِّ
عَرْشِكَ يَوْمَ لَا ظِلَّ اِلَّا ظِلَّ
عَرْشِكَ وَاسْقِنِيْ بِكَاْسِ
مُحَمَّدٍ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ شَرْبَةً لَا ظَمَاَ
بَعْدَهَا اَبَدًا ۔

"అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుక ఈమానన్ లాయజూలు, వయ కీనన్ లా యున్ఫదు వమురాఫకత నబియ్యికముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్.. అల్లాహుమ్మ అజిల్లనీ తహ్త జిల్లి అర్షిక యౌమ లాజిల్ల ఇల్లా జిల్ల అర్షిక వ అస్ఖినీ బికఅసి ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ షర్బతల్ లా జమఅ బాదహా అబదా"

(ఓ అల్లాహ్! ఎప్పటికైనా విడిపోని విశ్వాసాన్ని, ఏనాడు అంతం కానటువంటి నమ్మకాన్ని నీ నుండి కోరుకుంటున్నాను. ఇంకా ప్రళయదినాన నీ ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్‌గారి సాంగత్యాన్ని కోరుకుంటున్నాను.

ఓ ప్రభూ! ప్రళయంనాడు నీ అర్ష్ (పీఠం) నీడన నాకు చోటివ్వు, ఆనాడు ఆ అర్ష్ తప్ప మరే చోట నీడ అనేదే ఉండదు. హజ్రత్ ముహమ్మద్ (సఅసం) గారి హౌజు (చెలమ) నుండి ఇంకేనాడు దాహార్తుణ్ణి కానటువంటి నీటి పాత్రను ఒసగు.

## మకామె ఇబ్రాహీం వద్ద నమాజు

తవాఫ్ చేయడం పూర్తి అయ్యాక మకామె ఇబ్రాహీం వద్ద చేరుకొని అక్కడ రెండు రకాఅత్‌ల నమాజు చేయాలి. ఆ తరువాత ముల్తజిమ్ దగ్గరకు వెళ్ళి ఎంతో దీనంగా వేడుకుంటూ దుఆ చేయాలి. ఆ తరువాత జమ్‌జమ్‌కు వెళ్ళి అక్కడ మూడు గుక్కల నీరు నిలబడి త్రాగాలి.

## మకామె ఇబ్రాహీం దగ్గర చేసే దుఆ

اَللّٰهُمَّ هٰذَا مَقَامُ اِبْرَاهِيْمَ الْعَائِذِ بِكَ مِنَ النَّارِ حَرِّمْ لُحُوْمَنَا وَبَشَرَتَنَا عَلَى النَّارِ

"అల్లాహుమ్మ హాజా మకాము ఇబ్రాహీ మల్ ఆయిజి లి ఆయిజి బిక మినన్ నారి హర్రిమ్ లహూ మనా వ బషరతనా అలన్నార్"

(ఓ అల్లాహ్! ఇది నీ మిత్రుడైన ఇబ్రాహీం గారి ప్రదేశం. దైవ తిరస్కారులు ఆయన్ను అగ్నిలో పడవేసేటప్పుడు ఆయన నీ సహాయాన్నే అర్థించాడు. ఆయన్ను నీవు అగ్నినుండి ఎలా రక్షించావో మా శరీరంలోని మాంస కండల్ని కూడా అలాగే నరక జ్వాలల నుండి రక్షించు)

దీన్ని 'తవాఫె కుదూమ్' అంటారు. ఇఫ్రాద్ లేక 'ఖిరాన్', సంకల్పం చేసిన 'ఆఫాకీ' యాత్రికుడు చేయవలసిన తవాఫ్ ఇది. 'ముతమత్తో' అనే యాత్రికుడు ఈ తవాఫ్ చేయవలసిన పనిలేదు. అదేవిధంగా తవాఫె జియారత్, 'తవాఫె విదా' కూడా చేయాలి.

## 'తవాఫె జియారత్'

'తవాఫె కుదూమ్‌లో రమల్, ఇజ్తిబాలు చేసినవాడు, ఫర్జ్ తవాఫ్'లో అంటే తవాఫె

జియారత్‌లో వీటిని నిర్వహించనవసరంలేదు. అప్పుడు చేయకుండా ఉండిఉంటే తవాఫె జియారత్‌లో ఈ రమల్‌గాని ఇజ్తిబాలుగాని చేయాలి.

**తవాఫె విదా:** తవాఫె విదా (వీడ్కోలు ప్రదక్షిణ)లో పై రెండూ అంటే రమల్, ఇజ్తిబాలు చేయనవసరం లేదు.

**స్త్రీల తవాఫ్:** స్త్రీలు కూడా పై విధంగానే తవాఫ్ చేయాలి. అయితే వీరు రమల్‌గాని, ఇజ్తిబా గాని అంటే ఠీవిగా ఎదుర్రొమ్ము విరిచి, చేతుల్ని బాగా ఊపుకుంటూ నడవ కూడదు. అదీ కాకుండా వీరు తమ దుప్పటిని చంకనుండి తీసి పైన వేసుకోవడం కూడా చేయకూడదు.

**దుఆ:** తవాఫ్ చేసే తరుణంలో, మధ్యన, ఆ తరువాత ఏయే సందర్భాల్లోనయితే దుఆ చేసే ఆదేశాలున్నాయో అప్పుడు, ప్రతి తవాఫ్ చివరన దుఆ చేయాలి. పైన రాసిన దుఆలే కాకుండా ధర్మసమ్మతమైన ఇతర ఏ దుఆలైనా పఠించవచ్చు. కాని ఈ పవిత్రమైన హజ్ యాత్రలో ధర్మసమ్మతంగాని ఏ దుఆ అయినా చేయడం పెద్ద పాపం. ప్రతి దుఆను ప్రారంభించేటప్పుడు, ముగించేటప్పుడు 'దరూద్' పఠించాలి. ఇది దుఆ స్వీకరించబడడానికి కారణభూతం అవుతుంది.

## తవాఫ్‌లో వాజిబ్ అయినవి

తవాఫ్‌లో వాజిబ్ అయిన విషయాలు ఏడు ఉన్నాయి:

1. తహారత్ (పరిశుద్ధత) 2. సతరె ఔరత్ (స్త్రీ దాచవలసిన శరీర భాగాలు) 3. కాబా గృహం తన ఎడమభుజం వైపున ఉండేటట్లు కుడివైపు నుండి తవాఫ్ ప్రారంభించడం. 4. ఎలాంటి ఆటంకం లేకపోతే కాలినడకన తవాఫ్ చేయడం. 5. నిలబడే తవాఫ్ చేయడం. 6. 'హతీమ్' ప్రదేశం వెలుపలి నుండి తవాఫ్ చేయడం. 7. ఏడు ప్రదక్షిణలు చేయడం.

వీటిలో దేన్నైనా కావాలనో లేక పొరపాటునో వదిలేయడం జరిగితే, తిరిగి దాన్ని పూర్తి చేయడం తప్పనిసరి. అలాకాని పక్షంలో ఒక ఖుర్బానీ ఇవ్వాలి. నమాజులో వాజిబ్ తప్పిపోతే సహూసజ్దా చేయడం ఎంత ముఖ్యమో హజ్‌లోని వాజిబ్ తప్పిపోతే ఓ ఖుర్బానీ ఇవ్వడం కూడా అంతే ముఖ్యం.

## తవాఫ్‌లో హరాం అయిన విషయాలు

1. వుజూ లేకుండా తవాఫ్ చేయడం. గుస్ల్ చేయవలసిన పరిస్థితి ఏర్పడితే అలాగే తవాఫ్ చేయడం. 2. 'సత్ర్' భాగం కనబడేటట్లు ఉండడం. అంటే మోకాలిపై నుండి నాభి

వరకు ఉన్న శరీర భాగం కనబడడం లేక ఆ భాగాన్ని కనబడేటట్లు ఉంచడం. 3. కాబా గృహాన్ని తన కుడి భుజం వైపు ఉండేటట్లు వ్యతిరేక దిశలో తవాఫ్ చేయడం. 4. ఎలాంటి ఆటంకంగాని, అనివార్య పరిస్థితిగాని ఏర్పడకపోతే వాహనంపై ఎక్కి తవాఫ్ చేయడం. 5. 'హతీమ్' ప్రదేశం వెలుపల ఉండేటట్లు అంటే హతీమ్ ప్రదేశాన్ని వదిలి తవాఫ్ చేయడం. 6. కూర్చుని తవాఫ్ చేయడం. 7. ఏడు ప్రదక్షిణల కంటే తక్కువగా చేయడం.

**కఫ్ఫారా:** వుజూ లేకుండా తవాఫ్ చేసినట్లయితే దానికి ప్రతిగా కఫ్ఫారా (ప్రాయశ్చిత్తం) చెల్లించాలి. కఫ్ఫారా ఓ గొర్రెనుగాని, మేకనుగాని లేక ఓ దుంబను గాని ఖుర్బానీగా ఇవ్వాలి. ఒక జనాబత్ పరిస్థితి (గుస్ల్ చేయవలసిన పరిస్థితి) ఏర్పడి తవాఫ్ చేస్తే అది పెద్దనేరం. ఎందుకంటే ఆరాధనైనా ఆ స్థితిలో ఆచరించడం ఎంతో పాపం. కాబట్టి దానికి కఫ్ఫారాగా ఓ ఆవునుగాని లేక ఓ ఒంటెనుగాని ఖుర్బానీ ఇవ్వాలి.

అంతేకాకుండా మిగతా విషయాల్లో కూడా ఏదైనా తప్పు జరిగితే ఓ ఖుర్బానీ ఇవ్వవలసి ఉంటుంది. తవాఫ్‌ను తిరిగి చేస్తే (రిపీట్ చేస్తే) కూడా ఖుర్బానీ ఇవ్వాలి.

## తవాఫ్‌లోని మక్రూహ్ విషయాలు

ఈ క్రింది విషయాలు తవాఫ్‌లో మక్రూహ్

1. శరీరంపైగాని, వస్త్రాలపైగాని నజాసతె ఖఫీఫా లేక నజాసతె గలీజా (అశుద్ధ పదార్థాలకు సంబంధించిన రెండు రకాలు) అంటి అదే స్థితిలో తవాఫ్ చేయడం. 2. జిక్ర్‌గాని, దుఆలుగాని చేయకుండా అనవసర ప్రేలాపనల్లో నిమగ్నమై ఉండడం. 3. దేనైన్నా కొనడం, అమ్మడం, (అంటే వ్యాపార సంబంధమైన కార్యకలాపాలలో నిమగ్నమవడం) 4. ఒకటి, రెండు ప్రదక్షిణల తరువాత చాలా సేపటి వరకు కూర్చుని ఉండడం. 5. ఓ ప్రదక్షిణ చేసిన తరువాత, 'మకామె ఇబ్రాహీం' వద్ద నమాజు చేయకుండా మరో ప్రదక్షిణ ప్రారంభించడం. 6. రమల్‌నుగాని, ఇజ్తిబాను గాని వదిలేయడం. 7. హజ్రె అస్వద్ సంబంధమైన ఇస్తిలామ్ చేయకుండా ఉండడం. జన సమూహం మరీ అధికమయితే అక్కడికి నెట్టుకుంటూ వెళ్ళనవసరం లేదు. దూరం నుండే రెండు అరచేతుల్ని అటువైపు ఉంచి సైగచేసి వాటిని చుంబిస్తే చాలు. 8. జిక్ర్‌గాని, దుఆగాని పెద్దగా అరుస్తూ పఠించడం. అయితే ఇతరులు అలా చేస్తూ ఉంటే వారికి బాధ కలిగించే విధంగా హితబోధ చేయకుండా జాగ్రత్తపడాలి. సాధారణంగా అజ్ఞానులు బాగా గోల చేస్తుంటారు.

## సయీా

తవాఫ్ చేసిన తరువాత 'సయీా' చేయడం కూడా చాలా అవసరం. అంటే అది వాజిబ్. సయీా చేసే విధానం ఇది:

మొదట హుజ్రె అస్వద్ దగ్గరికి వచ్చి ఇస్తిలాం చేయాలి. ఆ తరువాత 'బాబుస్సఫా' గుండా 'సఫా' వైపు వెళ్ళి దానిపైకి ఎక్కాలి. అక్కడ దుఆ చేయాలి. అక్కడి నుండి దిగి మర్వా వైపుకు నడవాలి. ఈ రెంటి నడుమ రెండు గుర్తులున్నాయి. అవి మైలైన్ అఖ్జరైన్'లు. మొదటి మైల్ (గుర్తు) దగ్గరికి రాగానే ఓ మాదిరి వేగంగా పరుగెత్తే విధంగా నడవాలి. అయితే పరుగు మరీ వేగమైంది కాకూడదు. ఇదే విధంగా ఒకరిని తోసినట్లుగా ఒకరికి బాధ కలిగినట్లుగా ఉండకూడదు. రెండో గుర్తు దగ్గరికి చేరగానే పరుగును ఆపివేయాలి. ఇక మామూలు నడకతో మర్వా వరకు వెళ్ళి దాన్ని ఎక్కాలి. అక్కడా దుఆ చేయాలి. ఈ విధంగా ఒక చుట్టు పూర్తి అయిందన్నమాట. ఇలాగే సఫా నుండి మర్వా వరకు, మర్వా నుండి సఫా వరకు ఏడుసార్లు తిరగాలి. దివ్య ఖుర్ఆన్‌లో సఫా మర్వాలను 'షాయిరిల్లాహ్' అనడం జరిగింది. అంటే అల్లాహ్ నిర్ణయించిన గుర్తులు అవి. వాటి నడుమ సయీా చేసే ఆదేశాలు ఉన్నాయి. చాలామంది ఇమాములు సయీా చేయడం ఫర్జ్ అని అంటారు.

## సయీాలో పఠించవలసిన దుఆ

సఫా మర్వాలపైకి ఎక్కి దిగేటప్పుడు పఠించవలసిన దుఆలు హదీసు గ్రంథాల్లో చాలా లభిస్తాయి. అయితే ఆ సందర్భంలో ముఖ్యంగా 'తక్బీర్' (దైవ ఔన్నత్యాన్ని చాటడం), తహ్లీల్ (దైవ ఏకత్వాన్ని చాటడం) మాత్రం తప్పకుండా చేయవలసి ఉంటుంది. ఓ దుఆ ఇక్కడ రాయడం జరిగింది:

لَآ إِلٰهَ إِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ يُحْيِيْ وَيُمِيْتُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ ○

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్ దహూ లాషరీకలహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు యుహ్యీ వయుమీతు వహువ అలాకుల్లిషైయిన్ ఖదీర్".

(అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు సాటి ఇంకెవరూ లేరు. ఆయనే అన్నింటికి స్వామి, పాలకుడునూ. సకల స్తోత్రాలు ఆయన కొరకే. జీవితాన్ని ప్రసాదించేవాడూ, మృత్యువును కలిగించేవాడు ఆయనే. ఆయన సకల శక్తి సంపన్నుడు.)

ఈ క్రింది దుఆను సయీ చేసేటప్పుడు మాటి మాటికి ఓ మాదిరి శబ్దంతో పఠించాలి:

"రబ్బిగ్ ఫిర్ వర్‌హమ్ వతజావజ్ అమ్మాతఅలము ఇన్నల్ అంతల్ అఅజ్జుల్ అక్రమ్".

رَبِّ اغْفِرْ وَارْحَمْ وَتَجَاوَزْ عَمَّا تَعْلَمُ إِنَّكَ أَنْتَ الْأَعَزُّ الْأَكْرَمُ ـ

(ఓ నా ప్రభూ! నన్ను మన్నించు; కరుణించు. నా పాపాలను బాగా ఎరిగిన వాడివి. వాటిని క్షమించవా! నీవే శక్తిమంతుడవు, అమిత దయామయుడవు.)

## సయీలో వాజిబ్ అయినవి

1. సఫా మర్వాల నడుమ ఏడుసార్లు లేక అంతకంటే ఎక్కువ సార్లు తిరగడం. 2. కాలినడకన 'సయీ' చేయడం. 3. తవాఫ్ అయిన తరువాతనే సయీ ప్రారంభించడం.

ఎవరయినా సయీ చేయకపోయినా హజ్ విధి నెరవేరుతుంది. అయితే ఆ వాజిబ్‌ను వదిలేసినందుకు ఓ ఖుర్బానీని ఇవ్వాలి. సయీ చేసే సమయంలో వుజూ కలిగి ఉండాలి. సయీ చేసే సందర్భంలో పూర్తి ధ్యాస దైవంవైపే ఉంచాలి. అనవసరమైన బాతాఖానీలూ, ఇతర ఆలోచనలు సయీ సందర్భంలో ఉండకూడదు.

## సయీలో మక్రూహ్ అయినవి (అవాంఛనీయమైనవి)

1. సఫా మర్వాలను ఎక్కకుండా ఉండడం, 2. సఫాకు బదులు మర్వా నుండి సయీ ప్రారంభించడం, 3. మొత్తం ఏడు చక్కర్లు చేయకపోవడం, 4. మైలైన్ అక్జరైన్‌ల నడుమ పరుగిడకుండా ఉండడం.

## మైలైన్ కాకుండా ఇతర ప్రదేశంలో పరుగిడడం

స్త్రీలు కూడా పై విధంగానే సయీ చేయాలి. అయితే వారు మైలైన్ అక్జరైన్‌ల నడుమ పరుగెత్తకూడదు, మామూలు నడకతోనే వెళ్ళాలి.

**మినా:** తవాఫె కుదూమ్, సయీ ఈ రెండూ పూర్తి చేసిన తరువాత, మక్కా నగరంలో ఉన్నంతకాలం కాబా గృహ ప్రదక్షిణలు (తవాఫ్) చేస్తూనే ఉండాలి. ఈ తవాఫ్‌పైన చెప్పిన విధంగానే ఆచరించాలి. అయితే అందులో 'రమల్'గాని, తవాఫ్ తదుపరి చేసే సయీ గానిఉండవు. (చేయకూడదు). పిదప జిల్‌హజ్జా మాసం ఎనిమిదవ తేదీ నాటి ఫజ్ర్ నమాజ్ 'హరమ్'లో చేసి మినాకు బయలుదేరాలి. అక్కడ ఓ రోజు ఆగి,

తొమ్మిదవ తేదీనాడు అరఫాత్‌కు బయలుదేరాలి. మినాలో ఎనిమిదవ తేదీనాడు హజ్‌కు సంబంధించిన ఆరాధన ఏదీ ఉండదు. కేవలం ఎనిమిదవ తేదీనాడు అక్కడికి చేరడం తొమ్మిదో తేదీనాడు ఉదయాన్నే అక్కడి నుండి 'అరఫాత్'కు బయలుదేరడమే ఆరాధన. అది సున్నత్. అరఫాత్‌కు వెళ్ళడం, అక్కడ ఉకూఫె అరఫాత్ (అరఫాత్ మైదానంలో ఆగిపోవడం) ఆగిపోవడం గురించిన వివరాలు ఇలా ఉన్నాయి.

ఇది హజ్‌లోని మూడవ ఫర్జ్. అంటే ఈ ఫర్జ్, ఇహ్రామ్‌కట్టడం, తవాఫ్ చేయడం లాంటి ఫర్జ్ అన్నమాట. అయితే పై రెండు ఫర్జ్‌లు నెరవేర్చడానికి కొంత వెసులుబాటుంది. కాని ఉకూఫ్ కోసం ఓ ప్రత్యేకమైన సమయం కేటాయించడం జరిగింది. ఈ సమయంలో గనక ఆలస్యం జరిగిపోతే అసలు హజ్ విధే నెరవేరదు. ఉదాహరణకు, తవాఫె జియారత్‌నే తీసుకుందాం. దీని పది, పదకొండూ, పన్నెండో తేదీలలో ఏ ఒక్క తేదీలోనైనా నిర్వహించ వచ్చు. ఆ మూడు రోజుల్లోనూ నెరవేర్చలేక పోయినా జిల్‌హజ్జా మాసపు చివరి రోజు వరకైనా పూర్తి చేసుకోవచ్చు. అలా ఆలస్యం చేసినందుకు గాను ఒక ఖుర్బానీ ఇవ్వాల్సి ఉంటుంది. ముహర్రం మాసం చొరబడితే మాత్రం ఇక మరుసటి సంవత్సరమే చేయాలి. ఉకూఫ్ అలా కాదు. దీనికి ఓ ప్రత్యేక సమయం (తేదీ) నిర్ణయించడం జరిగింది. ఆలస్యం జరిగితే మాత్రం ఇక ఏమీ చేయలేం.

## ఉకూఫె అరఫాత్ కాలం

ఉకూఫె అరఫాత్ కాలం, తొమ్మిదో తేదీ మధ్యాహ్నం మొదలు సూర్యాస్తమయం వరకే. ఈ మధ్యకాలంలో ఎప్పుడయినా అక్కడికి వెళ్ళి కొంచెంసేపు విశ్రమిస్తే (ఆగితే) ఆ ఫర్జ్ నెరవేరినట్లే. అయితే ఏ నియమ నిబంధనలకు అనుగుణంగా 'ఉకూఫ్' చేయాలో ఆ నియమాలు ఈక్రింది విధంగా ఉన్నాయి.

## ఉకూఫ్‌లోని సాంప్రదాయక మర్యాదలు

తొమ్మిదో తేదీ నాటి ఫజ్ర్ నమాజు 'మినా' ప్రదేశంలో చేసే సూర్యోదయం అయ్యాక అరఫాత్ మైదానానికి బయలుదేరడం ఉత్తమం. అక్కడ తమ తమ బసలకు చేరిన వారు కాలకృత్యాలు తీర్చుకొని మధ్యాహ్నం అవక పూర్వమే గుస్ల్ చేసి బట్టలు మార్చు కోవాలి. సూర్యుడు కొంత పడమరకు వాలగానే వుజూ వగైరాలు చేసి 'మస్జిదె నమ్రా' వైపు నడవాలి. అక్కడ ఇమామ్ జుమా ఖుత్బాలా రెండు ఖుత్బాలు ఇస్తాడు (ప్రసంగాలు చేస్తాడు) ఆ ప్రసంగాల్ని శ్రద్ధగా వినాలి. ఖుత్బాకాగానే జొహ్ర్ నమాజు కోసం తక్బీరు

పలుకబడుతుంది. జొహ్ర్ నమాజు సామూహికంగా (జమాఅత్‌తో) చేయాలి. అది అయిన తరువాత వెంటనే అస్ర్ నమాజ్ కోసం తక్బీర్ చెప్పడం జరుగుతుంది. అస్ర్ నమాజు కూడా సామూహికంగా చేయాలి. అంటే జొహ్ర్, అస్ర్ నమాజులు వెంటవెంటనే చేయడం జరుగుతుందన్నమాట. ఈ రెండు నమాజుల నడుమ ఎలాంటి సున్నత్ నమాజుగాని, నఫిల్ నమాజుగాని ఉండవు.

కేవలం రెండు నమాజుల నడుమ ఒక 'తక్బీర్' మాత్రమే ఉంటుంది. అజాన్ కూడా ఈ రెండు నమాజుల కోసం ఒక్కటే.

ఈ సందర్భంలో గుర్తించవలసిన విషయం ఏమిటంటే, జొహ్ర్, అస్ర్ నమాజులు కలిపి చేయవలసింది కేవలం ఇహ్రాం స్థితిలో ఉన్నప్పుడు, జమాఅత్‌తో చేయవలసి నప్పుడు మాత్రమే. ఒంటరి వాడు ఈ రెండు నమాజులను కలిపి చేయకూడదు. నమాజు పూర్తి అయిన తరువాత ఇమామ్, మౌఖఫ్ అనే ప్రదేశానికి బయలుదేరుతాడు. ఇది 'జబ్లె రహ్మత్' దాపున ఉంది. అంతా కలిసి ఇమామ్‌ను అనుసరిస్తూ 'మౌఖాఫ్' వైపుకు బయలుదేరి వెళ్ళాలి. ఈ ప్రదేశంలోనే దైవప్రవక్త (సఅసం) తమ చివరి హజ్, 'హజ్జతుల్ విదా' దుఆ నమాజులు చేశారు. అయితే కొందరు సాధారణంగా, ఆ ప్రదేశంలో గుంపు ఎక్కువై త్రొక్కిసలాట జరుగుతుందని భయపెడతారు. కాని ఎవరి మాటల్ని ఖాతరు చేయకుండా అక్కడికి వెళ్ళాలి. అయితే దారి తప్పి పోతామేమో అనే భయం ఉంటే మాత్రం ఉన్న చోటున్నే జమాఅత్‌తో నమాజు చేయాలి.

## బత్నె ఉర్నా

అరఫాత్ మైదానంలోని ఓ ప్రదేశం ఇది. ఈ ప్రదేశం తప్ప అరఫాత్ మైదానంలో మరెక్కడయినా ఆగవచ్చు. 'జబలె రహ్మత్' దాపున ఆగితే మరీ మంచిది. అయితే ఎక్కడ ఆగినా ప్రజలను నొప్పించకుండా ఉండాలి. ప్రజలను నొప్పించడం ధర్మసమ్మతం కాదు.

'మౌకఫ్' అనే ప్రదేశానికి చేరుకొని వాహనం మీదుండి, వాహనం లేకపోతే క్రింద నిలబడి దుఆ చేయాలి. సూర్యాస్తమయం వరకు 'జిక్ర్' చేస్తూ దుఆ చూస్తూనే ఉండాలి. అనవసర ప్రసంగాలతో కాలం వృధా చేయకూడదు. ఇక్కడ ఏకాగ్రతతో, భయభక్తులతో తన ఇహపరాల సాఫల్యం కోసం, ముస్లిమ్ సమాజ శ్రేయం కోసం అల్లాహ్‌ను వేడుకోవాలి. ఇలా చేస్తే ఎంతో మేలు జరుగుతుందని హదీసుల్లో చెప్పడం జరిగింది.

దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ప్రకారం, షైతానుకు ఈ రోజు కలిగేటంత సిగ్గు అవమానం మరేనాడు కలగదట. ఈనాడు దైవదాసుల పెద్ద పెద్ద పాపాలే క్షమించ

బడతాయి గనక షైతాను నిస్సహాయంగా చూస్తూ ఉండిపోతాడట. దైవప్రవక్త (సఅసం) జబలెరహ్మత్ దగ్గర చేసిన దుఆ తీరును ఆయన అనుచరులు ఇలా విశదీకరించారు:

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం:

عَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ رَأَيْتُهُ عَلَيْهِ السَّلَامُ يَدْعُوا بِعَرَفَةَ يَدَاهُ إِلَى صَدْرِهٖ كَاسْتِطْعَامِ الْمِسْكِيْنِ۔

దైవప్రవక్త (సఅసం)ను 'అరఫాత్' మైదానంలో దుఆ చేస్తూ ఉండగా చూశాను. ఆ దుఆ తీరు, ఓ ఆకలి గొన్న నిరుపేద ఎంతో దీనంగా రొట్టె కోసం యాచిస్తున్నట్లుగా ఆయన తన రెండు అరచేతులు ఎదురొమ్ముకు సమాంతరంగా పెట్టి తెరిచినట్లుగా ఉంది.

దైవప్రవక్త (సఅసం) ఈ సందర్భంలో చేయవలసిన దుఆ ఏదో సెలవిస్తూ, ఇది ఇతర ప్రవక్తలు చేసిన దుఆ అని చెప్పారు.

لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ (ترمذی)

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహు లాషరీకలహు లహుల్ ముల్కు వల హుల్ హమ్దు వహువ అలాకుల్లిషై ఇన్ ఖదీర్" (తిర్మిజీ)

## ముజ్‌దల్ఫాలో

జిల్‌హజ్జా తొమ్మిదో తేదీనాడు సూర్యాస్తమయం అయిన తరువాత మగ్రిబ్ నమాజు చేయకుండానే ముజ్‌దల్ఫాకు చేరుకోవాలి. అప్పటికే మగ్రిబ్ వేళ దాటిపోతుంది. అయినా లెక్కలోనికి తీసుకోరాదు. దైవప్రవక్త సంప్రదాయం ఇదే. అరఫాత్‌లో జొహ్ర్, అస్ర్ నమాజుల మధ్య ఎలాంటి వ్యవధి లేకుండా చేయడం జరుగు తుంది. ఆ రెండు నమాజుల్లో అఖామత్ చెప్పేటంత వ్యవధి మాత్రమే ఉంటుంది. అయితే ఇక్కడ రెండు నమాజులు (మగ్రిబ్, ఇషా) కలిపి చేయడంలో, జమాఅత్‌తో (సామూ హికంగా) చేయాలన్న షరతు మాత్రం లేదు. అయితే ఒంటరిగా చేసినా వెంట వెంటనే చేయాలి. కాని అఖామత్ మాత్రం చెప్పాలి. అజాన్ చెప్పే అవసరం లేదు.

**వాదియే ముహస్సిర్ :** ముజ్‌దలిఫాలో 'వాదియే ముహస్సిర్' పేరుగల ప్రదేశం ఒకటుంది. ఈ ప్రదేశం తప్ప ఇంకెక్కడైనా ఆగవచ్చు. కాబాగృహాన్ని ధ్వంసం చేయడానికి వచ్చిన అబ్రహా సైన్యాన్ని దేవుడు సర్వనాశనం చేసింది ఈ ప్రదేశంలోనే. ఇదే దైవశిక్షకు లోనైన ప్రదేశం కాబట్టి ఇక్కడ ఆగకూడదని ఆదేశం. పదవ తేదీ రాత్రల్లా ముజ్‌దలిఫాలోనే ఉండాలి. ఆనాటి ఫజ్ర్ నమాజు జమాఅత్‌తో చేయడం ముఖ్యం. కాబట్టి జమాఅత్‌లో చేరే ప్రయత్నం చేయాలి. నమాజు ముగిసిన తరువాత 'జబ్లెఖజహ్' దగ్గర ఇమామ్ నిలబడ తాడు, వెంటనే అందరూ నిలబడి దుఆ చేయాలి. దైవప్రవక్త (సఅసం) నిలబడి దుఆ చేసిన రెండో ప్రదేశం ఇది. అరఫాత్‌లో నిలబడి దుఆ చేసినట్లే మహాప్రవక్త (సఅసం) ఇక్కడ కూడా నిలబడి దుఆ చేశారు.

**మళ్ళీ మినాలో :** ముజ్‌దలిఫా నుండి పదవ తేదీ ఉదయం, సూర్యోదయం కాకపూర్వమే మినా ప్రదేశానికి బయలుదేరాలి. ముజ్‌దలిఫా నుండైనా లేక బాటవెంట బడయినా నడుస్తూ ఏడు గులకరాళ్ళను ఏరుకొని వెంట ఉంచుకోవాలి.

**జమ్రయే అక్బాపై రమీ (రాళ్ళు విసరటం):** జమ్రతుల్ అక్బా దగ్గరకు వెళ్ళి, క్రింది భాగాన నిలబడి దానిపై 'రమీ' చేయాలి. ఒక్కో గులకరాయిని ఒకదాని వెంట ఒకటి దానిపై విసరడం మంచిది. జమ్రతుల్ అక్బా దగ్గరున్న గులకరాళ్ళను మాత్రం ఏరకూడదు. దాని దాపునే మరో రెండు జమ్రాలు ఉన్నాయి. కాని ఈ రోజు మాత్రం వాటి జోలికి పోకూడదు.

**తల్బియా సమాప్తం :** ఇహ్రామ్ కట్టినప్పుడు ప్రారంభించిన తల్బియా వచనాలు రమీ చేయడానికి పూర్వమే సమాప్తం చేసేయాలి.

**ఖుర్బానీ :** రమీ తరువాత ఖుర్బానీ చేయాలి. ఖుర్బానీ అయిన తరువాత 'హలక్' చేయించాలి. హలక్ అంటే తల గొరిగించుకోవడం లేక వెంట్రుకల్ని కత్తిరించుకోవడం. స్త్రీలు వెంట్రుకల్ని గొరిగించుకోవడం నిషిద్ధం. ఖుర్బానీ చేయడం, తల గొరిగించుకోవడం గురించి దివ్యఖుర్‌ఆన్‌లో తాకీదు ఉంది. కాబట్టి కొందరు ఇమాములు తల గొరిగించు కోవడం కూడా ఫర్జ్ (విధి) అని అంటారు.

ఒకే ఒక నియమం తప్ప ఇక ఇహ్రామ్‌కు సంబంధించిన నియమాలన్నీ ఈ ఖుర్బానీ, హలక్‌లతో సమాప్తం అయిపోయినట్లే. అయితే మిగిలిపోయిన ఆ నియమం 'రఫ్స్'. అంటే లైంగిక వాంఛల పరిపూర్తి. దీని వివరణ ఇదివరకే ఇవ్వడం జరిగింది.

**తవాఫె జియారత్ :** ఇది ఫర్జ్ చేయబడిన తవాఫ్ అంటే విధిగా చేయవలసింది.

ఆనాడు దీన్ని నిర్వహించలేకపోతే పదకొండో తేదీనాడు లేక పన్నెండో తేదీనాడు చేయవచ్చు. ఈ తవాఫ్‌లో, ముల్తజిమ్‌లో దుఆ చేయడం, హ్రజె అస్వద్‌ను చుంబించడం, మకామె ఇబ్రాహీంలో రెండు రకాతుల నమాజు చేయడం అవసరం.

'తవాఫె ఖుదూమ్'లో రమల్, సయీలు ఇదివరకే చేసి ఉన్నట్లయితే తిరిగి వాటిని చేయకూడదు. దీనితో ఇహ్రామ్‌లో నిషిద్ధం అయినవన్నీ అంతం అయిపోతాయి. తవాఫె జియారత్ చేసిన తరువాత హాజి, తిరిగి మినా ప్రదేశానికి వచ్చి అక్కడ రెండు రోజుల దాకా ఉండి పోవాలి. ఆ రెండు రోజుల్లోను అతడు చేయవలసింది ఒక్కటే.

**మూడు జమ్రాలను రమీ చేయడం:** పదకొండు, పన్నెండు తేదీల్లో మస్జిదె హనీఫ్ దగ్గర ఉన్న మూడు జమ్రాలపై గులక రాళ్ళు విసరడం. ఒక్కోదానిపై ఏడేసి గులకరాళ్ళను విసరాలి. ఒక్కో గులకరాయిని విసురుతూ తక్బీర్ పలకాలి. అంటే ఔన్నత్యాలన్నీ కేవలం అల్లాహ్ కొరకే అని చాటాలి. రమీలో మొదట జమ్రయేఊలా, తరువాత జమ్రయేఉస్తా, చివరిగా జమ్రయే అక్బాపై రమీ చేయాలి.

**తిరిగి మక్కా నగరానికి :** జిల్‌హజ్జా పన్నెండో తేదీ రోజున సూర్యాస్తమయం అవకముందే మినా నుండి మక్కాకు బయలుదేరాలి. 'వాదియే ముహస్సిర్'లో కొంత తడవు ఆగి దుఆ చేయాలి. ఇషా నమాజు ఇక్కడనే చేయడం ఉత్తమం. ఆ తరువాత మక్కా నగరానికి వెళ్ళి అక్కడ హాజీ తాను ఉండవలసినన్ని రోజులు ఉండవచ్చు. అక్కడి నుండి సెలవు తీసుకునే ముందు చిట్ట చివరి తవాఫ్ 'తవాఫె జియారత్' చేసి మరీ వెళ్ళాలి.

**'రమీ'కు సంబంధించిన మక్రూహ్ విషయాలు:** రమీ చేయడంలో మక్రూహ్ విషయాలు ఇలా ఉన్నాయి: 1. అశుద్ధం అంటిన గులకరాళ్ళను విసరడం. 2. జమ్రా దగ్గరి గులకరాళ్ళను ఏరి వాటిని విసరటం. 3. ఏడు గులకరాళ్ళకంటే ఎక్కువగా విసరటం. 4. వాటిని ఒకదాని వెంట మరొకటి వెంట వెంటనే విసరాలి. అయితే వాటి నడుమ ఆలస్యం చేయడం మాత్రం మక్రూహ్. 5. రమీ చేసే టప్పుడు తక్బీర్ పలకకుండా ఉండడం.

**రమీలో దొర్లే తప్పుల పరిహారం:** హజ్ సందర్భంలో వాజిబ్ విషయాలను వదిలేసినా లేక వాటి నిర్వహణలో ఆలస్యం జరిగినా 'కఫ్ఫారా' (ప్రాయశ్చిత్తం) చేయాలన్న విషయం తెలిసిందే. కాబట్టి రమీ చేసేటప్పుడు అలాంటి పొరపాట్లు దొర్లితే కఫ్ఫారా (పాపపరిహారం) చెల్లించుకోవాల్సిందే.

1. జిల్‌హజ్జా మాసపు పది, పదకొండు, పన్నెండు తేదీల్లో రమీ చేయడం వాజిబ్. ఎవరైనా చేయకపోతే పదమూడోనాడు కూడా చేయవచ్చు. అయితే ఇలా చేసినందుకు ఓ ఖుర్బానీ కఫ్ఫారా ఇవ్వాలి. 2. ఒకనాటికి సంబంధించిన రమీ తప్పిపోయినా లేక రమీ చేసే క్రమంలో మార్పు వచ్చినా ఖుర్బానీ చేయాల్సిందే. 3. ఏడు గులకరాళ్ళకంటే తక్కువ గులకరాళ్ళు విసిరినా ఒక సదఖా చేయాలి.

**ఖుర్బానీ :** హజ్‌లో చేసే ఖుర్బానీ అది హజ్‌కు సంబంధించిందే. ఈదుజ్జుహా నాడు చేసే ఖుర్బానీ 'ఆఫాకీ'పై వాజిబ్ కాదు. కారణం అతడు ప్రయాణికుడు అవడం వల్ల.

**'హలక్'లో దొరిలే పొరపాట్లు :** 1. హలక్ హరమ్ పరిధిలోనే చేసుకోవాలి. ఆ పరిధి బయట చేయించుకుంటే ఓ ఖుర్బానీ చెయ్యాలి. 2. 'అయ్యామె నహ్ర్' (ఖుర్బానీ చేసే దినాలు) అంటే పది, పద కొండు, పన్నెండు తేదీల తరువాత ఖుర్బానీ చేస్తే దీనికిగాను ఓ ఖుర్బానీ కఫ్ఫారాగా చెల్లించుకోవాలి. 3. రమీ చేయకమునుపే హలక్ చేయించుకుంటే ఓ ఖుర్బానీ చేయాలి.

**హజ్ ధ్యేయం-ప్రయోజనాలు:** హజ్‌కు ప్రయోజనాలు కొన్నిటిని గురించి ఇదివరకే మనం చెప్పుకున్నాం. ఇంకొన్నింటి గూర్చి ఇప్పుడు రాయడం జరుగుతోంది. హజ్ అనే ఆరాధనా కార్యక్రమం మొత్తంపై దృష్టి సారించి ఆలోచిస్తే మనకు ఈ క్రింది విషయాలు తెలుస్తాయి:

1. హజ్ దేవుని ఆజ్ఞాపాలన. ఆయన ఎడలగల ప్రేమ, ఆయన ఆరాధనకు సంబంధించిన ఓ చరిత్రాత్మకమైన గుర్తు ఈ హజ్. కాబాగృహానికి చేరగానే హజ్రత్ ఆదమ్ (అస) మొదలు అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం) వరకు ఈ భూమ్మీదకు పంపించిన దైవప్రవక్తలందరూ మన మనోఫలకంపై మెదలుతారు. ముఖ్యంగా హజ్రత్ ఇబ్రాహీం (అస) గుర్తుకు రావడంతోడనే ఆయన సంతతిలోనే ఎక్కువమంది ప్రవక్తలు ఉద్భవించారన్న విషయం మన మనస్సులో మెదులుతుంది మాటిమాటికి.

ధర్మం కోసం హిజ్రత్ (వలస) చేయడం ఆయనపై ఉన్న అనంతమైన దైవకృప, దైవాభీష్టం మేరకు తనకు అత్యంత ఇష్టమైన దాన్ని దైవమార్గంలో త్యాగం చేసే తీరు ఇక్కడ సజీవంగా మనకు కానవస్తాయి. ఇలాగే ఈ ప్రదేశంలో అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం) గారి పదమూడేళ్ళ త్యాగమయ జీవనగాథ మక్కా నగరవీధుల్లో మన కళ్ళకు కట్టినట్లు అగుపిస్తుంది. ఫలానా ప్రదేశంలో గదా ఆయన నమాజు చేసింది, ఆ నమాజు చేసేటప్పుడు ఆయన ఒంటిపై ఒంటె పొట్ట ప్రేగులు వేసింది అనే విషయాలు

గుర్తుకు వస్తాయి. అలాగే ఫలానా ఇల్లు ఉమ్మెహానీ గారి ఇల్లు. ఈ ఇంటి నుండే ఆయన దైవసన్నిధానంలోనికి మేరాజ్ యాత్ర చేసింది. ఇది ఫారాన్ కొండ శిఖరం, ఈ కొండ శిఖరంపై నుండే ఆయన ప్రధమ ప్రసంగం చేశారు! ఇది అర్ఖమ్ (రజిఅన్)గారి ఇల్లు (దారెఅర్ఖమ్), ఈ ఇంట్లోనే వ్రేళ్ళపై లెక్కించగలిగినంత మంది నిస్సహాయులు కలిసి ప్రపంచ దశను మార్చడానికి ప్లాను వేసింది!! అదిగో ఆ ప్రదేశం నుండే దైవప్రవక్త (సఅసం) మదీనాకు (హిజ్రత్) వలస పోయారు!!! ఇలా అడుగడుగునా ఆయన జీవన చరిత్ర కళ్ళకు కట్టినట్లు అగుపడుతుంటే హాజీ తనను తానే మరిచిపోతాడు.

2. హజ్ ఆరాధనకు సంబంధించిన ప్రతి అంశం హృదయ ఫలకంపై ఏకేశ్వర వాదపు చెరగని ముద్రవేస్తుంది. ప్రళయదిన భయానక వాతావరణం, అక్కడనిలబడి మనిషి చెప్పుకోవలసిన సంజాయిషీ తీరు, ప్రతి వ్యక్తి ఆ తీర్పు రోజున 'ఇహ్రామ్' స్థితిలో ఎలా ఉంటాడో ఆ స్థితిలో తనపై కప్పబడ్డ కఫన్ వస్త్రం (శవానికి తొడిగే తెల్లటి వస్త్రం)తో హాజరుకావలసిందే అన్న ఊహ లీలగా మెదులుతుంది హాజీ మనస్సులో.

3. దైవం, దైవధర్మం, దైవప్రవక్త ఎడల గల ప్రేమాభిమానాలు కేవలం నోటి మాటల వరకే పరిమితమైలేవని వాటిని చేతల ద్వారా నిరూపించడం జరుగుతుంది ఈ హజ్ ఆరాధనతో.

4. మనిషినే కాదు దేవుని సృష్టితాల్లోని అతి చిన్న జీవాన్నైనా అనవసరంగా హింసించకూడదు, బాధించకూడదు; పొరపాటున అలా జరిగితే దానికి వెంటనే ప్రాయశ్చిత్తం చేయాలనే గుణపాఠం కూడా గరుపుతుంది ఈ హజ్ ఆరాధన.

**మదీనా నగర సందర్శనం:** 'మదీనా మునవ్వరా'ను సందర్శించడం, 'మస్జిదెనబవీ'లో నమాజు చేయడం, ప్రవక్త (సఅసం) సమాధి గుంబదెఖిజ్రాను దర్శించడం అనేవి హాజ్ విధుల్లోని భాగాలు కాకపోయినా, కావాలని వాటిని వదిలి వేసి వెనక్కి తిరిగివచ్చేవాడు అమృతసాగరతీరం వరకు వెళ్ళి అందులోని ఓ గుక్కెడు అమృతాన్ని గ్రోలకుండా అనంతమైన జీవితాన్ని కాదని వచ్చే వానితో సమానం.

ఇస్లామ్ వంటి సంపద మనకు దక్కకపోతే మనం ఈ ప్రపంచంలోని వరాలన్నిటి కంటే గొప్ప వరాన్నే పోగొట్టుకున్నవాళ్ళం కదా? ఆలోచించండి! సృష్టికర్త ఎవరో, ఆయన హక్కులేమిటో, అలాగే సృష్టితాలమైన మనం మన స్థాయి ఏదో, మనకు లభించిన హక్కులేవో తెలుసుకోగలిగేవారమా? అలాగయితే మనకు పశువులకు నడుమ తేడా ఏమైనా ఉండేదా? ఇలాంటి సంపద మనకు ఎలా లభించింది? ఎక్కడి నుండి లభించింది? ఈ ప్రశ్నలన్నింటికి ఒకే ఒక సమాధానం. అదే, అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్

(సఅసం) గారి ద్వారానే ఇవన్నీ మనకు లభించాయి. ఆయన పవిత్ర భౌతిక కాయం మట్టిపొరల్లో దాగిఉన్నా, మన కళ్ళు ఆయన్ను గాంచలేకపోయినా,మనం ఆయన సమాధి దగ్గరకు వెడితే ఆయన మనకు అక్కడ ఉన్నట్లు అక్కడి ప్రతి అణువు సాక్ష్యం చెబుతుంది. దైవప్రవక్త (సఅసం) ఇక్కడ కూర్చునేవారని, ఇక్కడ మేనువాల్చేవారని, ఈ ఫలానా ప్రదేశంలో నమాజు చేసేవారని, ఫలానా ప్రదేశంలో నిలబడి ఖుత్బా (ప్రసంగం) ఇచ్చే వారని, ఇక్కడ కూర్చునేవారని, అదిగో అక్కడ విదేశీ ప్రతినిధులతో మాట్లాడేవారని, ఈ ప్రదేశంలో దైవవాణి అవతరించేదని అక్కడి ప్రతి ప్రదేశం వివరిస్తున్నట్లు తోస్తుంది. అదేవిధంగా ఆయన మక్కా నుండి హిజ్రత్ చేసి వచ్చినప్పుడు ఆయనగారి ఒంటె ఇక్కడ కూర్చుంది. అదుగో ఇది అగడ్త (కందకం) ఈ అగడ్తను త్రవ్వి ఆయన ఇస్లామ్‌ను రక్షించారు. ఆయనపై దుమ్మెత్తి పోయ ప్రయత్నించిన వారు స్వయంగా ఈ మట్టిలోనే కలిసిపోయారు అన్న సత్యం కళ్ళకు కట్టినట్లు అగుపడుతుంది. ఇదిగో ఇదే మస్జిదె 'ఖుబా' ఇక్కణ్ణే దైవప్రవక్త ప్రధమంగా నమాజు చేశారు. ఇది మస్జిదుల్ ఖిబ్లతైన్. ఇక్కడనే ఖిబ్లా దిశ మారింది ఇది మస్జిదె నబవీ. ప్రస్తుతం దీని అందచందాల్లో ప్రపంచంలోని ఏ మస్జిదు దీనికి సాటిరాదు. ప్రప్రథమంగా దీని గోడలు పచ్చి ఇటుకలతో, రాళ్ళతో లేపబడ్డాయి. పైకప్పు ఖర్జూరపు ఆకులతో కప్పడం జరిగింది. దీని నిర్మాణంలో స్వయంగా దైవప్రవక్తే పాల్గొన్నారు. నేలపై గల చిన్న చిన్న గులకరాళ్ళు ఆయన అనుచరులు సజ్దా చేసేటప్పుడు వారి నుదుళ్ళకు గుచ్చుకునేవి. వర్షం వస్తే నేలంతా తడిసి పోయేది. ఈ మస్జిదు గురించి ఖుర్ఆన్ "ఇది స్వచ్ఛమైన దైవభీతి పునాదులపై కట్టబడిన మస్జిద్" అని చెప్పింది. అంటే ఈ లోకంలో దైవప్రవక్త (సఅసం) తన స్వహస్తాలతో నిర్మించిన చిట్టచివరి మస్జిద్.

మొత్తానికి మస్జిదె నబవీ దర్శనం చేసుకొని ఆ మస్జిద్‌లో నమాజు చేసి, ప్రవక్త (సఅసం) గారి సమాధిని కళ్ళారా తిలకించిన తరువాత ఇక మదీనా నగర దర్శనం చేసుకుంటారు. ఈ నగరం నుండే ఇస్లాం కాంతి కిరణాలు నేల నాలుగు చెరగులా వ్యాపించాయి. ఈ కాంతితోనే ప్రపంచం అంతా విరాజిల్లింది.

మదీనా నగరం పూర్వనామం 'యస్రిబ్'. యస్రిబ్ అంటే శాపం, కల్లోలం అని నిఘంటువు అర్థాలు. అయితే దైవప్రవక్త (సఅసం) హిజ్రత్ (వలస) చేసి ఇక్కడికి వచ్చాక దాని పేరు 'మదీనతున్నబీ' అని ప్రచారంలోకి వచ్చింది. మదీనతున్నబీ అంటే ప్రవక్త నగరం అని అర్థం. వాడుక భాషలో కేవలం దీన్ని మదీనాగానే పిలుస్తాం. ఇక దీన్ని యస్రీబ్ పేరుతో పిలువకూడదు. ఇది అజ్ఞాన కాలం నాటి పేరు. ఇదే కాకుండా ఈ నగరానికి ఇంకా చాలా పేర్లున్నాయి. 'తైబా', 'తాబా', 'తయ్యిబా' వగైరా.

దైవప్రవక్త (సఅసం) మక్కా నుండి హిజ్రత్ చేసి బయలుదేరే ముందు దైవాన్ని

వేడుకున్నారు. ఆ దుఆ ఫలితంగానే ఈనాటికీ ఎందరెందరో ఆ నగర పవిత్ర మృత్తికలో ఓ అనిర్వచనీయమైన సుగంధాన్ని, సౌందర్యాన్ని అనుభవిస్తున్నారు. ఆయన దైవాన్ని వేడుకున్న వేడుకోలు ఇలా ఉంది:

"ఓ అల్లాహ్! ఎంతో ప్రీతికరమైన ఈ ప్రదేశం నుండి నన్ను బయటికి తీస్తున్నందుకు ప్రతిగా, ఇతర జనావాసాల్లో నీకు అత్యంత ప్రీతికరమైన ప్రదేశం ఏదో ఆ ప్రదేశానికే నన్ను చేర్చు."

**ప్రవక్త (సఅసం) గారి సందర్శనం:** దైవప్రవక్త (సఅసం) మజ్జిదె నబవీలో నమాజు చేయడం గూర్చి, తన సమాధిని సందర్శించడం గూర్చి స్వయంగా తాకీదు చేశారు. ముస్లిముల విశ్వాస సంబంధం, దైవప్రవక్తగారి ఎడల వారి అభిమానం తెగిపోకుండా ఉండాలన్నదే ఆ తాకీదులోని పరమార్థం. ఈ విషయంలో ఆయన ప్రవచనం ఇలా ఉంది:

"హజ్ చేసిన తరువాత నన్ను దర్శించని వారు నాపై దౌర్జన్యం చేసిన వారితో సమానం."

రవ్వంత విశ్వాసం కలిగివున్న ఏ ముస్లిమయినా దైవప్రవక్త (సఅసం)పై దౌర్జన్యం చేయ సాహసించగలడా చెప్పండి?

ఆయన దర్శనం అంటే ఆయన గుర్తుల్ని, ఆయన సమాధిని సందర్శించడమే అవుతుంది. కాబట్టి మరో సందర్భంలో ఆయన ఇలా సెలవిచ్చారు:

"ఎవరయితే నా సమాధిని సందర్శిస్తారో, వారు నేను జీవించి ఉండగా నన్ను సందర్శించిన వారితో సమానం".(బహేలీ)

'ఇక్కడ సందర్శించిన వారితో సమానం' అనే పదాన్ని వాడారు దైవప్రవక్త (సఅసం). అంటే ఆయన సమాధిని సందర్శించిన వాళ్ళంతా ఆయన సహాబా (రజిఅన్) (అనుచరుల) స్థాయికి చేర్తారని అనుకోవడం పొరపాటు. అయితే సహాబా (రజిఅన్)కు, ఇతర ముస్లిములపై ఎలాంటి ఔన్నత్యంగలదో, దైవప్రవక్త (సఅసం) గారి సమాధిని సందర్శించిన ముస్లిములు కూడా ఇతర ముస్లిముల కంటే ఎంతో మెరుగు అని అర్థం.

**మదీనా నగర సందర్శనా విధానం :** 'తవాఫెవిదా' (వీడ్కోలు ప్రదక్షిణం) అయ్యాక మక్కా నుండి మదీనాకు బయలు దేరాలి. మదీనా నగరానికి చేరువైన కొలది దాన్ని కళ్ళారా తిలకించే ఉబలాటంతో పాటు దాని ఎడల గల గౌరవప్రపత్తుల్ని హృదయంలో పెంచుకునే ప్రయత్నం చేయాలి. ప్రయాణ సమయంలో దైవప్రవక్త (సఅసం)పై దరూద్ సలాము పఠిస్తూనే ఉండాలి. ఇక మదీనా సరిహద్దులు ప్రారంభం అయ్యాయి

అన్నప్పుడు ఆ ప్రదేశం నుండి కాలి నడకన బయలుదేరి మదీనా నగరంలో ప్రవేశించడం ఉత్తమం. 'గుంబదె జిబ్రా' (దైవప్రవక్త (సఅసం) గారి సమాధిపై కట్టబడిన ఆకుపచ్చని గుమ్మటం) అగుపడగానే "అస్సలాతు వస్సలాము అలైకయా రసూలుల్లాహ్" అనే సలాం వచనాలు నోట పదేపదే వెలువడుతూ ఉండాలి. 'ఇమామ్ మాలిక్' (రహ్మాలై) మదీనాలో ప్రవేశించేటప్పుడు గౌరవ సూచకంగా తన వాహనం దిగి, తన చొక్కా గుండీలన్నీ విప్పదీసే వారు. అక్కడి మట్టి రేణువుల్లో ఏదైనా తన ఎదను వచ్చి తాకాలని ఆయన అభిలాష.

ఇలా మదీనా నగరంలోనికి ప్రవేశించిన తరువాత సందర్శకుడు తాను బస చేసే ప్రదేశానికి చేరి సామానులు ఓ చోట సర్దిపెట్టుకొని, గుస్ల్, వుజూ, మిస్వాక్ వగైరాలు పూర్తి చేసుకోవాలి. ఆ తరువాత 'మస్జిదెనబవీ' (ప్రవక్తగారి మస్జిద్) ద్వారం దగ్గరకు వెళ్ళగానే సలాత్, సలాం పఠించాలి. మస్జిద్‌లో ప్రవేశించేటప్పుడు పఠించే దుఆ పఠించి మస్జిద్‌లోనికి ప్రవేశించాలి. మస్జిద్‌లోని అందచందాలపై దృష్టిని పోనీయకుండా ముందు మంచి ఏకాగ్రతతో రెండు రకాఅత్‌ల 'నమాజె తహియ్యతుల్ మస్జిద్' చేయాలి. అల్లాహ్‌కు కృతజ్ఞతాభివందనలు తెలుపుతూ సజ్దయే షుక్ర్' చేయాలి. వీలు చిక్కితే 'రియాజుల్ జన్నహ్' లేక 'మిహ్రాబె నబవీ' వద్ద రెండు రకాఅత్‌ల నమాజు చేయాలి. ఆ ప్రదేశాల్లో చోటు లభించకపోతే చోటుకోసం ప్రయత్నం మాత్రం చెయ్యవద్దు. ఎక్కడ స్థలం లభిస్తే అక్కణ్ణే చేయవచ్చు ఆ నమాజును. నమాజు పూర్తి చేసిన తరువాత తూర్పు వైపు నుండి 'మవాజాషరీఫ్' దగ్గర ఉన్న గ్రిల్స్ వద్దకు చేరుకోవాలి. అక్కడ, అంత బిగ్గర స్వరంతో కాకుండా కొంత తక్కువ స్థాయి కంఠస్వరంతో సలాతు, సలాము పలకాలి. ఇక్కడ మనం నమాజులో కూర్చుని తషహ్హుద్‌లో పఠించే సలాము చాలు. అంటే అస్సలాము. అలైక్ అయ్యుహన్నబియ్యు అనే సలాము ఆ తరువాత ఆయన ప్రియసహాబీలు, హజ్రత్ అబూ బక్ర్‌సిద్దీక్, హజ్రత్ ఉమర్ (రజిఅన్)లకు కూడా సలాము చెప్పాలి. ఇక అక్కణ్ణుండి 'మెంబరేనబవీ' (ప్రవక్త ప్రసంగ వేదిక) దగ్గరకు వచ్చి ఇహపరాల సాఫల్యం కోసం అల్లాహ్‌ను వేడుకోవాలి. మస్జిదె నబవీలో 'రియాజుల్ జన్నహ్' అనే ఓ ప్రదేశం ఉంది. వీలైతే అక్కడ నమాజు చేసి దుఆ చేయాలి. ఇక ఇతర ప్రసిద్ధ ప్రదేశాల సందర్శనం కోసం బయలుదేరాలి. ఉదాహరణకు, 'జన్నతుల్ బకీ'. ఈ ప్రదేశంలో ఎందరెందరో సహాబీలు ఖననం చేయబడి వున్నారు. 'మస్జిదెఖుబా'తో పాటు ఇతర మస్జిదుల్లోనికి వెళ్ళాలి. ముఖ్యంగా ఉహద్ కొండకు వెడితే అక్కడ విశ్వాసులకు అవిశ్వాసులకు నడుమ జరిగిన రెండో యుద్ధం గుర్తుకువస్తుంది. ఉహద్ యుద్ధంలో అమరగతినొందిన సహాబీల సమాదులు అక్కడవున్నాయి. వీటిని సందర్శించాలి. ఈ ప్రదేశానికి వెళ్ళినప్పుడు దివ్య ఖుర్ఆన్‌లోని ఈ ఆయత్ (వాక్యం) పఠించాలి.

"సలాము అలైకుం బి మాసబర్‌తుమ్ ఫనీమద్దార్'

(మీపై శాంతికలుగుగాక. మీరు సత్యధర్మంపై నిలకడగా ఉన్నారు. ఈ ఇహలోకంలో ఎంత మేలైన పర్యవసానం ఇది!)

మదీనా నగరంలో ఉన్నంత కాలం అయిదు పూటల నమాజు 'మస్జిదె నబవీ'లోనే సామూహికంగా చేయాలి. వీలైతే తహజ్జుద్, నఫిల్ నమాజులు కూడా చేయాలి. ఇక అక్కణ్ణుండి స్వస్థలానికి బయలుదేరేటప్పుడు సాధ్యమైనంత మటుకు మస్జిదె నబవీలోనే రెండు రకాత్‌ల నమాజుచేసి తిరిగి దైవప్రవక్త సమాధి (ఖబ్రెనబీ)కి వెళ్ళి సలాత్, సలాం పఠించాలి. మళ్ళీ తిరిగిరావాలనే కోరికతో అక్కడ నుండి తిరుగు ముఖం పట్టాలి.

**ఖుర్బానీ (బలిదానం):** ఈదుల్‌అజ్‌హా నాడు చేసే ఖుర్బానీ కూడా, హజ్ ఆరాధనలా హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం గారికి సంబంధించిన జ్ఞాపకార్థమే. ఆయన తన ప్రియ తనయుడైన హజ్రత్ ఇస్మాయీల్ (అలై)ను ఖుర్బానీ (బలిదానం)గా ఇచ్చిన ఆ మహోన్నత త్యాగానికి గురుతుగా ఏర్పడిన సంప్రదాయం ఇది.

ఇది మీ తండ్రి అయిన ఇబ్రాహీం (అస)గారి గుర్తింపు చిహ్నాం అని దైవప్రవక్త (సఅసం) సెలవిస్తే, దివ్య ఖుర్‌ఆన్ దీన్ని ఈ విధంగా వర్ణిస్తోంది:

దేవుడు హజ్రత్ ఇబ్రాహీం (అస)కు ఆయన వృద్ధాప్య దశలో సంతానాన్ని ఒసగుతాడు. ఆయనకు జన్మించిన మొట్టమొదటి సంతానమే హజ్రత్ ఇస్మాయీల్. (అస) హజ్రత్ ఇస్మాయీల్ యుక్తవయస్సుకు చేరకపోయినా, బాల్యదశ నుండే మంచి విజ్ఞత, వివేచనలను సంతరించుకున్నారు. ఓనాడు హజ్రత్ ఇబ్రాహీం (అస), తన ఏకైక కుమారుడైన ఇస్మాయీల్ (అస)ను దేవుని మార్గంలో బలి చేస్తున్నట్లు కలగన్నారు.

ప్రవక్తల స్వప్నాలు వాస్తవమైన స్వప్నాలు కాబట్టి ఈ స్వప్నాన్ని దేవుని తరపున ఓ సంకేతంగా తలచి ఆయన తన ముద్దుల కుమారుణ్ణి దైవమార్గంలో త్యాగం చేయాలన్న దృఢ సంకల్పంతో ఈ విషయాన్ని కుమారుడికి తెలియజేశారు.

"బాబూ! నిన్ను అల్లాహ్ మార్గంలో బలి చేస్తున్నట్లు కలగన్నాను నీ అభిప్రాయం ఏమిటో చెప్పు" అని అడిగారు హజ్రత్ ఇబ్రాహీం (అస).

దేవుడు ఆయనకు చిన్నప్పటి నుండే ప్రవక్త పదవికి కావలసిన ఉన్నత లక్షణాలన్నీ ప్రసాదించాడు. కాబట్టి ఆయన విధేయుడైన తనయునిలా తండ్రితో "నాన్నగారూ! మీకు ఏ ఆదేశం ఇవ్వడం జరిగిందో ఆ ఆదేశాన్ని శిరసావహించండి. ఇన్షాఅల్లాహ్ నన్ను మీరు దృఢచిత్తునిగా చూస్తారు" అని అంటారు. (అంటే నేను దైవమార్గంలో బలి కావడంలో ఎలాంటి జంకు, భయం ప్రదర్శించను అని అర్థం). ఇక ఆ ఇరువురు మహానుభావులు

దైవాదేశం ముందు తమ శిరమును వంచేయాలని నిర్ణయించుకుని బలికి సిద్ధపడ్డారు.

హ(జత్ ఇ(బాహీం (అస) హ(జత్ ఇస్మాయీల్ (అస)ను బలిచ్చే ఉద్దేశ్యంతో ఓ ప్రక్కకు మెడ ఉండేటట్లు పడుకోబెట్టారు. ఇలా పడుకోబెట్టడంలోని ఉద్దేశ్యం ఏమిటంటే తండ్రి దృష్టి కుమారుని ముఖంపై పడి పుత్రవాత్సల్యం అడ్డురాకూడదనే. నిజానికి దేవుడు ఇస్మాయీల్ (అస) ప్రాణాన్ని బలి కోరలేదు. అసలక్కడ ఇ(బాహీం (అస)ని పరీక్షించ దలిచాడు. మనిషి తనకు అత్యంత ప్రియమైనదాన్ని దైవమార్గంలో త్యాగం చేయగలడా అనేదే ఆ పరీక్ష.

దీనికి రుజువు లభించగానే దేవుడు ఇ(బాహీం (అస) నుండి ఆ ప్రయత్నాన్ని విరమింపజేయడానికి జి(బీల్ (అస) దైవదూతను పంపారు. ఇస్మాయీల్ (అస) ప్రాణానికి బదులు ఓ పొట్టేలును జిబహ్ చేశారు. హ(జత్ ఇ(బాహీం (అస). దివ్య ఖుర్ఆన్‌లో ఈ పరీక్ష గురించి ఇలా సెలవీయబడింది: "నిశ్చయంగా అది ఓ పెద్ద పరీక్ష" (సాప్ఫాత్)

దేవుడే గనక ఆదేశిస్తే తన ప్రియాతి ప్రియమైన వస్తువును సయితం ఎలాంటి సంకోచం లేకుండా ఆయన మార్గంలో త్యాగం చేయడానికైనా వెనుకాడగూడదు. ఈ వైఖరే ఆయన దాస్యానికి తగిన వైఖరి అని ఖుర్బానీ (బలిదానం) ద్వారా మనకు తెలుస్తోంది. కాబట్టి దివ్యఖుర్ఆన్‌లో ఇలా సెలవియ్యడం జరిగింది:

ముస్లిములారా! మీరు ఖుర్బానీ చేసే జంతువు రక్త మాంసాలు ఏవీ దేవునికి చేరవు. కేవలం మీ చిత్తశుద్ధి, తక్వాలు (దైవభీతి) మాత్రమే దేవునికి చేరుతాయి.

అంటే మీకు లభించే పుణ్యఫలం మీరు చేస్తున్న మీ ఖుర్బానీ వెనక వున్న మీ చిత్తశుద్ధి మీ సంకల్పాలకే. ఈ కార్యంలో దైవసంతుష్టే ప్రధాన అంశంగా ఉంటే దానికి మంచి ఫలితం లభిస్తుంది. అదే ప్రదర్శనా బుద్ధితో చేసిందైతే దాని పుణ్యఫలం మీకు లభించదు. కాబట్టి దైవ ప్రవక్త (సఅసం), ఆ రోజు ఖుర్బానీ చేయాలని గట్టిగా తాకీదు చేశారు. ఆయన తాకీదులోని భావం ఇలా ఉంది:

నేడు అన్నిటికంటే పుణ్యప్రదమైన కార్యం ఖుర్బానీ చేయడం. ఖుర్బానీ పశువులోని ప్రతి వెంట్రుకకు పుణ్యం లభిస్తుంది అని ఆయన సెలవిచ్చారు (మిష్కాత్)

**ఖుర్బానీ తప్పనిసరిగా (వాజిబ్) చేయవలసిన వారెవరూ? :**

సదఖాఫిత్రా వాజిబ్ ఆయన వారందరూ ఖుర్బానీ చేయడం వాజిబ్ (అంటే తప్పనిసరి). అయితే కేవలం తన ఒక్కరి తరపునే అది వాజిబ్. ప్రాజ్ఞతకు వచ్చిన లేక ప్రాజ్ఞత పొందని సంతానం తరపున వాజిబ్ కాదు. అయితే వారి తరపున చేస్తే మాత్రం పుణ్యఫలం లభిస్తుంది.

మూడు రోజుల వరకు ఖుర్బానీ చేయవచ్చు. అంటే జిల్‌హజ్జా మాసపు పది, పదకొండు, పన్నెడో తేదీ సాయంకాలం వరకు. ఈ కాల వ్యవధిలో రాత్రి లేక పగలు ఖుర్బానీ ఎప్పుడయినా చేయవచ్చు. అయితే రాత్రి వేళలకన్నా పగలు చేస్తేనే ఉత్తమం. సదఖాయె ఫిత్ర్ ఈద్ నమాజుకు పూర్వం ఎలా తీసి పంచిపెడతామో దానికి భిన్నంగా ఖుర్బానీ ఈద్ నమాజు అయిన తరువాత చేయడం ముఖ్యం. అయితే పల్లెవాసులకు ఓ రాయితీ మాత్రం ఉంది. వారు ఈద్ నమాజ్ చేయడం కోసం దూర ప్రదేశాలకు వెళ్ళవలసి ఉంటే వారు ఆ రోజు తెల్లవారిన తరువాత ఖుర్బానీ చేసే అనుమతి ఉంది. పెద్దపెద్ద ఊళ్ళు టౌనులు, పట్టణాల్లో మాత్రం అలా చేసే అనుమతి లేదు.

మేక, గొర్రె, దుంబా, ఆవు, గేదె, ఒంటె ఈ రకాల పశువుల పెంటి, పోతుల ఖుర్బానీ ధర్మసమ్మతం. ఇది కాక మరే జంతువు ఖుర్బానీ ధర్మసమ్మతం (జాయిజ్)కాదు. జింక, దుప్పి, యనబోతు లేదా దున్నలాంటి అడవి జంతువుల ఖుర్బానీ చెల్లదు. వాటిని పెంచి పెద్దవాటిగా చేసినా సరే.

పై ఆరు రకాల జంతువుల్లో కొన్ని కేవలం ఒకేఒక వ్యక్తి తరపున ఖుర్బానీ చేయ వచ్చు. అవి మేక, గొర్రె, పొట్టేలు. కొన్ని జంతువుల ఖుర్బానీలో ఏడుగురు భాగస్వాములుగా చేరి కలిసి ఖుర్బానీ చేయవచ్చు. అవి ఆవు, గేదె, ఒంటె, ఈ జంతువులు జిబహ్ ఆయన తరువాత మాంసాన్ని ముక్కలుగా కోసి ఏడు సమభాగాలుగా తూచి పంచుకోవలసి ఉంటుంది. అయితే ఒకే ఇంటి వారు ఏడుగురు కలిసి ఒక జంతువును ఖుర్బానీ ఇస్తే ఆ అవసరం ఉండదు. కాని ఇతర భాగస్వాములు మాత్రం సమానంగా తూచి మాత్రమే పంచుకోవలసి ఉంటుంది. అయితే ఆ భాగస్వాముల్లో ఒకడు ఆ మాంసంలోని ఓ ప్రత్యేక మైన ముక్కను తీసుకోదలిస్తే దానికి సరిపడ మాంసం తన భాగంలో తగ్గించుకోవలసి ఉంటుంది.

ఏడుగురు కలసి ఖుర్బానీ ఇచ్చే జంతువులో కేవలం నలుగురు అయిదుగురే కలిస్తే అలా కూడా ఖుర్బానీ చేయవచ్చు. వారు సమానంగా ఎవరి భాగం వారు తీసుకుంటారు. (ఆలంగీరి, సంపుటం5, పేజీ 297)

**ఖుర్బానీ జంతువుల వయస్సు :** ఏడుగురు కలిసి చేసే జంతువు ఖుర్బానీ చేసే నాటికి, ఆవు గేదెల వయస్సు అయితే రెండేళ్ళకు తగ్గకుండా, ఒంటె వయస్సు అయిదేళ్ళకు తగ్గకుండా ఉండాలి. ఇక దుంబా, ఒంటె, మేక, గొర్రెల వయసు ఒక సంవత్సరానికి తగ్గకూడదు. అయితే దుంబా గాని పొట్టేలుగాని వయసులో ఒక సంవత్సరం తక్కువగా వున్నా చూపరులకు అది సంవత్సరం వయస్సుదై ఉంటుందనేటంత

పెద్దగా కనబడాలి. మేక, మేకపోతు మాత్రం ఒక సంవత్సరం కంటే తక్కువ వయస్సుదై ఉండకూడదు. (దుర్రె ముక్తార్)

**ఖుర్బానీ జంతువు ఎలా ఉండాలి?:** 1. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ప్రకారం, ఖుర్బానీ చేసే జంతువు చూడ్డానికి ఆరోగ్యంగా ఎలాంటి లోపం లేనిదై ఉండాలి. గ్రుడ్డిది, చెవులు కోసినది, కుంటిది, తోక తెగిపోయినది, కొమ్ములు విరిగిపోయినది అయివుండకూడదు. కుంటిది అంటే అది మూడు కాళ్ళతో నడిచేదని అర్థం. ఒక కాలు భూమ్మీద ఆనిగాని నడువదు. ఆనించినా ఆ కాలిపై భారం వేసి నడువదు అని భావం. అలాంటి జంతువు ఖుర్బానీ సరైంది కాదు. (ఆలంగీరి)

2. చెవులుగాని, పళ్ళుగాని అసలేలేని జంతువయితే కొన్నిపల్లు వున్నా లేక ఓ చెవి కొద్దిగా అంటే మూడోవంతు కంటే తక్కువగా తెగివున్నా ఆ జంతువు ఖుర్బానీ చేయవచ్చు.

3. సమూలంగా విరిగిపోయిన కొమ్ము గల జంతువు ఖుర్బానీకి పనికి రాదు. కొంచెం విరిగి పోయిన లేదా పుట్టుకతోనే కొమ్ములు లేని జంతువు ఖుర్బానీ సరైనదే.

4. చాలా బలహీనంగా ఉండి బాగా బక్కచిక్కిన జంతువును ఖుర్బానీ చేయకూడదు. బహీనమైనది, బక్కచిక్కినది అని అంటే ఎలాంటి మాంసపు కండ లేకుండా కేవలం చర్మం ఎముకల గూడుగా మిగిలిన జంతువు అని అర్థం. (ఆలమ్‌గీరీ)

5. ఖుర్బానీ కోసమని కొన్ని జంతువుకు ఆ తరువాత ఏదైనా లోపం ఏర్పడితే ఖుర్బానీ చేసే వ్యక్తి గనక ఆర్థికంగా స్తోమత వున్నవాడయితే మరో జంతువును కొని ఖుర్బానీ చేయాలి. స్తోమత అంతగా లేనివాడయితే ఆ జంతువునే ఖుర్బానీ చేయవచ్చు.

6. ఖుర్బానీ చేసిన తరువాత జంతువు పొట్ట నుండి పిండం బయల్పడితే ఆ ఖుర్బానీ నెరవేరుతుంది. అయితే ఆ పిండానికి రూపం వచ్చి ఉంటే మాత్రం దాన్ని కూడా జిబహ్ చేయాలి. ఖుర్బానీకి ముందే జంతువు సూడిది అని తెలిసినా ఖుర్బానీ చేయవచ్చు.

**ఖుర్బానీ చేసే విధానం:** జంతువులు, దాని ముఖం ఖిబ్లా వైపు ఉండేటట్లు క్రిందపడేయాలి. ఆ తరువాత ఈ దుఆ పఠించాలి:

"ఇన్నీ వజ్జహ్తు వజ్ హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్జ హనీఫన్ వమా అన మినల్ ముష్రికీన్. ఇన్నస్సలాతి వనుసుకీ వ

إِنِّي وَجَّهْتُ وَجْهِيَ لِلَّذِي
فَطَرَ السَّمٰوٰتِ وَالْأَرْضَ
حَنِيفًا وَمَآ أَنَا مِنَ
الْمُشْرِكِينَ ۝ إِنَّ صَلٰوتِي

| | |
|---|---|
| మహ్యాయ వమమాతీ | وَنُسُكِي وَمَحْيَايَ وَمَمَاتِي |
| లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. | لِلّٰهِ رَبِّ الْعَالَمِينَ لَا |
| లా షరీక లహు వ బిజా | شَرِيكَ لَهُ وَبِذَالِكَ |
| లిక ఉమిర్తు వ అన మినల్ | اُمِرْتُ وَاَنَا مِنَ |
| ముస్లిమీన్, అల్లాహుమ్మ | الْمُسْلِمِينَ ۝ اَللّٰهُمَّ مِنْكَ |
| మిన్‌కవలక్" | وَلَكَ۔ |

(అర్థం: నేను అన్ని వైపులనుంచి విముఖుణ్ణయి భూమ్యాకాశాలను సృష్టించిన అల్లాహ్ వైపుకే ముఖాన్ని మరల్చుతున్నాను. నేను ఆయనకు సహవర్తులుగా నిలబెట్టే వారిలోలేను. నా నమాజు, సమస్తలోకాల ప్రభువు అయిన అల్లాహ్ కోసమే అంకితం. దేవా! నీ ప్రసన్నత కోసం మేము సమర్పించేదంతా నీవు ప్రసాదించిందే. నీ కోసమే త్యజిస్తున్నాం.)

ఈ దుఆ పఠించి "బిస్మిల్లాహి అల్లాహు అక్బర్" అంటూ పదునైన కత్తితో మెడ తెగేటట్లు జిబహ్ చేయాలి. అయితే కేవలం నామమాత్రంగా కత్తి కదిపితే సరిపోదు. పూర్తిగా జిబహ్ చేయాలి. ఆ తరువాత ఈ దుఆ చేయాలి.

| | |
|---|---|
| "అల్లాహుమ్మ తకబ్బల్ మిన్నీ కమా | اَللّٰهُمَّ تَقَبَّلْ مِنِّي كَمَا |
| తకబ్బల్త మిన్ హబీబిక ముహమ్మ | تَقَبَّلْتَ مِنْ حَبِيبِكَ مُحَمَّدٍ |
| దిన్‌వ ఖలీలిక ఇబ్రాహీమ అలైహి | وَخَلِيلِكَ اِبْرَاهِيمَ عَلَيْهِمَا |
| మస్సలాతు వస్సలాం". | الصَّلٰوةُ وَالسَّلَامُ۔ |

ఓ అల్లాహ్! దీన్ని నా తరపున స్వీకరించు. ఎలాగయితే నీవు నీ హబీబ్ (ప్రీతి పాత్రులు) హజ్రత్ ముహమ్మద్ (సఅసం), నీ ఖలీల్ (మిత్రుడు) ఇబ్రాహీం (అస) తరపున స్వీకరించావో.

ఈ దుఆను నోటితో తప్పకుండా చదవాలని లేదు. ఎవరికైనా ఈ దుఆ కంఠో పాఠంగా రాకపోతే "నేను ఖుర్బానీ చేస్తున్నాను" అనే సంకల్పం చేసుకొని బిస్మిల్లాహి అల్లాహు అక్బర్ అని జిబహ్ చేస్తే చాలు. (రద్దుల్ ముహ్తార్, సంపుటం-5, పేజీ 32)

ఖుర్బానీ ఇవ్వదలిచిన వాడు తన చేతులమీదుగా జిబహ్ చేస్తే మంచిది. అయితే ఒకరి తరపున ఎవరైనా జిబహ్ చేస్తే ఆ ఖుర్బానీ తరపున ఎవరైనా జిబహ్ చేస్తే ఆ ఖుర్బానీ

ఇచ్చే వాని పేరును ఫలానా వారి కుమారుడు ఫలానా వారి తరపున ఖుర్బానీ ఇస్తున్నానని పలకాలి. అదే పెద్ద జంతువులోని భాగస్వాములైతే వారి పేర్లు వారి తండ్రి పేర్లతో సహా ఉచ్ఛరిస్తూ ఇది వారి తరపున స్వీకరించు అని పలకాలి.

ఖుర్బానీ మాంసాన్ని మూడింటి ఒకవంతు పేదసాదుల్లో పంచిపెట్టాలి. మిగిలింది తాను, తన పొరుగువారు, బంధుమిత్రులు నిరుపేదల్లో పంచాలి. ఎవరికి పంచకుండా తామొక్కరే వాడినా వాడవచ్చు. అయితే ఇలా చేయడం ఖుర్బానీ విధానానికి వ్యతిరేకం.

ఖుర్బానీ మాంసాన్ని ముస్లిమేతరులకు కూడా పంచి పెట్టవచ్చు. మీ పొరుగున అలాంటి వారు ఎవరైనా ఉంటే తప్పకుండా వారింటికి మాంసాన్ని పంపించాలి. అయితే కూలిక్రింద ఖుర్బానీ మాంసాన్ని ఇవ్వకూడదు.

**చనిపోయిన వారి తరపున ఖుర్బానీ చేయడం:** మృతుని పేర ఖుర్బానీ రెండు విధాలుగా చేయవచ్చు.

1. అతడు మరణించేటప్పుడు ఖుర్బానీ చేయమని చెప్పి మరణించడం. ఇలాంటి సందర్భంలో ఖుర్బానీ మాంసం మొత్తాన్ని పేదలకు పంచివేయాల్సి ఉంటుంది. 2. మృతుడు మరణ శాసనం చేయకుండా మరణించడం. ఇలా తల్లిదండ్రుల తరపున, మరొకరి తరపున తన ఇష్టంతో ఖుర్బానీ చేయవచ్చు. ఆ ఖుర్బానీ మాంసాన్ని తాను తినవచ్చు, ఇతరులకు పంచిపెట్టనూ వచ్చు. ఇది ధర్మసమ్మతమయిన విషయమే. అయితే ఓ వ్యక్తి లోగడ తన ఖుర్బానీ చేసిన వాడై ఉంటేనే మృతుని తరపున ఖుర్బానీ చేయాల్సి ఉంటుంది.

**ఖుర్బానీ చర్మం :** ఖుర్బానీ చర్మం రెండు విధాలుగా ఉపయోగించవచ్చు. 1. దాన్ని అమ్మకుండా ఉన్నంతవరకు ఖుర్బానీ చేసినవాడు దాన్ని ఉపయోగించ వచ్చు. లేక ఇతరులకు ఇవ్వవచ్చు. ఉపయోగించడం అంటే దాన్ని జానిమాజ్‌గానో లేక నీటి తిత్తిగానో లేక చెప్పులకోసమో వాడుకోవచ్చు. 2. దాన్ని అమ్మివేస్తే మాత్రం దాని ధర మొత్తం దానం చేయాలి.

**జిబహ్ :** ఖుర్‌ఆన్, హదీసుల్లో ప్రతి హలాల్ జంతువును జిబహ్ చేసి లేక వేటాడి తినవచ్చు అనే అనుమతి ఉంది. జిబహ్ విధానంలో జిబహ్ చేయవలసిన జంతువును ఖిబ్లా (కాబా గృహం (పడమర) వైపు ముఖం ఉండేటట్లు పడేయాలి (పడుకోబెట్టాలి). ఆ తరువాత పదునైన కత్తితో 'బిస్మిల్లాహి అల్లాహు అక్బర్' అంటూ జిబహ్ చేయాలి (మెడను కోయాలి).

1. జంతుమెడలో ఇరుప్రక్కల వుండే రెండు రక్తనాళాలు బృహద్ధమనులు, ఆహారనాళం, శ్వాసనాళం ఈ నాలుగూ తప్పనిసరిగా తెగాలి. వీటిలో కనీసం మూడైనా తెగిపోవడం చాలా అవసరం. కేవలం రెండే తెగిపోతే అది ముర్దార్ అయిపోతుంది. 2. ఖుర్బానీ చేసేవారిలో కొందరు పశువు మెడపై కేవలం కత్తిపెట్టి ఇతరులు దాన్ని జిబహ్ చేయమని ప్రక్కకు తప్పుకుంటారు. అలాకాకుండా పూర్తిగా పశువుమెడ తెగేవరకు జిబహ్ చేయాలి. 3. ఎవరైనా జిబహ్ చేసేటప్పుడు కావాలని 'బిస్మిల్లాహి అల్లాహు అక్బర్' అని పలకపోతే ఆ జంతువు హరాం (ముర్దార్) అవుతుంది. అయితే పలికే తలంపుతో వెళ్ళి జిబహ్ చేసేటప్పుడు దాన్ని మరిచిపోయి ఉచ్చరించకపోతే ఆ జంతువు హరాం కాదు. 4. పదునులేని మొండి కత్తితో జిబహ్ చేయడం మక్రూహ్. 5. జంతువు ప్రాణం పూర్తిగా పోయేటంత వరకు దాని చర్మాన్ని వదలడంగాని, దాని తలను మొండెం నుండి వేరు చేయడంగాని చేయకూడదు. ప్రాణం పోయేటంత వరకు దాన్ని అలానే పడి ఉండేటట్లు వదిలేయాలి. 6. జిబహ్ చేయడంలో పక్షి తల పూర్తిగా మొండెం నుండి వేరైపోతే అది ముర్దార్ కాదు. కాని అలా జరగకుండా జాగ్రత్త పడాలి. 7. ముస్లిమేతరులు చేసిన జిబహ్ హరామ్ (నిషిద్ధం). ఆ మాంసాన్ని కొనడం కూడా హరామ్. ముస్లిములైన స్త్రీలు లేక పురుషులు ఎవరు జిబహ్ చేసినా అది ధర్మసమ్మత మైనదే (జాయిజ్). కసాయివారు, మాంసాన్ని అమ్మేవారు జిబహ్ చేసేటప్పుడు 'బిస్మిల్లాహి అల్లాహ్ అక్బర్' అని ఉచ్చరించకపోతే ఆ మాంసం కూడా హరామ్ అవుతుంది. అదే విధంగా నేటి యూదులు, క్రైస్తవులు చేసే జిబహ్ కూడా ధర్మసమ్మతమైన జిబహ్ కాదు.

## అకీకా :

శిశువు పుట్టిన ఏడో రోజున లేక ఆ తరువాత అతని తరపున జంతు వును జిబహ్ చేస్తారు. అదే అకీకా. మహాప్రవక్త (సఅసం) అకీకా చేయమని తాకీదు చేశారు. స్వయంగా ఆయన హజ్రత్ హసన్ (రజిఅన్), హుసైన్ (రజిఅన్)గార్ల తరపున జంతువులు జిబహ్ చేసి అకీకా చేశారు. అకీకా చేయడం వలన పిల్లలు వారికి వచ్చే అన్ని కీడులు, బాధల నుండి రక్షింపబడతారు.

దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచనం ఇలా ఉంది. "పిల్లవాడు తన అకీకాకు బదులు తాకట్టు ఉంటాడు. కాబట్టి ఏడో రోజున అతని అకీకా చేయండి. అతని పేరు పెట్టండి. అతని తల వెంట్రుకల్ని గొరిగించండి".

మరో హదీసులో ఇలా ఉంది.

"అతని తరపున జంతువున జిబహ్ చేయండి. అతని బాధల్ని, అశుద్ధతను అతని నుండి దూరం చేయండి".

**అకీకా చేసే విధానం :** అకీకా చేసే ఉత్తమ విధానం ఏదంటే, శిశువు జన్మించిన ఏడవ రోజున అతనికి నామకరణం (పేరుపెట్టడం) చేయాలి. ఆ తరువాత ఆ శిశువు తరపున రెండు, లేక ఒక జంతువును ఖుర్బానీ చేయాలి. అతని వెంట్రుకలను గొరిగించి స్తోమతను బట్టి వాటికి సమానమైన బరువుగల వెండి లేక బంగారం దానం చేయాలి.

**గమనిక:**

1. మగ పిల్లవాడైతే రెండు మేకపోతులు లేక మేకలో లేక గొర్రెపోతులో లేక గొర్రెలో జిబహ్ చేయాలి. బాలిక అయితే ఒక జంతువు సరిపోతుంది. వీలు పడకపోతే మగపిల్ల వాని తరపున కూడా ఒక జంతువు జిబహ్ చేయవచ్చు. దైవప్రవక్త (సఅసం) హజ్రత్ హసన్ (రజిఅన్)గారి తరపున ఒక మేకను జిబహ్ చేశారు. (తిర్మిజీ) 2. ఖుర్బానీ చేసే జంతువులోని ఏడు భాగాల్లో రెండు భాగాలు అకీకా సంకల్పంతో జిబహ్ చేసినా ఇది ధర్మసమ్మతమైనదే. 3. శిశువు పుట్టిన ఏవో కొన్ని కారణాల వల్ల అకీకా చేయలేకపోతే, ఆ తరువాత ఎప్పుడు వీలు చిక్కితే అప్పుడు అకీకా చేయవచ్చు. అయితే ఏడో రోజు వచ్చేటట్లు లెక్కవేసి చెయ్యడం మంచిది. ఉదాహరణకు పిల్లవాడు గురువారం నాడు జన్మిస్తే అతని ఏడో రోజు 'బుధవారం' అవుతుంది. ఆ పిల్లవాని అకీకా చేస్తే బుధవారం నాడు చేయాలి. 4. ఖుర్బానీకి పనికివచ్చు జంతువులన్నీ అకీకా చేయడానికి పనికివస్తాయి.

**అకీకా మాంసం :** అకీకా మాంసం ప్రతి ఒక్కడూ తినవచ్చు. పిల్లవాడు తల్లిదండ్రులు, తాత నాయ నమ్మ, అమ్మమ్మలు తినకూడదు అనే అర్థంలేని నమ్మకాలు ఉన్నాయి కొందరికి. ఇది పూర్తిగా మూఢ నమ్మకం. ఖుర్బానీ మాంసంలో ఈ మాంసాన్ని కూడా ఇతరులకు పంచి పెట్టి తాము తినాలి.

**అకీకాలో పఠించే దుఆ :** అల్లాహుమ్మ హాజిహీ అకీకతు (ఇక్కడ బాలుడు లేక బాలిక పేరు ఉచ్చరించాలి) తకబ్బల్‌హు (బాలిక అయితే తకబ్బల్హా) కమాతకబ్బల్త మిన్ హబీబిక్ ముహమ్మదిన్ వఖలీలిక్ ఇబ్రాహీం అలై హిస్సలాతువస్సలాము దముహా 'బిదమిహీ' (బాలిక అయితే 'బిదమిహా') లహ్ముహ 'బిలహ్మిహీ' (బాలిక అయితే బలహ్మిహా), ష అరుహా బిషఅరిహీ (బాలిక అయితే బిషఅరహా), అజ్మిహా బి అజ్మిహీ (బాలిక అయితే బి అజ్మిహా).

**అర్థం:** ఓ అల్లాహ్ ఈ అకీకా ఫలానా వారిది. నీ హబీబ్ (ప్రీతిపాత్రులైన) ముహమ్మద్ (సఅసం) మరియు నీ ఖలీల్ (మిత్రుడు) ఆయన ఇబ్రాహీం (అ.స) తరఫున స్వీకరించినట్లు ఈ అకీకాను స్వీకరించు. ఈ జంతువుకు సంబంధించిన రక్తం ఈ బాలుని/బాలిక రక్తానికి పరిహారంగా దీని మాంసం ఈ బాలుని/బాలిక మాంసానికి పరిహారంగా, దీని వెంట్రుకలు ఈ బాలుని/బాలిక వెంట్రుకలకు పరిహారంగా, దీని ఎముకలు ఈ బాలుని/బాలిక ఎముకలకు పరిహారంగా ఇస్తున్నాను). పిల్లవాని తండ్రి కాకుండా ఇతరులు జిబహ్ చేస్తే ఫలానా వారి కుమారుడు ఫలానా వారి తరఫున జిబహ్ చేస్తున్నాను. ఓ ప్రభూ దీన్ని స్వీకరించు అనాలి. ఈ దుఆ పఠించిన తరువాత పైన పేర్కొన్న ఖుర్బానీ దుఆ 'ఇన్నీ వజ్జహ్తు వజ్ హియ... అల్లాహుమ్మమిన్క వలక్ చదివి బిస్మిల్లాహి అల్లాహు అక్బర్ అని జిబహ్ చేయాలి.

**వేటాడడం :** జంతువుల్ని, పక్షుల్ని వేటాడడాన్ని ఇస్లామీయ షరీఅత్ ముబాహ్‌గా పేర్కొంటుంది. అంటే చేయదగినది. దీనికి సంబంధించి ఎలాంటి నిషేధం లేదు అని అర్థం. అయితే వేటను ధర్మవేత్తలు ఏమంత మంచి దృష్టితో చూడరు. "కేవలం హాబీకోసం చేసేవేట నా దృష్టిలో మక్రూహ్" అంటారు ఇమామ్ అబూహనీఫా (రహ్మలై)

దుర్రెముక్తార్ గ్రంథకర్త 'ఇది ముబాహ్' అంటారు. అయితే వేటను ఉపాధిగా, వృత్తిగా చేసుకోవడాన్ని ఆయన కూడా ఒప్పుకోరు కాని ధర్మవేత్తలలో అధికశాతం, ఏదైనా ఆర్థికఇబ్బంది వచ్చినప్పుడు లేక అత్యవసర సమయాల్లో వేటాడడాన్ని అనుమతిస్తారు. ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మలై) ఎవరికైనా వేటాడి ఉపాధి సంపాదించే అవసరమే ఏర్పడినప్పుడు ఆ మాంసాన్ని భుజించడానికి, ఇంకా ఇతర పెద్ద అవసరాలు ఏర్పడ్డప్పుడు వేటాడితే తప్పులేదంటారు. (రద్దుల్ ముహ్తార్ సంపుటం-5, పేజీ 457-458)

తుపాకి, పిస్టల్, ఉండేలు లేక మరోవిధంగా వేటాడినప్పుడు, వేటాడిన ఆ జంతువు బ్రతికుంటే దాన్ని జిబహ్ చేయకుండా తినడం ధర్మసమ్మతమైనది కాదు. అయితే బాగా తర్ఫీదు ఇచ్చిన వేటకుక్కనుగాని, డేగనుగాని 'బిస్మిల్లాహి అల్లాహు అక్బర్' అని ఆ జంతువు లేక పక్షిపై వదిలితే ఆ తర్ఫీదు ఇచ్చిన జంతువులు వాటిని పట్టడంవల్ల చనిపోతే ఆ చనిపోయిన జంతువు హలాల్ అవుతుంది. అయితే ఈ విషయంలో చాలా షరతులున్నాయి. వాటి ప్రస్తావన ఇక్కడ అవసరం లేదు.

**గమనిక:** కుక్కను పెంచడం షరీఅత్‌లో నిషిద్ధం. అయితే రెండు అవసరాల కోసం

దాన్ని పెంచవచ్చు. 1. వేటాడ్డానికి, 2. యజమాని ధన, ప్రాణాల రక్షణకోసం. ఈ రెండు అవసరాలు తప్ప ఇతర మరే అవసరం కోసం కుక్కను పెంచితే ఘోరమైన తప్పిదం.

"ఏ గృహంలో కుక్క ఉంటుందో ఆ ఇంటిలోనికి దైవదూతలు ప్రవేశించరు" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు. (మిష్కాత్)

**హరామ్ జంతువులు:** కేవలం అశుద్ధ పదార్థాలనే తిని బ్రతికే జంతువులు వేటాడి మాంసాన్ని భక్షించే క్రూర మృగాలు, పక్షులు హరామ్ జంతువులు. ఉదాహరణకు పులి, చిరుతపులి, తోడేలు, ముంగిస, పిల్లి, పాములు, కుక్క కోతి, డేగ, గ్రద్ద, దూడ బోతులు (శవాన్ని పీక్కుతినే గ్రద్దలు), కాకి వగైరాలు. వీటిని జిబహ్ చేసినా తినడానికి వీల్లేదు.

**హలాల్ జంతువులు:** పైన చెప్పిన రెండు అలవాట్లులేని జంతువులు, పక్షులన్నీ హలాల్ కోవకే చెందుతాయి. వాటిని జిబహ్ చేసి తినవచ్చు. మిడతను జిబహ్ చేయకుండా తినవచ్చు.

**మక్రూహ్ జంతువులు:** బొద్దింకలు, ఈగలు, తాబేళ్ళు, తేనెటీగలు, కందిరీగలు, ఇంకా ఇతర కీటకాలు. భూమిపై ప్రాకే జంతువులన్నీ మక్రూహ్ కోవకు చెందినవి. గాడిద, కంచర గాడిదను తినడం ధర్మసమ్మతం కాదు. (హదాయా సంపుటం 2, పేజి 439)

**జలచరాలు:** జలచరాల్లో కేవలం చేప జాతికి చెందినవి మాత్రమే ధర్మసమ్మత మైనవి (జాయిజ్) అవిగాక ఇతర సముద్ర జీవుల్లో కొన్ని హరాం, మరికొన్ని మక్రూహ్ ప్రాణులున్నాయి. (ఇతర ఇమాముల దృష్టిలో కొన్ని ఇతర నీటి జంతువులు కూడా హలాల్ జంతువులే)

**జిబహ్ చేయనటువంటి జంతువులు:** 1. మెడ నులిమి చంపబడిన జంతువు చేతితోగాని, లేక తనంతట అదే మెడ పిసకబడిన జంతువు లేక యంత్రం ద్వారా మెడ పిసకబడిన జంతువు– ఇవన్నీ హరామే. 2. దేనితోనైనా ఢీకొని చనిపోయింది. లేక ఏదేని దెబ్బతగలడం వల్ల చనిపోయింది. 3. పై నుంచి క్రిందపడి మరణించింది. 4. పరస్పరం కొట్లాడి చనిపోయినవి లేక చంపబడ్డవి. 5. ఏదేని క్రూరమృగం పట్టడం వల్ల లేక హరాం జంతువు చంపడం వల్ల చనిపోయిన జంతువు. 6. అల్లాహ్ పేరు మీదగాక ఇతరుల పేరుమీద జిబహ్ చేసిన జంతువు.

గమనిక: ఒకటి నుండి అయిదు నెంబర్లలోని జంతువులను ప్రాణం ఉండగా జిబహ్ చేస్తే హలాల్ అవుతాయి. కాని అల్లాహ్ పేరుమీదగాక దైవేతరుల పేరుమీద జిబహ్ చేసిన జంతువు మాత్రం ఎట్టి పరిస్థితిలోను హలాల్ కాదు. ఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

حُرِّمَتْ عَلَيْكُمُ الْمَيْتَةُ وَالدَّمُ وَلَحْمُ الْخِنْزِيرِ وَمَا أُهِلَّ لِغَيْرِ اللَّهِ بِهِ وَالْمُنْخَنِقَةُ وَالْمَوْقُوذَةُ وَالْمُتَرَدِّيَةُ وَالنَّطِيحَةُ وَمَا أَكَلَ السَّبُعُ إِلَّا مَا ذَكَّيْتُمْ وَمَا ذُبِحَ عَلَى النُّصُبِ وَأَنْ تَسْتَقْسِمُوا بِالْأَزْلَامِ ذَٰلِكُمْ فِسْقٌ

"మీకు నిషేధించబడింది-చచ్చిన జంతువు, రక్తం; పంది మాసం; దైవం పేరు మీదుగా తప్ప ఇతరుల పేరిట జిబహ్ చేసిన జంతువు; గొంతు నులమడం వల్ల (ఊపిరి ఆడక), గాయం వల్ల, పై నుంచి పడటం మూలాన, ఎదురుదెబ్బ తగలడం వల్ల చచ్చిన జంతువు, లేదా ఏదైనా క్రూరమృగం చీల్చి వేసిన జంతువు-అది బ్రతికి ఉండగా మీరు జిబహ్ చేసుకున్నది తప్ప-ఇంకా ఏదయినా దైవేతర పుణ్యస్థలిలో జిబహ్ చేసిన జంతువు. ఇంకా పాచికల ద్వారా తమ అదృష్టాన్ని తెలుసుకోవడం కూడా మీకు ధర్మమైనది కాదు. ఇవన్నీ పాపకార్యాలు".

(అల్ మాయిద-3)

